సీ. పాపిష్ఠిరాజులపాలి దయ్యమ్ము సం
ధ్యావందనమునకు బాపగాఁడు
పరదేశసంచారతరణమ్మునకు రైలు
జపతపమ్ములకెల్ల సవతితల్లి
ముక్తికాంతాసంగమునకుఁ దాటుపుఁగత్తె
సద్యశోవ్యాప్తికిఁ జాటువెప్పు
ఆనందమునకు దివ్యాంగనాసంగంబు
రాజసంబునకు గారాలపాచి

తే. గీ. భాగ్యభోగ్యమ్ములకు నెల్లఁ బట్టుఁగొమ్మ
యఖిలవేత్తృత్వమునకు దివ్యాంజనంబు
సరసజనులకుఁ గర్ణరసాయనంబు
కవిత యిట్టిది యని చెప్పఁగాఁ దరంబె? 13

తే. గీ. కవులు నూఱును అనియును, గత నవీన
మనియు నాక్షేపణ యొనర్తురంచు నేను
కొంచెమెఱుఁగుదు మైనను "గొప్పత్రప్రాప్త
కొమ్మన" యటన్న సామెత నమ్మినాము. 14

ఉ. అంచితులైనవార లిది యారసి యూరసమున్ గ్రహించి లా
లించినఁ జాలుఁ; గొంద ఱ"అవి లే పివి లే" యని గేలిసేయు వా
రంచు రచింప మానుదుమె? యంతటివిస్ వినిముంప మమ్మునిర్
మ్మించిన బ్రహ్మకైనఁ దరమే? యిది పెద్ద తెలుంగు దుంటిదే? 15

క. అని శిష్టాచారంబుల
నొనరించి యొక కృతి నేయ నున్నంతట న
మ్మను వాడరేవుకుల ప
ర్థన వేంకటరత్నమంత్రి రావించి యనెన్. 16

చ. తిరుపతివేంకటేశ్వరసుధీమణులార! కవీంద్రులార! సు
స్థిరతరబుద్ధిభాక్కృతవధానవిధానపటిష్ఠులార! మ

ష్కారము శతావధాన మొనరమ్మనఁ గన్గొన నిప్పు పుట్టె మి
కరయఁగ దాన నేర్పు గలుగ దంచు జగద్విదితంబు గావునన్. 17

క. మిముఁ బిలువఁ బంపితిని టే
ర్కి మెయిన్ మాయన్నగారి ప్రేరేపణచే
శ్రమ మెన్నక వచ్చితిరి ము
దము నొసరించితిరి మిగుల ధన్యుఁడ నైతిన్. 18

తే. గీ. కవు లనేకులు జగమునఁ గలరు గాని
శాస్త్రవేత్తలు గా; రట్టి శాస్త్రశక్తి
గలిగి కవితావిశేషంబు గలిగి శతవ
ధాన మొసరింప మీవలెఁ దగ దొరులకు. 19

క. ఊరూరికి నొక్కొక రవ
ధారం బెత్తిరఁట శతవధానము చెలుపన్
గారవులిఁ జూచి నక్కయు
నారూఢిగ వాఁత లిడిన నట్లగు నేమో. 20

తే. గీ. రామరాజభూషణుఁడు ధర్మసుకవియును
మాడభూషి వేంకటకవిమండనుండు
కవులలోపల విఖ్యాతి గాంచి శతవ
ధానమొనరించి రనుచు వదంతి గలదు. 21

తే. గీ. అంతియే కాని చూడ లే దనుచు శతవ
ధాన మష్టవధానంబుఁ దగ నొనర్పఁ
జేసి బహుమతు లొనరించి స్నేహరీతి
దనర నొకతటి నంతికోద్యానమందు. 22

వ. వినోదంబుగాఁ గతిపయ మిత్రసహితుండై కూర్చుండి యస్మద్విరచి
తమ్ము లగు ధాతురత్నాకర కాశీసహస్ర శృంగారశృంగాటక శుకరంభా
సంవాదాదికంబులగు సంస్కృత గ్రంథంబుల నచ్చటచ్చటి శ్లోక
మ్ములను వేంకటగిరి గద్వాల విజయనగరాది సంస్థానమ్ములఁ బ్రసం

గవశమ్మున నొనర్చిన చాటుపద్యమ్ములను విని సంతసించుచు మే
రంబగు నాదరమ్మున మమ్మెంగాంచి యిట్లనియె. 23

చ. తెలుఁగునఁ జాటుపద్యములు తీయనవై యలనాఁటి [illegible]
రలు పనిఁబూని యందమగు గ్రంథ మొకం డతినూతనమ్ముగా
నవరియు నీతియుక్త మగునట్లు ప్రధాన రసంబు చిప్పిలన్
గలయ రచింప రాదె; కృతినాయకుఁగా ననుఁ జేసి యొప్పుగన్. 24

ఉ. తాత కృతీంద్రుఁడయ్యెఁ బినతాతసమాఖ్యుఁడు సుబ్బరాయవి
ఖ్యాతుఁడునుం గృతింగనె నఖండయశుండు ముకుందరావు వి
ద్యాతరుణుండు మాకుఁ బినతండ్రి యతం డొకసత్కృతిం గనెం
దాతలనాఁటనుండి కృతినాథులు మాపురులీను లందఱున్. 25

తే. గీ. రాజులచరిత్రలును గవిరాజచరిత
ములును గ్రంథమ్ములవి పెన్నొగలుగఁ జేయు;
నందులో నామనమ్మున కరసి చూడఁ
గవులకతలను రాజులకతలు లొచ్చు. 26

వ. కావున నేదేని యొక కవిచరిత్రంబు శృంగారరసప్రధానంబై నీతియు
క్తం బగునటులఁ గల్పించి యొసర్చుట నా యభిమతం బని చెప్పి
సబహుమానంబుగాఁ గర్పూరతాంబూలంబుఁ బెట్టుటయు. 27

సీ. అతిరహస్యంపు సంగతికిఁ దాళపుఁబెట్టె
మంచిచెడ్డలకుఁ జూపించుత్రోవ
కాలయాపనకుఁ జక్కనియుపాయం బమి
త్రధ్వంసమునకు ఫిరంగిగుండు
ఘనకార్యములకుఁ బెట్టినపేరు దారిద్ర్య
భంజనమ్మునకుఁ దుపాకిదెబ్బ
యాపన్నివారణ కౌషధప్రాయమ్ము
తులలేని సుఖదుఃఖములకుఁ ద్రాసు

తే. గీ. ఆత్మసంరక్షణమున కిమ్మైనకోట
సంశయమ్మునకు వినాశసమయ మరయ
సకలలోకోపకారంబుసలుపు సుజన
మైత్రికన్నను వేఱొండు మహిఁగలదె? 28

వ. అని చెప్పి కృతినాయకు వంశావతారంబు వర్ణింప నారంభించితిమి.

వంశవర్ణన

తే. గీ. అబ్జసూతిమొగమ్మున నవతరించి
నిగమములతోడఁబుట్టువై జగతి మొదటి
వర్ణమనఁదగు బ్రాహ్మణవర్ణమందు
శ్రీలఁ దులఁదూఁగుచుందు రార్వేలవారు. 30

క. ఆ యార్వేలనియోగుల
లో యోగము గల్గి మిగుల లోకోన్నతసు
శ్రీయును విద్యయు యశమును
బాయనిదై వాడరేవువంశం బలరున్. 31

చ. అవనిపుమంత్రియై యశము నందనివాఁడుఁ బరోపకారమున్
దవులనివాఁడు సంతతవదాన్యత మించనివాఁడు భూసుర
ప్రవరుల కన్నదానము నపార మొనర్పనివాఁడుఁ బండితా
శ్యపకుఁడు వాడరేవుకులమందు జనింపఁ దదేమి చిత్రమో! 32

తే. గీ. అక్కులక్రమమందుఁ దా నవతరించె
మంత్రిమాన్యుండు కృష్ణయమంత్రిమౌళి
సత్యసంధుండు త్యాగి యాజన్మభోగి
యతులితాన్నప్రదాత విఖ్యాతినేత. 33

క. ఆకారము సౌశీల్యం
బేకాకృతిఁ జెందినట్లు లెసక మెసఁగె సు
శ్లోకుఁడు నతిలోకుఁడు నగు
నాకృష్ణయభార్య పాపమాంబిక సతియై. 34

క. లలితాంగి యగుచుఁ దగుతన
తలనీతిలకమ్మునం దతఁడు గనె మునురన్
జెలమయఁ బెదచినసీత
స్నల లలితాకృతులఁ గృతుల నవసుమములన్. 35

చ. ఇలఁ గల మంత్రిపుంగవుల కెల్లరకున్ దల దాఁటి బుద్ధి గో
పల గురు వంశమై కవులపాలిటికల్పనగంబునాఁ గో
ర్కెలొసఁగు రామమంత్రిసగరీసంసాధివుఁ గూర్మిమంత్రియై
చెలమయమంత్రి వర్ధిలె విశేషయశస్స్ఫురితదిగ్తటీదుఁడై. 36

తే. గీ. లీలమెయిఁ బల్లకీలోని కాలు నేలఁ
బెట్టక చెలంగుసంపద నెట్టుకొనఁగఁ
జెలఁగె సత్యపరపుఁదహాసీలుదారుఁ
డగుచు ననయము నాచెలమయ్య మంత్రి. 37

చ. చెలమయమంత్రికిన్ సుగుణసేవధికిన్ దగుదేమయున్ సతీ
తిలకము చారుతావిధికిఁ దేట గుణమ్ములపేటి "యచ్చపూ
లలనకు సాటి రాఁదగరు లాఁతిచెలంవు" లటంచు నెంత్రు లో
కులు, చెలమయ్య యాతరుణికోస మొనర్చినపుణ్య మెట్టిదో! 38

చ. చెలమయమంత్రి కచ్చమకు శ్రీకరుఁ డార్యనుతుండు సద్యశో
విలసితదిగ్వితానుఁ డగు వేంకటరాయఁడు గృష్ణయాఖ్యుఁడున్
గలితగుణాఢ్యుఁడై సొబగుఁ గాంచిచెలంగెడు సుబ్బరాయఁడున్
గలిగిరి పుత్రులై సమధికంబగు బుద్ధిబలంబుదీటునన్. 39

చ. సుజనులయందు రక్తి పెరసుందరులందు విరక్తి దైవత
ద్విజగురులందు సక్తి నిరుపేదలయందు సమగ్రసక్తి దు
ర్వ్యజరిపుషట్కముక్తి సరసంబగుయుక్తి మృదూక్తియుక్తి వి
శ్వజనసదానురక్తి సహజమ్ములు వేంకటరాయమంత్రికిన్. 40

తే. గీ. సకలమతసారసిద్ధాంతసంగ్రహంబు
నొనరిచినమేటి నాచికేతునిచరిత్ర

మల్లికార్జునరవిజనమౌళిచేతఁ
గృతిఁ గనినమేటి యాతని కెవరు సాటి? 41

తే. గీ. మహితసోమేశ్వరస్వామి మనికిపట్టు
గౌతమీపుణ్యతీరప్రకాశితంబు
పూసపాటిమహేంద్రుప్రోలు కోటి
పల్లెతాణాకు నేతయై పరగెనతఁడు 42

తే. గీ. భర్త కనుకూల యతిథులపాలియన్న
పూర్ణ సకలసుగుణములపుట్టినిల్లు
నమ్మహాలక్ష్మిసాటి కామమ్మ తనరు
ధర్మసతి గాఁగ నచ్చమాంబయుఁ దలరె. 43

క. ఆ యిరువుర కుదయించిరి
ధీయుతుఁడు చెలమయమంత్రి ధీరుం డగునా
రాయణమూర్తియు సుజనవి
ధేయుఁడు భుజంగరాయధీసేవధియున్. 44

ఉ. మేధమెయిన్ బృహస్పతిసమీకృతుఁ డా చెలమయ్య మంత్రి గం
గాధరరామరాయనృపకాంతుఁడు రావుకులాగ్రిగణ్యుఁ డా
రాధితసత్కవీంద్రుఁ డతిరమ్యుఁడునై తగు పీఠికాపురీ
నాథునిమంత్రియై యశమునన్ దెర గట్టె దిగంత మంతటన్. 45

తే. గీ. అతఁడు మంత్రిత్వమువహించి యఖిలరాజ
కార్యముల నిర్వహించెడికాలమందు
రాజురాజను మాటమాత్రంబకాని
రాజునెఱుఁగరు ప్రజలు చిత్రంబు గాదె? 46

చ. పదునగు సన్నయన్నమును బట్టి వడల్చినఁగాని జిడ్డు తే
ల్పదలనిమంచినేయియును బాయసమున్ బలుపిండివంటలుం
మదికి ముదం బొసంగెడిఘుమంఘుమఁ బొల్చెడికాయగూరలున్
బొదలఁ దదీయపఙ్క్తిఁ దిని పోదురు బ్రాహ్మణు లెందఱేనియున్.

ఉ. క్రాఁగినవేఁడినీళ్ళను సుఖంబుగ స్నానముఁ జేసి తృప్తిగా
నోగిరమున్ భుజించి సొగ సొప్పెడిసత్రిపుఁ జాపడిన్ సుఖ
శ్రీ గణియించుచున్ నిదురఁ జెందుచుఁ జెల్మయమంత్రి నెంతురీ యూ
రాగతులైనబ్రాహ్మణు లహో! యని సొక్కుచుఁ గత్తిపూడిలోన్.

ఆ. వె. వాదరేవువంశవర్ధనుం డగుచెల
మయ్య కత్తిపూడియందు సత్రి
ముంచు కారణమున నొక్కింత చోరుల
బాధ తగ్గె నడచు పథికులకెల్ల. 49

సీ. చలము మీఱంగ శత్రుల జయించి ప్రతాప
మార్జించి మించెఁ దిక్కన్నమంత్రి
పైఁడియాదలలోనఁ బండితకవికోటి
కన్నముఁ బెట్టె విస్సన్నమంత్రి
బలుచమత్కారంబు గలగ్రంథములను నా
యకుఁడై చెలంగె సింగన్నమంత్రి
యడుగువారలకు నెక్కుడుగమాన్యము లిచ్చి
యశముఁ గైకొనియె నక్కన్నమంత్రి

తే. గీ. యొక్కొకరి కొక్కొక విశేషమున్నదంతె
కాని యన్నివిశేషముల్ గలుగలేదు
కలిగెఁటో! యువియన్ని యఖండుఁడైన
మహితవాద్రేవు చెలమయామాత్యమణికి. 50

తే. గీ. అన్నిటికి నేమి గాని కార్యార్థి యగుచు
నెచటి కేగిన నేలాటిమొదలనైన
వందవందలకొలఁది సద్బ్రాహ్మణులకు
నిత్యమును వంట చెలమయామాత్యువెంట. 51

ఉ. భావిపురాతనాద్యతనపార్థివులం దల పీఠికాపురీ
రావునృపాలశేఖరుని రాణకు మించిన రాజచంద్రుఁడు, వా

దేశ్రిపురసులుఁడుఁ దన్నరిపరేణ్యుని మంత్రియునైన చెల్మయన్
దేప నెదుర్చుమంత్రిజనశేఖరునిట్టి గనంబోల దొక్కెడన్. 52

తే. గీ. చతురమతియును గడుఁ జండశాసన ప్ర
భావుఁడగు కూచిమంచి గోపాలకృష్ణ
మంత్రి గారాపుఁగూఁతురు మహితసుగుణ
యైన కామేశ్వరమ్మఁ బెండ్లాడె నతఁడు. 53

క. ఆ కామాంబిక గుణముల
కాకరము సతీత్వమునకు నాలయము శుభ
శ్రీకిన్ దా పై చెలఁగె ర
మాకాంత యనంగ నయ్యుమాకాంత యనన్. 54

చ. అలచెలమయ్యమంత్రి గనె నాసతియందు మనోజతేజునిన్
విలసితసద్యశఃకలితు వేంకటరావు ననంతకాంతి జో
త్పిలు గుణవంతు నప్రతిము వేంకటరత్నసమాఖ్యు నల్వురన్
సలలితరూపశీలవిలసన్మతులై తనరారు కూఁతులన్. 55

సీ. ఇరువురు నాకృతి యొసకంబు గలవార
లిరువురు సమశైలిఁ బరఁగువార
లిరువురు గుణముల నెన్నంగఁ దగువార
లిరువురు యోగ్యత నెసఁగువార
లిరువురు నన్నంబు నిడ నాస్థగలవార
లిరువురు విద్యల నెఱుఁగువార
లిరువు రింగ్లీషులోఁ బరిచితి గలవార
లిరువురుఁ గవులకు నిచ్చువార

తే. గీ. లిరువురును భాగ్యభోగ్యముల్ వఱలువార
లిరువురును దాతతండ్రిల సరణివార
లమరు వేంకటరాయరత్నముల కతిశ
యోక్తిగానేర దిది స్వభావోక్తిగాని. 56

తే. గీ. తగు "కలెక్టరు" వ్యాసమూర్తిపులు తెల్గు
నన్ బొనర్చిన యాజగన్నాథరావు
తనయ వేంకటరత్న మూలమునిఁ బెండ్లి
యాడె వేంకటరావు ప్రఖ్యాతి మెసఁగ. 57

క. ఆవెలఁదియందు వేంకట
రా వాక్కుసుమాంగనియె రమ్యాకారిం
శ్రీ వెలయువానిఁ జలపతి
రావున్ గామేశ్వరియను రంటిలు కూఁతున్. 58

క. ఆ వేంకటరావు పున
శ్శ్రీ వెలయఁగఁ బెండ్లియాడెఁ జెల్లాయమ్మన్
భావుకగుణసంపన్నన్
భావమునను నచ్చినట్లు వరఁగెడిసాధ్విన్. 59

తే. గీ. పెద్ద 'తహసీలుదారుఁడై' పేరుగొన్న
తేజుగల నందివాడ పేట్టాజుకూఁతు
నను గుణగుణాఢ్యఁ బద్మనాథమ్మయనెడి
రమణిఁ బెండ్లాడె వేంకటరత్నమంత్రి. 60

శా. ఆరూఢాఖిలభోగభాగ్యములచే నాపద్మనాథమ్మయం
దారోగ్యాయురపారసౌఖ్యగుణగణ్యాకారసౌభాగ్యసం
త్కారన్ వేంకటరత్నమంత్రిగనియెన్ గామేశ్వరీనామక
న్యారత్నమ్మును సొంపు పెంపు వెలయన్ గామేశ్వరీసత్కృపన్. 61

(షష్ఠ్యంతములు)

సీ. ఏతాదృశస్ఫీతిభూతివిఖ్యాతివి
ద్యాతిశయద్యోతితాంతరునకు
సంస్కృతాంధ్రకవిత్వసారస్యమారంద
ధారామధుకరాయితశుభమతికిఁ
జెలమయామాత్యసంచితపుణ్యరాశికిఁ
గామేశ్వరాంబికాగర్భమణికిఁ

బిస్రనాథాంబికాపతికి వేంకటరాయ
సోదరునకు దాతృతావరునకు

తే. గీ. వాచరేష్ఠకలాబ్ధిపూర్ణోడుపతికిఁ
ప్రథితమౌద్గల్యమునిగోత్రపావనునకు
సరసకవిజనపికపుష్పసమయమునకు
మహితవేంకటరత్న సన్మంత్రిమణికి. 62

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా మా యొనర్పఁబూనిన కేవలకల్పిత ప్రబంధంబగు శ్రీపఞ్చాననమ్మునకుఁ గథాక్రమం బెట్టి దనిన. 63

(కథా ప్రారంభము)

చ. కల దొకపట్టణంబు కలకాల మపారసుధారసంబుచే
నలరు రసజ్ఞ యన్నమున కాసలు సేయ ధరాతలమ్ములో
వల జనియించి పాటలనెపమ్మున నుండెడి దేవకోటినాఁ
దెలఁగెడి శిష్టకోటికిఁ బ్రసిద్ధ మనంతపురాభిధానమున్. 64

సీ. అరుణోదయమున నిత్యస్నాన మొనరించి
యర్ఘ్యప్రదానమ్ము లాచరించి
సిర్కా విబోవతుల్ నియతిగా ధరియించి
పలుమాఱు పింజెపింజెలు ఘటించి
భూతిరేఖలు మూఁడు మొగమునఁ గీలించి
భ్రూమధ్యమునఁ జుక్కబొట్టుఁ బెట్టి
నారికేళకటాసనమ్ములఁ గూర్చుండి
జందెపుసవరణల్ సలుపుకొనుచు

తే. గీ. బ్రహ్మచారులు వేడ్క సంభ్రమముతోడ
ననుపఠించుచు నుండఁగా ననుదినంబు
వేదసంతలఁ గాలమ్ము వెళ్ళఁబుత్తు
రనుగుణమ్ముగ వైదికు లప్పురమున. 65

సీ. రాజు లెల్లరును భార్గవరాముచే యనఁ
దేజంపుఁ బెంపు నశింపవలెనె;

కోమటు లెల్ల జక్కులరాజులే యన
నైశ్వర్యములపెంపు లమరఁగవలెనె ?
పాదజు లెల్లను బలరాములే యన
హాలసంపదయు నొక్కఁ బలుకవలెనె ?
వెలకాంత లెల్ల రంభలె యన్న రూపసం
పద లిట్టి వంచుఁ జెప్పంగవలెనె ?

తే. గీ. వనము లెల్లను నందనవనములె యనఁ
గుసుమసంపత్తులను చేత కొనఁగవలెనె ?
యనఁగఁ జెలువారు నవనిలో ననుపమాన
పుణ్యచరితం బనంతాఖ్యపురవరంబు. 66

చ. చదువుల నన్నియున్ జదువఁజాలిన శిష్యులు చుట్టుముట్టఁగా
నది యిది యంచు నెంచక సమస్తరసమ్ములతోడ నెప్పు డె
య్యది ప్రకృతంబొ తద్రసమయత్వము నొంది వచింపుచుండు రా
ప్పిదముగ నప్పురంబునఁ గవిప్రవరుల్ సరసత్వ మొప్పఁగన్. 67

వ. అట్టి కవిపుంగవులందు విశిష్టాద్వైతమతమ్మున. 68

క. మేదురసంపద్వ్యక్తుఁడు
మేధావి యశస్వి సుకవిమిత్రుఁడు కవితా
మోదామృతాంబునిధి మధు
సూదనుఁ డను నొక్క సుకవిసుందరుఁ డొప్పున్. 69

ఉ. చిన్నతనమ్మునన్ గడుఁ బ్రసిద్ధపు విద్యల నభ్యసించి సం
పన్నత గల్గి సుందరసుమం బనఁ దల్లికిఁ దండ్రి కొక్కఁడై
వన్నెయు వాసియున్ రుచిరవర్తనమున్ జెలువార నొప్పు న
ప్పెన్నిధి, తల్లిదండ్రు లిలఁ బెత్తన ముత్తమరీతిఁ జేయఁగన్. 70

ఉ. "మానవదేహి కెంత మతిమంతున కింతటిలోన నోనమా
లైనను రావు వానిఁ గనినయ్యమ లెంతటి పుణ్యశాలులోఁ
గాని సుఖమ్ము లిట్టిసుతుఁ గాంచినవారలవే" యటంచుఁ బే
రాని నుతింత్రు కేళిసమయమ్ముల దంపతులెల్ల నాతనిన్. 71

సీ. "నాకళ్ళయెదుట మొన్నటిదాఁకఁ జిన్నత
నంపుఁజేష్టల సంచరింపలేదొ!
నాకళ్ళయెదుట నున్నతిలేక వెట్టి నా
వీధివీథుల విఱ్ఱవీఁగ లేదొ!
నాకళ్ళయెదుట నెంతయువింత రఘువంశ
మును జంకఁబెట్టుక చనఁగలేదొ!
నాకళ్ళయెదుట నున్నతు లెల్ల నవ్వంగఁ
జిటిపొటిపద్దెముల్ సెప్పలేదొ!

తే. గీ. ఎంతలో నెంతవాఁడయ్యె! నెంత బుద్ధి
వచ్చె! నెటువంటి సత్కీర్తి వచ్చెఁ! జిత్ర"
మనుచు నాతని చర్యలే యభినుతింత్రు
పండితవరేణ్యు లక్కవి భాగ్య మేమొ! 72

క. ఎప్పుడు మనమునఁ దలఁచినఁ
దప్పక కడుపారఁగన్నతల్లింబలెఁ దా
నప్పరమేశ్వరి యాతని
కప్పుడె కననౌను బుణ్య మది యెట్టిదియో! 73

సీ. కవితఁ జెప్పఁగనేర్చుఁ గఱపు దీఱఁగ వేయి
గంటాలకైన నిష్కంటకముగఁ
జదువఁ జెప్పఁగనేర్చు శబ్దశాస్త్రాదికం
"బది మే" లనుచుఁ బండితాళి మెచ్చ
వద మడంపఁగ నేర్చుఁ బదిమందికవు లొక్క
టై దుష్టవాదమ్ము నందుకొనిన
మాటలాడఁగ నేర్చు మధురమ్ముగా విన్న
వార లెల్లరును 'వహ్వా' యనంగ

తే. గీ. 'బాగుబా' గనియనఁ బాటఁ బాడనేర్చు
నతులితంబుగఁ జదరంగ మాడ్చుడనే

కూడెనా! యక్షేశుకొడుకైన బుధ విభు
　　త్రికిఁ దగ్గఘన మిచ్చి తేలదేఁడు
మేఁడెనా! వేదాంతవిద్యావిశేషజ్ఞుఁ
　　డైనను మాటుమా టాడదేఁడు''

తే. గీ. అనుచుఁ దనుఁజూచుజనులెల్ల నభినుతింప
సాటిబోటులలో నీటుగోటుఁ గల్గి
పఱితె నౌరౌర! బళిర! వహ్వా! వహ్వా!
మేలుమేల్! రాజధాని యూబాలసాని. 80

క. అమ్మధుసూదనుసార
స్యమ్మును విని సోయగమ్ము నడసెయు ననురా
గమ్ము మదినూనె దైవకృ
తమ్మున నబ్బాల దానిదశ యెట్టిదియో! 81

గీ. వయసువాఁడఁట! యామీఁద వైష్ణవుఁడఁట!
సుకవియఁట! సూక్తినిధియఁట! సోయగంబు
గలుగువాఁడఁట! మనములు గరఁచకున్నె?
జాఁతివైనను నేలాటినాతికైన. 82

వ. ఇట్లు తదధీనచిత్తయై తన మనమ్మున. 83

సీ. ముద్దుమాటల మురిపెమెఱుంగనివాని
　　ధనమేల? వానిసౌందర్యమేల?
బంధవ్యవాయసంపద తెఱుంగనివాని
　　ధనమేల? వానిసౌందర్యమేల?
చుంబనప్రక్రియాసుఖ మెఱుంగనివాని
　　ధనమేల? వానిసౌందర్యమేల?
సరససంగీతవైఖరి తెఱుంగనివాని
　　ధనమేల? వానిసౌందర్యమేల?
తే. గీ. ఇన్నియును గల్గి జగతిలో పన్నెకెక్కి
సతులఁ దేలించు సుకవిపండితుల నరయ

రతులఁ దేలింప రతిధనయుతుల నధము
తతులఁ గవఁగూడు తనువులగెతు లవేల ? 84

వ. ఇట్లు పట్టరానితమకమ్మున చుట్టుముట్టు నెట్టకేలకు సిబ్బితెడి చిన్నది
మెల్లనఁ దనమనోభిప్రాయం బెఱింగించి సిగ్గుపడిచి యున్నది. 85

చ. చతురుఁడటంచు సర్వకవిసత్తముఁడంచు మహాత్ముఁడంచుఁ ది
వ్యతనమువాఁడటంచును ఘనమ్ముగ నాతనిఁ జెప్పుకొందుము వే
యితిపరుఁగల్గునో యతని సత్కృతిఁగూడి సుఖింపు మన్న నా
యితిపయె ధన్య. జన్మ మన నయ్యదియే ! సొగసున్న సద్దమే ! 86

ఆ. వె. సరసుఁడగుచు సర్వసంపద్భములయందుఁ
బెద్దయయ్యు వయసుపేర్మిచేతఁ
బిన్నయైనవాని మన్ననఁ జేరన్న
సానకర్మిందిపన్న దానిపన్న. 87

తే. గీ. కలిమి గలవా రనేకులు గలరుగాని
తెలివిగలవారుకారు; నాతీరుతెలిసి
గలుగువారలఁ గూడఁగాఁ దలఁచియుంటఁ
గాని ధనపద్మపాత్ర్యకుగణముఁగాదు. 88

క. ధనవంతులు ధనవంతులు
ధనవంతులటంచుఁ బల్కెదవుకాని సదా
ధనమెంత తెచ్చియిచ్చిన
ధనమా ? మతి సౌఖ్యకరము తల్లీ ! చెప్పుమా. 89

చ. "వెలధనమింత" యంచనిన మేనమాయాసయుచ్చు మచ్చుపుల
దులు వెదఁజల్లినట్లు కడు దొంగవిలాసము యాసుకట్టిటా
మ్మలఁ గవఁగూడువారి యధమంబగుజన్మము సౌఖ్యజన్మమా ?
పలచినబాలికన్ గవయువారిది జన్మముగాక తల్లిరో ! 90

తే. గీ. విత్తమార్జించు పనికిసై పేలకొలఁది
గా నుపాయములున్నవికావి కార

దాఁచపు మ్ములు గలవాఁడు దక్క నితరుఁ
డింతి రుచములు బట్టిన నేమిసుఖము ? 91

తే. గీ. గర్భగతునకునై నను గల్పనమ్ము
సేయు ప్రవృత్తిసటంచును జెప్పుచుండ్రు;
పెట్టఁడా ! పట్టెఁడన్నము పృథివిలోన
మనలఁ బుట్టించినట్టి యవ్వనజభవుఁడు. 92

తే. గీ. అదియునుంగాక నీవు ద్రవ్యంబు వేల
కొలఁదిగా నార్జనముఁజేసి కూడఁబెట్టి
యుంటి; వయ్యది చాలదే ? యొరులకీయ
మేమును భుజింప నాకరు మేరగలదె ? 93

తే. గీ. ఇట్లు బాలామణియును గామేచ్ఛపట్టఁ
జాల రాచార్యునిసయుండు చాల సరసుఁ
డనుచుఁ దనతల్లితోఁడ ధనాశ గూడ
దనుచు బోధించి బోధించి యనియె మఱియు. 94

చ. "వితతయశుండు ధార్మికుఁడు వేలకువేలు గణించువాఁడు పం
డితుఁడు సమస్తరాజమకుటమణిరంజితపాదుఁ డార్యస
న్నుతుఁడగు నాథరాముఁడు దనుంగుఁ బ్రియుండగుఁగాత" మంచు న
న్నుతి యొనరింతు నెంతయు నినున్, సముఁహార్పఁగదే! రయమ్మునన్.

తే. గీ. అనుచుఁ దనతల్లితోడఁ జెప్పినదితాని
తానుతానయి స్వాతంత్ర్య మూనదయ్యె;
నెంతవలవున్న నెంతవలంతియైన
జననిఁ గిసురింపలేదు వేశ్యావధూటి. 96

చ. అను తనపుత్రిమాటలు హృదబ్జము బిట్టలరింప వృద్ధభా
మినియు మనమ్ములో సుతకు మేలు గణింపుచు "మంచిదమ్మ ! నీ
కనుగుణుఁడైన పూరుషు రయమ్మున నే ఘనుఁ దూర్తునమ్మ ! నీ
వనుమితి మానుమమ్మ! మనమం" దనుచున్ గడుఁ బ్రీతిఁ బల్కుచున్.

పెద్దాపురపుఁగోట పెద్దమ్మ కిల్లాట
కవివరేణ్యుల కోపకలనఁ గాదె?

తే. గీ. కరుణ గల్గిన నిల్లు బంగారు మూసు
గరుణ దప్పిన నడవియౌ గడియలోన
బ్రహ్మకొడుకైనఁ గవులకు భయముఁజెందు
మన మనఁగనెంత? యమ్మక్క! మదిని జూడ. 103

తే. గీ. ఐన నొక్కయుపాయంబుఁ బూని వాని
మనగృహం బేగుదెంచు నట్లనుఘటింప
వలయు; నవ్వైష్ణవసుతుండు వచ్చువఱకుఁ
జిలుకవలె నుండు మీవు సొమ్ములుధరించి. 104

వ. ఇట్లు తనతనయ నొప్పించి యిప్పని యెట్లు నమకూర్తునని మనమ్మున యోజించుచున్నంత నొక్కనాఁడు దైవవశమ్మున నమ్మధుసూదనుండు.

క. కట్టుస్ బొట్టుస్ జుట్టుస్
బిట్టువనుల బుట్టఁజేయ బిరబిరమనుచున్
నెట్టనఁ దనవీథిం జను
పట్టున నడిఁగట్టి వృద్ధవారాంగనయున్. 106

తే. గీ. ఎదురుచని "స్వామి! మీదాసి పదములకు న
మస్కరించుచునున్నది మాగృహంబు
చెంత కొకసారియైన వేంచేయవలదె?
మహిఁ బ్రవృత్తికిఁ దారతమ్యములు గలవె? 107

వ. అదియునుంగాక యేడుమూఁడు పురుషాంతరమ్ములనుండి మీపూర్వుల మంగళాశాసనపరిభావమ్మునను దివ్యమంత్రోపదేశ పరిభావమ్మునను నొక్కింతయుఁ గొదవలేక నేఁటివఱకు వర్ధిల్లుచుంటిమి. మాయర్థ ప్రాణమ్ములు భవదధీనమ్ములగుటం జేసి. 108

క. ఒకమాఱు మాదుగేహము
నకు దయసేయక యె చనుట న్యాయమె మీకున్?
సకలజనులు భగవంతున
కొకటేకద! పక్షపాత ముండునె? చెపుఁడీ." 109

తే. గీ. అనుచుఁ బల్కిన పల్కుల కతఁడు మాఱు
మాటఁ జెప్పఁగలేఁడాయెః మాహిని బల్కి
చేతఁ బాత్రైనఁ ద్రావరు స్నేహరీతి
చేత విషమైనఁ ద్రావుట సిద్ధము కద ! 110

తే. గీ. నక్క పొదరిల్లు పంచాననంబు కరణి
వారకామిని యిలు సొచ్చె వైష్ణవుండు;
ఎన్ని చదువులు చదివిననేమి నీచు
లకు గురుత్వంబు వైష్ణవులకు నితంబు. 111

క. మత్యమరాచార్యసమ
ప్రత్యయసచివాగ్రగణ్య ! పండితసుకవి
స్తుత్యా ! వేంకటరత్నా
మాత్యమణీ ! సుజనకమలమాన్యద్యుమణీ ! 112

చ. చెలమయమంత్రిపుత్ర ! సరసీజశరోపమగాత్ర ! నీరజా
తలసితనేత్ర ! సర్వజనతానుతిపాత్ర ! కవీంద్రదక్షిణా
నిలశుచైత్ర ! దానజితనీరజబాంధవపుత్ర ! రాజితా
చలహారహీరకాశసితసారసతుల్యయశోధురంధరా ! 113

కవిరాజవిరాజితము.

లలితసుహృత్కవిబంధుయుతామితలక్షణలక్షితచిత్రపదం
బలయుతదివ్యసభాభవనాంతరపారగసప్రసరత్కవిసుం
దలకవితామృతసంతతపానసుసః ప్రియవారకథాషణవా
మలతరవర్తన ! తోషితబాంధవ ! మంత్రిశిఖామణి ! ధీరమణీ !

— గద్య —

ఇది....శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్ర వ ణా మ ం ట ప ము



## ద్వి తీ యా శ్వా స ము

క. పంకేజాతవిలోచన
పంకరుహాభవాదివినతపదయుక్కుటరూ
పాంకితశంకరకింకర !
వేంకటరత్నపరిధాన ! విశ్వజనీనా ! 1

తే. గీ. అవధరింపు మనంతరం బతని సుచిత
పీఠమం దుండఁగాఁ జేసి వేశ్యమాత
బత్తి దళుకొత్త మిగులఁ బ్రిపత్తి దనర
నిట్టులనియెను గౌరవం బుట్టిపడఁగ. 2

తే. గీ. వైష్ణవోత్తమ ! మీ పాదపద్మరజము
వలన మాయిల్లు పావనత్వంబు నందె
ధన్యనైతిని మాకన్య ధన్యయయ్యె
నెన్నియో మంగళము లబ్బు నింక మాకు. 3

ఉ. దాసజనప్రసన్నుఁడగు తామరసాక్షుని దాసులైన మీ
దాసులకున్ దదంఘ్రియుగదాసులకుం దదధీనవృత్తులౌ
దాసులకుం దదీయపదదాసులకుం గడుదాసురాల వి
శ్వాసము గల్గువారలకు వైష్ణవులే కద ? రంగనాయకుల్. 4

తే. గీ. చిన్నతనమున మాయింటి కెన్నఁడేని
స్నేహితులఁ గూడి మీరు విచ్చేయుచుండుఁరి
నాలుగైదేండ్లనుండి యెన్నఁడును రారు
దాసి తరియించునట్టి విధం బిఁకెట్లు ? 5

వ. అని వినయమ్మునం బల్కు సజ్జనభవేశ్య కయ్యాభిముఖ్యం డిట్లనియె. 6

ఉ. వచ్చుట కేమిగాని పలువారలు చూచిన లేనిపోని పె
న్మచ్చలు పన్ని "యీతని గుణమ్ములు మంచివి గా" వటంచుఁ దా
రచ్చటనచ్చటం బలికి యల్లరి సేతురు; లోకు లన్ని బ
ల్ముచ్చులు సత్యమెన్నరు దె? లోకము మాయను మాఁగియున్నదీ?

ఉ. ఇంతకుఁ దప్పు వేఱొకటి యేదియు లే దిఁక సంపదుండు డా
సంత యటన్న; వృద్ధ యను "నయ్యది పొప్పదె లోకు లైనవా
రెంతటివారికైన నిటు లెంచుదు రైనను వారివల్ల నా
వంతయు మీకుఁ గార్యమునునట్టిది లేమగదా! తలంపఁగన్. 8

ఉ. నిప్పున కంటునే చెదలు? నీరజమిత్రుని కంటునే తమం?
బెప్పటికైన మీరలిటు లేటికి సందియ మందుచుందు? రో
యప్ప! రమానివాసుని దయన్ దమ రెంతటివారలైననున్
దప్పునె? దాసురాండ్రపయిఁ దప్పులు పట్టక యాదరించుటల్." 9

వ. ఇట్లుచితాలాపమ్ములం బొద్దుఁ బుచ్చుచున్నంత. 10

సీ. ముంగాల సింగారముం గార మేలు బం
గారు రంగారు లంగా ధరించి
దబ్బకాయలఁ జూచి యబ్బగారని పిల్చి
గబ్బి గుబ్బలఁ గంచుకమ్ము దొడిగి
చందమామ మిటారమొందు మోమున గంగ
సిందూరనామంబుఁ దొంమెఱచి
కలువరేకుల దాలు గెలువఁజాలెడి సోగ
చెలువు కందోయిఁ గజ్జలము దీర్చి

తే. గీ. లీలఁ గిల్జడఁ జుట్టి చౌల్లెమ్ము పెట్టి
లలితరుచి నొప్పుచున్న బులాకి కోడ
మించి ముసిముసినగవులు మేలమాడ
విప్రుదరిఁ జేరె నప్పు డవ్వేశ్యతనయ. 11

ఉ. పైఁట దొలంగి పాదములపైఁబడ గాజులు మ్రోయ సర్వదే
శాటనపావనంబగు ధరామరుపాదసరోజయుగ్మ మా
బోటి నమస్కరించె నలపుష్పశరాసుఁడు బాణపఙ్క్తికిన్
వాటము గాక తా గిరటపైఁ బెనచాప మనంగ నత్రటిన్. 12

వ. ఇట్లు నమస్కరించినఁ దగుగతి మంగళాశాసనం బొసఁగి చనుట
కుద్యుక్తుండగు వక్కవివర్యుం జూచి వృద్ధ యిట్లనియె. 13

క. అమ్మా! మన యయగారికి
నిమ్మా! తాంబూల మింటి కేగెదరఁట వే
బొమ్మ కొనిరమ్మ మన పు
ణ్యమ్మున వారిటకు వచ్చినారు గదమ్మా! 14

సీ. అయగారి దర్శనం బాచరింపఁగవలె
నంచు నెంతయుఁ గుతూహలముతోడఁ
బల్కుచుందువు నీవు కల్కిరో! యెన్నాళ్ళ
నోయుండి వార లీయూరిలోన
దయచేసి యుండియు దయచేయ రెన్నఁడు
మన యింటి కటువంటి మాన్యు లిపుడు
దయచేసినారు తద్దయు నీదు సుకృతంబు
ఫలియించె, నీనోము పండె నమ్మ!

తే. గీ. వారితో మాట లాడ రీవకున నీవు
సిగ్గు గైకొని తలవంచు టెగ్గుగాదె!
వార లేమనుకొందు రీవరుసఁ జూచి?
యన్యులా? వారు మనకుఁ బద్మాయతాక్షి! 15

వ. అని తల్లి పల్కుటయు. 16

ఉ. చేతను బళ్లెరంబుఁ గొని సిగ్గొకకొంచెము వెన్కలాగఁగా
వాతెఱయందుఁ జిర్నగపు వాటపుఁబంతము లాడుచుండ మే

ల్మాఁతల గుబ్బలున్ బయఁటలోపల డాఁగుచుమూఁతలాడఁగా
నాతని డగ్గరెన్ వికసితాంబుజలోచన గుండె ఝల్లనన్. 17

ఉ. "ఇచ్చిన దిప్పుడే పెదలు నీయన, నీయుత యిట్టు లెంతనే
పిచ్చటఁ గాలయాపనము నే నొనరింతు" నటంచు నుంచుచున్
ముచ్చట వెన్కకున్ మఱియు ముందటికిన్ దిగలాగఁ గొంచనే
పచ్చపలాక్షి యూరకొనె; నట్లగుఁగా మది మోహముండినన్ । 18

సీ. కరము కంపము నొంద సదులు తల్లడ మందఁ
జెమటచేతను జెక్కు చెమ్మగిల్లఁ
గనులు చాపలమూన మనము గోరికలానఁ
దనువు పులకలచే దళముగాఁగ
నవ్వు లవ్వకుఁదీయ లవ్వ చివ్వునదాయఁ
జనులు గందరగోళ మనుసరింప
సిగ్గు వెన్కడుగేయఁ జేటు ముందడుగేయ
మోహమ్ము తలకెక్కి మురువుఁజూపఁ

తే. గీ. బల్లెరము బల్లమీఁదను మెల్ల నునిచి
తమలపాకులు దీసి హస్తమునఁ బూని
పొలఁతి తాంబూల మిచ్చునప్పు డొకపింతఁ
జేసె నావింత యేమని చెప్పవచ్చు? 19

వ. ఇట్లు తాంబూలం బొసంగిన గ్రహించి చన సుద్యుక్తుం డగు నమ్మధు
సూదనున కవ్వేశ్యమాత మరల నిట్లనియె. 20

తే. గీ. తప్పుగాఁ జూడరేని నే నిప్పు డొక్క
మనవిఁ జేసెద; దేవర మనవి చిత్త
గింపవలెఁ దప్పయిన క్షమియింపవలయు
దాసరుల తప్పు దండముతో సరిసమ. 21

తే. గీ. వర్ణములలోన వృత్తినిఁ బట్టిచూడ
మాకులం బెంతకేనియుఁ గాకులంబు

"తగిన యన్నంబులోనికిఁ దగినకూర
దొరక" దనుసామెతకు మేమె గుఱుతుసుండి. 22

మ. ధనమా ? లోపములేదు; విద్యయును మీదాస్యమ్మునంజేసి కై
కొనె నీ కన్నియ, రూపురేఖలకుఁ దక్కుంగల్గు మావారిలోఁ
గసుగిప్పై తగు హెచ్చుతగ్గు, గడువేడ్కన్ సాటి రోబోట్లరీ
తిని వర్తింపఁగఁ జేయకుండుటకు నెంతే నెంతు స్వాంతంబునన్. 23

ఉ. పుట్టిననాఁటనుండి ధనమున్ గడియించుట కిచ్చలేదు నా
కెట్టులనైనఁ గాని ఘనులెల్లరు మెచ్చుటయే ధనంబు సీ!
పొట్టకునై కడయ్య ? పలుపోకలు పోవుట, ధాత పెట్టఁదే
పట్టెఁడుకూడు ? నన్నము నెపమ్మునఁ జచ్చినవార లుండిరే ? 24

ఉ. ఏదెసనైన సత్పురుషు లెల్లను మెచ్చెడి సత్ప్రవర్తనం
బూఁటి క్రమప్రకారమున నుత్తమసమ్మతిగా ధనంబు సం
పాదనఁ జేయు టొప్పగును; మాన్యులు మెచ్చనిద్రవ్య మేల ? పా
కీడి గడింపదే ధనము; కీర్తికిరాని ధనంబు కొల్పనే ? 25

శా. ఏనే రాను మదీయమైన కులమం దెన్నో తరాలాయెఁగా
నీ నీచున్ వినఁబోరు, చూడరు; ధనం బీసీ ధనం బీయుకే
పోనీ బ్రాహ్మణజాతిఁ దక్క నితరున్ భోగింపఁగాఁబోరు; కా
దేనిన్ క్షత్రియజాతి, యన్యము 'ముదారే' మాకుఁ జర్చింపఁగన్. 26

ఉ. కాసుల నిత్తుమంచు నరకాసుల నిత్తుమటంచు వత్సర
గ్రాసమువచ్చు భూముల నొకానొక నిద్రకె యిత్తుమంచు నా
యీ సుత నెల్లవారడుగ, నేమొకొ ? నామన మిచ్చగింప; దే
దోసమొ కాని నా తనయతోడు మఁడీ ! యనృతమ్ములాడినన్. 27

ఉ. అందఱు కన్నివంకలను నల్లుచునుండు నెకాని యెవ్వనిం
బొందుట కిచ్చగింప; దదెపో, యని యేనును నూరకుంమ; మీ
యందునమాత్ర మిచ్చ గల దంచును సూచనఁ జేయుచుండు; నే
"సుందసుప్రమాసిపం డిది" యటందును; దా "నది కాదు కా" దనున్.

తే. గీ. కాన దీనిని మీదాసిగా నొనర్చి
సంతసము పెరుమాళ్ళకు సంఘటింతు
భాగవతులకై౦కర్యంబు భగవదభిమ
సమ్మతం బని రాదె? వైష్ణవమతంబు. 29

వ. అన నయ్యాచార్యకవివరుం డద్దాని కిట్లనియె. 30

ఉ. కోరినమాట మంచిదియె కోరంగవచ్చును గోరినంతనే
నేరము గల్గునే? వినుము నీదగుమాటకు నుత్తరంబు నీ
కోరిక లేకయే జగతిఁ గోరెడివారలు వేనవేలు నీ
వారసికాగ్రగణ్యులకు నర్పణ సేయుము నీదుపుత్రికన్. 31

క. రసికతయన నెట్టిదియో
యనుమంతయు మాకు నున్న, యటువంటి పనుల్
రసికులవి; మేమయినచో
రసహీనము మఱియు నిహపరమ్ముల వెలియున్. 32

చ. పర మటులుండఁగా వినుము భామిని! "తానఁట, సత్కవీశ్వరో
త్తరుఁడఁట, మంచిచెడ్డల విధమ్ము సమస్త మెఱుంగునట్టి ధీ
వరుఁడఁట, వేశ్యకన్యకకు వల్లభుఁడౌనఁట, యెంతవింతయో!
హరిహరి" యంచు లోకులను నాయపకీర్తిఁ దాకఁజెల్లునే? 33

క. "ఎవరికినిఁ దెలియ" దంచును
నవరణఁ జేయకుము; పిల్లి చయ్యనఁ గన్నుల్
మ్రగన మూసి పాలుద్రావిన
నెవరికిఁ దెలియకయ యుండునే? తనుఁగొనుమీ. 34

తే. గీ. అన్నియు నెఱుంగుపోఁడవే యగుదు వైన
గాని యొక్కటివినుము నిక్కమగు మాట
ఎట్టి సంగతులైనను నిముడుఁగాని
జారచోరత్వములు దాఁగఁజాల వెందు. 35

తే. గీ. మఱి యుఁ గేమన్న, నింకొకమాట వినుము
ఎట్టివాఁడైన వెలయాలి వెనవెనేని
యశము గంగనుబడు నపయశముపచ్చుఁ
గాన మాటోఁట్ల కిది మంచిగాదు నిజము. 36

క. అని పలుకుచున్న విప్రునిఁ
గని "యీగతి మీరు పలుకఁగా నసనెఁ, యశం
బున కేమిలోప మబ్బును ?
కనమే మును కవులయొక్క రతలు మహాత్మా ? 37

సీ. ధనకామినీమణీజనలోలుఁడైనట్టి
కాళిదాసున కేమి ఘనత దరిగెఁ?
చింతామణీవారకాంతాయుతుండైన
లీలాశుకున కేమి లీల దగ్గె ?
విధివిరామమునేక వేశ్యకాంతలఁగూడు
శ్రీనాథకవి కేమి చేటు మూఁడె ?
విత్తకాంతాధరాయత్తచిత్తుండైన
ధూర్జటికవి కేమి దోస మబ్బె ?
తే. గీ. గ్రంథములయందుఁ దాము శ్రీరంగనీతు
లెన్నియో చెప్పుదురుగాని యెంచిచూడ
వారకాంతలఁ దడవనివారు లేరు
కవులసంగతి నే నెఱుంగనిదికాదు. 38

వ. అదియునుంగాక విశిష్టాద్వైతసిద్ధాంతవిరుద్ధం బంటిరేని. 39

క. "అడియ" నని కోరుచున్న
ప్పుడు కాదనఁబోరు వైష్ణవులు; తొండరడి
పొప్పొడియాళ్వారాక మా వెల
పడఁతిం గొనె; బ్రహ్మరథము పట్టరె ? జియ్యల్. 40

క. రసభరితములగు కావ్యము
లసమానమ్ముగ నొనర్చి యఖిలజనులకున్

రసికత నొసఁగు సుకవులే
రసికులు గా రనుచు మూర్ఖురాలిగాఁ జెపుఁడీ. 41

తే. గీ. సిద్ధమయినట్టి యన్నంబుఁ జేతి కంది
నట్టి పరిపక్వఫలమును, నంగనాపు
ణీప్రథమయౌవనమును బండితు లుపేక్ష
సేయఁగా రాదుచేసినఁ జెడుదు రిఁక. 42

వ. అదియునుంగాక. 43

క. "భూదానము కన్యా వి
ద్యాదానమ్ములు పరిగ్రహణయోగ్యమ్ములొ
గాఁ దెలియఁజెప్పుదురు మీ
భూదేవతలే" యటన్న భూసురుఁ డనియెన్. 44

క. కులమును దెలివియుఁ దేటయుఁ
గలుకులయెడ ముందుఁ జూడఁగావలె నందం
గులము పరిధానమ్మగు నది
కలియనిచో దానిఁ బొందఁగారాదు కదా! 45

తే. గీ. కాళిదాసాదికవులసంగతికి మాడు
హస్తిమశకాంతరంబగు నది యటుండ
వార లొనరించినట్టి సద్వర్తనములు
చేయవచ్చును జెడ్డలు చేయరాదు. 46

క. కవులకుఁ గలిగినరసికత
కవనమునం దుపచరింపఁగా యోగ్యతరం
బవుఁగాక కులవిహీనలఁ
గవయుటకా? యన్న వృద్ధ కనలుచుఁ బలికెన్. 47

క. కులభేద మెన్నఁగూడదు;
తెలివియుఁ దేటయును గల్గు తెఱవలయెడ నీ

యిలలో "స్త్రీరత్నం దు
ష్కులాదపి" యనంగ వినమె ? సూరివరేణ్యా! 48

క. "ఏజాతివారిఁ గూడిన
నాజాతియె యగును వేశ్య" యంచును విద్వ
ద్రాజులు పలికెడుమాటల
నే జూటామాట లనుచు నెంచితిరి గదా ? 49

వ. అనిన నద్దానియుక్తియుక్తంబులైన మాటలచే సంతోషపెట్టి
చనువాఁడై చిఱునవ్వు నవ్వుచు నాతం డిట్లనియె. 50

తే. గీ. యోగమున్నను దప్పింప నొకరివశమె?
యుక్తిపై యుక్తు లరుదు నంతముండదు గద?
మహిఁ వినుటలేదె " మాటకు మాట తెవులు
నీళ్ళకును నాచు తెవులు" లను నీతిరీతి. 51

క. అని పలికి ప్రొద్దుపోయిన
దనియును రేపకడ వత్తుననియును నవ్వే
శ్యను నొప్పఁజేసి చనె నా
తనిగృహమున కతఁడు శంకితస్వాంతుండై. 52

వ. అట్లు చని యాతండు తనమనమ్మున. 53

తే. గీ. నిదురఁబోఁగొట్టుఁ, గ్రమముగా నెత్తికెక్కుఁ,
గలుషతఘటించుఁ గుండయుఁ గట్టియుఁ దన
చేతఁ గొనఁగూర్చు నదిగానఁ జెప్పనగునె
వేశ్యకును నస్యమునకును భేదమిలను ? 54

ఉ. రాగములేకయే పయికి రాగముగల్గినరీతిఁ జూపుచున్
రోగముగల్గియున్ బయికి రోగములేదని బొంకులాడుచున్
సాగినయంతపట్టుఁ గడుఁ జల్లఁగ ద్రవ్యము దోచిపుచ్చు నీ
భోగముజాతి నమ్ముటలు బోలవుగా ! భువి నెంతవెట్టికిన్. 55

సీ. మాయమాటలకు సమ్మతమైన వ్యాఖ్యాత
తులలేని పచ్చిబూతులకు బొంగ
యనుచితవ్యాపారమునకుఁ బెట్టినపేరు
స్తుతిపాఠవాక్యసంతతికి పంటి
పరమనోభిప్రాయహరణమ్మునకు నర్థ
మస్వృతవాక్యముల కిమ్మైనకొంప
తనయానువిరచితావినయమ్ములకు ఛత్రి
మఖిలదోషములకు నాలయంబు
తే. గీ. బెట్టుసరిమాటలకు పెట్టఁ బుట్టినిల్లు
నిఖిలజనసంతతులకు వినిగ్రహంబు
వెనుకముందును తెలియని వెట్టివెట్టి
విటులపాలిటి యమపాశ వేశ్యమాట. 56

ఉ. కావున వేశ్యమాట లనఁగా మటుమాయలమారిపుంత; ని
ష్ఠైవగ నైన లాలనము లిచ్చకముల్ పయిపూఁత బూటకముల్
కేవల సత్యరీతిగను గిల్కొనఁజేసి ధనమ్ముఁగొల్తు; రీ
త్రోవ తెలుంగమే; బుధులతోడను పొందనె యట్టివేశ్యముల్. 57

ఉ. జారసఖిన్ ధనాంగనను జారిని జోరిని గ్రాగుఁబోయి నె
వ్వారును గీర్తి గానపడువారలు కొంపకుఁ జేర్పరాదు; త
ద్ద్వారముఁ గార్యముండినను దామును ద్రొక్కఁగరాదు; నక్క మీ
తీరు తెలుంగకున్నఁ గొనితేపలెనే యపకీర్తి మేదినిన్. 58

ఉ. కావున నిట్టిసంగతులు గౌరవహీనులపెట్టెఁబోమ్మ; రీ
త్రోవలు మంచిపూరుషులు ద్రొక్కరు, త్రొక్కినవారిమెచ్చ; రీ
త్రోవలఁ గాలుపెట్టనినరుండు మహాత్ముఁడు; కాలుపెట్టినా,
కేవల నిందితుండు నపకీర్తిపతీమణికిం బ్రియుండునౌ. 59

సీ. కొండమాచార్యపుత్రుండు రామామణి
నెనసి నిర్భాగ్యుఁడై చనఁగదేదా

నీలకంఠాప్రధానిసమాటఁ దలచంపిరి
ముఖిఁగూడి మాన్య మమ్ముకొనలేదొ
హనుమంతరావు చేకొనినపత్తుఁడు సుంద
రినిఁగూడి కొంపమ్ముకొనఁగలేదొ
.అల్లకృష్ణయమంత్రియనుజుంను మణిమాల
తోఁగూడి ముష్టి యెత్తుకొనలేదొ

తే. గీ. వీరలొకలెక్కయే! జమీందారు లెంద
ఱెంద ఱప్పులపాలగు టెఱుఁగఁబడమ?
అమరఁగాక హిరణ్యశృంగములు తనదు
వెలవెలఁదిపోందు పలుకష్టములకు విందు. 60

క. అని మనమున ననుకొని జరి
గినసంగతివలన నెట్టికీర్తిగలుగునో
యని చింతయించె నాతఁడు
ఘనులకు నపవాదకన్నఁ గష్టము గలదే? 61

తే. గీ. మనము చెడబున్నకతన నమ్మదనుఁ దతని
యింటిపంచకునైనను నేఁగకుండె;
మనము చెడఁగొట్టుకొన్న యమ్మగువమిన్న
దాపునను గాఁపురము పెట్టె దర్పమెండ. 62

తే. గీ. అంతఁ గొన్నిదినంబుల కఖిలజనుల
కపరిమితమోదదాయకంబై తనర్చె
సంతతామోదభారవిశాలసవర
సాల కీలితమగుచు వసంతఋతువు. 63

తే. గీ. "ఇంట సతులను డించి యిట్లుంట మీకుఁ
బరువు గా" దని ప్రోషితభర్తృకలను
వారిపక్షము వహియించి పాంథజనులఁ
గూఁకలిడె నన గోకిలల్ కూఁత లిడియె. 64

సీ. అత్తతోఁ బోరాట మంది పోయినయట్టి
జామాత తనుఁదాన సఖ్యపడియె
భార్యతోడ విరోధపడి పోయినమగండు
మగుడ భార్యను బ్రీతిమాలుకొనియె
సన్యసించుటకు నిశ్చయ మందినవిరాగి
రాగాంధుఁడై తన రమణిఁ గవిసెఁ
గార్యార్థమై దూరగతుఁ డైన సంసారి
తత్తఱమ్మున నూరిదారి పట్టె

తే. గీ. బ్రహ్మచారులు పెండ్లికై పాట్లఁ బడిరి
వేశ్యమాతలతోడను విగ్రహించి
నట్టి విటులెల్ల వద్దాని ననుసరించి
రహహా ! యేమందు వసంతాగమమున. (9)

సీ. చిన్నారి పొన్నారి చిఱుతప్రాయపు వధూ
వరుల వివాహముల్ సలుపువారు
వచ్చియు రాని గుబ్బలదుల్కు గల గుబ్బె
తలకు శోభనములు సలుపువారు
ముడివేయుటకు డజావడిసిగల్ గల బిడ్డ
లకు నుపనయనముల్ జరపువారుఁ
గ్రొత్తక్రొత్తగఁ గట్టుకొనిన లోగిండ్ల గృ
హప్రవేశమ్ముల నందువారు

తే. గీ. స్వామికల్యాణ మహముల సలుపువారు
గ్రామదేవత జాతరల్ గడపువారు
లలి వసంతోత్సవమ్ముల నలరువారు
నైరి ప్రజలెల్ల నవ్వసంతాగమమున. (10)

వ. ఇట్లు వసంతఋతువు చెలంగు నెడ నొక్కనాఁ డమ్మధుసూదనుం డొక
సాయాహ్నంబున శీతవాతపోతనిషేవణమ్మునకై యంతికోద్యానమ్ము

నకుం జని యచట సుధాసైకతవిక్షేపనస్వచ్ఛం బగు నొక్కచప్పరం
బధిష్ఠించి తదారామరామణీయకంబు విలోకించుచు వికసితాంతరం
గుఁడై యున్నంతఁ దదుదంతంబు నొకచెలిమిన్న తదీయవివిక్తసంద
ర్శనాభిలాషిణి యగుపసబ్బాలామణికిం జెప్పిన నప్పద్మాక్షియు. 67

సీ. తన నవ్వుకన్నఁ జక్కనితెల్పుగల చల్వ
  కండువా బుజముచక్కటి నటింపఁ
దనమేనికన్న మెత్తని క్రొత్తమల్లెపూ
  వులు వేణినుండి జలజలని రాలఁ
దనకాంతికన్న హెచ్చున నొప్పుబంగారు
  మొలనూలు కటిమీఁద మొనసియాడఁ
దన మోవికన్న నెఱ్ఱనిరంగుగల గాగ
  రా పదమ్ములమీఁద రంగు లీన

తే. గీ. వలపు చిగురింపఁ గోర్కెలు దొలకరింప
మనము వెనఁగొన సందియం బినుమడింప
నతనిఁ గనుఁగొను వేడుక లలవరింపఁ
దత్క్షణమ యేగె నంతికోద్యానమునకు. 68

వ. ఇట్లు చని వాదవ్వుల నాతనిం గాంచి సమీపమ్మునకుం జన సంశ
యించుచున్నంత. 69

సీ. బలుపసందుగ నొప్పు పైఠిణీ తైకపైఁ
  బైఁటలో హారముల్ నీటుఁ జూప
మలఁచినట్లున్న దండలఁ గ్రిక్కిఱిసి దండ
  కడియమ్ము లొకవింతకాంతి నీన
ముఱువుఁ జూపెడి ముద్దుమోవిపైఁ బ్రసరించు
  తళ్కుముత్తెము తళత్తళ నటింప
భ్రమపుట్టఁజేయు పాదముల నొప్పెడినూపు
  రధ్వనుల్ గతికి సారస్య మొసఁగ

తే. గీ. వెనక మొసఁగంగఁ గాంతి నద్దెసఁ జెలంగ
ముసిముసినగవు మొగమున మొలకలెత్త
నల్లనల్లనఁ దనకడ కరుగుదెంచు
సుందరినిఁ గనె నమ్మహీసూచనుండు. 70

వ. ఇట్లు గాంచి తదాగమనసమ్మదకచ్చురుపడి యుచ్చలి యిట్లనియె. 71

తే. గీ. ప్రొద్దుగ్రుంకెను జీఁకటుల్ పొసఁగునాయెఁ
బొలుపుమీఱఁగ భూషణభూషితాంగి
వగచుచుఁ దోడింతలేక యుద్యానమునకు
నేల వచ్చితి? వనిఁబూని బాలసాని! 72

వ. అనుచు నొక్కింత స్మితపూర్వకమ్ముగ నడిగిన నప్పల్లవపాణి యిట్లనియె. 73

ఉ. వెండియు రేపె వత్తు మని వేగిరపాటున గంటఁబెట్టినఁ గా
ర్యుండక యల్లనాఁడు పని యున్నదటంచును వేగి రాక రా
కుండుటఁజేసి మిమ్ముఁగన నొయ్యన నొంటిగ నేను వచ్చితిన్
బండితులైనవారల కబద్ధము లాడుట న్యాయమే? సా! 74

తే. గీ. నాఁడు మాయమ్మతోడ మీ రాడుచుండు
లకు సముత్తరములు చెప్పుటకు నోకి
దలఁచియును మిన్నకుంటి మాతల్లిఁ గాంచి.
వెలవెలందుల పొందు దంత చెప్పుకుంటె? 75

వ. కలయుట తప్పటంచుఁ బలుకం దగునే? మఱి వేశ్యకాంతలం
గలయుటలేదె? బ్రాహ్మణులు, గానమె వారలు, నన్యకాంతలం
గలయుట తప్పుగాని వెలకాంతలఁ గూడుట తప్పు గాదు; బా
"వలచిన మేనమామసుత వావియ కా" దని యుందు రేమొకో! 76

క. కులకాంతతోడఁ గూడినఁ
గలదే మఱి తప్పిదంబు? గనుఁగొనుఁడి మదిన్
గులకాంతయు వెలకాంతయు
నిలలో నొకతీరువారలే మనుజనకున్. 77

ఉ. పాపమటంచుఁ బల్కి-తిరి పంచశిలీముఖబాణసంభవ
త్తాపముచేత బాధపడుతన్వి సనాదరణం బొనర్చు నా
పాపమరస్న నన్యమగు పాపము లెక్క-దె ; యట్టిపాపమున్
బాపెడిపుణ్య మీ చిఱుతపాపము గీపము లెక్క-చేతురే ? 78

సీ. సంపెంగఁ బోలుపుష్పము గల్గునే ? యొక్క-
తేఁటి కయ్యదివెనుపోటు గాక
తుహినాంశుఁ బోలువస్తువుగల్గునే ? పద్మ
తతులకు నైధనతార గాక
మొగలిఁ బోలెడి దుష్మములు గల్గునే ? కాల
గణనకు షష్ఠాష్టకంబు గాక
గానమ్మువంటిసత్కళల గల్గునే ? వేద
విపుల కయ్యదియుఁ బ్ర క్కెదురు గాక

తే. గీ. పలచి పలపింపఁగల్గిన వారముఖ్య
వంటి వగలాఁడి గల్గునే ? వనితలందుఁ
దమమదికి వేఱురీతిగాఁ దట్టెఁగాక !
భూమిసురరాజ ! కవితాసతీమనోజ !

సీ. పండితపామరాపారమోదదము గా
నమ్ము మాపెట్టెలో సొమ్ముగాదె ?
శుభకార్యములయందు సొంపు సంపాదించు
బిభి మేము పెట్టినభిక్ష గాదె ?
మన్మథవేదాంతమార్గోపదేశమ్ము
లనఁగ మా తలనె పుట్టినవి కావె ?
ముసిభీతిలో మునిఁగిన రాజుసుద్ధరిం
పఁగ మమ్ముఁ జెప్పి చెప్పవలెఁ గాదె ?

తే. గీ. సురతనైపుణ్యముల మదిఁ జొన్పురసిక
వరుల కందఱు మాతరువాతఁ గాదె ?

ఎన్నివిధములఁ జూచిన నున్ననలపఁ
దగుదుమేకాని నిందఱఁ దగము మేము. 80

సీ. కామాగమాభ్యాసకలన మీకుఁ గవీంద్ర!
కామాగమాభ్యాసకలన మాకుఁ
దత్తదంగస్ఫూర్తిమత్త మీకుఁ గవీంద్ర!
తత్తదంగస్ఫూర్తిమత్త మాకు
నవరసాలంకరణరతి మీకుఁ గవీంద్ర!
నవరసాలంకరణరతి మాకు
ససుమనస్కామోదశయ్య మీకుఁ గవీంద్ర!
ససుమనస్కామోదశయ్య మాకుఁ

తే. గీ. బరవశవిధానకౌశలపటిమ మీకుఁ
బరవశవిధానకౌశలపటిమ మాకుఁ
గాన మీకును మాకు నైక్యంబు తప్పు
గాదు; వివరించి చూడు మో కవివరేణ్య! 81

సీ. సరసపద్యవిశేషసక్తి మీకుఁ గవీంద్ర!
సరసపదవిశేషసక్తి మాకుఁ
జిత్రబంధశ్లేషసిద్ధి మీకుఁ గవీంద్ర!
చిత్రబంధాశ్లేషసిద్ధి మాకు
శుచికులోదయకృతస్ఫూర్తి మీకుఁ గవీంద్ర!
శుచిరలోదయకృతస్ఫూర్తి మాకు
అభినవపాండిత్యవిభుత మీకుఁ గవీంద్ర!
యభినయ పాండిత్య విభుత మాకు

తే. గీ. నన్నిటను మీకు మాకును సరసిచూడఁ
దౌల్యమేగాని వర్ణభేద మొకఁ డుంటె
నింతమాత్రము భేద మదేరికైనఁ
గలదని యెఱుంగరే? మీరు కవులుగారె? 82

వ. అదియునుం గాక. 83

చ. అతిరతిసంప్రయోగమున నార్జనఁ జేసెన రామశాస్త్ర మే
గతిఁ జరితార్థమౌను? కులకాంతలయుం జదివిగూడ దంచు నా
రతికలయే వచించుఁ; బరరామల కంతటిరాల మబ్బునే?
వెత యగుఁగాదె? లక్షణవివేకము లక్ష్య మెఱుంగకుండినన్. 84

తే.గీ. అనుచు నొకమాట కొకమాట కతుకకుండఁ
బల్కు, దరహాస మొనరించుఁ, బైఁట జార్చు,
మనములోఁగోర్కి వెలిఁజేయుమనుచు మరుఁడు
ప్రేరణము సేయ నాపఁగా నేరితరము? 85

వ. అను సవ్వాలామణి సయుక్తికమ్ములగు వచనమ్ములకు సంతసింపుచు సతం డద్దాని కిట్లనియె. 86

ఉ. ఎన్నఁడు నేర్చితీ వగల? నెన్నఁడు నేర్చితి విన్నిమాటలన్?
మొన్నటిదాన వీవు సరిపో! యిపు డెంతటిదానవైతి? నిన్
బిన్నటినాఁ డెఱుంగుదును "బెప్పెపె మెమ్మెమె" యంచు నుండు నీ
వెన్నిటఁ జాణవైతి; విపు డెవ్వనిచే నను బుట్టఁబెట్టవే! 87

వ. అని పలికి.

సీ. రమణీమణీవిహార మెఱుంగనట్టిధీ
పటుఁడౌటచే మది గరఁగ లేదొ
ధనకామినీమణీజనతత్పరత మంచి
కాదనియే మది గరఁగ లేదొ
క్షణసుఖమ్మునకు యశమ్ము గంగను గల్పఁ
గా రాదనియె మది గరఁగ లేదొ
మనమీఁది తాత్పర్యమా వెలచెలి? కిట్టి
దరుదనియే మది గరఁగ లేదొ

తే.గీ. కాని యక్కన్నెమిన్నయు లోనుగాక
చనియెఁ దనయింటి కాతఁ డప్పనము విడిచి;
క్రొత్తమగాఁ గాని యింతమాత్రమున కట్టి
ఘనులబుద్ధులు వెడమార్గమునకుఁ జనునె! 89

మొదటి కన్నెరికపుఁ దొడవుఁ బెట్టెనో, లేదొ
మీనాక్షి గట్టించు మేడఁ జూడు
నీకన్న వన్నెచిన్నెలు గల్గెనే? కాంతి
యొడలెల్ల బంగారుతొడవులాయె
నందమా, చందమా? యది యదృష్టమెకాక
యతివేణి యెంతసౌఖ్యము గడించె

తే. గీ. నేఁటి కేఁడాది యాయె నీ కీడువచ్చి
గవ్వయైనను నీపల్లె గడన యెఱుఁగఁ
బాడి చెప్పిన నీకుఁ గోపమ్ము వచ్చుఁ
గష్టసుఖములు నీ వెఱుంగవు గదమ్మ? 96

సీ. చక్కెర విల్కాని సామ్రాజ్యలక్ష్మినాఁ
బ్రిక్కుచున్నప్పు చూపట్టవలదె?
కేళికారీతిఁ జొక్కించువేళలను బం
త్రిపుబొమ్మపోల్కెఁ గన్పట్టవలదె?
ఎదురుగాఁ బోతెంచునెడ విలాసంపునం
చల బ్రోవనఁగఁ జూపట్టు వలదె?
రతి పెంచుకొన్న గారంపుకీరంబునా
భాషించునప్డు గన్పట్టు వలదె?
తే. గీ. విటుల మోహింపఁ జేసెడి వేళలందు
మచ్చుమందుల బొమ్మనా మసల వలదె?
సాని సాని యనంగనే సంబరంబె,
వేయిరీతులదాని సంసారి యనరె! 97

శా. ఏమెవ్వానికినైనఁ గాని హృదయం బీరాదు వాఁ డట్టివాఁ
డే యౌఁ గాక; యొకం డటంచు మన సేమి. సూత్రముం గట్టెనే?
దోయీవానికి నొక్కఁడే పతియఁటే, బోగాల కొక్కం డఁటే
రాయం, జమ్మురా? వెట్టిఁబూని కులమర్యాదల్ విడం జూతురే? 98

దాలిచి వేషభాషలఁ గనంబడినంతనె యెంతవారికిన్
జాలి మనమ్మునన్ మిగులఁ బాల్పడు నే మనుకొంటివమ్మరో ? 105

ఉ. ఇంతియుకాకయున్నఁ దమయింట నెసంగెడి సుందరాంగులౌ
కాంతలకన్న నెక్కుడగు కాంతలమే మన ? మెంతచక్కనౌ
కాంతయుఁ గాంతుఁడైన మన కాంతలఁ గన్గొని మోసపోవు; నా
నింతకు ముఖ్యకారణము నెన్నఁగ మేళమునుమ్మ కోమలీ! 106

క. నవనాగరికులు కొందఱు
శివశివ ! మన మేమి తప్పుఁ జేసితిమొ 'శుభం
బవునెడ మేళమ్ములు పి
ల్వవల' టటంచును బ్రతిజ్ఞఁ బట్టిరఁటమ్మా. 107

క. 'మేళమునకు బదులుగ వీ
ణాలాపమ్ములను మోదముంపఁగ రాదే?
హేలమెయిఁ బాడు పైఁజెలు
చేలా వోగాలకన్న నెసకంబిడరో ? 108

క. వీరల కిచ్చెడి ధనమున
నాఱువపాలిడిన వార లధికామోద
శ్రీరాజింపఁగఁ బాడరె ?
వారాంగన లేల? పో! వివాహమ్ములకున్. 109

ఉ. వారలలో శతాంశమును బాడఁగ లేరది యట్టులుండ సిం
గారములూని వచ్చిన నెగాదిగఁ జూచి మతెంతవారలున్
ధీరత మాని దర్పమును దేహమునుం జెడఁగొట్టుకొందు రీ
వారసతీసమన్వితవివాహము లేరికి ముప్పొనర్పవే." 110

క. అనిసభలు చేసి తెచ్చెరు
లనేకము లొనర్చి 'మేళ మరుదెంచినచోఁ
జనుదేరము పెండ్లికి మే'
మని కొందఱు నిశ్చయించి రని వింటిఁ జుమీ. 111

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# ప్ర ప న్నా నం ద ము

## తృ తీ యా శ్వా స ము

క. పటుకవితావిద్యాలం
పట ! ఆజస్రప్రకృష్టభాగ్యోదయ ! దు
ర్ఘటకార్యసంఘటక ! వేం
కటరత్నామాత్య ! సుకవికమలాదిత్యా ! 1

వ. అవధరింపు మనంతరంబు.

చ. జరిగె వివాహ మచ్చుతరసప్రసరత్కలకంఠకంఠభా
స్వరపటుకాణీమణీసటసంగతమంగళవాద్య ఘోషవి
స్ఫురితదిగంతరాగతవిశుద్ధచరిత్ర ధరాసురాధిరా
జరుచిరమంగళశ్రుతిరసప్రథితప్రమద ప్రదంబుగన్. 3.

సీ. ఒకచోట సకలవైదిక సంతతులగోష్ఠి
యొకచోటఁ బండితప్రకరగోష్ఠి
యొకచోట సుకవిరాణ్ణికురంబములగోష్ఠి
యొకచోట మంచివైణికులగోష్ఠి
యొకచోట సరసగాయకవతంసులగోష్ఠి
యొక్కచోటను వారయువతిగోష్ఠి
యొకచోట నైతిహాసికకథారసగోష్ఠి
యొకచోటఁ బారిహాసికులగోష్ఠి

తే. గీ. యొక్కచోటఁ జిరంటికాయువతిగోష్ఠి
యొక్కచోటను భటరాట్ప్రముదయగోష్ఠి
యతిశయిల్లఁ గ్రమమ్ముగా నైదురోజు
లును దెలంగె వివాహమ్ము ఘనులు మెచ్చ. 4

తే. గీ. సూటి కోరరైన నచ్చటి నీటుకోడె
కాండ్రిలో మందునకునైనఁ గానరారు;
పెద్ద పెద్దల మనములే బిగువు చెడఁగ
వారలకు నట్టు లుండు టబ్రమ్ముగాదు. 11

చ. ఇది యిటులుండ నమ్ముదిత యోసమయమ్మునసైన దీలుగా
నదసు తటస్థమైన యపు డమ్మధుసూదనుతోడ హాస్య మొ
ప్పిదముగఁ జేయుఁ గన్గొలుపుఁ బ్రేమ చలిర్పఁగ గోట గీటుఁ దా
బడు లొనరింపఁ దాతఁ దొకపట్టునసైన నదేమి చిత్రమో! 12

చ. ఇట్లు వివాహంబు సలక్షణంబుగాఁ జేసికొని పెండ్లివారేగు నయ్యవ
సరమ్మునం దత్పురసమీపమ్మున. 13

సీ. ద్రాఘ్నదీతరణతంద్రాళుపాంథాహూత
నావికప్రతిపచోరావకంబు
ఆసీయమానమీనాకులీభవదనే
కానాయకరధీవరాకులంబు
అంతరీపాగతానఁతగోగోపాల
కాయసర్పివద్వారికణగణంబు
విరసత్కుసుమపుంజవిహారమాణసపీన
మలయమారుతపోతమానితంబు

తే. గీ. అపరరోధోవిహారాగతాసమాన
హూణమిథునావలోకనాహూయమాన
హాలికాన్యోన్యభాషణవ్యాకులంబు
చేతము గరంచు నొక్క ధునీతటంబు. 14

తే. గీ. కాననగుటయు వారు ధాస్కరుఁడు చరమ
గిరి సమీపమ్మునకుఁ జేర నరుగుటయును
దత్తఱమ్మున నొక లంచఱును నెక్కి
దాఁటసాగిరి నావికుల్ దాఁటఁ జేయ. 15

తే. గీ. "వారకాంతనుగూడ నీపంటివాని
కర్హమా" యని వారుణి యధికకోప
శోణదృక్కోణయై తన్నుఁ జూచుచున్న
నో యనఁగ సూర్యుఁ డారుణ్య మొందె నంత. 16

తే. గీ పద్మినీకాంత యపరదిగ్భామఁ గూడఁ
గాఁ జనెడి కాంతుఁ డా బలాత్కారముగను
లాగ, జాఱిన రక్తచేలం బనంగ
సంజకెంజాయ దోఁచె దిక్ప్రాంతములందు. 17

తే. గీ. వారకాంతను దవిలి తా పసుపుపోఁడుఁ
దగుచు నిచ్చట నిఁక నుండఁదగ దటంచు
వ్రీడచే సూర్యుఁ డస్తాద్రి వెన్కఁ జేరె
శిష్టులకు వారకాంతలు రిపులు గాదె! 18

శా. జాఱెన్ సంజ, పతత్రిసంఘములు వృక్షవ్రాతనీడమ్ములన్
దూఱెన్, హాలికజాతి యిండ్లకడ కత్యుద్వైరముం బొప్పఁగాఁ
జేరెన్, మన్మథుఁ డాశుగమ్ములను నిస్సీమప్రతాపమ్ముగ
న్నూనెన్, భర్తలరాఁక చిత్తసరణిన్ గోరెన్ వధూబృందముల్. 19

సీ. చోరసంసృత్యసాధారణాధారంబు
జారసాంగత్య కేదారభూమి
ఘూకలోకాలోకనాకచక్యంజనం
భేకాకికోకశోకాకరంబు
దీపావళీమహాటోపసంధానంబు
నక్షత్రవజ్రశాణఫలకంబు
చాక్షుషజ్ఞానప్రశమనాధిదైవంబు
కృషికృతితతి సముత్కృష్టనిష్కృ
తే. గీ. మఖిలమార్గావరోధ బ్రహ్మగ్రహంబు
మచ్ఛభూనీచభూసమానోపకరణ

మప్రమేయం బఖండం బనంత మగుచు
నాక్రమించెఁ దమంబు దిక్చక్రమెల్ల. 20

తే. గీ. అచ్చటచ్చట నొకటొక్కటై గణింపఁ
దగిన నక్షత్రము లగణ్యదశ వహించి
తమకు నుపకారకంబగు తమము గొంత
పో నడంచెఁ గృతఘ్నునిఁబోల్కి నపుడు. 21

కమలినీముఖ విలాసముల కెవ్వాని దీ
ప్తిప్రచారంబు సుప్తిప్రదంబు
కైరవిణీవక్త్రకలన కెవ్వాని యా
గమన మవ్యభిచారకారణంబు
చంద్రికాపక్షితృష్ణావ్యాధి కెవ్వాని
ప్రాప్తి నిర్వ్యాజదివ్యౌషధంబు
కోకీమనోనంతశోకాబ్ధి కెవ్వాని
యుదయంబు పర్వచంద్రోదయంబు

తే. గీ. మానినీజనమానహిమాని కెవని
రాక నళినీమనోనాథురాక, విరహి
జనుల కెవ్వాఁడు ప్రత్యక్షశమనుఁ డాతఁ
డుదయమందెను జంద్రుఁ డత్యుచ్చుఁ డగుచు. 22

తే. గీ. ఇటుల వెన్నెల తెల్లెడ నెసక మెసఁగ
గచ్చు చేసినయట్లు జగంబు మెఱసె
నదిని దరియించి సామ్ము లందఱు ననేక
మార్గముల నేగ సాఁగి రమందగతుల. 23

తే. గీ. అన్నదీతీర సౌభాగ్య మరసికొనుచు
మోదమందుచు నమ్మధుసూదనుండు
తా నొకఁడ యేగుచున్న యుత్తరిని బాల
మెసుకఁ జనసాఁగె నిదివేళ యని తలంచి. 24

సీ. త్రైక దాఁటియు బనారసుకందువా దాఁటి
గబ్బిగుబ్బలకాంతి గంతు లిడఁగ
గాగరా దాఁటి పైఁ గట్టుపుట్టము దాఁటి
తొడలయందంబు బడాపడి నొనర్పఁ
గర్ణమ్ములను దాఁటి గండస్థలము దాఁటి
కమ్మలకాఁతి యాగడముఁ జూపఁ
దలఁదాటి మొలదాఁటి తళ్కు మీఱెడిమేల్మి
బంగారుజడ బరాబరులు సేయఁ

తే. గీ. పార్శ్వగతవృక్షగళితపుష్పప్రకీర్ణ
మై శుకపికాళికలరవాభిరామ
మై మలయమారుతోపేతమై యొప్పు
నట్టి యామేటి యుద్యానవనికి నరిగె. ౫౫

సీ. చెట్టుచెట్టునకు విచ్చినపుష్పజాలంబు
వర్షించు వలిపిల్లవాయువులకు
నడుగడ్డునకుఁ బల్లవాంతరమ్ములనుండి
కెరలి పైఁ బడు చంద్రకిరణములకుఁ
దేపతేపకు దిమ్మదిరుఁగ జుమ్మని మీఁటఁ
బడి హాళాహాళిసేయు భ్రమరములకు
మాటిమాటికిఁ గామమంత్రముల్ తెనిఁగించి
విప్పిచెప్పెడి శుకపికములకును

తే. గీ. గెరలి యన్యోన్యమును రతిక్రీడ సల్పి
కోరికల కీరిత లొసంగు శారికలకు
ధైర్యమును ధారవోసి తత్తటమునందు
మెల్లమెల్లనఁ బరుగిడుఁ బల్లవోష్ఠి. ౫౬

శా. వన్నెల్ గుల్కెడి నవ్వుసెమ్మొగముతో వాలారు లేఁజూపుతో
సన్నంబై యసియాడు నెన్నడుముతో జాణైన చన్దోయితోఁ

గన్నులఁ జల్లఁగఁ జేయఁజాలు పగతోఁ గంపించు మైదీవతో
వెన్నాదంగల వేణికాభరముతో వెన్నాఁడెఁదా నాతనిన్. 27

సీ. చిన్నిపన్నెలమోముచెల్వు వడ్డి కొసంగు
చిన్నారిపొన్నారి చెమటదాని
నాయాసమున దెప్ప లల్లనల్లన నార్చు
శ్రీయుతం బగు కన్నుదోయిదాని
నొలయు నిట్టూర్పువాయువులచేఁ దబ్బిబ్బు
లై యుబ్బు పెన్గుబ్బ లమరుదానిఁ
గరఁగి సిరైై నాసికను జాలువాఱునిం
పూరంపుతోరంపుసౌరుదానిఁ

తే. గీ. గలకలధ్వను లొలయఁ బొంకమ్ముమీఱ
జాఱు మొలనూలుగల కటిస్థలముదానిఁ
గందియున్నట్టి పాదయుగంబుదానిఁ
గనియె మధుసూదనుండు వెన్కకును దిరిగి. 28

క. కనినంతనె తనమనమున
ఘనమైన వికారరీతి గనుపట్టుటయున్
దనలోఁ దా నిట్లని యను
కొనియె సమస్తంబు నెఱుఁగుకోవిదుఁ డగుటన్. 29

సీ. పగలు భార్యను బట్టి పడఁగొట్టు ముక్కోపి
భృత్యుఁడై చరియించు రేయియందుఁ
బగలు స్త్రీ యన శత్రువుగఁ జూచు విజ్ఞాని
నిశియందుఁ బరమాత్మనియతిఁ జూచుఁ
బగలు సన్న్యాసమే "బహుబా" గనెడి యోగి
రాతిరి తనదుభార్యను స్మరించుఁ
బగలు "వివాహంబు వద్దు వ" ద్దనువర్ణి
పెండ్లికై రాతిరి పేర్మిగొలుపుఁ

తే. గీ. గాన నెటువంటివాఁడైనఁ గాని రాత్రి
యేకతమ్మున స్త్రీగాలి సోకె నేనిఁ
దత్తఱం బంది పరపరాయత్తుఁ డగుచుఁ
గోర్కె లిగురొత్తఁ బైఁబడఁ గోరుచుండు ? ॥30॥

తే. గీ. అనుచుఁ బరిపరివిధముల నతఁడు తనమ
నంబులో నూహసేయు, జ్ఞానంబు గల్గు
వారల కొకప్డు వికృతి చేయదుఁగాని
యితరులంబోలెఁ దుందుడు తెనయఁబోఁడు. ॥31॥

వ. ఇట్లతండు డోలాయమానమానసుండగుచు మెల్ల మెల్లన చనుచు
న్నంత నబ్బాలామణియు. ॥32॥

క. పిలిచి యిటు లనియె ముద్దులు
గులుకఁగ "మీతోడఁ గలసికొనుటకునై నే
వలసి చనుదెంచితిని నా
పలనైనను జూడ రిది నెపానన రాదే ? ॥33॥

క. మావారలు పటుమారము
గా వచ్చుచునున్నవారు కావున మిమ్ముం గా
నే వేఁడెద నిచ్చోటన్
మావారలు వచ్చుదనుక మసలుట కొఱకున్. ॥34॥

వ. అనిన నాతండును ప్రతిఁ జెప్పనేరక వల్లెయని యుచ్చోఁ గూడుకుండు
టయు నక్కన్నెమిన్న నాతనిపజ్జకుం జేరి యిట్లనియె. ॥35॥

చ. "సరసుఁడ వంచు నెంతయును జాతురి గల్గినవాఁడ వంచు సుం
దరుఁడ వటంచు నిన్ గని యొడన్ గదియున్ గమకింప నాపయిన్
గరుణ యొసంగదాయె నిది కాముకధర్మమె ? కోరుదాని నీ
వరుస ననాదరింపఁ దగవా ? మగవారల కెందు" నాపుడున్. ॥36॥

క. "మగువా ! కాముకులగు న
మ్మగవారికి నీవు చెప్పుమాటలు సరిగా

దగుఁగాని మమ్ముఁబోఁట్లకుఁ
దగునా? చెప్పు" మన నిట్లతని కనెఁ జెలియున్. 37

క. "ఆఁడుది గోరిన గాడిద
వాఁడే కోరినను మొగలివంటిది" యనుచున్
జేడెలు సెప్పెడి సామెత
నేఁడే మీవలన నాకు నిక్కంబాయెన్. 38

క. వెలఁది తనంతటఁ దానై
చులుకఁదనమ్మునను మనసుఁ జొన్పుచు సిగ్గున్
వెలితియొనర్పుటతన్నను
గలదే మతి తప్పిదంబు? కవికులవర్యా! 39

క. రసికుఁడవని నిను గోరిన
రసహీనముఁ జేసి యిట్లరయరయె నన్నున్
గసరుట ధర్మంబగునే
రసికులు వినిరేని నవ్వరా, రసికవరా! 40

ఉ. మూలము లేని టీక సుమపుంజసమృద్ధముగాని శయ్య వా
చాలతలేని పాండితియు సంతతిలేని గృహంబు మంచితాం
బూలములేని భోజనము ముద్దులు గుల్కెడి కన్నెమిన్నతో
మేళనలేని జవ్వనము మేలగునే? కవిరాజశేఖరా!

చ. 'సుకవి యితండు వియ్యదియు సుందరి వీరల కెంతమాత్రముం దా
రకముగనున్న' దంచు 'ఘటనానిపుణత్వ మయారె!' యంచుఁ బెం
డ్లికిఁ జనుదెంచినట్టి ఘనులే పఠియింపఁగ వింటి; నన్ గ్రహిం
పకునికినైనఁ దప్పు దిది, వచ్చిన వాదులు తప్పిపోవునే? 42

క. మన కిదిపఱికే కలదని
జను లెల్లరుఁ జెప్పికొనఁగ సాఁగిరి కాదే!
'జనవాక్యం కర్తవ్యం'
బను పెద్దల పల్కులకును నాఱడి కలదే? 43

తే. గీ. ఏల యీలాటిమాటలు ? చాలుఁ జాలు,
'హితవుగా' దని చెప్పరాదే, మహాత్మ !
'అలి నొల్లనివానికి నీలకూర
లోన నుప్పెక్కు' డను మాటలు నిజముగాను. 44

క. వెడవిల్తుఁడు శరముల బా
రిడి నసుఁ గుడి మొదపు చేర యేయఁగా నంగన్
గడెయైనఁ దాళఁజాలను
దడ వొనరించు టిది మంచిదనమా ? ఘనమా ? 45

ఉ. వాదములేల ! పట్టి యపవాద మహింపఁగరాదు గాన మీ
పాదములాన యింక పలవంతలఁ బెట్టుటగాదు. చిత్తినా
యాదుఁడవైతి శంకర పల" దలఁపఁ గిరగ్రహింపం బొసఁగ్ని నా
గాదిలివన్నెలాఁడి; ఘనిఁ గాంతలపాహాస మింపయొప్పునే ! 46

ఉ. గుట్టు చెడెన్, దడాలిడిగ గుండెలు జల్లనె. మై చమర్చె ని
ట్టట్టు పడంకె హస్తములు. నన్యముఁ జెప్పఁ బిరోఁతామె. నా
పట్టున నా శుకుండయినఁ బల్కఁగలాఁడె మహాత్మమాట ! చేఁ
దట్టి జితేంద్రియుండు ప్రవరాఖ్యుఁడు దక్క మహాత్ముఁ డెక్కడన్. 47

ఆ. వె. అట్లు కరముపట్టి యాలింగన మొసర్ప
నిచ్చఁజేయు నంత నేగుదెంచి
రా సరోజనేత్ర యనుఁగు నెచ్చెలు: లతం
డానిమిత్త మెంచి యవలఁ ద్రోచె. 48

ఉ. త్రోచిన వెన్కఁ జూచి, తనతోడిచెలుల్ పఱతెంచుటం గదా :
యీ చెలికాఁడు సిగ్గు వడియెం ; జెలు లిప్పుడు నాదుపాలికిన్
బూచులవంటి వారయిరి పో ! యని చింతిలసాఁగె: స్నేహముల్
దోఁచవుగా మనం బతనుదోషపరీవృత మైనవేళలన్. 49

వ. అట్టియెడ దగ్గరి నెచ్చెలు లిట్లనిరి. 50

సీ. "పరిహాసమునకు నే 'బావగా' రనిపిల్వఁ
'బో'మ్మన్నవారు కాఁబోలు వీరు!
వారు గారే వీరు చేరి నే 'మఱదిగా'
రనిపిల్వఁ గసరుకొన్నట్టివారు!
వారు గారే వీరు వలపార మనకాంత
దరిఁజేర వెన్కకు జరగువారు!
వారు గారే వీరు 'వారకాంతలు మాకుఁ
బనికి రా' రని ప్రజ్ఞఁ బలుకువారు!

తే. గీ. వారలునుగారు వీర లెవ్వారొగాని,
వారలేమైన నీలాటి పనులొనర్తు
రే!" యటంచును నాయమ్మ లెత్తి పొడిచి
గేలి గావించి రమ్మద్దరాలి చెలులు. 51

తే. గీ. ఇటులు పల్కెడి కాంతల కుటిలవచన
ములను వినియును విననియట్లొలయఁజేసి
రయము మీఱంగఁ జనెఁ గవిప్రవరుఁ డంతఁ
దనమనమునందు సందేహ మినుమడింప. 52

సీ. బ్రహ్మదేవు మొగమ్ము పడఁతికిఁ బడకిల్లు
చేసి పెట్టినయట్టి చేవకాఁడు
హరిమురస్థ్సల మెక్కియంగనామణికి శ
య్యాతలమ్ముగఁ జేసినట్టిఘనుఁడు
సాంబుశరీరంబు నంబుజాక్షికి ధార
వోయింపఁ జేసిన మాయకాఁడు
"స్త్రీలఁజూడ" మటంచుఁ దెగనీల్గు పెద్ద పె
ద్దల గర్వముల గడఁగఁ గఱపువాఁడు

తే. గీ. తత్కరస్పర్శతన్మృదుతరపచ్ఛ్ర
వణములను బీజమునఁ బునర్భవము నొంది

యంతలో వృద్ధిఁ జెంది కొండంత యగుచు
నాతనికిఁ బ్రోవలోనఁ బ్రత్యక్షమయ్యె. 63

సీ. నడచునేరాని యానడచుమార్గం బేది
తెగునో యాతని కెఱుక లేదు
చూచునేరాని యాచూచు పదార్థమ్ము
లెవ్వియో యాతని కెఱుక లేదు
తలఁచునేరాని యాతలఁపులో సంగతి
యెద్దియో యాతని కెఱుక లేదు
నవ్వునేరాని యానవ్వు నవ్వుట లేమి
హేతువో యాతని కెఱుకలేదు

తే. గీ. పలుకునేరాని పిలిచినవార లెవరో
యెంతమాత్రము నాతని కెఱుక లేదు;
ఏమి చెప్పుదు! నంతలో నింతయయ్యె
నాతని యవస్థ యా ఋషి చేతు వలన. 64

క. వివిధములగు సందియములు
వివిధములగు కోరికలును వివిధగతులఁ దన్
గవిసి కొలువంగ నాతఁడు
భవనమ్మును జేరె డిల్లపడిన మనముతోన్. 65

ఉ. చందురుఁ జూచి యుల్కిపడు, జల్లనిగాలికి బెట్టుఁ జెందు, నే
చందము నందముం గనఁగ నైనఁ బడఁడు, విద్దురఁ జెందవోపఁ దా
సుందరిచందముగా మదిని జొన్పి యపార్థములైన కోరికల్
సందడిఁ జేయ మందుని పసందువఁ గుందుఁ గవీంద్రుఁ డెంతయున్.

ఉ. "వేసవి మల్లెమొగ్గలకు వియ్యపురాలు రదాళి, నాసలో
వీసము గాదు గంధఫలి, వేల్పు మిటారుల తోడికోడ లా
రా! సఖి, దానిఁ బోల్పఁదగవా? యితరాంగనలన్, వెదాను; దా
లాసతిఁ బోలఁగల్గు నవలా భువిలో నహి లేదు లే" దనున్. 67

వ. అని పట్టరాని తమకమున్నను. 58

శా. వెన్నెల్ చెంపలఁగొట్టు మైపసపుతో, వింతైన కెమ్మోవితో,
సన్నల్ సేసెడి ముద్దుకన్నుఁగవతో, జాతైన పయ్యంటతో,
గన్నేరుంబువు గాఁగరా నొటఁగుతోఁ గాఱించి దోతెంచు నిన్
గన్నారం గని మెచ్చుటాడఁగల భాగ్యం బెన్నఁడో? కోమలీ. 59

సీ. పలు కొక్కటియె సేయుఁ బదివందల వరాలు
వాలుఁజూపులు రెండువేలు సేయుఁ
నగ వొక్కటియె సేయు నాల్గువేల వరాలు
పిల్లపిఁగుట లాఱువేలు సేయుఁ
బడ మొక్కటియె సేయుఁ బదివేల వరహాలు
లావణ్య మది యొకలక్ష సేయుఁ
బలుసోయగమె సేయుఁ బదిలక్షల వరాలు
చలువగుబ్బలతీరు కోటి సేయు

తే. గీ. ముద్దుగుత్కొడి నెమ్మోము మూఁడుకోట్లు
నాసనొట గెన్న డెబ్బదినాల్గుకోట్లు
నుమటి సింధూరనామమ్ము నూఱుకోట్లు
నీకు వెలఁజెప్ప శక్యమే? నీలవేణి. 60

సీ. కలికిరో! మెత్తనై యలరు నీ మే నొక్క-
సారి గిల్లినఁ బాలు గారకున్నె!
యబలరో! మించుతై యలరు నీచూపులు
సోఁకినంతనె మది చొక్కకున్నె!
పొలఁతిరో! మృదులమై యలరు నీ కెమ్మోవి
నొక్కినంతనె తేనె చిక్కకున్నె!
చెలియరో! నీదుకౌఁగిలి యొక్క త్రుటియైనఁ
బడసిన రస మట్టిపడకయున్నె!

తే. గీ. మగువ! నీతోడ నొకమాఱు మాటలాడ
సరసకవితావిశేషంబు మెఱయకున్న!
ముదిత! యొకసారి నీకనుల్ ముద్దుగొనిన
బ్రహ్మకైవల్యపదవి చేఁబడకయున్న! ॥61

సీ. తడబాటుచేతఁ జే యొడిసిపట్టి 'కటాక్ష
ముంచుమా' యన నాలకించవైతిఁ
యమ్మిన విచ్చు తుందుడుదుగుబ్బలఁ గౌఁగి
లించఁ బూసిన సమ్మతించవైతిఁ
గలకండకన్న మిక్కుటమైన రుచిగల్గు
కెమ్మోవి రుచులారగించవైతి
వెడవింటివాఁడు ఱువ్విన బాణములఁ జాల
పగలఁ బొందిన దారిఁ గనులవైతిఁ

తే. గీ. బవలు చెయిపట్టి పిలిచినఁ బలుక వట్టి
దాన నమునస చీఁకటిలోన నీలి
చీరఁ గట్టినరతి సన్నఁజేయు పెట్టి
పగిది నేఁ గోలుపోతి దైవంబ! నేఁడు. ॥62

చ. కనుఁగవ కింపు గల్గి తగు కామకలాభ్యసనంబు గల్గి యౌ
వనమున తేఁట యయ్యు రసభావములం గడుఁ బెట్టయై తనం
తన వలపున్నదైన వనితామణి యెవ్వనికబ్బుఁ? బ్రాగ్భవం
బునఁ దులలేని పుణ్యములు పూవులు పూచి ఫలింపకుండినన్. ॥63

చ. కిలికిలిపల్కులున్ సొగసుఁ జిక్కఁడి ముద్దులుఁ దాఱుమాఱులున్
వలపులచోద్యముల్ మిగుల వన్నెలుఁ జిన్నెలుఁ గల్గుకౌఁగిలిం
తలు బ్రతిమాలుటల్ కసరి తప్పులుపట్టుటలుం దెలంగుటాం
తలరతమే రతంబు; మఱి తక్కినవెల్ల రసాతిదూరముల్. ॥64

చ. పలచినలేమఁ గూడుటయె భాగ్యము, భార్యలవల్లఁ దిప్పుఖం
బలవడ; దన్యకాంత లనఁగా, మఱి తల్లులవంటివారు; వే

శ్యల కిది సుస్ను; యొక్కయెడ సంభవ మందిన నట్టివేశ్యతోఁ
గలయుటకన్న వేఱొకటి కల్గునె? స్వర్గము మోక్షముస్ భువిన్. 65

ఉ. తానఁట, వేశ్యకొంతయుఁట! తానయి తాఁ దనుగోరునంట! యెం
తేనియు ముద్దులాఁడియఁట, యీడును జోడఁట! మౌనియైనఁ దా
మానఁగలాఁడె? వేయి పయిమాటలు సెప్పఁగ నేర్చుఁగాని; యే
మైనను దీనిఁ గూడవలదా? యిలఁదా జనియించినందుకున్. 66

సీ. కలుగనేకలుగదు కలిగెనేనియు ఛాంద
సున కనాథస్త్రీగమనము గల్గుఁ
గలుగనే కలుగదు కలిగెనేనియుఁబండి
తునకు బరస్త్రీగమనము గల్గుఁ
గలుగనే కలుగదు కలిగెనేనియును రా
జునకు దాసస్త్రీగమనము గల్గుఁ
గలుగనే కలుగదు కలిగెనేనియుఁ గవీం
ద్రునకుఁ బణ్యస్త్రీగమనము గల్గుఁ

తే. గీ. గలుగ దొకవేళఁ గలిగినఁ గలుగు మునుల
కప్సరస్త్రీగమన మని యనుటవలనఁ
గవులకును వేశ్యలకుఁ దప్పుగాదు చెలిమి;
దానిలో నప్రయత్నసిద్ధ మిదికాదె! 67

ఉ. కోరినదాని మాను టది గొప్పవిశేష, మిఁకట్టిపూరుషుం
డారయ లేఁడు నూటి కొకఁడైనను, గోటికి నొక్కరుండు చే
కూరునొ, లేదొ? తా నగుచుఁ గోరెడి పూరుషుఁడన్న వెఱ్ఱివాఁ
డై రసహీనుఁడై జగమునం దపహాస్యతఁ గాంచదుండునే! 68

సీ. తనకుఁ దానై వండుకొని తిన్న నద్ది య
న్నంబు గా దద్ది సున్నంబు గాని
తినకుఁ దానై వేసికొనిన నయ్యది వీడి
యమ్ము గా దది వడియమ్ము గాని

తనకుఁ దానై పెట్టికొనిన నయ్యది మంచి
కొప్పు గాదది ప్రాఁత చెప్పు గాని
తనకుఁ దానై చెప్పుకొనిన నయ్యది సుప్ర
తిష్ఠ గాదది యపప్రతిష్ఠ గాని
తే. గీ. తనకుఁ దానయి పొందరమ్మనుచుఁ గొంటెఁ
గోరునది నోరు గాదు పైఁడారు గాని
యపప్రియత్న సిద్ధమ్ముగ నబ్బనట్టి
పొందు లొడఁగూర్చుఁ గాదె పెంపొందుసుఖము! 69

క. కవితయు వనితయుఁ దనయుం
డవలచి వచ్చిన ముదం బొదవఁ జేయును; ఇ
చ్ఛావశతేక బలాత్కా
రవిధంబున వచ్చెనేని యది దుఃఖ మిడున్. 70

క. ధనకాంతామోహమ్ములు
జనులకు స్వార్థపరములు జగమున; నెవఁ డీ
ధనకాంతామోహమ్ములఁ
గన కుండునో వాని శివునిఁగా నెన్నఁదగున్. 71

వ. అని మఱియును. 72

మ. తగునే? సత్కవినైన నాకు ధనకాంతాసంగమం, బీపని
న్నగరే? పండితులైనవారు వినినన్, నాకేమి యా? నవ్వినన్
మగుడ న్నవ్వెద వారినంచు మది నిమ్మాడ్కిం బరిశంసించుట నా!
"తెగితే లింగఁడు రాయి" యంచను జనోక్తిస్ఫురిత్తనేమో కదా!

ఉ. కాంతల నమ్మరాదు వెలకాంతల నంతకుమున్నె నమ్మరా
దింతవిరుద్ధ ముండునె? ఛీ! వెలకాంతకు మోహ ముండునే!
వింత గదా! జగమ్ములను వేములతీయఁదనంబు, లింతయుం
గొంత మనమ్ములో నరయఁ గూడదె? తుందుడు కింత చెల్లునే! 74
కాంతలమాట నమ్మికొని కంతునికిం గడు లోఁడవై తదీ
యాంతరభావముల్ దెలియ "కైనరుబొజ్జ" యటంచు నుబ్బుచుం

చ్రెంతవివేకమైన మది నీవిషయంబు పరీక్షసేయఁగా
నెంచియు "పిచ్చితోఁదగొని యేటను బడ్డ" విధంబుగాదొకో? 75

ఉ. చేడెలు చిన్నిరాలమునఁ జిన్నెలు వన్నెలు లేక యెంతయున్
"బూడిదబుస్స" నాకృతినిఁ బొందియు నంతట నీడు వచ్చుచోఁ
బాడుగఁ జేతు రెంతమతిపారగుచిత్తమునైన; నయ్యయో!
"గాడిదపిల్ల కోమలము" గాదె? విచారణఁ జేసి చూచినన్. 76

ఉ. "మందులు పెట్టి యెంతమతిమంతుని చిత్తమునైన; లోనుగాఁ
గొందురు వారకాంత" లని కొందఱు పల్కుదు రెంతవెఱ్ఱిలో!
మందులు వేఱె యున్నవియె? మాయలమాటలుఁ దక్కుఁజూపులున్
మందతరస్మితమ్ములును మక్కువ చెక్కిలి నొక్కులున్ వినా. 77

వ. అని మఱియుఁ బశ్చాత్తాపమ్మున. 78

సీ. గరగరలాడు నాగరపన్నెకుచ్చెలల్
కాళ్ళపై వింతగా గంతు లిడఁగ
జిల్గుకంచెలలోనఁ జిక్కి చక్కనిగుబ్బ
దోయి మాటికిని దుందుడుకు సేయ
మునులనైనను దాసులను జేయఁగా జాలు
చూపు లింతసరాని సొబగునీన
గాంగేయసచ్ఛాయ గదలుకొల్పెడి దేహ
కాంతి చూపఱగుండె గలఁగఁ జేయ

తే. గీ. నెన్నియో వన్నియలగుంపు లీనఁజాలు
నగవు మొగమునకెంతయో సొగసుఁదెలుప
వచ్చి నాచిత్తము హరింపవచ్చును గద?
వలపు మరియాదలు దలంపవలదె? కాంత! 79

ఉ. కంతునికేల వొప్పెసఁగు కమ్మని మామిడిపూలగుత్తి నా
నెంతయు నామ కన్నుఁగవ కింపు ఘటించి యిదేమొ? యోసి క
ర్ణాంతవిలోచనా! మనము సర్మిలి దొంగిలి పాఱిపోతి వా
వంతయు శంక లేక, మది నంత యరాజక మంచు నెంచితే! 80

క. ఈ విధమున నతఁ డెంతయు
నావేదనఁ జెందుచుండె నప్పుని [illegible] దా
నేవిధి దోఁచక గృహమున
దైవగ మీఱంగఁ జేరి యాత్మగతమునన్. 81

చ. తలఁచునొకో ? మనమ్మున నతండు నను౦ దనవానిఁగా, నటుల్
దలఁచిన నేమియౌను ? రవిచంద్రుల పాటున నుండువాఁడు నా
చెలిమి గణించి నా గృహముఁ జేరఁగ వచ్చునె ? యిట్టివానికిం
దలఁపు ఘటించుటే మొదటితప్పిఁక మాటలు వేయు నేటికిన్. 82

సీ. మొదట నే నన్నచో మొగము నెత్తనివాఁడు
క్రమముగా మోమెత్తి కాంచఁదొడఁగెఁ
దరువాత మాట యెత్తిన మొసంగనివాఁడు
యిటురీతి నుత్తరం బీయఁదొడఁగెఁ
విస్మిత నర్మవాక్యము లాడనివాఁడు
గొంచె మీరీతి భాషించఁదొడఁగె
నటుమీఁద సంస్పర్శ నాచరింపనివాఁడు
కేల్పట్టికొనుట కంగీకరించె

తే. గీ. పిదప మొసంగిన గ్రహియించి వేసికొనియె
గోటగీఁటినఁ జాటుగా మాటుకొనియె
మాట లిఁక వేయునేల ? నామాటయున్న
నడుగుదాఁటునె ? యిఁకఁ గొంత గడచుమీఁద. 83

ఉ. అంతకు నోర్వఁ డాయెఁ బరమాత్ముఁడు, శ్రేయముఁ జెందువారి క
త్యంతము విఘ్నముల్ సలుపు, నంతియకాని యొకప్పుడైనఁ గా
సంతయుఁ జేయఁబూనఁడు సహాయము, దైవము దూలఁజెల్లునే?
యింతకు నాకు వానికిని నేర్పడి యుండినఁ దప్పిపోవునే ? 84

ఉ. తా నయి కోరుటన్నఁ గడుఁ దప్పిద మౌఁ గద వారకాంత; కెం
దేనియు నర్థియుం గలిగెనేని నెదా ననిపించుకున్న మే

లొ: నది యట్లుగార యిటులైనను వేఱేరఁ జెప్పనున్నదే?
లేనిది లేర యుండ నతిలేపుల నప్పటియుం డటన్షహో. 85

క. ఇటుఁ గుటిలాలక మనమున
గుటగుట మను, మూరు దూఱుఁ గుపలయమిత్రుం
బెటిలి పడఁదిట్టు, నళులను
గటకట మని పండ్లు గొఱికి కసరు విసుపుచే. 86

తే. గీ. యామినీగోపకామిని యాకసం బ
నెడిఘటమ్మున జ్యోత్స్న యనియెడి పెరుఁగు
దరచి చేర్చినవెన్నముద్ద యన నంత
వెడలెఁ దెల్లనికాంతితో వేగుఁజుక్క. 87

సీ. ఏచరణాయుధం బింపు మీఱఁగఁ బాణి
ని యతికి హరిస్వాదినియతిఁ దెల్పె
నేచరణాయుధం బాచారివిప్రుని
త్యస్నానదై వజ్ఞతను వహించె
నేచరణాయుధపారిచర్యరూపుఁ డై
హరి నిశీథము వేడు వసఁగఁ జేసె
నేచరణాయుధశ్రీచేత శూలి పి
లాపురమ్మున నుండెఁ గాఁపురమ్ము

తే. గీ. అట్టిచరణాయుధసమాజ మఖిలజార
చోరులకు గుండెలో దిగుల్ బోదుకలఁగ
ఉడుడుఉఊడూ యటంచు నత్యుచ్చరీతిఁ
గూయసాఁగెను దమతమ గూళ్ళనుండి. 88

సీ. జాఱిపోయిన నీవి సవరించి సవరించి
తులుదుగుబ్బల పైఁ గుచురుపఱచి
వీడిపోయిన కొప్పు బిగువుగా ముడిపై చి
సొగసుదుప్పటి మేల్ముసుంగు పెట్టి

సంకేతితస్థలస్థనవప్రసవతల్ప
గతపతీమశముతోఁ గలసి మెలసి

తే. గీ. అమితతృష్ణార్దితభుజంగసముదయప్ర
మదవిధానాతికుశలసంపదలఁ బొదలి
మలయనిలయపటీరద్రుమలయనిలయ
మారుతములు ప్రభాతసంపదలఁ దెలిపె. 93

తే. గీ. తత్తదుద్యానవనఫలతతులు మెసవి
యినుఁడు రాఁ బోవుచున్నవాఁ డనియెఱింగి,
వరుసవరుసన నన్నియుఁ బక్షికోటి
తమతమ నివాసములకు మూఁకములు సేరె. 94

తే. గీ. క్రమముగా జాఱె రాత్రి, సరస్తటప్ర
దేశములఁ జేరి తెల్లనై దికవతంసు,
లరుగఁజొచ్చిరి పాంథులు పురము దనరఁ
దారక లడంగెఁ, జంద్రుఁ డస్తరుచియయ్యె. 95

సీ. పద్మినీవిరచితాపారపుణ్యోదయం
బుత్పలిన్యాప్తపాపోచ్చయంబు
కోకీప్రియాగమాస్తోక ముహూర్తంబు
ఘనహిమానికిఁ బెద్దగారుమోకము
సురతసంతోషవిస్ఫురణమ్మునకు జీవ
మతనుతాపమ్మున కౌషధంబు
ఆవాలముల పన్ను లార్జించుకరణమ్ము
చీఁకటిపాలిటి చీఁడపురుగు

తే. గీ. భువనజాతంబు లేమోదఁ బ్రోచుపోఁడ,
మూఁడుమూర్తులు నివసించుమేడ, జగము
పాలిటి సులోచనం, బహర్పతి క్రమమ్ము
గా నుదయమందెఁ గన్నులకఱవు దీఱ. 96

శా. స్నానంబుల్ పచరించువారు జపముల్ సంధించువా రగ్నిస
మ్మానంబుల్ నెఱవేర్చువారుఁ దరణిం బ్రార్థించువా రాత్మస
ధ్యానంబుల్ పొసఁగించువారు నిగమధ్యానమ్ములం జేయువా
రానందాబ్ధినిఁ దేలువారలును నై రచ్చెల్లెడన్ వైదికుల్. ॥ 117

శా. ప్రాతఃకృత్యములన్ యథోచితముగాఁ బాటించి వేదమ్ములన్
చేతం బూని నవీనపాఠమును నిశ్శేషమ్ముగాఁ జూచి రా
మా తాత్పర్యము గొంత కొంత మదిలో నాటించి యన్యార్థు లెం
తో తాత్పర్యముతోడ దేశికులఁ గన్గోఁ బోయి రప్పట్టునన్. ॥ 118

క. మౌద్గల్యసగోత్రభవా!
సాద్గుణ్యవిచార! ఘనదానముదితవిభవా!
హృద్గతభవా! సుకవితా
విద్గణ్యప్రాభవా! ప్రవీణాగ్రభవా! ॥ 119

క. గణనాతీతగుణశ్రీ
చణ! కవితారమణ! సరససాహిత్యరసో
ల్బణ! పరణాయుధరూప
త్రిణయన పదసేవనాధురీణ ధురీణా! ॥ 120

స్రగ్విణి. కామమాంబాలసద్గర్భపేటీమణీ
దామము త్రామణీ! ధామధామస్వస్త్రణీ!
సోమధామోపలస్యూతసాధాంతరా
రామరాజాధిర ప్రాజ్యభాగ్యోదయా! ॥ 121

— గద్య —

ఇది....శ్రీ తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
కేవలకల్పితంబగు శ్రవణానందంబను మహా
ప్రబంధమునందుఁ దృతీయాశ్వాసము.

శ్రీ ర స్తు
శ్రీమత్పరదేవతాయైనమః

# ప్ర బో ధా నం ద ము

## చ తు ర్థా శ్వా స ము

క. నూత్న ప్రఖ్యాతిజిత
ప్రత్నధరానాథమంత్రిరత్న! సుకృతకృ
ద్యత్నదృఢచిత్త! వేంకట
రత్నామాత్యమణి! విబుధరాడ్రాజమణీ! 1

వ. అవధరింపు మనంతరంబు. 2

క. మెల్లన మేల్కాంచి యతం
డుల్లములో నుండు విస్మృతి యొదల కెవరికిం
దెల్లము గాకుండఁగ సం
ఫుల్లపదనుఁ దగుచుఁ గాలమును గడపుచుఁ దాన్. 3

క. ఏదియుఁ బోఁచక కడుఁ జిం
తేది ముదముఁ దక్కి "యెట్టు లీమోహజలం
బీఁదుదుఁ గర్తవ్యం బిఁక
నేది?" యని మనమ్ములోన నెంతయు వగతోన్. 4

ఉ. ఈవిషయంబు మానుకొనుటే కడుసౌఖ్య మటంచు నెంచి తా
నావిధిఁజేయ నిశ్చయము నందిన యంతనె మోహ మగ్గలం
బై వెనువెంట నంటు; నటులైనను జేయుదు నన్నతోడనే
థాపము వేసవేలు ప్రతిబంధకముల్ గనఁజేయు నెంతయున్. 5

క. మానుదునా! చేయుదునా!
మానుదుఁ జేయుదు నటంచు మల్లాది యొగిన్

మానిని విచార మొక్కఁడె,
పూనియొనర్చిన విచారములు పెక్కులుగా ! 6

క. అని తనమదిలో ననుకొని
యును బుద్ధిఁ ద్రిప్పలేక యొగి సుస్థిర ము
క్కనకాంగికి లిఖియింపుట
కును బ్రారంభించెఁ గొంత కొలఁది తెలివితోన్. 7

మ. రణదుద్యన్మణికంకణక్వణజితభ్రమ్యత్పుష్పంధయాళికిన్
గణనాతీతకలాలసద్రమణికిన్ గాఢంబిసీవేణికిన్
గణికోద్యన్మణికిన్ బ్రశస్తతర రేఖాహంసికిన్ బాలికా
మణికిన్ పత్త్రిజితాబ్జశీతఘృణికిన్ మాద్యత్పికీవాణికిన్ ! 8

క. అనవద్యయానపోవయు
ఘనరసికసమాగమాధికసుఘోషయునుం
దనధనములు గలుగఁగ టీ
పన లిడి నా వ్రాయు వ్రాఁతపల నెట్టివనన్. 9

క. కడుమాట లేల ? విను, లోఁ
గద మాపఁ గలానిధిప్రకారణమునఁ బం
డ్రుఁడు బంధుఁడు నీకై కద !
విడిచెం బంద్రునదు మాట విపుతేంటుయుఁ ! 10

క. తలుపలచేనికి వేఁడిమి
చిలువడు విశ్వాస. మగ్నిశిఖదను వైరస్యం
బలపడుసుగాక, వెలవాం
తలకు వలపు గలుగు టది వినంబడదు కదా ! 11

తే. గీ. అట్టిగణికాడులమ్మునఁ బుట్టినట్టి
దానవే కద ! నీవును దరుణి నీడు
వలపు గలదన్న మూర్ఖునివంటివాఁడె
నమ్మనేరఁడు; నే నెట్లు నమ్మనేర్తు ? 12

క. నిజమయిన వలపు గలుగని
గజగామినిఁ గవయువానికన్న నధముఁ డీ
త్రిజగతి లేఁ; డదియ యనం
గఁబడు రసాభాస మనఁగఁ గాంతామణిరో! 13

క. ధనమును గులమును వృత్తం
బును రూపముఁ జూతు రెండు బోటులు; మీలోఁ
బని లేదు తక్కినవి యొక
ధనమె ప్రధానమ్ముగ దవె తరుణీమణిరో! 14

తే. గీ. కోరితివి నన్ను; నాబోఁటిఘీరుఁ గోరి
యేమిసంపాదనముఁ జేసెదే లతాంగి?
ధనము గల్గినవాని సౌఖ్యని పరింపఁ
దగు నదియు రాదె నీ కులధర్మ మరయ? 15

క. ఇదియంతయు నీమదిలోఁ
బదిలముగా నూహ చేసి వ్రాయవలెఁ జూమీ!
తుది నిష్ఠురంబుకన్నను
మొదటనె నిష్ఠురము మేలుగు పూర్ణేందుముఖీ! 16

క. అని వ్రాసి పంపె సంతట
దినకరుఁ డస్తాద్రి కేగెఁ దిమిరము ప్రబలెన్
వనజాహితుఁ డుదయించె మ
దనుఁడు పథికసతులమనముఁ దల్లడపఱచెన్. 17

క. ఏమియుఁ దోఁచక యవ్వని
తామణి యున్నంతఁ గమ్మ తారసిలుటయుం
బ్రేమ దలిర్పఁగఁ జూచి మ
హామోదముఁ జెంది తల్లి కంతయుఁ జెప్పెన్. 18

వ. తల్లియు సంతసించి "జాగు సేయక వినయపూర్వకమ్ముగాఁ బ్రత్యుత్తరముం బంపు" మని చెప్పుటయు నక్కన్నెమిన్న. 19

క. ఏమని వ్రాయుదు సీతని?
కేమని వ్రాసినను సీతఁ డియ్యకొను? నటుల
చీమాడ్కిని యోజింపుచుఁ
దా మెల్లన నిట్లు వ్రాసెఁ దనువైపుటితోఁ. 20

వ. శ్రీ మదుభయవేదాంత ప్రవర్తకులగు మహామహోపాధ్యాయులవారి సన్ని
ధికి దాసురాలగు బాలామణి సాష్టాంగముగ నొనర్చి కుశలోపరి వ్రాసి
కొను ఘనవి. 21

క. నిన్నటిరాతిరినుండియుఁ
గన్నులుదీసికొని యెదురు గనుఁగొనుచును నే
నున్నతటి మీర లంపిన
విన్నాణపుఁగమ్మ మదికి వేడ్క నొసంగెన్. 22

శా. తాపం బాఱె, విచారమూ సడలెఁ, జిత్తంబా మహానందపు
ద్వ్యాపారమ్యముఁ గాంచె, ధైర్యగుణమా దౌవన్యులంటెరె, నా
శాపాశం బతిదీర్ఘమై భవదపేక్షిణ వృద్ధిబొందించి యా
లోపప్రక్రియ నొప్పెఁ బూవియుతుబంటుట్ నాఁటి బంధ్లైరిఁరిన్. 23

క. ఇందుకు నందియమును మీ
రంపం బనితేదు మీర లంపించిన ర
మ్యం బగఁ గైకొని బ్రహ్మా
నందభరితురాల నైతి నానాగతులన్. 24

క. మిముఁ గోరిన దెంతులకో
తమ తెలుఁగుదు, రే నెఱుఁగుదు, దైవ మెఱుంగుఁ
సుమబాణుఁ దెలుఁగు నిది ని
క్కము మీసందియముఁ బాపఁగా నేరుతునే? 25

ఉ. నాయెడఁ బ్రేమ లేనికతనం దమకన్నియు సందియమ్ము లే
పాయక తోఁచుచున్నవి నెబా! సీఁక మి మ్మస నేల? మీమనం
బా యరవిందసంభవుఁడె యట్టు లొనర్చిన యప్పు, డింతకుం
గాయజుఁ డేమిసేయ సమకట్టెనొ? మీమదిఁ ద్రిప్పనేర్తునే. 26

క. "రవి తెలియఁగ రాని దైనను
గవి తెలిసెద" రంచుఁ జెప్పఁగా వింటిమి స
త్కవులైన భవాదృశు లోక
యువిదమనస్స్థితి నెఱుంగు టొకకష్టంబే? 27

ఉ. కోరినయంతమాత్రమునఁ గోరికతీఱ గ్రహించి యెక్కడో
గౌరవబుద్ధిఁ జూచి రసికుండఁగనీక సమస్తరీతులం
జేరికఁ జేసి వంతమును జెల్లఁగఁజేసెడి నాయకుండు చే
కూరఁగ నోఁచినట్టి సుమకోమలినోము లవెట్టినోములో! 28

ఉ. ఏలిన నేలుఁగాక జగమెల్లను, రూపమునందు మన్మథుం
బోలినఁ బోలుఁగాక; పలుభూషలు పెట్టినఁ బెట్టుఁగాక! యే
కాలమునందుఁ గాని రసికత్వపుసంపదచేఁ గవీంద్రులం
బోలెడివార లీ జగతిఁ బుట్టి రటన్న ప్రసిద్ధి వింటిమే? 29

చ. కవు లొనరించు గ్రంథములఁ గాంచిన వారలె యెక్కడో రస
జ్ఞవరులటంచు నిక్కెదరుగా! యటువంటి ప్రబంధముల్ విలా
సవిధి రచించునట్టి కవిచంద్రుల కెట్టి రసజ్ఞతావిశే
షవిలసనంబు గల్గునో విచార్యము గాదె స్వతంత్రురాలికిన్! 30

చ. ఇదియొకకారణం; బిదియు నిట్లనె యుండఁగనిండు; మీరుఁ జె
ప్పఁదగినదానఁ గా, నయినఁ బల్కెద, నొక్కటె యొక్కపూరుషుం
గదిసినయంతమాత్ర మది గల్గును, వేఱొకఁ డంతకన్నఁ దాం
బదిపదిరెట్లు లెక్కుడగు వాఁడయినన్ మదిపుట్టనేర్చునే? 31

ఉ. కావున సీక్షణంబ తమకమ్మున వచ్చి యనుగ్రహించి నన్
బ్రోవఁగఁ గోరెదం దమకుఁ బుట్టెడి శంకలకున్ సదుత్తరం
బావల నిచ్చెదం గడుఁ గృపాకరులై క్షమియింప వేఁడెదన్
దైవము సాక్షి యింతయును దథ్యమటంచును వ్రాసి పిమ్మటన్. 32

చ. రవి మెఱుఁ గాయె నక్కలువరాయనికన్న, నిదేమి పాపమో
పవనునికన్న నామదికిఁ బావకుఁడే మెఱుఁగాయె నక్కటా!

శివశివ! వేయిమాట లింకఁ జెప్పఁగ నేటికిఁ? జిత్తజాతసం
భవమగు నాయవస్థ భగవంతుఁ డెఱుంగును నీ వెఱుంగుదున్. 33

వ. అని వ్రాసి యంపిన నమ్మధుసూదనుండును. 34

చ. రయము భయమ్ము సంభ్రమము రక్తి విరక్తి నిరాదరాదరో
దయనయముల్ మదిం గదిసి తత్తదుపాధులఁ బుట్టఁజేయ నా
క్కయెడ రహస్యరీతి నది గాంచి పఠించి తదీయభావని
శ్చయ మొనరించియుం జదువసాఁగుఁ బునఃపునరాదరంబునన్. 35

క. కను మరలం గను మరలం
గను మరలం గను నతండు గాంక్షవిదిర్పన్
వనజాయతలోచన లం
పినవార్త లవెంతదైనఁ బ్రేమాస్పదముల్! 36

తే. గీ. ఇట్టు లాతమ్మఁ గని కని యెట్టకేల
కా సరోజాక్షిపొందు సేయంగ నిశ్చ
యించి తగురీతి నటు కేగుదెంచుటకును
బయలువెడలె నిశీథసమయమునందు. 37

మ. ఒకకాం తేగును, సంశయించును; సముస్యక్తత్వముల చెందు, వే
ఱొకకాం తేగు, యథాస్థితింగను; నిరుద్యోగమ్ము పాటించు; నిం
టికిఁ బోతెంచుట కూహసేయు; నిటు లెంచేఁ గంటిమే వింత! వి
ద్యకదా, హేతు వతండు సంశయసముద్రాంతర్గతుల డాటుటన్! 38

మ. మనుజుండై జనియింపరాదు, జనియింపంగల్గినం బాండివీ
ధనుఁడై యుండఁగఁ బోల, దట్లయినచోఁ దప్పేమి? యవ్వాఁడు పుం
స్త్వనిరూఢిం గనఁబోల, దట్లయిన నవ్వాఁ డంగనాకామియై
చనరా దొండెడ, కట్టులైనను రహస్యప్రక్రియల్ గూడునే? 39

ఉ. "ఎవ్వరు గందురో మఱియు నెవ్వరు విందురొ యేమనందురో
యెవ్వరు పల్కరింతురో మఱేమొ?" యటంచును సంశయించు వాఁ
డివ్వసుధం బరాంగనల నెట్టులఁ బొందఁగనేర్చు? భోగపుం
జవ్వని పొందు సేయుటయె సాధ్యము గా దటువంటివానికిన్. 40

క. కలుచెడిపాముసు మీఁదం
బలుచెడిభూతంబు నెఱుఁగఁబడక మనసు ని
బ్బరముగఁ దిరిగెడి గరకరి
బిరుదులె పో ! జారకృతికిఁ బెట్టినపేరుల్. 41

సీ. చూపట్టునట్టివస్తువు లెల్లఁ దనుఁ బట్టఁ
గావచ్చు వారంచుఁ గాంచకున్నె ?
వినవచ్చునట్టినిస్వన మెల్లఁ దనుఁ బల్క
రించు పల్కు లటంచు నెంచకున్నె ?
ఎడనెడ నడచిపోయెడివారలెల్లఁ దన్
జూచువారలె యంచుఁ దోఁచకున్నె ?
లుగుపట్టునట్టిగృహమ్ము లన్నియుఁ బ్రియు
రాలివే యని శంక నందకున్నె ?

తే. గీ. అహహ ! క్రొత్తగ వ్యభిచార మాచరింపఁ
బోవుచున్న రహస్యపుఁ బురుషులకుఁ ద
టస్థమగునట్టి యీ దురవస్థ శతృ
వర్గమునకైన వలదురా! వలదు వలదు. 42

వ. ఇట్లు సంశయించుచుఁ జుదకుఁ జనఁజాలక కాలయాపనంబునకై
యొకసుహృద్గృహమ్మునకుం బోయి యటఁ బరుండుటయు. 43

చ. దొరకిన పెన్నిధానమును దొంగల కిచ్చినరీతి, నాతఁ డీ
వరుసఁ బరుండి యుండ, గుణవంతుఁ డనం జను నొక్కమిత్రుఁ "డీ
కరణిఁ బరుండనేమి?" యని గట్టిగఁ ద న్నడుగంగ నాతఁ డా
చరమునఁ జేతి కిచ్చె నల తన్వి లిఖించినయట్టిపత్రికన్. 44

క. ఇచ్చి "భవత్తాత్పర్యం
బచ్చొత్తినరీతిఁ జెప్పనగు" నన నతఁ డీ
సచ్చరితున కిది తగదని
చెచ్చెరఁ బలపోసి హితముఁ జెప్పఁ దొడంగెన్. 45

చ. "కులమును బ్రాయమున్ యశము గోవిదభావము భాగ్యసంపదల్
చెలువము సత్ప్రవర్తనముఁ జేతికి మించినయట్టి యోగ్యముం
గలిగిన మిమ్ము నొక్కవెలకామినిఁ గోరుట కబ్బురంబె. మి
మ్ములవినినంత నే చెలికిఁ బుట్టెఁ యుంటు మనోవికారముల్ ? 46

ఉ. చిన్నతనమ్మునుండియుఁ బ్రసిద్ధి వహించి జగంబునందు బల్
పన్నెకు నెక్కఁగల్గు తగుపర్తనచేఁ జరియించునట్టి మీ
రన్న, మహానుభావులు గదా ? తమటోఁటులె యిట్టివైనచో
మన్నెబువంటివార 'లిది యుక్తి యెటో' యని సంశయింపరే. 47

సీ. తల్లిదండ్రులు విన్నఁ దప్పుగా గణియింతు
రత్తమామలు విన్న నాదరింప
రూరిపెద్దలు విన్న గారవింపరు, మాట
వినఁదగువారును వినరు, తనదు
బాల్యమిత్రులుగూడఁ బరిభవింపఁగఁ జూతు
రాలు చుల్కనఁజేసి గాలిజేయుఁ
దననపుకరుఁగూడఁ దన్ను హేళనఁ జేయు
నన్న నన్యులమాట లెన్ననేల ?
తే. గీ. ధనము చెడుఁ, గీర్తిచెడు, దేహముసడు లేవి
పోసిదురవస్థ గల్గును గాన విత్త
కాంతలనుగూడువారి కొక్కయెడనైన
నసఁపడదు సౌఖ్యము విచార మడుగవలెనె ? 48

వ. ఇదియునుంగాక, 49

సీ. అర్థ మిచ్చినయప్పు డతిగౌరవము చేయు
నర్థ మీకున్న మూఁడంకె వేయుఁ
గాను కిచ్చినఁ గాళ్ళ గడిగి నెత్తిని చాల్చుఁ
గాను కీకున్న బింకాలఁ జూపు
లంచ మిచ్చినను లాలించి ముద్దులు పెట్టు
లంచ మీకున్నఁ జీల్చించు మొగము

నగలు దెచ్చినయప్డు వగ తెన్నియో చూపు
నగలు తేకున్న నావగలు సున్న

తే. గీ. చీర లిచ్చినయప్డు హర్షించి చూచుఁ
జీర లీకున్న యప్డు గుంజించి చూచుఁ
గంచుకాగడ వెలిఁగించి కనినఁగాని
వలపు గన్పట్టునే వారవనితలకును ? 50

తే. గీ. వన్నె చిన్నెలుగల గొల్లతన్నెముంత
సర్వజనులును ద్రొక్కు బజారుసంత
అంచయును నేగ నేమించినట్టిపుంత
పంతలకు వింతదొంతర వారకాంత. 51

ఉ. ఏరికినైనఁ గూడపు ధనేచ్ఛఁ జరించెడి వారకామినీ
చారు కుచోపగూహనవిచారము లన్నపు డుత్తమోత్తమో
దార యశోవిశేషపరిధానవిభూషితసర్వదిక్సతీ
వారు లనంగ నొప్పు తమవంటిమహాత్ముల కర్హ మెట్లగున్ ! 52

మ. గుణవంతుండను నోట "ముండలముటాకో" రీతఁ దంచున్ బుధా
గ్రణు లాక్షేపణఁ జేయఁబూనుదురు; చుల్కం జేసి మాటోఁటులున్
గణనంజేయ రటంచు మైత్రి నిటుఁ బల్కంబూనితిం గాని వా
గ్రణముం జేసి మరల్తురే ? హరిహరబ్రహ్మాదులైనన్ మిమున్. 53

క. ఐనది కాదని యనఁగాఁ
గానిది యౌనని వచింపఁగాఁగల మీతో
నేనా, వాదము చేయుట ?
యేనూఱుగురైన మీకు నెదురే ! చెపుడీ." 54

క. అని యాతఁడు పలికిన, ని
ట్లను, "మీతోఁ జెప్పి మంచి యగునో, కాదో
వినఁగోరి యడిగితిని మం
చి నిదానమ్ముగను మీరు చెప్పితిరిసుఁడీ. 55

క. తన కెంతతెలివి కలిగినఁ
దనకార్యమునట్లఁ దానె తగదు నడుపుట ము
ప్పునిపని; యోగ్యతగలిగిన
తన మిత్రుల నడుగు టొప్పుఁ దగినపని కెందున్. ౫౬

ఉ. ఇంతియ కాక మీ రెఱుఁగరే? నను విస్మయపాటుఁ బుంది యీ
వింతలలోని కెన్నఁడును వేడుకఁ జేసి మునుంగుఁ గొన్న: నీ
కాంత యదేమొకాని నను గాసిలఁ జేయుచునున్న యందుచే
నంతయు మీకుఁ జెప్పి తెలియన్ వినఁ గోరితి మంచిచెడ్డలన్." ౫౭

క. అని యతఁడు చెప్పనీతులు
విని యప్పనిపట్ల నితఁడు విముఖుం డాయెన్:
ఘనులగు మిత్రులు గలిగిన
మనుజులు దుర్వ్యసనములందు మునుఁగుట గలదే? ౫౮

సీ. 'ఇప్పుడే వచ్చునో, యింకనె వచ్చునో' యంచుఁ
దలవాకి టిల్లుగా నిలిచి నిలిచి
'వచ్చువాఁడైన నీవఱ కేల రాకుండు?'
యని మనమ్మున శంక నంది యుంటి
'నేను వ్రాసినకమ్మ నిజముగాఁ జూచెనో,
చూడలేదో' యటంచు సొక్కి సొక్కి
'రాకుండునా? యిప్పు రాత్రి యెంతో ప్రొద్దు
పోలే' దనుచు మదిఁ బొక్కి పొక్కి

తే. గీ. యున్నకన్నెను మఱుదారి నుంచిపైచి
స్నేహితునిమాటలకుఁ బ్రతిఁ జెప్పలేక
చనక యచ్చోట నిద్రింపసాఁగె నతఁడు
నిదుర యేరీతిఁ బట్టెనో? మది యెఱుంగు. ౫౯

ఉ. ఇంతకుమున్నె యవ్వనిత యెంతయు సంతస మంది 'మన్మన
కాంతుఁడు నేఁడు రాఁగలఁడుగా!' యని భూషణభూషితాంగియై

వింతగఁ గేళికాగృహము వేగ సలంకృతిఁ జేయఁ జేసి 'యే
మింతఁగఁ గాలయాపనము సీతఁ దొసర్చె' నటంచు నెంచుచున్.

చ. పడిపడి పచ్చువానిపలె వార్తను బంపియు నింతరాత్రి దాఁ
గడచినమీఁదనైన సిటఁ గారిడఁ, డెంతటి సత్యవాది యీ
తఁడు! నను నింతచుల్కఁగ నెపన్ గణియించునె? వచ్చెనేని, నే
నడుగక యుందునే? మనమునందలికోపముఁ దీర్పకుందునే? 61

క. అని కనులు దీసికొని యా
తనిరాఁకను నెదురుచూచుతనయం గని నె
మ్మనమున విసువు దసర న
వ్వనజాననతల్లి యిట్లు పలికెం బెలుచన్. 62

ఉ. ఓపలిరాడుబోఁడి! వినవో! నిజ మొక్కరివంటివాఁడు గాఁ
డాతఁడు, వచ్చునే మనగృహమ్మున? కాతనియందుఁ గాంక్ష నీ
చేతమునందు గట్టిగ వసింపుచు నుండిన నేను జెప్పు నీ
రీతిగఁ జేయు మాతఁడె వరించి గ్రహించు నినుం గ్రమమ్ముగన్.

క. చమువను నొకమిషఁ బూని ప్రి
తిదినమ్మును నతని సన్నిధికి నేగినచో
మదిఁ జనవు హెచ్చి క్రమముగఁ
బదునుచెడు న్నిక్క మిది యుపాయము సుమ్మీ. 64

క. వచ్చుట కాతనిమదిలో
నిచ్చ వొడమెఁగాని యిచటి కేతెంచెడి యీ
ముచ్చట లన్యులు గన్నను
జచ్చినచావగు నటంచు సంశయపడియెన్. 65

చ. క్రమముగఁ గొంతకాలము గరమ్ము రహస్యముగాఁ బ్రవర్తనం
బమరినమీఁదఁగాని "యెవరైనను గాంచెదరేమొ" యంచు శం
క మొదటఁ బోఁచు నెట్టివిటకాండ్రకు నన్నవు, డెప్పు డిట్టి క
ర్మముల నెఱుంగనట్టి జనమాన్యులు సంది యమందకుందురే? 66

హామయులుగా నొనర్తురను నంశ మెఱుంగరొ! తల్లిదండ్రు లు
త్తము లనరాదె? వేఱొకవిధం బయినన్ మఱి సమ్మతింతురే? 71

చ. ఒకరకమైన పావడ మఱొక్కరకంబగు జాకెయున్ మఱిం
కొకరకమైన పైఁటయు మఱొక్కరకంబగు భూషలున్ ధరిం
చుచు మురురంబుఁ జూచుకొని సొంపుగలేదని యెంచి, యంత వే
ఱొకటి మఱొక్క టింకొకటియున్ ఘటియించు నఁటేగువేళలన్. 72

వ. అట్లు వచ్చి.

చ. చదువనుపేరెగాని యొకసక్కెపుమాటల నాడుచుండు, సం
దొడదినయప్పుడెల్ల నెదియో యొకసంగతి దెచ్చి "పండితుల్
మొదలె యబద్ధమాడెదరు, మోసముచేతురు వారినమ్మ టొ
ప్పదుసుఁడి" యంచుఁబల్కితలవంచినగుఁజా మొగమెత్తుఁగ్రమ్మఱన్.

చ. పలుచనిపండుటాకులకు బాగుగ నీనెలుడిసి చక్కఁగాఁ
జిలుకలుచుట్టి దొంతరలుచేసి యమర్చి కరాంగుళీదళం
బుల నిఱికించి తెచ్చి పలువుల్ మొలపించుచు నిచ్చి యంతటం
బలుకును జిల్కపల్కులను వ్యంగ్యపురంగు చెలంగి పొంగఁగన్. 75

శా. ఎంచు న్మర్మము లెత్తి మాటికిఁ, దుటాయించుం గనుల్, బల్మిటా
రించుం జన్గవపై చెఱుంగు, వల పూరించున్, నగించున్, బ్రశం
సించుం, ఋంచుమనోవికారమును సూచించున్ మనుల్ వెంచున
మ్మించుంబోఁడిస్వభావమో? యతని నమ్మించన్ బ్రియత్నించుటో?

చ. ఎడపక యెల్లవేళ మఱి యెప్పుడు చూత మటన్నఁగాని య
క్కడనె వసింపుచుండుటయు రాని యొకానొకవేళనైనఁ దాఁ
వదయక యింట నుండినవిధం బది యెట్టిదియో యెఱుంగ ద
ప్పదఁతుర, దానిచిత్తమును బట్టిన భూత మదెట్టిదో కదా! 77

సీ. ఒకమాఱు మనుచరిత్రకథాంశమున వరూ
థిని మరుల్ సెందుపట్టునను జదువు
నొకమాఱు నాయికాదికచేష్ట లెఱిఁగించు
రసమంజరీదసప్రసృతిఁ జదువు

నొకపూట నభినయప్రకటీకరణకా
భినయదర్పణరసాభిరతిఁ జదువు
నొకపూట గానవిద్యోపయుక్తాంగసం
గ్రహముఖ్యగ్రంథసంగతులు చదువుఁ

తే. గీ. గొత్తకొత్తలు జావళీల్ క్రొత్తక్రొత్త
పదములును గ్రొత్తక్రొత్త వర్ణములును
నింపు దళుకొత్తఁగోరి రచింపఁ జేయు
నేమి చెప్పఁగవచ్చు? నయ్యంతిచర్య. 78

ఉ. ఆ పగలాఁడి వచ్చువఱకు వాఁడు దనంతవిషాదవేదనల్
బాపముసంచుఁ దెంచుఁ; దలపైఁ జనుదేరఁ గ్రమక్రమమ్ముగాఁ
జేవ మనమ్మునం దనుఁ జేయును గాని మనోవికారసం
భావన బైటఁ బెట్టఁ డఁట! బాపురె! యాంతసభావమెట్టిదో! 79

ఆ. వె. ఆ సరోజనేత్ర యరుదెంచువఱకె సం
తాప మతని. కా లతామనోష్ఠి
అరుగునంతవఱకె యామోద మీగతి
జరిగెఁ గొన్నిదినము లంతలోన. 80

ఉ. వేసవి వచ్చె భాస్కరసపీనగవీనమితాఖిలావృగు
ద్వ్యాసపవాసనైకపలనాకలనాకులనాయికాసము
ద్భ్యాసపశాసనాదికృతియుంకృతిసంచలషట్పదావళీ
భాసురశుష్కపుష్పవిటపప్రకరప్రతిభాపరిమోదమై. 81

సీ. సూనబాణునిరేకఁ దొక్కి యడ్కువ వ్రాలు
ప్రియురాండ్రి బైఁటచే విసరువారు
విసరినందులకునై కొసరి యింకొకసారి
వెడవెడవనుల కొప్పించువారు
నొప్పించినను నొప్పకున్న క్రొన్ననబోఁడు
లను "మాటదులు దీర్చు" మనెడివారుఁ

టెచ్చకొమ్మన్న విదిర్చి శయ్యను డిగ్గి
చనువారిఁ గని ముద్దుఁ గొనెడివాడు

తే. గీ. ముద్దుఁగొని సుద్దులను గొంతప్రొద్దు జరపి
మలయవాయువు లిటుపురఁ గలకదేర్పఁ
గలయఁదమకించి కోడికూఁతలకుఁ దలఁకు
వారలై రఁట గ్రీష్మవిభావరులను. 82

చ. పదిలినఁ జిచ్చిపోఁగు మనువారలు తక్క సమస్తదంపతుల్
పొఁపలెడి గ్రీష్మతాపమును బొంది సహింపఁగలేర తెల్లవా
ఱుచునుక వేఱువేఱుగఁ బరుండి నిశాంతసమీరపోతసం
పద లొలయంగ నైక్యగతి వర్తిలఁ బూనుదు రట్టివేళలన్. 83

ఉ. వేసవితాప మిట్టి దని వేమరు నొక్కి వచింప నేల ? యా
యాసము నొంది తాపమున కాఁగఁగ లేక రమావిభుండు నా
వాసముఁ జేసె నంబుధి నివాసముఁ జేసె సుమేశుఁడున్ హిమా
నీసము పేతపర్వతపసీతటిసీతటకుంజమండలిన్. 84

చ. ఇతరుల దాహాపుం గతుల నెన్నఁగ నేల ! దినేశు నంతవాఁ
డతితరతృష్ణచేఁ దన సహస్రకరమ్ములు సాచి నేమపుం
గతి విడనాడి గుంటలనె కాదు, నదమ్ములఁ గాదు, కూపసం
తతులనె కాదు కంటికి గనంబడి నంతయుఁ ద్రావె నీరమున్. 85

ఉ. అట్టి బెడంగుకాఁక నలరారి వెలింగెడి గ్రీష్మతాపసం
ఘట్టనకున్ స్మరాగ్ని యలుకం గని ధాని జయింతు నంచు బల్
వెట్టతనంబు పూని కడు వృద్ధినిఁ జెంది వియోగతప్తులం
బట్టి పలార్చెఁగాని పరిపంథినిఁ బట్టి పలార్ప నేర్చెనే ? 86

శా. వచ్చెం బ్రోషితభర్తృకాంగనల తాపం బార్పఁ బెగ్గానలం
బిచ్చల్ మాయఁగఁ జేయ సస్యములకున్ జేయూఁత గై సేయ వి
ద్యుచ్చంచద్ఘనమాలికానినదభీత్యుద్వేజితస్వాంతయో
షిచ్చారూన్నతమాంసలస్తనభరాశ్లేషంబు వర్షర్తువున్. 87

తే. గీ. వాన కేళీగృహమ్ములఁ బడలనీక
బలి తమంతనె కౌఁగిలింతలను దాచ్చు
మబ్బు రాత్రిందివమ్ముల మాటుపఱచు
వర్షఋతువంత దేవి ! దంపతులదావి. 88

క. బోరునఁ బడియెడివర్షా
సారంబులు వహ్ని నప్డు చల్లార్పంగాఁ
జారుస్త్రీరుచిరకలశా
ధారంబై బ్రియుడుఁ గాంచె దంపతిమున్నన్. 89

వ. అట్టియెడ నింట నెవ్వరును లేని యొక్కనాఁటి రాత్రిసమయమ్మున నత్తలోదరి మితభాషితాంగియై "అనుగుణంబగు సమయంబు నేఁటికిఁ జేకూరె" నని సంతసింపుచు రహస్యప్రకారమ్మున. 90

ఉ. వచ్చి గృహమ్ముఁజొచ్చి యొకపైఁ బవి నాతనిఁ జూచి యుంటఁ గా
నచ్చపలాక్షి యాతఁ డసహాయుత శయ్యఁ బరుండి గ్రంథమున్
దెచ్చెరఁ జూచుచుండఁ దరిఁ జేరఁగ సందియమంది ద్వారమం
దచ్చపు బంగరుం బ్రతిమ యట్టుల దాఁగిలియుండి క్రమ్మఱన్. 91

క. మెలమెల్లనఁ జని శయ్యా
తలనికటమునందు నిలుపఁ దత్తలమున న
వ్వెలఁదుకఁ బొడఁగని యాతఁడు
నిలుపున సీరాయె నదియు నివ్వెఱపడియెన్. 92

క. అతఁడును నదియును నిటు ల
ప్రతిపత్తి విమూఢగాఢభావోదయసం
గతులై యుండిరి క్షణపరి
మితకాలం బదియు శక్యమే ? వర్ణింపన్. 93

సీ. తనకు నద్దానిపై మనము పుట్టకయున్నఁ
'బొమ్ము పో' మ్మని చెప్పఁబోలదొక్కొ :
ఇచ్చగల్గినఁ జనవిచ్చి కౌఁగిటఁ జేర్చి
మరుకేళిఁ గరఁగింప మెఱుఁగఁదొక్కొ :

అక్కన్నెయెవతెయో యనుట కింతకుమున్న
పరితిదినమ్మును గంటఁ బడనిదొక్కొ!
పాపముంచుసు భయంపడుట కీలోననే
హృదయసంగతులచేఁ బొడలఁదొక్కొ!

తే. గీ. రామశాస్త్రప్రశంసలఁ గనఁడొ, వినఁడొ!
యేమిభావించెనో యాతఁ డెవరికెఱుక?
రమ్మనియుఁ బొమ్మనియు మాటరాదు నోట
"పలపు సానికిఁ బలుపు దెబ్బలు" ఘటించు. 94

తే. గీ. అటులఁ దన్నాదరింపని యతనిరీతిఁ
గాంచి మదిలోనఁ గోపమ్ముగదుర మఱిరి
బోపుటకు నుద్యమించి యూర్పునిగుడించి
యుంచుక మనమ్ములోన యోచించి మఱియు. 95

ఉ. దాపునఁజేరి హస్తమునెదం గదియించిన యంతమాత్రనే
రాఁపుర మాయె మేను పులకప్రకరమ్ములకున్, మనమ్ములోఁ
గాఁపురమున్నకామము పికాపికలై చనె; నెట్ట కేలకుం
బాపపుభీతియుం బొలఁగి పర్విడె; నెంతయుఁ జాల రంగనల్! 96

శా. ఆరీతిం గని యాసతీతిలక మత్యానందముంజెంది "ని
న్నే రామామణి యిట్లుచేయఁగలదోయీ? యంగనాయోగ్యమౌ
గారామెల్లను నీవచేసెదవు వో! కాకేమిరా!" యంచుఁ గ
ర్పూరామోదితపూగసంకలితతాంబూలమ్ము నందిచ్చుచున్. 97

ఉ. "మంచిదికాని" 'వేశ్యలకు మాయలు మెండెటువంటివారలన్
వంచనఁజేతు' రందు; రది వాస్తవమే; తమవంటి వారికిన్
వంచన మంచి గాదుకద? వచ్చెడియట్లనె యుత్తరమ్ము వా
యుంచియు రాకపోవు టిదియేకద? ధర్మము మంచివారికిన్." 98

తే. గీ. అనిన నతఁడిట్టులను "నింద్యమనియుఁ బాప
మనియు నేమానితివిగాని యన్య మెఱుఁగఁ;

బరిహాసింపుమనొ యంచు బల్రయమ్మన మధ్య
మధ్య నాపతి యొక్కమాఱు పెనఁగు
కౌఁగిలింపుమనో యంచుఁ జవులు దేఱఁగ మధ్య
మధ్య నోష్ఠ మొక్కమా ఱొసంగు

తే. గీ. ముష్టులిడి యొడలెఱుఁ గమి మోవిఁ గొఱుక
బనులుతీర్చనెయసి చేతఁబట్టు ఱొమ్ము
రాజ్యమిది నాదియంచు గర్వమ్ముఁ జూపు
సుపరత మొనర్చు వేళ నయ్యువిదమిన్న. 103

క. ఉపచరించిచ్చలనంబు క
టిచపుత్కారంబు మేని తీవి బెళుకుఁజూ
పుచు రఃరు సారెకు వర్ణిం
పుచు మెచ్చె నతండు దాని పుంభావంబున్. 104

ఉ. ఎఱుఁగరు రిష్టమింత సుఖమింత విలాస విశేషమింత యం;
చెఱుఁగరు మోహమింత వలపింత పెనంగిన దింతయంచు నా
నరసుఁడు నా సఖీమణియు సౌఖ్యరసాంబుధిలోన మున్గి తే
లిరి; వివరింప శక్యమె : బళీ : మఱి వారి వినోదవైఖరుల్. 105

వ. అంత. 106

తే. గీ. జారిణీజారసురతప్రసంగభంగ
మంగళానంతతాపశాంత్యౌషధంబు
చోరకృత్యాంతరాయ మాచారివిప్ర
కోటివిజ్ఞప్తి విననయ్యెఁ గోడికూఁత. 107

వ. అంత 108

సీ. నలిగిపోయిన పుష్పములు కీలుజడనుండి
యడుగడ్గునను ద్రోవయందు రాల
మలయు ప్రాతఃకాలమలయవాయువులచేఁ
జెమటబిందువుల మొత్తము లణఁగఁ

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రవణానందము

## పంచమాశ్వాసము

క. శ్రీమహితపీఠికాపుర
ధామ ! నిరుపమానకీర్తిధవళితసకలా
శామండల ! వేంకటర
త్నామాత్యవరేణ్య ! రసికతాధిరగణ్యా ! 1

తే. గీ. అవధరింపు మనంతరం బంత సూర్యుఁ
డుదయగిరి నెక్కె ; నతఁడు యథోచితముగఁ
గృత్యములు దీర్చుకొని రాత్రికృత్యమునకు
మోదమందు మఱింత విషాదమందు. 2

సీ. ఏకాంతఁ గనుఁగొన్న నిసడించెడిబుద్ధి
యీకాంతమీఁదఁ దా సోఁక నేల ?
సోఁకిన నేమి, యాసుందరీమణి తనం
తనె వచ్చి నన్నుఁ గైకొనఁగనేల ?
కైకొన్న నేమి, చిక్కఁదనం బఱలగ నా
కామినీమణితోడఁ గలయనేల ?
కలసిన నేమి, యాకామినీమణి పొందు
పరవశత్వమొనర్చి పరఁగనేల ?

తే. గీ. పరఁగుఁగాకేమి, బుద్ధి దా మరల నేల ?
మరలుఁగాకేమి, బొత్తిగా మరల దేల ?
వేయిమాటల ఫలమేమి, విధికినైనఁ
గామదేవు జయింప శక్యమ్ముకాదు. 3

మ. ధనమా, పోవును; మానమా, చెడును; నిందా, నెత్తిపైఁ జెక్కుఁ; గో
నసుమానింతురు తల్లిదండ్రులు; పలంబా, వన్నెఁ దంచెక్కుఁ; బా
తన మాంద్యమ్ము ఘటిల్లు; బంధుగులు సందందొప్పఁ బెంపింతురు; రో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 4

మ. 'విను నీబోఁటులనంగ నెంత? మును గంధీరప్రవాహమ్ములా
మునులే ముచ్చటలందు మున్గి; రిటయేమో పెద్దబ్రహ్మందమా?'
యన రాఁబోకుము వారికి స్మరుఁ గొండంత తంత్రంబు నున్నఁ; బో
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 5

మ. 'మును లీలాశుక కాళిదాసకవిరాణ్ముఖ్యుల్ ఘనస్త్రీలతో
డను గ్రీడింపరె! దాన వారల ప్రతిష్ఠల్ పోయెనే?' యంచు నీ
వనఁ దప్పుం జుమి; నక్కయేడ! దివిజాధ్వాగాలయం బేడ! నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 6

మ. "తనయంత న్నినుఁ గోరి వచ్చినది యీ తన్వీమణి న్వీడఁగాఁ
జనునే? నీ" కని బుద్ధిచెప్పెదవు మెచ్చన్ వచ్చు నీయుక్తి; యీ
తనువే శాశ్వతమా! పరమ్ము వలదా! తప్పుల్ విచారింపవా!
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 7

మ. తనపుల్ బుద్బుదముల్, యశం బనఁగ నిత్యం బట్టి యీ సద్యశ
మ్మును నీతుచ్ఛసుఖాప్తికై క్షణములోఁ బోఁగొట్ట నుంకించె దీ
వనుమానింపవు లేశమాత్రమయినన్ హా! యెంత దౌర్మార్గ్యమే?
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 8

మ. జననంబంది సమస్తపండితులు మెచ్చన్ దెచ్చికొన్నట్టి కీ
ర్తిని నిష్కారణ మొక్కనాతికయి వార్థిం గల్పఁగానేల? లోఁ
గను, అంతొక్కటి సూటిమాటలను మెక్కంజాలు నిక్కమ్ముగా
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 9

మ. "వనితాసంగమ మెన్నఁ జంచలము, స్వప్నప్రాభవం; బట్లు కా
దని చేయం బరిణామనీరసకరం, బాజోలికిన్ బోకు. మీ
వని వేసారులు చెప్పియుం దుదకు నాహా! యెంత చేయించితే!
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 10

మ. "నను నీ వెప్పుడుఁ బాయ వ" ద్దనుచు నా నారీవతంసంబు దె
ల్పిన 'నష్టే' యని యొప్పుకొంటి, సిపు డాతేమ న్వివదంబావ మౌ
నని యూహించెద, వెంత సత్యమతివో హా! మెచ్చఁగావచ్చు నిన్
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 11

మ. "జననంబందిన దానికి న్ఫలము వేశ్యాకామినీవక్త్రచుం
బనమే కాక మఱేమి యున్న దిదియే భవ్యం బభవ్యంబు గా"
దని వాదించెదు, నీ చరిత్రి మది వహ్వా! మెచ్చఁగా వచ్చు నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 12

మ. జననం బందిన దానికిన్ ఫలము సచ్చారిత్రుఁడై సర్వస
జ్జనులుం దన్ను నుతింప ధర్మపరుఁడై సాక్షాత్పరబ్రహ్మముం
గన నూహించుట కాక, కామి యయి భోగస్త్రీల భోగింపుటా?
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 13

మ. "తనుఁదా వచ్చినవేశ్యఁ గూడు సుఖ మింతా! యెంతయో తెల్పనా
కను వౌనా? యది యట్టు లుంచు మిది బ్రాహ్మదుల్ గణింపంగ శ
క్తిని బొందం గలరా!" యటం చనెదు, నీ తీపింత గాఁబోలు నో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 14

మ. "అనుపయ్యోస్ గద! నీకు దీనికిని జాత్యాదుల్ కళాశాస్త్రరీ
తిని, వహ్వా యిఁక దీనిపైఁ జనెడి బుద్ధిన్ ద్రిప్ప నీ వొప్పుకొ
న్నను నేనొప్పుదునే?" యటం చనెద వన్నా! యెంతస్వాతంత్ర్యమో
మనమా! వద్దిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 15

క. అని యీగతిఁ దన మనమున
ననేకరీతులుగ నెంచి యనుతాపమ్మున్
గను నాలోననె యచ్చెలి
చనుదెంచె యథాస్థితముగఁ జదు వను మిషచే. 16

క. చనుదెంచెఁగాని యాతని
ముఖపటిరీతిఁ గను జూడమో మోటముఁ జెం
దును, పెల్వెలఁ బాఱును, సి
గ్గును గను; మెతక గుణ మెంత క్రూరపు గుణమో! 17

చ. చదువఁగ సంశయించు, నెరసత్కృతము లాడఁగ సంశయించు, సొం
పొంపఁ బ్రియావరికారమున నూరక యుంటకుఁ గూడ సంశయిం
చెదఁగను, నింతకన్న మనువే కడు మేలని లోనెంచు నా
సుదతి; పరుల్ గదా! హృదయచోరులు రాంకరల కుంకు నాఁటినన్. 18

వ. పిమ్మట నాతండును నిశీథసమయంబున మదనవిషప్రేరితుండై యున్నాని
గృహమ్మున కేతెంచుచు హఠాత్సంఘటనితికించిట్టి పేపస మున్నను. 19

మ. ఘనరాజన్యశిరస్తటీమకుటసత్కారమ్ముచే మించు న
న్నును బ్రేరేపణఁ జేసి వ్యర్థముగ నెంతో పాప మార్జింప నీ
ధనరారీమణిచెంతఁ ద్రోచె, నిదియున్ ధర్మమ్ముగాఁ దోఁచెనే?
మనసా! పట్టిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 20

మ. ఘనపొప్పన్ జనపాలసేవకనమస్కారమ్ములం గొంచుఁ, బ
ద్ధనసౌధమ్ముల ద్వారసీమలను నిత్యమ్ముం బ్రవర్తించు న
న్నును నిర్లజ్జునిఁ జేసి వేశ్యగృహమున్ దూర్పంగ నీకొప్పునే?
మనసా! పట్టిఁక నాదు మాట వినుమా, మర్యాదఁ గాపాడుమా! 21

మ. ఇది దుష్కార్యమటంచు నాతఁ డిటు లెంతే లోన నూహించుచుం
డువకుణా గూఢముగాఁ దదీయగృహమున్ డుంయుష్కుమై చేరి, యు
మ్మదిరాక్షీఘనసుస్తనాగ్రపరిరంభ ప్రక్రియా భోగసం
పదచేఁ దానెవరో యెఱుంగఁ; డపుడుం బాండిత్యముల్ దోఁచునే?

మ. అటులే గెన్ మఱికొంతకాలము రహస్యప్రక్రియల్ దోఁప న
చ్చటి కీతండును నేగు, నిచ్చటికి నచ్చందారిస్యయున్ వచ్చు, నె
ప్పటి కేప్రక్రియ నీలా యట్టులగుఁ; జెప్పన్ శక్యమే? దైవసం
ఘటనానైపుణి! యాతఁ డయ్యదియొ? యక్కాంతాకియే యాతఁడో?

చ. మదిని విరక్తి దోఁచెనొ; సమంజస మీపని గాదటంచు బు
ద్ధి దిరిగి పోయెనో, మఱి పదింబది పెద్ద లొనర్పు నిందకుం
బెదరెనొ యేమొ కాని, సరవిం దదనంతర మా లతాంగి శా
ర్తిదుఁడయి యాతఁ డేగెఁ బరదేశ మొకానొకఁడౌ నెపమ్మునన్. 24

క. శ్రీమంతము సతతహిమా
సీమంతము పర్జితతటినీ గాహన కే
శీమంతము పరిబలించెన్
హేమంతము విరహిజనులకే కుంతం బై. 25

క. చలి వెట్టి యుష్ణరుచి కం
బలకంచుకరాంతవాద్యపహ్నుతుఁడై యి
మ్ముల మిణుఁగుఁబోలుఁ; గిరణ
మ్ముల పసలేకున్నఁ దగ్గిపోవునె? యెందున్. 26

చ. పగలు కృశించె, రాత్రివిరవాతెఁ గుబేరదిగంతరాగతా
శుగము జనాళి కాశుగము సొంపునఁ దోఁచె ననంగవహ్ని హె
చ్చె, గిరివరమ్ము లన్నియు హసించె హిమాచలమున్, జలమ్ముపం
డ్లు గొఱుకసాఁగె, వృద్ధులు కడున్ భయమందిరి పాంథభామలున్.

తే. గీ. అట్టి హేమంతమున నతఁ డన్యదేశ
వాసి యగుటకు నబ్బాల వగలఁ బొగిలి
నూతనవియోగమెంతయుఁ జేత మెరియఁ
జేయఁ దనయంతఁ దా నిటుచింతఁ జెందు. 28

సీ. "గుబ్బలా యివి? కావు; కుంభికుంభోరోజ!
నాపూర్వజన్మపుణ్యములు గాని
అధరమా యిది? కాదు; మధురబింబఫలోష్ఠి!
రహిమించు నమృతపాత్రింబుగాని
కన్నులా యివి! కావు; కమలసన్నిభనేత్ర!
కళలనీనెడి ధేనుక లగుఁ గాని
వదనమా యిది? కాదు; వారిజారిసమాస్య!
నామనోరథనిధానంబు గాని

తే. గీ. బాలికవు నీవు గావహో! నీలవేణి!
లీల నూఁగెడి మరునిడోలికవు గాని"
అనుచు నుపరతవేళ నన్నాదరించు
వాని మేలెట్లు నే మఱపంగ నేర్తు? 29

చ. నిను విడనాడి నేఁటికి గణింపఁగ నొక్క నెలాయె నోయి ! నీ
గనుఁగొను నిచ్చఁ గన్నులను గాయులు గాచెఁగదోయి ! పేర్మి ...
మ్మనమున నెంచవోయి ! యనుమానము మానఁగదోయి ! ...
గనికర ముంచవోయి ! రతకంటను జూడదు మోయి ! ...

క. అని చింతించుచు మధుసూ
దను మిత్రుం డొక్కఁడతని తాపునదుం డో
వు నెసరిముస్ విని యవ్వన
జనయన తనపంత యతని సన్నిధిఁ జెప్పెన్. ॥31

తే. గీ. మాటిమాటికిఁ జెప్పి యమ్మగువమిన్న
చింతగొనుటయు, నారఁ దెప్పెలిమి తమది
మెల్ల మధుసూదనునితోడ నెఱుఁగఁ జెప్పెఁ:
జెప్పినంతనె యాతని చిత్త మదరె. ॥32

తే. గీ. ఇన్ని దినములనుండి యా పన్నెలాఁడి
తోడఁ గ్రీడించు భాగ్యంబు గూడదయ్యెఁ:
సౌఖ్యములు పెట్టిపుట్టని సమయములను
సౌఖ్యములు గోర నెరికి సంభవించు ? ॥33

ఉ. ముక్కర ముక్కునం గదిసి ముద్దులు గుల్క, బులాకి మోవిపై
చక్క నటింప, లే నగవు చాయయు లజ్జయుఁ గుమ్మలాడ నా
యక్కనఁ జేరి నాయమ నయమ్ములకుం బ్రీతిఁ జెప్ప జెక్కుచో
మక్కువఁ గౌఁగిలించుకొను మత్సుకృతమ్మను జూచు టెన్నఁడో ?

సీ. నాముద్దులమిటారి నావన్నెలకటారి
నాపున్నెములకోవ నాదుచేవ
నావలపులదీవి నాయమృతపుబావి
నాసొగసులతేట నాదుమూట
నాకోరికలయిక్క నానాణెములచుక్క
నారసమ్ములసీమ నాదుప్రేమ
నాకనుఁగవవిందు నాపెనువగమందు
నాకల్కి నాబల్కి నాదుచెల్కి

తే. గీ. నాదు రెండవప్రాణంబు నాదు నోధ
నంబు నాగుట్టు నామట్టు నాదుపట్టు
నెన్ను విడనాడి యేగతి నున్న దొక్కొ
చెప్ప కేగె నటంచేమి చేసె నొక్కొ; 35

ఉ. "నాతిరొ! లాతియూరికిని నాథుని నంపితివా" యటన్న 'నే
నాతఱి నూర' లే నని తనంతనె కన్నులనీరు జాఱఁగాఁ
గాతర వైతి పంచుఁ జెలికాఁడు వచించెను; నాదుకన్నులే
యాతమిఁ జూచెనేని మగువా! యని యెంత విచార మొందునో. 36

చ. క్రమముగ మానసంబు కనుగందు నినుం గను భాగ్య మబ్బమిన్;
దమకము హెచ్చి, మిన్నుపయి దాఁటినయట్టులఁ దోఁచె నీదు చై
దములకు వాచెఁ గన్నులు, ముదంబు యథాయథలై నశించె, శ
క్యమయిన స్వప్నమందయినఁ గన్పడుమా! యొకమాఱు నెచ్చెలీ!

సీ. చిఱునవ్వు మొగమందుఁ జెంగలింపఁగ సిగ్గు
పడుట కైనను సిగ్గు వడెడిదాని
భక్తి విశ్వాససంపర్కమ్ముచే బయల్
పడెడి కించిత్ప్రేమభరముదాని
ఇటు చేయు మని చెప్ప నెట్టకేలకు సమ్మ
తించి తత్కృతి నాచరించుదాని
సురవిమ్మనం దనాదరము గల్గియు నాద
రమ్ము లేదని చెప్ప రాని దాని
తే. గీ. నుత్తరము చెప్పఁదగినట్టియుక్తులకును
మొగ మొకించుక వంచుక మురియుదాని
ముగుదయని మధ్యయని చెప్పఁదగనిదానిఁ
జూడఁదగుసోయగముదానిఁ జూడవలదె! 38

చ. గరువపుఁజెయ్వులా? మెయినిగారములా? కులుకాదుతీరులా?
పరువమునిగ్గులా? వలపుభావములా? రస మొల్కునల్కలా?
మఱవని ప్రేమలా? తలఁపు మర్మములా? వెలలేని ముద్దులా?
యెఱువదిమందిలోన సరియా? మఱి యాకరియానయానకున్. 39

ఉ. కోటిరా! నాఁడు నేలకులు పొల్పుగ నా కిడుపేళ ప్రేమనీ
నీటగు గోట గీఁటి? తది నేఁటికి నిన్ను స్మరింపఁ జేసెదీ
మాటలు వేయునేల? యొకమాట వచించెద నెంచి చూడుమా
మాట లడంగుఁ గాని మఱి మచ్చలడంగునె? మానినీమణీ! 40

చ. రతి యన నట్టిదో యెఱుఁగరాని నను న్గని యాత్మకీర్తి పే
నతివరో! జారపూరుషులయందు మహాత్మునిఁ జేసినట్టి నీ
చతురత కేమనందుఁ? గడు జాణవు జాణవు కావె; యింత చి
న్నతనములోన నింతటి ఘనంబగు కీర్తియుఁ గల్గియుండునే? 41

క. ఎన్నఁడు రతి నెఱుఁగనియా
మున్నే మెఱుఁ గాయె, నింత మునిఁగె నెఱిఁగినం:
"దిన్నమ్మకుఁ దిన్నంతయుఁ
గన్నమ్మకుఁ గన్నయంత" కాదె మృగాక్షీ? 42

చ. "వ్రతమును బాడుచేసి నను వంచనఁ జేసితి వెంతదానవే?
యతివరా" యన్నమాట కహహా! యని నవ్వుచు "ముద్రవైచియుం
చితిరె? బిగింపు మాట లిఁకఁ జెప్పకుఁ" డంచు వచించుమాఁటి నీ
చతురత నేఁటికిన్ మదిని జల్లనిపేళఁ దలంతుఁ గోమలీ. 43

చ. అలదినమందు నాస్థలమునం దల కేళిగృహమ్మునందు నా
సలు దనివార నీసురతసౌఖ్యము దేలిననాఁటి నుండియుం
గలసతిమోము గన్గొనుటకున్ మనసొగ్గదు; "అంత సాఁగఁ జెం
దిలి యిఁక నేల" యంచును బఠించెడి పెద్దలనోటు ప్రావ్యనే? 44

ఉ. దూరమునందునుండియును డొయ్యలి! దగ్గఱ నున్నరీతిఁగా
బీరముఁ జూపుచుంటి వది భేష! శెబాసు! బళా! యిదేమి? యో
నీరజగంధి! కంటికొర నిద్దురపట్టక మున్నె పక్కలోఁ
దూఱెదు; కన్నువిచ్చినను దుఱ్ఱున దూఁరెద వెంత దానవో? 45

ఉ. అన్నులమిన్న! నిన్నుఁగని యందరు కొందఱుమూర్ఖు "లెంతయుం
జిన్నెలు వన్నెలుం గలుగు చేడియగాదిది" యంచు, దాన నీ
వన్నెల కేమి లోప? మది వారలకన్నులలోప మెన్న, నా
కన్నులు వారు పెట్టుకొని కాంచిన నోరులు మూయకుందురే. 40

ఉ. అన్నిటి కేమిగాని మగవా! యొకటే నిజమైనమాట, నీ
చిన్ని మెఱుంగుఁజూపులను జిత్రపుఁ బల్కులు మొల్కనవ్వులుం
దిన్నని భక్తియుం దనివి దీఱని పేర్మియు నెంతతంచ్రిలో
మున్నను నిన్ దలంపులను నోపిక నాకిడఁజాలెనుం జుమీ. 47

చ. మగువ దలిర్పఁగా సుపరిమస్మథకేళిని గూడువేళ "నో
రమణిరో! నన్నుఁగూడి యిటు లింతులు సేయఁగ నీకుఁ జెల్లెఁగా
క మహిని దేని కో" యనినఁ "గాక మతే, యిది నాదుపూర్వపు
ణ్య" మని పలుకు నీదు వచనంబులు నామది నాట కుండునే? 48

ఉ. రాపిడి గబ్బి గుబ్బల నురమ్మునఁ గ్రుమ్ముచుఁ గోర్కె దేపుచుం
గోపము చేతయే కసరి కొట్టుచు "నౌచ్చితి" యంచు వింతలం
జూపుచు ముద్దువెట్టుచును సొంపుగ నన్నెగ మెత్తిచూచు నీ
చూపుల కీయఁగా వలదె? సోలెడు పద్యము లంబుజాననా. 49

చ. సముఖముఁ జేరవచ్చి బిగిచన్నులఁగ్రుచ్చి కవుంగిలించి ప్రా
యము తమిఁజూపుచుం దమలపాకుల చిల్కలు నోటఁబెట్టుచున్
దమకము మీఱ నన్ను వరతమ్మున సోలఁగఁజేయునట్టి భ
ప్రియముగల నాఁటిరోజు లిఁక రావిఁక రావిఁక రావు నెచ్చెలీ! 50

చ. గరముగ నన్నుఁ గూడుటకు రాతిరివెన్నెలవేళ రాఁగ, మె
చ్చి కవుఁగిలించి "నీవెవరో? చెప్పుము నాయికలం" దటన్నఁ జె
ప్పక నగుఁదా టటంచుఁ బొరపాటున మెల్లనఁ "బిందిరాభిసా
రిక" యనిపల్కు నీ వచనరీతులు నా మది నుండకుండునే. 51

ఉ. 'పాపనకీర్తి యీతఁ' డని పండితులెల్ల నుతించి కొల్వఁగా
భూవలయమ్ము నన్ యశముఁ బొందుచు నుండెడి నాదు నయ్యయో!
నీవగతే సదా మదిని నిల్పి భజించుట లబ్బె నెచ్చెలీ!
దైవము వ్రాయువ్రాఁతలవి తప్పవుగా భువి నెంతవారికిన్. 52

చ. సొగసులదొంతియైన యల సుందరి చెయ్వు లవెంత మూర్ఖుఁడుం
బొగడఁగ రాని వంచనఁడు; పున్నెము లేనిదినమ్ములన్ స్మృతిం

దగులంగఁ జేసి నాకుఁ బరితాపము హెచ్చఁగఁ జేసి నీవు నన్
బొగిలిన నేమియో! మఱచిపోయి సుఖమ్ముగ నుండు చిత్తమా. 53

ఉ. రాతిరి కొంత నిద్ర గదురంగనె దూరమునందు నున్న యా
నాతినిఁ జూడఁబోయి యట నాలుగుజాములు నుండి యిప్డుగా
చేతమ! వచ్చితి; విటులఁ జేసిన నిన్నుఁ గ నేమి సేసినన్
బాతక మున్నదే! యిటుల భావుల మాయలఁ జిక్కనప్పుడే! 54

సీ. "స్త్రీలఁ గూడినఁ జేటు చేకూఱు" నని సదా
  పలుకు నే వాడాలఁ గలయనేల?
కలసిన నేమి, 'లోకులు విన్న మర్యాద
  లకు భంగ' మని భీతిలంగ నేల?
భీతిల్ల నేమి, యాభీతభీతమృగాక్షి
  నట డించి యచ్చోటి కరుగనేల?
అరిగిన నేమి, యాయింగన కొకనీటి
  బొట్టు డించక యిట్లు పొక్కనేల?
తే. గీ. గతజలమ్మున కీయానకట్టదేల?
  మెట్టినేర్పులు గలిగిన దిట్టయైనఁ
  బరులకును బుద్ధులను జెప్పవచ్చుఁ గాని
  యాత్మకైనప్పు డాబుద్ధు లడుగుపట్టు. 55

చ. కలిమి చెడంగనిమ్ము, కులకామిని దిట్టినఁ దిట్టనిమ్ము, విం
దలు గలుగంగనిమ్ము; తలిదండ్రులు గుందినఁ గుందనిమ్ము, సం
కెలలు పడంగనిమ్ము, తనకీర్తికి భంగము గల్గనిమ్ము, దాఁ
గలసినకాంతఁ బాయు టది కష్టము కష్టము కష్ట మక్కటా! 56

ఉ. మారకళావిశేషముల మర్మములెల్లఁ బఠించి, లక్ష్యముల్
నేరుచు టెట్లొకో యనుచు నేను విచారణ సేయుచుండఁగా
నా రమణీలలామ తనయంతనె తాఁ గరుణించి నేర్పఁగా
నేరిచినాఁడ; దాని విడనేర్తునె? నేర్చిన దైవ మోర్చునే! 57

క. అని యీగతి మోహాబ్ధిని
మునిఁగి మనోరథరథమ్ముఁ బూని యతఁడు వే
గ నిజావాసముఁ జేరెను
మనోరథము నిలుపఁదగిన మానిసి గలఁడే? 58

వ. అట్లు వచ్చినపిమ్మట.

ఉ. అక్కమలాక్షి యాతఁడును నగ్గలమై తనరారు పేర్మి పెం
పెక్కఁగఁ గొంతకాలము యథేష్టసుఖమ్ములఁ దేలుచుండఁగా
నొక్కెడ నత్తలోదరియు నొక్క యయోగ్యతఁ జేసెఁ; గంబళిన్
మెక్కుచు వెండ్రుకల్ వెదుక మేకొనుచోఁ గలు వానె యేరికిన్! 60

తే. గీ. రాజరాజైన నెంతటి రసికుఁడైన
నెంత గారా మొసంగిన నెంత ధన మొ
సంగినను జాఱున నొసర్చు దొంగసంగ
తుల నొసర్చక మాన దీ తులువజాతి. 61

వ. ఇట్లబ్బాల తన వృత్తిపై ఖరిం బ్రవర్తింపుచుంటయు. 62

క. ఎఱుఁగద యాతం డెప్పటి
కరణిన్ వర్తింపుచుండెఁ గామపరుండై
ధర గణికాంగన లొనరుచు
దురుపాయము లేరికైన దుర్జ్ఞేయంబుల్. 63

వ. ఇట్లున్నంత.

క. అమ్మధుసూదను కష్టసు
ఖమ్ములకు సమవర్తిసక్తిగల గుణవంతుం
డమ్మగుపదైన వృత్తాం
తమ్మంతయు నెఱిఁగి యిట్లు తలపోసె మదిన్. 65

తే. గీ. ఎన్నివిధములఁ జెప్పిన నితఁడు మున్ను
వినక తుద కాచరించె నవ్వేలఁది పొందు;
ఆచరించుట కేమి, 'యయ్యతివ మిన్న
తన్న గుణవతి' యేదంచుఁ గళవళించు.

మ. 'ఘనసారీమణులెల్లఁ దుచ్ఛమతులే తథ్యమ్ముగాఁ జూడ నీ
ఘనసారీమణిమాత్రి యొక్కతె మహాధన్యాత్మ కాఁబట్టి దీ
నిని పట్టింపుటకాద' దంటి విపుడేనిన్ గూడునా, కూడదా ?
మనసా ! పట్టఁక నాదుమాటవినుమా ! మర్యాదఁగాపాడుమా ! 74

క. రసగతి దృఢనిశ్చయుఁడై
యాగరితకు వ్రాసెనిట్లు "లకటా ! యుశమున్
బోఁగొట్టికొంటి నీయను
రాగము నిజమని తలంచి రమణీమణిరో. 75

క. చెలికాఁ డాడిన పలుకులఁ
గల యర్థం బెఱుఁగలేక కలికిరొ ! నీప
ల్కులె వేదము లని మురిసిన
కలుషాత్మున కిట్టిఫలముఁ గలుగక యున్నే. 76

ఉ. నిన్ననసేల ! నీదు కులనీతి నెఱింగినవాఁడనయ్యుఁ జే
రెన్నికఁ గన్న సద్యశము నెంచక చంచలమానసుండనై
పన్నియు వాసియుఁ రుచిరవర్తనముం జెడఁగొట్టుకొంటి నా
కన్నను మూర్ఖుఁ డింకొకఁడు గానఁగరాఁ డిఁక వేయునేటికిన్. 77

చ. పలపు నిజంబటంచు మనసా ! మది నమ్మితిఁ గాని యిన్ని మా
యలు గలదాన వం చెఱుఁగనైతిఁ గటా ! సరివారలందు నౌ
దలయును వంచుకోవలసెఁ దన్వి ! వ్రతంబు చెడెన్ సుఖమ్మునుం
గలుగకపోయె నిట్లగునుగా ! వెలకాంతలతోడి కూటముల్. 78

ఉ. ఓవనజాక్షి ! నీదు కులయోగ్యత లెల్ల నెఱింగి నీపయిన్
భావము నిల్పి పండితులుఁ బామరులుం గడు గేలి సేయఁగా
దే ! విధిచోదితుండనయి తేలిక కేలికనైతి; నేరికిం
గేవల కాలకర్మ గతికిం బ్రతికూల మొనర్పఁ జెల్లునే ! 79

సీ. పుట్టినాఁడమరదా ! భువనప్రసిద్ధమౌ
వైష్ణవకులమందు వనజనయన !

చదివినాఁడనుకదా ! సకలవిద్యలను స
జ్జనులెల్ల మెచ్చంగఁ జంద్రవదన !
తిరిగినాఁడనుకదా ! పరదేశములను వి
ద్యాపరిసంగములకై తలిరుఁబోఁడి !
పొందినాఁడనుకదా ! భూమిలో నీసాటి
వాఁడు లేఁడనుకీర్తి పద్మగంధి !

తే. గీ. అట్టి నాబోఁటి నీబోఁటివానియొక్క
కాంత కాసించుటే యొక కాని మాట;
దానిలోన రసాభాసవశయుఁ గూడఁ
గలిగెనేనియుఁ జెప్పనా ! కలికి ! సుఖము. 80

క. ధన మీనో ? మన మీనో ?
వనపినో ? నీదు జాతిచందము కాద
న్నను నొకటి తప్పున్నదె !
పని లేదిఁక నీ గుణంబు బయటం బడియెన్. 81

తే. గీ. కప్పురంబొడి పంకంబుఁ గలిపి దాని
యందుఁ గస్తూరిగూర్చి దోహదముచేసి
చానిపి పన్నీటితోడఁ బెంచుదురుగాక
యున్నవాసన వాయునే ? యుల్లిగడ్డ. 82

తే. గీ. గతజలమ్మున కిఁక నానకట్టగట్ట
నేమియగు ? నీదు నాకును ఋణముదీఱె;
మంచిపనిఁ జేసితివి, నాదుమాట కేమి,
జగతి నుపకారమగు చర్య సలిపితీవు. 83

ఉ. వెలచెలులన్ వివేకులగు పెద్దలు పెండ్లికిఁ బిల్వరాదు; వా
రలు గల పెండ్లికిం జనఁగరాదు; జనం గనఁబోల దాటపా
టల; నదిగాక విద్యలఁ గడంగి వచింపఁగ రాదు; దీనికిన్
సొలసినవారికెల్ల మధుసూదను దుర్గతి రాక తీఱునే ? 84

తే. గీ. అసుచు నెఱుఁగంగ నేర్చినయట్టివారి
రెల్ల నెఱుఁగంగఁ జేసితి విందువదన!
యెఱుఁగ నేరనియట్టి సోదరుల కీవ
కాదు బ్రహ్మయు బోధింపఁగాఁ గలాఁడె! 85

క. నాకొక్కని కపకారము
చేకొని యొనరించి తంచు సిగ్గిలఁ దరుణీ!
లోకోపకారకంబగు
నీకృతికిన్ మెచ్చవలదె! నేర్పరు లెందున్." 86

క. అని కమ్మ వ్రాసి పిదపం
దనయంతన విడిచె దానిఁ దగ సమ్మదసూ
దనుఁడు; మనము విఱిగినచో
వనితామణు లన్న గడ్డిపరకలు గారే? 87

క. వాసవునకైన ధనకాం
తాసంగతి వలదు, దానితత్త్వమ్ము రసా
భాసము నిక్కము; సుగుణ
వ్యాసంగులు దాని బారిఁ బడరెప్పట్లన్. 88

మ. అటఁ డీరీతిఁ బరిత్యజించుటయు సయ్యబ్జాక్షియుం గొంతఁ దా
మతిఁ జింతించి క్రమమ్ముగా నతని ప్రేమ న్మాని పెన్మాయలాఁ
డితనం బూని స్వవృత్తి నెల్ల విటగోష్ఠిం జెంది పెంపొందె నౌ:
"గతిచేసమ్మరు గంజి పానక" మనంగా నిక్కమౌనే కదా! 89

సీ. తలిదండ్రు లింటిపెత్తన మొకించుక లోటు
జరుగకుండెడిరీతిఁ జక్కఁబెట్ట
నసురూల మగుతీవిఁ దనకాంత తనకెంత
యును వన్నె వాసి నార్జనము సేయ
సతిభక్తి గలశిష్యతతు లెల్లవేళలఁ
దను గొల్చి బుద్ధిమత్తను భజింప

శ్రీమత్పరదేవతాయై నమః

# పాణిగృహీత

[ కల్పిత ప్రబంధము ]

★

శతావధానులైన

తిరుపతి వేంకటేశ్వర కవులచే

రచింపఁబడినది.

★

ప్రకాశకులు :

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వరపల్లి కేషన్సు

కడియము P. O.

తూర్పు గోదావరి జిల్లా.

1956

ఇది శృంగారరస ప్రధానమైన

చక్కని కల్పిత ప్రబంధము.

ఆ రు ఆ శ్వా స ము లు


పరిష్కర్త — విద్వాన్

# చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

కడియం P. O. తూ॥ గో॥ జిల్లా.



ప్రచురణ :

వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్

ఆలమూరు.

శ్రీమత్పరదేవతాయై నమః

# పాణిగృహీత.

## ప్రథమాశ్వాసము.

శా. శ్రీదుం డాప్తుఁడు, గౌరి భార్య, యచలశ్రేష్ఠమ్ము వాసమ్ము, వి
ఘ్నాదుల్ వాపెడివాఁడు పుత్రుఁడు, శుభం బర్పించుశబ్దమ్ము పే
రై దైవారెడివేల్పు, నిత్యకరుణావ్యాప్తుండు పుచ్ఛాన్వయున్
దాఁ దాత్పర్య మెలర్పఁ బ్రోచు నల సీతారామనామాంకితున్. 1

చ. గురు వగు బ్రహ్మపండితునకు న్నతిసల్పి జగత్ప్రసిద్ధవా
గురు లగు సంస్కృతాంధ్రకవియోగుల మ్రొక్కియు నేఁటి మేటులన్
గరము బహూకరించి యిఁకఁ గాకవితాభువనైకరాజ్యభా
స్వరులగు నామమాత్రకవిచంద్రులకున్ బొనరింతు మంజలుల్. 2

తే. గీ. లజ్జ గల్గిన పూర్వకాలమ్మునందుఁ
గోటి కొక్కఁడు గల్గెఁబో! కుకవి, నేఁటి
కాలమం దేమికర్మమో కవులనూటిఁ
దొంబదులు కుపదమ్మునఁ దూఁగుచుండ్రు. 3

ఉ. కైత యొకండు గాదిపుడు కాలము సర్వము మాఱె, వ్యర్థపుం
జాతురి హెచ్చె, నల్ప మగుసాహితితోఁ బెదపెద్దపొత్తముల్
చూతురు, తప్పు దిద్దుదురు, శూరత చచ్చెఁ గవీంద్రులందు; సీ!
మూతులు గట్టివైచికొనఁ బోలదె? సత్కవులైనవారికిన్. 4

చ. తగుదుమొ లేదొ యంచు మదిఁ దత్తరపాటొకయింత లేక "మీ
దగుకయితమ్ము చూచితిమి యందది యిందిది" యంచుఁ బద్దెముల్
దగులుదు, రందుకోసమె మొదల్ దమ రంపుదు రిక్కవుల్; వృథా
యగుఁగద? వీరిసమ్మతు, లహా! తగువారి కివేల? కాల్పనే. 5

తే. గీ. అగ్నిహోత్రమ్ములకు మొద లెన్నిపుటలొ
నిండు నభినందనములతో నిండుగకట
యొక్కఁడేనియు నిజమగునూహ వ్రాయఁ
దట్టువ్రాసిన నద్దాని నడఁతు రాకట. 6

తే. గీ. భారతమ్ముపై నెవరియభిప్రాయ ముండె ?
మనుచరిత్ర మొద లేరిసమ్మతులునిలిపెఁ ?
దీపి లేనిఫలమ్ముపైఁ దేనెచిలుక
నేమి యగుఁ? దీపి గలదాని కేమిపలయు ? 7

తే. గీ. చేతఁ గానిశతపథానిచేతినింద
సర్టిఫికెట్లుకట్టలే, సహజశక్తి
గలుగువారల, కవి యేల ? కాల్పనే స్వ
తఃప్రకాశుఁడు గోరునే తనకు దివ్వె? 8

క. "సంగీతసాహిత్యులు వా
గంగనకున్ గుచము" లనుట "హాస్యాస్పద" మం
చుం గన్నులుగా దిద్దెడి
శృంగారవిదుల్ కవీంద్రు లిక్కాలమునన్. 9

ఉ. ఇంతకు నింత మాట నిఁక నిన్నియనంబులుగూడఁ జూంబనా
క్రాంతము తోట మోటనుచుఁ గాళ్ళగ మూర్తిగా మ్రే శ్వటంచురో
తింత్రిణికాఫలమ్ము లనఁ దీయదె ? పూర్వ కవీంద్రు లక్కటా !
యింత వివేకముం దెలియరే ? యది దిద్దెడిపాటివారమే ? 10

క. స్తనశల్యపరీక్షఁ జో
యిన ఫలముం గలదె ! వాని నిటుపోల్చినయ
య్యనఘువిభావము నెఱిఁగిన
జనుఁ డేగతి దిద్దు ? నది రసం బెటులిచ్చున్ ? 11

తే. గీ. ఇంతమార్దవ మెఱిఁగియు నిహిహి ! పిరు
బాలకుల కంచుఁ జేసినపాతపుస్త

కమున సుఖరోగములగాథ నిముడఁజేసి
రట నుపాధ్యాయు లెటుచెప్పనగునో? యకట! 12

ఉ. కంతురుకుంక లైనపలుగాకికలార్థుల రెట్లు పాఠ మీ
అంకుపురాణమున్ నయభరప్రద మంచు వచింప నొప్పు? నా
శంక యొనర్పరే? నగరె? "సర్వము నీతికె" యందురేని మీ
నాంకునిఁ దెల్పు నారతిరహస్యము పాఠము పెట్టరాదొకో! 13

తే. గీ. తగినసామగ్రి దొరకిన ధార లేదు
ధార గల్గిన సామగ్రి దనరఁబోదు
రెండు గల్గినవారితో నొండు గల్గు
వాడు డీకొన నది నగుఁబాటు గాదె? 14

ఉ. కొంచెము గొప్ప సంతసము గొల్పినఁ జూడుఁడు చించివేయుఁ డే.
మంచియు లేనిచో, నివియె మా నమనమ్ము, లనుగ్రహించి మ
న్నించుఁడు, కాశినాథబుధనేతవిధాన వృథావివాదముల్
పెంచకుఁ డాగ్రహించకుఁడు "పెప్పెపె" యందురు మే మెదుర్గానన్.

చ. పరిణతశక్తు లైన యలభారతపుంగవు లట్టు లుండ ము
ష్కరుఁ డనిపించుకొన్న కవిసామజసింహము రామకృష్ణు వా
గ్విరచనగూడఁ జూడుఁడు ప్రవేశఫలమ్ములు చిన్నచిన్న వ్యా
కరణపుఁబొత్తముల్ గొణిగి కయ్యముఁ బెంచకుఁడయ్య! వాగ్విదుల్.

క. తొలిబాసయందుఁబలె నీ
తెలుఁగుంబాస వెలయించుదీపము లేమిన్
విలువగలకవులలక్ష్య
మ్మలె తా మీభారమెల్ల మోయఁగవలయున్. 17

క. శ్రీభాగము మే మల దే
వీభాగవతమ్మనంద వివరించితి మీ
శోభ.యిట మరల నేల? ప
రాభవ మందకుఁడు పైకి రాకుఁడు కుకవుల్. 18

ఉ. కాలముఁ బట్టి దేశమును గాంచి పరిపక్వము నెంచి పేశభా
షాలలితాంగి మాఱు టది సత్కవిసమ్మతి మాట నస్వప
శ్యాలను నాంధ్రభాషఁ గలపాటను నాచితిఁబట్టి మేము వి
ద్యాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పుకొందురో. 19

మ. అగుఁ గావ్యమ్మది, యైనను బ్రహసనపాత్రీయమ్ము, ప్రారంభమా
దిగ దీనన్ బలుచోటులన్ బొసఁగు నెంతేనిన్ రసాభాసము, ద్రో
మగువన్ నాయికచేఁత, మర్త్యులసరత్రర్యాపవాక్యమ్ము, చె
ప్పగ దానిన్ వెలయింపఁ బండితులు తప్పల్ దిద్దరో కదా ? 20

తే. గీ. కవిత యన్నను దెపరివాగ్రచన యెల్ల
దాని కనుకృతి సేయుటే తగినఫణితి
అంతియేగాని యెల్లెడ ననను గుఱుపు
శైలి గల్పించు టది యేటిపంత మగునొ ? 21

తే. గీ. మాలపల్లె వర్ణించుచో మహాసురులను
జెప్పుగతి మర్త్యులు వాడుతప్పుమాఁట
లెంతమృదువుగా మార్చినఁ గొంతయైనఁ
బచ్చి యుండక మాన దిప్పట్లు నిజము. 22

క. అనరాదు గాని యప్పర
విని "గనులున్ జనులు మొదలు వేయఁబడగని" పం
చనియె నివి భారతాదులఁ
గనుఁగొనెనో లేదొ, కతము గన్పడు నకటా ! 23

ఉ. తా నొనరించుకట్టునకుఁ దప్పినవృత్తము లెన్నియెన్నియో
మానుగ లక్ష్యసంగతుల మన్ననచేసి యదేమిపాపమో !
మానెను బోతరాజరవిమండనువాగమృతంబు గ్రోలలే
నైనను దోసముల్ గలపె యయ్యెడఁ జిక్కఁగఁ జూడువారికిన్. 24

ఉ. కాకును రేఫకున్ జెలిమి రావని పెద్దవివాద పెంచెఁ దా
నేకళనుండి వ్రాసెనొ కవీంద్రుఁడు నన్నయ, కల్పనావిశా

రే ? కవు లొక్కరే, నుభయరేఫలెయవ్వి ? నణల్, శసల్, లడల్,
గాక యభేద మీయొకటికా ? తగకుండుట, మేలు మేల్ ! బళీ ! 25

శా. శ్రీనాథాదుల లేనిలోపములు వర్ణించెన్, రలాభేదసం
ధానంబున్ దెగఁదెగ్రించె దిద్దిు, యది గన్నట్టి నవ్వరే! శాబ్దికుల్,
తా నేయేయవి లేవనెన్ దనకు నంతర్వాణు లౌసత్కవీ
శానుల్వాడిరి విస్తరించుటకు శాస్త్రం బెట్లు వీ లియ్యెడన్. 26

క. ఎఱిఁగి ప్రయోగించినదో
యెఱుఁగనిదో తెలియవలయు నిచ్చో నలవ్యా
కరణపుభాష్యములో వ్రా
సిరి చీవా ట్లిడిరి లక్ష్యసిద్ధి దెలుపుచున్. 27

క. ఎన్నెన్నిపొత్తములు కవు
లెన్నెన్నివిధాలఁ జెప్పి రెన్నెన్నివిశే
షోన్నతు లయ్యెడఁ గన్పడు
నన్నియుఁ దెలియంగ శక్యమా ? యొక్కనికిన్. 28

తే. గీ. వాదిదౌర్బల్యమే కాని లేదు వాద
దుర్బలత్వము, లక్ష్యముల్ దొరక వనుట
బొత్తిగాఁ దప్పు, తెలుఁగున బొంకి రిట్లు
సంస్కృతమ్మున నింతగా సాగ దాట. 29

ఉ. ఇంతకుఁ బోతరాజకవి నీతఁడు దాఁ బహివెట్టె దానిచే
నింత లిఖింపఁగావలసె నిందుకుఁ దిమ్మకవీంద్రుఁ డేమి, సు
స్వాంతులు తక్కులాక్షణికు లందఱు నేమి, యెదిర్చి యక్కవిన్
గాంతికిఁ దెచ్చి రప్పకవి కా దనుమాత్రములోనఁ బోయెనే. 30

మ. యతియో ప్రాసయొ తప్పు పేరికిని రాదా ? దానఁ బాండిత్యవి
స్తృతికిన్ లోపమె ? భ్రాంతి పండితులకే, "యేవార్థమప్యవ్యయ"
మ్మితిపూర్వోక్తి దలంపుఁ డెందఱును దా మీపూర్వపుంబొత్తముల్
మలిమస్మృత్యలు దిద్దకే రలిగెఁ బ్రామాణ్యమ్ము, యోచింపుఁడీ. 31

ఉ. వారికి నచ్చవచ్చుగతి వారును వారును దిద్దరేని యీ
భారతమాదిగాఁ దెలుఁగుబాసను సంస్కృతమందు నొక్కటే
దారిని బోవు పాఠములు, దానికిఁ గారణ మేమి? యిప్పు ము
ద్రిరచనాలయమ్ములను దప్పులొప్పులు కొన్ని చెప్పెదన్. 32

వ. అని శిష్టాచారప్పలమ్మున సూరిప్రాయమ్ముగ వినుచుక చర్చించి యొక్కెడఁ గార్యవశమ్మున బృందావనపురమ్మున కరుగుటయు నయ్యెడ నాబాల్యమిత్రుండును ననాదిపవిత్రతర పుణ్యవంశసంభూతుండును గానరసకోవిదుండును గవితా మాధురీధురీణుండును నగు సీతారామ నామకవిప్రఘనదత్తసూజుల నొక్కనాఁడు 33

ఉ. తా నొకహార్మనీ శ్రుతిసుతారముగాఁ దగుదాని నూని దెం
దానపుఁ బ్రీతి గొల్పుగతిఁ దానముఁ బల్కఁగఁ జేయుచున్ మఱిన్
దానికి మేళుగానిగతిఁ దంబుర మీటుచుఁ గొంచ ఫెల్లి "రా
నా" నసురీతిఁ బాడ నది హాయిగ వించుఁ దదేకచిత్తుఁడై. 34

వ. కొండొకసేపు విస్మృతసకలప్రపంచుండై కాలక్షేప మ్మొనరించి చిఱు నవ్వు నవ్వుచు భక్తిపురస్సరమ్ముగా నిట్లనియెను. 35

చ. "తిరుపతివేంకటేశ్వరులు తియ్యనిమాటలతోడ సూరి పా
మరులకు మెచ్చుగాఁ గవిత మంచిగఁ జెప్పెద" రంచు వించు సం
బరపడుచుంటి కాని యొకపాటిప్రబంధము నైనఁ గైకొనఁ
జిరమున నుండి యత్నమును జేసియుఁ గానయితిన్ గృతార్థుఁడన్. 36

తే. గీ. ఆత్మకూరునృపాలునియట్లు మిమ్ము
నేనుఁ గంబారి నెక్కింప నేమొకాని
తక్కుసమ్మాన మొనరింపఁ దగినపాటి
సిరి గలదు సుండు నాకు లచ్చిపతికరుణ. 37

చ. అన విని "నీకొసంగు దొరయబ్బరమే? మఱి విప్రులందు పెట్
ధనమున దాతృతాగరిమఁ దక్కుపరీక్షంసల మాటనాఁటఁ ద
క్కిన గలరే? నినున్ దొరయుకీర్తిపరుల్, కయికొ మ్మవశ్యమున్
మనమున కిష్టమైనకృతి మాన్యతమున్ దగుదాని" నాష్టడున్. 38

ఉ. ఇప్పటికెంతలేదనిన నిర్వదికిఞ్జ బయినుండు మీకృతుల్
తప్పక నేయు నా శతవధానపుఁబద్దెములున్ నృపాళిపై
గుప్పినపద్యముల్ గలవు కొల్లలు, భాగవతంబు దీనిలో
గొప్పది ,దానినేను మునుగోరితి, నీయకపోతి రెందుకో ? 39

మ. ఋతువుల్ పర్వతముల్ సముద్రములు నీరేజాకరమ్ముల్ శత
క్రతుముఖ్యామరసంఘముల్ తఱచుగాఁ గబ్బమ్ములం దెల్లెడన్
శ్రితులన్ దన్పుచునుంటఁజేసి యిఁకనేఁ జోద్యమ్ముగా నూత్నపుం
గృతి నిర్మింపఁగఁగోరెదన్ నయమునన్శృంగారమున్ మీఱఁగన్. 40

చ. మనుజున కెద్దియోయొకతె మానినియుండుట యొప్పునో ? కుల
మ్మున కనుకూలమైన విరిఁబోఁణియె యంచొకనేమమో ? యిటన్
మనమున నెంచిచూడ నెట మంచి యిహమ్ముఁ బరమ్ము వాయదో ?
వినపతె దీనికెంతయును వీలగుగాధ రచింపుఁ డొప్పుగన్. 41

వ. అని సకర్పూరతాంబూలమ్ము వెట్టి యంబరాద్యర్పణమ్ముల సంతుష్టి
గావించుటయు నలరి యతని డెందమ్ము చందమ్ము గుఱుతెఱింగియు
మఱింత విశదీకరింపఁదలంచి యతనిన్ గూర్చి- 42

ఉ. పాణిగృహీతి యందురు వివాహితయైనసతిన్, దనంతఁదాఁ
ణి బాగ్రహించి యుంచుకొను బానిసకొత్తును శాబ్దికాగ్రిణుల్
పాణిగృహీత యందు రొక వర్ణమునందునె కాక యెన్నియో
పాణిగృహీతికిన్ గలవు పాణిగృహీతకునుఞ్జ బ్రభేదముల్. 43

ఉ. దున్నయు నేనుఁగున్ సరిగఁ దూఁగునె?యంచయుఁ గొంగ యెందు నే
నెన్నఁడుగాని సాటిగనునే ? మఱియెక్కడి కెక్క ? డక్కటా !
వన్నెయు వాసియున్ సుపతవర్తనమున్ జెలువారుభార్యకున్
మున్నరికంపుఁదొత్తునకు మూఢులెఱుంగఁగ లేరహో విటుల్. 44

వ. అన నతం డిట్లను.

చ. విటులకు బుద్ధివచ్చుగతి వేశ్యలకున్ దలవంపుగా విశం
కటపదగుంభనమ్ములను గాక కడున్ సులభంపుశైలి నో

క్కటి రచియింపుఁడీ? కృతిని గైకొనఁ జిన్నటనాఁటనుండి మి
క్కుటముగ నన్ను నెక్కాలఁపుకోరిక లిప్పటి కీరికల్ గనన్. 46

వ. అనుటయు.

ఉ. ఇందుకు గ్రంథజాలము లనేకములున్నవి. దుష్ప్రవర్తనం
బందుఁ బురాకృతంపుసుకృతాతిశయమ్మునఁ గాలుపెట్టకే
డెందము తక్కియుండవలె. డెప్పరమై యటుగాక దక్కినన్
విందుమె? యెందునేనియును వెన్కకుఁ దీయఁగఁజేయు శబ్దముల్. 48

చ. సుకృతపుబుద్ధి మూలఁబడు. సుందరియే గురువంచుఁ బోఁచు. దు
ష్టకృతుఁడై యాగమమ్ములగు. జాపకులే నయబోధకమ్ములౌ
నకటకటా! యొకానొకని కగ్గలమై తగుజవ్వనమ్మునం
దొకనికి బుద్ధిమార్పడకయుండుఁ బురాకృతపుణ్యసంపదన్. 49

వ. అయినను బాటించువార లసదని నీతిన్ బోధింపమానఁదగదు గాన నీమనోరథంబు చొప్పున నట్లన చెప్పెదమని యంగీకరించి యాదారమ్మ కతనఁ గృతినేతయగు నతని వంశమ్మొకింత వర్ణించెదము.

బ్రహ్మముఖోత్పన్నంబై యెక్కుడు ప్రశస్తి కెక్కు నాదిమవర్ణం బునందొక యవాంతరశాఖ యగు వెలనాఁటి వంగడమ్మునందు గౌతమస గోత్రమ్మున "పుచ్చానామక వంశమ్మున ననేకులు మహామహా లుద్భవించి యశమును గాంచి మించిరి. అటమఁ గాబత్రిమమ్మున విశ్వనాథబొట్లనుధన్యుండుదయించె. నియ్యనఘునకు విశ్వేశ్వరసోమ యాజులు జనించి యఖండ వండితుండై ప్రశస్తిసంయుతయేవార వంతు లూరను నొక యగ్రహారంబు సంపాదించె. నీమహనీయు కొమ రుండు లక్ష్మీనారాయణశాస్త్రి. ఈతనికి వెంకటసోమయాజియు, విశ్వే శ్వర సోమయాజియు, సీతారామ సోమయాజియు, లక్ష్మీపతి సోమయా జియు, కామేశ్వరసోమయాజియు నను నేగురు పార్థివనామ బుదయిం చిరి. అందుఁ గనిష్ఠునకు సీతారామశాస్త్రి. రామయ్య. రాజయ్య లను సుతత్రితయ మావిర్భవించె. వీరిలో రామయ్యకు పూర్ణయ్య. లక్ష్మి

నారాయణ, కృష్ణయ్య, శ్రీరాములు, విశ్వనాథము ననునేగురు సుతు లుదయించిరి. ఈయైదుగురును సుప్రసిద్ధులే యైనను నిందు ద్వితీయుం డగు లక్ష్మీనారాయణాహ్వయుండు స్వార్జితాఖండసంపత్సంపన్నుండును నిరతాన్న దాన నిరతుండును మహావదాన్యుండునునై మిగుల యశము నందె. ఈయన్నదాతయే బెజవాడలో సత్రముంచినపరోపకారి. ఈతని యన్నదాన మహత్త్వముంగూర్చి యేమి యితరయోగ్యతలను గూర్చి యేమి యెంతయైనను వ్రాయవలసియే యుండును. ఈతఁడనపత్యుం డగుకతనఁ దన పిన్నతమ్ముఁడగు శ్రీరాముని కుమారుని దత్తుఁగాఁ జిన్నఁటినాఁడగై కొనియె. అతని పేరు సీతారామయ్య. ఈయనకుఁ గన్నతల్లి జోగాంబ, పెంపుడుతల్లి లక్ష్మాంబ, ధర్మపత్ని లక్ష్మీదేవి, వీరలందఱును సద్గుణసంపన్నలు. ఈవంశము వేదవేదాంగాది విద్యలకు నాకర మనియుఁ దద్విహిత కర్మానుష్ఠానమునకుఁ గుదురనియు నిందలి మహాపురుషుల నామములే కొన్ని సహస్రముఖముల వాక్రుచ్చుటం జేసి యావిషయమును మరల విస్తరించుట పునరుక్తియని యాఁగొలి కింటోక యీయన్వయమునం దెల్ల నెక్కుడు త్యాగభోగరాయఁడవి లోకులచే నెన్నఁబడు సీతారామాహ్వయుం డీకృతికి నధినేతకావున నార సికునకు నభ్యుదయ పరంపరాభివృద్ధిగా మాయొనర్పన్ బూనిన పాణి గృహీతయను కల్పిత ప్రబంధమ్మునకుఁ గథాక్రమంబు. 50

ఉ. పత్తన మొక్కఁడొప్పు "హరిపావకముఖ్య దిగీశలోక సం
పత్తులకెల్ల నొక్కయెడఁ బద్మభవుం డిరవొందు చేయఁగాఁ
జిత్తమునన్ దలంచి యిది చేసె విజ" మ్మని యెల్ల పాండితీ
వేత్తలు దన్నుతింప నరవిందసమాఖ్యఁ బరీమళించుచున్. 51

మ. నదికిం దాపట చుట్టుపట్టులను నానందమ్ము పుట్టించుచె
ల్వొదవన్ వర్తిలు తోఁటలొప్పునఁట, వాయుప్రేరణన్ సౌరభా
భ్యుదయం బెప్పటికప్పు డుండునఁట, యే యుద్యోగము న్లేక సౌ
ఖ్యదశన్ జీవన మయ్యెడన్ గలదఁ టన్యం బట్టి దొం దుండునే? 52

ఆ. వె. లచ్చి యెల్లవేళలను నందుఁ గాపుర
ముండుకతన దాని కొదవునట్టి
పేరు సార్థకంపుఁ బెంపునఁదగె నేతి
బీరకాయరీతి నీరసిలక. 53

తే. గీ. వెండికొండల మాదిరి వెల్లదీవు
లవిధమున మల్లెపూలరాశి పడుపునను
సంతత సుధామహోల్లసత్స్వాద పటిలి
కనులపండువు సేయు నక్కాటకసీమ. 54

మ. కనకమ్మన్నను లోష్టమన్న సరిగాఁ గన్గొంచు నన్యాంగనన్
జననింగాఁ దలపోయుచున్ నిగమవిశ్వాసమ్ము వోనీక నె
మ్మనమెల్లప్డు విరాగమంద యిడి ధర్మప్రక్రియన్ బొల్చి తా
మనసూయా పరులౌట నతుల్లుసుమీ ? యాప్రోలి విప్రోత్తముల్. 55

చ. అరిమదభంజనమ్మునన యాగ్రహ, మాగ్రహ మబ్బినప్పుడున్గా
శరణనువారిఁ బ్రోచుట యశమ్మను జ్ఞానపు మేలిగుర్తు, సం
సరణమసారమం చెఱుక, క్షత్రియజాతికిఁ బెట్టినొమ్ముల
ప్పురమున, నేల శూన్యమయి పోవు నిహమ్ముఁ బరమ్ము వారికిన్. 56

తే. గీ. సాధుసజ్జన నామముల్ సంతరించి
నట్టి తమపూర్వపురుషుల యశము చూచి
కాని క్షత్రియకృత్యమ్ముకై కొనంగఁ
దగుదు రప్పురికోమటుల్ ధనదసములు. 57

ఉ. ఎండలవేళ దున్న రది యెద్దులగాసికి హేతువంచు, బ్రి
హ్మాండము క్రిందుమీఁదయిన నాడినమాటకుఁ దిర్గులేదు, ష
ట్కాండలు రాముసచ్చరిత గాక యనేకపురాణజాలముల్
మెండుగఁ దామెఱింగిన సుమేధసు లప్పురి మున్నపాదజుల్. 58

తే. గీ. పూవులమ్ముటఁ గవి పుష్పలావికలని
సెఱుతుపట్టుదురే కాని గొనబుఁదనపుఁ

బలుకులును మేనితళుకులుఁ గులుకుఁజూపు
లౌర వారాంగన లటన్న యాసగొలుపు. 59

మ. ఎలసీటిన్ బురణించు నీర్గలిగి తా మేకాలమం దింక క
ప్పులతోనిండియు నూరకే యెవరినిన్ బోనీక పంకమ్ము లో
పలన్ దాల్పక యోగిచిత్తములతేవన్ బొల్చు నవ్వీటి బా
వులు గన్గొన్న మఱెట్టి పాంధులకుఁ బోవున్ మేనియాయాసముల్. 60

తే. గీ. శాంతియార్జించుపొంటె వేదాంతములను
జదువనేటికి ? క్షమకునై జపతపమ్ము
లూననేటికి ? నప్పురిసున్న మత్త
గజముల ప్రవర్తనముగన్నఁ గలుగవొక్కొ. 61

క. తమసహజుఁ దుచ్ఛపదవిన్
గొమరారుట తాముక్రిందఁ గ్రుమ్మరుటయు నై
పమి నచటి సైంధవములు న
భముపయికిన్ దుముకు దవుడువారెడిపట్లన్. 62

ఉ. తాళి యొకండు లేదనెడి తప్పిద మొక్కడితప్ప గేహినీ
లీలలఁ దమ్ముఁజేకొనిన లేఁతబొజుంగులఁ దన్పుచుఁ గళా
శాలిను లౌటకున్ ఫల మసత్యము దూరముచేయు తద్ధన
స్త్రీలు నిజమ్ము లంజెలఁ బతివ్రత లన్న మతేమి దోసమా. 63

ఉ. అందొక భూసురుండు సకలాగమవేత్త యనాదిసుప్రసి
ద్ధిం దగువంశమున్ మఱియు దీప్తికిఁ దెచ్చెడి సద్గుణప్రజం
బంది చెలంగువాఁడు నిరతాన్నవితీర్ణికి నాటపట్టు న
స్పందితచిత్తవర్తనుఁడు భాసిలు శంకఁరు డన్నపేరునన్. 64

మ. పరకాంతాపరకీయవిత్తహరణప్రారంభముల్ సేయు ము
ష్కరులన్ వీనులఁబెట్టఁ దొక్కయెడఁ బ్రొక్కర్మమ్మునన్ జేసి ద
గ్గఱినన్ విన్నను హా! శివా! యనుచు లోఁ గంపించుపేరాక య
ద్దురితంబున్ బెడఁబాపఁ జేసికొను నెందున్ లేని సత్కర్మముల్. 65

ఉ. వైదికుఁడయ్యు లౌకికపువర్తనమందును బ్రజ్ఞ గల్గి సం
పాదనచేసె లక్షలకుఁ బైఁ గడుహెచ్చుగు ద్రవ్య, మగ్రజ
శ్రీదత నిట్లు కాంచియును జిత్తజుబారికి లోఁగియుండె వే
తేదియు నేని దుర్వ్యసన మేర్పడియుండె వ్యయింపఁ డింతయున్. 66

సీ. కట్టించె మిగులఁ జక్కనిరీతి నన్నదా
నము సల్పునట్టిసత్రములగములు
చేయించె నెందఱో చేసాచి యడిగిన
బ్రహ్మచారులకు వివాహములను
శివకేశవులకు హెచ్చినభక్తి నూఱూర
నమరఁగాఁజేసె దేవాలయములు
వేయించె ధర్మార్థమై యింపుసొంపారు
నట్టితోఁటలు నూటికన్న హెచ్చు
తే. గీ. యజ్ఞములు సేయఁజేసెఁ బైనందెఁ గృతుల
నగ్రహారమ్ము లొకకొన్ని యాచరించెఁ
దక్కువిఁకలేదు సప్తసంతానములను
నొక్కసంతానమే లేకయుండెఁ గాని. 67

ఉ. ఆతనిభార్య యందులకె యాత్మ సదా దిగులొందుచున్ బురా
రాతికి గౌరికిన్ సిరికి రాక్షసహారికి వాణికిన్ సదా
ధాతకుఁ దక్కవేల్పుల కెదన్ముద మిచ్చువ్రతమ్ము లెన్నియో
చేతికొలంది దానములు సేయుచుఁ జేసెఁ బ్రియుండు మెచ్చఁగన్. 68

వ. ఇట్లప్పతివ్రత యనేక కాలమ్ము నానావ్రతమ్ము లొనర్చియు వివిధనదీ
నదమ్ముల గ్రుంకులిడియుఁ దుదకు విసువుటయు నతండు 69

క. "అన్నతనూజునకును దాఁ
గన్నతనూజునకు భేదగతిగల్గునె?" యం
చున్నతరూపవిశాలు ల
సన్నయుఁ దనయన్నకొడుకు సాఁకఁగ నెంచెన్. 70

తే. గీ. ఎంచి తనభార్యగన్గొని యిట్టులనియె
''గలికి ! యెన్నాళ్లలిటు కష్టగతికి నోర్చి
కల్పములనున్న వ్రతములు కడఁగిచేతు ?
విది పురాకృతకర్మమ్ము నెట్టులడఁచు ? 71

వ. సంతానమ్ము లేకయుండుట యిహలోకానందమ్మునకె కొఱతఁగలిగించుఁ గాని పరమ్మున కించుకయు భంజకమ్ము గానేరదు. ''అపుత్రస్యగతి ర్నాస్తి'' యని కేవలకర్మతులు చెప్పుదురే కాని యద్దాని జ్ఞాను లొప్పరు. 72

తే. గీ. ముక్తినందెడి వానికి ముఖ్యమొక్క
జ్ఞానమగుగాని యితరమ్ముగాదు దాని
నెనయలేకుండు నొకపాటిహీననరుల
కియ్యదియు నొక్కతెరువని యెఱుఁగు మబల ! 73

సీ. భీష్మున కెందఱుబిడ్డలు పుట్టిరి ?
శుకయోగి కెందఱు సుతులువొదమి ?
రల యాంజనేయున కాత్మజులెందఱు ?
గణపతి కేపాటి కాన్పుగలదు ?
పైవారలందఱు పడిరె ? దుర్గతుల, సం
తానమ్ముగల్గి నెందఱు మనుష్యు
లిపుడు పిశాచాది హీనజన్మమ్ముల
నెత్తుట లే దింతయేల ? పుత్రిఁ 74

తే. గీ. డెంతయును యోగ్యుఁడగునేని యిహమునందుఁ
దమకుఁ బరిచర్య సలుపుట దక్కఁ బరము
నందొకింతయుఁ గాఁడు సహాయుఁ డొక్క
యెడల నగునందువేని నీ విదియు వినుము. 75

వ. పుత్రునివలన ముక్తిగలుగునని చెప్పెడి పురాణమ్ములే వారు పదితెఱంగులనియు నందు దత్తుండును బరగతికి సాధనమ్మగుననియు ఘోషించుచున్నయవి కావున. 76

క. నాయన్నకు సుతులెందఱొ
శ్రీయుతు లున్నారు మొన్న చిన్నసుతుఁడొకం
డాయుర్భాగ్యసమన్వితుఁ
డై యుద్భవమందె వాని నగుఁ గైకొనఁగన్. 77

వ. ఉదారుండను పేరున నొప్పు వానికిప్పుడు వయస్సు మూఁడు నెలలగుటయుఁ గర్మవశమ్మునఁ దలిదండ్రులిరువురు గతించుటయు నీ వెఱుంగనిది కాదుగదా: అట్టి శిశువున్ బోషించుటయె మనకు నిహపరలోకమ్ములకు సాధనంబగునప్పు డవ్వానికి మన సకల సంపత్తునుంగూడ నొసంగుట యెట్టి సుకృతం బొనఁగూర్ప నేరదు? మఱియు నొక్క విశేషంబు గల దాకర్ణింపుము. 78

చ. కనుఁగవతీరు నెమ్మొగముకాంతియుఁ జెక్కులసొంపు నాసయొప్పును నళికంబుచందమును ముద్దులుగుల్కెడి లేఁతనవ్వుపొల్పును వెడఁదైన పేరురముపోఁడిమియున్ మిసిమిన్ జెలంగు మేనును గన వానిఁ బ్రాకృతజనుం డనఁబోల దొకించుకేనియున్. 79

ఆ. వె. "ఎచట రూపమట్టి నచటన గొనములు
సంభవించు ననుచు శాస్త్రవిదులు
పల్కుచుంద రింకఁ బనిలేదు యోఁచింప
వాని స్వీకరింపవలయు" ననుచు. 80

చ. పతిఁగని యిట్లుపల్కిన లపావని" యోయనఘాత్మ: మీరలా
నతి యిడి నప్పుడే యదియు నాకును సమ్మతమైన నిందులో
వెతకిన దోసముల్ గలవు వీఱఁడులై యొరుసాఁకి వానిచే
సతమును గుందుచున్న మనుజన్ముల నెందఱఁ జూడ మిద్ధరన్." 81

చ. కలిగినవాఁడు యోగ్యుఁడగుఁ గాక యయోగ్యుఁడె యౌనుగాక తా
మలుగరు తల్లిదండ్రి, లతఁడాడిన దాటఁగ సాగఁజేతు ర
న్యుల నిసువన్నభేద మొకఁ డుండుటచే మఱి యెంతమంచియో
కలిగిన మీఁదనైనఁ దమకానుపునుం బలెం జూడరెవ్వరున్. 82

చ. అమలిన బుద్ధితోడఁ దను నత్యనురాగము మీఱఁ జూచినన్
గ్రిమముగ నత్తువాఁడొకఁడు గన్పడఁ డేగతినేని యేరిలో
పమునవొ ఛేవ మబ్బుట ధ్రువం, బటుగావున దత్తపుత్రశో
కమునకు నగ్గలం బగుటకన్నను వేతొకవెట్టి యున్నదే. 83

ఉ. వాఁడొకవేళ నత్తినను వానితలోదరి యత్త దేగతిన్
గూడెడి సౌఖ్య ? మెట్టు లొనగూడెడి? సంసరణమ్ము, లేనిచో
లేఁ దనువంతయొక్కటియె లే దితరం, బిటులైన సంసృతుల్
పొడగుఁ బెల్లుగల్గెడి వివాదలు, ప్లీడరు లుబ్బి యార్వఁగన్. 84

తే. గీ. ఎందఱు జమీనుదారులు హీనులైరి
యెంద ఱగ్రిహారస్థులు కుందువొంది
రెందఱు ధనాడ్యు లియ్యెడ నింపుచెడిరి
గాన దత్తునిగొనుట దుఃఖంపుఁదెరువు. 85

మ. కులవిభ్రింశకు లెందు, ముండల ముటాకోరుల్, స్వకర్మస్థితుల్
దెలియన్ జాలని మాఱుబాస మొఱకుల్, దీపించుచున్నారు పు
త్రులు కాలస్థితిఁబట్టి, యిట్టి వెడఁగుందోకమ్ముతో నేమి ? వీ
రలు సేవల్ బొనరింతురో ! మఱి గయాశ్రాద్ధమ్ములన్ జేతురో ! 86

ఉ. ఈకలి కాలమందు "సుతులే పరసాధన" మంచు నెంచువా
రే కడుమూర్ఖచిత్తు, లదియేమొకొ యెవ్వని నోటఁజూచినన్
నాకు "మతేల తద్దినము? వైదికకర్మము లెందు?" కంచు నే
బోఁకుఃనెవండొయొక్కరుఁడుచూడఁబడున్ శుచియున్ మహాత్ముఁడున్.

చ. పితరులసద్గతిన్ గుఱిచి పెంచుకొనం దగునెవ్వరేని నేఁ
టి తులువబాలకుల్ సలుపు తీవుల కేడుతరమ్ము లిట్టటుల్
గతిచెడి ఘోరమైన నరకమ్మునఁ గూలుట నిక్కువంబు, సం
తతికి ఫలమ్ము వోవుటఱి దాపరమయ్యె నిఁకేటి సద్గతుల్. 88

చ. అన నతఁ డిట్లుపల్కు "నెపుడైనను గొందఱు యోగ్యులన్యరీ
తిని మఱికొంద ఱుండు టది ధీరహితం బిపుడందు నెక్కుడై

కనసగు దుష్టపద్ధతులు, కాఁదగు కార్యము కాకతీఱ దె
ప్పని వశమౌ యుగానుగతి వచ్చెడి చెట్టతనమ్ము నాఁగఁగన్. 89

తే. గీ. ఇంతసందియమేల ? యే నెపుడు మనసు
అమ్మనం దెన్ని యేనితరమ్ములాయెఁ
గాని నేఁటి కయోగ్యుఁడొక్కఁడును బుట్టి
నట్లువిన నిప్పుడిట్లైలయగునొ. చెపుమ? 90

చ. మనుజుఁడు మంచికార్యమును మానుగఁజేసెడి పట్ల "హానివ
చ్చు" ననుచు జంకఁగూడ; దొకచో నయినన్ జెడుకార్య మూని "దా
న నగును మే" లటంచును మనలబిడ రా "దిది శాస్త్రచోదితం"
బని మన మాచరింపుదము హాని యిటన్ సమకూర దింతయున్." 91

క. అని పలువిధముల బోధిం
చిన నామెయు నొప్పె నంతఁ జిన్నిశిశువుఁ గై
కొని తల్లిదండ్రులై హె
చ్చిన ప్రేమము మీఱఁ బెద్దఁజేసిరి, కడఁకన్. 92

తే. గీ. ఎనిమిదవయేఁడు దాఁటకమునుపె యుపన
యనముగావించి బ్రాహ్మణజనములకును
నిత్యమును గావలసినంత నిగమభాగ
మభ్యసింపఁగఁ జేసి రయ్యాత్మజాతు. 93

తే. గీ. అగ్ని కార్యమ్ము నల్పు సంధ్య నొగివార్చు
బడికిఁజని లౌకికపువిద్యఁ బఠన సేయుఁ
"బెంచుకొన్నను నిటువంటి పిల్లవాఁడు
దొరకవలె" నంచుఁ దన్ను నెల్లరు నుతింప. 94

క. ఆకారము, నైశ్వర్యము
శ్రీ కలయును నొక్కరూపు చెందిన కరణిన్
లోకోత్తర గుణగణముల
కాకరమై పొల్చు నయ్యుదారుం డెంమున్. 95

ఉ. పెద్దలయందు భక్తి మఱి పిన్నలయం దనురక్తి నేమపున్
సుద్దులయందు సక్తి వెడసోయగమందు విరక్తి యెంతయున్
హద్దు నతిక్రమించు కృతులందు నశక్తియుఁ గల్గి యెందుసున్
ముద్దుసుతారపున్ గొనపు మూలధనంబయి యాతఁ డొప్పెడున్. 96

ఉ. అంత వయస్సువచ్చుటయు నాకృతికిన్ సమమైనదాని ర
వ్వంతయు నేని లోటు నొకయందును లేని సుశీల బంధుతా
క్రాంతఁ గులాభిజాత ననఘమ్మగు లగ్నమునన్ వివాహమున్
సంతసమొప్పఁజేసిరి పసందని యెల్లరుఁజూచి మెచ్చఁగన్. 97

ఉ. నాఁటి సదస్యపున్ దినమునన్ వెల హెచ్చగు నేలుజోడులున్
నూటపదాఱులున్ మఱియు నూతనవస్త్రములున్ వరాలు నే
పాటి కలాఢ్యుఁడేనియును బంచె నుదారుని తండ్రి, ద్రవ్యమున్
గోటులు సేర్చుఁగాక బుధకోటికి నీగతి నీయ వచ్చునే. 98

ఉ. అపయిఁ గొంతకాలమున కాసతికిన్ వయ సంకురింప నా
యేపున నిర్వురన్ గలిపి యింపులుసొంపులుఁగుల్కు దంపతుల్
గాఁపుర మాచరించుగతి గాంచి కుతూహలమంది "వీరికిన్
బూఁవలు గల్గఁగా వలయుఁబో!"యని నెమ్మది నెంచుచుండఁగన్. 99

మ. తనకుం గాలము చేరువౌటయును నాతం డంత నాత్మీయమౌ
ఘనపుణ్యమ్మున నాత్మనామధరు లోకంబైన కైలాసమున్
గననేగెన్ దదనంతరంబునను దత్కాలోచితంబుల్ క్రియ
మ్మునఁ గావించి యుదారుఁడెంతయును సొమ్మున్ వెచ్చఁబెట్టెఁజా వెసన్.

చ. పిదప నొకింతకాలము వివేకులు మెచ్చెడిసత్ప్రవర్తనం
బొదవఁగఁ "దండ్రికన్న నితఁ డొక్కట లోఁగఁ" డటన్న ఖ్యాతికిన్
గుదురయి తల్లిగారి కనుకూలుఁడునై సతికిం గుతూహలా
స్పదుఁడయి జాగరూకుఁడయి సంసృతిఁ జక్కఁగఁ బెట్టె నొప్పుగన్. 101

సీ. అగ్రహారమునుండి యరుదెంచురైతులఁ
గని వారి కష్టసుఖమ్ము లడుగు

నడిగి వారలు చెప్పు నాయా యి సంగతుల్
వివి శిష్టులోఁ గొంత విడిచిపెట్టిఁ
బెట్టి యింకను గవిపెట్టఁగావలసినఁ
బెట్టుఁబడికిఁ గొంత విత్తమిచ్చు
నిచ్చి యయ్యెం పంట వచ్చు కారున నొంటొ
రులకు బంపక తాన యూధి నరుగు

గీ. నరిగి దాదాపు భూము లేమైన నమ్మ
కమునకరుదేరఁ దప్పక క్రయమొనర్చు
విచ్చు నార్జించుసకలమ్ము "నితనికన్న
జాగరూకులు లే" రని జనులు మెచ్చ. 102

తే. గీ. ఎవ్వ రెవరికిఁ దండ్రి యేయేవిధమున
వార్షికములిచ్చుఁ దాఁ బ్రతివత్సరంబు
మఱియు నెవ్వరి నేరీతిమనుచు నితఁడు
నంతకెక్కుడుగాఁజూచు నన్నియెడల. 103

మ. వ్యవహారమ్మను జక్కఁబెట్టుకొను, భృత్యవ్రాతమున్ బ్రోచు, న
వ్యవహారమ్మొనరింపఁ డెన్నఁడును దేవార్చా విహీనమ్ముగా,
సపముల్ సేసెడివారి కిచ్చు, మఱియున్ పత్రమ్ములం గల్గు లో
పవిఘుల్ దీర్చుఁ, బురాణమున్ విను మదప్రాగ్భారమూరాత్ముఁడై. 104

శా. "ఐశ్వర్య మ్మధికమ్ము గల్గియును గర్వాంధత్వమున్ లేక యీ
విశ్వమ్మెల్ల నుతింప మున్ బ్రవరుఁ డావిఖ్యాత సత్కీర్తియై
శశ్వత్కర్మ విధాతయై నెగడెఁ దత్సామ్య మ్ముదారుండు దా
విశ్వాసమ్మునఁ గైకొనంగలఁడు" నా వేత్తృత్వ పర్యాప్తుఁడై. 105

చ. మెలఁగెడి యయ్యుదారునకు మేటిగఁ జిన్నతనమ్మునుండి యిం
పులు గులుకంగఁ బాడునెడఁ బూరుషులైన వెలందులైన మి
క్కిలిగను నాదరించు టది కేవలమున్ సహజప్రచారమై
యలవడి యంతకంత కది యంతును బంతును లేక వర్ధిలెన్. 106

సీ. "వెంగుళూరున నుండుభీమసానికొమార్త
వీణలో నెంతేని జాణ" యనుచు
"మచిలీపురమునఁ బెమ్మాసానిమనుమరా
లభినయమ్మునఁ గడునధిక" యనుచుఁ
"గద్దాలిలోన వెంకాసానిచెలియలు
సాహిత్యమున మేటిచతుర" యనుచు
"బళ్ళారిలోనఁ బాపాసాని చదరంగ
మున జూదమునఁ బేరు గనిన" దనుచు
గీ. "కామశాస్త్రప్రశంసయు గాత్రపుఁజవి
చెన్నపురిసానులకు వన్నెచిన్నె" లనుచుఁ
దఱచు నాథానరసికు లాతనిసమీప
మునఁ బొగడుచుండ్రు గానంపువినికిఁ దెలిపి. 107

చ. వినివిని వాఁడునాఁటికిని వెఱ్ఱి శిరమ్మునకెక్కి యేదియో
పనినెపమూని వాండ్రు గలపట్టణముల్ గనసూహ సేయు, నం
తన "చననేల యియ్యెడకె తాఁ బిలిపించిన రారె" యంచు నె
మ్మనమున నెంచు "నట్లయిన మాత కనిష్ట" మటంచు లోఁ గసుక్.

మ. అతఁ డీరీతిని గానమందు ఘనమౌనాసక్తి దీపింప నా
త్మ తదీయంబుగ దానికై యధికమౌ ద్రవ్యమ్ము వెచ్చించుచు__
గుతుక మ్మొప్పఁగ నభ్యసించుచును దక్కంగల్గు కార్యమ్ములన్
మఱి పోనీయక తన్మయుండగుచు నున్మత్తాత్ముఁడై వర్తిలున్. 109

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
పాణిగృహీతయందుఁ బ్రథమాశ్వాసము.

———

# పాణిగృహీత



## ద్వితీయాశ్వాసము.

క. శ్రీపుచ్చాకులదీపక !
కోపాదికదూర! గానకోవిద! సుయశః
పాత్రిపర! దాతృత్వగుణ
శ్రీపూరిత! నిత్యసదయ! సీతారామా! 1

తే. గీ. అపహరింపు మనంతరం బంత సకల
కుసుమసంపత్తులకు మేలికోర్కెయగుచుఁ
బస గలుగుదంపతుల పాలిపంటయగుచు
నలమె నెల్లయెడల వసంతాగమమ్ము. 2

శా. అక్కాలమ్మున నాతఁ డెయ్యదియొ కార్యం బుండుటంబట్టి తా
నక్కార్యమ్మును దల్లికిం దెలిపి యా యంగీకృతిం బొంది యొ
ప్పక్కన్ బాయని ముద్దరాలిఁ దనభార్యన్ మేల్మినొప్పించి తా
నొక్కండున్ జనె భాగధేయపుర మత్యుత్సాహ పర్యాప్తుఁడై. 3

ఉ. ఆపురిలోన నాటకము లాడెడిశాలలు పెక్కులుంటఁ దా
నేపని కేగె నట్టిపని యెల్లను దీరినమీఁదనైనఁ దో
నోపక నాటకమ్ములను నొప్పుగఁ జూచుచు గానపుంజపుల్
బాపురె! యంచు మెచ్చుచును బాడెడివారలఁ గూడిమాడుచున్. 4

మ. తనయూరిన్ దనయిల్లు వాకిలియు నాత్మద్రివ్యసంపత్తియున్
దనయిల్లాలిని దల్లినిన్ దనదుర్భృత్యవ్రాతమున్ జిత్తమం
దునవైనన్ దలపోయ కెల్లపుడు సంతోషప్రదంబైన గీ
తనినాదామృతవార్ధిలో మునిఁగి యీఁదన్ దొచ్చె నశ్రాంతమున్. 5

క, గానంపువినికినెపమున
మానము మర్యాద యనుచు మతినెంచక యా

యానిచులతో వేశ్యల
వైన గృహమ్ములకు నేగు నహరహ మతఁడున్. 6

మ. ధనవంతుండఁట! రూపవంతుఁడఁట! విద్యావంతుఁ డౌవాఁడఁ పే
ధననారీమణి వానిఁ జూచి మదిలోఁ దాత్పర్యమున్బూన దై
నను నాతం డొకకొంతకాల మటు గానం బానుపేకాని య
క్కానరాంగీకుచకుంభసంభృతులకుం గాఁడయ్యె లోలాత్ముఁడై. 7

సీ. "ఇతఁ డబ్బుచో నాదుసుతకు నెల్లిండికే
చేయింప లేనె? కాంచీకలాప
మతిపురాతన మైనయట్టి నాయిలు మేడ
గాకుండునె? యితండు కన్నెకైన
సీ యమాయికుఁడు మాయేణాక్షి నెనసిన
మఱునాఁడు గొనవచ్చు మాన్యభూమి
ధనమునకేమి యీతం డొప్పుకొన్నచో
నూరక నాకూఁతు నొసఁగు దాన"

తే. గీ. నిట్లు వృద్ధవేశ్యలు తమయెడఁదలందు
"నెవ్వతె గృహమ్మ నోఁచెనో యిట్టిభాగ్య
మున" కటంచు మాటికిఁ బ్రశంసనుబొనర్ప
దిరుగు నాతఁడు మిత్రులఁ దఱచుగూడి. 8

ఉ. మున్నరికమ్మనున్ వయసుమున్వను మేనిహారంగు వేసవుం
జెన్నును గాంచి యెంతయును జిన్నెలు వన్నెలు వొల్చుబోగపుం
గన్నెలు "వీనివంటి యెసకమ్మనఁ బొల్చెడి కోడెకాండ్రు లే,
రెన్నఁగ దేనికబ్బునొకొ యిట్టి బొజుంగులఁగూడు భాగ్యముల్. 9

ఉ. పాడుకొలమ్మనన్ బొడమి పైక మొసంగినవానికెల్లఁ దా
సూడిగముల్ బొనర్చుచు నయోమయ మైనమనమ్ము దాల్చురో
చేడెల పుట్టువుల్ ఫలముచెందఁగ నెక్కడనో యొకండు చే
కూడు విటాళిలోఁ గొలము గొప్పసిరుల్ గలయిట్టివాఁ డొగిన్. 10

సీ. గానమ్మునం దింతకాంక్షగల్గిన వాని
కేల లేకుండుఁబో! యింతులందు
తేకేమి, యేలేమ లీల లాతని మది
యందు నచ్చెనో యెట్టు లరయవచ్చు ?
ముందేమొకాని యేపూవుఁబోఁడికిని ని
ప్పటికిఁ జిక్కెనటంచుఁ బలుకరాదు
గా నాభినయము లాకాంక్షించినంతనే
వ్యభిచారి యనుటయు వలనుపడదు

తే. గీ. ఇల్లలికినంతనే పండు వెట్టులగును ?
నావగింజను నరభాగ మైనఁ గాదు
విందుమో, కందుమో ! వీనివిధము నేఁట
రేపటను, డాఁగునే ? లంటె కాఁపురములు." 11

వ. అనుచుఁ బ్రసంగించుకొనుచుండురఁట. ఇది యిట్టులుండ,

చ. "నిను మదిఁగోరి యుంటి నిదినిక్కము నమ్మ" మటంచు నెన్నియో
తనమదికోరికల్ మృదుపదమ్ములతోడ లిఖించి యంతలో
నన తెలివొంది "యేకాలము నాతికి నియ్యది గొప్పతప్పు, దా
సను జెడఁబుట్టి రిక్కాలమునంగల యంగన లిట్టిపట్టునన్. 12

ఉ. నా కితఁడే వశుండయిన నాకొలపుం గొనముల్ త్యజించి యీ
శోకదలెల్లఁ బోరడచి పూవిలుకానిఋణమ్ము దీర్చుచున్
రాఁకలు పోఁకలున్ మఱచి రాణిగఁ దద్గృహమందె యుందు నీ
చాకలి మంగలిన్ దనుపు చావునతున్ దుది గల్గఁజేయుచున్." 13

ఉ. ఈగతి నుల్కినట్టి తరళేక్షణయున్, మది మల్కి యాతనిన్
లోఁగొను వట్టిమార్గమును లోఁ దలపోయని చారుగాత్రియున్,
సాగ దటంచుఁ జింతిలనివానయు నొక్కతెయేని లేదఁ పే
రాగము లేనిమోను లనురాగము గాంచరె? యొక్కపట్టునన్. 14

ఉ. అం దొకసుందరాంగి జలజాక్షి యనన్ జను వన్నెలాఁడి తా
నెందు స్వవిద్యలందుఁ గడు నెన్నికగాంచిన యెమ్మెలాఁడి వా
నిం దనవీధి నేగుతఱి నిక్కి కనుంగొని లోఁ గొనంగ నెం
చెం దననీచజన్మ మది శ్రేష్ఠత కాకరమై చెలంగఁగన్. 15

తే. గీ. ఎంచి తనమదిలోన యోజించి తనకుఁ
దగినమేటి యుపాయ మొదవమి జాణ
గానఁ దనకెంతయును వశుఁడైనయొక్క
విటునితో మంతనమునఁ దా నిటులు పలికె. 16

ఉ. కన్నెఱికమ్ము గాకమును కామ మొకించుక లేనియప్పుడే
పిన్నతనమ్మునన్ మిగులఁ బెంకెతన మ్మలరారునన్ను లోఁ
గొన్న విటాగ్రిగణ్యుఁడవు కోటు లొసంగియు నాఋణమ్ము, నీ
వెన్నఁడు దీర్పనేర, విటు లెవ్వతె నిన్ను గణించుఁ? జెప్పుమీ. 17

క. నగలా! నాణెములా: యే
వగలాఁడికి నైనఁగాని వలపు నిలుచునే?
మగనాలికన్న హీనవె?
నగరే నను నాకొలమ్మునం గలకన్నెల్? 18

ఉ. పిన్నటనాఁట నన్నుఁ గొని పెంచినతల్లి ఋణమ్ము దీర్చితో!
కన్నెఱికమ్మునాఁడు నొకకానును గొంగునఁ గట్టనేర్చితో!
వన్నెలుఁ జిన్నెలున్ గలుగ వచ్చెనె భాగ్యము? తేర కాఁడ! ని
న్నెన్నఁ బనేమి? నాదుమననే కడుమెత్తని దెన్నిభంగులన్. 19

ఉ. తల్లియుఁ దల్లితల్లియును దజ్జనయిత్రియు నెన్నికొంపలో
గుల్లలుచేసి గుట్టు లిడికొన్నధన మ్మది యెల్ల నల్లముం
బెల్లముగాక నీకతన మెల్లఁగ దొల్లఁగఁజొచ్చె; నింతకున్
దల్లికిఁ గాని పోకిళులఁ దాఁ జను రోచెలి పేరు దెచ్చునే! 20

శా. "అమ్మా! అంకుమగండు పీపుమను దా నావంతయున్ దుల్పఁడే
నమ్మంబోకుము రాజునైన నొరు నైనంగాని నీచేతిలో

సొమ్ముం బెట్టిననాఁడు దక్క మొగమున్ జూపెట్టరే" యంచు నే
త్పై మ్మాయల్, చెవి నిల్లు గట్టుకొని పోరెగా, దల్లి నిన్పాపఁగగా. 21

ఉ. ఐన నదేమొ నీ వనిన నావల వేలకువేలు వచ్చినన్
గాని వృథాపరియాస మిటుఁ గన్పడినన్ మన మింద చచ్చుఁ, బో
నీ నెల కొక్కరూపికయు నీ విడనెంచ విఁ కెన్ని నాళ్ళు వి
న్నాని చరింతుఁ ? దల్లియును నున్నకుటుంబముఁ దిట్టిపోయఁగన్. 22

ఉ. ఈపురిలోని మూకులమునింతులయం దొకవిద్దెఁ గాదుసూ:
రూపమునందు నేరుపున రూఢిగ నా కెనయైన చాన నీ
వే పరికింపు మందఱును వేలకువేలు ధనమ్ము గూర్చి రే
నే పదదైతి నీకతన, నీవును రా విఁకఁ గొన్ని నాళ్ళకున్. 23

తే. గీ. జనని నానంద మొనరింపఁ జాలనైతిఁ
గొలమువారలలోఁ బెద్దకూళనైతి
బేలనై సరివారలఁ బోలనైతి
నేల వేయును ? నీకై యిల్లాలనైతి. 24

చ. ఇతరకులమ్మునం బొదమునింతులఁ బిన్నటినాఁడ తెచ్చి పెం
చి తగిన విద్దె బుద్ధియును జెప్పియు నొండొకజాతిపుర్వు యుం
వృత్తుల నకుల్ స్వజాతి నలరించినభంగిని సానిఁ జేయ నా
పతి తమ కర్త దెంతయును సానులకున్ దలవంపు నింపుచున్. 25

చ. అనుచు నొకప్పుడున్ వినని యప్పలుకుల్ చెవి సోఁకినంత న
వ్వనితకు దానుఁడైన విటవల్లభుఁ దల్లన గుండె జల్లనన్
గన లుదయింప నాఁచికొని కాదని యౌనని పల్కలేక లో
నసుకొనె నిట్లు "సీ: పడపుటంగన లిట్టిరె యేరికేనియున్. 26

చ. ననుఁ గని కాని భోజన మొనర్పదు న న్విడికాని యన్యమున్
విన దొకవేళనైన నను వీడి యొఱుంగదు గర్వ మన్నమా
టన వినరాదు దీనిహృదయం బిపు డెంతటిలోన మారె, "రో
వనితల పేర్మి కల్ల" యనువార్త లసత్యము లెట్టులౌ భువిన్? 27

చ. జనని యొనర్చుబోధములచందము దాఁ దలకెక్కి యుండునా?
తన చెలికత్తియల్ సలుపుతంత్రము లాత్మఁ గలంచియుండునా?
ననుఁ దలఁదాఁటు నింక నొకనాయకునిన్ వరియించి యుండునా?
కనికర మింతలేక యిటు కాఱులు ప్రేలుట కేమిహేతువో! 28

చ. తనపసిప్రాయమందు విటు దైవముగాఁ గనునవ్వేలందియే
చనఁ జన మోటువాటి యొకచందమునన్ గనుఁ, జుల్కఁజూచు, లొం
గినకొలఁదిన్ మఱింత వణకించును, సేవకుకన్న హీనుఁ గాఁ
గను నిది తుచ్ఛజాతులకుఁ గాక మఱొక్కరుఁ గల్గ నేర్చునే." 29

వ. అని యచ్చెలి నుద్దేశించి.

తే. గీ. అడిగినను వచ్చు ద్రవ్యమ్ము లడుగకున్న
రాకపోవునె? మర్యాద రాదుగాని
మగువ! "యేడ్చినదానికి మగఁడువచ్చి
యేకులొడికినదానికి రాకపోఁడు."

తే. గీ. మొదలఁ దా నెంతచేసినఁ దుదకునొక్క
మాటతో నదియెల్లను మట్టుపడును
వినవె? యీసామెతనునీవు వనజనయన!
"నూఱునోములు ఒంకతోఁ దీఱిపోవె" 31

చ. ధన మనుమాట వేశ్యయనుదానికిఁ దోడన నీడవోలె నుం
డినయదియే నయంబుగ గడింపవలెన్ సమయమ్ముచూచి, యీ
వినయపు డావు పాలిడదె? నీటి నొసంగవె వర్ష కాలమం
దున జలదమ్ము? లింత మదిఁ దోఁచనిదానికిఁ జెప్పనేటికిన్? 32

క. అన జలజాక్షియు మోమున
నునునగవు సెలంగ "నోయనుంగుబోఁటిగా!
నిను ధన మిమ్మనుటకు పె
ట్టినె! యెక్కడఁదెత్తు? వది, యెఱింగింపుమొగిన్. 33

వ. ఇట్టిపట్టునఁ గృష్ణునకు నొక గొల్లచేడియ చెప్పిన సమాధానమ్ము గల
దాకర్ణింపుము.

మ. జనన మ్మాదిగఁ బొట్టనించితివిగా చౌర్యమ్మె కార్యమ్ముగా ?
ధన మెక్కింతయు నీయకే పరిజనతీదాంపత్యముల్ గొన్న నీ
జనసంబుల్ పదికోటు లీబుణము దీర్చన్నేర్చునే ? యట్టి నీ
కను నేమున్నది ? యేమొసంగెద ? వహో ! గోపాలచూడామణీ." 35

వ. అని యాజలజాక్షి యతనిన్ గొంతబుజ్జగించి మఱియును. 36

మత్తకోకిల. "గాన మన్ మిషచేతఁ గొందఱఁ గన్నెలన్ పలపించియా
పైని నాట్యమటంచుఁ గొందఱ బాలలన్ గికురించియున్
సూనబాణకళాపరిపీణతఁ జూపి కొందఱఁ బ్రోడలన్
మానభంగ మొనర్చునీవును మా కొసంగెడి దేమిటో ! 37

ఉ. కావున నిన్ను నేను ధనకాంక్షమెయిన్ జిననాఁటనుండియున్
బూవిలుకానిముచ్చటలఁ బొందఁగలే దిది నిక్కువంబు, నే
నేవిధినైన జన్మమిది యెంతకునుండునొ యంతవట్టు నీ
తో విడకుండుటే నిజము తొంబడివిఘ్నము లిందు వచ్చినన్. 38

క. మనచెలిమికి భంగ మ్మెం
దును గల్గకయుండునట్టి త్రోవను ద్రవ్యం
బును నార్జింపఁగవలె; నే
మున ద్రవ్యము లేమి నెట్టులగుఁ బోషణముల్ ? 39

ఆ. వె. "కూరుచుండి తినిన గుబ్బగోపురములు
నాట" వెన్నినాళ్ల కగును వింట
మన్నద్రవ్య? మింక నొండొక్కసదుపాయ
మెద్దియేనిఁ జూచుటే హితంబు. 40

క. ధన మెంత నీవొసంగినఁ
గొన, నది యేమంటివేని, గూఢమ్ముగు వ
ర్తన గల్గుప్రియునిపై మన
మొనసినగతి నుంచుకొవిన వెనయుదు వింటే. 41

ఉ. ఎంతధన మ్మొసంగినను నెన్నిసగల్ మెయినిండ వైచినన్
గాంతుఁ డొకండు పేఁడొకఁడు గావలె నిష్టుఁడు లోవెలంది కీ

యింతుల మర్మకర్మము లొకింత యెఱుంగ రహో! జమీనుదా
ర్లంతిపురమ్ములం దిడుదు రందును మానవు మా ప్రవర్తనల్. 42

గీ. అభినయమటంచునో గానమనియొ వైద్య
మనియొ మఱియెద్దియోమిష యనువుపఱచి
తనకుఁ బ్రియుఁడగువాని నంతఃపురమున
కళ్ళిమమ్మన రప్పింతు రజ్జముఖులు. 43

క. అది యేమికర్మమో! తొం
బదిలక్ష లొసంగెనేని మదనుండేనిన్
గుదురదు మన మిక్కాంతల,
కద నెఱిఁగినయట్టివిటునియందుం బోలెన్. 44

మ. ఇదియే నిక్కముగాకయున్న విను మీ వీయూరనేకాదు తొం
బదియూళ్ళన్ గనుఁగొమ్ము ద్రివ్యమహితుల్ మాజాతి పూఁబోణులన్
బదిల ష్మొగతి నుంచుకొంటయును నప్పద్మాక్షు లింకొక్కనిన్
గదిసిన్ చూతిక నంపి తెచ్చుకొనుటే గన్పట్టు నీ కెల్లెడన్. 45

ఉ. కొందఱుపెట్టు లయ్యెడలఁ గొండొకమానిసి ద్వారమందుఁ గా
పుం దగుఁజీత మిచ్చి యిడిపోదురు; వాని కొకింత యిచ్చినన్
జందనగంధికిన్ విటునిఁ జయ్యన వాఁ డొనఁగూర్చుఁ; గొన్నిచో
ట్లం దగ వాఁడె యా విటుఁడు; లంజెలనైజము లెన్న నేటికిన్. 46

ఉ. నమ్మవుగాని నీకు నొకనాతిచమత్కృతి చెప్పుదాన మా
యిమ్మన కావలన్ గల మృగేక్షణ నాథుఁడు శయ్య నుండఁగా
నమ్మకచెల్ల! యింకొకని నచ్చటనే రతిఁ దేల్చె విద్రి వోఁ
డమ్మహితుండు దీపమును నాఱదు కాంతల కెంత లిప్పనుల్. 47

చ. ఒక వెలచానచేయనుచు నూహ యొనర్పకు స్త్రీలజాతికే
సుకరము మాయ, యందు వెలనుందరు లిందులకై జనించుటన్
బ్రిరటన కెక్కెనేనియును బాధయు నంతగ లేమిఁ జేతు రి
ట్టి కుటిల కృత్యముల్ విటు నటింపఁగఁ జేతురు కీలుబొమ్మగన్.''48

ఉ. నావుడు నాతఁ డిట్టులను "నాతిరో! పిన్నటినాఁటనుండి మీ
రోవెలఁదుల్ పొనర్చు పలురోఁతలు నేను నెఱుంగువాఁడ నీ
వేవిధి బోధచేసెదవొ యేర్పడఁ జెప్పుము ద్రవ్య మాగతం
బౌపల, నద్ది యెట్టిదియునైనఁ బొనర్చెద శంకఁ దక్కుచున్." 49

క. అన జలజాక్షియు మనమునఁ
దనకోరిక సెల్లునని ముదం బందుచు నే
ర్పున నిట్టులనియె దాని ర
వన నేమిట నవ్విధాత సరిపెఢా బళిరే! 50

చ. "అరసితిఁగాదె! నీ వల యుదారుని, నాతఁడు మేటిసంపదన్
ధరణిపునంతవాఁడఁట! యుదారత నామమె చెప్పుచుండ నొం
డొరులు వచింపనేల? యతఁ డొక్కొకనాఁ డొకనాతియింటి చే
గి రహిని గానమున్ వినెడి కీలది నీవు నెఱుంగ కుందువే. 51

తే. గీ. ఇప్పటికి దేనియందు నయ్యెమ్మెకాని
మది లగింపమి నిక్కువం బదియు నొక్క
దిముసమున నేను లోఁగొందు నీకునాదుఁ
దగినద్రవ్యమ్ము నార్జింతు దానఁజేసి. 52

క. కావున నాతనితోఁ జన
వేవిధముననైనఁ జేసి యియ్యెడ కతనిన్
రాపింపుము తక్కినపని
నీ వేమియుఁ జేయవలదు నేన యెఱుఁగుదున్. 53

ఆ. వె. అతని తగులు గాంచి యామీఁద నీమీఁది
పేర్మి విడుతు నంచు భీతి నీకు
లేశమైన వలదు, లేఁబ్రాయమునఁ దగు
లొక్కన్నవాని విడుచుగోల గలదె! 54

చ. అతఁ డొకవేళ నన్నుఁ దనయంతిపురమ్మున నుండఁజేసి భృ
త్యతతులఁ గాపువెట్టినను దప్పక నాదగు నేర్పుకల్మి నీ

కుతుకము వెట్టులేని సమకూర్చెద వేయునునేల? వాని "నా
ప్రీతి" ననిపించెదన్ వలపుఁ బెంచి క్రమమ్ముగ నీసురాకకున్." 55

క. అనవుడు నాతఁడు తనదువ
దన మించుకఁ జేసికొనియు ధన మీలేమిన్
దన కది యీగతికిన్ ద
క్కినఁ దక్కు దటంచు నెంచి కీలెఱిఁగి యొగిన్. 56

ఆ. వె. అది యకృత్యమగుట నాత్మ నెఱింగియు
దానివలనఁ గలుగుతగులుత్రిప్పు
కొనఁగలేక "వల్లె" యని యొప్పుకొనియె నే
పనికిఁ దుచ్ఛవిటులు పాలుపడరు! 57

తే. గీ. రాణి నొరుఁ గూర్చె మున్ను భళ్ళాణనృపతి
తనసతికిఁ దాన దూతయై చనియె నలుఁడు
పరుఁ గవయఁ బొందుఁ డిదె నాజ్ఞ భార్య, కంత
కన్న ఘనుఁడనె? యిది భార్య గాదు నాకు. 58

క. అని మనము సమాధానం
బును బొందఁగఁ జేసికొని సుముఖుఁడై మెలమె
ల్లనఁ జని యొకదినమున ని
ట్లనియె నుదారుఁ గని మైత్రియలవడుకతనన్. 59

మ. "తమ రీయూరికి వచ్చు కార్యమది సొంతం బాయెనే? యేవిశే
షము లీపట్టనమందుఁ గాంచితిరి? వాస మ్మిచ్చటన్ మీకు సౌ
ఖ్యముగా నున్నదియే? యిటన్ దమరు నింకన్ గొన్నినా ళ్లుందురే?
తమ రేగన్ మముబోఁటిమిత్రులకుఁ జింతల్ సెప్పఁగా శక్యమే. 60

శా. గానమ్మున్ వినుచుంటి రొఁగద! సమగ్రప్రజ్ఞ యద్దాన నే
మీనాక్షీమణి కొప్పు? నాట్యముననేమీ యన్యమందేమి యే
లేమేనాశికముఖుల్ నుతింపఁ దగువా రీవీట? మీవీటిలో
నీనాట్యాభినయాదికమ్ములకు హాయిన్ జెందువా రుందురే?" 61

చ. అనవుడు "గానమందుఁ గల రంగన లయ్యెడ నెంద తెలంపతో
యనుకృతికైన లే దభినయమ్మన కొక్కతె మాపురమ్మునం
దున ననసేల, దేశమది దుర్గతిభాజన; మొక్కదీనిదే
వినికిమెకాని యియ్యెడ వివేకిని గన్పడ దందు నెందునున్. 62

క. నెలనుండి యెంద తెందతొ
యెలనాఁగలఁ జూచుచుంటి నించుక గానం
బలవడుపె కాని యభినయ
మొలయదు మాదేశ మిదియు నొక్కతె తలఁపన్. 63

క. వినియుంటిఁ బ్రసంగముపళ
మున మును నీపట్టణమున ముగుద యొకతె చ
క్కనిరీతి నభినయమ్మునఁ
బనిసేయు నటంచు దాని వలయున్ జూడన్. 64

తే. గీ. దాని నామమ్ము మఱచితిఁగాని యంత
సుప్రసిద్ధకుఁ బేరేల ? సొగసునకును
నదియె తగినదియఁట, యించుకంత కవన
మల్లునఁట, యెంతనిజమొ యీయంశములను ? 65

క. దూరపుఁ గొండలు నునుపను
తీరో మఱియేమొ యాసతికి నభినయమం
దేరాములు సరిరా రని
పేరు గలదు దానికచటఁ బెద్దగ" ననుడున్. 66

క. విని వెదకఁ బోవు తీవియ
దన కాళ్ళకుఁ దగిలిన ట్లతఁడు సంతోష
మ్మును గని "యది యొక్కతెయే
చను నీపురిలోని సానిజాతికిఁ దొడవై. 67

తే. గీ. అందమునకిక్క మరియాదలందులెక్క
యభినయపుదీవి, నడివయసమరుతీవి

గానమునవీణ, మేల్కావనానజాణ
సంపదకుమేటి, దానికేచాన సాటి ? 68

క. చిన్నప్పటినుండియు న
క్కన్నియ నెఱుఁగుదును నేను గలకలనగవుం
జెన్నగు నెమ్మోమున కొక
వన్నెయిడున్ మృదుల మధుర వచనపురచనల్. 69

తే. గీ. బాల్యమునుమెట్టి మెడఁబట్టి బైటఁగొట్టి
యౌవనమురా భయమ్మున ననఁగఁజెలికి
చనులుచంకలదూఱెను గనులుచెవుల
దూఱె నడుమెటకేగెనో తోఁచ దహహ ! 70

సీ. మనసుదీఱఁగ నొక్కమాఱు చూచిన గండ
శిలలకైనను గుండజల జనించుఁ
జనవుమీఱఁగ నొక్కసారి ముట్టిన నుక్కు
కంబాలకును బులుకలు పొసంగుఁ
గులుకుచు నొకసారి పలుకరించినఁ బిచ్చ
వానికైనను గచ్చ వదలిపోవుఁ
బదనుగానొకమాఱు భావమ్ముసూచింప
బమ్మకైనను బుట్టు రిమ్మతెవులు
గీ. మురువుమురిసిన ముద్దులు మూటగట్టుఁ
బలుకుపలికినఁ దేనెలవానగురియు
నవ్వునవ్విన నోట రత్నాలురాలు
కలితలావణ్యపేటి యక్కామఘోటి. 71

సీ. బిబ్బోకవతి గబ్బిగుబ్బదోయినిఁ జూడ
మతిమాలి బతిమాలు యతియు రతికి
ఉడురాజముఖి కంటఁబడి దానిజడఁజూడ
జడదారి పెడదారిఁ జనఁగఁ దివురు

కన్నెమిన్న బెడంగుకన్నుసన్నలు గన్నఁ
 గన్నవాఁడును దాల్మి మన్నఁజేయుఁ
గల్కిముద్దులుగుల్కు చిల్కపల్కులకుల్కి
 పల్కరింపఁగఁజూచుఁ గల్కియైన
తే. గీ. నొంటిపాటునఁ జెలి కడనుండె నేసి
 దత్తరమ్మున వేదాంతి మెత్తపడును
 జెలిశరీరమ్ము నొకపరి చే స్పృశింపఁ
 బుంస్త్వ మొదవింపఁజేయు నపుంసకునకు. 72

ఉ. చామనచాయయున్ మిగులఁ జక్కనిచన్గవ లేడిచూపు ల
 క్కామునికైనను న్ వికృతి గల్పనఁజేసెడి పోయగమ్ము లీ
 లామధురోక్తిచాతురి కలాకలనమ్ము బెడంగుఁ బ్రాయమున్
 మోము నొయారమున్ భువనమోహనమై తగు నవ్వెలందికిన్. 73

తే. గీ. పేరు జలజాక్షి యది నేతిబీఱకాయ
 గాదు జలజమ్ములను దెచ్చి కమలసూతి
 తాపదము సేయు శిల్పివిధమ్ము దోఁప
 నతిరె మోమున నసుటొక్క యర్కజింపె." 74

తే. గీ. అన నుదారుండు పల్కు "నీ యక్షరములె
 మున్ను నే విన్న యవియు నక్కన్నె కడకు
 మనము పోవచ్చునో? దాని మనుఁ డెవఁడును
 బెట్టికొనియుండఁడో? వాని పట్టు లేదొ?" 75

చ. అన సఖుఁ డిట్లు పల్కు "నది యాహొలమందునఁ బుట్టఁదగ్గజ
 ప్వని యని యెంచఁబోకుఁడు ధ్రువమ్ముగఁ బూరుగుతోఁటలోని చం
 దనలతయున్ గలంజపువనమ్మున నౌతులసీమతల్లి, దా
 ని నవతచందమున్ వినుతు నిక్కము మీమన మక్కజింపడన్. 76

ఉ. కన్నెతిక మ్మొకానొకఁడు గైకొని వాని యదృష్ట మెట్టిదో
 చెన్నఁటివాదు తప్ప నలచేడియ యెవ్వరొ వాఁడెఱుంగఁ; దా

చిన్నియొయారి యాపయిని సీ! యని యెందులకో విరక్తిలోఁ
గొన్నదివోలెఁ గైకొనదు కోటు లొసంగెడివాఁడు వచ్చినన్. 77

ఉ. దానికిఁబ్రియ మియ్యెడల దగ్గఱదగ్గఱ నిర్వదేఁడు లే
మానిని యుండు నిట్టికిఁబ్రియ మానవలోకమునందుఁ? దన్మనం
బేనరనాథసూనుపయి నేర్పడియుండెనొ? యెందుకోప మీ
మౌనము తాల్చెనో? యొరులమానస మేగతిఁ గాననయ్యెడిన్. 78

సీ. ప్రార్థనరీతిగాఁ బద్యమ్ములనువ్రాసి
"వ్రాయుమీ జా" బంచుఁ బంపువారు
యుత్తరమ్మును వ్రాయకుండి యెచ్చటనైనఁ
గనుపడ్డఁ "గరుణ లే" దనెడివారు
లేనిపోనిపని గల్పించుక యింటిచు
ట్టును బడి తిరుగాడి చనెడివారు
అంగీకరింప లేదనెడి కోపముచేత
గోడకుఁ గాగితాల్ గొట్టువారు

తే. గీ. ఇంటిపై బెద్దలనుపైచి యేగువారు
గొట్టవలెనంచు లోలోన గొణుగువారు
నై తుదకు దానిపొందుఁ దామందలేక
విసివి వదలిరి యాజోలి వీటివిటులు. 79

మ. ఎవనిన్ ధన్యునిఁ జేయనున్నదియొ, తానెవ్వాని తారుణ్యమున్
గవివర్ణ్యం బొనరింపనున్నదియొ, యే కాంతాశిరోరత్నమున్
సవతాలై యుడికింపనున్నదియొ, యేసారజ్ఞు సంసారసా
రవిహీనత్వము వాపనున్నదియొ! నేరంబోల దూహింపఁగన్." 80

క. అనవుడుఁ "దాదృశగుణగణ
ఘనిఁ గనుఁగొనుటయును గొంత గణనీయమె నీ
వెనువెంట నెప్పుడేనియుఁ
జనుదెంచెదఁ దెల్పు తగిన సమయ" మ్మనుడున్. 81

క. "కనుఁగొని తెల్పెద" నని యా
జనపంచకుఁ డరిగె; దాని చక్కఁదనము నె
మ్మనమున నాటుకతన నూ
లసమాంద్య మ్మయ్యుదారు దరి కరుదెంచెన్. 82

క. దానియిలు చేరినట్లి
ట్టానిన్ గనుఁగొనినయట్లు దానిచతురతన్
దా నోడినట్లు మనమున
దానింగను దానివెంచు దాని నుతించున్. 83

తే. గీ. మునుపు వినినప్పుడే కొంత మొలకగనిన
వాని యనురాగవృక్ష మిప్పానికతన
నిపుడు తిరిగియు వింటచే నెదిగి వింత
సరణి నొక్కింత శాఖోపశాఖ లలమె. 84

వ. అట్టియెడ నింతకుమున్ను జలజాక్షి గుఱించి పరికింపించిన పంచకున
కొక్కింత శతురివగు మఱియొక్క విటుం డిట్లను. 85

తే. గీ. ఎవనితోఁ నెప్పుఁడేనిఁ దన్నించుకంత
యడుగకున్నప్డు మంచియే యగునుగాక
చెట్టయగుఁగాక తనయంతఁజెప్పఁబోడఁగు
వానికన్నను బేల యెందైనఁ గలఁడె? 86

క. ఐనను మీశ్రీయన్ను ప్ర
ధానముగాఁ గోరి మీదుతలఁపెక్కంగా
వానేర్చినంతలో మీ
కేనొక సంగతినిచెప్ప నెంచితినిజుఁడీ. 87

క. విటవర్తనలోఁ జిన్న
ప్పటినుండియుఁ దిరిగి దానఁ బడుపాటుల నొ
క్కటియున్న దక్కఁక యెఱిఁగిన
పటుమతి నని నన్నెఱుంగపలయును మీరల్. 88

క. విధవలనేకులు గల రా
విధవలలో నధమమైన వేశ్యఁ దగులు దు
ర్విధము గలవాఁడె మొదలిటి
విధవ మదీయానుభవము వినిచెదఁజుండీ! 89

క. ప్రేమ మొకించుక లేకయె
కామముగల వనితవలెనె కాసునకై తా
నోముసుతునైనఁ గూడెడి
సామాన్యం గూడువాని జన్మము ఘనమే? 90

తే. గీ. ఇహపరమ్ముల నెఱుఁగని హీనమతులు
కష్టసుఖముల నెఱుఁగని కఠినమతులు
మానమర్యాదలెఱుఁగని మందమతులు
తక్క వెలవెలఁదుల పొందు దలఁపఁ దెందు. 91

ఉ. చండుగ ద్రోహమూది నిజధర్మములున్ విడనాడి బోగపున్
ముండలతోడఁ బోవుటకు బుద్ధిని బ్రేరణ చేయుచున్న యా
రండలకొడ్కు దానికి సరాసరిగా ధనమీయకున్న బ్ర
హ్మాండము మున్గిపోయినటు లాపయి నేడ్చును సర్వశూన్యుఁడై. 92

ఆ. వె. ఉండఁ గొంపలేక, పండఁ బానుపులేక
ముండకిచ్చుటకును ముడుపు లేక
మొండితనముపూని దండివార మటంచు
బండవిటులు దిరుగుచుండఁ గనమె! 93

శా. వేసారుల్ పచరించినన్ మనము తృప్తిం జెందఁగాఁ బోదు, వ్య
త్యాసమ్ముల్ ప్రబలించు, బుద్ధి చెడు, నాయాసమ్ము మెండౌను, వి
శ్వాసమ్మున్ జెడిపోవుఁ, గోప మొదవున్, వాంఛల్ తుదల్ముట్టు; వే
శ్రీసాంగత్యముకన్నఁ బాడుపని వేఱేలేదు చర్చింపఁగన్. 94

శా. వైకుంఠమ్మయి శంభులోకమయి దేవజ్యేష్ఠునావాసమై
నాకంబై నరలోకమై నరకమై నానాఁటికిం దోఁచు సీ

రాకాచంద్రిముఖీసమాగమమునన్ బ్రాజ్ఞేతరుల్ వోలె సు
శ్లోకుల్ పండితులున్ భ్రమింతు రిది యుక్తిప్రాయ మూహింపఁగన్. 95

తే. గీ. మొదల సంసారమే కడుమోహమయము
గాన దానికై యొప్ప రఖండమతులు
దానిలో లంకెవలని యందమైన సుఖము
చెప్పనా! శత్రునరును నీచేతు పలుకు. 96

క. తలిదండ్రిలు మోదింతురొ?
కులమునను బ్రతిష్ఠగలదొ? కులకామిని లో
నలమట గాంచదొ? యేమిటఁ
గలుగున్ సౌఖ్యమ్ము లంకెకాఁపురమందున్? 97

క. తనువుచెడు మానమడఁగున్
ధనముడుగున్ రుచికిఁ ఎనకు దస్వగుఁ కాన
మ్మును నబ్బు జూవ మెనయున్
ధనకాంతలు నేర్పనట్టి తప్పులు గలవే? 98

క. 'మనతలన పుట్టినే? యి
ప్పుడు' లని యొకవేళ మీరు ప్రశ్నింతురు, కై
కొనపలె నటులేనియుఁ దాఁ
దనకన్నన్ జిన్నదానిఁ దగియెడిదానిన్. 99

క. "వచ్చియు రాని కుచమ్ములు
వచ్చియు రానట్టి ముద్దుబాలుర పలుకుల్
హెచ్చగు మోదమునిచ్చును"
నచ్చును రసికులకు నవియె నవనవగరిమన్. 100

క. ఒఱఁగిన చనుఁగవ గలిగిన
తరుణిం గవగూడుకన్నఁ దఱచై కడుఁ గ్రి
క్కిరిసిన చనుఁగవ గలిగిన
తరుణుల పదతాడనము శతగుణము మెఱుఁగౌ. 101

ఉ. గిల్లినఁ బాలుగారు కలికిన్ గవఁగూడిన సౌఖ్యమబ్బుఁ గా
నెల్ల విటాగ్రగణ్యులును నెత్తరతత్తఱ చేసినట్టి యా
యల్లరిబోటిఁ గూడ సుఖ మబ్బునె? మాటలతేట వక్క మీ
యుల్లమునందుఁ జూచికొనుఁ డూరకవాఁగెడివాఁడఁ గాఁజుఁడీ. 102

ఉ. పున్నమనాఁటి చందురుని పోఁడిమి మంచిది గా దటంచు నే
నెన్నఁడుగాని పల్కనిఁక నేమన, నద్ది క్రిమక్రిమమ్ముగా
సన్నగిలున్; ద్వితీయ నగు చందురుఁ డన్నఁ! గ్రమక్రమమ్ముగా
నున్నతి చెందు భేద మిదియొక్కటి ప్రౌఢకును న్నవోఢకున్. 103

తే. గీ. అందులో మీర లెద్దానిపొందు నేయ
నెంచుచుంటిరో యదియు మీకీడుగాదు
దానికిం గూర్చి వాఁడిట్లు దారి వేసె
బోటి యద్ది యిక్ష్వాకులనాఁటి దవుర! 104

తే. గీ. ఇపుడు మీతోడఁజెప్పిన యీపరిబుద్ధిఁ
డెలమి నివ్వన్నెలాఁడికి వలపుమగఁడు
పేరుగుర్తివ్వంగనేల? యీయూర దీనిఁ
జూడకున్నట్టివార లెచ్చోటలేరు. 105

క. ధనవాంఛలేకయే యి
వ్వనితామణి యీడు వచ్చువఱకే విటులన్
గని పిల్చి కూడఁజొచ్చెను
దన కోలమున కన్నెలెల్లఁ దను నవ్వంగన్. 106

ఆ. వె. "మాఱుమనువు దానిఁ జేరంగఁదీసిన
మొదటిమగని సోదె మొదలుపెట్టె"
నన్నరీతి నిది రసాభాస మందును
నెక్కుడనుచు మీర లెఱుఁగవలయు. 107

క. చాతుర్మాస్యలలో యతు
లేతీరున బొంకెదరొ యదే తీరున వే

శ్యాతరుణులు వయసు గడున్
దాఁతురు తలక్రిందుచూడఁదగు నట నిపటన్. 108

ఆ. వె. తనకుఁ బెద్దయైన తరుణితోఁ గూడుట
యాయు వణఁగఁజేయు టట్టులుండ
"దాని కేటి పీనితగు: లేదకే:" యంచు
నగుదు రెల్లవారు నగడుచేసి. 109

తే. గీ. కడఁగి "కదపంత గుమ్మడికాయ కత్తి
పీఁటకగు లోఁకు"వని యట్టి టోటి నొప్పు
టొప్పిదం బేనియును దీని నొప్పఁబోకుఁ
డింతకన్నను జపలురా లెందులేదు." 110

క. అన నతఁడిట్లను "నేమము
లను గఱపేః చెప్పవచ్చు లోఁబడియెడి య
జ్జనములు దొరకరు; వేశ్యా
జనులకుఁ గలదోసఁగు లితరజనులకు లేవే? 111

తే. గీ. దేనియందైన ననుభూతి దీఱుపిదప
దాని నిరసించువాఁడంత జ్ఞానిగాఁడు
మొట్టమొదటన నిరసించు నట్టివాని
నెన్నఁగాఁదగు; వారలు నున్న జగతి. 112

క. అనిపలుక నాతఁ డంతటఁ
జనిలొ నుదారుఁ డిటులోనఁ జర్చించె "నొకం
డనుమోదించిన వస్తువు
జనుఁ డింకొకఁ డొప్పఁడిచియ సహజం బెందుఙా. 113

క. చందురుకాంతిం గని లో
నెందఱు సంతోష మంద రెయ్యెడలను? దా
మందునె పంకజములు? జగ
మందఱికిన్ ముద మొసంగునది లేదెందున్. 114

ఉ. దానిపరివ ర్తనన్ గుఱిచి తద్దయు నాతఁడు నచ్చఁజెప్పు న
ప్డేనదునైన నయ్యతివ యేలికొనజా గమకింప దన్న మా
పే నిజ, మక్కతమ్మునన యీతని కాతరుణీవతంసమం
దూనె ససూయ నిక్కమది; యొక్కఁడు సెప్పెడిబుద్ధు లొప్పునే? 115

ఆ. వె. దాని వినినదాది తన్మయంబయి చిత్త
వృత్తి విస్మృతాన్యవృత్త మయ్యెఁ
గనిన యప్పు దేమి గానున్నదో బుద్ధి
కర్మ మనుసరించుఁగాదె! యెందు. 116

సీ. కాంతలతోఁ బొందఁగూరామి నిక్కమా!
యటులైన నేల పెండ్లాడవలయు?
అన్యకాంతలఁ గూడు టనుచితంబందుమా!
యటులైన నిదియుఁగా దన్యకాంత
వెలయాండ్రిచెల్మి తప్పిదమౌనటందుమా!
యటులైన పీంద్రెందు కవనియందు?
సత్కులీనులకు నాచారంబు గా దందు
మా! యింతలోన నేమౌఁ గులమ్ము?

తే. గీ. కలియుగమ్మున నీరీతి కట్టుబాఁటు
గాని మున్ను శకుంతల గాదె? వేశ్య
యాఁపె గొన్న దుష్యంతున కందునింద
నేమి లోపమ్ము గల్గె? నిందేటిశంక? 117

చ. పలుపురు నొక్కచేడియకుఁ బాల్పడు టొప్పదుగాని నేమమున్
వెలసెడి యిట్టియుగ్మలిని వీధిమొగమ్ము గనంగ నీక తాఁ
గులసతిఁబోలె నుంచుకొనఁగూడదె? దీన మతేమిలోపమౌఁ?
గలిమికి నెందునున్ ఫలముగావె, మహోన్నతభోగభాగ్యముల్? 118

ఉ. భోగమునందు నిచ్చలను బొందనివా రిల లేరు; దానికిన్
ద్యాగము ముఖ్య, మందులకు ద్రవ్యము గావలె; దానిచేమి న

య్యాగమవేత్త లీసుఖము నందఁగలేక స్వరీతి నెల్లరన్
భోగవిహీనులన్ సలుపఁ బొత్తము లిక్రియవ్రాసి రీసునన్. 119

క. ఒకని ధనమొటచేఁ బర
వికచాంభోజాక్షి నెనయుటది మది దోసం
బిఁక సకలజనులకును దా
నొకగతి ధనమగుట వేశ్య నొందుటదగదే. 120

క. ధననాశన తనునాశన
ఘనతానాశనము లింపుఁ గలుగుట ప్రసిద్ధమై
నను నెల్లరకును నయ్యవి
పసుపడు ననరాదు భాగ్యవశమగుకతనన్. 121

తే. గీ. ఎందునేనియు సందియ మెనయకుండ
మనుజుఁడు ప్రవర్తనమ్మను గొనఁగవలయుఁ
గాని దీర్ఘయోజన కొఱగాదు "సంశ
యాత్మనసియించు" నని పెద్ద లందురుగాదె. 122

ఉ. సారవిహీనమైన భవసాగరమందుఁ గురంగలోచనల్
సారము, తెల్వితేటలును జాణతనమ్మును వందుముఖ్య. మీ
తీరు స్వతంత్రులైన మదతీమణులందుఁ బొసంగు, వాం డ్రిహోఁ
జారిణులంచు మానుకొనఁ జాతురి యుండెటఁ జూడ గద్దెడిన్. 123

ఆ. వె. దొసఁగు లెన్నియేనిఁ బొసఁగుఁగా కెందును
గలలఁ గానవిద్య కన్న లేదు;
అంగనాజనమ్మునందు రూపాటీప
కన్న మనము చనుపుకన్నె మన్న. 124

చ. అదియునుఁ గాక వస్తుగుణ మారయనెంచిన దేనికెందు నె
య్యది సహజంబొ దానిఁ గననౌనట, వేఱొకచోట నించుమిం
చు దనకు నట్టిసంగతియె చొప్పడినన్ సహజప్రచారమై
యొదవమిఁ దెచ్చిపెట్టినటు లుండకమాన ద దెన్ని భంగులన్. 125

క. ఆమనిఁ బొడము రసాలము
తో మఱియొక ఋతువునందుఁ దొడరునదియ తా
నామధురిమ మిడనేరదు,
హో! మహినది మేనమామపోలిక యగుటన్." 126

క. ఇటు పలువిధముల యోజిం
పుట కారంభించునంత మొట్టమొదటి య
వ్విటుఁ డేగుదెంచి "యటకే
గుట రే'' పని చెప్పుటయు రగులొ్కానుకొర్కెన్. 127

తే. గీ. అందులకె సిద్ధమైయుంట నతఁడు "వల్లె"
యనియె; నంతట మఱునాఁడు నరుగుదెంచె
నర్మసఖుతోడఁగూడి యన్నాతిమిన్న
సదనమునకేగె నభినయాసక్తి నతఁడు. 128

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
పాణిగృహీతయందు ద్వితీయాశ్వాసము.



# పాణిగ్రహీత

## తృతీయాశ్వాసము.

క. సరసతరరుచిరగీత
స్వరసాదరః లక్ష్మణాగ్రజన్మగృహీతాః
గురుతరభాగ్యసమేతాః
చిరకీర్తిప్రాప్తికామః సీతారామాః

తే. గీ. అవధరింపు మనంతరం బాలతాంగి
యెప్పుడును గనుమాయక యెసక మెసఁగు
తనదు దేహమ్ము గేహమ్ముఁ దదధిపమగు
సొంపుగులుక నలంకృతుల్ చొనిపి పిదప. 2

క. తత్తదుపాంగమ్ముల స
త్యుత్తమగతి నలవరించి యొక్కయెడఁ బదా
యత్తమ్మగు చిత్తమ్మున
నత్తరుణి గవాక్షనిహితపుగు చూపొలయున్. 3

తే. గీ. ఎదురుచూచుచు నున్నంత నిరవు రచటి
కేగి రేగుబయును దరుణేందువదన
దవ్వులన కాంచి కేళీసదనములోని
కంతలోఁ జవె సిగ్గున్న యబలపోలె. 4

తే. గీ. అయ్యుదారుని నొక యుచితాసనమున
నుండఁగాఁజేసి నర్మసఖుండు లోని
కరిగి "యిదియేమిపాపమో యబలః యతని
దీసికొనివచ్చినప్పు డీతీరు తగునెః" 5

వ. అన నా టక్కరికరిగమన యతని కిట్లను.

ఉ. దూరమునందు నున్నయెడఁ దోయజనేత్రల కెంతయేని వా
గ్ధోరణి యుప్పతిల్లు మదిఁ గొం కొకయించుకయున్ జనింప దా
ధీరతయున్ గభీరతయుఁ దెంపును బెంపును దగ్గఱైన య
ప్పూరుషుమోము గన్గొనినఁ బోవు సదెంతటి ప్రౌఢకేనియున్. 6

క. నమ్మెదవొ, లేదొ యాతని
నెమ్మొగముం గనినయంతనే మదిలో నా
కమ్మడిగ లజ్జవొడమెన్
జిమ్మిన నది వదలి చనదు చేవదగులుటన్. 7

క. పసితనమునుండి నన్నున్
గుసుమశరవిహారములఁ దగుల్కొల్పిన నీ
దు సమీపమ్మున నితరుని
దెస మొగమెటు త్రిప్పి నిలువఁ దేఁకున గలుగున్. 8

క. పలువురు ప్రియురాండ్రొక్కట
గలసభఁ బురుషుండు నిలువఁగలఁ డదిరసముగా
దొలఁగింపదు; కామిను లటు
నిలుచుటకున్ దగరు రసము నీరసము నగున్. 9

వ. అను నక్కలికి ప్రసంగమ్మున కడ్డుగా నతం డిట్లను.

క. "అతఁ డచట నే నిచట నుం
ట తగదు నే నెఱుఁగనట్టి టక్కరితనమా?
యతివ! యిది, సిగ్గు మీఱా
తి తరుణులకు నున్న యింత తెల్లం బెన్నన్" 10

తే. గీ. అని యతండరుగుటయు నయ్యతివమిన్న
యల్లనల్లన వారుండునట్టియెడకు
నరిగి యటఁ గంబ మొక్కింత యడ్డుగాఁగ
నోరగానిల్చి కాంచుచునుండునంత. 11

క. తనమది నద్దానినిఁ గనుఁ
గొను చెప్పుడటంచుఁ గోర్కె గుబ్బతిలఁగఁ జిం

తనసేయు నయ్యుదారుఁడు
వనితబెడంగంతఁగాంచి వహ్వారె! యనుచున్. 12

తే. గీ. మెచ్చి "యిచ్చపలాక్షి నామేదనుంచ
నేర్చితినయేని నాకు వస్నెయును వాసి
కలుగు జవ్వన మిది సార్థకత్వమందుఁ
గలిమి గలుగుటకును సుంతగలుగు ఫలము. 13

క. తగు కాంతతోడఁబొందున్
దగులని మనుజునకునైన ధనధాన్యమ్ముల్
సొగసును జాణతనమ్మును
భగవద్వంచితము లధికపాపాస్పదముల్. 14

ఉ. శాతరుణీమణిన్ గలసి యుంచుక భేదము లేక యుండఁ దా
నేతరుణుండు కామకల లెప్పుడు చింతనసేయుచున్ లస
ద్గీతవినోదముల్ గనుచుఁ గేవల మోదమయాత్ముఁడై వయ
స్స్ఫూర్తికి సార్థకత్వ మొనవించునొ, వాఁడుగదా! కృతార్థుఁడౌ." 15

క. అని యూహసేయు దానిన్
గనరాలోకన మొనర్చి మరియు మఱియు న
వ్వనిత కిలపాటి లే దని
తనలో నానందమందుఁ దనియు నెడందన్. 16

తే. గీ. అట్టియెడ నర్మసఖుఁడిట్టు లను "జగాన
నళినయమ్మున నీపాటి యందకత్తె
గానఁగారాదు, గానమ్ముఁ గవనశక్తి
దానికిన్ దోడు దీని కేతరుణి లేదు? 17

క. ఎదుటన్ జెప్పిన నుతియని
మది నమ్మదవటికిఁ దోఁచు మాటలిఁకేలా?
గుదిగూర్చె నన్నిసంగతు
లిది తావుగ నెంచి ధాత యింపెసలారన్." 18

క. అని జలజాక్షిం గనుఁగొని
"ననఁబోఁణిరో! సిగ్గు వారనాతికేఁ దగునే ?
కనుఁగొన వచ్చినవారల
మనమెక్కన్ మెలఁగకుంట మరియాదటవే ? 19

క. సిగ్గుగల వారకాంతయు
సిగ్గెడలు కులాంగనయును జెడుదురు; నీవీ
యెగ్గెఱుఁగ నేర విదియొక
పెగ్గెయనుచు గునిసె దిందుఁ బెంపుగలుగునే. 20

తే. గీ. "సగముచచ్చి యంతయుఁజచ్చి జగతి గాన
హాస్యములు నేర్చికొనవలె" నందు రందు
నభినయమ్మను నట్టిద యదియుఁగల్గి
యింత సిగ్గుండఁజనునె? యో యిగురుఁబోఁణి. 21

క. నీ తెలివితేటలకు సం
గీతాభినయప్రస క్తికిన్ గై తకుఁ బ్ర
ఖ్యాతిఁ జెడఁగొట్టెఁగదః లో
కాతీతంబైన లజ్జ యలవడి యబలా." 22

క. అనుమాటకుఁ బ్రత్యుత్తర
మును జెప్పక యంతకన్న మొగ మించుక వం
చి నగుచు నా జలజాక్షి య
భినయపుఁ బాండిత్యమెల్ల వెల్లడి చేసెన్. 23

తే. గీ. తెచ్చి పెట్టిన సిగ్గయ్యె ధీర యగుట
సహజమై ఖదిఁ గనఁజేసి చలదపాంగ
వీక్షణమ్ముల నొక్కింత వెల్లిగొలుప
విందుమదులెక్క యయ్యుదారుండు పలుకు. 24

తే. గీ. "ఏటి కిద్దాని నీవలయించె దింక?
నీవు చెప్పిన దంతయు నిక్కమయ్యెః

'పలులు లంజెలలోఁ బతివ్రత, పలాంగ
నాజనమ్ముల లంజెయు' నాఁగవినమె. 25

తే. గీ. నీవు చెప్పినయట్లన యీపెలంది
యేదియోకారణమ్మున నిక్కాలమునఁ
బొడమెఁగాఁబోలు వయసునఁ బ్రోఢయయ్యు
నింతబిడియ మిక్కాలమున నెంచఁగలదె! 26

తే. గీ. అభినయమ్మది చూచినయట్టులయ్యె;
గాన మీరీతి చక్కనికాంతి గలుగు
పలువరుస గలకలుకల కొలయు టరుదె!
కపన మీరెంటికన్నను గష్టమగునె?'' 27

క. అను నాతనిపలుకులు విని
తనపై నవ్వానిమనము తగులుట నిక్కం
బని యెంచి యంతలోఁ దీ
అని చింత వహించి యిటు కరమునూహించున్. 28

ఉ. చక్కనివాఁడు మేటి సరసమ్మగు వర్తన మెప్పువాఁడు బల్
టక్కరి గానముఖ్యకలలన్ గడునేర్పరి దివ్యవంతుఁ డ
మ్మక్క! యితండు నాకుఁ బ్రియుఁడౌట పురాకృతపుణ్య, మైననున్
జిక్కినపూర్వపుంబ్రియుని స్నేహము నేగతి మాననేర్చెదన్? 29

క. ఇతనిన్ గాంచిన దాదిగ
మతి నీరై యంతు లేనిమదులున కెరమై
సత మైన చింతఁబడి వి
స్మృతసకలం బయ్యె ముందు మెలఁగుట యెట్లో! 30

చ. ఇతని వరించి యెల్లపు దహీనసుఖమ్ముల నందుచున్ రమో
న్నతి రధికార మూనినమనమ్మునఁ దన్ దలపెట్టనేని నన్
మతిఁదలపోసియున్ విసివి మాటికి దూఱియుఁ ద్రోవగాన క
చ్చతురుఁడు రాయముఱావిడి యశ మ్మెటువంటిది నాకుఁ గూర్చునో. 31

మ. ఎపుడో యేమగునో యటంచు మదిలో నెంచంగ నేలా! యితం
డిపుడే తా మొగ మింత చేసికొని యేదేఁ బెద్దయాపత్తు నె
త్తిపయిన్ వ్రాలినయట్లు చింతగొనుచున్ ధీరత్వముం బూనుటన్
గపటానందము పైకిఁ జొప్పడుగతిన్ గన్పట్టుచున్నాఁడహో. 32

సీ. ఏకర్మమెఱుఁగని యెలప్రాయమున నేను
కసరికొట్ట నొకింత విసువఁడయ్యె
నెఱిఁగియు నెఱుఁగని చిఱుతగుబ్బలనాఁటి
పరుసదనానకు వెఱువఁడయ్యె
నెట్టకేలకు నాదుగుట్టు కైకొని వృద్ధ
యాడిపోసినదాని కలుగఁడయ్యె
నాకారణమునఁ దనకుటుంబమునఁ గల్గు
కలహమ్ములకు భీతి గాంచఁడయ్యె
తే. గీ. నన్నిటికినోర్చి ననుఁబ్రియురాలొ లేక
దైవమో యనుబుద్ధి నెదందలంచు
చున్నవాని వృథా ద్రవ్యమన్న కారణమున విడనాడు నాకు జన్మమును గలదె? 33

తే. గీ. దౌత్యమంగీకరించె నాతనిఁగరంచె
నంతఁబో కియ్యెడకుఁ దెచ్చెఁ జింతగలిగి
యును మదుపకారమునకు దాని నెడఁజేసి
యీను దిగ్రమింగె నింతవిశ్వాసి గలఁడె? 34

చ. ఇటుపయి సీతనిన్ మఱవకే యొకభంగిని గారవించి య
క్కటికము చూపి నేను గలకాలము సౌఖ్యము నందఁజేసినన్
గటకట! తానెదఁ జా మఱచుఁగాక యిదెల్లను గామియౌట, నా
కెటు మఱవంగవచ్చు నివి యెన్నిభవమ్ములకైనఁ జాలదే. 35

చ. "తనప్రియుఁ డైనవాఁడఁ టొకతప్పును నాతనియందు లేదఁ తే
పనియు నొనర్చువాఁడఁట! నెబాసు! ధనమ్మున కాస చెంది య

య్యనఘుని నీచకృత్యమున కాస్పదుఁగా నొనరించె నొక్క రో
వనిత" యటన్న దుర్యశము వాయఁగ నాకు నుపాయ మున్నదే. 36

తే. గీ. పెండిలిని నాడకుండిన నుండెఁగాని
వార కామినినైనను వసు నొకానొ
కని వరించి తదనుగతిగా మెలంగ
వలయు ననుకట్టుఁబాటుండవలదె జగతి. 37

ఉ. మాతెతకన్న హీన లగుమానవతుల్ వ్యభిచారవృత్తికిన్
జాలక కట్టుఁబాటునకు జంకుచు నొక్కొకనిన్ వరించుచున్
గాలము పుచ్చుచుండ గణికాజనమంతకు నెంతహీనమో!
హా! కతనమ్మువఁగా బడుచుకొంటిని రోయ దొరించు నేనియున్. 38

తే. గీ. ఒకఁడు పోయినమీఁద వేఱొకనిఁ గట్టి
కొంట యాచార మొకకొన్ని కొలములందు
నందులోనను జేరదీ యధమకులము
ధాత వంచించె నీజాతి తలిరుఁబోండ్ల. 39

క. అని తనమనమునఁ జింతిలు
వనితామణి సారెసారెఁ; వార లిరువురున్
దనతన రనుగుణ మగురీ
తిని జింతం గాంతు రవియుఁ దెలుపన్ వశమే? 40

తే. గీ. ముగురు వీగతి నొందొరు మొగముగనుచు
నెపతెగని చింతయుచు సంద్ర మీఁదుచుండఁ
దరణి యుంతట వారికిఁ దరణియుగుట
కో యనఁగఁ బశ్చిమాంబుధి దాయఁజనియె. 41

క. అంత సుదారుం డచ్చెలి
చెంత న్నిలుపోపలేక చేతోజాత
శాంతికి వశుఁడై చనియెడి
చింతన్ లేచుటయు నతని చెలికాఁ డనియెన్. 42

ఉ. "గానము వింటిమో కవనకౌశలమున్ దిలకించినారమో
మౌనమునందుఁ గల్గు ననమానపుఁజాతురి దక్కఁ బంకజా
తాసన యించుకే నభినయంపుఁ బ్రసక్తియుఁ జూపదయ్యె మీ
రీ నలినాక్షిపై నలిగి యిక్కరణిన్ జనుపెట్టు లొప్పగున్." 43

ఉ. నావుడు నాతఁ డిట్టులను "నాదుమనమ్మునఁ గోప మంచు నీ
వేవగ నిశ్చయించి తిది యెక్కడిచాతురి? యింతమాత్రినే
యావగలాఁడి నమ్మనె? సఖా! యొకవిద్దియఁ గాదు దీని కే
త్రోపల నేలతాంగి నవతుం గనఁజాలు? సెబాసు! వహ్వారే! 44

క. కనుఁగొనినమాత్రనే మన
మున మోహం బుప్పతిల్లె మున్మాటికి ని
క్కనరాంగి కింక శ్రీమమి
చ్చిన దానంజేసి మనకుఁ జేటగుఁజుమ్మీ. 45

చ. ఇదిమొద లిత్తరోదరికి నెవ్వరియొద్దను విద్దెచూపు నీ
చదశఁ దొలంగఁజేయ సుమచాపుఁడు యత్న మొనర్చుఁగాక! యి
మ్మదవతి సిగ్గునం దిటులు మ్రగ్గుచునుండుట చూచి యాత్మసం
పద నెగడింపఁజేయు చెలిపట్టున నాతఁ డనుగ్రహింపఁడే. 46

తే. గీ. మరలరావచ్చుఁ గనవచ్చుఁ ద్వరయదేల?
యబల యేమగు? మనమేడ కరుగువార?
మభినయం బెందుఁబోచ్చు? నెందఁడఁగుగాన
మగునె యారంభశూరత జగతినెందు." 47

క. నావుడు నర్మసఖుం డ
ప్పావుంబోఁడిఁగని పల్కుఁ "బోలఁతిరో నీపైఁ
గావలసినంతకోరిక
చే వచ్చినవారి నిట్లు సేయం దగునే? 48

క. సుమగాత్రి! వారి మంచిత
నమున స్నిలోటు దాఁ గనంబడదయ్యెన్

దమలపుటాకులకున్ వోఁ
చమె? యెఱుఁగవె? యిదియు సానిచంద మ్మగునే?" 49

మ. అన నచ్చేడియ భూషణధ్వనుల పొల్పవ్వారిగా నల్లఁ గ్ర
క్కునఁ గేళీభవనమ్ముచెంతఁ జని యాడల్ పోఁకలున్ దక్కఁగ
ల్గిన మేల్వస్తువులుగూర్చి పళ్ళెరమునన్ గీల్కొల్పి యొయ్యారమె
ల్లను దూపై చనుదెంచెనో! యనఁగ మెల్లన్వచ్చి యచ్చేరువన్. 50

తే. గీ. వినయభయసంభ్రమమ్ములు వెల్లిగొనఁగ
నిలువఁబడునంత నద్దాని నీటొకింత
యడ్డులేమిని గనులార నతఁడుగాంచి
నిలువునీరయి యట్లన నిలువఁబడియె. 51

తే. గీ. అంత నచ్చెలిమిన్న కరాగ్రకీలి
తమ్ములగు నాగవల్లీదళమ్ము లతని
హస్తమునసుంచి పళ్ళెర మచట డించి
చని యథాస్థానమున నిల్చెఁ జవులుగులుక. 52

ఉ. అంత సుధాకరుం డొక్కగతి నచ్చోటువీడి తదేకచిత్తుఁడై
యంతివిలాసముల్ మగువ యొప్పులు పైదలి మేల్పొరంగులున్
గాంత యొయారముల్ కనులఁగట్టిన యట్లెదుట న్నటింప న
వ్యంతుఁడు లేనిమేళ మటఁ గల్పనసేయఁగఁ జూచుచున్ జనెన్. 53

ఆ. వె. చనుచు నర్మసఖుని గని యిట్లుపల్కె "హా
చెలిమికాఁడ! జగతిఁ గలుగు పట్టి
ణముల నూపురమ్మునంగల చోద్యముల్
గానరావు వేరొకంట నెందు. 54

చ. అటఁ గల కామినుల్ పదవుటంగనలున్ మఱివేసవేలు మి
క్కుటముగు రూపమున్ హొయలు కొల్లలుగాఁ గలవారలుండ్రి నా
రెట వినుమంటిదానఁ గను టెన్నఁడునున్ లభియింపదయ్యె; వి
వ్వట భవదీయసంగతివశమ్మున నింతటి భాగ్య మబ్బెఁగా! 55

క. నాతోడ నీవు సెప్పిన
యాతరుణీమణియె యిది? సఖా! యది గాదో?
యాతీరెక్కడ? నీవను
నాతీరెక్కడ, శతాంశ మంతరమునుమీ. 56

ఉ. చూడకచూచు నేర్పు వినుచున్ వినకుండెడికౌశలమ్ము మా
టాడక యాడు జాణతన మన్నిటికేమి? యొకింత లోనఁ బో
రాడుట కమ్మనోభవు విటాళిపయిన్ బురికొల్పుపొల్పు పూఁ
బోఁడికి దేనికిన్ గలుగఁబోలదు దీనికిఁ గల్గుచాడ్పునన్. 57

తే. గీ. గుబ్బలబెడంగు పిఱుఁదుల గొప్పతనము
మేని తళతళలును మోముమిసమిసలును
గలికియైనంతమాత్రిన గల్గ నిక్క
తమున మెచ్చితి నం చెదఁ దలఁతువేమొ. 58

చ. పలుకులుచేయునేల? పరభామ లనన్ గను లెత్తిచూడ; నే
వెలవెలఁదుల్ సుఖమ్ముగను వీనులుచల్లఁగ నెంతపాడినన్
గలఁగదు మానసం; బివట గానమటుండ మఱొండటుండఁ బ
ల్కులుసు వినంగలే దకట! కోరికలీరిక లెత్తనేటికిన్? 59

చ. తరము లనెన్నియో జరిగెఁ దాతలతాతలు వారితాతలున్
మఱియును వారితాతలును మాకొలమం దిటువంటి కోర్కెలన్
మురగరు, దానికేమి, కడు మన్ననకెక్కిన పాండితీధురం
ధరు లటువంటివారి కిఁక నాకటనన్ బ్రదివస్థితుల్ చెడెన్. 60

తే. గీ. ఏమయినఁ దప్పదింక నీయింతిచెలిమి
యయ్యదియు నీయధీనమై యలరుకతన
నచిరకాలలభ్యంబని యాత్మనెంతు"
ననుడు నతఁడిట్టులను నుదారునికిఁ బేర్మి. 61

ఉ. "చెప్పితిఁగాదె! మున్ రసికశేఖర! యాలలితాంగి చంద, మ
య్యొప్పును గొంత మీ కనుభవోచిత మయ్యెఁగదా! తనంత న

యొప్పఁలకుప్ప యొప్పికొను టొక్కటిదక్క నుపాయ మిందుదున్
జొప్పడ దన్య, మేమయిన సుందరి డెందము చూచిచెప్పెదన్. 62

చ. ధనమన లెక్కతే దొరకట దానికి లోఁగిన వేలసంఖ్య దె
చ్చును, నదియేనిఁ దజ్జనని చూపునటున్ భ్రమగొల్పు నేమొ, య
వ్వనజముఖీలలామము పంచన నేయఁగ నేయుపాయముం
బనుపడ, దైన యత్నమును మానఁగరా; దెపు డెట్టు లుండునో; 63

చ. నిసుఁ గసుఁగొన్న మాత్రముననే వెలచేడెల లెక్కయేల? యే
వనజముఖీలలామములు వాంఛ యొనర్పరె మానసేర్తు? దై
నను నిట యత్నమేల యన, నాయసుభూతినిఁబట్టి చూడ ని
క్కనకనిభాంగి యోగినిగఁ గాలముపుచ్చెడునంచుఁ దోఁచెడిన్. 64

ఉ. కాని సమంజస మ్మగుచుఁ గన్పడ దిప్పటి యూహయున్ సదా
గానమునందు రక్తి వెలగట్టు నలంకృతులందు సక్తియు న్
నూనశరపరివారములఁ జొప్పడు కబ్బములన్ బ్రసక్తియ
చ్చానవు మెండు, తద్విధము చంచలతం గనఁజేయు నియ్యెడన్. 65

తే. గీ. మునిఁగిపోయినదేమి, యమ్మగుద తల్లి
తోడ మీమది నున్న సంతోస మెఱుఁగఁ
జేసి యామీఁద దానికిఁ జెప్పఁజేసి
యెసుసుం జెప్పిచూతు నిం దేటిచింత?" 66

ఉ. నాపుడు నుత్సకత్వ మెదనాట సుదారుఁడు పల్కె "నెప్పుడో
సీ విటు నేతు నన్న నెటునే నిలుపోపుదు? నేఁటిరేయి నా
దాపగలాఁడి, యాయతివ, యాచెలి, యాచిగురాకుఁబోఁడి, యా
రాపరవుం జనుంగవ జొకాటపుటిక్క, వశమ్ముగావలెన్. 67

క. రేపేమో మనమేమో
యాపూవుం బోణియేమొ యన్యమదేమో
వే వొమ్మిప్పుడ నాసం
తాప మ్మెడఁబాపు మింకఁ దదయుడు మిచటన్. 68

తే. గీ. చందురుం డర్ధముదయించెఁ జదల వెన్నె
లయును బర్వఁగఁజొచ్చెఁ దొలంగెఁ దమము
మందమారుత మదె చూడు కుందముల ప
రీమళమ్మును వెదఁజల్లెఁ రేఁగె మరుఁడు. 69

ఉ. తల్లికి నేమి చెప్పెదవొ? దానికి నేమని విన్నవించెదో?
పల్లవపాణి కేకిస్త్రియఁ గృపన్ గలిగించెదొ? నన్నుఁ దన్మనో
వల్లభుఁ జేయు భారమది పైనిడికొమ్మెటు నీ వొనర్చినన్
దెల్లు నటం చెఱుంగు, మొకచేడియ వానిఁగ నన్ దలంపుమా. 70

చ. కలదు ధన మ్మనంతముగఁ గంటికి మింటికి నంటుమాడుగుల్
గలవు సమ స్తముం గలదుగాని యొకించుక లేనివారిలో
వల నొకరుండ నియ్యబలఁ బాణిగృహీతగఁ జేయనేని, గో
ర్కులెల్ల నెనగాని సంపదలు కుంకుమలేని కులాంగనామణుల్. 71

ఉ. ఏ నని తా నటంచు నొకయించుక భేదము లేకయుంట న
చ్చానకుఁ జెప్పఁగాఁ దగినసంగతు లేమని బోధసేతు నీ
కే నెఱిఁగింపఁగావలయునే? యదిగాక, పురాకృతంపుఁ బు
ణ్యానఁగదా! లభించితివి నాకొకయూతగ నీవు నెచ్చెలీ." 72

చ. అన "నిదె పోయి వత్తు" నని యాతఁడు వెన్కకునేగె, మీఁద మె
ల్లన బసకేగి మిక్కిలి యలంచురు నెమ్మదితోడ భోజనం
బొనరిచి మిత్రరాకకయి యొక్కెడ నొక్కఁడుఁ గూరుచుండి తాఁ
గనుఁగొనుచున్ దుటిన్ యుగముగా గణియించుచుమారు దూఱుచున్.

ఉ. చెప్పఁగరాని వేదనలచే నలచేడియ నాత్మనెంచి "నీ
గొప్పపిఱుందులున్ వలపుగొల్పెడి మేల్ పలుచాలు లక్ష్యమున్
దప్పని చూపుకోపులును దామరతంపర లైన లీలలుఁ
ముప్పిరిగొన్న మోహమున ముంచెఁగదే! జగదేకసుందరీ. 74

ఉ. చందురుబాధకే సయిపఁజాలుదునో, మదనాగ్ని కాఁకకే
కందకయుందునో, పశ్రియకాలుని జో దలవల్లగాలికే

పందురపండునో సకలవాంఛలకున్ గుదురైన సమస్తస
ఙ్కందసవల్లి! నీదయిన సంస్మరణాశయె మాసుకొందునో? 75

మ. అకటా! నే నెటు తాళువాఁడ, నట నీ వా కంబపుం దాటునన్
వికచాబ్జమ్ము లిరుంగెలంకులను నావిర్భావమున్ బొంద మి
న్నక వీక్షించుచు లజ్జ గొట్టి వయి యానందింపఁగాఁ జేయు నా
పక్రియ్రీ తోఁ దలంచినంత మది నీరంబౌఁ గురంగేక్షణా! 76

క. అని తన్మయమగు మనమున
ఘనతర మగు రాగమెదిగి కాలూన నతం
డనిమేషత్వముఁ గైకొని
యును సురతావాప్తిఁబౌలు సూహించు నహో! 77

తే. గీ. అట్టు లొకకొంతసేపు మిన్నరసి యచటఁ
గలికి గోరులసొంపు నచ్చెలియమోము
పెంపు నొకకొంత గని యంతఁ బెదవి విఱిచి
నర్మసఖు నాత్మనెంచి తన్నాయకుండు. 78

మ. "ఇదిగో! వచ్చెద" నంచు నేగి చనుఁడేఁ, డేణాక్షి యేరీతి మ
న్మదమున్ గాంచెనొ? యెట్టియుత్తరము నన్నుంగూర్చి తాసంపెనో?
యదనున్ వమ్మొనరింప నెంచదుకదా, హా! దైవమా! యిట్టి క
ష్టదశాపారము మిత్రుఁదొప్పకొనునే, చాతుర్యమున్ జూపఁడే? 79

ఉ. ఎక్కడిమిత్రుఁ! డేనచటి కీతని నంపుట గొప్పతప్పు "తా
నక్కసరాంగి కీతఁడు ప్రియంపడువాఁ"డని వింటిఁగాదె? నీ!
మక్కువ యెంతచేసె! ననుమాన మొకించుకయేనిఁ గాంచ కా
దిక్కున కట్టివాని పెసడీయక పంపితి నెంత వెఱ్ఱినో! 80

తే. గీ. తెలివితేటలు గలవాఁడు ధీరుఁడితఁడు
చనినచోఁ గార్యసిద్ధియౌ నని తలంపఁ
గూలిపాలి సామెతయొనఁగూడ దాని
నొగి నధమనాయికన్ జేయుచుండె నేమొ! 81

ఉ. "కుఁజెనకాఁ దొకింత కొనగోటనునైనను మీట కెంపు వా
ల్గంటిని నాయకున్ గలుపఁగా గమకింపఁ" దటంచు మున్న నే
వింటిని వేయిసార్లు, విధి! వీఁ డిఁక నచ్చెలిమిన్నతోడ నా
యంటును సొంటునుం దెలుప కాడుచుఁ బాడుచుఁ గూకుచుండెఁ బో!

గీ. తనదుచిత్తమ్ము నేనియుఁ దగినసొగసు
గలుగుచెలిమిన్నకడ కంపఁ గదలిరాదు;
అట్టిచోఁ గేవలాన్యుల నంపనగునె?
దౌత్యమునకన్న సతిపొందు తప్పిదంబె? 83

క. పురుషుఁడు పురుషుని దరుణియుఁ
దరుణిని బంపంగఁదగదు, తరుణి పురుషునిం
బురుషుండు తరుణి దౌత్యము
విరచింపఁగఁ బంపుటయ వివేకము తలఁపన్. 84

మ. అని మిత్రుం గడుదూఱుచున్ మనమునం దాలోచనల్ సేయుచున్
వనితన్ లోఁదలపోసి యుల్కిపడుచున్ వైరాగ్యముం గాంచుచున్
దనకై తానటకేగ నూహగొనుచున్ దర్కించుచున్ దాపమున్
గనుచున్ గుందుచు నుండునంత హితుఁడున్ గన్పట్టె దౌదవ్వులన్. 85

క. కని "యతఁడగునో కాఁడో"
యనియును "కార్యమ్ము సఫలమయ్యెనొ లేదో"
యనియును "నిష్కారణ మి
య్యనఘాత్ముని దూఱితినేఁడ" ననియును వగచున్. 86

తే. గీ. అంత గగ్గలికేతెంచి "యనఘ! నీదు
పనుపునన్ జని యాశతపత్త్రినేత్రఁ
గాంచి మెలమెల్ల నీప్రసంగమున డించి
తెలిసికొంటిని మదినున్న తెఱఁగుకొంత. 87

క. అంగీకృతి సూచింప ద
నంగీకృతి తెలుపవెందు నతివలు లేరే!

రంగైన మిమ్మువంటి భు
జంగుల పిలుపంది యిట్టిచందము కలదే? 88

చ. అయినను నాలతాంగిహృదయం బొకకొంత భవత్సమాగమ
ప్రియమని కొన్ని చెయ్వుల నెఱింగితి; నంతఁ దనంత నెమ్మిఁ బ
ద్దయుఁ గతినాత్మ యయ్యతివతల్లియు నయ్యెడ కేగుదెంచె నా
శయమొకకొంత చెల్ప నది సమ్మతి గన్పడఁజేసి యుల్లసెన్. 89

ఉ. ఏయెడనైన "నీయతివ యెవ్వరిసాని?" యటన్నచో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయకుఁ డబ్బిన మీకుఁ గీర్తియౌ;
"నీయనసాని యెవ్వతయొ, యెట్టిదియో?" యని నప్పుడో "ఫలా
నా" యని చెప్పికోఁదగిన నాయిక గల్గిన మీకుఁ గీర్తియౌ. 90

తే. గీ. ఎట్టులేనియు మర్యాదయే ప్రధాన
మనుచు వర్తింతునేకాని ధనమదెంత
వచ్చినను వేఱురీతుల కిచ్చనేయ
నెఱుఁగరే? మీరు నామనోవృత్తిరీతి. 91

చ. ధనికుఁడు రూపశాలి గుణధన్యుఁడు మాన్యుఁడుసున్ సదాస్యుఁడున్
బినవయ సొప్పువాఁడు నెటుచేకుఱుఁ? దావృకుఁ డెట్టికేలసున్
దనకు లభించె మీకృపకతమ్మున, నియ్యెడఁ దక్కఁజెల్లునే?
యనుపగువాని మానఁదగునా? మనకెల్లపు డిట్టిఁ డబ్బునే? 92

ఉ. కావున మీరు చెప్పు రసికప్రవరున్ గని శంకఁదక్కి నే
నీవిధిఁ జెప్పినట్లు వచియింపుఁడు "నాదుతనూజపైఁ గడున్
భావము మీకుఁ గల్గు టది భాగ్యము గాని సదా కళత్రసం
భావన దీనిఁజూడఁదగుఁ; బ్రియము శాశ్వత మౌనె? యెఱింగెన్. 93

క. విడువవలసివచ్చిన లో
గడ నిచ్చిన దట్టులుండఁగా దానికి ము
మ్మడు గధికమిచ్చుటకు ని
ప్పుడ పత్రము వ్రాసి కొనుఁడు పూవుంబోఁడీ. 94

క. మోమోట మించుకయు లే
కేముసలిది యిట్టులనియెనే యనకుఁ డహో!
కాముకు లెక్కడ? సత్యము
లేమాడ్కి వి? నాకుఁ గ్రొత్తలే! యివియెల్లన్. 95

తే. గీ. మొదల నేర్పాటొకం డిట్టులొదవెనేని
మేమె మీరయి మీరలే మేమునగుచు
నుండఁగావచ్చుఁ; గూడునే! తిండిపట్ల
మఱియు వ్యవహారపుంబట్ల మాటకుఱుచ. 96

గీ. అందఱుంబోలెఁ బలువుర నాశ్రయించి
యొకరికనుఁ బ్రామి యొకరితో వికవికలకుఁ
బోవుటయు నాగృహమ్మున పూవుఁబోండ్లు
నేర రిదిమీకుఁ బదపడి నిక్కమగును. 97

ఉ. వలపు గలన్ని నాళ్ళు మగువా! చెలియా! సకియా! తలోదరీ!
చిలుకలకొల్కి! యంచుఁ గడుఁజేరికచేసి సమస్తవస్తువుల్
పలుమఱు తెచ్చియిచ్చి యటుపై నది కొండొక తగ్గెనేని య
క్కలికి మొగమ్ముచూడ; రిది కాముకధర్మము నేనెఱుంగుదున్. 98

చ. కలసిన కొన్నినాళ్ళొకటిగాఁ గనుపట్టెడి మేనులై దినం
బులు చనుమీఁద రెండునయి పోవఁగఁ బోవ మగండు నాఱునై
వలపు క్రమమ్ముగా నుడుగుపట్టున సానియవస్థ చూడఁగా
వలయు మఱొక్కఁ డట్టియెడ వచ్చునొ? యిచ్చునొ కామితార్థముల్.

చ. వదలినఁ జచ్చిపోదు మనువైఖరి యిద్ధరయందు నెందుఁ దా
మొదలఁ గనంబడున్ బిదప మోహముతగ్గియొ, జ్ఞానమబ్బియో
పదపతికన్నఁ బూరుషుని మానస మొండొక చుల్కఁబాఱున
య్యది గనిపెట్టలేని వెలయాండ్రకు నేగతి ముప్పునెగ్గెడిన్? 100

చ. తగినవిటుండు చేకుఱఁడు తారసమైన ధనమ్ము నీఁడు నో
యగమును నీగియున్ గలుగు నట్టిఁడయేని యతండు నిర్ధనుం

దగు మన మిచ్చువారు కఱవా ? ధనమిచ్చెడి వారెకాని, యే
మగువకు నేని సౌఖ్య మనుమానము మా గణికాకులమ్మునన్. 101

తే. గీ. "సానులను జేయుటుడిగి లోకానుగతిని
బెండిలి యొనర్చుకొనరాదె వెల వెలందు"?
లంచుఁ గొందఱు బోధింతు రదియు నంత
మంచితోవ యటంచు నా మదికి రాదు. 102

శా. త్రాగుంబోతులు జూదగాండ్రు వనితార్థప్రాపకుల్ సోమరుల్
భోగంపుంగొలమందుఁ బుట్టుపురుషుల్, పూఁబోండ్లు విద్యావతుల్
యోగోద్రేకిను లుత్కళార్హ! లెటు లీయోషామణుల్ నీచులన్
భోగింపం దగువార లిట్టులయినన్ బోకున్నె ? మర్యాదయున్. 103

ఉ. సానిఁగ జేసెనేనియును శాస్త్రులుఁ బంతులు మంత్రులున్ ధరే
శాసులు వైశ్యరత్నములు సంపద గల్గెడి యెల్లవారు సం
స్థానము గాచు సేవకుల చందమునం దనయిల్లు గాతు, రిం
కేసలినాక్షికిం గలవె ? యిట్టి మహోన్నతభోగభాగ్యముల్. 104

సీ. "ఏకలెక్టరుకు లేదింత వ" ర్కనుభంగి
నుత్తరమ్ములును బ్రత్యుత్తరములు
"ఏడాక్టరుకును లేదింత యల్లడి" యన్న
చందాన విలుగాచు సారటులును
"ఏజనానాకు లే దీచంద" మనుభంగి
మాడిగం బొనరించు చేడియలును
"ఏదేవతకును లే వీకాన్క" లనుతేవ
ఫలపుష్ప ముఖవస్త్రపటలములును

తే. గీ. తనకొలమ్మునఁ బొడమిన మనుజు నొకనిఁ
గట్టికొని కాఁపురముసేయు కలికి కెట్లు
గలుగ నేర్చును ? సానియై వలచి వలపు
గలుగఁజేసెడి కలికిమిన్నలకుఁ దక్క. 105

తే. గీ. జగతి "వాణిజ్యకృషికర్మజనవరేణ్య
సేవనమ్ముల సంపదల్ చేకుఱు" నని
చెప్పుదురుగాని తగినట్టి యొప్పుగలుగు
సానిగడనకు నవి శతాంశములు గావు. 106

తే. గీ. నీచ మిదియంచుఁ గొందఱు నీతివిదులు
పల్కుదురు సత్యమే; యట్లుపల్కువారు
పలుపువృత్తుల నిట్టినైచ్యం బొకింత
లేదె ? యొక రొండొకరి నెంచలేకపోరు. 107

శా. ఉద్యోగ్యం బని ప్లీడరీ యనియు నెంతో మంది శ్లాఘింతు రా
యుద్యోగంబు శ్వవృత్తి, రెండవది తా నొక్కొక్కెడస్ మాపనిన్
హృద్యంబౌ ననిపించు, లాభమది యెందేఁ గల్గు నావృత్తి సం
పాద్యం, బయ్యది పూజ్య మెల్లరకు, నీచానీచతల్ చూచిరే ! 108

క. ఏకారైకారము లొక
టే కడవొటను స్వవృత్తి నేతద్వ్యక్తిఁ
దాఁకు నసత్యమ్మిది వే
శ్యాకాముకులైన రసికు లారయుచు మదిన్. 109

క. ఏవృత్తిఁ దలఁచి చూచిన
నావృత్తికిఁ దగినకష్ట మందుండెడు వే
శ్యావృత్తికి నెజ్జపయిన్
గావలసినయంత పసిఁడి గలిగెడిఁగాదె ? 110

తే. గీ. అయిన నే, మిట్టి మేలైనయట్టి వృత్తి
కిప్పు డెన్నెన్నియో సంఘటించె ముప్పు;
లక్కతమ్మునఁ దగినంత యట్టికట్టు
దిట్టములు చేసినన్ గాని దీఱదింక. 111

తే. గీ. అనుచు నేమేమియో చెప్పె" నన ముదాపుఁ
డాననము వికసింప "నో యనఘ ' వృద్ధ

గోప టది తప్పుగా దిది కొ్రిత్తయగునె ?
యెవరుగోరరు కూఁతుల నిచ్చుపట్ల ? 112

క. వారలు గోరిన నది యొక
తీరుగఁ గనుపట్టుఁ దగమతిన్ దలపోయన్
ధీరులకు, నదియు నితరము
నారూఢిగ నొక్క విధమయగుఁ దుద కెన్నన్. 113

ఉ. ఇంతకు నేఁటిరేయి నను సేణవిలోచనతోడఁ గూర్ప నా
యింతి యనుగ్రిహించెనొ ? మఱెయ్యదియే నిదిగాక యట్టు నొ
క్కింత వచించెనో ? నొడువు మిచ్చుట కెన్నఁడు వెన్కఁదీయ నే
యింతికి నేనిఁ దప్ప దిది యేటికి నాకడఁ జెప్పఁగావలెన్." 114

క. అనవుడు నతఁడిట్లను "నే
నును నిట్లన చెప్పి తన్మనోగతిఁ గల వ
ర్ణన నెఱిఁగితి నంగీకృతి
కనుపట్టెన్ జను వె తడవుగా మన మింకన్." 115

ఆ. వె. అనుచు నయ్యుదారు నచ్చెలిమిన్న కే
శీ గృహమ్మునకుఁ జెలిమిదలిర్ప
వెంటఁ బెట్టుకొనుచు వేఁ దీసికొనిచనె
నర్మసఖుఁడు కామధర్మవేది. 116

— గ ద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
పాణిగృహీతయందుఁ దృతీయాశ్వాసము.



# పాణిగృహీత

## చతుర్థాశ్వాసము.

క. ఆగర్భశ్రీగుంఫిత
జోగాంబారామయార్యసుచిరకృతతపో
యోగపరిణామ ! లలిత
శ్రీగాంధర్వాభిరామ ! సీతారామా ! 1

తే. గీ. అవధరింపు మనంతరం బత్తలోద
రీమణి నుదారుఁ గల్పి యాకాముకుండు
చిన్నవోయినమోముతోఁ జెలియ మనము
నందుఁ దలఁచుచుఁ దనయింటికరిగి పిదప. 2

మ. అకటా ! పిన్నటనాఁటనుండియును నాయానంద మానందమై
వికలత్వమ్మును దాదృశంబయి దయావిర్భూతిమై నెందు భి
న్నకృతుల్ నేరకయున్న నెచ్చెలికి నన్యత్వంబు నేఁ దబ్బి నన్
వెకలిన్ జేసెఁగదా వృథా వెలచెలిన్ బ్రేమించి కామించితిన్. 3

ఉ. నావలసన్ గ్రహించె లలనామణి బాహ్యరతాదిసర్వసం
భావన లక్కటా ! యది సెబా ! సని యన్యుఁడు మెచ్చునయ్యొ; గో
దావరి పుట్టుటొక్కయెడ దాని ప్రయోజన మింక నొక్కచో
నీవిధి గ్రొత్తయే ? యెఱిఁగి యియ్యెడ నేఁదపియింప నొప్పునే ? 4

శా. నాకన్నన్ గడులేఁతప్రాయమును విన్నాణమ్మునున్ దేజమున్
శ్రీకూలంకషభోగభాగ్యములు వాసిన్ బొల్చు నవ్వానితో
నేకీభావము నంది యియ్యబల నన్నేమంచుఁ గామించు ? నే
నీ కాంతామణి కింక నీర్విడుచుచేఁ యెబ్బంగి యుక్తమ్మగున్. 5

చ. అరమరలేక చిన్నతనమాదిగ నొక్కటియై పరస్పర
స్మరణముదక్క వేఱొకవిచారము దూరముఁ జేసి విప్రలం

ఖరసము వెళ్ళఁబుచ్చుచుఁ బ్రపంచమెఱుంగని యట్టియుగ్మమున్
విరహముపాలు సేయు నవివేకికి ధాతకు జన్మమున్నదే! 6

ఉ. సానులులేరె యీజగతి? జాణలు గారె? మనమ్ము నీరె? యే
సానికి నేఁబొఱుంగునకు సఖ్యము లీగతిగల్గెఁ? గల్గుఁబో!
యీనియతిన్ మఱొక్కనికి నింతిని దానయి కూర్చి పొక్కునో?
మానము దక్క డెందు వెలమానిని నమ్మిన యెమ్మెకాండ్రికున్. 7

సీ. కలికి యింతకు వానికెలన నల్లననిల్చి
యొయ్యారముగ వీడె మియ్యకున్నె?
యబల యింతకు వాని యక్కు చక్కఁగఁజేరి
ముద్దుసుద్దులు మించ మురియకున్నె?
వెలఁది యింతకు వానితలఁపులూరఁగఁ జెక్కు
గ్గొట్టి నెట్టన ముద్దు వెట్టకున్నె?
గరిత యింతకు వాని మరుకేళిఁ గరఁగించి
గరువంపు బిరుదంబు గాంచకున్నె?
తే. గీ. ఆలలన లేనిపోనిదై నట్టి యలుక
గాంచి యింతకు నాయెమ్మెకానిచేత
ననునయమ్ము లవెన్నియో గొనకయున్నె?
చెనఁటిదై వమ్ము నన్ను వంచించె నకట. 8

మ. పలికెంబో! చెలినన్నుఁగూర్చి "యొరునిన్ బ్రాణేశుఁ గావింపు" మం
చలుకన్ లోఁగొనియున్ వెలిం దెలియనీ కంగీకృతిన్ జూపి ని
ష్కలుషంబౌ మదినూని వాని నతివన్ గల్పంగ నా కొప్పునే!
తెలియంజాలక మోసపోతి నిట నీతిన్ బూనఁగాఁ జెల్లునే. 9

చ. వెలచెలిఁగూడు టొక్కయవివేకము, కూడినవా సత్యముం
బలుకమి గొప్పతప్పిదము, పాము నెడన్ ఋజువర్తనమ్ములా
సలుపుట? దేవుఁబట్టి సదృశంబగు పత్త్రిగూర్చుఁ; టొప్పు హా!
వలపున ముంచి మించి విటు వాతులు గోతు లొనర్తు రక్కటా! 10

తే. గీ. అనియెఁ బో! బంజెయొాటఁ దానట్టిమాట
నాయయోగ్యత యెయ్యెడఁబూదిగలిసెఁ
వేయునేటికి? వెలయాండ్రి డాయువారి
కంతకన్నను దుర్వ్యత్తు లబ్బు నిజము. 11

ఉ. దాసునిరీతి దాని పదతామరసమ్ముల నాశ్రయించుటం
జేసికదా, మఱెవ్వఁడును జేయని ధుష్కృతి నేర్పుకిల్మి న
న్నాసతి చేయఁజేసె నకటా! యిటు లెప్పుడు చెప్పె నప్పుడే
కోసిన నేమిపాప మగుఁ? గోమలినాలుక యింతయింపగన్. 12

తే. గీ. నన్నుఁ బిననాఁటనుండియు నమ్మఁ జేసి
తుదకు నీగతి దుర్గతిఁద్రోసి యొరునిఁ
గలసి కులుకుచునున్న యక్కలికిమిన్న
కేల తగులదు? నాయుసు రిహామునందె. 13

ఉ. ఇంత యపాత్రురా లగుట యెల్లనెఱింగి యదేమి పాపమో
యింతిపయిన్ మనంబు పరువెత్తెడి, నుత్తలపాటు బెందెడిన్
గాంత దలంచి, యౌర; "విటకాంత్రకు నెక్కడిమాన" మంచు సి
ద్ధాంతముగా వచించు కవితల్లజు లూరక వాఁగువారలే? 14

ఆ. వె. నిష్కళంకుతైన నీటు కాండ్రకు మనం
బీయ, కిచ్చినట్టులే నటింతు
రకట! వారకాంత; లద్దమ్ములో మోము
దెట్టులుండు నిదియు నట్టులుండు. 15

తే. గీ. ముచ్చిబంగారమున కావిమూర్తియైన
వెలవెలందులప్రేమ లోపలముకొన్న
యట్టివిటులకు ద్రవ్యక్షయం బటుండఁ
బలువుదును నవ్వు టియ్యది పైనికొసరు. 16

తే. గీ. తనువునందలి సారమంతయు నయితము
నల్లనల్లన లాగి వారాంగనాజ

నంబు తమవిటులను, గుబుసంబు భుజగు
లును వెడలఁద్రోతు రిదిగనుఁగొనరు విటులు. 17

చ. కొలమునఁ బుట్టినట్టియొకకోమలిఁ బిన్నటనాఁడ పెండ్లియై
కలిగినయంతలో సుఖముగాఁ దలిదండ్రులు నత్తమామలున్
బలుమఱు దన్నుమెచ్చఁ గులపావనుఁ డన్న యశమ్ము లోకమం
దలమఁ జరించువారివికదా! నిజమైన సుఖమ్ము లెమ్మెయిన్. 18

క. అని యీతఁడు పలువిధముల
మనమునఁ దలపోయుచుండె మానినియు నుదా
రునిఁ గలసి కులుకుచును నో
య్యన నాలో నితనిఁ దలఁచి యాత్మగతముగన్. 19

మ. అకటా! నన్నెడఁబాసి యెన్నఁడెఱుగం డవ్యాజరాగాశ్రయుం
డొకరిం బోలెడివాఁడు గాఁడతఁడు నన్నుల్లమ్మునం దెంచి యే
మికతల్ సేయఁగ సాహసించెదినొ? నామేలెల్ల వమ్మయ్యె; న
మ్మిక నాపై నిఁకనైననుం జెడదె? యేమీ, వాని తప్పెట్లగుఙా? 20

ఉ. వేడుకకాఁడఁటంచు మది వెక్కస మించుక లేక "యొండొరుం
గూడఁగఁ దెమ్మ" టంచు ననఁగూడునె? విత్తము కారణమ్ముగాఁ:
జూడనిచూడ్కిగా మఱి బొజుంగులఁ గూడినఁ గొంతఁ గూడుఁగాః
కేడవి యిట్టివర్తనము? లేమవిచేసితి? నేరు మెత్తురో? 21

క. నాకారణమునఁ గులమున
కే కానికళంకుగల్గె నిహిహీః యిటుపై
నాకత విన్నను రోయక
యేకాముకు లిచ్చగింతుః రిల వెలచెలఁలన్. 22

ఉ. ఎంతటి మానహీనులొ! మఱెంతటి యేవము లేని పందలో!
యెంతటి బుద్ధిశూన్యులో? మఱెట్టిరొ కో? విటకాండ్రు, జోగపుం
గాంత లొనర్చు హేయములు కన్నులనిండఁగ నెప్డు చూచుచున్
బంతమొకింత పూన రిది బాలిశవృత్తిగఁ జూడ రక్కటా! 23

శా. త్రాగుంబోతుల బుద్ధిహీనత గదా! ద్రవ్యమ్ము సారాయికిన్
రాఁగా హేతు, వదెంత కట్టుచెడినన్ రాకుందురే? వా రహో!
బోగంపుంగోల మట్లనే విటులదుర్భోగాప్తి దుశ్శీలమై
శీగం బూడ్చినపెట్టెయై యిటుచెడన్ బెంపేది నానాఁటికిన్. 24

క. ఇక్కరణి నన్యయోజనఁ
జిక్కియు నవ్వానిమనము చెయ్వులఁ దనకుం
దక్కించుకొనియె; విటులకుఁ
దక్కిన సంగతులపైని దలఁపుం గలదే? 25

ఉ. పువ్వులవిల్తు పోరఁ గలపోఁడుములెల్లను నొక్క రాత్రికే
యవ్విటుఁ డవ్వెలందియును నాని సుఖించి, ర విట్టి వట్టి పం
చెవ్వగఁ దెల్పనొప్పగు? నదేమిటి, కింత కెఱుంగనట్టి వా
రెవ్వరు? పక్షులున్ బశువు లీసుఖ మందవె? యంత కెక్కుడే? 26

ఆ. వె. కుక్కుటమ్ములంత గొక్కురుకోయనె
నలమఁదొడఁగెఁ జల్లనైనగాలి
చుక్కవాడిచెఁ దక్కురిక్కలు తఱిగెన
ట్టారి వెల్లనాయె జాఱె రేయి. 27

ఉ. అంత సుధారుఁ డచ్చెలి యొయారముగాఁ దను సాగనంప న
య్యంతివిలాసముల్ హృదయమెల్లెడ వేడ్క ఘటింప సంతటన్
ధ్వాంతమడంగియున్ దనయెదం గలధ్వాంత మసంతమై తగన్
జింతమఱొండు లేక యలచేడియ నెంచుచు నింటికిం జనెన్. 28

తే. గీ. సారసమ్ములు వికసింపఁ జక్రవాక
జంపతుల కింపు జనియింప జగములెల్ల
నంధతనుబాసి మోదింప హాయిబెంప
రవి యుదయమందెఁ గుముదినీచ్ఛవులు డిందె. 29

చ. అటు లొక కొంతకాల మలయబ్జముఖీమణి పొందు నందుచున్
విటకులశేఖరుండయి వివేక మొకించుకలేక స్వీయమౌ

కటకము మాటయే తలఁపఁగానక యుండెను; నంత దల్లి య
ప్పటి చరితమ్మొకింత విని పంపెఁ దదానయనార్థ మాప్తులన్. 30

ఉ. పంపిననెట్టులో చెలియఁ బాయఁగలే కెడఁబాసి "యుత్తరం
బంపుచుమండుమీః" యనుచు నాదర ముట్టిపడంగఁ బల్కి నై
లింపనివాసముం దొఱఁగలేక యలందురు నష్టపుణ్యులా
ర్యుంపుటవస్థయెల్లఁ దనదై చనె నీగతిఁ జింతనొందుచున్. 31

శా. "ఆయజ్ఞాననఁ గన్నకన్నులనె భార్యన్ జూడ నేతెంచుటల్
నాయజ్ఞానమె రాజుఁగన్న కనులన్ నాథున్ విలోకించినన్
హేయపక్రియఁ దోఁపకున్నె? యిదిగా కీలోకమందెన్న నే
స్త్రీయారత్నము వారకామినులవాసిం జెందఁగా నేర్చునో? 32

మ. అడుగున్ వెన్కకు లాగివేయుటకు నయ్యబ్జాక్షి సాంగత్యమే
కడు సామర్థ్యముఁ జెందియున్నపుడు వెన్కన్దోడు నీవేల? యో
గొడుగా! యీసుడిగాలిఁ గూడి ననుఁ జిక్కుల్ వెట్టుటల్ మాని ముం
దడుగున్ సాఁగగనిమ్ము, నామనవి నీవాలింపు మిప్పట్టునన్. 33

ఉ. ఈవును గాలియుం గలసి "యేణట్పృశన్ నిడనాడి యేగుటొ
ప్పో? వల" దంచు న న్నిపుడు వెన్కకుఁ ద్రిప్పఁ దలంచినా రహో!
దైవబలమ్ము చాలదది తల్లిగఁ దా నవతార మంది న
న్నీవిధి లాగుచున్న దిపు డేమియు సేయకు మాతపత్రమా. 34

మ. జడ మీ వయ్యు, జగమ్ము లెక్కతన నుచ్ఛ్వాసమ్మునం బొల్చు న
ట్టిఁడు నీకున్ సహకారి యౌట నను బోటిం జేర్పనుంకించి నా
యడుగున్ వెన్కమఱల్చె దీ వొఱుల తాపార్తిన్ హరింపన్ గదా
పుడమిన్ బుట్టితి వాతపత్రమ! నిసుం బోలున్ దలన్ దాల్పఁగన్. 35

వ. పదపడి ధూమశకటం బారోహించి యతండు.

ఉ. తల్లిని దుష్టురా లను చెడన్ దలపోయుచుఁ దండ్రి యోగ్యతా
భ్యుల్లపనంబు సూరక యహో! యని మెచ్చుచు సారెసారె క
ప్పల్లవపాణి చెయ్వుల జపం బొనరించుచు నేగె నున్నవా
తెల్లరు నంతరాయమగు టెంతయు శత్రులు కోడెకాండ్రకున్. 36

క. రైతే దేఁగారణమున
జాల మ్మొగ్గనరించి వెనుక జరిగినచో నా
వ్యాలోలుఁ డదియుఁ దన కసు
రూలించెడి జాలి యనుచుఁ గొండొకయెంచున్. 37

ఉ. చిక్కినమేనితో వగపుచెందెడి డెంచముతో స్వతఃపరిక్ష
దక్కినమోముతోఁ దనదుదాపునకున్ జను పుత్రుఁ దల్లి దా
మిక్కిలి గారవించి మునుమించిన దెంచక, పైనొక్కపు పెం
పెక్కినపక్కి నీతి జనియింపఁ బ్రసంగ మొనర్చె నీగతిన్. 38

చ. ముసుపెటులైననున్ గృహము మోపిక నీకుఁ గాలిసంకె లౌ
టను దెలియంగదన్న ! కడుఁదక్కరులన్ దరిఁజేరనీకు మ
న్న, నయముచందమున్ దెలిసి నాయనకున్ యశ మబ్బఁజేయు మ
న్న, నెనరుగల్గు మన్న, ద్రవిణంబు వ్యయింపకు మన్న, వమ్ముగన్.

ఉ. ఏపని కేశకేనియును నేగిన నయ్యెడ గేహవిస్మృతిన్
గాఁపుర మాచరించు టది గాదు గదన్న. కళత్ర మెంతయుం
దాపము నందు దుష్కృతులఁ దారకుమన్న, యొకింత పూర్వులన్
దాపసచర్యులన్ దలఁచి తద్గతి నిల్పఁగదన్న ! మేటిపై. 40

ఉ. పచ్చెడి రైతులన్‌గని జవా బెవరిత్తురు ? సాహుకార్లకు
న్నచ్చెడిరీతిఁ జెప్పఁదగు నాయకు లెవ్వరు ? తండ్రినాఁడె తా
నిచ్చినసొమ్ము పుచ్చుకొను టెవ్వరు ? కోరెడివారి కప్పులి
చ్చిచ్చుటదెవ్వ ? రెక్కడికి నేగిన నక్కడ కాఁపురమ్ములా ! 41

తే. గీ. ఎన్నిజన్నమ్ములంజేసి ? రెన్ని యగ్ర
హారములు తెచ్చి రెందఱ కన్నమిడిరి
భూము లెందఱ కిచ్చిరి ? పూర్వు లందు
మిర్వ్యయంబింతలేదు తుందుడుకు చనునె ? 42

తే. గీ. ఎంతద్రవ్యంబు ముందు నీవింటనుండి
తీసికొనిపోతి ? వామీఁదఁదీఁగెకతన

మరలఁబంపినయదియెంత ? యెఱుఁగుదే, కు
మార ! యిది యెల్ల నెయ్యెడ మఱిఁగిపోయె. 43

ఉ. ఈగతిఁ జెల్లఁజేయ మన మెక్కడిలెక్క ! ధరాపురందరుల్
జోగులుగారె ? యొౌన్నృపులఁ జూచుటలేదె ? యిదిట్టులుంచు మే
లాగు సహింతురా ! సకలలక్షణముల్ గలభార్య యుండఁగా
భోగపుఁదొత్తులన్ మరగఁబోయెడి నీకత లాలకించుచున్. 44

ఉ. వత్సరమైనఁగాదు జనవంద్యుఁడు తండ్రి గతించి, నీకు నే
తత్సమయమ్ము నిష్ఠమెయిఁ దాల్చుటమాని యయోగ్యతాఖనుల్
కుత్సిత లగ్రిజాతులకుఁ గూడనిచీఁడలు లంజెముండ లం
దుత్సుకతాభరంబు గొనుటొప్పునె ? కర్మము కాలిపోవఁగన్. 45

ఉ. వింటిని నీదువైఖరులు వీనుల సూదులు సూడినట్టు తే
యంటును సొంటు లేని కుల మక్కట! గంగను గల్వ నిన్నుఁగ
కొంటిమె ? కొంచె మొప్పెలను గూడుక గాడిదరీతి భోగపుం
గుంటలయిండ్లు దూఱెదవె ? కూళవె, గోలవె, జేలవే సుతా ! 46

శా. అన్నా ! వైనఁట బ్రాందియంట వినికీయం టక్కటా ! నీకు నీ
విన్నాణం బెటులబ్బెరా ? ద్విజకులావిర్భూతియున్ దానమున్
మున్నెచ్చో వినలేమ నీదుతలనే మున్గెన్ మహాపాప, ము
చ్ఛిన్నంబయ్యెఁ గులమ్ము నీకతన చీ ! చీ ! గోత్రవిధ్వంసకా ! 47

చ. నయము భయమ్ము నెమ్మదికి నాటఁగఁ దల్లి యొనర్చుబోధ య
మ్మెయి విని మోమువంచి పయిమిక్కిలి యుత్తరమీక "యెవ్వఁడ
ప్పయనములోని చెయ్వులను వ్రాయక యిట్యెడఁ దెల్పె" నంచుఁ ద
ద్దయుఁ దనలోన సిగ్గిలు నుదారుఁడు లో మఱియొండు దోఁపమిన్. 48

తే. గీ. అట్లు వినయంపుగనియయి యన్నపాన
ములకు సయితములేవని ముద్దుఁ గాంచి
లోన నించుకచింతించి లోలహృదయ
యగుచు నాసతి దానిట్టు లనియె మఱియు. 49

చ. ఎఱుఁగక చేయుకార్యముల కేమి యిఁకేనియు బుద్ధిగల్గి య
ద్దురితము వాయుపొంటె గురుదోషనివారిణి గంగ కేగి య
క్కుటమెయిఁ దండ్రికిం గతులు కల్పనచేసి పురమ్ముఁ జేరు వ
త్సరమునుగాకమున్న యిటుసల్పుట యొప్పగునంచుఁ బల్కుడున్. 50

చ. ఒదవిన సిగ్గడంప నిది యొక్క యుపాయము గల్గె నంచు నొ
ప్పిదముగఁ దల్లియాజ్ఞ గొని పెద్దలఁగొందఱ నామె తోడుగా
సదమలబుద్ధులన్ బనుప సాయముగాఁ గొని యాతఁడేగె న
మ్మదనహరాలయమ్ము పరమప్రథితార్థపురాశి గాశికిన్. 51

సీ. అడుగడ్గునకు వింతలై స్వాంతమును దన్పు
దేవళమ్ముల దీప్తు లావహిల్ల
నిరుప్రక్కలను నభోంతరము దాఁటిన మేటి
మేడలసౌరు మిర్మిట్లుగొలుప
నెటఁజూడ నచటనే యింత యాచ్ఛాదనం
బును లేని లింగాల పొలుపు లెసఁగ
నాఱుశాస్త్రములు నధ్యయనంబు నొనరించు
విద్యార్థు లెల్లెడ వేడ్క నింప
తే. గీ. నెన్నియో దేశములనుండి యేగుదెంచి
నట్టితైర్థిక జనము లెప్పట్టునఁదగ
సూత్రిపట్టినగతిఁబొల్చు సురనది పరి
సరమునందొప్పుఁ గాశికాపురవరంబు. 52

తే. గీ. ఎన్నియోఘట్టములు, నట నెందఱెంద
రోమహాత్ములు సన్న్యాసు లామహాను
భావులను గొల్చి జ్ఞానమ్ము వడయు గేస్తు
లెల్లయెడనొప్ప నప్పురం బింపు నింపు. 53

శా. గంగాస్నానము నాచరించి పిదపం గాశీశు సేవించి మీఁ
దం గామామరకల్పవృక్ష మగు తద్భార్యన్ విశాలాక్షి భ

ర్తిం గేల్మోడిచి మ్రొక్కి మాధవముఖాదిత్యార్చనల్ సల్పు పూ
తాంగుల్ వేలకువేలు వొల్తు రట నిత్యంబున్ విముక్త్యర్థులై. 54

ఉ. తాదృశమైన యప్పురముధన్యత నెవ్వఁడు నెప్పఁజాలు ? బ్ర
హ్మాదులు లోకజాలము లయంబగునప్పుడుఁగూడ దాని గౌ
రీదయితుండు శూల మలరించి తదగ్రమునందు నిల్పు నిం
కేదగు దాని సాటి ? నుతియింపఁగఁ జెల్లదె కాశికాపురిన్ ! 55

ఉ. ఆపురిఁజేరి యాతఁ డట నాచరణీయము లైనకృత్యముల్
వే పచరించి దానములు వేలకువేలుగ నిచ్చి భూమిచే
బాపలఁ గొందఱన్ దనిపి పై గయకేగి యటన్ బితృప్రియా
శాపరిపూర్తిజేసి యట సాఁగి స్వదేశము వోవుదెంచుచున్. 56

చ. తిరిగియుఁ గాశికేగి యట దేవళముల్ మఱికొన్ని చిత్రముల్
పరిపరిగాంచి గంగ నటఁ బట్టఁ బ్రియాగకు నేగి తత్పురి
త్పురసముఁబట్టి యప్పురిని సొంపగు కోటఁ గలట్టి మేటియ
బ్బురములు సూచి యేగెఁ దనపోలికి నాప్తులతోడ వేడుకన్. 57

తే. గీ. జననికభిషేక మొనగెంచి సతియుఁ దాను
నమ్మహాగంగఁ బూజించి యగణితముగ
విప్రులకు నన్నదానంబు విస్తరించి
తల్లి సంతసమంద నుదారుఁ డంత. 58

శా. సంసారస్థితిఁ జక్కఁబెట్టుకొనుచున్ జాయన్దగన్జూచు చా
శంసాపాత్రముగాఁ బ్రివర్తనము మెచ్చన్ జేయుచున్నంత మీ
మాంసన్జేయక తల్లి యాతనియెడన్ మర్యాద నీక్షించి "ప్ర
ధ్వంసపప్రక్రియ తగ్గె" నంచుఁ దలఁచెన్ దత్త్వంబు నూహింపమిన్.

ఉ. "అచ్చెలిఁజూచు టెట్టు? లిఁక నయ్యెడకేగు నుపాయ మెద్ది ? యే
యొచ్చెముచేసినన్ జనని యొప్పెడి ?" నంచుఁ దలంచునంతలో
నచ్చపలాక్షి యయ్యెడకుఁ నాత్మపురమ్మును వీడి మున్నె తా
వచ్చుటఁజేసి కమ్మఁ దగవ్రాసి తనంతన యంపె దూతికన్. 60

ఉ. వచ్చిన దూతిచేతి "కెదె వచ్చితి" నంచు లిఖించి యిచ్చి పో
నిచ్చి మనమ్మునన్ బెరుఁగు నిచ్చలు మోమునఁదోఁప నంతలో
హెచ్చెడి యుత్సుకత్వమున కెద్దియుఁ బారము గాక యేగెఁ దా
నచ్చపలాక్షిఁ జూడఁగ సుదారుఁడు లోన భయమ్ము గ్రమ్మఁగన్. 61

ఉ. "ఉత్తరమైనవాగ్రియ విది యుక్తమె? నీ" కని యింతి వల్కుచో
నుత్తరమేమి చెప్పదు నహో! మది నెంతటిపేర్మి తేనిచో
నత్తరళాక్షి తాన యిటకై చనుదెంచునె? యెంతదూర మ
ప్పత్తనఁ మంబ హేతువునఁ బంకిలచిత్తుఁడనైతి నక్కటా! 62

ఉ. అంబయుఁగాదు హేతువు రహస్యమునం దొకయుత్తరంబు నే
నంబుజనేత్రకున్ బనుప నాపె నివారణచేసెనే? నిమి
త్తం బిట వేఱుకా దొకస్వతంత్రత లేమియె; కాదు కాదు డెం
దం బదియేమొ! యెప్పనికిఁ దార్చిన నేగదు నాఁటనుండియున్. 63

చ. కలికియె కారణంబిచటఁ గాఁదగు నత్తరళాక్షి పీడి నే
వెలికరుదెంచు టాదిగ నవీనవిధం బొడఁగూడె; నేమియుం
దలఁపదు చిత్త, మేమిటికతం బని చింత యొనర్పఁ దాను నం
దుల జొరఁబాఱ దిప్పటికిఁ బోఁచె నిజ మ్మిది" యంచు నెంచుచున్.

ఉ. నేరము నేయుమానవుఁడు నేతకడన్ జనుపోల్కి మోమునం
దీఱని దైన్యమున్ మఱి మదిన్ గడుభీతియుఁ గొంతలజ్జయుగా
వారక తోఁప నచ్చటులవారిజలోచన యున్నచోటికిన్
దారె సుదారుఁడల్లయగుఁ దన్నులపట్లఁ గృతాపరాధికిగా. 65

క. నలుగడలుగాంచి పదపడి
జలజముఖి వసించుగృహముచాయఁజని యటన్
గలకలికిఁ గాంచినంతన
పులకలు గనుపట్టె మేను పొంపిరివోయెన్. 66

చ. తనుఁ గని మాటలాడ దొకదండము వెట్టదు మోము నెత్తద
వ్వనరుహనేత్రి యంచు మది వంత యొకింతయుఁగాంచ కల్లన

ల్లనఁ బ్రియురాలి డగ్గఱి విలాసగతిన్ జెకు గీఁటి మోము నె
త్తిన శతపత్రనేత్ర యొకతీరున నక్షులు జాలువాఱఁగన్. 67

ఉ. కొండొకసేపు నేర్పుమెయిఁ గొంకెతనమ్మున మిన్నకుండి "నీ
మిండతనంపుఁ జందమిది మేలుగనున్నది, యిట్టివాఁడవా!
వెండియు రేపె వత్తునని వెళ్ళినదే యొకసందు చేసి రా
కుండుట నీకుఁ జెల్లె నిటు లొండొరు లెవ్వరు నేర్తురే బళీ! 68

చ. ఇరువదియేండ్లప్రాయ మదియేగెడునంతకు మిన్నకుండి పై
"నఱువదియేండ్లయప్డు చదు" వన్నటు లే నినుఁ గట్టికొంట యి
క్కరణి విచారమందుటకె కాక సుఖమ్మునకా? నిజమ్ముగాఁ
బురుషులనమ్మువానికిఁ బొక్కుటదక్క మఱొండు గల్గునే. 69

మ. మతు లేకీకరణమ్ము గాంచకయొ, నమ్మన్నమ్మికల్ చాలకో,
కుతుకంబుల్ నెఱవేఱకో, సిరులు లేకో యేదియో మూఁడియో,
సతికిన్ భర్తకు నత్త దొక్కయెడ నీసఖ్యమ్ముచేకూఱ దు
ర్మతియై దానికి దైవ మెయ్యదియొ సంపాదించుఁ బ్రత్యూహమున్. 70

చ. వినుఁ గనుఁగొంట కిక్కరణి నేనయి వచ్చితి నన్నమాట యే
వనితయునేని మాకొలము వారలలో వినెనేని నవ్వకుం
డునె! యెటనేని సానుల కిటుల్ చను టొప్పునె? దానికేమి, ప్రీ
తిని గనఁజేసి తిట్లరుగుదెంచు శ్రమమ్మున కోర్చి యెమ్మెయిన్. 71

ఉ. "లంజెగదా!" యటంచు మది లక్ష్యమొకింతయు లేమి వీడితే
నిం జనుగాని యొక్కచెలినీతి యొకొక్కొకపక్కి నొప్పు "నీ
మంజులవాణి యిట్టి" దనుమాదిరి నిర్ణయ మాచరింప న
క్కంజభవుండు నేరఁ డనఁగా నొకపాటి బొజుం గెఱుంగునే! 72

చ. వెలచెలియై జనించి కనువేఁదుఱు చెందినపట్ల దానికిన్
గలుగుట యబ్బురంబె పలుకష్టము, లొర్ల ననంగనేల? చం
చల మగు నాదు నెమ్మనముచందము నింద యొనర్తుఁగాక యే
లలనలు గాంచిరో సుఖములన్? వలపుల్ తలకెక్కుపిమ్మటన్." 73

చ. అని పలుమాఱు దూఱు చెలియన్ దగుమాటలుసెప్పి కొంత సి
గ్గున కగు చెయ్వులన్ గొలిపి కొంత క్రమమ్ముగ సుప్రసన్నఁగా
నొనరిచి మించుపేర్మి దళుకొత్త "సఖీ! నినుఁ బాయు టాదిగా
మనమది యేమొకో! పనికిమాలినదయ్యె నిజమ్ము నమ్మమీ. 74

ఉ. ఇంతియలాకయున్న నిఁక నేపనినేనియు మాను టొప్పఁగా
కింతిరొ! నీకు నుత్తరమునేనియు వ్రాయనె! యంత పందసే
కంతునిసాక్షి నేఁడు నినుఁగాంచితి నెమ్మన మెప్పటట్ల ని
శ్చింతతగాంచె నింతయును సిద్ధము నమ్మిన నమ్మకుండినన్. 75

ఉ. వచ్చిన తత్ క్షణంబ మగువా! యలకాశికి నేగినాఁడఁ బై
నచ్చుగఁ యాత్రఁజేసికొని యక్కడనుండియు మొన్నవచ్చితిన్
బచ్చనివింటిజోదుకృప వచ్చితి వంతన నీవు, యాత్రికుఁ
వచ్చెఫలంబు, నిక్కమిది వంచనసేయఁడు దైవమెవ్వరిన్. 76

ఉ. ఈవును నేనునుం గలసి యియ్యెడ హాయిగ నుండవచ్చు సౌ
ఖ్యావహ మీపురంబు, మనకన్నియు మంచివెకాని తల్లిగా
రీవిధమొప్ప, దామె కిది యించుకయున్ దెలియంగరాదు కో
పావిలమైనచో మనకు హాని ఘటించుట నిక్కమెమ్మెయిన్. 77

ఉ. కావున నీవు గోప్యగతిగా వసియింపుము నాదునామ మెం
దే వచియింపఁబోకు వచియించినమాత్రన యేమిగాని యే
యేవిధికైన గోప్యగతియే కడుశ్రేయము, డాఁగునంచునున్
గేవల మెంచఁగూడ దపకీర్తియుఁ గీర్తియు రెండు నట్టివే. 78

ఉ. పేరగుదాన నీవు కడుఁబెంపుగలట్టిది మాకుటుంబ, మీ
కారణమై రహస్య మది గావలసెన్ మఱియొందురీతియే
నే రెటు సంచరించెదరొ యేరికిఁ గావలె! నింతవీటిలో;
నూరనుగాని యిట్టిపురి నొక్కని కొక్కనిజోలి గల్గునే. 79

క. మీపురము లొక్కపదియా
మాపురి విడఁదీసి కట్ట మానిని! దీనన్

గాఁపురము సేయుగేస్తులు
దాపునఁ గలవారిపేరె తామెఱుఁగరుసూ! 80

తే. గీ. అట్టిసంగతిలో నిట కధికదూర
ముండు మావీధి, యియ్యెడనుండు నిన్ను
నెవఁడుగుర్తించి మాతల్లి కెఱుఁగఁజెప్పు?
నట్లయిన భయమేలన, నదియు వినుము. 81

ఉ. మీపురిలోన నే పలుపు మిక్కుటపుం బను లట్టు లుంచు మే
మేపను లేను నీపడకయింట నొనర్చితి వాని వన్నిటిన్
దాఁపక చెప్పినారెవరొ, తల్లి కిదెక్కడివింత! జారతా
వ్యాపృతి తానయై జగముపై కరుగున్ నిజ మింత కోమలీ." 82

క. అనవుడు జలజాక్షియు బె
గ్గున మందిన పగిదిదోఁపఁ "గులవనితగ న
న్నను జూచెదనను టది యె
ల్లను బోయెనె? యెంతలోఁ గులటనైతిఁ గటా! 83

క. జారుఁడను దుర్యశము పర
నారులఁ జోరగతిఁ గూడు నాయకునకు నౌ
మా రమణిఁ గొనిన నీయప
కీరితి లేదిపుడు నీదుకృప పింటి నిటుల్. 84

క. ఏలంజె వచ్చుఁ? దానై
వేలకువేల్ మైళులున్న వీటికి నీ కి
ల్లాల నమకొంటి "గలదే
రై" లను మల్లైనఁ దవకు రానేల? యిటుల్. 85

క. యోగినిగతిఁ గాలమ్మును
నే గడపుచునుండ నీవు నేరుపుమై నన్
భోగినిగఁ జేసి చింతా
భాగినిగాఁ జేయనుంటి పాగయితిఁ గటా! 86

తే. గీ. మొదల మాతల్లిమాటల మోసపోక
పురుషసాంగత్యమున బుద్ధి పోవనిక
యుండ నాముండ యొక్కనికొప్పఁజెప్పె
వాని నానాఁడ పోఁగొట్టి వగ్రితముగొంటి. 87

ఉ. దానికి నంతరాయమయి దాపర మైతివి దానికేమి నా
మాన మెఱుంగకే కడుసుమాళమునన్ దగునిన్నుఁజూచి మా
యానిధిగా గణింప కకటా! తుద కెందుకుఁగాని పందనై
బానిసతొత్తనై చెడితి భారము నీకయితిన్ వృథాగతిన్. 88

ఉ. ఎందుకు సృష్టిచేసెఁ బరమేశ్వరుఁ డీచెడుగుంగొలమ్ము? పై
నందముఁ జందమున్ గలుగునట్లు లొనర్చఁగ నేల? చేసెఁ బో
పందల కెల్ల విందొనరుపన్ విధియింపఁగ నేల? యూరకే
కుందఁగఁజేసి యిక్కరణిఁ గుత్తుక గోయఁగనేల? యక్కటా. 89

ఉ. అందముఁ జందముం గనియొ యాదరము న్నిజమంచు నమ్మియో
వందలు వేలు నీయఁదగు వాఁడనియో యొక మాయకానికిన్
డెందము నమ్మి వానికిఁ గడిందిగఁ బ్రియము ధారవోసి యం
తం దనువీడ నేడ్చెడి యనాథకులమ్మనఁ బుట్టఁ జెల్లునే? 90

చ. కలుగుట దుర్లభం బొకఁడుకల్గినఁ బెద్దరహస్య మందుకున్
దలరక యొప్పుకొన్నఁ దుదిదాఁకను నెగ్గదు వానిచెల్మి యే
వెలచెలియేని యొక్కయెడఁ బ్రీతియొనర్చుట తప్పిదంబు పం
దలయినఁ దప్ప నొందుగతితమ్ములు దీన జనించు టొప్పునే. 91

చ. కలిమిని లేమి నొక్కగతి గారవమున్ బచరించుచుణ దళ
త్తళ గల జవ్వనమ్ము దిగఁ దాగ్రివిన పిమ్మటనేనిఁ బూర్వపుం
జెలిమి యొకించుకేని యెడసేయని పెన్మిటి గల్గువింతి కం
జలి యొనరింప నొప్పు దివిషత్పతి యుంచిన సాఁవియేనియున్. 92

సీ. తగినసంతాన మ్మొదయమంద "నాయనా!"
యని వార లెవ్వాని ననఁగవలయు?

అన్నదమ్ములు గౌరవార్హు లుండిన వారు
తల లేమనంచు నెత్తంగవలయు?
తనుఁ గన్నతండ్రి యుత్తముఁడేని యతనిమొ
గమ్మెమిగతినిదాఁగాంచవలయు?
ఏదేని శుభకార్య మేతేర నెవనితోఁ
గాంక్షమైఁ బీఠ మెక్కంగవలయు?
తే. గీ. నక్కటా! తాను బాడగు టట్టులుండ
వెనుకముందటివారల వెలికిఁ దార్చు
రోవెలందుల పుట్టువుల్ రోఁతగావె
యెఱుఁగనేర రీయర్థమ్ము హీనమతులు. 93

ఉ. అట్టికులమ్మునం దెటులనైన మహేమి పురాకృతమ్మునన్
బుట్టినదానికిన్ వగవఁ బూనిన లాభము గల్గఁబోదు, తాఁ
గట్టినకర్మముల్ కుడుపుగాంచక తీఱునె? యిప్పుడేని యీ
గుట్టు నెఱింగి యొక్కరునిఁ గూడి దినమ్ములు పుచ్చఁజెల్లదే? 94

ఉ. ఒక్కనిఁగూడి కాఁపురము నొప్పుగఁజేసెడి చానపొంచు తే
ఫక్కిని జారుఁడన్న దురుపద్రవమున్ గలిగించు, వింటి నీ
చక్కనిగాక సర్వజనసమ్మతమై మశయాశమందుఁ బే
రెక్కెడి నగ్రజాతులకు హీనకులాంగనతోడి కూటముల్. 95

ఉ. కావున నన్ను జారగతిగాఁ గయికొందువయేని నొల్ల "భా
ర్యావిధిఁ జూచుకొ" మ్మనుచు నప్పుడచెప్పె మదంబ, దానికి
న్నీవెటు లొప్పికొంటి? పదినేఁడిటులన్ గికురింతె? మాకొలం
బేపగదైన మాసరణి యేవము నైఁప దదెన్నిభంగులన్." 96

క. అనవుడు సుదాయుఁ డచ్చెలి
కను "నే లోకోక్తి నంటి, నది నీకింతన్
మనము నలయించెనే! యే
మని భార్యఁగ నిన్నుఁ జూడననుకొంటి? చెలీ. 97

ఉ. చక్కఁదనమ్ములేదొ? గుణసంపదలేదొ? వయస్సులేదొ? బల్
టక్కులమారిగావొ? వివిధమ్మగు విద్దెలు నేరవో? నినున్
జిక్కని కౌఁగిటన్ జనవు చేసినపిమ్మట భార్య గీర్యయున్
మక్కువకానె? యేల యనుమానము? మానుము మానినీమణీ. 98

ఉ. నమ్మవుగాని నీవు మదినాటినదాదిగ భార్యఁ జూడఁగా
నెమ్మది సమ్మతిం గనదు నేరము, లూరక తోఁచు దానిపై
నెమ్మియుఁ బూచు నీగుణములేకద; యింతకు కారణమ్ము, నీ
సొమ్మనుకొమ్ము నన్నును దిశుద్ధిగ మాటలు వేయునేటికిన్. 99

గీ. విప్రులకు నాల్గుజాతుల వెలఁదులందుఁ
గలదు స్వాతంత్ర్య మది నేఁటి కలియుగమునఁ
గాదనుచుఁ గొంద అడ్డిరిగాని యింత
మాత్రమునఁ బోయెనే? పూర్వమతము సకియ. 100

సీ. బ్రాహ్మణుఁడై పుట్టి పరమచండాలితో
సంసారియైన విశ్వాసి యొకఁడు
ముగురను మున్ జంపినముండమోపిని గట్టి
కొని గృహస్థయిన సుగుణుఁ డొకండు
ఐకమత్యమున కియ్యవి ముప్పనుచుఁ గులా
చారముల్ వదలినజాణ యొకఁడు
"పింగాళిచిప్పకు వెండిగిన్నెకు భేద
మున్నదే!" యనియెడి యోగ్యుఁడొకఁడు

తే. గీ. వీరలేకద సభలలోఁ బెద్ద లిపుడు!
మనకు మర్యాద వీరలేమని యొనర్పు?
రింతకును దవ్యవంతున కెవనితోడ
నేమిపని? వెలి యాతని నేమి సేయు? 101

చ. జనని గతించుదాఁక నొకచందమునన్ జననిమ్ము; మీఁద ని
న్నును స్వగృహమ్మునం దిడుచు నూతనబుద్ధి యొకింతలేక నా

జన మదియెల్ల నీకు నుపచారము సల్పెడు నట్లొనర్తు; న
న్నునియెడి వాఁడొకండు గలఁడా! మఱి తల్లి కొకింత జంకెదన్. 102

ఉ. దాఁపఁగనేల? విన్మమ్మ, మును తండ్రి గతించెడువేళ ద్రవ్యమున్
జూపి ముదంబుతో "నిది త్రిశుద్ధిగ నీ మరణంపువేళ నీ
వీపసివాని కిమ్మిచట నించుకయేని వ్యయింప కందులో
నోపినమాత్రముం గలిపి యుచ్చగతిన్ బొనరింపఁ గాఁదగున్. 103

తే. గీ. యౌవనము ధనసంపద యాధిపత్య
మవల నవివేక మియ్యవి యడఁచు నొక్కొ
క్కొక్కటియె మానవుని నివియొకట నన్ని
యునుబొసఁగెనేనిఁ జెప్ప నేముండు సాధ్వి! 104

చ. నవనవయౌవనుండయిన నందనుఁ డొప్పుగఁ గాంగి చల్లనా
రి వెలయుపాలభంగి నొకరీతికి వచ్చెడుదన్క జాగరూ
కవిధిని సర్వముం బయినిగాంచుచు ద్రవ్యము చేతి కీక పై
వ్యవహృతిశాలి యైనయపు డంతయు వానికిఁ జెందఁజేయుమీ." 105

చ. అని పలునీతులన్ దెలిపి యాపెకు సర్వము నప్పఁగించెఁ; గా
వున మన కామెసమ్మతిని బూనకచెల్లదు; దానఁజేసి ని
న్నునిచెద వేఱుగాఁ, బిదప నోపిక పెట్టితివేని యెల్లరన్
బనిఁగొనుదానవై మెలఁగవచ్చును బొచ్చెములేనితీరునన్. 106

చ. అనవుడు నవ్వెలంది యను "నక్కట, యెందులకింతనోదె ? నీ
జనని శతాబ్దముల్ సుఖవశమ్మున నుండెడుఁగాక, నీధనం
బును సుఖముండుఁగాక, నను మోసముచేయక భార్యగాఁగఁ జే
కొను టది చాలు; వచ్చెఁ బదికోటులు దానన నిక్కమింతయున్. 107

చ. ధనము గడించియుంచి యది తాము గతించెడివేళ నెవ్వరే
నినిఁ గొనిపోయిరే? జగతి నీతి యనీతియుఁ గీర్త్యకీర్తులున్
జనవనువేళ వెంటఁబడుఁ దక్కినదంతయు దూరదూరమై
పనుపడు; దీనికేమి, పదిపాళులు నీకృప గాంచఁగల్గితిన్. 108

ఉ. చిన్నటనాఁటనుండి కడుఁబెంకెతనమ్మున నుంచెకాని మా
కన్నెలఁబోలె నెల్లరకుఁ గాళ్ళకు మ్రొక్కెడి దానఁగాను; నా
మున్నరికంబు సాగుటకు మూలమవై ననుఁగొంటివీవు; లే
కున్న మతేమిలే ధనము, లుల్లము చల్లఁబడె న్నిజమ్ముగన్. 109

ఉ. ఏమనఁ దెల్పుదాన విను మే మొద లీకొలమందుఁ బుట్టలే;
దేమనుజుండు నన్గనెనొ యెవ్వతె తల్లియొ యే నెఱుంగ న
న్నేమెయిఁ దాను గైకొనెనొ యియ్యది పెంచియుఁ బెద్దఁజేసి బల్
నేమము లోలి నేర్పెఁ; గులనీతికిఁ దావలమై చెలంగఁగన్. 110

క. ఆనీతులు నామది కిం
తేనిం జొఱఁబాఱ; వేగతిన్నేర్చును? చి
న్నైక్కె నెగడనిపక్షికి భా
షానియతి న్నేర్పఁ; గులమ చను ముఖ్యంబై. 111

క. సంగీతము సాహిత్య
మ్ముం గొమరగు నభినయమ్ము ముగుదులకెల్లన్
సంగతములగుట నాకుఁ బొ
సంగున్ దగుపాటిపర్జ్ఞ జగదీశుకృపన్. 112

ఉ. ఇంతకు నాకొలమ్ము మొద లెయ్యదియో విననైతిఁ దల్లితోఁ
బంతము పట్టికోరినను "బ్రాహ్మణకన్య" పటంచుఁ బల్కె; నే
వింత విధమ్మున న్నను వివేకవిహీన మదంబ గాంచి ని
శ్చింతమెయిన్ ద్యజించెనొ, యిపీ! పడుపుంగొల మాశ్రయించితిన్.

ఉ. కోపమువచ్చు మీకనుచుఁ గొంకక పల్కెద మీకొలమ్మునం
దేపగుచున్న దీయధమవృత్తి యదేమనఁ, బెద్దవృద్ధు తా
నేపసిపాపనో ధనమునిచ్చి కొనున్ గనునంత మృత్యు, వా
పాపిని మమ్ముఁబోఁటుల నపారముగాఁగని యిట్లొనర్చెడిన్. 114

శా. పోనీ, స్త్రీలు పునర్వివాహమునకున్ బోరామి వాదించు వి
జ్ఞానుల్ పండితు లేమిపాపమొ! ధనాశన్ గూఁతు వృద్ధాత్ముఁడౌ

వానిన్ జేర్చునపాత్రిఁ 'గూడ' దన; రవ్వాఁడిచ్చు నన్నోదకా
లానందమ్ము మెయిఙ్గా భుజింతు రిది యన్యాయమ్ము గాకుండునే. 115

శా. కన్యావిక్రయ మాఁగలేని యల విజ్ఞానుల్ పు తేమంచుఁ దా
మన్యాయమ్ముగ స్త్రీ పునఃపరిణయవ్యాపార మాఁపంగ వే
డ్కన్ యోజింతురు! రెండునుం దగనివే కాఁబట్టి యందొక్కటన్
మాన్యత్వమ్ము మతొక్కటన్ దొసఁగ దేమూఢ్కన్ బొసంగింతురో.

మ. పతితోఁ గొండొకకాలమున్ సుఖములన్ బ్రాపించి పై వాఁడు పో
వుతటిన్ మేటివిరక్తిమై సకలమౌ భోగమ్ములన్ వీడి బో
డితలన్ దాల్చి యతిస్థితిన్ గనుట పాటింపన్ దగున్ గాని చి
న్నతనమ్మందన నాలుగేఁడులపుడేనా, యిట్టివైరాగ్యముల్? 117

ఉ. అట్టివయస్సునన్ విధవయై యది యించు కెఱుంగనప్పు డా
బొట్టెను గాంచి కొంద "ఱిది పూర్వమునం దిటు పెట్టిపుట్టె" నం
చెట్టులొ పల్కుదుర్; మఱి యదే పయి నొక్కనిఁ గట్టుకొన్న నాఁ
డిట్టులు పల్కరాదె? యవు డెక్కడికేగెఁ బురాకృతం బహో! 118

తే. గీ. స్త్రీపునఃపరిణయములు సేయవలయు
నంచుఁ దర్కింపఁగాని యీయుబలలైన
బాలవిధవలపట్లనా, పండితులకుఁ
గల్గు పాండిత్యమెల్లఁ జిక్కఁగనదచుట! 119

శా. సంజన్ మొగ్గిక్కరు కాళ్ళునేనిఁ గడుఁగర్ శౌచం బటుండంగ లో
నం జంకర్ మన మిట్టులుంటి మిది యంతర్వాణి లీక్షించిరే
నిం జాలన్ వెలియౌ నటంచు నొకరేనిన్ వారి వారింప రి
క్కం జాతుల్ తమధర్మశాస్త్రములకున్ గన్పట్టి రెప్పట్టునన్. 120

ఉ. మాలల నంటుకోవి జనమాన్యులు, శూద్రులు చేసి తెచ్చు భ
క్ష్యాలు భుజింపనట్టి గుణగణ్యులు, మీకులమందు నేఁడు లే;
రీలలి సంచరించు ఘనులెల్లరుఁ బంక్తికి నర్హులై పతుల్
గూలఁగఁ బెండ్లిచేసికొను కోమలు లెట్టు లనర్హ లౌదురో! 121

శా. ఆయాస్కూళ్ళను బండితుల్ గలరుగా! యందెందు విద్యార్థు లే
మీ యేర్పాటుగ నుండిరే? యచట లేరే? దుర్కలున్ మాలలున్
సీ! యీయెల్లర కందు వేదమయినన్ జెప్పంగఁ దా మొప్ప వి
ద్యాయత్తుల్ కులవంతులై విధవ పెండ్లాడన్ గులంబూడెనే? 122

ఉ. కావున నేను నీపిదపకాలమునందలి విప్రజాతిలోఁ
బావనురాలనై మెలఁగవచ్చును సంశయమేల? భార్యగా
నీవు పరిగ్రహించుటకు, నీతులు జాతులు నానకట్టకున్
గావలెఁ బూర్వమం,దిపుడు కైకొనువారెవ రాప్రచారముల్? 123

తే. గీ. ఎవరు పూర్వపుటాచార మెఱుఁగువారొ
వారలకు శాస్త్రముత్తరవాది యిచటఁ
దక్కువారల కీజోలి తగుల దెవ్వ
రేని నడిగిన నోరెత్త రిట్టులనిన." 124

ఉ. నాపుడు నవ్వి "మాకాలమునంగల వైఖరు లిట్టులుండుటన్
నీ విటు లంటి తప్పిదమె? నీచులు మాన్యత గాంచఁబట్టి యా
యీవిధు లిట్టు లయ్యె; నిదియే మన పూర్వపుఁగాలమైనచోఁ
బాపనపుం గొలమ్ము లిటుపాడయినన్ బుధు లూరకుందురే! 125

మ. సరసంబౌ గతిఁ బల్కితీవు బలవత్సన్న్యాస మన్నట్లు ని
ష్ఠురమౌ జవ్వనమందుఁ గాంతలకు నెట్టుల్ గూడు వైరాగ్య? మె
వ్వరికో జంకి యొనర్చు నేమములు నిల్వన్నేర్చునే? జన్మమే
బరువై తోఁచెడు భర్తలేనిసతికిన్, బైమాట లింకేటికిన్. 126

మ. పతిపోవన్ బలవద్గతిన్ సతిని దద్భర్త్రింగముందుంచి వే
చితి నంటించెడు ఘోరపుంగృతిని వాసిన్ గట్టిపెట్టించి రే
మతిమంతుల్, తగవార లియ్యబలలన్ "బాల్యమ్మునందే వివా
హితలం జేయఁగరాదటం" చనిన నీహీనస్థితుల్ తగ్గెడిన్. 127

మ. "పదియేఁడుల్ చనుమీఁదఁ జేయఁదగు నాపై రెండు దాఁటంగరా
దిదివో! స్త్రీలకుఁ బెండ్లికిం దటి" యటం జేర్పాటు గావించుచో

ముదితల్ వృద్ధులఁ బెండ్లియాడుటలు తప్పున్; దానిచేఁ దగ్గుఁ దాం
బదిపాళ్లీ దురుపదరిద్రం, బదియు విద్వత్సమ్మతిన్ గాఁదగున్. 128

తే. గీ. ఈడువచ్చినకన్నియ నెవ్వఁడేని
వృద్ధునకు నమ్మఁజూప నెవ్విధినిసాగు?
నక్కటా! యెన్నివృత్తులో యవనినుండఁ
బంద లీవృత్తికతన జీవనముగొందురి. 129

తే. గీ. అప్పదీక్షితు లొక్కప్పు డాత్మజాత
కిట్టి దురవస్థగల్గఁ దానెఱుకకల్మి
స్త్రీపునఃపరిణయములు నేయఁబూని
యును వెనుకదీసెనఁట తల్లి యొప్పకునికి. 130

ఉ. అప్పటికాలమందు నెటులైనను నిప్పటి విప్రజాతికిన్
దప్పని దోఁచ దిప్పని, వృథాగతి వారలగోడు వోసికో
నొప్పుటకన్నఁ బండితుల కొండొకదోసములేదు; పెక్కు తా
తప్పుల కొప్పి యీయొకటి తాము సహింప రదేమి పాపమో! 131

తే. గీ. అరయఁగాలేక మిము వెలయాంద్రటందురి
గాని యీయర్థమది నేఁటికాలమందు
దరివ్యమిడి పెండ్లియాడిన ధన్యతముల
భార్యలకు నెల్లఁ జెల్లఁగావచ్చుఁగాదె. 132

శా. సాంకర్యమ్ము తటస్థమౌననుచు విశ్వస్త్రావివాహమ్ము వి
ద్యాంసుల్ పెద్దలు గాదటం చనిరి సత్యంబే, యిదొక్కండె యీ
పంకంబున్ ఘటియించుచో నిటులనన్ బాగౌఁ; దనంతస్ జగం
బింకం బాతెడిపట్ల నీనియమ మిం దెవ్వాఁడు పాటించెడిన్. 133

ఉ. భూతిమొగమ్మునంగలుగు పుణ్యుఁడు ప్రొద్దుట స్నానసంధ్యలన్
జేతము జొన్ప వైదికపుఁ జెయ్వులమానిసి నూటి కొక్కఁడే
నీతతిఁ గానరాఁ, డిపు డివేటికిఁ? బూర్వపుగాధతేల? వి
ద్యాతిశయంబు మాని బుధు లందఱు దీనికి నొప్పరాదొకో. 134

శా. వ్యాసాదుల్ ఋషులై నిజమ్ము లయి తద్వాక్కుల్ భవిష్యద్గతిన్
బూసస్ గ్రుచ్చినరీతిఁ జెప్పు టదియుఁ బోకుండి యారార: వీ
రే సారజ్ఞులు? వీరి కయ్యెడల లేనేలేదు విశ్వాస, మీ
యీ సక్లేష్టే నెటు లుండు? భ్రష్టులగువారే తన్మతోద్ధారకుల్.'' 135

తే. గీ. అనుచు నాయాయిగోష్ఠిని నతఁడు నదియుఁ
గొంతతడవు వాదమ్ము దమంత సల్పి
"మనకు నీగొడవేటికే? ఘనులు దీని
విందు'' రని విరమించి పై వేడ్కఁదనర. 136

తే. గీ. తమకు ననుగుణమైన వర్తనలఁ గొంత
తడవు గడపి యామీఁద నుదారుఁ డింటి
కరిగి ప్రతిదిన మీరీతి సతిరహస్య
మైనగతి దానిపొందు దా నందుచుండె. 137

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
జతుర్థాశ్వాసము.



# పాణిగృహీత

## పంచమాశ్వాసము.

క. సరసాంతఃకరణా! సు
స్థిరగానాభరణ! నిత్యచింతితభగవ
చ్చరణ! కవితాదరణ! సురు
చిరవితరణ! కీర్తికామ సీతారామా! 1

తే. గీ. అవధరింపు మనంతరం బట్లు కొంత
కాలము రహస్యవర్తన గలుగుమీఁద
వారినోటను మఱియు నవ్వారినోటఁ
దల్లి యెల్లసంగతి విని తల్లడిల్లి. 2

మ. అకటా! పుట్టినరోగమున్ మొదటనే యంతమ్ము గావించి పు
త్రకు యోగ్యం బొనరించినా ననుచుఁ జేతంబందు నూహించి యీ
సకలమ్మున్ వెసఁ జేతికిచ్చితి నిసీ! చండాలుఁడై వీఁడు దు
ష్టకృతిన్ మానఁడు సైఁచు టెట్టులిఁక? నింటన్ వంట లే విప్పుడున్. 3

తే. గీ. వేదశాస్త్రములందు వివేకులైన
రాజమణుల మెప్పించి మర్యాద మిగుల
నార్జనముచేసి రీయగ్రహారములను
బూర్వు లివి వీనికతమున బూదిఁగలియు. 4

వ. అని చింతించి యొక్కనాఁటి భోజనసమయమ్మున కొమరున కిట్లను.

శా. అన్నా! చిన్నతనమ్ము నుండియును సంధ్యావందనాసక్తి నీ
కెన్నంగాఁ గడునెక్కు డిప్పు డది తా నేమయ్యె? బ్రాహ్మణ్యపుం
జెన్నే ని వ్విడుచున్న దేమిగతి? నీచెయ్వుల్ వినన్ గోత్రత్తై
నన్నున్ గాల్చుచునున్న విట్టిపనులున్ న్యాయంబె? నీకోఁటికిన్. 5

చ. ఎఱిఁగి యెఱుంగకో, మొదట నేవపుఁ గార్యము సల్పితీవు పైఁ
దిరిగియు శుద్ధిఁబొందితి సతీమణియౌ కులకాంతయుండ నె
వ్వెఱికపుమాని యప్పడుపుబిత్తరి నిత్తఱి గుత్తగొందువా?
సిరిగల కొంపకున్ గలిగెఁ జేటిఁక మాటలు వేయునేటికిన్. 6

ఉ. ఎవ్వరిఁ బంపినా వచటి కిచ్చెదుముండకునై తనంతఁ దా
నెవ్వగనచ్చు? "నెయ్యెడల కెందుల కేగెదొ?" యంచు నెంచితిన్
అవ్వగదా, దినమ్మునన రాతిరి చెయ్యువెలె! నీదువర్తనల్
నివ్వెరె యెవ్వరేనియు? వినాయకుఁ జేసినఁ గోఁతి యయ్యెనే! 7

క. ఏమేమి నగలు నాణెము
లామాదిగముండ కిడితి? వౌరౌరౌరా!
సీ! మూర్ఖ! నిన్ను నీపయి
నేమియొనర్చినను బాప మించుక గలదే?" 8

క. అని యేమేమో యొద లుడి
కినగతి కనుగుణముగాఁగఁ గెరలి పలికినన్
దనుఁగానియట్లు వినియును
విననిగతిన్ జెవి నొకింత పెట్టర యతఁడున్. 9

ఆ. వె. భయముదీఱ పట్టపగలును రేయును
దాని యింటనుంటఁ దక్క సన్య
మించుకయునులేక యిల్లాలి మాటయే
తలఁపకున్నఁ దల్లి తల్లడిల్లి. 10

తే. గీ. "అంతకంతకు మొరడయ్యె నహహా! వీఁడు
భార్యఁజూడఁడు వ్యవహారపరతఁగాంచఁ
డేమిగతి?" యని యొంచి తా నేమియనక
తగినవారిచేఁ జెప్పింపఁ దలఁచె నపుడు. 11

చ. అరపరరేక యింటివ్యవహారము లన్నియుఁ జక్కఁబెట్టుచున్
చిరమునసుండి స్వీయగృహసీమకు నాశ్రితుఁడైన యోగ్య నొ

క్కరుఁ గని "పుత్రి నీతిపరుఁగా నొనరింపు" మటన్న నాతఁ డు
ద్ధురమతి యొక్కనాఁ డతనితోఁ దగ మంతనమందు నిట్లనున్. 12

మ. కులవిధ్వంసకమైన కార్యము వివేకుల్ సేయఁగాఁ బోరుగా!
కులమన్నన్ గులమూ, ద్విజాతి! యది చేకూరన్ వశంబే? తమి
జ్జ్వలతన్ బ్రాగ్జనిభాగధేయమున సంపాదించి ప్రాయంపు డు
శ్చలముంబూని యథోగతిం బడు టిదే చందంబు? నీబోఁటికిన్. 13

ఉ. జన్మములన్ బొనర్చుటో! విశాలయశమ్ము గణించుటో! సదా
మన్ననకెక్కు పండితుల మన్పుటొ! చుట్టల నాదరించుటో!
విన్నఁదనమ్ము రాదె? సువివేకము పోదె? పురాకృతంపు భా
గ్యోన్నతి మన్నుగాదె? యిటు లుంపుడుకత్తెలఁ గూడఁ బాడియే. 14

సీ. ముక్తికామినితోడ ముచ్చటించిరిగాని
వెలవెలందులఁ గాంచి కులుకరైరి
ఉపనిషత్కాంతల నుంచుకొనిరిగాని
పడుపుతొత్తుల యానఁ బాలురైరి
సాహితీసతితోడ సరసమాడిరిగాని
కులవిహీనలఁ జేరఁ దలఁప రైరి
కీర్తిభామినులకు మూర్తినిచ్చిరిగాని
గుత్తలంజెలపొందు గోరరైరి
తే. గీ. తరతరమ్ములనుండి యిందనుక మీ కొ
లమ్మువారలు నేఁటి కీ లలనకతనఁ
గొలమునకు నీకు నిహపరమ్ములకు నొక్క
పెట్టఁజెడఁదగినంత యిక్కట్టువచ్చె. 15

తే. గీ. ఇహమునం దట్టులుండ మీయింటిపూర్వు
లహహ! పరమునసేని వారాంగనాజ
నమ్మునకు సేవపడియె జన్మములు కోర్కె
యించుకయులేక చేయుట యాపు వినవె? 16

ఉ. వైదికజాతిలోఁ బొడమి వారనికల్మికి నెల్లవై యని
ర్వేదమనమ్ముతో నిటు వివేకము దక్కి కళత్రయౌవన
శ్రీ దిగులొందఁ బాడువెలచేడియ నుంచెడి నిన్ను వోఁటికిన్
మాదిరి నేయ నీ భువనమండలి నొందొకఁ డుండఁ బోలునే? 17

మ. తిరుగుంబోతులు లేరె? వారిఁ గనియున్ ధీజాడ్యమే లేనిచో
నరుఁడెవ్వాఁ డిల వారకామినుల సౌందర్యమ్ము నాసించు? నీ
పరువిం దెట్టిది? నేఁటి నీనడత కేపార్గిజ్ఞుండు లోఁగుంచఁ? డో
ప్పరికింపందగునే? కనుంగొనుచు మీప్రాపందు మాబోంట్లకున్. 18

శా. దారిద్ర్యమ్ము జనించు, మై సిరి వృథా దైన్యమ్ముపాలౌ, సదా
చారం బాఱడియౌ, యశమ్ము మొదలే సన్న్యాసముం గాంచు, సం
సారంబెంతయు నాఱు, నెల్లెడల నిస్సారత్వమేతోఁచు, నీ
వారస్త్రీసురతప్రశంస దగునే? వర్ధిల్లు సంసారికిన్. 19

క. అని యేమేమో తా నే
ర్చిన విధమున బోధసేయఁ జెవినిడక యతం
డనయము ననయంపున్ వ
ర్తన మానఁడ వీటులమనము తరమే త్రిప్పన్? 20

వ. ఇట్లు పలువురు సెప్పందొడంగుటయు.

మ. ఇదిగాదంచు మనమ్మునం దలఁచి యయ్యేణాక్షితోఁ "గార్యమి
ట్టిది" యంచున్దగఁ దెల్పి "మంచి" దనుడున్ డెందమ్ము వొంగార నొ
క్కదినం బాపురి వీడి యిర్వురును దుర్గాపట్టణం బేగుదెం
చి దిగుల్ దక్కి యటన్ వసించిరి ఘనశ్రీ మించు సౌధమ్మునన్. 21

ఉ. ఆపురి వీరి పూర్వులకు నాకరమౌటను దండ్రి యచ్చొటన్
గాఁపుర మాచరింపఁ దగఁ గట్టెను సౌధము, దానిలోనఁ దా
నీపురుషోత్తముండు వెలయింతి నొకర్తుక నుంచెఁ; జెచ్చెఁగా
కాపురుషుండు నైఁపఁగలఁడా? యిది దాఁగనులారఁ గాంచియున్. 22

ఉ. జ్ఞాతులుఁ దక్కుబందుగులుఁ గాంచి "యహా! యిది యేమివింత! దు
ర్నీతి సహింపఁగా వశమె? నేరుపుమై మరలింత" మంచుఁ బో

నాతఁడు వారి వచ్చుటకె యాజ్ఞనొసంగఁడు లజ్జ పుట్టకు
న్నే! తగు బంధువర్గ "మిహిహీ!'' యని యగ్రిమునంద నవ్వినన్.

ఉ. నవ్వుదు రెల్లవా రని మనమ్మనఁ దా నెఱుఁగండొ? యెక్కడొ
అవ్వకు నాకరంబగుట పాత్రిజ్ఞతకుం దగదం చెఱుంగఁడో?
యవ్వకుఁగాక భార్యకును నంతకుమున్నె పరుండునై బుధుల్
ప్రవ్వగఁ దిట్ట దుశ్చరిత రోయని యాయన నేమనన్దగున్. 24

శా. ఆనీటున్ వెడగుంబొజుంగు భవనమ్మం దెల్లెడన్ గాయనీ
గానానూన రసమ్ములా! యభినయత్కాంతా వినోదమ్ములా!
సూనాస్త్రాగమ చర్చలా! మిగుల మెచ్చంగల్గఁగాఁజేయు లా
స్యానందానుభవమ్ములా! యొలయు నీయావేళనా కెప్పుడున్. 25

ఉ. తిట్టఁగనిమ్ము తల్లి, సుదతీమణి బోరున నేడ్వనిమ్ము, బల్
అట్టు జనింపనిమ్ము, ధనరాసులు గవ్వలుగాక చెల్లని
మ్మట్టి యఖండ సౌఖ్యముల నందుచుఁ గష్టమెఱుంగనట్టి యా
పుట్టువుకన్న మిన్నయగు ముక్తి విరక్తి యొసంగ నేర్చునే? 26

శా. ఇచ్చున్ మద్దెలగొట్టువారలకుఁ, దా నిచ్చున్ దగన్ బాడుచోఁ
బొచ్చెంబింతయులేవి స్నేహితులకున్ బూఁబోండ్లరో యిచ్చు; రా
నిచ్చున్ బంక్తికి నెంతమంది నయినన్, వీక్షింపఁ డావంతయే
నిచ్చున్ ''ఖర్చిది యాయమింత'' యని, వాఁ డేమింరఁ గానుండెనో?

ఉ. తల్లికిఁ జిక్కు దవ్వ్య మది దక్క సమస్తము నాలుగేండ్లలో
దొల్లఁగఁజేసి యాపయిఁ గడున్ విలువైతగు నగ్రిహారపుం
బల్లెల 'సిస్తు' చాల కవి బంధకముంచి ఋణమ్ముఁజేసి తాఁ
జెల్లఁగఁజేయుఁ బల్వగలఁ జేతికి నెమ్మొక యింత యుండమిన్. 28

తే. గీ. తనదుపంక్తిని నన్నసత్రిమ్ము జరుగఁ
గామసత్రమ్ము గణికలకడఁ జెలంగ
నయ్యుదారునిఁ గొల్చుచు నెయ్యురెంద
ఱెందఱో సోమరులు పొల్తురెసకమెసఁగ. 29

ఉ. గాయనగాయనీమణు లొకానొక వేళను బాయకుండుటన్
జేయని చేరికై యతని చేతికి నాటవెలందివోలెఁ దా
హాయిగ జంత్రిపుం గల యొయార మెసంగఁ బొసంగి లొంగె నా
తీయఁదనంబు మెచ్చు వెనుదీయక గాయకుఁ డెట్టిఁడేనియున్. 30

తే. గీ. గాయకుఁడు వచ్చెనేని యక్కాలికిదాను
శిష్యభావమ్ము గైకొని చెలిమికలిమి
వానఁగలుగు విశేషముల్ తగినకొలఁది
నార్జనముచేసి కాని యయ్యనఘు విడరు. 31

శా. దాతృత్వమ్మున మించియున్ మిగుల విద్యాసక్తి రాణించియున్
మాతృద్వేషము దారదూరగతియున్ మాన్యేతరుంగా నప
ఖ్యాతుంగాఁ దనుఁజేయ నాతఁ డది లోఁగాంచంగ లేకెప్డు లీ
లాతాత్పర్యపరీతుఁడై కడపుఁ గాలంబెల్ల హేలాగతిన్. 32

క. ఆకలికి వర్తనంబది
లోకుల కొకరీతినైన లో నతనికిఁ ద
ద్వ్యాకులచిత్తుఁడగుట నా
హా కలిగించి "యది భార్యయగు" 'ననిపించెన్. 33

తే. గీ. "వీనితోనవ్వె మొన్న, నవ్వానితోఁడ
నొక్కపేళయ్యెఁ గూర్చుండె నూరకుంట
తగవె?" యని యెవ్వరేనియుఁ దనకుఁజెప్ప
వినఁడు వినెనేని నమ్మఁడవ్విధము సుంత. 34

తే. గీ. నాగరా గట్టమాని యఖండనీతి
రాకరంబగు కులకాంత యట్లన వ్వె
లంది వేషభాషాదుల నంది పైకి
నంచరించుఁ గులాచార సరణు లుడిగి. 35

మ. ధనమందిచ్చను గాదుగాని యల కాంతారత్న మప్పడు నా
థునిఁజూడన్ గవిగాయకుల్ చనుడు నందున్ నచ్చువానిన్ దవం

తన యేవేళనో వశ్యుఁ జేసికొని విత్తంబిచ్చు భర్తన్ జయిం
పనౌకో నాఁగను జిత్తమిచ్చి కడు సంభావించు గూఢస్థితిన్. 36

ఉ. ఆచెలి కేమిపాపమొకొ హాయిగఁ బాడెడి వానికన్ననున్
వాచవిగాఁ గవిత్వ మొక వైఖరి నుంత రచించు వానిపైఁ
బూచు మనంబు తాదృశుని బొందునకై మది నూరుచుండు నా
లోచనసేయుఁ దన్మయత లోలవిలోచన సారెసారెకున్. 37

తే. గీ. రాజు సంతసమందిన గ్రామమిచ్చుఁ,
బద్దెమిడుఁ గవి, బచ్చు దాపైచు ముష్టి,
యెవనిమెచ్చునో కాంత యయ్యెమ్మెకాని
కతనుపట్టాభిషేకమ్ము నాచరించు. 38

ఉ. ఈగతి నప్పడప్పు ప్రియుఁ డెవ్వరి మన్ననసేయుచుండుఁ దా
నాగజయాన వారలకె యాత్మసతీత్వము వెల్లడించు నా
బా గదియెల్ల నల్లరిగఁబై వినువారలు నవ్వుచుంద్రహో!
భోగముదాని నుంచుకొనఁబోలునె? యెంతటి పందకేనియున్. 39

ఉ. పోయినఁ బోవుఁగాక వెలబోటిపయిన్ మరులూన నెన్నఁడే
నీ యది యంతగాఁ దనకు నెగ్గు ఘటింపదుగాని యొక్కతె
"న్నా" యని యుంచుకొన్న వెటివాయనకన్నను హీనుఁ డున్నె? యే
తాయి సహింపనేర్చు నది అంకు లొనర్చి యమర్చు నేవముల్. 40

మ. వ్యభిచారంబన వారకామినుల కావంతేని లజ్జాకరం
బభిమానఘ్నము నంచుఁ దోఁచ, నది గోప్యంబేల కావింతుర
న్న, ధృతిన్ దెచ్చియొసంగు నాథుఁ డదివిన్నన్ జీవనంబూడు నం
చు భయానన్; గులకాంతరీతు లెటుపచ్చున్? వ్రాఁడఁద్రి నెట్లుంచినన్.

చ. సరసతగల్గువాఁడు గడుసంపద వొల్చెడివాఁడు నూతన
స్మరుఁడన నొప్పువాఁడు మదమత్తుఁడు నౌ విటుఁ డబ్బియున్ దరి
ద్రిరతికి నాస చేయునఁట తా వెలయాఁ లిది స్త్రీలజాతికే
పరిభితి గన్నదోస మొకబానిసలన్ వెలిఁజేయునేటికిన్? 42

మ. "ధనమేలా? సొగసేల? చక్కని కవిత్వం బెవ్వఁడే నేర్చు వా
నిని మెచ్చన్‌దగు మాటలాడఁ దగు వానిన్ బిల్చి యవ్వానికిన్
జనవీయన్ దగు వానితోడ విధిగా సఖ్యంబు గూర్పన్‌దగున్
వనితాచిత్తహరుండు వాఁ" డనుచు నవ్వామాక్షి దా నెంచెడిన్. 43

ఉ. ఏగతినైన మేటి సుకవీందురినిఁ గొల్చి కవిత్వ మల్లు నా
యాగతిఁ జక్కనేర్చుకొను నాస దినమ్మును వృద్ధిఁబొంద నా
బోగము దాన పూన్కి మెఱుఁ బొత్తములెల్లను జూచుచుండు నా
లోఁ గననయ్యె నాత్మకులలోలవిలోచనలన్ గవిత్వముల్. 44

తే. గీ. రాధికాసాంత్వనమ్మను రచనఁజేసె
పేరుగను ముద్దుపళని తెల్వియును, విజయ
నగరభూపాలుఁ డుంచిననాటి చాటు
పద్యములు గాంచి యాకీర్తి వడయనెంచి. 45

మ. ప్రియునిన్ గాంచి కవిత్వపుం గరిమముల్ పేనోళ్ళ శ్లాఘించి త
ద్దయు నావిద్దియయందు నెమ్మనము శ్రిద్ధాబద్ధమై యుంటఁ దె
ప్పియు "వారిం బిలిపించి నాకు నది చెప్పింపన్‌వలె" న్నాఁగ నా
దయితుం డాపిరియురాలి పెట్టులను విద్యావిట్టు మెప్పారఁగన్. 46

మ. కవనంబన్నను మాటలా? యదియుఁ జక్కన్ జెప్ప శాస్త్రిదికం
బవలోకింపవలెన్ బురాకృతపుఁ బుణ్యంబున్నపైఁగాని యా
చవి శాస్త్రజ్ఞులకేనిఁ గల్గ దిడియాసన్ బొంచఁగాఁ బోకు మే
వివరింపన్‌గలనా; యటుల్ గలుగు నాభేదమ్ముతెల్లన్ జెలీ? 47

సీ. చదువఁగావలె శబ్దశాస్త్రాదికమ్మును
వీక్షింపఁగావలె విద్యలెల్లఁ
జూడఁగావలె రాజచూడామణుల సభల్
పొందఁగావలె మహాభోగములను
తిరుగఁగావలె దేశదేశాలవెంబడిఁ
బడవలెఁ బడరానిపాటులెల్ల

వినఁగావలెను బూర్వవిద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃప్రశంస

తే. గీ. కవులు కవులన్న మాత్రిన కవులుగారు
ఎంతభారమ్ముగలదొ కవీశ్వరులకుఁ
దెలిసికొంటివె? యిదియ విద్దెలకునెల్ల
ఫలము; దీనికి యత్నించు టలఁతియగునె. 48

క. అన నదియిట్లను "నంతటి
ఘనమగు కష్టమ్ము దానఁ గలదేనియు నె
క్కొని యిపుడు కవిత సెప్పెడి
జనులకు మీచెప్పినట్టి శక్తులు కలవే? 49

తే. గీ. దేవభాషాకవిత్వవిధికి విశేష
శాస్త్రవిజ్ఞాన మది యనసరముగాని
దేశభాషాకవిత్వవిధికి నిదేల?
యెఱుఁగనని చెప్పుటో? నాకు నిదియునెల్ల. 50

చ. మునుపటి నాటకమ్ములును మున్పటి మేటిప్రబంధముల్ తెనుం
గొనరుచు నేఁటికై సరుల కున్నవె? శాస్త్రపరిశ్రమమ్ము ల
య్యనఘుల సత్ప్రబంధముల నందఱు మెచ్చుటలేదె? ధారయుం
డినయెడఁ జెప్పనొప్పగుఁ గడిందిగఁ గబ్బము లెవ్వరేనియున్." 51

ఉ. నావుడు నాతఁడిట్టులను "నాతిరో! నన్నయభట్టుఁ దాటి వి
ద్యాపదులెల్ల నాంధ్రమున యందుఁ గవిత్వము చెప్పి రౌఁగదా,
యా విదితాత్మలొక్క తెలుఁగా! తమ రభ్యసనం బొనర్చు, టా
దేవవచఃకలాపములు తెల్లము సేయవె వారిపాండితిన్? 52

తే. గీ. తెలుఁగుతెలుఁగని యద్దాన దిగుటెకాని
సంస్కృతమ్మనకన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమమున్నఁ జాలు
దాని, కిద్దానికో! రెంటఁ దగులవలయు. 53

ఉ. ఇప్పటి కైతగాం డ్రహహా! యింగిలిపీ సొకయింత నేర్చి పై
జెప్పెద రాంధ్రపుంగయిత, సీ! యవి పండితు లాదరింతురే?
తప్పులకుప్ప లక్కృతులు తంపటవెట్టుట కేనినెవ్వరే
నొప్పిరె? వీరిఁజూచియొకొ, యూరక నీకుఁ జనించె వేఁదుఱుల్? 54

ఉ. తప్పని యెవ్వరేని విదితం బొనరించిన నొప్పుకొంటయే
తప్ప నదెందుకో యెఱుఁగు దార్ఢ్యము లేకొక ధార యూఁతగాఁ
జెప్పఁగ నొప్పు నే కవిత? చెప్పినచో నది మూసివెట్టుటే
యొప్పునుగాని పై విడుచు టొప్పునె? లజ్జ గలట్టివారికిన్. 55

చ. మునుపు మహాకవీంద్రులు సముజ్జ్వలపక్కి నొనర్చు కబ్బముల్
వినుతికి నెక్కెఁగాని యవివేకుల కూఁతలు తాటియాకులం
దునె నశియించె; నోటఁబడు తుంపురులేనియు నిప్పుడచ్చు ప
చ్చినకతనన్ జగాన విలసిల్లెడి మేటికృతుల్ నశించెడిన్. 56

ఉ. ధార వృథారసమ్మునకు ధారయిడన్ మనసెట్టులొప్పునో
వీరికి ! నెక్కడేనియు వివేకులు గల్గిన వారిఁగొల్చి త
త్సారము గుర్తెఱింగి దగు శాస్త్రము నేనియు నభ్యసించి యా
పై రచియింపరాదొకో ! ప్రబంధము, లేటికి వెట్టి యల్లికల్ ? 57

తే. గీ. కాలమహిమమ్ముగాని యేకాలమందు
వచనము రచించువారు కవనమునందుఁ
బేరుగాంచిరి, యెంతటి పేదతనము
వచ్చెఁ గవితాలతాంగి కివ్వారికతన ! 58

క. అపశబ్దమ్ములతో వచ
నపుఁగవితలు మొదలువెట్టి నారాయణ ! మూ
ర్ఖపు మనుజు లక్కటా ! కవి
తపదమ్ములు విఱుగఁగొట్టెదరు నిర్దయులై. 59

తే. గీ. సంస్కృతాంధ్రమ్ములందు వచనకవనము
మున్ను రచియించువారలు నున్నవార

నర్షమగు పాండితియును బద్యకవనమ్ము
గలిగి విద్యావిదుల మెప్పుగాంచువారు. 60

తే. గీ. పాలనుభవించువారు యవాగు వొక్క
యపుడు దాగివిన రిక్తులంచనరు వారి;
సరికదా, వారి కదియు యశము ఘటించు
లేమి నది దాగివువారి కాలీఁయెట్లు ? 61

చ. ఇపు డిఁకనొక్క కర్మమది యేమన ? నేర్చినయంతలోనఁ గ
బ్బపుఁబను లాచరింప నది పండితులొ కవులొప్పఁజూచి "యీ
కవితము సెప్పనేల!" యని గాఢముగాఁ దలవాయఁ దిట్టి దా
నిపయి విమర్శనం బొకఁడు నింపుదు రంతకు మున్మడుంగుగన్. 62

తే. గీ. కుడిచి కూర్చుండి యొక్కచోఁ నసఁగియుండ
లేక నీరేల యీపెట్టి? లేమ! యంత
వలసెనేనియు గానమందలి పరిశ్రి
మమ్ము హెచ్చించి యటఁబేరుఁగొమ్మ, కొమ్మ." 63

చ. అన సది యిట్లుపల్కు "నిజమాడితి, రైసను గానవిద్యలోఁ
బని యది యెంతచేసినను బాడెడి శక్తియె తక్క నర్థముస్
గనెడితెఱం గొకింతయును గల్గమ దాని విధమ్మలేనిచో
జననము వ్యర్థ మయ్యెది ఘొసంగెడి విద్యయె విద్య యెమ్మెయిన్. 64

తే. గీ. అన్నివిద్యలఁ గలుగు సారాంశములను
గవితలో నలరారెడిఁగాన వచ్చుఁ
గాక, రాకుండుఁగాక యక్కలకు యత్న
మును బొనర్చెదఁ బాగ్రిప్త మెట్లనువుపడునొ. 65

క. పదకవిత మొదల నేర్చితి
నది నామది కంతకష్ట మనిపింపద యే
రొదవింపలేరు వచనము
గదియింపఁగ నెంతుఁ బద్యకవన మ్మింకన్. 66

క. "ముదివిటులు విధవలంజలు
పదకవిత" లటంచుఁ దిట్టె బహుళాంధ్రవచో
భ్యుదయుఁడు శ్రీనాథుం డది
చదివితి నాపైనిఁ గోర్కె చదికిలఁబడియెన్. 67

తే. గీ. కడుపు చెక్కలుగా నవ్వుగలుగు నకట!
వేణుగోపాలశతకమ్ము వింటిరికద!
"ద్విపదకావ్యమ్ము ముదిలంజె దిడ్డిగంత"
యనుచుఁబడఁదిట్టె నతని నేయమ్మగనెనొ! 68

ఉ. కావున మీర లొక్క కవికంజభవున్ బిలిపించి యాయనన్
జీవనసేవనాదుల వశీకృతుఁగా నొనరించి నన్ను వి
ద్యావతిగా నొనర్చు టది తప్పదు; మాకులమందు ముందు వి
ద్యావతు లాంధ్రిపుం గవిత లల్లు యశస్వినులుండెఱుంగరే." 69

చ. అన మనమందు దానిదగు నాస్థకు సంతసమంది "మంచిదే"
యని కడుబుజ్జగించి తగునట్టి కవీంద్రుని రాఁక గోరుచున్
దినములు పుచ్చుచుండ సుదతీమణి యొక్కెడఁ గోరెనాతనిన్
దనపురిఁ చత్సమేతముగఁ దాఁ జనఁగా నతఁడొప్పె నందుకున్. 70

వ. పదపడి యప్పాణిగృహీతతో సపరివారమ్ముగ భాగధేయపురమ్ముచని యయ్యెడ నొక్క చక్కని బాడుగుమాడుగున వసియించి నిరంతర సుఖమ్ముల నోలలాడుచు సంగీతాది వినోదమ్ములఁ దేలు నవసరమ్మున.

చ. కన్నడసీమనుండి యొక గర్భదరిద్రుఁడు సుంత కైత దాఁ
బన్నఁగ నేర్చువాఁడు నొకపాటిగ గాన మెఱుంగువాఁడు మూ
షోన్నతి లేనివాఁడు పయసొప్పెడి వాఁ డొక బ్రాహ్మణుండు వ
చ్చె న్నిజశక్తిఁ జూపి సిరిఁజెంద నుదారునిఁ జూచు వేడుకన్. 72

మ. పదపద్యమ్ములు కొన్ని చెప్పి తనదౌప్రావీణ్యముం జూప "నే
మిది నీవున్ గవనమ్ము చెప్పఁగలవా? యెందెందుఁ బాండిత్య ము
న్నది?" యంచున్ శ్రుతపాండితీగరిమ నాయాయావిశేషమ్ములన్
గదలింపన్ వెఱఁగంది యక్కవి రిక్తత్వమ్ము సూచించుచున్. 73

ఉ. "స్కూలున నింగిలీషు నొకకొంత పఠించితిఁ దెల్గు దానితో
వేలగ నభ్యసించితిని లేమిమెయిన్ ఖయిరెండు సాగమిన్
జాల విచారమంది వెస ఛంద మొకించుక చూచి గానపుం
జా లది పూర్వమే కలిగి సాయ మొనర్పఁ గతల్ రచించితిన్. 74

చ. హరికథలల్లుచున్ గృహమునందలి రిక్తత వాపికొంచు నేఁ
దిరిగెద దేశముల్, తగు సుధీమణి శిష్యొకింత లేమి సు
స్థిరగతిగాఁ గవిత్వ మది చెప్పఁగఁజాలఁ గటాక్షముంచి మ
త్పరిచితమైన యట్టికతఁ బాడఁగ నాజ్ఞయొసంగ వేఁడెదన్." 75

చ. అన జలజాక్షిఁ గాంచి "చెలియా కః నుఁగొంటివె యీపసన్?పటుం
బ వియత్కై ధనాఢ్యులను వంచననేయఁ గవిత్వమంచుఁ గై
కొని వెఱిమొఱ్ఱి పద్దెములు కొన్ని రచింపఁగఁ జొచ్చె నేను జె
ప్పినయదియెల్ల సత్యమనిపించుట కీతని రాక యుగ్మలీ! 76

తే. గీ. ఎందులోఁ జేరకుండెడి హీనులెల్లఁ
గవులలోపల నిట్టేడఁ గలియుచుండ్రి
ఎల్లవర్ణమ్ములనుగూడి యించుకంత
యంతరములేక తురకలయందుఁ గలియు. 77

ఆ. వె. ఇంగిలీషు చదివి యీకవిత్వముచెప్ప
నేల? దానఁ జెప్పనేల రాదు?
ఉభయభ్రష్టు లిట్టులొనరింతు రీనాఁటఁ
గవుల కింక నేటి గౌరవంబు!" 78

చ. అన సదయాంతరంగయయి యచ్చెలి పల్కు "విశేష పాండితిన్
గను కవిపండ్రి లిక్కరణిగాఁ జుమెంతురె యెల్లచోట్ల? కి
య్యనఘుని వాక్యమాధురి సహస్రమునేయఁగఁ జాలు మీకు న
చ్చిన కవి కాకపోయినను జెప్పఁగనేర్పుఁ గవిత్వమొప్పుగన్. 79

చ. పదివెదిశైలి గానపుఁబసం దనరారుటఁజేసి చక్కఁగా
మదికి ముదం బొసంగఁదగు మంజులమైన పదమ్ములుంటచేఁ

మొదలు రసంబు, నేరుపును బొల్చెడిఁ, దిప్పులకేమి? రక్తిసం
పద నడఁగింపనేర్చునె? చమత్కృతిమత్కృతియందు దోసముల్. 80

తే. గీ. దోషముల్గల్గుఁగాక నిర్దోషమయగుఁ
గాక రసహీనకృతికన్న ఘనరసాస్ప
దంబగు కవిత్వమెందు ముదంబొసంగు
నంకయుతుఁడయ్యు జాబిల్లి హాయినిచ్చు." 81

శా. ఆమాటల్విని యయ్యుదారుఁడును దా నంగీకృతిం బూని న
ర్మామాత్యాదులలోనఁ జేర్చికొని యాయావేశఁ బాడించు చే
మేమో యల్లికలల్లఁజేయుచును నాయేణాక్షియుం దాను ని
త్యామోదమ్మునఁ గాలముం గడుపుచున్నంతన్ దుదిన్ వానికిన్. 82

చ. ఎరు సొకయింత లేక చరియించుటచే నలకాంతపై మనం
బరిగి యదెంత దిర్పిననునట్టిటు తా వెనుదీయదయ్యె; స
త్తరుణికి నంతకున్ మునుపెఁ దన్మయమయ్యె మనంబు, దాన నా
యిరువుర లోపమేమి? యట నీతనిదే యపరాధ మెమ్మెయిన్. 83

శా. దానిన్ భార్యగ నుంచుకొన్న యతఁ డంతస్థాపితన్ జేయ క
వ్వానిన్ వీనిని గోప్యమం చెఱుఁగ కవ్వామాక్షి కేళీగృహాం
తానిన్ జేర్చునె? యిట్టులైన నదిగాదే, సత్సతీరత్నమున్
మానం బూడ్వదె? నిత్యసంగ మది యున్మాదంబు గల్పింపదే? 84

ఉ. "స్త్రీలకు గోప్యతాగరిమ చెప్పెడివారలు వెఱ్ఱు" లంచు మూ
ర్ఖాళి పచింతు రిప్పు డిటు లంగనలన్ సభ కెక్క నిచ్చి యా
మూలమునన్ జెడఁ మొగము మూసుక మిన్నక లోనఁ గుందు జ్ఞా
నాలసు లెందఱో యిల స్వయం రచితాగసు లుండి రక్కటా. 85

క. మునుపూర్వు లెంతయనుభవ
మునఁ జేసిరొ! కట్టు బాటు; మూర్ఖులు దానిన్
గననేరక యిహిహీ! యనఁ
జనునే? తమకంతకన్న శక్తులు కలవే? 86

మ. కలుదాఁకివన్ జన దంచుఁ జెప్పుటకునై కల్పించ్చు నాచెట్టునా
కలుగూడన్ గలుషమ్ము లంచుఁ దమవాక్కుల్ శాస్త్రముల్‌గా జగం
బులకున్ బోధ యొనర్చినట్టి సుమహాత్ముల్ కడు కైలాసమా
ఖులలన్ బోలఁగఁ జాలరో? వశమొకో ఖండింప నక్కట్టులన్. 87

తే. గీ. తమరు విధిలేక చేసెడి తప్పులన్ని
కడుపున కటం చెఱుంగరే ఘనులు, వాని
నొప్పులని చెప్పనొప్పుట యొక్కతప్పు
పూర్వులను దూఱుటిదియుఁ దప్పుపయితప్పు. 88

తే. గీ. స్త్రీకి స్వాతంత్ర్యముండుట చెల్లదంచుఁ
జెప్పు మను వంతపెట్టియేః చెడి కొలమ్ము
నెల్ల గంగను గల్పదే? యెఱుఁగనేర
కూరకయ శాస్త్రకర్తల మీఱనగునె? 89

ఉ. భోగముదాని కింత తలపోయఁగనేటికిఁ? గుక్క గోవునుం
గాఁగ నొనర్ప శక్యమె? యగాధము లేగతి నుంచెనేనియున్
స్త్రీగతు, లందులోఁ గఱకు చేయనివాఁడు ధవుండు గల్గఁ దా
యోగిని వంటిదైనఁ గను నొక్క క్షణమ్మున భోగినీగతిన్. 90

ఉ. ఆగతి నిర్వురున్ మరుని కగ్గలమై మనమంద మగ్గుచున్
సాగమిఁ బొక్కు "చించుకయు సందగునే?" యని దేవు వేడుచున్
రాగమె రోగమై తగఁ గరమ్ము నలందురుచుండి రంతలో
నాగజయాన సాహసము నంది కృతార్థునిఁ జేసె నాతనిన్. 91

క. సామాన్యయయ్యుఁ బరకీ
యామాన్యతఁ గాంచి వాని నహామో నిశయో
యేమ్మూలనొ చరితార్థుం
గా మన్నవనేయు నతని కనుఁ బ్రామి యొగిన్. 92

ఉ. నాయకు పక్కలో నిమిడి నాతి యెటుల్ కనిపెట్టునో యతం
డాయతిమైన నిద్రగను నయ్యెడ మెల్లనలేచి "రాదుగా?

ప్రేయసి" యంచు లో నొగులు ప్రేమిడికాని యురమ్ము చేరు నా
మాయలమారి, యయ్యతివ మానస మేమిట ధాత చేసెనో! 93

ఉ. రూపవిహీనుఁ డప్పొటుఁడు రూపసి, చీఁకటి వెల్గు, స్థండిలం
బే పఱ, పూరకుండుటయె యింపగు పల్కులు, ధూళి గంద, మే
చాఁపయునేని దుప్పటిగఁ జాన కృతార్థతఁ జెందు; సేవముల్
దోఁప వాకించుకేనియును దొయ్యలికిన్ బ్రియుఁ డబ్బుపట్టునన్. 94

మ. తనకై భార్యఁ బరిత్యజించెనఁట! మాతన్వీఁడి యవ్వాసమై
నను గాదంచును రోసెనంట! యొకఁడై జ్ఞాత్యాదిబంధువ్రజం
బునకున్ దూరంగుఁడై వెలింబడిన చొప్పున్ గాంచె నం టట్టివా
నిని దా నిట్టులొనర్ప న్యాయమగునే? నీచాత్మ కాకుండినన్. 95

ఉ. ఆతనియందుఁ బ్రేమ మొదలంట నశించియొ? కాదు; లేక ప్ర
వ్యాతిగమైన చిత్తమున నాశ జనించియొ? కాదు; రూపసం
ప్రీతియొ? కాదు; కొండొక కవిత్వ మదింతకుఁ దార్చునొక్కొ! దు
ర్జాతికిఁ గల్గు చంద మనరాదె? వికల్పము లిన్నియేటికిన్. 96

మ. మగనిన్ రూపమునన్ ధనమ్మునను సమ్మానాతిరేకమ్మునన్
దగు విద్వత్తను దక్కుభంగులను మందప్రజ్ఞుఁగాఁ జేయు మేల్
సుగుణుల్ లేకయె యొక్కరీతిమెయి నించున్ మించు గాకుండ మే
టిగుణిన్ గొల్చునె సాధ్వి? మానవతు లీతీవుల్ ప్రశంసింతురే? 97

ఉ. "పీఁడగు పీఁడు గాకునికి వేఱొకఁడో" నను నట్టి బుద్ధిఁ దూఁ
గాడెడి యందకత్తెఁ గొని యంతటఁ బోవక పంజరంబునన్
గ్రీడకుఁ గాకి నుంచుగతి గేహమునం దిడ గేహినీగతుల్
పాడుకొలమ్ము కొమ్మలకుఁ బట్టునె? పైపయి నవ్వి యున్నవే! 98

మ. తనకున్ బ్రొద్దుట లేచుటాదిగ నిశీథంబైన యందాఁక న
మ్మను చిన్నమ్మలఁ బెద్దయమ్మలను బై మాతృష్వస్రుస్తోమమున్
దన తోఁబుట్టువులన్ మరుల్గొలిపి విత్తమ్మిచ్చి భోగించు దు
ర్జనులన్ బుట్టినదాది చూచు చెలికిన్ సాధ్వీత్వమెట్లబ్బునో? 99

ఉ. ఉంచికొనంగనేల? వెల యూడిగపుం జెలులన్ జనుల్, నయో
దంచితమైన వర్తనకుఁ దార్పఁగనేల? పయిన్ దదన్యధా
భ్యంచనలైన వారలకు నల్గఁగనేల? కటా! భుజంగులన్
వంచనఁజేసె ధాత, యొకపాటి వివేకము గల్గఁజేయమిన్. 100

ఉ. ఆచెలి వానిఁ గూడి యిటు లాఅడిపోకలు వోవుచున్ బ్రియా
గోచరమైన ఫక్కినటు కొన్ని దినమ్ములు వుచ్చె; నంత నా
యీ చతురత్వమెల్ల దరి నెయ్యెడలన్ వసియించు నెయ్యురే
చూచిక్రమమ్ముగా "నిజము సు"మ్మిది యంచుఁదలంచి యొండొరుల్.

చ. కలసి యొకొనొకప్పు "డిది గాదది యా" నని చర్చఁజేసి "యీ
తులువ కిదేమి మూఁడెనొకొ? తోఁచదు, శుద్ధవరిద్రుఁడిక్కటల్
తెలిసినఁ గోపదారి వెనుదీయునె? చంపుట కాతఁ గక్కటా!
కలిగెనొకో? దురాత్మునకుఁ గాలము దగ్గటి యిట్టి దుర్మతుల్. 102

ఉ. విప్రులలో జనించియును వీరుఁ డితండు దుపాకులన్ గటా
ర్లప్రతిమానముల్ గృహమునం దెపుడున్ గనుమాయనీయఁ డా
ర్తిపత్రిదమంచు నెంచక పొరిన్ బొరి వేఁటకు నేగి కాన ఖం
తుప్రకరమ్ముఁ జంపు మన దుండగుఁ డిప్పటువున్ సహించునే?" 103

చ. అనవుడు వేఱొకండను "నహా! యతఁ డేమి యొనర్చు, నట్టి చ
క్కని విటుఁ డబ్బి సర్వవిధరామములఙా దన కున్నయప్పు డే
మని యిది గోరఁ గావలయు నా యధమున్? వరియించినప్పు డా
దని వెనుఁదోయువారు గలరా? యిదియాతని దోసమెట్లగున్? 104

తే. గీ. అక్కలికి భాగ్యరేఖ దానట్టిదగుట
వెలిక్షిరాకుండెఁగాని యీవెకలితనపుఁ
బోడిడ యిటువంటి యతిథులఁ గూడ దింత
కెందతెందఅ? నిది మన కేటికొర్తె? 105

చ. ఇది బయలెక్కుచే నిజముయేనియు నాతనిఁ జంపనేల? యు
మ్మదిత వధింపు టొప్పగును, మూర్ఖుఁడు గానియెడన్ వివేకనం

పదకలిమిన్ జెలిన్ గృహము పాయఁగఁజేయుటె మేటితెల్వి, కు
క్క దినకమానునే? తనదు గ్రాసము లేసుఖ మిచ్చి పెంచినన్. 106

చ. అనుకొన రాదుగాని మన మాతని దర్వ్యముఁ దిన్పునుండి, యే
మని పరియించె నంతకె సహస్రము చూచిన యిన్వేలంది? నే
మని సతి వీడి యీతులుప కబ్బురపుం జనవిచ్చె? వీని ని
వ్వనిత యదెట్లు చేసినను వహ్వారె! మెచ్చఁగవచ్చు నెమ్మెయిన్. 107

సీ. తను దత్తుఁగాఁ గయికొనినతల్లి ''యలోపొ
లో'' యటంచును దుఃఖ మొందుచుండ
తనకుఁ గన్నియ నిచ్చు ననఘులౌ న త్తమా
మలు లోన మలమలమఱుఁగుచుండ
తనుఁ గట్టికొన్న యుత్తమురాలు భార్య సం
తతధారవృష్టి నేత్రములఁ గురియ
తనయపత్యపు టాసఁ దలక్రిందుగా వ్రేలు
పితరులెల్ల నిరాశఁ బెట్టు దిట్ట
తే. గీ. నెందుకీ ముదితొత్తుతో నిటకు నటకు
గాలిఁ దిరుగాడు నొకయుఁగాక సాఱెఁ
బయనము లొనర్పుచును దన వైభవమ్ము
గుఱు తెఱుంగనివీనిఁ బేర్కొనఁగవలయు? 108

ఉ. మాడుపులెన్ని? పూవులసుమాళమునం దగు తోఁటలెన్ని? పై
సీడువచింపరాఁ దగని వెన్నిసిరుల్? తన కేమివచ్చె న
వ్వీడు విడన్? విడెన్ సరియె, వెన్కటి యాత్మపురమ్ముఁ జేరుటన్
బూడిద! యేటికెప్పరినిఁ బోవలె వర్తన మద్దె కొంపలన్. 109

శా. అప్పుల్ సేయుటతప్ప వేతెఱుఁగఁ డీయార్యేతరుం డెల్లరున్
బప్పుంగూడుగ మ్రింగుచుండి రిపు డిప్పాపాత్ము రా లెట్టులేక
దప్పుంగాక యదృష్టమే యిదియు నీతం డింతలోనైనఁ దా
విప్పు న్నేత్రము, లున్నమట్టుకయినన్ వీక్షించి రక్షించెడిన్.'' 110

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నాతని కెవ్వ రెఱుంగఁ జెప్ప వా
ర్విన దెవరెన్ని చెప్పినను వీఱఁడి, యంతటఁ బోక చెప్ప వా
నినె వెలిఁజేయు; నయ్యతివ నేరుప దెట్టిదొ! యింత పెంపెవా
నిని దన దాసుఁ జేసికొని నిక్కెడి నీల్గెడి విఱ్ఱవీఁగెడిన్. 11

ఉ. ఎవ్వనినేని లెక్కయిడ దెంతటివానికి నేని మ్రొక్క దీ
క్రొవ్వడఁపన్‌వలెన్ మనసుకోరిక దీఱఁగ నంచు నెంతు నేఁ
డివ్విగ చేకుఱెన్ దగినదే యిది యైన మఱేమి లాభమా?
నవ్వెడఁగుం బొజుం గిది యథార్థమటంచుఁ దలంపఁ డింతయున్."

చ. అన మఱియొక్కఁ డిట్టులను "నాచెలిజోలికిఁ బోవనేల? యా
యనకును దానికిన్ గలనె నాక్రియఁ, దప్పు లొనర్చుఁగాక యా
తని కవి యొప్పులేయగు, వృథా మనకేటికిఁ గంఠశోష? యే
మని "తగువార" మంచు నిది యాతనితో పచరింప నేగుదో! 113

క. అది వేశ్య, యితఁడు విటుఁ డి
య్యది తప్పెట్టులగు? భార్యలైన వనితలే
వదలంగనేర రీ దు
ర్మదపుం జైదముల నొరులమా పేమిటికిన్? 114

క. మన మేల నిమిత్తత్వము
గనవలయున్ దీనఁ దాపగతి దాఁగదు పైఁ
జనుఁ దనయంతన యది, య
య్యనువునఁ దోడ్పడఁగరాదె? యంతవలసినన్. 115

క. "ఏకఱ్ఱను నిప్పుండిన,
నాకఱ్ఱయె కాలు" నన్య మనవసరం బీ
పోకలు తగు యోగ్యులకున్
వాక్రువ్వఁగ రాని వింత వంతేమిటికిన్." 116

క. అని మిన్న కుండి రంతటఁ
జనియెన్ మఱి కొన్నినాళ్ళు చయ్యన నర్కా

మినికి వినాశనకాల
చ్చునను మూఁడెన్ లేనిచో సుబుద్ధి వాదమదే? 117

వ. ఇట్లు దినదినమ్మును గోరిక లీరికలెత్త నత్తలోదరి చిత్తమ్మున నత్తల పాటు దక్కి యక్కుకవి యక్కున కెక్కుడు మక్కువఁ దక్కుచు సొక్కుచు నున్నంత నొక్కనాఁటి రేయి యథాపూర్వమ్ముగ గానాది వినోదమ్ములఁ గాలహరణం బొనరించి నిశీథ మ్మగుటయు. 118

చ. తన దయితుండుఁ దాను మఱిఁ దక్కిన నెయ్యురుఁ గ్రొత్త భర్తయున్ బెనుగది నందు నందిమిడి వేఱగు శయ్యలఁ బవ్వళించి యుం డినయపు డెమ్మెకానిపయి డెందము వాఱుడు సాహసించి "యీ జను లెవరేనిఁ గందు" రని చాన మదిన్ దలపోయ కొప్పుగన్. 119

శా. అందెల్ చప్పుడుసేయ కుండుగతి నొయ్యారమ్ముగా లేచి దీ ప్తిం డెల్వొందెడిదీపమార్చి గుఱిచేఁ బ్రేమాస్పదుం జూచి "వ చ్చుం దన్వంగి" యటంచు మేల్కనిన యా చోరపిప్రియున్ జేరి యా నందింపన్ దొడఁగెన్ దదీయ మగుడెందం బెంతపాషాణమో! 120

ఉ. ఆలలియెల్లఁ దాఁ గని యుదారుని స్యాలకుఁ డెంతయేనియున్ బాలకుఁడయ్యు లోనఁ "దన బావకు నప్పరు దూరమౌటకున్ మూల మిదే" యటంచుఁ దలపోసి "యిదేగతినైనఁ బోయినన్ మేలగు నప్ప" కంచు ఱితి మీఱిన రోషముఁ దోషమున్ దగన్. 121

ఉ. అల్లన లేచి దీపము గృహమ్మున వెల్గఁగఁ జేయుసంత కా హల్లకపాణి మున్నె తనదౌ శయనీయముఁ జేరి "యింక నే కల్ల పచించినన్ మఱుఁగు గాదిది వీనికి స్పష్టమాయె, వీఁ డల్లరిసేయు" నంచు మది నల్లలనాడి దిటమ్ముగాంచియున్. 122

వ. ఉపాయమ్మున నప్పిల్లవానిం బిలిచి మంతన మ్మగునెడకుం దీసికొని పోయి వెలవెలం బోవుచు దీనమ్మగు చందమ్మున మెల్లన నిట్లను. 123

ఉ. తమ్ముఁడ! నన్ను నప్పగ నెదం దలపోయుదు. వేను నట్టి చం దమ్మున నిన్నుఁ జూతు నొక తప్పొనరించితి నెట్లు గడ్పులోఁ

బమ్మినపేర్మిఁ బెట్టికొని బావ యశ మ్మిఁక రక్షచేసెదో,
కమ్మవలెన్ స్వబుద్ధికృతకార్యము గాదిది మోస మయ్యెఁజా! 124

ఉ. ఈవిధి దాఁప నేమిగల? దేనొక నిద్దురవోయి లేచి మీ
బావయటంచు డగ్గఱితిఁ బాపి యతం డెటు లూహ చేసెనో,
భావజు మర్మకర్మముల పాలొనరింపఁగఁ జొచ్చె నింతరుణా
జీవము నీదుహస్తమున జిక్కెఁ గృతాగసురాల నెమ్మెయిన్. 125

ఉ. పాపపు నిద్రమత్తు పొరఁబా టొనరించెను గాక లేమిచో
"రూపసి" యంచు వానిపయి రోసు జనించి స్వయంవరమ్ముగా
నాపగదిన్ బయిన్ బడితినా? యిపుడేమన నేమి లాభమౌ?
దీపము కొంపదీసెఁ దన తేజము నంతకె పాయునేటికిన్. 126

మ. అది గా కెన్నివిధాలఁ జెప్పినను నీ యాపూఁట దానెంతు కీ
గదిలోఁ జేర్పవలెన్? వినంచు రద! యీరక్తిమ్ము నేఁడబ్బె; నాఁ
డుది యంచున్ మగవాఁ డటంచు నొకకట్టుంబాటు లేకున్న నీ
గ్గది దక్కుంగలదే? యిఁ కేమనుచు నేఁ బ్రాణమ్ముతో నుందునున్. 127

చ. అరమరలేమి సిగ్గువిడి యంతయుఁ దెల్పెద నంతలోన నే
నరసితిఁ గొన్ని వంగతుల "వాయస కా" రని, యిప్పుడేని దు
శ్చరితుఁడు 'పోవని' మ్మనిన సమ్మతి చెందఁగ వచ్చునా, "యిదే
దొరకెను నం" దటన్న గతి దుండగుఁ డయ్యె నిఁకేమి సేయుదున్?

చ. ఎవరిని బట్టినన్ విడువ; రేను వచించితినేవిఁ గోపముం
దపులు నొకప్డు చూచితివె, "ధర్మమె ధార్యను వీడు?" టంచు నే
మివిలి వచించుచున్ గనిన మిక్కుటపుణ్ మతియాడి, వేఱ చె
ప్పవలయునే? యెఱుంగనివి బాపగుణమ్ములు నీకు మున్నవే? 129

ఉ. ఎన్ని విధాలఁ జెప్పినను నింటికయున్ విప రేమిసేతు? 'నా
మె వ్వను జూచుకన్నఁ గడుమేటిగఁ జూడకయున్న దుర్భతో
ఛ్యున్నతి మిమ్ముఁ బొందు టటులుండఁగ నెల్లరు నంతకన్నను
న్న నన్నసువార్త' లన్న "నిను నాటుక గోసెద" నంచుఁ బైఁబడున్. 130

ఉ. దగ్గఱనుండు నీ పలుఁగుఁబ్రాగుఁబోతు లదేమి చెప్పిరో?
యగ్గికి దోసమబ్బినను సబ్బెడిఁగాక వచింపఁజెల్లునే?
మ్రిగ్గి గృహమ్ములో నిఘుమానవతీతిలకంబువక్లనే
యెగ్గును, నెంతకుం దగరె? హీనులు గొంపలు గూల్చు కూళలున్. 131

చ. నిజమగు దోసముం గనియు నిండుగృహస్థులు వృద్ధికాము లా
ర్యజనులు చూడకున్న యటు లక్కడనే మఱతుర్; దురాత్ములో,
ప్రజలకు గీడుసేయుటయ వర్తనమౌట ననత్యమేని దా
ని జగతి కెక్కఁజేయుదురు; నీచుఁ జేర్చికొనంగఁ జెల్లునే? 132

ఉ. పుట్టెఁడు పేర్మితోఁ బతికి బోరన నాయమ యేడ్వ దాతముం
గట్టిన యాపెకన్ను నసుఁ గాదనరాదె? యెటుల్ వచించినన్
బట్టినపట్టు వీడ రని బాప నెఱుంగుడు కాదె? యింతకుం
గట్టెఁడి దైవ మాపె నటు కాఁటియవెట్టెడి నేమిసేయుదుం! 133

ఉ. ఆయమ మేటిదై గృహమునందు సమస్తము చక్కఁబెట్ట నే
హాయిగ నాపెచాటున విహారపు భార్యగ నుండి యిర్వురం
బాయక కొల్వఁగాఁ దలఁతు; బానిసతొత్తులు భార్యలౌదురే?
వేయికి నుండునే యసుము వీరపతివ్రత దాన నేమగున్. 134

చ. పతిరత యుండెనేనియును వారవధూమణి, దానికెట్టులో
ప్రతిన చెడున్, గుటుంబినికి రావటు దుస్థితు "లేమి" యంటివా?
సతి గల యింటికి క్కరణి సంఘముచేరదు; చేరెనేని యు
న్నతగుణు లుందు రం; దవగుణమ్ముల దుప్పలు ముప్పొనర్పరే! 135

చ. తనుఁ బతియన్న భ్రాంతిమెయి దగ్గఱఁ జేరిన దుర్జనుండు గా
కునికిఁ బయిం బడంగలఁడె యోగ్యుఁడు? కొండొకనాతి యెట్టిదై
నను దనతల్లిగాఁ గనఁడె? న్యాయము దుర్మతి కేలతోఁచు? నె
వ్వని ననసేల? నాదు తలవ్రాఁతకు దుఃఖము నందఁగావలెన్. 136

చ. అని తనదైన తెల్వి యది యంతయు నుట్టిపడన్ బతివ్రతాం
గనయును బోలె నీతులను గల్పనసేయుచునప్పగారిపై

వసుమతి చూపు టాదిగల యావిధమంతయుఁ జూచి వాని నె
మ్మనము గరంగి నీరయి సమంజసమైకృప దానికిట్లనున్. 137

ఆ. వె. ఇంత చెప్పనేల? యే నేటి కాయన
తోడఁ జెప్పువాఁడ? దుడుకు చెంద
వలదు, తెల్లవాఱ వచ్చె నిద్రింతము
పోద మదిగో! చుక్క పొడిచె ననుడు. 138

తే. గీ. చేతిలోఁ జేయి వేయించి చెలియుఁ గొంత
యంతరంగమ్ము విశ్వాసమందఁ బోయి
యుల్లఁగను మూసి నిద్రించు నదియ పోలె
నభినయించుచునుండె నయ్యవసరమున. 139

ఉ. వాఁడును "దీన నేమగునొ పాపవిలోచన" యంచు లోన న
ల్లాడుచు "వాటుతోఁ గలిగి నంతటిదే చెలి" యంచు మెచ్చుచున్
"గూడిక యంతరాయ మొనఁగూడునొకో" యని చింత నొందుచున్
వేడుకదక్క "యెప్పుడిఁక వేగునొకో?" యని యెంచుచుండఁగన్. 140

క. కాకమ్ము లఱచె, మున్నే
"కొక్కో" యని కోళ్ళు గూసెఁ, గోరమ్ములు సు
శ్రీకలిమి విఱ్ఱవీఁగె, ది
వాకరుఁ డుదయించెఁ దెల్వి పఱచె జగమ్ముల్. 141

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వర ప్రణీతం
బైన పాణిగృహీతయందుఁ
బంచమాశ్వాసము.



# పాణిగృహీత

## షష్ఠాశ్వాసము

క. అకపటహృదయాంతర్ని
త్యకలితనాదస్వరూప! దాతృత్వశ్రీ
ప్రకటిత యశస్క! బాహా
సికలాజాలాభిరామ! సీతారామా! 1

తే. గీ. అవధరింపు మనంతరం బయ్యుదారుఁ
డించుకేని యెఱుంగమి నెప్పటట్ల
సత్తలోదరితో మాటలాడుఁగాని
యబల యొక్కింత మది సందియమునఁ బలుకు. 2

మ. తనపూర్వం బది గుర్తెఱుంగు ననుచుఁ దన్వంగి యబ్బాలునిఁ
గని, మాటాడఁ, దదగ్రమందు మసలంగా సందియం బందు; నూ
తనుఁడౌ ప్రేముడికాని మోము గని తంద్రన్ జెందు వేయేల? జీ
వనమే బర్వుగ నెంచు; దుష్కృతి దురభ్యాసంబులట్లౌఁగదా. 3

వ. అట్టియెడ సుదారుం డచ్చెలిమిన్న చిన్నవోయిన విధమ్మున నున్న
తెఱంగునరుఁ గని కన్నులు బన్నమ్ము గన్నయట్లు చింతించుచు సంతాప
మ్మగ్గలమ్ముగ దగ్గఱఁ జేరి బుజ్జగించి యిట్లను. 4

క. తెలవారిన మొద లెప్పుడు
కలికిరో? గానమ్మొ లేక కవితయొ కృషిలో
మెలపుచుఁ గలకలలాడెడి
తలఁ పేమిటి కీదినమునఁ దా వగచెడియెన్? 5

మ. కవియేమయ్యెను? గైతయెం దడఁగె? జోకల్ మాతెనే మింతలోఁ?
జవి నానాఁటికి హెచ్చెనో? యుడిగెనో? చంద్రాస్య! పద్యమ్ము లె

య్యేవియేనిఁ రచియించితే! చదువు మేదీ? చూత మందెందు నె
ట్టివిశేషమ్ములు గ్గలునో? వెడఁగుబోటీ! యింత వంతేటికిఁ! 6

ఉ. వచ్చిననాఁటఁగోలె నిటు వామవిలోచన! యొక్కనాఁడునున్
ముచ్చట దక్క యుండ వరమోహమయి యీఁగనియంత వంతలోఁ
బొచ్చినదానిఁబోలె నెటు చూచిన నొక్కవిధాన నుంటి; వే
పొచ్చెములేనిదాని కిటుపోలునె? నీకు వినీలకుంతలా. 7

క. చెప్పు మది యెట్టిదైనన్
దప్పక తీర్తు ననఁ దరుణి తడవిసోసుచుఁ దాఁ
జెప్పఁదగిన దొం డుండమి
నప్పటికిన్ బొనఁగుహేతు వది కల్పించెన్. 8

క. కల్పించి మిగులనేరుపు
జల్పనశక్తియును గ్గలుసఖి గానఁ డగన్
బొల్పి యది యక్కతమున ది
గుల్పొనిన యదియుఁబోలెఁ గోమలి పలుకున్. 9

ఉ. "మాటల కేమి లోపము? మానసవైఖరి మాటెఁ, గానిచో
నేటికి దాఁచి పెట్టితిరి? యేఁ గనకుండఁగ నిన్న జా; విదే
వాఁటను జూడ లే దొకట నాకును మీకు రహస్య మున్నదే?
చాటొనరింపఁగాఁ దగినసంగతి నా కదుగంగ నేటికిన్? 10

క. మిము నమ్మికాదె? నాచు
ట్టములకు దవ్వైతి నెంతటక్కరులొ? కటా!
క్రమముగ నను వేతొక టగు
కర్మమునఁజూచెదరు తప్పుగలిగెనె? చెపుఁడీ. 11

క. మీయాజ్ఞ మీఱితినొ? మీ
కాయాసకరమ్ము లైన యాయా కోర్కుల్
పాయక కోరితినో? న
న్నియెరుసునఁ జూడనేల? యే లాఁతినొకో? 12

ఆ. వె. మొదలనుండి నన్ను నెద నిట్లు భావింతు
రేని యింత చింత పూనకుందు;
బూవు లమ్ముచోటఁ బుడక లేగతి నమ్మ
దాన? మీరెఱుఁగని ధర్మమున్నె? 13

క. ఇఁక మిమ్ముఁ గొల్చు స్నేహితు
లకటా! నను గారవింతురా? వినరే? నా
యరుఁ డొకటి గొట్టినను మా
ధుకరపువాఁ డొకటి గొట్ట దొరఁకొనకున్నె? 14

ఉ. పేరిమి తప్పుచో నిచటఁ బెండెలు వట్టుక వేళ్ల నేల? యిల్
చేరుటనా, యటన్న మది చెల్లదు; పంజరమందుఁ గొన్ని నా
శ్కారము దా వసించి పయిలేచి చనంగ స్వజాతి దానిపైఁ
గారము నూఱుఁగాని తనగౌరవమున్ బచరించి యేలునే? 15

క. కొలమునకున్ వెలి యయితిన్
బలపంతపుబాహ్మణార్థవైఖరి మీకున్
జులుక నగుదాన నైతిన్
దల[వా]తఁకుఁ జింతసేయఁ దగదే? నాకున్." 16

క. అని బుడిబుడిదుఃఖమ్మునఁ
గనుఁగవ నశ్రువులు దొఱఁగఁగా గద్గదని
స్వన మొలయ మాట లాడఁగ
ననుపుపడని విధము దోఁప నది విరమింపన్. 17

చ. "ఇది యొకహేతు వౌనె చెలి యింతటిపంతకు? దాన నేమి యు
న్నది? యుడుగంగ నేల? కనిసంతన యేమనువాఁడఁ? జూడు మ
య్యది యటఁ బెట్టియున్న" దని యాతఁడు తెచ్చి యొసంగ నంత న
మ్మదిత పఠింప, దించుకయు మోమటు త్రిప్పదు వ్యాజమూర్తియై.

క. దాని కతఁ డెంతయేనియు
లో నొగిలి తదంగనాతిలోలుండగుటన్

"మానిని ! విను వినిచెద నీ
నానేరము నైఁపు" మనుచు నారంభించెన్. 19

క. శ్రీరస్తు చిరంజీవి యు
దారునకున్ దల్లి శోభనావాప్తిగ నా
శీరాదిపూర్వకమ్ముగ
మీఱిన ప్రేమమున వ్రాయుమే లేఖనిసన్ :.. .. 20

మ. కనువారెవ్వరొ నీవెఱుంగవు, నినున్ గన్నట్టులే పెంచి పె
ద్దనుగాఁజేసి గృహస్థుగా సలిపి సంతానాఢ్యుఁగాఁ జూడరే
చనె మీతండ్రి, యభాగ్యురాల నగుటన్ జాయాపరిజాయూరు నిన్
గన జీవించితి నేటి కీబ్రతుకు ? ప్రాక్కర్మమ్ము నిందార్హమే? 21

క. కడచినదానిని సారెకుఁ
దడవిన లాభమ్ము గలదె ? దారదు సీకున్
బడదయ్యెఁ; బురాకృత మి
య్యెడఁ దా నిట్లుండె దాని కెవ్వరు కర్తల్! 22

క. ధనమును వెచ్చించితి వని
మనమున దిగులొందఁ గలరె మసుమలు? దీనిన్
దినఁగ, మనమూఁడుపొట్టలు
చనకుండునె ? చాఁప జిరుగఁ జదరయుఁగాదే? 23

క. చెప్పితిఁ జెప్పించితి నీ
యొప్పమియును దెలిసికొంటి నూఱట గన లే
కిప్పు డిఁక నొకటి వ్రాసెద
నప్పా ! యిద్దానికైన ననుమతి గొనుమా ! 24

ఆ. వె. వయసు కొద్దియైనవాఁడవు గాన నీ
కిష్ట మైనకన్నె నేఁటి తెచ్చి
కొనుము పెండ్లిచేసి ధనమెల్ల మీ కిచ్చి
సంతసింతు మేను సతియుఁ గాంచి. 25

తే. గీ. ఇంకి నొకమాట భార్యయం దిష్టమించు
కయును లేదేని యీపెండ్లిగాని సుఖసు
ఖాల మేమిట్టు లొప్పుట గాదుసుమ్ము
గేస్తు వగు ఔక్కరణినైనఁ గీర్తికరము. 26

క. నీయిష్ట, మెట్టులేని వ
తీయుతుఁడవు గమ్మ నీకుఁ దీపి గలుగు నా
రోయువిద యంటివా, యది
పాయనిదే మేము చెప్పువారమె యచటన్. 27

క. అని వినిపించిన విని య
వ్వనజాక్షియు నతనిఁ జూచి "వయసున్ గొమరున్
గొనములు గలసతి యుండఁగఁ
జనునే? నీ కిట్లు మమ్ముఁ జక్కన్ బెట్టన్. 28

తే. గీ. నీవు బాగుగనే యుందు నింద నాది
యెందు కీఅవ్వ? నీకు నే నెప్పుదేని
"భార్య వదలు" మటంచుఁజెప్పనుగదా, వి
వేకవంతు లెఱుంగని విధులుకలవెః 29

క. అని తనమనమునఁ గలవిసు
వుననో యిచ్చకమొ కాని పొలఁతి తగుగతిన్
దనకున్ బోధించిన నా
తనిమనమును గొంతకొంత దారన్ మరగెన్. 30

తే. గీ. ఉత్తరమ్మును వినిచిన యువతి దానఁ
గొంతశాంతించినట్టుల కుటిలుఁడతఁడు
తలఁచె, నాజలజాక్షి యట్టులనె యభిన
యించె మదినున్న తెఱఁగది యెటకుఁబోవు. 31

క. ఆగతిఁ గొన్నిదినమ్ములు
నేగుటయును నప్పుదేని యింతిమనము దా

బాగుపడదయ్యో దాని వి
రాగపుగతి గాంచి దాఁ గరము శంకితుఁడై. 32

ఆ. వె. ఒద్ద నుండువారి నొక్కొక్కరిని నల్ల
నల్ల నడుగుటయును నందఱెఱఁగి
యున్నవారలైన నూరకయుండి; రె
వ్వనికి వలయు నిట్టిపాడుగొడవ? 33

క. స్యాలకుని నట్ల యడుగుడు
బాలకుఁ డగుకతనఁ దగినవడువున బొంకన్
జాలక యున్నది యున్నటు
లాలలన కుచేష్టయెల్ల నతనికిఁ జెప్పెన్. 34

క. దానిపయి దానిదగు కవి
తామానాసక్తియును సహాయముగా "సీ
బానిస తొత్తిటు చేయుట
యే నిజ" మని కనలు గదుర నిటు లెద నెంచెన్. 35

క. ఎవఁడేనిఁ జెప్పినను న
మ్మవశము గా, దించుకయును మాయ యెఱుఁగఁ ద
య్యువిదనె యక్కఁగఁగను పీ
నివిషయమున దోసమెట్లు నేనూహింతున్. 36

క. అని వచ్చెడికోపమ్మును
దనమది మును పాఁతుకొన్న తాత్పర్యము గ్రి
క్కున మ్రింగఁ గొన్ని నిముసము
లనయము నితికృతివిమూఢుఁడై మ్రాన్పడియెన్. 37

ఆ. వె. ఎనిమిదేండ్లమంది యేకశరీరమై
యున్నవన్నెలాఁడి యొక్కయింత
లోన శత్రువయ్యె, లోమాఱ వెనుకటి
చిన్నెలెన్నఁబడునె? చేటుదక్క. 38

వ. అట్లు మ్రాన్పడి యతం డొక్కింత తడవునకుఁ దెలిసి

తే. గీ. ఎఱుఁగ కుంటిని గాని యీహీనబుద్ధి
యెల్లపుడు నిట్టిదే, దీనియెడల నిట్టి
చపలభావమ్ము గలదని సాఁతెనొక్కి
చెప్పఁడే ? మొట్టమొదట లొక్క స్నేహితుండు. 39

మ. అకటా! పిన్నటినాఁట నుండియును నన్యాసక్తతన్ సుంత గా
నక పేర్మిన్ భయభక్తులఁ గొలుచుధన్యన్ మాన్య నిల్లాలి నూ
రక యీతొత్తువలన్ దగుల్కొని విచారమ్మందు మున్గంగఁజే
యు కుచేష్టన్ దగినట్లొనర్చె; నిదియే యుక్తంబు దా నెమ్మెయిన్. 40

చ. ధనమును వమ్మొనర్చితిని, దల్లికి దవ్వయి తార్గుఁబోతులం
దును నొకపద్దు కైకొని యధోగతికిన్ దగువాఁడ నైతి, నీ
యనుచితకృత్య మంతకును నక్కట! యియ్యది కాదె హేతు? వే
మనుకొన నేమి లాభ మగుఁ? నన్నియు నింతకుఁ దీఱెఁ బూర్తిగన్.

ఆ. వె. ఏ నెఱుంగనైతిఁ గాని యీదుష్టురా
లింత కెంతమంది నిచటఁ జూచి
"ఇంతకన్న బుద్ధిహీనుఁడు లేఁ"డను
యశము నాకు జగతి కంపెనొక్కొ. 42

క. అని పశ్చాత్తాపమ్మును
గని హితులకుఁ జెప్ప రండగర్భ మగుటఁ గా
దని యటునిటునున్ దోఁపక
తనలోఁ దా నిమిడి యయ్యుదారుం డుండన్. 43

చ. క్రమముగ శంకఁ దక్కి యలకంజవిలోచన "నాథు స్యాలకుం
డమలినచిత్తుఁడే" యనుచు నాత్మముదం బొకయింత గాంచుచున్
"రమణుఁడు తన్నుఁ జూచుటకు రా కెటు తక్కెనొ?" యంచు సేశిన
ద్మము విడి వచ్చె నచ్చెలి యుదారుఁడు చింతిలుచున్నచోటికిన్. 44

ఉ. వచ్చెనుగాని రాత్రి యొకవైఖరి స్వప్నము గాంచి యుంటచే
నచ్చపలాక్షి యందుఁగల యాత్మమ్మృతిన్ దలపోసి "నిక్కమౌ

చెప్పుటఁ గాని యేమొ విధి యెట్లొనరించునొ" యంచు సంశయం
బిచ్చఁ జరింప నగ్రిముడనే యొక భంగిని విల్చె రిత్తగన్. 45

చ. నిలిచినయంత నచ్చెలికి నేత్రము దాఁ జలియించె దానికిం
దలరక దక్షిణంపునయనంబగుటన్ మతికొంత సందియం
బొలయఁగ "మారకే యిటుల సుండుటయున్ గల" దంచు దాని లో
దులుపుచు లేనితోస మలతొయ్యలి దాల్చుచు నట్లు యుండఁగన్. 46

ఉ. ఎవ్వఁడు దేనిగాలి యొకయించుక సోఁకినఁ దుర్భిక్షి చూచు నిం
కెవ్వఁడు దేనిదాక కెదు రేగి యెదన్ దమిఁ గౌఁగిలించు నిం
కెవ్వఁడు భార మం చెఱుఁగ కెప్పటి కంకమునంద నిల్పు వాఁ
డవ్వగలాఁడి వచ్చుటయ యాత్మ దలంపఁ డుదారుఁ డయ్యెడన్. 47

క. అటు నిలువం బడి చింతా
జటిల మ్మగు నతని చిత్తసరణిన్ గల దే
మిటి యొకొ ? యిటు లింతటిలో
మటమట యీతనికిఁ గల్గు మర్మ మదేమో ? 48

క. స్యాలకుఁడు తంపి పెట్టెనొ ?
బాలకుఁ డతఁ డేటి కట్టి పని యొనరించుఁ
గూళ లెవరేని వానికి
పీల యిడి వచింపఁ జేసి రేమో ? మరలన్. 49

ఉ. ఏనొనరించుచేష్ట యది యీచినవాఁ డొకరుండె కాక యీ
వానరసేన కెట్లెఱుఁగ వచ్చు ? నెఱుంగక యేమి, పిల్లి దాఁ
గాననికన్నులన్ భయముఁ గంపము నొందుచుఁ బాలు ద్రావ నే
ర్గానరె ? కొంపఁ దీయుటకుఁగాఁ బ్రియతించిరొ యేమొ ? యీసునన్.

చ. ఎటు దొరకున్ ? ధనాంగనకు విట్టికొలమ్ము వయస్సు రూప మ
క్కటికము పేర్మి గూర్మి గలకాముకుఁ, డేటికిఁ బోతి వానితోఁ ?
గుటిలుఁడు వానికైత యది గొంతుక గోసె, దరిద్రుఁ డేటి కి
ట్చట కరుదెంచెఁ, గూళవిధిచెద్దము లెవ్వరి నెట్లు సేయవే ? 51

ఉ. హాయిగఁ బద్దెముల్ చదివినంతట వానికిఁ జిక్కుఁ గాని యీ
కోయనికోఁత దాఁ దెలిసికో గమకించెనె ? పాడుబుద్ధి, చీ !
చీ: యని యీతఁ డింక నెడఁ జేసినఁ "జాలుదు" నంచు జీవమున్
రోయక యెట్టులుందు ? సరిరోయువిదల్ ననుఁ జూచి నవ్వఁగన్. 52

ఉ. 'ఎంతటిభాగ్యమే' యనుచు 'నెంతయదృష్టమె' యంచు 'నెంతబల్
వింతలె' యంచు 'నెంతపొరలేనితలంపులె' యంచు ముక్కుపై
నింతులు కేలు వెట్టికొని యెల్లపుడు న్నుతియించు నాకు
వంతయె నిక్కమైనను రవంతయుఁ గూడవు జీవనస్థితుల్. 53

తే. గీ. "మురుగు కాలువజాతిలోఁ బొడముపలుగు
లేడ, సంసారిణులతోఁ ద్రివలేడ ? కుక్క
కిందునే నేయి ?" యని మోమునెదుట నెల్ల
వారు నిందింప బ్రతికినభాగ్యయేమి. 54

చ. పొడమితి నేకొలమ్మననొ పొందితి మిక్కటమైనభోగముల్
కడపితిఁ గాల మెల్ల వృథ గాక సుఖమ్ముల కెల్లయై చనన్
దొడిగితిఁ గట్టితిన్ గులముతొయ్యలులెల్ల నెబా సనంగ ని
య్యెడ నిఁక నేమియైన నగు నెంతకు శాశ్వత మీశరీరముల్. 55

ఉ. ఐనను నాత్మహత్య యది యంత శుభప్రద మంచు నెంచమిన్
'నానెఱజాణచెద్దుముల నాయకుఁ గా దని నమ్మఁ జేసి నా
పై నెప రిట్లు చెప్పిరొ, కృపారహితుల్ కపటాత్ము, లిప్పు డ
క్కాని దురాత్ములన్ వెడలఁగా నొనరించెదఁ గాక' యం చొగిన్. 56

ఉ. చిత్తము గట్టి చేసికొని చిన్నె లెఱింగినజాణ గాన లో
నుత్తలపాటు లేనిచెలియుం బలె దగ్గఱఁ జేరివెన్కయై
యత్తలిరాకుఁబోఁడి కను లల్లనఁ జేతుల మూసె నంతలోఁ
దత్తఱమంది "యెవ్వ" రని తత్కరకంజసమాగమమ్మునన్. 57

క. మెత్తపడెడి చిత్తమ్మును
నొత్తిగిలఁ జేసి, చేతు లొక్కింతన దా

నె_త్తి వెలిఁ జిమ్మి "సీ! సీ!
తొత్తా! నను ముట్టఁ బోకు తొలఁగు" మటన్నన్. 58

ఆ. వె. డిల్లవోయి తనదు డెందమ్ము పఱియలై
కట్టు దప్పఁ "గలలు కల్ల గావు
శకునములును గావసత్యముల్ నిజ" మని
మనసు మరల ధైర్యమునకుఁ జొనిపి. 59

క. "పరకీయచందమునకున్
జొరబడితిం గాని సుంతసొమ్మునకై క
క్కుఱితిం బడనుగదా? యే
తరుణులకున్ లేని విట్టిదశ" లని వగచున్. 60

వ. అని ౘాడువాఱి యవ్వారిజాక్షి చురచురఁజూచుచు.

ఉ. ఎప్పుడు లేనిరీతి యిది యెట్టిది? యింతటితిట్టు తిట్ట, నే
త ప్పొనరించితిన్? వెనుక దారి యదెల్లను దప్పె నింతలో
నెప్పలుగుల్ మఱేమి వచియించిరి? నవ్వుల కిట్టు లాడుటో?
చప్పుడు గాక యుండ నను సాగఁగఁ దోలు నుపాయమో? రవా! 61

తే. గీ. భార్యఁ బాలింపుమని నిన్న వచ్చియున్న
యు_త్తరమ్మునఁ జిగురున నున్న యట్టి
తల్లిమాటను బాటింపఁ దలఁచుటొక్కొ?
యే నెచటికేగుదాన? ని న్నిపుడు విడిచి. 62

తే. గీ. వయసు దార దోసి వచ్చినయప్పటి
నుండి నిన్నుఁ గొల్చి యొకటనైన
భేద మింత లేని ప్రేమమెలంగిన
దాన, నెటకు నిపుడు తలఁగుదాన? 63

తే. గీ. వంటబ్రాహ్మణుతోఁ గాని బట్టలుతుకు
వానితోఁగాని బంట్రోతువానితోడఁ
గాని లోకమ్ముతోపాటుగా నొకింత
కులికితినొ, యెందుకింత మీకులికిపాటు? 64

ఉ. ఇంతకుఁ దప్పులేని నను నిక్కరణిన్ జనునే, తిరస్కృత
స్వాంత నొనర్ప ? నొక్కయెడ వచ్చుటయున్ గలుగున్ దొసంగు;ర
వ్వంత విచారణల్ వలయునా ? "యదె దున్నకు దూడ పుట్టె" న
న్నంతస "పల్పుదె" మ్మనఁగ నౌనె ? భవాదృశుఁడైన మేటికిన్. 65

చ. అని నిలుపోపరామి నయనాంచలసంచలదశ్రుమాలికల్
పెనఁగొని గద్గదస్వరము పేరి వచస్స్ఫురితి దప్పఁజేయ నా
తనిపదముల్ శిరమ్మునకుఁ దాఁకఁగ నొయ్యన వ్రాలి యేడ్చె న
క్కనకనిభాంగి యాతనికిఁ గంటఁ దడిన్ జనియింపఁ జేయుచున్. 66

క. విరిసెడికోపము పొరిఁబొరిఁ
బురికొనఁగాఁ జేసికొని నపుంసకుగతి ద
త్తఱపాటు దక్కి యించుక
తరలి పురలఁ బల్కె నయ్యుదారుఁడు దయతోన్. 67

క. "ఎక్కడి నీ, వెక్కడి నే
నెక్కడినమ్మికలు ? వలపు లెక్కడ ? కొన్నా
ళ్ళక్కఱ పడి తిరిగితి మా
మక్కువ లన్నియును నాఁటిమాటలు చెలియా ! 68

క. అప్పటినీవును వేఱే
యప్పటి యానేను వేఱె యప్పటికాలం
బిప్పుడు రమ్మన వచ్చునె ?
యిప్పటికిఁ దగినరీతు లిప్పుడు వచ్చుఁ. 69

ఉ. రొక్కము లేక కాదు, నిను రోసియుఁ గాదు, మఱొక్కలేమకున్
దక్కియుఁ గాదు చెప్పెద యథార్థపుసంగతి చిత్తకార్తిలోఁ
గుక్కలరీతి నొక్క వెలకోమలికై పలుమంది చేరినన్
జిక్కు లనేకముల్ గలుగు చీ యనిపించి విరక్తి చెందితిన్." 70

క. అని యట నిలువన్ జాలక
చని వేఱొక్కెడకుఁ గొంత శాంతించియు న

వ్వనితన్ గుకవిజ్ఞా సహితము
గనె యిలు వెడలింప నెంచి కఱకు వొడమఁగన్. 71

ఆ. వె. తగినమిత్రు నొకని దగ్గఱగాఁ బిల్చి
కార్య మిట్టిది యనఁగా నతండు
సంశయించి పిదపఁ జాన యున్నెడ కేగి
యిట్టులనియెఁ జిన్నయెలుఁగు దోఁప. 72

చ. వెలఁదిరో! యుగ్రుఁడై యతఁడు వెల్గుచునుండెఁ దటాల్న నియ్యెడం
దొలఁగుము లేనిచోఁ గలుగు దొందర లెట్టివియేని యింకఁ బైఁ
బిలువఁగ వచ్చు, నీవపుడు పేరిమిమై నిట రాను వచ్చు; నిన్
దలఁచిన నీరు గాఁడె ? యిటుతా వృథగా వెడలింప నేటికిన్. 73

క. అని యెన్ని చెప్పినను న
వ్వనిత వినదు దానియెడల భయభక్తులతోఁ
జను నాతఁ డేమి సేయు ?
నెవనివశమగు ? దాని నచొటు వాయన్ జేయన్. 74

క. పదపడి లోఁకువ యగుటన్
గదలించెన్ గుకవి; నిల్లుగదలి చనెడియా
త్మదయితు చందమ్మునకున్
మదిఁ దనదశకన్న వెలఁది మలమల మఱుఁగున్. 75

క. అటు లొక్క రెండుదినములు
'కటకట' యని యెల్లరనఁగఁ గలికి యనశన
స్ఫుటకఠినోపోషణముల
నటఁ గదలక యతని కరుణకై కాచునెడన్. 76

తే. గీ. కరుణ యొదవియు నాతఁ డక్కలికి యెఱుఁగ
కుండు విధమున డాఁచి "యిట్లొంటినింట
విడుచుపిమ్మట వలసిన విడిది కిటకు
రమ్మనిన బుద్ధిగానుండు రమణి" యనుచు. 77

క. లోనెంచి దాని నానా
నూనవిభూషణకదంబ మొకటియుఁ గొనక క
మ్మానిని యిలు చేర్పించియు
దానిజనని కిట్లు వార్త దా నంపించెన్. 78

క. నీకొమిరె దుర్మదంపుం
బోకిళ్లకు నాకు రోఁతపుట్టెఁ "జను" మనన్
వే కదలదు రెన్నాళ్లై
శోకించుచు లంఘనముల సుర్రిక్కుచు నుండెన్. 79

తే. గీ. దానియాస్తి యావత్తు నీదగ్గఱ కిపు
డంపితిని నీవు వచ్చి నీయాత్మజాతఁ
దీసికొనిపొమ్ము లేనిచో దీనిని బల
వంతముగ నిల్లు వెడలింప వలసి వచ్చు. 80

క. అనుమాట వినినయంతన
చని తా నవ్వేశ్యమాత జామాతను నే
ర్చినరీతి వేఁడికొని యా
తని చనవుం గాన కంతఁ దనయన్ గనియున్. 81

క. మెలమెల్లన బోధించియుఁ
జలమున రానొల్ల ననెడిచానన్ బలిమిన్
వెలికిన్ గొని చనె; నది య
వ్వలఁ దనయిలు సేరి లోన వగచుచునుండెన్. 82

క. ఇదియంతయు విని "దైవము
బ్రతికించెన్ నన్ను నాదు పట్టయి" యని య
మ్మదిత యిలుసొచ్చెఁ గవ్వప
శదుఁ "డదియేమనునో" యనెడిశంక వెనుబడన్ 83

చ. కళవళమందుచున్ వెతలఁ గందుచుఁ గుందుచు నున్న బోటి య
వ్వల వలపున్మగండటకు వచ్చినయంతన తేటిచూచి వె

ల్వెల దిగఁద్రావి యాతనిచవిఁబడి కుల్కఁగ సాగె నద్దిరే!
వెలచెలి కబ్బునవ్విరహవేదన లేఁద నశక్య మెట్లగున్. 84

ఉ. "ఏమిటికై వరించితివో, యిప్పుడఁగుంగవిఁ దీరెఁగాదె! యా
యామదమెల్ల, నింకయిన నవ్వలి కంపక కొంప చేమటం
చీమెయి దూర్చెదే? యనుచు వృద్ధ వెసన్దలనోరు మొత్తుకోఁ
గోమలి లెక్కసేయకయ కూటములన్ గరఁగించు నక్కవిన్. 85

ఉ. ఆగతి నిర్భయంపుసుఖ మందుచు నాగజయాన లోన నా
నాగతి "నాప్రియుం డిటకు నాకయి తాఁ దనయంత వచ్చు బ
ల్లోఁగినవాఁ డెటుల్ దలఁపులో ననుఁ బాయఁగలండు? దుర్మతుల్
వాఁగెడికూఁతలన్ విడుచువాఁడె! యతం" డని యెంచు సారెకున్.

చ. అచట నుదారుఁడున్ దరుణికై వగఁ జెందుచు నెప్పుడేనిఁ దా
న చని వెలందిఁ జూచుటకునై మది నెంచియు నట్లులైనచో
"సచివులు భృత్యులున్ మిగులఁ జౌకఁగ నెంతు" రటంచుఁగొంకు "న
వ్విచికిలగంధిసాటి పదివేలను లే" రని లోనఁ జింతులున్. 87

క. డోలాయమాన మగుమది
తో లీలలు దక్కి యతఁడు తొయ్యలి 'ఫోటో'
లాలోకించుచుఁ గుందుచుఁ
గాలమ్మును గడుపుచుండెఁ గళవళపడుచున్. 88

క. ఆరీతియెల్లఁ గని య
వ్వారాంగన యిటకు మదల వచ్చుట తగ దం
చారూఢి నతనిమిత్రులు
వారించెడివలను జూచువారయి కడఁకన్. 89

తే. గీ. దానియప్పటివర్తనఁ దథ్యముగ నె
ఱింగి "యిప్పటికేని యారంగులాఁడి
వాని వదలదు నీకు నీవంత యేల?
కావలసెనేనిఁ బట్టియీఁగలము మేము" 90

క. అనుడు "నటులాచరించునె ?
వనితకుఁ బొరపాటు మొదల వచ్చెనుగా క
ప్పని బుద్ధికృతము గా" దని
తనమదిలో నున్నతెఱఁ గతండు వచింపన్. 91

క. వారును నొకసమయము గని
యారామామణికిఁ గవికి నగుచేరిక క
న్నారంగఁ జూపంగ ను
దారుని రాగాంకురము మొదటికి నశించెన్. 92

క. తనతప్పిదమును బ్రియుఁడే
కనులారఁగఁ జూచుటయును గాంత యొకవిధం
బున నపుడు బొంకి నమ్మమి
ననరాని దురుక్తులెల్ల ననిపించికొనెన్. 93

చ. పదపడి యింక నాతనికృపన్ గడియించుట దుర్లభం బటం
చెదఁ దలపోసి యాస మొదలే నశియింపఁగ ధైర్యమంతయున్
వదలి "యిఁకేటి బెట్టుసరి ! పైఁ బరి బొత్తిగఁదప్పె"నంచు న
మ్ముదిత "యుపాయ మిట్టి" దని మూఁటికి నెంచి కృతప్రియత్నయై.

మ. తనకున్ దానయి యొక్కరేయి యతనిన్ దర్శించి దీనాస్యయై
యనుమాన మ్మొకయింత లేక చరణమ్మందున్ శిరంబుంచి, పే
ర్మి ననున్ వేగ రుణింపఁ దప్పదనుచున్ మేలెంచు మంచున్ వచిం
పనిదయ్యున్ స్ఫురియింపఁ జేసి కరుణన్ బాటింపకున్నంతటన్. 95

ఉ. కుందుచు నింటికేగి దనకుంగల తెల్వి యదెల్ల దైన్యపుం
జందమునంద చేర్చి యొక జాబిటు వ్రాయఁగఁ బూనె, నద్దిరా !
చందనగంధు లెట్టి ఘనసాహస మైన నొనర్చి బొంకి నా
థుం దమచెయ్వులన్ వెనుకఁ ద్రొక్కఁగఁ జేయుచు రెట్టి కుర్దునిన్.

క. 'యమ్మారాధ్యే' గారికి
నమ్మినమీదాసి చరణనతముఖియై. దం

దమ్ములు సారెకు మ్రొక్కుచు
నిమ్మెయి వ్రాసికొను మనవు లియ్యవియయ్యెన్. 97

చ. ఎనిమిదియేండ్లనుండి మిము నేక్షణమున్ బెడఁబాయనైతిఁ గా
దని తమ రూరికిన్ జనినయప్పుడు కాలము లెక్కపెట్టుచుఁ
దినములు పుచ్చుదాన నిదె! దేవునిచెయ్దయని నాఁటినాళ్ళనుం
డి నెనరుమాలి మీరు కరుణింపమి నీగతి నుంటి ఒంటిగన్. 98

క. ఇఁక నుండఁజాల నాజే
యి కుటిలచేష్ట లవి యెన్నియో మనమున లె
క్కకుఁ దా మెఱింగి యోజిం
చి కరుణ నిల్పఁదగు నాదుజీవము తఱితోన్. 99

క. పేరేల చెప్పవలె నన్
బ్రేరేపించి రిటుమీకుఁ బ్రియము గలుగువా,
ఁ'రయ కాదుర్బోధకు
ధీరత్వము గోలుపోయితిన్ జెడితి నిటుల్. 100

క. నాకర్మమ్మునఁ గలపని
యేకారణమైన నేమి, యిటు లోకపరిఁ దాఁ
జేకూరె నిక్కమిది పై
శోకించితి మొదలఁ దెలివి చొప్పడదయ్యెన్. 101

చ. తదుపరి యెంత యేడ్చినను దాఁ "జెయి గాలినమీఁద నాకులన్
వెదకుట వంటిదయ్యె" నను వీఱిఁడిగా గణియించి యిట్టిటె
ట్టిద మగువంతకున్ జొనుపుటే యొకయాటగ నెంచి వారు న
న్నది ఒనరింపఁజేసి రెవరైనను గర్మము దాఁటువారమే? 102

ఈగతి నాతల వ్రాసె వ్ర
థాగతి విధి, తలఁపు మిమ్ముఁ దగులమి నొరుపై
రాగిల్లి మనఃపూర్వక
భోగము గావింప లేదు పొరఁబడి చెడితిన్. 103

ఉ. ఏకొలమందుఁ బుట్టినను నిన్నిదినమ్ములనుండి మీగృహం
బేకనివాస మౌట నిఁక నిప్పుడుపుంగొలపుంగృహమ్మున
న్నాకుఁ బదమ్ము లేఁగవు, ధనమ్మును వద్దు మనమ్ము వద్దు నా
రాఁకకు మాత్రి మొప్పుము కరమ్ములు మోడ్చితి నేడ్చితిన్ సఖా. 104

చ. కడుపున కింత యన్నమును గట్టుకొనంగను బాఁతచీరలే
నిడుఁ డిది చాలు; నాయసువు లెంతకు నీచెడుమేన నుండు న
క్కడదనుకన్ భవచ్చరణకంజములన్ గనిపెట్టుకుండు నిల్
దుడిచెదఁ బ్రక్కలన్ బఱతుఁ దొల్తటికర్మము నెంచుచున్ బ్రియా.

ఉ. ఇచ్చక మంచు నెంచకుఁ డిఁకెన్నఁడు నన్నును గూడవద్దు పై
రచ్చను వ్రాసి యిచ్చెదను రాగి దుగానియుఁ గోరకుండ, లో
నచ్చదు నాకుఁ దల్లికిని నాథ! యెటుల్ వసియింతు నింట, నా
ముచ్చ టిదొక్కటే, చిగురుముద్దిటు చెల్లఁగఁజేయు మెమ్మెయిన్. 106

ఉ. మీ రెటు సేయు మన్న నటు మీఱక చేసెదఁ, గన్నులార మి
మ్మారయు టొక్కటే వలయు నన్యము గోరను మీమదాసి కీ
చేరిక నిచ్చి పాదములఁ జేర్పఁడదే పదివేలు; దీని నిం
కేరికిఁ జూపకే పనుపుఁ డించుకవార్త, క్షమింపుఁ డన్నియున్. 107

క. ఇచ్చయొ యనిచ్ఛయో మీ
రిచ్చపలస్వాంత కిపుడ యేర్పఱుపవలెన్
బొచ్చెమ్ము వలవ దది మీ
యచ్చరములతోడ వ్రాయు టభ్యర్థింతున్. 108

క. అని వ్రాసియంపుటయు దా
నిని గని యాతండు మనము నీ రగుటయు మా
నినిఁ దలఁచి తలఁచి తనలో
ననుకొను నిక్కరణిఁ బ్రేమ మగ్గల మగుడున్. 109

మ. అకటా! యంతటిదాని కిక్కరణి దైన్యం బింత వాటిల్లునే?
వికలత్వం బవురా! నృపాంగనగతిన్ వేమంది సేవించుదా

నికి దాస్యం బుచితంబె ! యెంతవగపున్ జిత్తమ్మునన్ లేనిచో
ఒకి యూనీచత కొప్పునే ! చెలిరో ! పశ్చాత్తాప మిట్లున్నదే ? 110

క. కానిమ్ము నిన్ను మరలన్
బూనికమైఁ గొన్న మొగముపొంతనె లోకుల్
"ఛీ ! నింద్యుఁ" డనుచు నుమియరె ?
నానేరం బేమి యిచట ? నారీమణిరో. 111

ఉ. నిటున్ గోటునున్ దగిననేరుపు నోరుపు వన్నెచిన్నెలున్
దేటయుఁ దెల్వియున్ గలుగునెయ్యపుఁదొయ్యలు లెందఱేని నీ
పాటివెలందు లౌదురె ? సెబాసు ! బళా ! నహవా ! వహవ్వ ! నీ
మాటలసౌరుతీరు గలమానిని నేను జగానఁ గానఁగా. 112

చ. గళగళలాడు గాగరలు కంగులు రంగు లెసంగు రైకలున్
హరువును మువ్వసుందగు పయంటలు 'పౌడరు' లత్తరుల్ విరుల్
గర మలరారు భూషలును గాక వెలందు లటంచుఁ గల్గిరే ?
సరసిరుహాక్షి ! మీకొలముచానలలో నినుఁ దక్క నొక్కడన్. 113

చ. అగుదువు సోయగమ్ముగలయట్టి విలాసిని వైన నేమి, నీ
సొగసును జూపుకోవులును సుందరి ! వ్యర్థము లంచుఁ జెప్పఁగాఁ
దగు; నది యేమనన్ వినుము తన్విరో ! యోగ్యతలేని యప్పు వ
మ్మగువను బొందువాఁ డనఁగ మాలఁడొ? మాదిగవాఁడొ? గాఁదగున్.

తే. గీ. ఎంతసౌందర్యముండిన నేమిఫలము
యోగ్యత యొకింతగలుగని యువతిమణికి ?
నెన్నినగ లెట్టిహృదయేశుఁ డెట్టితఱుకు
లుండినను బొట్టులేకున్న ముండయనరె ? 115

తే. గీ. నిన్ను నిందించుకన్నను నన్ను నేన
నింద యొనరించు టది మంచిచంద మతివ !
కాన నావంటి విశ్వాసహీనుఁ డెందుఁ
గానరాఁడు జగమ్మునఁ గలికిమిన్న. 116

ఉ. ఎందఱనైనఁ జూచితి నికెందఱనైననుఁ జూడనుంటి నో
సుందరి ! నీదుచందమును సొంపును నింపు దలంపు నింపు నే
మందు నవారవిందవదనా ! పద నాయెద నాటఁబోకు నీ
కుందగు నందకానిఁ గయికొందువు నా కయి కుందనేటికిన్. 117

క. అని యచ్చెలి తనయెదుటన్
గనుపట్టినభాతి దోఁపఁగాఁ బల్కెడి యా
తనిచందము గని దూతిక
యను, "నయ్యా ! నన్నుఁ బంపరా ! యిఁకనైనన్". 118

క. దానఁ దెలివొంది తన య
జ్ఞానభరం బది యెఱింగెఁగా ! యని లజ్జన్
లో నొందుచుఁ "జను ముత్తర
మే నీ లే" దని వచింపు మేటికిఁ దడయున్. 119

చ. అన నదియేగె, నంతవల కాజలజాక్షియుఁ 'బోయి దూతి రా'
దనుకొను, 'లేఖ తెచ్చునొకొ?' యంచుఁ దపించు నొసంగకుండునే?'
యని ధృతిగాంచు "వట్టియడియాసలె" యంచు నిరాశ నించు, 'దే
నిని దిని ప్రాణముల్ విడుతు నే' ననుకొంచు గణించు మందులన్.

ఉ. నేర్చియొ నేరకో యిటుల నేనొనరించితిఁ దప్పు, దాన బల్
పేర్చిన యాగ్రహమ్ముమెయిఁ బ్రేమయొకింతయు లేక యింత వ
న్నేర్చునె ! భార్యనే, పడపుటింతిని గానె ? యిదెంత దోస మీ
చర్చ యదేల ? యాతనికిఁ జచ్చి యశ మ్మొనఁగూర్చు టొప్పదే. 121

క. అని కృతనిశ్చయయై విష
మును సిద్ధము చేసికొని యమోఘ వ్యవసా
యనిబద్ధచిత్తయై యుం
డునెడన్ దఱి కేగి యయ్యనుంగున్ దెలియున్. 122

క. "ప్రత్యుత్తర మీ లే" దన
నత్యంతామర్ష ఘర్షితాంతరయై "ప్రా

ణత్యాగమె వర మిఁక సం
స్తుత్యననుగుణంపుఁబ్రతుకు చొప్పడనేలా ? 123

క. మును వేశ్య లొక్కకొందఱు
తనువున్ విటుతోడ వీడి తద్దయుఁ గీర్తిన్
గొని, రేను విటుని యవమతి
కని, ప్రాణం బూడ్చి సుచిరయశమున్ గొందున్'' 124

క. అని మరల మనుము వెనుఁదీ
సినఁ దత్తఱపాటు దక్కి చెలి సంక్షేప
మ్మునఁ దనయుద్యమమును నా
తని కీగతి వ్రాసెఁ దెగువ దైవారంగన్. 125

ఉ. "ఇంతకు మున్ను మీకు లిఖియించిన కమ్మపత్రికార మేను మీ
చెంత భవత్పదాబ్జములసేవకునై బ్రదుకన్ దలంతు నో
కాంత ! బహూక్తులేల ? యిది కష్టమొ, యిష్టమొ ? నేఁటిరాత్రికే
పఁతము మాని తెల్పుటది బాగని యెంచి నమస్కరించితిన్". 126

క. అని వ్రాసి మరల నంపినఁ
గనుఁగొని లోలోన నతఁడు కరుణ వొదమియుఁ
వెనువెంటఁ గోపఁ ముబ్బగఁ
దనలో దానిట్లొకింత తల్లడ మందున్. 127

ఉ. చచ్చుట నిక్కమేయగు విశాలవిలోచన, చాక యుండుఁగా
కిచ్చట కెట్లు రాఁదగు ? నిహీ ! యని యెల్లరు నవ్వరే ? సరే,
యచ్చటులాక్షి యీపయిఁ గులాచరణం బొనరించి కాలముం
బుచ్చుటకన్నఁ జచ్చుటయె పో ! కడు మేలగు నెన్నిభంగులన్. 128

వ. అని యద్దానిం దలంచుకొని.

ఆ. వె. ఇపుడు చావ నేల ? యింతకు మున్న చ
చ్చితివి; నీవకాదు చెలియమిన్న !
వీఁడు నట్టివాఁడె, భేదమ్ముగల్గునే ?
మనకు నెన్నఁడేని వనజనయన. 129

ఉ. పుట్టరె, గిట్టరే? జనులు పుట్టిన నేమగుఁ? గిట్ట నేమగున్?
గట్టగువర్తనమ్ము చెడి కాపథవర్తనులైనవారి కె
ప్పట్టున సౌఖ్య ముండ, దధవా యొకపట్టునఁ గల్గుఁగాక దా
నిట్టిదయౌ నిసీ! చెడితి వెమ్మెయి నన్ జెఱఁగొట్టి తంగనా!. 130

మ. గృహిణీవర్తనమందు నీకుఁ గలరక్తిన్ గాంచి నేహేతువై
బహుదుశ్శీలము మీకొలమ్ము గుణముం బాటించు నంచెంచితిన్
మహిళారత్నమ! యన్నియున్ మృషలె నీమాటల్; నెబా సింతకున్
బహి వెట్టన్ బడి ప్రాణ మూడ్చు మనుచున్ వ్రాసెన్ విధాత్రృం డహో

ఉ. ఏనును జీవ మూడ్చుకొనుటకే ప్రయతింతునో, దాన నేమగున్?
మానిని! యాఁడుదాని కది మన్ననఁ దెచ్చెడునట్లు పూరుషుం
డేని నొసంగ, డెక్కరణి నిన్ విడియుండుమ? నేమొగమ్ముతో
నే నినుఁ బూర్వముఁబలె గణింతు? ఘటింపవు రెండునుం జెలీ." 132

క. అని యత్తుదిజాబునకును
దనప్రిత్యుత్తరము నిడక తరుణీమణి దూ
తిని వంపుడు దా నచ్చెలి
విని యాపై నొడలు వీడ విసమున్ మెసవెన్, 133

క. అక్కతన నత్తలోదరి
మిక్కటమగు నార్తిగూరి మృతి గనుటయు నీ
వెక్కసపువార్త విని మది
నెక్కుడు చింతించె నాతఁ డిది యొప్పదొకో. 134

ఉ. అయ్యది యెట్టిదైన హృదయంబు సదా తదధీనమౌగతిన్
నెయ్యముమై మెలంగు నల నీటువెడంగుబొజుంగు నేఁటి క
త్తొయ్యలి యాత్మ హేతువున దుడ్కు మెయిన్ మృతిఁజెంద నెంతగా
దయ్యము నేఁతకై వగచి తాళఁగలే కెదఁగుందఁగావలెన్! 135

క. పగవారల మృతికైనను
దగువారల హృదయమునకుఁ దాపము దవులున్

మిగులఁ బ్రియమైన యానో
యగపుంగని కతఁడు శోకమందుట తగదే? 136

చ. అరసితిరే? యుదారు గతి యక్కట! యెంతకు వచ్చె! ద్రవ్యమా?
సురిఁగె, యశంబు గంగఁబడెఁ, జొక్కపుమేని పసందడంగె, దు
ర్భరమగు పాతకం బొకటి పైఁబడె, దుఃఖముతోడిపాటహో!
దురితపుసంత వారసతితోఁ దగునే? తగులాట మేరికిన్? 137

వ. పదవడి యయ్యుదారుండును.

ఉ. దానిపప్రిసక్తియెల్ల దిగఁద్రావి స్వకీయపురమ్ముఁ జేరి యా
పైని స్వభార్య దాను నొకపాటి గృహస్థులపోల్కె నుండి, ర
జ్ఞానమదెల్లఁ బోయె, భవసాగర మెందు నసార మంచు లో
లో నెఱిఁగెన్ మఱెయ్యెడల లోలుఁడు గామియు దానఁ జేసుతెన్. 138

క. ఆపయి వేశ్య లనినఁ ద
ద్వ్యాపృతి గలవార లనిన నత్యధికాసూ
యాపరవశుఁడై చూచు స్వ
లోపము లన్నియును దలఁచి లో లజ్జించున్. 139

చ. తనభయ మింత లేమిని యదాయదలౌ నలయుగ్రిహారముల్
గనుఁగొని వానిపై ఋణము గల్గుటకున్ మది రోసి వానినె
ల్లను వెసఁ దీర్చి తల్లి తనలక్షణముల్ గని సంతసింప నీ
తిని గనె నెల్లభంగుల సుదీర్ఘయశం బనిశంబు గ్రమ్మఁగన్. 140

— గద్య —

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకళానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే రచి
యింపఁబడిన పాణిగృహీతయందు సర్వమును
షష్ఠాశ్వాసము సంపూర్ణము
శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.



శ్రీమత్పరదేవతాయైనమః

# లక్షణాపరిణయము

శతావధానులైన

తిరుపతి వేంకటేశ్వర కవులచే

రచింపఁబడినది.

ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వరపబ్లికేషన్సు

కడియము P.O.

తూర్పు గోదావరి జిల్లా.

1956

ఇది శ్రీకృష్ణుని అష్టవిధ పట్టమహిషీమణులలో
నొకామెయగు లక్షణాదేవి — వివాహ
ప్రసక్తిగల — గ్రంథము. ఆఱు
ధారలో పూర్తిగావింపబడిన
మూడు ఆశ్వాసముల
ప్రబంధము.


పరిష్కర్త — విద్వాన్

# చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

వదియం P. O. తూ॥ గో॥ జిల్లా.



ముద్రణము:

వేంకటేశ్వర ప్రింటింగ్ ప్రెస్
ఆలమూరు, తూర్పుగోదావరిజిల్లా.

శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# లక్షణాపరిణయము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీరామామణి జానకీరమణియై సేవింపఁ దమ్ముల్ సదా
గారాబమ్మునఁగొల్వ నెల్లయెడలన్ గల్యాణముల్ మీఱ సు
శ్రీరంజిల్లునయోధ్య నేలికొను నా శ్రీరాముఁ డెల్లప్పుడున్
శ్రీరామాధిపు నాత్మనామధరు రక్షించున్ గృపాశాలియై. 1

సీ. సత్త్వరజస్తమశ్శక్తులలో సత్త్వ
శక్తియౌ లక్ష్మియంశమునఁ బొడమి
యాత్మానుగుణగుణాఢ్యమ్మగు వృత్తిఁజె
న్నారు విదేహునగేహమునఁ బెరిఁగి
తమము ప్రధానమై తనరెడుశివువిల్లు
విఱిచిన శ్రీరాము వరునిగఁ గొని
రాజసంబణఁచి యరణ్యమేగెడి భ
ర్తకనుకూలయై వెంట నరిగి రావ
తే. గీ. ణాదులనుగాఁచి జగముల యార్తిఁదోఁచి
భర్తతోడఁ గుబేరపుష్పకము నెక్కి
మరల సాకేతమేలంగ మరలివచ్చు
సీత శ్రీరామవిభునకు సిరు లొసంగు. 2

శా. శ్రీ కెంగేల నెసంగు రాచిలుకఁ బేర్మిఁ జూచి ముద్దాడి "నా
బాకీ తీర్పు" మటంచు మై నిమిరి దువ్వఁగా, జిల్క "యక్కా! యదే
మో కృష్ణుండనె వింటె" యన్న నగు మా మోమున్ విలోకించు నా
శ్రీకాంతుండు కృతార్థుఁ జేయుత యశోర్థిన్ రామభూమీపతిన్. 3

ఉ. "కల్లలుపన్ని నన్విడిచి కానలలో నల చెంచుబోటితో
నల్లరి సేయుదే'' యని యొయారముగా మగనేత సేయుచో
నల్లనఁ జెక్కుఁగొట్టి "యకటా! కడునొచ్చితి'' వంచు నవ్వ మా
పల్లవపాణి యోగ్యునకు భాగ్యము లిచ్చుత రామశౌరికిన్. 4

మ. నెనరుం జిల్కెడు ముద్దుపల్కులను శ్రీనీలాచలోష్ఠామృతా
దనసారస్యము గానుపింప నిజభక్త శ్రేణి గీర్తింపఁగా
ననురాగమ్మున దాటికొండనగరిన్ హాళి న్నివాసమ్ముచే
సిన యిల్వేలుపు వేంకటేశ్వరుఁడు వాసిన్ బ్రోచు రామాధిపున్. 5

సీ. ఐదుమోములజంగమయ్యపూవుంబోఁడి
యాఱుమోములవానియనుఁగుఁదల్లి
కలిమికోమలి పల్కువెలఁదుల్ గొలుచుదేవి
కడిమితోఁట నెసంగుకలికిమిన్న
పోతురక్కసునితోఁ బోరాడిన నెలంత
జేజేలవరసి బ్రోచెడి పడంతి
పూఁపజాబిల్లి పూవుందాల్చినవెలంది
జగములన్నియుఁ బ్రోవఁజాలుజాణ

తే. గీ. మంచుగుబ్బలి రాచూలు మించువన్నె
వలువఁగట్టిన యెలనాఁగ చలువచూపు
కోపులన్ జూచి రక్షించు గోకిరెడ్డి
వంశమణియైన శ్రీరాము వల్గుధాము. 6

శా. "నాకై ఘోరతపమ్మొనర్చి తుద కన్యాయమ్ముగా నా తప
శ్శ్రీకిన్ భంగముకూర్చి కోరి తపు డిప్పీ? యింత మారాఁతిన కే
లా? కోప" మ్మని దీనుఁడయ్యు సతియల్కన్ బాపి నవ్వించు గౌ
రీకాంతుండు కృపాళుఁడై మనుచుతన్ శ్రీరామభూమీశ్వరుణ్. 7

మ. పతిచే మున్నుగ సామవేదము పఠింపన్ జేసి యామీఁదఁ ద
ద్గతి వీణన్ బలికించి నేర్పుమెయి శుద్ధశ్రోత్రియుండైన త

త్పతికిన్ గానరసంబు నేర్పఁ దన గీతప్రౌఢిమన్ జూపు భా
రతి వాక్పాటవ మిచ్చి ప్రోచుఁ గృపమీఱన్ రామభూనాయకున్. 8

సీ. ఒక మోము భారతీ వికచాంబుజాస్య వా
తెఱఁజిల్కు తీయనితేనెఁ గ్రోల
నొక మొగం బాపదంతుకతోడ సరస స
ల్లాపమాధుర్యంబు చూపుచుండ
నొక మొగం బాపెలందుక తావిఁజిల్కు పు
క్కిటివీటితమ్మ పుక్కిటవహింప
నొక మొగం బానెలంతుకతోడ రతికలా
విషయికోపన్యాసవిధులు దెల్ప

తే. గీ. నొక్కమధురోష్ఠ పానముదక్కఁ దక్కు
కృతులఁ బ్రతిసేయనేరని యింతిమిన్న
బిట్టు కౌఁగిలి గిలిగింత నెట్టుకొన్న
నలువ కృతిపతి కాయువు కలిమిఁబెంచు. 9

తే. గీ. కృతిపతి యొనర్చునట్టి సత్కృతుల కంత
రంతరాయమ్ము లొడఁగూర్ప కలరుకొఱకు
మొదటఁ జెల్లింపవలసిన మ్రొక్కు లొసఁగి
వేఁడికొందుము మాబొజ్జవేల్పుదొరను. 10

తే. గీ. కాళిదాస మయూరాది కవులు నన్న
యాదులు కవులు చేసిన యట్టి కావ్య
ములఁ జదివి కైత చెప్పఁగ మొదలువెట్టి
నలుపకుందుమె? తన్నమస్కారమేము. 11

తే. గీ. అన్నవస్త్రము లొసఁగి విద్యలను శిష్యు
లకు ననుదినమ్ము చెప్పు విలక్షణప్ర
భావు భావుకభావు మాపాలిదేవు
బ్రహ్మ గురువర్యుఁ గొల్తు మపారభక్తి. 12

తే. గీ. ఏచతుకు లోర్వలేమి పిసాచులెలమి
సత్కవులమీఁదఁ బడకుండ సలిపి రట్టి
కుకవులకు వందనమ్ములు కోట్లకొలఁది
స్థిరతరమ్మగుభక్తి రచింపవలదె ! 13

ఆ. వె. గ్రంథచోరులైన కవులార ! మాపద్య
ములను దొంగిలింప వలదు వినుఁడు
మాదుకైత కొక్క మాఱువేసము వైచి
మార్చికొంద మన్న మాఱఁబోదు. 14

ఉ. ఆఁకలిఁ దీర్చికొం పెవరికైనను ధర్మమ కాన బైటి పు
ల్లాకులవంకఁబోయి యట నాఁకలి తీర్చికొనుండు లోనికిం
బోకుఁడు; పోతిరేనిఁ గడుముప్పగు; మీచిరజీవిథాప మో
కాకవులార ! మీకుఁ జిరకాలము పాయకయుండుఁ గావుతన్. 15

ఆ. వె. మచ్చరమ్మువిడిచి మాకవిత్వరసమ్ము
గ్రోలరయ్య ! మెచ్చుకోలుగలిగి
యోర్వలేమి సేడుపొంద మీకన్నీర
పోవుఁగాని యేమిపోవుమాకు? 16

క. "అవిలే వివిలే" వనిమా
కవనము నిందింత్రుగాక కవులందఱకున్
జవిగల్గుకృతుల నొనరిం
ప విరించిపత్రిమదకైన బరువగుఁగాదే. 17

చ. పలువురు సత్కవిత్వ మది పాల్పడకుండినఁ గొన్ని పుస్తక
మ్ములు రచియించి సిగ్గిలక మోదము నొందుట తప్పుగాదు; పు
త్రులు తన కుద్భవించినఁ "గురూపులు కాఁగల" రంచు భార్యతోఁ
గలయికమానునే ? సుతులఁగాంచకయుండునె ? రూపహీనుఁడున్. 18

సీ. ప్రియురాలి పాలిండ్లబిగు వెఱింగినవాఁడు
జిగికైతయందలి సొగసెఱుంగు

రుచిరాస్య కెమ్మోవిరుచు లెఱింగి
నవాఁడు రసకవిత్వంపు సారస్యమెఱుఁగు
పద్మాక్షి చూపుసోవల నెఱిం
గినవాఁడు తీక్ష్ణకవిత్వంపుఁ దేటయెఱుఁగు
పలువెలందుకల కౌఁగిళు లెఱిం
గినవాఁడు మిశ్రకవిత్వప్రమితు లెఱుంగు
తే. గీ. నంధతమసాభిసారికాగంధ మెఱుఁగు
వాఁడె యాళుకవిత్వంపు జాడయెఱుఁగుఁ
గాని యన్యుల కెఱుఁగ శక్యమ్ముగాదు
భావవిజ్ఞాన మది పయిపైనిఁ గలదె! 19

క. లలితప్రబంధముల లో
పల యమకముఁదూర్చి రసము పాడొనరింపన్
వలయునె? పెరుగునువడ్లును
గలపోసిన ముచ్చటగునె? కవివరులారా, 20

చ. మతిగలవారి కేనియుఁ బ్రమాద మెలర్పక పోదు; పుష్పస
మ్మితకవితాలతాంగిని రమింపఁడు కేవలశాస్త్రులార! మీ
మతులకు వచ్చినట్లు రసమాధురిఁ గ్రోలుఁడుగాని వ్యర్థపుం
జతురిమఁజూపి దాని స్తనశల్యపరీక్ష యొనర్పబోకుఁడీ. 21

వ. అని శిష్టాచార ప్రశంసలొనర్చి.

మ. ప్రతిసంవత్సరమాఖమాసమున గద్వాలప్రభుం డిచ్చు ను
న్నత సత్కారపు వార్షికమ్ముఁగొని. కౌన్నాళ్ళచ్చటన్ రాజబం
ధుతతుల్ సత్కవితాదరుల్ మిగుల సంతోషమ్ములన్ దేల్ప ను
న్నతటిన్ దన్నృపుస్యాలకుండు కడుసన్మాన్యుండు స్నేహార్ద్రుఁడై. 22

వ. భక్తితాత్పర్యమ్ములిగురింప నస్మత్కృత సంస్కృత గ్రంథమ్ముల యం
దలి శ్లోకమ్ములను నాంధ్ర ప్రబంధమ్ముల యందలి పద్యమ్ములను
దదేకాయత్తచిత్తమ్మున సానుజుండును సపుత్రమిత్రుండునునై వినుచుఁ
జుట్టుఖారియున్న పండితకవిసంఘము దిక్కు మొగంబై. 23

సీ. గద్వాలరామభూకాంతుని యిల్లాలు
గారాపుఁ జెలియ లేఘనయశునకు
సౌమిత్రికన్న నచ్చపుభక్తియుక్తిఁ
జెన్నారు రాజారెడ్డి యనుజుఁడెవని
కట్టిఁడిట్టిఁ డటంచు ననరానిమేటి
తిమ్మారెడ్డి యెవనికి మతొకతమ్ముఁ
డత్యంతసత్కవిత్వాదరుండైన
లక్ష్మారెడ్డి యెవ్వాని మాతులుండు
తే. గీ. చిన్నతనమంద కృతులకుఁ జేతులొగ్గు
నిపుణబుద్ధి సీతారామనృపతి సార్వ
భౌముఁ డెవ్వానికి ననుంగు భాగినేయుఁ
డతఁడు శ్రీరామనృపతి పండితహితుండు. 24

క. శ్రీతాటికొండ పురమున
నేతాదృశగరిమనేలు సీతిపరుఁడు వి
ఖ్యాతుం డతిశాంతుఁడు వి
ద్యాతిశయం బెఱుఁగుజాణ యనుపమరక్తిన్. 25

చ. తిరుపతివేంకటేశ కవిధీరుల మమ్మనుగాంచి వాక్యచా
తురి మెఱయంగ నిట్లనె "బుధుల్ బళిరేయన మీరు గ్రంథముల్
విరచనచేసి యుంటిరి ప్రవీణతమై మఱియెన్నియేని, యం
దరయఁగ నాకు భాగవత మన్నిఁటికిం దలమానికంబగున్. 26

శా. స్వామీ ! మీకవితాప్రవాహము జగద్వ్యాప్యంబు మాటోఁట్లు త
త్సామర్థ్యం బిదమిద్ధమంచు వచియించన్నేర్తురే ! లక్షణా
భామన్ గృష్ణుఁడు పెండ్లియాడుకత నాపైఁ బేర్మిమీఱం గృతిం
గా మిమ్ముం దయఁ జెప్పవేఁడెదను సత్కారమ్ము తోరమ్ముగన్. 27

చ. తిరుపతివేంకటేశ్వర సుధీమణులార ! కవీంద్రులార ! దు
స్తరతరబుద్ధిభాక్శతవధానవిధానపటిష్ఠులార ! భూ

వరహితులార ! యెక్కుడు కృపామతి నాకుగ మాకు లక్షణా
పరిణయమున్ రచింపవలెఁ బండితమండలి కింపుగావలెన్. 28

మ. కవితాకన్యక లెందఱేనిఁ గల రిక్కాలమ్మునం దల్ల వా
రు విచారింపఁగ గుడ్డికన్నుగలవారో, కుంటివారో, సురూ
పవిహీనాత్ములొ కాఁగలారు; వివరింపన్ సర్వసంపన్న మీ
కవితాకన్య యటంచు నొక్కి పలుకంగానేర్తు ముమ్మాటికిన్. 29

తే గీ. చెన్నపురి రాజధానిలోనున్న రాజ
వరులు నైజాములోనున్న నరవరులును
మీ శతవధాన కృతులకు మెచ్చికాదె
బంగరు బిరుదులొసఁగిరి బహుమతులుగ. 30

ఉ. ఏనుఁగునెక్కినారు ధరణీంద్రులు మ్రొక్కఁగ నిక్కినారు స
న్మానములందినారు బహుమానములం గ్రహియించినార లె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయంబొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుఁగొనినారలు మీరు కవిత్వసంపదన్. 31

శా. ఈయాంధ్రావనియందు మీక ననిభూమీశుల్. మిమ్ముం బూజలన్
జేయన్నేరని రాజచంద్రులును నాచే నశ్రితుల్; వేయునే
లా ? యీనాఁటికవీంద్రులం దెవరు విద్యాశక్తి రాజన్యరా
జ్యాయత్తంబగు పట్టపేన్గుపయి నాహాపుట్ట నూరేగిరే ! 32

తే. గీ. హెచ్చుతగ్గులు తులఁదూఁప నెవరికన్న
హెచ్చు మాబావగారు; వారిచ్చినారు
మీకు బంగరుబిరుదు లక్ష్మోటిమేటి
వార్షిక మ్మిచ్చు మీకు నెవ్వరికి హెచ్చు. 33

తే. గీ. శ్రీకరుండగు నరసదీక్షితుని సుతుఁడు
సుకవియగు పాపశాస్త్రికి సోదరుండు
అస్మదాస్థానమునకు ధర్మాధికారి
బారయకు మీరనిసఁ గడు గౌరవంబు 34

క. మాతండ్రిగారు మును కృతి
కై తామెంతేని యత్న మలరించిరిగా
నీ తగు కవి దొరకమిఁ ద
చ్చేతం బొప్పుకొనదయ్యెఁ జెప్పించుటకున్. 35

క. జనకుని కోర్కెం దీర్పని
తనయునిఁ దనయుఁడని చెప్పఁ దగదం డ్రిటుగా
వున నీకృతి కారణముగ
ననుఁ గృతకృత్యునిఁగఁ జేయ న్యాయ్యం"బనుచున్. 36

వ. వాగ్బహుమాన పూర్వకమ్ముగఁ దాంబూలంబు వెట్టుటయు నేమును నతని యోగ్యతకు నలరి యీవిభువతంసుండు తక్క గుణములట్లుండఁ బిత్రినుజ్ఞాకరణ ధురంధరత్వమ్మునను నిజమ్ముగ రాముఁడే యగునని ప్రశంసించుకొనుచు నాతనివంశ క్రమంబుఁ గొందొక వివరింపఁ బూనితిమి. 37

క. సిరి యే చరణము పరమా
దరమున సేవించు నట నుదయమందెను శం
కరు తలపూతోఁ బుట్టువు
ధర నుత్తమశూద్రకులము తగియెడివృద్ధిన్. 38

తే. గీ. కారణాంతరముల దానఁ గలిగె నెన్ని
యేనిభేదమ్ము లవి చెప్పనేల? నాఁడు
నేఁడు నిఁకమీఁద వికృతులజాడఁ దాఁ జ
ననిదియై యొప్పు నొక పాక నాటికులము. 39

ఆ. వె. క్షమకు సత్యమునకు సత్త్వమ్మునకు రాము
నాఁటివారు పాకనాటివారు
భోగభాగ్యములకు యోగమ్మునకుఁ గృష్ణు
నాఁటివారు పాకనాటివారు. 40

తే. గీ. వారి గోత్రములెన్నియో వఱలు నందు
గోకిరెడ్డియనెడి కాఁపు కులపురుషుఁడు

గాఁగలిగి యతిరాజసకలన మిగిలి
యొక్క తెగవారు బల్ సిరినొప్పచుండ్రు. 41

చ. భరతునిఁబట్టి యిందుజులు భారతులైరి, రఘుండు హేతువై
పరఁగిరి రాఘవాఖ్య నలభానుకులప్రభవుల్, మహాయశ
స్కరుఁడగు గోకిరెడ్డి యతిశస్తగుణాకరుఁ డిందుఁగల్గుటన్
వఱలెను వానిపేర్గలిగి వంశము వీరి కసంశయమ్ముగన్. 42

క. అతిరాజస గోత్రావ
స్థితిచే నతిరాజసత్వసిద్ధి గలిగెనో?
యతిరాజనులగు వీరలె
గతియగుదురొ గోత్రి మట్టిగతిఁ గాంచుటకున్? 43

గీ. తెలియుటతి దుర్లభంబని ధీరులెన్నఁ
దగిన యవ్వంశమందు ముత్యమ్ముపోలె
రంగాధాత్రీవతంసుఁ డారంగ నుదయ
మంది ప్రజనేలె నిరతనిష్పందయశుఁడు. 44

శా. పొంగారంగల కీర్తి కెల్లయగుచున్ భూలోకదేవేంద్రుఁడై
సింగంబన్నను జీరికింగొనక విస్తీర్ణప్రతాపాప్తి నే
లంగల్గెన్ మఱినేల నర్థిజనులెల్లన్ దన్నుశ్లాఘింప, నా
రంగారెడ్డి గుణోత్తరత్వమది వర్ణ్యంబౌట కాశ్చర్యమే? 45

గీ. ఆతనికుమారు, డత్యంతశీతలుం డ
నంతధరణీశుఁ డీతఁ డనంతయశుఁ డ
నంతసుగుణాకరుండు ననంతతేజుఁ
డగుచుఁ బాలించిమించె ననంత నెలమి. 46

గీ. ఆతనికిఁ బుత్రుఁడయ్యెఁ దిమ్మావనీంద్రుఁ
డతఁడు పూర్వులఁబోలి రాజ్యమ్ము రామ
రాజ్యముగనేలి పుత్రికఁ బ్రాజ్యసుగుణఁ
గాంచెఁ గొండమ్మ యను నొక కాంచనాంగి. 47

క. శ్రీరమణు సాటిఁదగు రా
జారెడ్డికి నామె నిచ్చి సర్వోన్నతమౌ
తీరునఁ బెండ్లి యొనర్చి ధ
రారమణునిఁ జేసెఁ బిదప రాజ్యమ్మిడియున్. 48

గీ. జలధి నిల్లటముండిన శౌరిపోల్కి
హిమగిరి వసించు నల నగజేశు మాడ్కిఁ
దాటికొండ పురమ్మునఁ దా వసించి
మించి పరిపాలన మొనర్చె నంచితముగ. 49

క. ఆరామయందుఁ గనె సు
శ్రీరుచిఁదగు రామచంద్రిరెడ్డిన్ మఱి ల
క్ష్మారెడ్డిన్ గొమరులుగా
నా రాజారెడ్డి వంశ మతి వృద్ధిఁదగన్. 50

క. మాతామహకులగోత్రి
ఖ్యాతులు వీరైరి ఖ్యాతిగల కన్యకనే
నాతిగఁ గొనఁదగుఁ గాదే
నీతీరగువారి నేమమిట్టిది యగుటన్. 51

సీ. ఇరువురు ప్రఖ్యాతి కెల్లలై తగువార
లిరువు రాకృతిపొంక మెసఁగువార
లిరువు రర్థులకిచ్చు నిచ్చఁ బొల్చెడివార
లిరువురు విద్దెల నెఱుఁగువార
లిరువురు కవులచే నెన్నికగనువార
లిరువురు కనికరం బెనయువార
లిరువు రధర్మమ్ము నీసడించెడివార
లిరువురు శత్రుల నొరయువార

తే. గీ. లిరువురును దాతతండ్రుల సరణివార
లిరువు రన్యోన్యమును మైత్రిఁ బరఁగువార

లొక్క యుగభేద మొక్కటిదక్క రామ
లక్ష్మణులు రామలక్ష్మణుల్ లలితమతులు. 52

తే. గీ. వీర లాచారపరులు సుశ్రీరుచిరులు
వీరు లతిధీరు లత్యంత శూరు లధిక
బంధుపోషణతత్పరుల్ ప్రబలు లెంత
కేనిఁదగు చేవఁగల వార లిద్దయశులు. 53

ఆ. వె. రామచంద్రరెడ్డి రమణీమణుల కెల్ల
మేలుబంతి యనెడి మేల్మిగన్న
లక్ష్మమాంబికను సలక్షణమ్ముగఁ బెండ్లి
చేసికొనియె మిగుల వాసియెసఁగ. 54

సీ. మునికులగోత్ర సముద్భవుండగు ననం
తారెడ్డి యేగుణోత్తరకుఁదండ్రి
తనపేరు సార్థకత్వము వహింపఁ జరించు
రత్నమాసాధ్వి యేరమణితల్లి
తిరుగుళ్ళ పురమేలు నరపతి నారసిం
హారెడ్డి యేసతికన్నగారు
రాజమాన్యుఁడు మేటితేజోయుతుండు ల
క్ష్మారెడ్డి యేజగన్మాన్యతమ్ముఁ
తే. గీ. డట్టి శ్రీబుచ్చమాంబ గోపాంబ వీర
లిరువురును భార్యలై తనకెసక మెసఁగ
భోగదేవేంద్రుఁడై వృద్ధిఁబొందెనౌర
శ్రీయుతుండు లక్ష్మారెడ్డి ధీయుతుండు. 55

సీ. లక్ష్మిసరస్వతుల్ రహిసీడనఁగవచ్చు
నన్యోన్యమును మైత్రియమరెనేని
సాహితీగీతులు సరినాఁగఁదగు నేక
పురుషాశ్రియత్వంబు వఱలెనేని

శాంతిదాంతులతోడసాటి సేయఁగవచ్చుఁ
బైనొండు లోనొండుఁ బరఁగవేని
శ్రద్ధామనీషలు సరిచెప్పఁగావచ్చు
నన్యోన్యవైరుధ్య మలరదేని
తే. గీ. అక్కసెల్లెండ్రునై సమానాకృతులయి
సవతులయ్యును భేదమ్ము లవము లేక
క్షీరనీరవిధమ్మునఁ జెలిమిగలిగి
డంబలరు బుచ్చమకును గోపాంబికకును. 56

క. ఆలక్ష్మి రెడ్డియు మఱి
యాలలనలలోన బుచ్చమాంబయును లస
చ్ఛీలుర ముప్వురుగొమరుల
బాలిక నొక్కర్తుఁ గని రపారయశస్కన్. 57

క. శ్రీలక్ష్మిదేవియను న
బ్బాలిక తనపేరు సార్థపటిమ వహింపన్
బాల శశిరేఖయో యనఁ
గా లలివృద్ధిం దనర్చెఁ గళలలరారన్. 58

ఉ. ఆలలనా లలామ సుగుణాకరుఁడౌ గదవాలరామభూ
పాలునకిచ్చి పెండిలి యపారముదమ్మునఁ జేసి; రాపె స
చ్ఛీలము తన్మనోహరు ప్రసిద్ధియు నీగియు నిర్ణయింపఁగాఁ
జాలుట మాక కాదు జలజాతభవాదులకే నశక్యమౌ. 59

తే. గీ. ఈమెకన్నను జిన్నలై యెల్ల సుగుణ
ములను నెవ్వరికన్నను మొదటివార
లగుచు నలరారుచుండ్రు రాజావనీంద్రుఁ
డును మఱియుఁ దిమ్మనృపతియు ననుపమితులు. 60

క. ఇరువురు విద్యలలో ఘను
లిరువురు నాకారవంతు లిరువురు నన్నన్

గురుభక్తిఁగొల్చు గురుయశు
లిరువురు సంతానవంతు లిరువురు శాంతుల్. 61

మ. మతిమంతుండయి పారసీచదివి తిమ్మారెడ్డి ప్యాసయ్యె ను
న్నతమైనట్టి వకీల్పరీక్ష యిదియుండన్ దెల్గునన్ సత్కవి
ప్రతతుల్ మెచ్చఁగ నీతివాక్యపదపూర్వంబైన రత్నావళిన్
గృతితానై యొనరించె నమ్మహితునిన్ గీర్తింపఁగాఁ జెల్లదే. 62

క. వీరికినెల్లన్ జ్యేష్ఠం
డై రాజిలు ననుపమానమగు శాంతికి తా
నై రామారెడ్డి మహా
ధీరుఁడు గంభీరుఁడును సుధీమాన్యుఁడునై. 63

తే. గీ. పారసీభాష నెక్కుడు పండితుం డ
రేబియన్ భాషలోన నుత్కృష్టతముఁడు
తెల్గునం దెంతకేనియుఁ దెల్విగల్గు
వాఁడు వినయాదిగుణముల వీడితండు. 64

ఆ. వె. ధర్మసుతునకేనిఁ దప్పు వెదకవచ్చుఁ
గాని యితనియెడలఁ గానరాదు
ఇంత శాంతి దాంతి యింత యనుద్ధతి
యింత యోగ్యతయు మఱెందులేదు. 65

తే. గీ. కవులతో స్నేహమొనరించు ఘనుఁడతండు
కవులతో స్నేహమొనరించు ఘనుఁడితండు
భేదమిట్టిది యొక్కింత లేదయేని
రామవిభుఁ డనవచ్చు నీ రామవిభుని. 66

క. ఆరాముఁ డనంతాసుత
గారామునఁ బెండ్లియాడెఁగా; రాముఁడితం
డారామతల్లి పేరిఁటి
నారీమణిఁ బెండ్లియాడె నయవినయయుతన్. 67

క. ఎంతేనిఁ దనదు పెద్దలు
సంతసమునఁ బొదల రామజనపతి యాయు
ష్మంతుని సుశ్రీమంతు న
నంతాంబికయందుఁ గనె ననంతారెడ్డిన్. 68

—* షష్ఠ్యంతములు. *—

సీ. ఏతాదృశగుణాళిచేతఁ బొల్పెడివాని
కతులిత వైభవం బలరువాని
కీవిచేఁ బ్రఖ్యాతి నెనసి వర్తిలువాని
కతిశుద్ధమగు చిత్త మమరువాని
కధికమౌ రసికత కాధారమగువాని
కఖిలవిద్యాశాలి యైనవాని
కెనలేని వినయంపు గనియైనవానికి
ధైర్యమెక్కుడు గల్గి తనరువాని
గీ. కభ్యుదయములు గల్గెడు నట్లు మేము
బుధులు ముదమందు గతిఁ జేయఁబూను లక్ష
ణాపరిణయమనెడి ప్రబంధమ్మునకుఁ గ
థాక్రమం బివ్విధమ్మునఁ దనరుచుండు. 69

—❦—

# కథాప్రారంభము



ఉ. సిరికిం బట్టు యశోవిభూతివిజయశ్రీశోభితాశాంతరుం
డరిరాట్కాననవీతిహోత్రుఁడు ప్రశస్తౌదార్యభాభాసురుం
డరుణన్యక్కరణక్రియాచణప్రతాపాలంబి సౌజన్యసు
స్థిరుఁ డస్తోకకలావిలాసుఁడు బృహత్సేనప్రభుండొప్పగున్. 1

ఉ. దాత మహానుభావుఁడు బుధప్రతతిం గరఁగించు వాఁడు ని
ర్ణేత సమస్తవిద్యల, కనింద్యచరిత్రుఁ డపాస్తశత్రుఁ డు
ద్ధూతసమస్తకల్మషుఁడు దూరవిచారణశీలుఁ డుత్తమ
ఖ్యాతిసమేతుఁ డానృపతికాంతునిఁ బోలగఁ జాల రొండొరుల్. 2

సీ. ప్రతిలేనిసంపత్తిఁ బరిఢవిల్లుటెకాదు
విద్యావిశేషముల్ వెలయువాఁడు
అనుపమానఖ్యాతి నతిశయిల్లుటెకాదు
వినయాతిశయము శోభిల్లువాఁడు
అధికప్రతాపమ్ము నంది యుండుటెకాదు
శాంతి దాంతులను మెచ్చఁదగువాఁడు
అప్రతిమాకృతి ననుగమించుటెకాదు
తల్లిఁగాఁ బరభార్యఁ దలఁచువాఁడు

తే. గీ. సకలసుకవిచకోరకనికరపూర్ణి
మాతుషారకరాయితామందవితర
ణక్రియాశాలి రాజన్యచక్రమౌళి
మానితపదద్వయుఁడు బృహత్సేనవిభుఁడు 3

సీ. సుకవి వచ్చెనఁటన్నఁ జూడనంపుటెకాని
మనకేమియని యూరకొనుటలేదు
విద్వాంసుఁ డనియన్నఁ బిల్వనంపుటెకాని
పోనిమ్మనుట మొట్టమొదలె లేదు

గాయకుం డనియన్న గారవించుటె కాని
నాస్తి పొమ్మనుట స్వప్నమున లేదు
యాచకుం డనియన్న నాదరించుటె కాని
యీసడించుట యెన్నఁడేని లేదు

తే. గీ. ఎన్నిసార్లైన నడిగిన నిచ్చుచుంటె
కాని మున్నిడు టొక్కమాటైన లేదు
అనృతమాడుట మందునకైన లేదు
ఏ నృపులుసాటి యా బృహత్సేనపతికి! 4

క. నయమా ప్రతిపదసంపదు
దయమా యామీఁద మత్తత త్త్రిపురా
ద్జయమా యదియును గాక వి
నయమా వేతొకరుఁ డిట్లనన్ దాదృశుఁడే. 5

క. ఆ రాజేంద్రుని కొక్క కు
మారీమణి తనరు సకలమనుజేంద్రతనూ
జారత్నములకు నాపెకు
వార యరయ హస్తిమశకపైఖరి నొప్పున్. 6

తే. గీ. ఆసరోజాక్షి పుట్టినయది మొదలుగ
నఖిలశుభలక్షణమ్ముల నలరుకతన
లక్షణ యటంచుఁ బల్కి రెల్లరును న త్త
లోదరీలక్షణము లెంత యొప్పునొక్కొ! 7

తే. గీ. ఆమగువ జన్మనక్షత్రమే మొకాని
పుట్టినదిగోలె శ్రీకృష్ణ పుణ్యకథలు
వినఁగ మది ముచ్చటంబడు వెన్నఁడన్న
మాట విన్నంతమాత్ర సమ్మదముచూపు. 8

ఉ. ఆ యెలనాగ శైశవమునందున మేల్ రతనంపుఁ దొట్టెలోఁ
బాయనికూర్మినుంచి తగుపాటలు పాడెడివేళ "లాలి కృ

ష్ఠా" యన నాలకించి వదనాంబుజ మంకురితస్మితమ్ముగాఁ
గోయని మించి యాడునఁట, కోమలి జన్మవిశేషమెట్టిదో! 9

తే. గీ. పలు పలుకులేల, గరుడపక్షులు సయితము
సహజమగు కూజితమునఁ గృష్ణా యటన్న
నాలకించి వినోదాబ్ధి నోలలాడు
మతులెవరికైనఁ గర్భాను గతులుగావె! 10

క. కేవలలక్షణయయ్యును
నావెలఁదుక సర్వలక్షణాలంకార
శ్రీవెలయ సలక్షణయనఁ
గా వృద్ధిం జెందె శీతకరరేఖ యనన్. 11

క. అలరులకు సౌరభమువలె
వెలకు శరత్సమయమువలె నీరదతతికిం
దొలకరిమెఱుపుంబలె న
న్నెలఁతకు తేజవ్వనంపునిగ్గులు దోఁచెన్. 12

సీ. మునిమురి నగవులపస పసందుగఁ దూఁగె
మొలకచూపులసౌరు తళుకుజిలికె
నడలందుఁ గడువింత జడిమ నూల్కొనసాఁగె
నెదవిస్తరించి పయ్యెదనుడాఁగె
నడుము నానాఁటికి నాదారుగాఁ దోఁచెఁ
దొడలయందునఁ బుష్టి దొలకరించె
వాతెఱ వేతొక్క వైఖరిఁ గననయ్యెఁ
జాతురి పల్కుల నూఁతగొనియె

తే. గీ. నంతకంతకు లావణ్యమతిశయించె
వింతవింత పనులయందు వేడ్కదొడరె
నంతిపురమున నుండు టభ్యాసమయ్యెఁ
గంతునకుఁ గాఁపురంబయ్యె నింతిమేను. 13

తే. గీ. జాఱుముడివైవఁ గట్టిపైఁ బచారుసేయు
జడఘటించిన మడమలఁ దొడరియాడుఁ
గొప్పువెట్టినఁ దలకన్న గొప్పగాంచుఁ
జొల్లెమిడుటొప్పదే యట్టి సుదతి కురుల. 14

మ. పరివేషమ్ములుగట్టి పూగశకలప్రాయమ్ములై యంత బం
గరుగోలీల నతిక్రమించి లికుచాకారమ్ములై పిమ్మటన్
సరసీజమ్ములమీఱి గట్టిపడి విన్నాణంపు బల్కుప్పలై
పరిమాణింప నశక్యమై యెసఁగె నప్పద్మాక్షివక్షోజముల్. 15

క. రదములను మల్లెమొగ్గలు
పొదలన్ లేఁజన్నులనెడి పూవుంగుత్తుల్
గదియ నునుఁ బల్కుకోయిల
రొదలొదవఁగఁ బుష్పసమయరూఢిన్ దనరెన్. 16

క. అంత వసంతము సంతత
దంతురితలతాంతమొప్పె దాంతవిరహిహృ
త్కుంత మతికాంతసరలా
శాంతము సంతోషకరనిశాంతంబగుచున్ 17

క. లేమావిగున్న చిగురుల
నామెయి మెసవంగఁ గోకిలాంగనలకు ని
త్యామోదప్రదమధుర
శ్రీమెఱయఁగఁ గంఠములకు జీరలు తెగియెన్. 18

క. అల కాల మెల్లరకు సమ
కలనన్ శాస్త్రప్రసిద్ధి గాంచినదయ్యున్
గలయికలులేక తగు కాం
తులకున్ గాంతలకు నిశలు దుర్దశలయ్యెన్. 19

ఉ. మామిడిపండ్లు పానకము మంజులతన్ దగు నిక్షుఖండముల్
భూమిసురాగ్రిగణ్యులకుఁ బూర్ణముగా నిడి చందనమ్ము మై

నోమియు వీవనల్ విసరియున్ దనియింతురు పుణ్యవంతు ల
య్యామనియందు మాధవున కాదర మెంతయు మేదురమ్ముగన్. 20

క. అట్టియెడ బృహత్సేనుఁడు
దట్టములగు చూతములను దనరారి మణీ
కుట్టితకుట్టిమమై బల్
వెట్టన్నెట్టఁ దగునట్టి విరి లేఁదోఁటన్. 21

చ. చరమధరాధరమ్మునకు సన్నిధిలో నొకయింత దవ్వునన్
సరసిజమిత్రుఁడుండ భటసంఘము గొల్వఁగ నేగి వట్టివే
ళ్ళరుచి నెసంగి సర్వశుభలక్షితమై యలరారునట్టి చ
ప్పరమునఁ గూరుచుండెఁ దగు పండితమండలి చుట్టువాఱఁగన్. 22

ఉ. గాయక గానముల్ నెలఁగఁగా రమణీయధనాంగనామణీ
గేయవిలాసనాట్యములొగిన్ మిగులన్ దగ స్వస్తివాచకా
గ్రీయులు వేదఘోష మొనరింప నిలింపులకింపు నింపు న
ట్లాయతమైన సంపదల నానృపుఁడంత వదాన్యమౌళియై. 23

మ. మణులన్ వజ్రములన్ మహాంబరములన్ మద్యాదులన్ మేటి ద
క్షిణలన్ భూసురవర్గముం దనుపుచున్ గేలోమ్మిడ్చి యవ్వారికిన్
బ్రిణతుల్ సల్పుచు వీవనల్ విసరుచున్ బాటీరపంకంబు వీ
క్షణరమ్యంబుగఁ బూయుచున్ స్రజములన్ గంఠమ్ములన్ వైచుచున్.

ఉ. ఉన్నయెడన్ సమస్తజగదుత్సవకారణమై సమంతతో
భ్యున్నతపన్నగప్రకరపోషకమై ద్రమిడాంగనాకుచ
స్విన్నపటీరసారభవిశేషపరీమళమై యెలర్చె సం
పన్నవిపన్నభూరిసుఖబంధురమై మలయానిలంబొగిన్. 25

క. ఆమలయానిల మొలయుట
చే మహీసురులును నృపాలశేఖరుఁడును భృ
త్యామాత్యాదిజనమ్ములు
నామోదరసాబ్ధిఁ దేలు నాసమయమునన్. 26

సీ. కాషాయ వస్త్రమ్ము కటితటమ్మునఁ గ్రాలఁ
గాయమంతయు భూతి గడలుకొనఁగఁ
ద్రిదశాపగామృత్తు నుదుటిపైఁ జెలువార
మస్తకమ్మున జటామకుట మొలయ
దండక మండలుద్వయము కేలనెసంగఁ
బాదద్వంలందుఁ బావాలు దసరఁ
జేరురమ్మునఁ బద్మబీజమాలయెలర్ప
వీణియ బుజముపై రాణనింప

తే. గీ. నంబరమునుండి కృష్ణకృష్ణా యటంచు
సరససంగీతభంగీతసంగతులను
బాడియాడుచు నానందభరితుఁడగుచు
వచ్చె నారదుఁడా నృపవరునికడకు. 27

ఉ. వచ్చినమౌనిఁ గాంచి సభవార లవారణగౌరవంబు పైఁ
బెచ్చుగ లేచి; రంతఁ బృథివీపతికల్పితపూజ కెంతయున్
మెచ్చి మునీంద్రుఁ డాదరము మీకొనఁ దన్నృపమౌళిదత్తమౌ
పచ్చలగద్దెపై హరినిఁ బాడుచు వేడుక పిచ్చలింపఁగన్. 28

వ. సుఖాసీనుండై.

ఉ. "నందకుమార! భక్తజననారకతారక! ద్వారకాపురీ
నందనచందనద్రుమ! సనాతననూతనగోపసుందరీ
బృందమిళింద! బంధురపరీమళధామమరంద! నీకిదే
వందనముల్ పదింబదిగ వందలువేలు పురందరార్చితా! 29

ఉ. ఇందుముఖీమనోజ! జగదీశ! రమేశ! విధీశనుత్య! ని
ష్పందయశోవిశాల! పరిపాలితసన్మునిజాల! నన్మనో
నందన! భక్తచందన! కనత్కనకాంబర! కృష్ణ! నీకిదే
వందనముల్ పదింబదిగ వారిజలోచన! పాపమోచనా! 30

క. చిక్కవు తపముల జపములఁ
జిక్కవు జన్మముల నేమిచేసిరొ! నీకా

టక్కరి గొల్లవెలందులు
చక్కఁగఁ జిక్కితివి వారిసందిళులందున్. 31

మ. అలినీలాలక భీష్మకన్య తొడపై నానందముం దెల్ప లీ
లలు చెన్నారఁగ సత్యభామ మధురాలాపమ్ములం దేల్ప ని
చ్చలు పైపెచ్చుగ నాసుదంత విడెమున్ జానొప్పనందీయ మె
చ్చులమన్ మెచ్చులొసంగు నీవిహృతికిన్ జోహారు జోడించెదన్. 32

శా. కోకల్ చంకనుబెట్టి గూఢగతిఁ దక్కంగొల్ల యిల్లాండ్ర బల్
వీఁకన్ వంచనచేసి పొన్నపయికిన్ వేంచేసి కూర్చుండి త
ద్రాకాపూర్ణనిశాకరాననల మర్మంబుల్ విలోకించు "నీ
జోకలె లోకము మెచ్చుపోక'' లనుచుఙ జోడించి కేల్మోడ్చెదన్. 33

శా. రాకాచంద్రికనన్మయూఖతతిమీఁదన్ జేరి కాళిందిలో
నేకాంతమ్ముగ గొల్లచేడియలతో నిచ్చల్ పిసాళింపఁ గొ
క్కోకాచారము దప్పకుండ ననుఁగుం గోపాలకుల్ సూడ స్వే
చ్ఛాకాంతంబయియొప్పు నీదయిన రాసక్రీడ కే మ్రొక్కెదన్." 34

క. అని మాటిమాటికిని వ
న్వనజాక్షుని చర్యలెల్ల వర్ణించుచు భ
క్తినిమీలితలోచనుఁడై
ముని వీణియమీఁదె రసము మోటలుగట్టెన్. 35

క. నెట్టికొని నారదుఁడు రస
ముట్టిపడన్ జలజనయను నొగిఁబొగడఁగ వ
ప్పట్టునను బృహత్సేనుని
పట్టి వినియె వలపుకొంత పయిపయిఁబొంగన్. 36

వ. ఇమ్మెట నారదుండును బృహత్సేనుండును గొంతవడి నుచిత ప్రసంగ
మ్ములఁ గాలమ్ముఁ బుచ్చుచుండి రట్టియెడ నమ్మని కెలననున్న లక్ష
ణంగాంచి నృపున కిట్లనియె.

ఉ. "ఈయెలనాఁగ పెండ్లికినీడయి తోఁచెడిఁ బెద్దలెల్ల నా
హాయనఁబొల్పు నూత్నమదనాంచితు నొక్క కుమారకుఙ జగ

ద్గేయునిఁ జూచి సర్వజనగేయముగా నిఁకనైనఁ బెండిలిన్
జేయక మిన్నకుంట తగునే? నరపాలకులావతంసమా!" 38

క. అన జనవరుఁ డిట్లను "నో
యనఘా! తగునట్టి నరవరాగ్రణిసుతునిన్
జననుతుని మీరలారసి
వినిచిన నవ్వానికిచ్చి పెండ్లియొనర్తున్." 39

చ. అనవుడు మౌనియిట్లను "ధరాధిప! మౌనులమైనమాకు న
చ్చినపురుషుండు పార్థివకృతులు సెప్పెడివారలఁబోలె మీకు న
చ్చునొ, యటుగాదొ! నామదికిఁజొప్పడువాని వచింతు నాతఁ డీ
క్కనకనిభాంగికిం దగినకాంతుఁడటంచుఁ దలంతునెంతయున్. 40

ఉ. ద్వారకనేలువాఁడు సముదారగుణాఢ్యుఁడు మేలువాఁడు నా
కారము చెప్పనేల! రతికాంతునిఁగన్న మనోహరుండు దు
ర్వారరిపుప్రకాండమదభంజనుఁ డాతనికన్న మేటి యీ
ధారుణిఁగాదు నాకముఖధామము లందుఁ గనన్ వినన్ జుమీ, 41

ఉ. ఆతని కాతఁడేప్రతి సమస్తవిధమ్ములఁ ద్వత్కుమారికా
రీతియుఁజూడ నాతనివరింపఁగ నెంచెడియట్ల తోఁచు మే
లీతరుణీశిరోమణికి నీడతఁ, డాపరిభూతశంబరా
రాతికి జోడు నీతనయ రాజవరేణ్య! యెఱుంగఁజెప్పితిన్, 42

క. కాని యొకసందియము కల
దీనరలోకాధిపతుల కెల్లరకును న
మ్మౌనిజనసుతుఁడు గొల్లఁడు
గాని నృపుఁడు గాఁడఁటంచుఁ, గలది వచింతున్. 43

క. నారాయణుండు ధరణీ
భారము వారింప యాదవకులమ్మునఁ జె
న్నారెన్ గృష్ణుండన నీ
కారసి తెల్పితిని గడురహస్యంబైనన్. 44

క. చకితులగు లోకులకు వెఱ
వకతీఱదు గాన నొకయుపాయము కడునె
న్నికయగుగతిఁ దెల్పెద వా
రక చాటింపుము స్వయంవరము జగమెల్లన్. 45

ఉ. సీకొమిరెన్ వరింప ధరణీపతులెల్ల రహంక్రియామదో
ద్రేక మెలర్ప రాఁగలరు; తెల్లముగా నపుడీవు మత్స్యయం
త్రాకలనమ్ము నన్ జయమునందిన సుందరుఁడీ కుమారికన్
జేకొనునట్లుగాఁ బ్రతినచేయు ముపాయము న్యాయ్యమైతగన్. 46

ఉ. దానికిఁ గృష్ణుఁడొక్కరుఁడు దక్కఁ దదన్యు లశక్తు; లాతఁ డ
మ్మౌని జలమ్మునందుఁగని యుప్పరవీధిని మత్స్యయంత్రముం
బోనరుకంగలాఁ డతని పోడిమి యన్యుల కబ్బనేర్చునే
యానరరథ్యచోదకునికడ్డమె! యెంతటి రాజచంద్రులున్. 47

మ. జయలక్ష్మీలలనామనోహరుఁడు కృష్ణస్వామి నీపుత్రికిన్
బ్రియుఁడై యొప్పెడి నిక్కమియ్యది నృపుల్ పేపెత్తిపైవచ్చినన్
లయముందింపఁగఁజాలకున్నె? శిశుపాలధ్వంసి నీకేల ని
ర్భయమౌరీతి నొనర్పుమిట్లు, శుభముల్ వాటిల్లు నాయానతిన్." 48

క. అనుపలుకులు విని నృపవరుఁ
డనుమోదముచెందె మౌనియరిగెం దనయి
చ్ఛను; లక్షణకున్ మన మ
మ్మనసిజజనకుపయి మాటిమాటికి బ్రాలెన్. 49

తే. గీ. అంత నరపతి పురమునకరిగె; లక్ష
ణాంగనామణి యంతఃపురాంతరమున
కేగెఁ; జెలిక త్తెలందఱు నిండ్లుచేరి;
రరుణుఁ డరుణప్రభాంకితకిరణుఁడయ్యె. 50

— ఆశ్వాసాంతపద్యములు —

క. ఘార్జీభాషాప్రజ్ఞో
త్కర్షాకర్షితయశోధికా ! శంకరసం
కర్షణసమబుద్ధియుత ! య
మర్షస్వీకృతివిరహిత ! మానితచరితా ! 51

స్రగ్విణి. పాకనాట్యన్వయా ! బంధురాలంక్రియా !
శ్రీకళత్రాంఘ్రి సంసేవనాప్తోదయా !
గోకిరెడ్డ్యాప్తసంగుప్తకీర్తీ ! గుణా
లోకనైకప్రియా ! లోలుభత్వాప్రియా ! 52

పంచచామరము.

ధరామరస్థిరాదరా ! వృథావిధోక్త్యనాదరా !
నిరంతరానురక్తి చిహ్నా ! నిత్యపోషితప్రజా !
పరాభిధేయవస్తుతత్త్వపండితా ! యశోన్వితా !
ధరావరేశ్వరా ! సమస్తధర్మమర్మభాస్వరా !

— గద్య —

ఇది శ్రీతిరుపతివేంకటీయ లక్షణా పరిణయంబను
మహాప్రబంధమ్మునందుఁ బ్రథమాశ్వాసము



శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# లక్షణా పరిణయము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీకర ! లోకోన్నతసుగు
ణాకర ! యావనకలావిహార ! సుకవితా
పాకవివేకముగల కవి
రాకకలరు వేల్పుగిడ్డి ! రామారెడ్డీ ! 1

తే. గీ. అవధరింపు మనంతరంబబ్జబంధు
నందు రాగాతిశయ మెక్కుడై చెలంగె
స్వగతుఁడగు హరి వరుఁగఁగోర గమకించు
లక్షణకు గల రక్తిఁదెల్పనో యనంగ. 2

క. అంబుజబంధుఁడు పూర్ణత
రంబై యర్ధమయి కొంతరాణించియు సూ
క్ష్మంబై తగు బింబమునఁ గ్రి
మంబుగఁదాఁ బశ్చిమాద్రిమాటున కరిగెన్. 3

క. హరిదశ్వుఁడు తనగృహమున
కరుదెంచె నటంచుఁ బశ్చిమాంబుధి మణులన్
గరమునఁ గానుకొసంగఁ ద
దరుణచ్ఛవిఁ బొల్చెననఁగ నరుణుం డెసఁగెన్. 4

తే. గీ. పశ్చిమాచలమునఁ గాంతి పరిఢవిల్లెఁ
గాని తూరుపుఁగొండ రిక్తదశనందె;
"నొకఁడు చెడిపోవుపైఁగాని యొకఁడు బాగు
పడుటలే; దని జను లాడుపలుకు నిజము. 5

తే. గీ. వారకాంతనువదలి యంభోరుహాప్తుఁ
డరిగినంతన యద్దాని నంటుకొనఁగఁ
దిమ మురుగుదెంచె, వారకాంతలకుఁ దగిన
వాఁడు వీడిన దురవస్థ వచ్చుటరుదె! 6

ఉ. అంబుజషండ్ చలించెఁ, బతగావళి గూళ్ళకుఁ జేరవచ్చెఁ, దీ
రంభులనుండి విప్రులు కరంబుల డంబుగ నీరుకావిప
ప్రంబుల సంపుటంబులు మొసంగ గృహంబుల కేగుదెంచి, ర
థ్రింబున సంజ తగ్గె, విరఁజాజెఁ దమంబు క్రమంబుగా దెసల్. 7

తే. గీ. కొండలన్నియుఁ గాటుకకొండలయ్యెఁ
జెట్టులన్నియుఁ జీఁకటిచెట్టులయ్యెఁ
బండులన్నియు నేరెడు పండులయ్యె
నేమనఁగవచ్చుఁ దామసిదీమసంబు! 8

ఆ. వె. జలజజలజబంధుశరదాభ్రములయందుఁ
గలుగు రాగమెల్లఁ గలసి జార
జారిణీమనఃప్రచారంబు గావింపఁ
బోలు లేకయున్నఁ బోవుటెట్లు. 9

తే. గీ. గగన మను గని పెకలించి కాలపురుషుఁ
డందుఁగల వజ్రములఁ బయి నమరబెట్టు
చున్నపోలికఁ గ్రమముగా నొక్కటొకటి
గాఁబ్రకాశించెఁ దారక ల్గములుగట్టి. 10

చ. వెలవెలఁబాఱెఁ దూర్పుదెస వేవిళు లొప్పెసమీఁద గర్భిణీ
లలసమొగంబువోలె; శుభలక్షణలక్షితుఁడై దిగంగనా
తిలకమునొంపుసన్ దగి ప్రతిక్షణవర్ధిత కాంతిసంపదల్
చెలఁగఁగఁ జందురుండు వొడిచెఁ నగపాలుతమం బడంగఁగన్. 11

క. కలువలపాలిఁటి పున్నెము
కులుకుంజపరాండ్రపాలి కోరిక గజదొం

గలపాలిఁటి మృత్యువు వె
న్నెలరాయఁడు వెలిఁగె విరహిణీశత్రుండై. 12

క. చేరెఁ జకోరములెల్ల; వి
చారమ్మున మునిఁగెఁ జక్రిజంపతులు; జల
ఝూరె వెన్నెలరాలన్; జే
కూఱెన్ దంపతులకింపు; కొలఁకులు తేఱెన్. 13

తే. గి. పద్మినీకాంత తనుఁజూచి పవలు నవ్వ
రాత్రి నగసాఁగె దానిఁ గైరవిణి చెలఁగి;
యేరికేనియు సమవస యేగుమీఁద
రాణ నెసఁగెడి పున్నమ రాకపోదు. 14

వ. ఇట్లు చంద్రుఁడు విజృంభించుటయు.

ఉ. "నారదుఁడేలవచ్చె? జననాయకు మ్రోలకు, వచ్చెఁగాక తా
మారునిఁగన్న సుందరునిమాటల నెత్తఁగనేల? యెత్తఁగా
నారమణీమనోహరునియందము నామది కెక్కనేల? "నా
కోరిక దీర్చువారెవరొకో? యిపు" డంచు మదిం దలంచుచున్. 15

మ. "అనురాగంబది కన్నుఁగానదు, మనంబా మిఱ్ఱుపల్లమ్ములన్
గనదెచ్చోటనునైన నేగు, నిఁక వేడ్కల్ మంచియున్ జెడ్డయున్
మునుపే నేరవు, మన్మథుండు చపలాత్ముండెంతయు న్మూర్ఖుఁ డం
గనలన్ లోకువఁజేసి మీఁదఁబడు శక్యంబే నివారింపఁగన్?" 16

క. అని పలుఁదెఱఁగుల మనమున
జననాయకపుత్రి ప్రబలసంశయడోలా
వినిహితమగు తనహితమున
కనుమశలగు చెలులులేమి నటుచూచుతఱిన్. 17

ఉ. నెచ్చెలులేగుదెంచి ధరణీవరపుత్రికఁగాంచి తద్విధం
బచ్చపడంగనెంచి ప్రియమారఁగ డగ్గఱఁజేరి యెంతయున్
బొచ్చెములేనికూర్మి పొలుపున్ దెలుపన్ విరహాగ్ని పైపయిన్
హెచ్చఁగఁ బచ్చవింటిదొర హెచ్చులనున్ బయిపెచ్చులై తగన్, 18

క. పొదలుటకు సంశయించుచు
ముదితకుఁ దామిట్టులనిరి ముద్దియలు "బళీ
యిదియేమివింత! తాపా
స్పదమయ్యె లతాంగి మేను క్షణకాలమునన్. 19

చ. కుచములఁ దారహారములఁ గ్రొంబొగ రేఁగుటయేమి? చందనం
బు చిటులుటేమి? మేను తెలుపుం బలుపెక్కుటయేమి? యింతలో
విచికిలగంధి నీకుఁ గనువేఁదుఱుగల్గిన హేతువేమి? యిం
త చపలతక్షా వెసం గను విధంబదియేమొ? యెఱుంగఁజెప్పుమా. 20

క. నీవైఖరిచూచిన నీ
భావం బల తుంటవింటివానికి నిల యీ
భావముగనె ననితోఁచెడిఁ
బైవారమె? యేము నీకుఁ బద్మదళాక్షీ. 21

క. కావున నీనెమ్మదిఁగల
యాపత్సంగతులు చెప్పు మందుంగల కా
ర్యావసరము గనుఁగొందము
నీవారికిఁ దెలియకుండ నీరజనేత్రీ. 22

వ. అనిగ్రుచ్చి గ్రుచ్చియడుగు నెచ్చెలుల కచ్చెలిమిస్న గ్రస్నన నిట్లనియె. 23

ఉ. చెప్పెడిదేమి నాకుఁగలచేవయుఁ దోఁవయు మీరకాదె? మీ
యొప్పనికార్యమందు మదినుంచెడిదాననె? మీకుఁజెప్పుటల్
తప్పునె? తప్పుగల్గునె? విధానమెఱింగిన పోఁడ్రకైన మీ
రెప్పని సేయఁజాల? రిది యెంతటికార్యము మీరుపూనినన్. 24

ఉ. నారదమౌని వచ్చి జననాయకుముందరఁ గృష్ణచర్య లిం
పార విపంచికారవము హాయిగఁగూర్చి వచించెఁ, జించె న
మ్మారుఁడు నామనంబు పలుమాఱు శరమ్ములనించినించి, యో
సారసగంధులార! యొకసక్కెము చేసెదరేమొ? నెమ్మదిన్. 25

చ. అవనివరుండు నమ్మునివరాగ్రిణియాన స్వయంవరమ్ము సే
యవలయునంచు నెంచె నపుడామురవైరి యనుగ్రహించి యీ

యవనికిరాకయున్న మన మావలఁజేసెడిదేమి? వానికొ
క్కవిషయమౌనె? నావలపుకాంతలు వేనకువేలు గల్గఁగన్. 26

సీ. ఎదుటొమ్ముదిగక నెమ్మదికెక్కు పలుతక్కు
లొదవించు రుక్మిణీయువతి కన్నఁ
దొడఁజేరికడుమీఱి గడిదేరి ప్రోడయై
ప్రేమచూపెడి సత్యభామకన్న,
నును కెంపు కనునింపులను జంపునుంకించి
భయపెట్టికలఁచు జాంబవతికన్నఁ,
జలమూని తలఁపాని వలపే నియతిఁజేని
లీలనోలార్చు కాళిందికన్న ;
తే. గీ. నెచటదొరకిన నచటన యిండ్లకడకు
లాగికొనిపోవు గొల్ల యిల్లాడ్రకన్నఁ
జక్కఁదనమున్న దాననో, చాకచక్య
మున్నదాననొ ? యేను దామోదరునకు. 27

వ. అని పట్టరాని తమకమ్మున నెట్టకేలకు గుట్టుచెడి వెట్టగదుర నెట్టుకొని యిట్టు నట్టును దోఁపమిఁ దనలో,

సీ. ఆరుక్మిణీదేవి కధరంభవై తేని
యధరమా ! తదధరసుధలభించు
నాసత్యభామకు హస్తంబవై తేని
హస్తమా ! యతని కేలంటగల్గు
నాజాంబవతికి వక్షోజంబవేని వ
క్షోజమా ! తన్నఖాంకురము లొలయు
నాసుదంతకుఁ గన్నులై జనించితిరేవిఁ
గనులార ! యతనిఁ గన్గొనఁగనబ్బు ;
తే. గీ. తుదకు నొక గొల్లసుదతికిఁ బదములై తి
రేని చరణమ్ములార! యా వేనిమౌళి

హాసన లభించు నారీతిమాని నన్ను
నాశ్రయించితి రేమి భాగ్య[illegible]గల్గె? 29

ఉ. ఎంతటిసోయగంబొ? మఱియెంతటి చక్కని చారుచర్యమో?
యెంతటి వింతసంతసమొ? యెంతమనోహరతావిశేషమో
యెంతటి తీవియో? మఱియు నెంతకు నెంతయుఁగాక యున్న స
త్కాంతలు సన్యకాంతలును గంతుని మంతనమందు నుంతురే. 30

మ. మదనుం దిట్టఁగరాదు: కోయిలత్రో మాఱొడ్డఁగారాదు, వె
న్మది వారింపఁగరాదు, కోర్కెలపసన్ మర్దింపఁగారాదు, దు
ర్మదముం గ్రిందుగఁజేయరాదు, తనకామం బన్యులౌవారితో
మొదలే చెప్పఁగరాదు కష్టముకదా, పూఁబోడియైపుట్టుటల్! 31

క. మదనా! నీకిది యెంతయు
వదనా? నీవంటివాని కనదలమీఁదన్
గదనార్భటి లగునా? యా
పదనాటిన వారిమీఁద బాహుబలంబా. 32

క. పొలయలుకలుగల కలికుల
కలఁక వెలికిగొలుపు తలఁపుగలిగింపఁగ నీన్
గలిగించెను జలజాసనుఁ
డిల వెలియగు జలజముఖుల నేచెదపకటా! 33

క. కలసిమెలసి చెలరేఁగెడి
తలనీతలునులరు వలపుతలఁపులుపైపై
నొలయించినఁ గలుగును నీ
కిలఁ జలసము లేనికీర్తు లిక్షుశరాసా. 34

చ. భుజములు తీటవట్టినను బోరఁగరాదె, పురారితోడ? నీ
రజముఖులా? భవచ్ఛితశరమ్ములదాడికిఁ దాళువారు; నీ
విజయ మెఱుంగమే? యజుఁడు విష్ణుఁడు రుద్రుఁడు నీకు దాసులౌ
రః జగము లెల్లగెల్చి యొకరామపయిం దగునా? ప్రతాపముల్. 35

శా. రాజీవంబ యటంచు వైచెదవు తద్రాజీవమున్ జీవమా
రా జాగేల? యటంచు జీవమును గ్రూరంబై వెలింజేయు నో
రాజీవాస్త్ర! భవద్వినోదములు మార్గాలంపు సయ్యాటలై
రాజీవాక్షుల నేచుచున్న విది ధర్మంబౌనె? నీ బోఁటికిన్. 36

వ. అని చంద్రు నుద్దేశించి,

తే. గీ. తండ్రి జీవనదాత నీధామమెన్న
జీవనదమార్గ మాకృతిఁ జీవ
నస్వరూపమ్ము నీకు ననాథజీవ
నాపహరణంబు యుక్తమౌనా? శశాంక! 37

తే. గీ. పంకజములకు నీకును బద్ధవైర
మట్టి పంకజసాయకు ననుసరించి
చేవచూపెద వౌర! రాజీవవైరి
పరమ శత్రులు గలసినఁ బ్రతుకఁదరమె. 38

చ. సహజకళంకమంది గురుసామజయానను గూడి యామినీ
విహరణశీలివై దివి భువి న్నిలువోపకయున్నయట్టి నీ
యహమిక కంగనామణులు నా నొక లెక్కయె? యింతయేల? నీ
యిహము పరమ్మునుం గనని యెద్దెల నేమన నేమిలాభమౌ. 39

చ. ఎదుటికి వచ్చి పుష్పముల నింపుజనింపఁగఁ జల్లినట్టి య
మ్మదను మహోగ్రకోపమున మాపిన యాపురవైరి యెప్పుడున్
గదలక నెత్తికెక్కి నినుఁ గాదనఁ డాగ్రహమూనఁ డక్కటా
మది నొకలింగధారి వని మాటికిఁ దా నభిమాన మూనెనో. 40

క. అని చందురునిం బలుమఱు
గినిసి పలికి చెవులు చించు కీరమ్ముల మిం
చినగతిఁ గేరెడి పికములఁ
గనులెఱ్ఱఁగఁజేసి యనిలుఁ గని యిట్లనియెన్. 41

క. చలమూననేల? మలయా
చలమారుతమా! వియోగచలమానినులన్

బలమాఱఁజేయు టిదియొక
బలమా? కలమాట తెల్పు పథికులఫలమా. 42

ఉ. ఈగతి దూటిదూటి యొక యింతయుఁ దాళఁగలేక మూర్ఛవో
గాఁ గని నెచ్చెలుల్ చలువగందము గుబ్బలఁబూసి శీతలో
ద్యోగము లెన్నియేనియును దోఁచినవట్టు నొనర్చి తేర్చి యిం
కేగతి నిర్వహింతు మని యెంచి తలంచుచు నున్నయంతటన్. 43

తే. గీ. కెలనఁ బంజరముననున్న చిలుక వలికె
"నేల యీలీల యోజింప నేనుగల్గఁ?
గృష్ణునెఱుఁగనొ? ద్వారకకేగలేనొ?
కార్యమును బొత్తుపఱచెడి గతు లెఱుఁగనొ? 44

ఉ. మున్నొకనాఁడు చూచితిని ముచ్చటమీఱఁగ ద్వారకాపురం
బన్నగవైరిప్రోలు నగజాధిపువీడు రమేశురాజధా
ని న్నగఁజాలు నన్నగరి నిచ్చలుఁ గాఁపురమున్న భూసురుల్
జన్నములందుఁ బ్రోడలు విశాలయశుల్ నిగమాంతకోవిదుల్. 45

ఉ. వారల పాండితీమహిమ వారలయోగ్యత వారితీరు న
వ్వారి కులానువర్తనము వారలతేజము వారిసంపదల్
వారి కుటుంబవైఖరులు వారిపరోపకృతిస్వభావముల్
వారిజ సంభవుండయిన వర్ణనసేయఁగలేఁ డొకింతయున్. 46

క. అదియేమి వింతయో యొక
పదియేఁడులు వచ్చువఱకె పదమున్ గ్రమమున్
దుదముట్టఁ జెప్పనేర్తురు
చదువుల కిక్కలగు బ్రహ్మచారులు నగరిన్. 47

ఉ. కత్తులపైఁ బరీక్షనిడఁగాఁదగు వేదము, శాస్త్రమన్న మీ
చిత్తమువచ్చినంత యిఁకఁ జెప్పెడిదేమి, కవిత్వమన్న పే
రెత్తి జయింపశక్యమె మఱెవ్వరికేని, సమస్త విద్య ల
ప్పత్తనభూసురాగ్రణుల పాలనరాదె? మఱింతయేటికిన్. 48

ఉ. రాజులకేమి ? సంపదల రాజిలు వారలులేరె ? తత్పురిన్
రాజులు నిర్జితప్రథితరాజులు రక్షితవేదశాస్త్రవి
ద్రాజులు సమ్మదాయితవరాజులు సంపదలందు మేటి రా
రాజులు కీర్తినిర్మలితరాజులు రాజులు భోగసంపదన్. 49

తే. గీ. కోమటుల సంపదలను బేర్కొనఁగనేల
యాదియంతమ్ము నొందియు నాదియంత
మును గనక మధ్యమమ్మునై చను ననేక
ములు మణులు వజ్రములు రత్నములును నెలమి. 50

తే. గీ. విష్ణుపదజులు సదసద్వివేక మెఱిఁగి
తగు ననంతాప్తిచే మహోదయముగాంచి
విధుని సంసేవనముఁగల్గి విధివిహితగ
తుల నతులమై ఖరుల నొప్పుదురు పురమున. 51

ఉ. అప్పురి వారకామినుల యందము చంద మటుండనిండు బల్
కుప్పలుగా ధనంబు పదికోటు లొసంగినఁగాని పీచునిన్
జెప్పలు విప్పిచూడరు సరేకద ! విద్యలుసూపి ద్రవ్యమున్
గొప్పగ సంగ్రహించి యనుకూలురఁగూడి సుఖింతురెంతయున్ 52

ఉ. అందమునందుఁ దన్నగరమందలి గొల్లవెలందులే మరు
చ్చందనగంధులం గెలువఁజాలుదు రన్న ధనాంగనామణీ
బృందము నెన్ననేల ? పురవీథులఁ బూవులనమ్మ బోట్లతో
డం దులఁదూఁగ నేర్చునె బెడంగున రంభయు గింభయైనియున్. 53

ఉ. పూవులతోఁటలా, ముదముఁబుట్టఁగఁజేసెడి మేటితావులా,
బావుల కీవులా, మణులుపన్నిన మేల్మికడాని మేడలా,
మావులతావులా, మధురమంజులకోకిలకాకలీకల
ద్రావములా ! మనోహరము తత్పురమెన్నిఁట నెన్నిచూచినన్. 54

క. ఆపురము నేలికొనెడి మ
హాపురుషుఁడుకాఁడె ? కృష్ణుఁ డనఁగ, నతనితో

రూపమున నన్యవిధమున,
నేపురుషులు సాటిపత్తురే భువనమునఁ. 55

సీ. పురిటింటనున్నయప్పుడ పూతనను గొట్టి
మేటివిఖ్యాతిచే మించినాఁడు
అతిబాల్యమైన ప్రాయమున మద్దులఁగూల్చి
యందరాని యశమ్ము నందినాఁడు
అంతకింతైన ప్రాయమ్ములోనన దావద
పము మ్రింగి ప్రశస్తి దవిలినాఁడు,
అంతకొక్కింత హెచ్చైన ప్రాయముననే
నగమెత్తి సత్కీర్తి నెగడినాఁడు
తే. గీ. కాళియాహిమదం బడగంగఁద్రొక్కిఁ
గంసు హింసించెఁ, దనవారి కష్ట ముడిపెఁ,
బెండ్లియాడెఁ, గుచేలుఁ గుబేరుఁజేసె,
నాతఁ డగుఁగాదె ? శ్రీకృష్ణుఁ డతివలార ! 56

క. పదియాఱువేల చెలులకు
మదనుండై వెన్న పెరుఁగు మఱపించి ముదం
బొదవఁగఁ దిని బలిసిన కో
విదమాన్యుఁ డతండు గుఱుతు వేటిఁక నేలా. 57

ఉ. ఆతని చిత్రమేమొ యొకఁడయ్యును నందఱ కన్ని రూపులై
వేత్రతల సౌఖ్యఁజేయుచును వేయివిధమ్ముల మెప్పులందిత
చ్చేతములందు నెప్పుడు వసించు నటంచును జెప్పవింటి మా
జ్ఞాతులఁజూడఁబోయి యొకనాఁడు నిజమ్ముగ నమ్మఁడింతయున్."

చ. అను శుకరాజుమాటలు హృదబ్జము బిట్టలరింప నెచ్చెలుల్
విని గదియంగఁజేరి పృథివీవరు పుత్రికఁగాంచి "నీమన
మ్మునఁ గల కోర్కె లింపలరఁ బూర్తియొనర్పఁగఁ బూనినట్టి నీ
యనుఁగు శుకమ్ముమాట వినవమ్మ! మనఃపరితాప మాఱఁగన్. 59

చ. పులుఁగుల కిట్టికార్యములు పూనఁగఁజెల్లదటంచు నెంచఁగా
నలవశ దల్లనాఁడు దమయంతికి నన్నలుతోడ నేస్తముం
గలుపదె యొక్కయంచ? గనఁగా నివి కొఱ్ఱిత్తులె? తత్తదున్నత
స్థలముల కేగఁజెల్లునె? వెసన్ మఱియొక్కరి కెంతవారికిన్. 60

శా. ద్వారమ్ముల్ పనిలేదు కోటలనిన్ దాఁటుల్ తదంతస్థితా
గారంబుల్ సొర శంకలేదు పులుఁగుల్ గా కిట్టికార్యమ్ము లె
వ్వారల్ దీర్పఁగలారు? నీ మనమునన్ బాటిల్లు తాపమ్ము నీ
కీరాగ్రేసరుతోడఁ జెప్పఁదగదే? కీరేశ్వరాలాపినీ. 61

ఉ. అమ్మరో! యిట్టికార్యముల యం దిటు జాగొనరింపరాదు వే
గమ్ముగ నీమనోరథము గాదిలిచిల్కకుఁ జెప్పిపంపు జా
లమ్మొనరింపఁబోకుము విలంబము చెట్టయగున్ “శుభస్యశీ
ఘ్ర” మ్మని చెప్పినట్లు వినవుగా, తడవాయె నిశీధమేగెడిన్.” 62

క. అని మాటిమాటికిని బో
ధనచేసెడి చెలుల విసువు దనరఁగఁ గని నె
క్కొని మఱియు మఱియు బోధిం
చిన మెల్లనఁ జిల్కతోడఁ జెలి యిట్లనియెన్. 63

క. రమ్మనుమీ, సైపుట భా
రమ్మనుమీ, విరహ మతిభరమ్మనుమీ, వా
రమ్మనుమీ వ్యవధి, సుదూ
రమ్మనుమీపురి, స్వయంవర మ్మనుమి తగన్. 64

క. చలమనుమీ మరునకు. ని
శ్చలమనుమీ మన్మంనం, బచలమనుమి దృగం
చల మన్యులపై. నిదిచం
చలమానిని గాదటంచు శౌరికిఁ జెపుమీ. 65

క. మొఱ్ఱిక్కతిననుమీ, తనకుం
దక్కితిననుమీ. విశేషతాపభరమునన్

సొక్కితిననుమీ మిగులన్
జిక్కితిననుమీ, స్వయముగఁ జెప్పితి ననుమీ. 66

క. అనుమానమేల ? నిక్కము
నిను మాన నటంచుఁ బలికె నెలఁతుక పేర్మిన్
జనుమాన మొసఁగుమనుమా
చనుమా కనుమా కృపానుసారిన్ శౌరిన్. 67

క. విరు లరులు, సరులు నురులు, హి
మరుచియు నకఱ్ఱిమరుచి, పికమాద్యద్భృంగ
స్వర మురు భీకరతర, మే
మఱ కిదియంతయును దెల్పుమా నరహరికిన్. 68

చ. అనియనుపన్ శుకంబరిగె; నంచితసంచితపుణ్యగణ్యస
జ్జనధననందనందనలసత్పదపద్మరజోనుషంగస
ద్మనిభృతవాసభాసురమదభ్రమదామృదుగానదూనదే
వనిచయమై తనర్చు నల ద్వారకకున్ గరుబంతచారియై. 69

తే. గీ. కుక్కుటములంతఁ గొక్కురుకోయటనియె
దిక్కులం దించుకించుక తెల్విదోఁచెఁ
జుక్కపొడిచెఁ బొటుక్కునఁ జూడఁజూడ
దీపములు తెల్లవారె సంతాపమాఱె. 70

శా. చోరుల్ తాఱిరి తారకల్ జుణిఁగె గచ్చున్విచ్చెఁగా జారిణీ
జారుల్ వాఱిరి మారుఁడున్ మరలెఁ గాసారంపుఁ దీరమ్ములం
బాఱుల్ సేరిరి దూరమేగు పథికుల్ మార్గంబులంబట్టి రం
భోరుటొప్పారటపూరపూరితములై పొల్పారె సుందెమ్మెరల్. 71

సీ. అభిసారికాంగనావ్యభిచారములుతగ్గెఁ
దమము తూరుపు పర్వతమ్ము డిగ్గెఁ
గువలయమ్ములరంగు దవుదవ్వుల మణంగె
వెడవింటివాని యాగడమడంగెఁ

బద్మినీకాంతకుఁ బ్రాయంబునిండారె
నంబుజారికి వైభవంబుతీఱె
నేకీభవించుచుఁ గోకముల్ చెలరేఁగె
గుడ్లగూబలు కొండగుహలడాఁగె
తే. గీ. రంగుమెయి మత్తవస్తువుల్ మిఱ్ఱింగిమిఱ్ఱింగి
యొడలెఱుంగని రతముల బడలిబడలి
తెలివిఁగనలేని బలుసోమరులకుఁ దక్కఁ
దెల్లముగ నెల్లవారికిఁ దెల్లవారె. 72

ఉ. రంగుగఁ దూర్పుకొండపయి రాజిలు చెట్టునబుట్టినట్టి నా
రంగఫలంబనంగఁ గడురమ్యములౌ నరుణప్రభాచ్ఛటల్
నింగినిఁ బర్వఁబంకజవనీకమనీయత మాటిమాటి కు
ప్పొంగ సహస్కరుండు పొడుపుంగనెఁ జక్కవ లొక్కటైతగన్. 73

తే. గీ. ప్రాఙ్నగము సూర్యుఁడనుపుత్రుఁ బడయుకతన
సంతసమ్మున దిక్కుల కంత రక్త
రాంకవమ్ములు బహుమతి రాణనొసఁగె
నాఁగ నీరెండ చెన్నారె నాల్గుదెసల. 74

ఉ. అంతకు లక్షణాసతియు నాబిడ నెచ్చెలులున్ దిగంతర
ప్రాంతనిషక్తదృష్టులయి పల్మఱు కీరము రాక చూచుచున్
గంతు దురంతతాపమునఁ గ్రాఁగెడి రాతనయన్ బ్రమోదిత
స్వాంతనొనర్ప నేగిరి వసంతునికోటకుఁ బూలతోఁటకున్. 75

సీ. గొలలచేఁదూఁగు కదళికల్ ఫలమ్ములఁ
గొమరారు నారికేళములగములు
చేయెత్తు నిడుపువచ్చెడి పూగములు కిసా
లయములఁ దగురసాలంపుఁ దరులు
పూలఁబిందెలఁబండ్ల వ్రాలెడి పనసలు
పండినచెఱకులఁ బ్రబలుమడులు

నడుగడ్డునకును జొప్పడు పిల్లకాల్వలు
కంటికి నింపగుపంటచేలు
తే. గీ. చక్కని కొలంకులును మేటి చంద్రికాంత
ఫలకవేదులు కేళకూళులు సుహాళ
మలరు కేళీగృహమ్ములు పొలుపుదెలుపు
వలపుజిలికెడి యుద్యానవనమునందు. 76

సీ. ఉభయపార్శ్వములందు నొప్పారు మల్లికా
ప్రితతి సౌందర్యంబు పాఱఁజూచి
దూరదూరమ్ముగాఁ గేరుకోయిలలతోఁ
దులదూఁగు మావుల నరసియరసి
జలజలరాలు పుష్పములకుప్పల సౌర
భమువొల్చు పొగడవృక్షములు గాంచి
మలయవాయువులచేఁ గలయఁబర్వెడి పరా
గముల నొప్పెడి నికుంజములనెంచి
తే. గీ. తమ్మిపూఁదేనెఁగ్రోలి చిత్తమ్మునకు ము
దమ్మునుం దిమ్మనుం గ్రిమ్మ తుమ్మెదల ర
రవమ్ములకు నిమ్మయిన తటాకమ్ముపొంత
వింతయగు చంద్రకాంతశిలాంతరమున. 77

శా. కాలక్షేపముకోసమై సొగసులొ కంసారి సంసారపున్
హేలల్ వాడుచు లక్షణాంగనకు నెంతే మోదముం గూర్చుచున్
వేళాకోళములాడుచున్ నృపసుతన్ వేమాఱు నూరించుచున్
హాళిన్ దేల్చుచుఁ గూరుచుండిరి వయస్యల్ కీరముం దూఱుచున్ 78

ఉ అంతట నేగుదెంచె రయమారఁగఁ గీరము దూరమౌ పరి
శ్రాంతి నొకింతయున్ గణనసల్పక, వచ్చెడిదాని నంబర
ప్రాంతమునందుఁజూచి ముదమందుచు "సీకొక వందనమేండ్లు, మా
పంత లడంగె మాకుఁ బదివందలయేం" డ్లని రందఱుజ్జ జెలుల్. 79

క. అనునంతట నక్కీరము
వనజేక్షణకేల బ్రాలి వగరుచుచున్ గృ
ష్ణునిఁజూచితిఁ జెప్పితి వ
చ్చునతండు స్వయంవరమ్ము చూచెడి వేడ్కన్. 80

వ. అని సంక్షేపమ్ముగా ఫలితార్థమ్ము చెప్పిన నచ్చిలుకలకొలికి యచ్చిలుకం గని మెల్లన నిమురుచు నిట్లనియె. 81

ఉ. ఏమనెశౌరి ? నీవు మఱి యేగతినేగితి ? వేదనుండె నా
రాముని సోదరుం, డెటు విరామముగల్గెఁ బదాఱువేల గో
పీమణులన్ భరించు నల వేణువినోదికిఁ? బూసగ్రుచ్చిన
ట్లీమెయి సర్వముం దెలుపుమీ, శుకరాజకులావతంసమా ! 82

ఉ. రమ్మని గారవించెనొ, కరమ్మున నీవయి పోయివ్రాలితో?
కమ్మలిఖించి యిచ్చెనొ ? ముఖాముఖిమాటలు సెప్పిపంపెనో ?
నమ్మెనొ, నమ్మలేదొ ? మఱి నా వలపంతయు మూలముట్టుగా
నమ్మధుసూదనుండు నిజమంచుఁ దలంచెనె ? కూర్మినించెనే. 83

ఉ. పోతి నిశీథమందపుడు బోటులకూటములందు నమ్మురా
రాతి విలాససౌధముల రంజిలు నాసమయమ్మునందు నీ
కాతని దర్శనంబెటుల నబ్బెనొ ? యేగతి విన్నవించితో ?
చేతము చల్లనౌనటులఁ జెప్పఁగరాదె సవిస్తరమ్ముగన్. 84

చ. కువలయనేత్రి సారెకును గోరికలీరికలెత్త నీగతిం
దవిలి పునఃపునఃప్రకలితమ్మగు నాదరముం దురమ్ముగా
నవిరళమై రసప్రసరమైతగు వాక్యపరంపరన్ గడుం
జవిదళుకొత్తఁ బల్కనవెసన్ శుకరాజవతంస మిట్లనున్. 85

క. ఏ నరుగువఱకుఁ గారణ
మేనెఱుఁగనుగాని యాతఁడెఱిఁగినయటులన్
దానొకఁడు నొక్కఁడై యో
మానిని ! సౌభాగ్యమందు మసలుచునుండెన్. 86

చ. ఎలమిఁ బచారుసేయు జలజేక్షణు దవ్వులఁ గాంచి కార్యమున్
ఫలితమగుంగదా యనుచుఁ బక్షములన్ ధ్వనిరేఁగకుండ ని
శ్చలగతి నాతఁడున్న మణిసౌధము పొంతకునేగి తద్గవా
క్షలనడుమన్ దృగంచలముసాచి గృహాంతరమెల్లఁ జూచితిన్. 87

చ. చిలుకలుకొన్ని పంజరవిశేషములన్ గనుపట్టె; నంత లో
పలికి వెసన్ జనంగ నొక పద్మదళాక్షియు లేకపోయె; నా
తలఁపున సందియంబగుఁగదా, యపుడేమి యొనర్పఁగావలెన్ ?
జలజదళాక్షుఁడైన నొక చందనగంధియు లేకపోవునే ! 88

వ. ఇట్లు సంశయించి వెండియు. 89

సీ. కారుకమ్ములనేలఁగాఁ జాలె నెమ్మేను
నెమలిపింఛియము పెన్నెఱులనొప్పెఁ
గరముల శంఖచక్రములు పేర్మినెసంగె
వనమాల గళమున నెనసి వ్రేలెఁ
గౌస్తుభం బక్కుపైఁ గళల నీనఁగసాగె
శ్రీవత్సమును వింతచెలువు తెలిపెఁ
బీతాంబరంబు విస్ఫీతమై కనుపట్టె
వేణువా మోవిపై రాణనలరె
తే. గీ. తక్కఁగల గొల్లదొరల బల్ తెక్కులెల్ల
చక్కనగుఫక్కిఁ గన్పట్టె నిక్కమితఁడు
కృష్ణుఁడేయని యోజించి కెలననుండి
యెదుటవ్రాలితి నాతఁడు నదిరిచూడ. 90

చ. వెలఁదిరో ! యేమిచెప్పనగు పెన్నునివింతలు, నన్నుఁ జూచి "యో
చిలుక ! భవత్సఖీమణికి సేమమె ? పెండిలి యౌనచెప్పు ? త
య్యలికులవేణి కేన్నృపునియం దనురాగముగల్గె ? నీకునుం
దెలియకపోదు నాకుఁ దగఁదెల్పుము పెండిలి కేనువచ్చెదన్." 91

చ. అని వదనమ్మునన్ బలుచనై నను తేనగవంకురింప నన్
గని యెకసక్కెపుంగతినిఁ గంజవిలోచనుఁడాడె నాతఁ డే

యనువున నీమనోరథమునారసె దయ్యమెఱుంగు ! నాకుఁదో
చెనపుడు నారదుండరిగి చెప్పెనటంచుఁ గురంగలోచనా. 92

చ. అదియునుగాదు నిక్క, మతఁడాతనితో నినుఁ జెప్పఁగాక, నీ
మదిఁగలమర్మమెట్లతని మానసమంటె ! నటుండనిమ్ము; నా
కిది కడుఁబెద్దవింత ! నను నీవనుపం జనినట్టిదానిఁగా
నెదనెటు నిశ్చయించె ? జగదీశ్వరుఁ డాతఁడెఱుంగకుండునే. 93

వ. అంత నేనును మహానుభావుండగు నతనికి నమస్కరించి వినయమ్మున నిట్లంటి. 94

క. దేవా ! నీవెఱుఁగనికత
లేవీటన్ గలుగు ? నీకు నేనెఱిఁగింపం
గావలయునె ? పునరుక్తము
గావలయునె ? యంచుఁ జెప్పఁగా దొరఁకొంటిన్. 95

తే. గీ. భూసరోజముఖీమణిభూషణంబు
సప్తభూమికహాటకసౌధవరము
సకలసంపద్విభాసురజనచయంబు
మదిరములకెల్ల తనరారు మదిరపురము. 96

క. పాఠులు ధృతనిగమవ్యా
పారులు సమధీతనిగమపారులు జితకో
పారులు సమస్తశాస్త్రా
పారు లుదారులు నజాతపారులు నగరిన్. 97

ఉ. అచ్చటి రాచవారు కలనైనను బోరులనోరగారు, వి
వ్వచ్చునినైన మెచ్చ, రల భార్గవరాముఁడు నేఁడునున్నఁ బై
పెచ్చునిపించుకొందుమని బీరము బేరములాడుచుంద్రు; కాల్
గుచ్చినఁ బాఁపరాతలలకున్ దలవంపులొనర్తు రెంతయున్. 98

ఉ. తాతలనాఁటి పాతులకతమ్మున నాతని కందలేముగా
కాతఁడు మమ్ముఁబోలె ధనమార్జనచేసెనెయంచు నూచుసం

జాతపుడాతివారచట జక్కులరాయని లెక్కసేయ రే
పాతులులేకయే ధన మపారముగా గడియించి మించుటన్. 99

క. పాదజులెల్లరు ద్విజసే
వాదరు లత్యంతవిభవు లప్పురియం దా
మోదింపఁ దగనివస్తువు
లేదొక్కటియేనియును నళీకంబేలా. 100

వ. అట్టిపురమ్మున కధీశ్వరుండు 101

క. కలఁడు బృహత్సేనధరా
తలనాథుం, డతఁడు మిగుల ధర్మాత్ముండా
లలితునకు నొక్కకూఁతురు
సెలఁగున్ లక్షణయటంచుఁ జెప్పుదు రాపెన్. 102

ఉ. మాచెలియంచుఁ జెప్పికొనుమాటలుగావివి యామెఁబోల నా
మాచెలి యయ్యుమాసతియు మారునినారియు మాఱుగారు దే
వా! చెలులుందురౌఁగద పదాఱుసహస్రము లిప్పురమ్మునం
దాచెలియందమందలి పదాఱవతీరున మాఱనేర్తురే! 103

వ. అని వెండియు. 104

సీ. నీలంపుమణులు మానెలఁత పెన్నెఱులంటి
పడఁతిగుబ్బలు దబ్బపండులంటి
దానిమ్మగింజలు తరుణిదంతములంటి
మగువ కెమ్మోవి బింబఫలమంటి
చెలిమిన్ననూఁగారు చీమలబారంటిఁ
గలికివళుల్ తరంగమ్ములంటి
వనజాస్యనాసిక కనకపుష్పంబంటి
వెలఁదికన్నులు పద్మదళములంటి.

తే. గీ. సకియ నెమ్మోము పూర్ణిమాచంద్రుఁడంటి
కొమ్మ పెందొడ లంటికంబమ్ములంటి

నడుము సున్నంటిఁ బొక్కిలి సుడియటంటిఁ
దగును నీకంటి రమ్మని తగులుకొంటి. 105

క. కరములు నీరజశోభా
కరములు గళమెన్నదరనిగళమగు నఖరాం
కురములు హిమకరరేఖాం
కురములు పదములును విజితకోకనదమ్ముల్. 106

ఉ. బంగరుబొమ్మ సంపఁగులపట్టు చొకాటపుటిక్క మేలు మేల్
రంగులకుప్ప మారునిశరంబు రసంబులతేట వజ్రపున్
ముంగర నేరుపుందళకు ముద్దులమూట వరాలపేట మా
యంగన, దానిఁబోలఁగల యంగన లేదని నొక్కిచెప్పితిన్. 107

ఉ. నారదమౌనివచ్చి జననాయకునొద్ద నొకింతగా భవ
చ్చారుతరప్రభావముల చందమునందమునుందగన్ మనం
బారఁగఁజేయుచుం దెలిపె నోయదునందన! తత్క్షణంబ నీ
పై యచివెట్టె మాచెలియ, పట్టఁగ శక్యముగాదదేరికిన్. 108

క. అళులనిన నులికిపడు నె
చ్చెలులన్నన్ గసరుఁ బికవిశేషధ్వనికిన్
దలఁకు శశియన్న నులుకున్
జిలుకలకొలికి యళు కేమి చెప్పఁగవచ్చున్? 109

చ. నిను నుతియించు నిన్ గసరు నీవనినన్ దలయెత్తిచూచుఁ దా
నినుఁ బలుమారునుం దలఁచు నీదు కథాసుధఁ గ్రోలు నంతట
న్నినుఁగను నిన్ను మ్రొక్కు మఱినిన్ను వినున్ నినుఁబాడు మాటికి
న్నినుఁబలవించు నివ్వెదకు నీమయమంతయు మాలతాంగికిన్. 110

ఉ. చక్కనివాఁడవీవు నెఱజాణలజాణ నరేంద్రకన్య; బల్
టక్కరివీవు సొంపగుబెడంగున మేటి నృపాలబాల; నీ
వక్కమలాస్యకుం దగుదు వక్కమలాస్యయు నీకుఁజాలుఁ; దా
మ్రొక్కె నుతించె వేఁడికొనె ముంచినఁ దేల్చిన నీవసుమ్మికన్. 111

క. అని నీచెప్పిన సంగతు
లను శతగుణముగ నొనర్చి లలితగతుల బో
ధనచేసి "పత్తునిట" కని
యనిపించితి హస్తమందు హస్తంబిడియెన్. 112

చ. అని చిలుకాడుమాటలు హృదబ్జము బిట్టలరింప లక్షణా
వనజముఖీలలామ ముఖవారిజ మంకురితస్మితమ్ముగాఁ
జనపునఁ జిల్క కుక్కలు చక్కలుం దినిపించె; నార్తకా
మినులకు దూతబోక్కతతి మేటివరమ్ములొసంగు డైపముల్. 113

తే. గీ. అంతనెచ్చెలు లిట్లని రానరేంద్ర
పుత్రితో "నీదు కార్యమ్ము పొత్తుపఱచి
నట్టి చిల్కకు సమ్మాన మాచరించి
చిల్క తేజీదొరను వెలిఁజేయనగునె".. 114

మ. అనఁ జూచాయల నత్తలోదరియుఁ దానంగీకృతిం దెల్పె న
వ్వనజాస్యల్ నృపపుత్రితో సరసిలో వాలాయమోలాడి యొ
డ్డునకున్ వచ్చి కురుల్ విదిర్చికొని పట్టుంబుట్టముల్ గట్టి నె
క్కొని భూషల్ ధరియించి బొట్టులిడి కోర్కుల్ మిన్నుముట్టన్ దగన్.

సీ. కిలకిలమనుచుఁ గోకిలలు గూసెడిచోట
నళిదంపతులగాన మమరుచోటఁ
జిలుకముత్తెదువుల్ గలసి యాడెడిచోట
గేకులు పురివిచ్చి కెరలుచోట
నల్లిబిల్లిగ లతలల్లి యొప్పెడిచోటఁ
బుష్పపరాగంబు వాలయుచోటఁ
బిల్లవాయువులు సంప్రీతిఁ జేసెడిచోట
శారికల్ సురతముల్ సలుపుచోటఁ

తే. గీ. బూలఁబిందెలఁ దులఁదూఁగి నేలకంటు
గుజ్జుతేనుసుమామిడి గులుకుచోట

సపరివారమ్ముగాఁ బుష్పశరుని నిలిపి
యతని వామాంకమున రతి నసువుపఱచి. 116

క. ఆవాహనాదివిధుల ము
దావహముగ మదనదేవునర్చించి సఖుల్
పూపుందోయిలి గొని యా
దేవుని మదినిల్పికొని నుతించిరి భక్తిన్. 117

సీ. మదనాయ తారుణ్యసదనాయ శుభ్రాంశు
వదనాయ దేవ తుభ్యంనమోస్తు
మారాయ వైరాగ్యచోరాయ ధృతకీర
వారాయ దేవ తుభ్యంనమోస్తు
కామాయ సహచరసోమాయ విరహిణీ
వామాయ దేవ తుభ్యంనమోస్తు
తరుణాయ సౌందర్యవరణాయ శంబర
హరణాయ దేవ తుభ్యంనమోస్తు

తే. గీ. పంకరుహసాయకాయ తుభ్యం నమోస్తు
పద్మజాదినుతాయ తుభ్యం నమోస్తు
పరమపుణ్యకథాయ తుభ్యం నమోస్తు
భార్గవీనందనాయ తుభ్యం నమోస్తు. 118

చ. నలు దమయంతితోఁ గలిపినావు సుదర్శనుతోడఁ బేర్మి లీ
లలుపొలయంగ నాశశికలాలలితాంగినిఁ గూర్చినావు నీ
విలఁగల యెల్లదంపతుల కేలికవై జగదాదిహేతువై
చెలఁగెడివాఁడ వీసతికి శ్రీహరి పొందొడఁగూర్పఁజాలవే. 119

చ. అని నుతియించి యావనితలందఱుఁ గందళితాంతరంగలై
యనుఁగు సఖీమణిం గలసి యంతిపురమ్మున నాపె డించి యా
జ్ఞనుగొని యిండ్లకేగిరి పెసన్; జలజాప్తుఁడు నంతఁదీక్ష్ణవ
ర్తనుఁడయి మధ్యమాంబరపదమ్మున దంబుగనొప్పె నిచ్చలున్. 120

తే. గీ. అవనిపతి భోజనాదికృత్యములు దీర్చి
కవులు మంత్రులు పండితుల్ గలసికొలువఁ
దరుణశరదిందుముఖులు చామరలువీవ
నిండుకొలువుండెఁ గన్నులపండువలర. 121

ఉ. నారదుఁడాడినట్టి వచనమ్ములు మంత్రులతోడఁజెప్పి మే
లారసి పుత్రికామణికి నాయదునందనుపై విరాళియున్
బాలు పెఱింగి చారులను బంచెఁ దగన్ శుభలేఖ లిచ్చి వి
స్తారధరాతలేశ్వరుల సంఘములన్ బిలువంగ సత్తఱిన్. 122

—• ఆశ్వాసాంత పద్యములు •—

క. శ్రీశారదాకటాక్ష
వేశ సమావేశ సంప్రవృద్ధఖ్యాతీ!
దేశాయిదేశముఖము
ఖ్యాశాశ్రితబిరుదశాలి! యాత్తగుణాళీ! 123

చ. హితమితభాషితాపరిచితీశ్వరహృద్గతభావవేత్తృతే
ప్సితసఫలీకృతిప్రతినివేశితగౌరవబుద్ధినిష్కళం
కితచరితా! కవిత్వరసకేవలతత్పర! సత్పరాయణా!
అతిపరిపక్వచిత్త! పరమాద్భుతవృత్త! మహాగుణోత్తరా! 124

స్రగ్విణి. తాటికొండాఖ్యసద్గ్రామధామా! నిరా
ఘాటసామర్థ్యయుక్తా! మహాశాంత! యు
త్పాటితక్రోధ! సంప్రాప్తబోధా! యస
త్యాటవీచ్ఛేదనాయత్తచిత్తాంచితా! 125

— గద్య —

ఇది శ్రీతిరుపతివేంకటీయ లక్షణా పరిణయంబను
మహాప్రబంధమ్మునందు ద్వితీయాశ్వాసము



శ్రీరస్తు.

శ్రీమత్పరదేవతాయైనమః

# లక్షణాపరిణయము



## తృతీయాశ్వాసము

క. శ్రీరామచంద్రపదప
ద్మారాధననియతహృన్నయ! హారహీరయశ
శ్శ్రీరుచిర! నిరుపమదయా
ర్ద్రా! రక్షితపండితేంద్ర! రామనరేంద్రా! 1

తే. గీ. అవధరింపు మనంతరం బట్లు నంద
నందనుఁడు చిల్క చెప్పిన యందచంద
ములు మనమ్మున నాటి యమ్ముద్దుగుమ్మ
కన్నులకుఁ గట్టినట్లుగాఁ గళవళించు. 2

ఉ. అంతకుమున్న విన్న చెలు వగ్గలమై తలకెక్క రుక్మిణీ
కాంతున కంతకంతకును గంతునిదంతి వచించినట్టి య
య్యంతి విలాసముల్ మనసి కేపుఘటించి తదన్యకాంతలం
దెంతయు సేవగింపు లగియింపఁగఁజేసె నదేమివింతయో. 3

సీ. రుక్మిణితోఁ బొత్తు రుచియింపదాయెఁగాఁ
దాయగాఁదోఁచె సుదంతవింత
సాత్రాజితి యటన్న శత్రుత్వమాయెఁగా
మాయగాఁదోఁచె జాంబవతిపేర్మి
రాధికాసతి చెల్మి రహిలేకపోయెఁగా
పాయఁగాఁదోఁచె నాభద్రపేర్మి
నీలపొందు చదవివెన్నెల పోలికాయెఁగా
కాయగాఁదోఁచె నర్కసుతమమత

తే. గీ. వన్నెగల గొల్లకన్నెల చిన్నెలన్ని
యెన్నికకు రాక మునుమున్న వన్నెదఱిఁగె
చిన్ని చిన్నారి చిన్నెలు వెన్నుదన్న
లక్షణామయుఁడయ్యెఁ బద్మేక్షణుండు. 4

సీ. సందియంబందె భీష్మకరాజనందన
సత్యభామ కొకింత శంకవొడమె
రాధకు మునుపోలె రసమెసంగకపోయె
భద్రికు నీరసభావ మొదవె
కళలుజారుట తప్పెఁ గాళింది కెంతయు
ననుమానము సుదంత కినుమడించె
జాంబవతికిఁ బూర్వసారస్య మెరుసాయె
నీలకు మునుపటిబాళి తఱిఁగె
తే. గీ. లక్షణాధీసుఁడైన పద్మాక్షుపొందు
సుందరులకందఱకుఁ గ్రొత్తసందియమాయెఁ;
గాంతులమనమ్ము లన్యసంగతముతైనఁ
దెలివిగల ప్రౌఢచెలులదుఁ దెలియఁబడవె ? 5

చ. తపకుఁ బరస్పరమ్ముగల తామసముల్ విడనాడి యందఱుఁ
గుమిగొని కృష్ణుచర్యలను గొంతవడిన్ దలపోసి యంత న
క్కమలదళాక్షి చిత్తమధికమ్ముగ లక్షణయందుఁ జిక్కుటల్
క్రమముగఁ గింపదంతిగఁ దగన్ దెలియంగఁ దలోదరీమణుల్. 6

క. "మన మనుభవింపఁగా మిగి
లిన సౌఖ్యం బనుభవించులే" యంచు నొక
ర్తను; "దానికేమి యదియుసు
మనవంటిదె పో" మ్మటంచు మఱియొకతె యనున్. 7

ఉ. "చాలపటంచు నింక నొక సారసగంధిని గూడనెంచెనో!
యాలలితాంగి యంపమున కందఱ కెక్కుడటంచుఁ దోఁచెనో!

స్త్రీలు పదాఱువేలుగల చెల్వునకేమని యాసచేసెనో
యాలలనాశిరోమణి, బళా! కలరే; మనవంటి వెఱ్ఱులున్! 8

క. తరుణి కొక పురుషునందుం
దిరముగ మదినిల్చుఁగాని తెఱపలయందున్
దఱచుగఁ బురుషుల కొకచో
గుఱినిల్చుట కాన మేమొకో? తరళాక్షీ. 9

క. మనచంద మెచ్చటను మే
దినిఁ గనవినరాదు వింతతెరువిది లోక
మ్మునఁ బురుషులిట్టివారలు
వినఁబడిరె? పురాణములను వేదములందున్. 10

చ. ఇతరమృగాక్షులందుఁ గలనేని మదింజొరనీక సంతతం
బతివమొకర్తుగా నియమమందెడి సుందరులైన పూరుషుల్
వెతకిన నెందునేనిఁ బృథివింగలరేమొకొ యంచు సంశయా
హతమగు నామనం, బటులనబ్బిన గుబ్బెతపుణ్య మన్యమే." 11

క. అని పలువిధములఁ గృష్ణుని
వనజాననలెల్ల వారివారిమదిఁకిఁ దోఁ
చినభంగి నాడికొని; రం
గన లన్యస్వాంతుఁ గాంతుఁ గని యోరుతురే. 12

సీ. చిలుకపోయినతోవ పలుమాఱుఁ దిలకించుఁ
దిలకించి నిట్టూర్పు వెలికివిడుచు,
విడిచి యుంచుక సేపు తడబాటు మదిఁదాల్చుఁ
దాల్చి కందమ్ము లంతలుగఁజేయుఁ,
జేసి లోలోన విశ్వాసమ్ముసంధించు
సంధించి యచ్చోన చందమెంచు,
నెంచి ముచ్చటలాడ నించుకగమకించు
గమకించి తనలోనఁ గళవళించుఁ,

తే. గీ. గళవళించి యపత్రపగాంచి మించు;
మించి యోజించు; యోజించి మేలుగాంచుఁ
గాంచి చింతించు; చింతించి కంతునెంచు;
నెంచి "దయయుంచు" మని పలవించు శౌరి. 13

సీ. తా బృహత్సేనుఁడై తనరువాఁడయ్యు బృ
హత్సేనసుతకునై యాసచేయుఁ,
దా బహులక్షణాధారుఁడయ్యును నొక్క
లక్షణాతరుణీవిలాసమెంచుఁ,
దా బయోధరపయోధరహారియయ్యు న
త్తలునీపయోధరమ్ములకుఁ దలఁకుఁ,
దా దావఘోరాగ్నిఁ ద్రాపువాఁడయ్యు న
య్యంగనావిరహాగ్నికటపటించుఁ,
తే. గీ. దా ననంగునిఁ గన్నట్టి తండ్రియయ్యు
నయ్యనంగుని శిక్షింప నదరుగాంచుఁ
దా జగన్మోహనుండయ్యుఁ దద్గతైక
మోహినీ మోహవార్నిధి మునిఁగి తేలు. 14

క. ఈగతిఁ గృష్ణుండెంతయు
వేఁగుచు నుద్యానమునకు వెడలి యచట నా
నాగమవీక్షాకలనో
ద్యోగమ్మునఁ బ్రొద్దుపుచ్చుచుండెఁ దనంతన్. 15

ఉ. అంతట నేగుదెంచిరి స్వయంవరలేఖలు గొంచుఁ జారు ల
క్ష్మంతునిఁ గన్నతండ్రి కెనకమ్మున విన్నపమాచరింపఁ, గం
సాంతకుఁ డాదరమ్మున స్వయంవర లేఖ పఠించి లోన నా
క్కంత దిటమ్ముపూని చనియెన్ దనమేడకు నిశ్చితాత్ముఁడై. 16
తే. గీ. లక్షణాచంద్రముఖియు విలక్షణార్తి
నలసిసొలసి "స్వయంవరమగుట యెట్లు,

కృష్ణసందర్శనంబగు పెష్పు, నా మ
నోవ్యథలు తీఱుచెప్పు" డనుచుఁ గడంగి. 17

ఉ. ద్వారకయున్న దిక్కునకుఁ దద్దయు దృష్టినిగుడ్చుచున్ సఖీ
వారము తత్పురీపథమువంకకు నంపుచు మాటిమాటికిన్
మారుని దూఱుచున్ మలయమందసమీరకుమారుఁ గేరుచున్
వారిజనాభునిన్ హృదయవారిజమందుఁ బసందు చేయుచున్. 18

తే. గీ. అవధిదినములు పలుమారు నరసికొనుచు
గణనచేయుచుఁ గాలదైర్ఘ్యమ్మునకు స
సూయచెందుచుఁ గుందుచు నాయశోది
కాతనయుఁగూర్చి కాలమ్ము గడపునంత. 19

ఉ. వచ్చిరి రాజపుత్రు లనివారణవారణులై తురంగరం
గచ్చతురంగులై జయదఖండరథోద్ధతులై నిరస్తవి
ద్యుచ్చలనాసిధాసురకరోద్ధురసారసనాదిసాదిధా
స్వచ్ఛతురంతయానవిలసత్పరివారజనానుయాతులై. 20

ఉ. అంగజతేజుఁ డుజ్జ్వలితహారకిరీటమణీవిభూషణా
భంగురకాయుఁ డాయతకృపారసబంధురమానసుండు వ
చ్చెం గమలాక్షుఁ డుత్సుకత చెన్నలరార రథాధిరూఢుఁడై
మంగళసంగతంబయిన మద్రధరాధిపురాజధానికిన్. 21

ఉ. నెచ్చెలు లేగియంత ధరణీవరపుత్రికఁగాంచి "వచ్చె వి
ప్వచ్చుని బావ" యంచుఁ దెలుపన్ వలపంకురమంది యంతలో
హెచ్చి మనోవికారము లనేకములన్ సృజియించె నేమనన్
వచ్చును, బచ్చవింటిదొరవై ఖరు లాఁగఁగ నేరిశక్యమౌ! 22

చ. ఒకతె వచించు నావెనుక నొక్కతె చెప్పు ననంతరంబు వే
తొకతెయు మీఁద నొక్కతయు నొక్కతె చెప్పినమాట వేతొక
ర్తుక మదినెంచ కిట్లుపలురూపులఁ జెప్పిరి మద్రరాజక
న్యకకు మురారిరాక, శుభమౌనెడ వార్తల పౌనరుక్త్యముల్. 23

సీ. హరివచ్చెనని చెప్పె ననుఁగు నెచ్చెలియొకర్తు
సరసిజాక్షుండనె సకియయొకతె
పద్మనాభుండనెఁ బడఁతిమిన్న యొకర్తు
వనమాలియనెఁ జంద్రవదనయొకతె
బర్హభూషణుఁడనెఁ బద్మనేత్ర యొకర్తు
చక్రహస్తుండనెఁ జానయొకతె
వేణుభాసురుఁడనె వెలఁది యింకొక్కర్తు
కౌస్తుభాన్వితుఁడనెఁ గాంతయొకతె
తే. గీ. కలికియొక్కతె శ్రీవత్సకలితుఁ డనియె
నతివయొక్కతె పీతాంబరాఢ్యుఁ డనియె
యదుకుమారకుఁ డనె నొక్కయంచయాన
కృష్ణుఁ డనిచెప్పె వేఱొక్కకీరవాణి. 24

తే. గీ. ఎచటఁజూచిన రాజన్యు లెచట దృష్టి
నించినను గుఱ్ఱముల్ గజానీకములును
నెచటఁ గనుఁగొన్న రథము లిట్లెల్లయెడల
దంతురంబయ్యె మద్రపురాంతరంబు. 25

క. అంత బృహత్సేనధరా
కాంతుం డెల్లరకుఁ దగినగౌరవములతో
నెంతయు సన్మానించి య
నంతరమున మత్స్యయంత్ర మాసాదించెన్. 26

ఉ. పిమ్మట రాజులెల్లఁ బృథివీపతి పిల్వఁగఁబంపమత్స్యయం
త్రమ్ము సమీపమందుఁ గల రచ్చనెలర్చెడి చంద్రకాంత పీ
ఠమ్ములఁ దారతమ్యము గడల్కొన నూల్కొని రంబుజాక్షుఁడున్
సమ్మతినెక్కె నొక్కవిలసన్మణిపీఠ మవార్యచర్యుఁడై. 27

ఉ. చూచెడివారు, యంత్రమిది చోద్యమటంచుఁ దలంచువారు, "నా
రాచపువిద్దెకుం దగినరచ్చ యిదే" యనువారు, "వారిలోఁ

జూచుచు దీనిఁగొట్టవలెఁ జూచినఁ గా" దనువారు, "వహ్వారే
రాచకౌమార్త నేలఁగల రాజెవఁడో" యనువారు భూపతుల్. 28

మ. వయసొక్కింత యతీతమౌ నృపతులన్ వాలాయ మీక్షించి లే
వయసుల్ రాజకుమారు లందఱును నవ్వన్ జొచ్చి రాశ్చర్యమౌ
వయసుల్ దప్పినమీఁదఁ గన్నియలపై వాంఛల్ పిసాళించువా
రి యయోగ్యస్థితు లేరికేనియును బూరించున్ రసాభాసముల్. 29

ఉ. నందకుమారు రాకకతనం దెలివొందిన మోముతోఁ గన
త్సుందరమందహాసకలతోఁ దులఁదూఁగుచు గండపాళి నిం
పుందళుకొత్తు నున్ విరహపుం దెలిచాయలతోడ లక్షణా
చందసగంధి వచ్చె సరసంపుగతిన్ మితభాషితస్థితిన్. 30

ఉ. గాదిలి రాచకన్నియ నెగాదిగఁ జూచుచు రాకుమారు "లీ
మాదిరి సుందరీమణి విమానచరప్రమదాళులందుఁ గా
కోదరరాజసంభవతలోదరులందును లే" దటంచు నా
మోదము సందియమ్మును బ్రమోదమునుం గని రందఱుందగన్. 31

ఉ. అంత నృపాలకుం డొకఁడు హస్తమునన్ ధనువున్ ధరించి య
త్యంతము నేర్పుగల్గినటు లాకసమందలి మత్స్యయంత్రి మొ
క్కింతగ నీటఁజూచి శరమేసెను బారెడు హెచ్చు తగ్గుగా
"నెంతటి వింటి విద్య" యని యెల్లనృపుల్ దనుఁజూచి నవ్వఁగన్. 32

ఉ. ఇంచుక దుస్సిపోవ నొకఁడేసె; మఱొక్కఁడు లక్ష్యమెద్దియో
యెంచక బాణముం జెఱిచె; నేమనవచ్చు! నొకండు లక్షణా
చంచలనేత్రిపై మనము జాఱినవాఁడగుటన్ మఱొక్కచో
నించె శరంబు, నందఱును నివ్వెఱఁగంది తనుం గనుంగొనన్. 33

శా. అంతన్ గంతునిఁగన్న తండ్రి సురకాంతానందసంధాయియై
ప్రాంతస్థావనిపాలకుల్ శిరములన్వంపన్ సళంపాంబుద
భ్రాంతిం దెల్పుచు బంగరుంబటము పైపై జాఱ సందీపితా
శాంతుండై యపలీలమైఁ దునిమె మత్స్యాకారమున్ యంత్రమున్. 34

ఉ. త్రుంచినయంతమాత్రమున దుందుభు లాకసమందు మ్రోసె వా
యించి రనేకవాద్యముల నిచ్చట నచ్చట నచ్చరల్ ప్రశం
సించిరి లక్షణాసతియుఁ జెచ్చెరవచ్చి మధూకమాల నుం
కించి తగిల్చె సిగ్గిలుచుఁ గృష్ణునికంఠమునందుఁ బొందుగన్. 35

వ. ఇట్లు లక్షణ కృష్ణువరించుటయు నచ్చటి రాజులందఱును
ఉ. గొల్లఁడు రాచకన్నెను దగుల్కొనిపోవఁగ రాజులార! మీ
యుల్లములందు సిగ్గుపడ కూరక పోయెదరేల? రండు భీ
తిల్లుట రాచపాడియె? మదించిన వీనిమదం బడంచి యీ
పల్లవపాణికిం దగినవానికిఁ బెండ్లియొనర్తమం చొగిన్. 37

చ. తవతవమీఱఁ గొందఱు కటారులుదీసిరి; కొంతమంది క
స్గసనెఱసంజచాయ లొలుకన్ ధనువుల్ శరముల్ ధరించి "త
క్కువగనలేక గొల్లనికిఁ గూఁతు నొసంగుదురయ్య! యేటిరా
జ" వనుచు మద్రభూపతిని సారెకు దూఱఁగడంగి రంతయున్. 38

వ. ఇట్లు రాజులందఱును నొక్కపెట్టి హరిపైఁ గవయుటయు

సీ. బవరమ్ము వచ్చె దైవమ! యంచు లక్షణా
సారసాక్షికి గుండెజల్లుమనఁగ
రాజవైరంబు సంప్రాప్తించెనని మద్ర
ధరణీశునకుఁ గాళ్లతడఁబడంగ
మీనయంత్రము ద్రుంపలేనిరాజుల కేటి
పౌరుషంబని పౌరవరులు దూఱ
నీరాజమణు లెంతయీసుమానిసు లంచుఁ
జదల గీర్వాణు లాశ్చర్యమంద
తే. గీ. పట్టుపుట్టంబు నడుమున బిట్టుచుట్టి
హరిణతతిమీఁద దుముకు సింహంబుపగిదిఁ
జక్రి యొకకేల ధరియించి సరసిజాక్షిఁ
దవనిపాలురపై నిర్భయముగ నుఱికె. 40

వ. ఇట్లుఱికి సంవర్తసమయ ధారాధరమ్ము వఱువున శరాసారమ్ములంబ
ఱపి చీకాకు గావించిన

ఉ. ఆనృప వీరులందఱు స్వయంవరశైఖరు లెంచికొంచు లో
లోనఁ జలమ్ము లజ్జయును లోలతయున్ దలవంపునింప ము
న్నానినమార్గముంగొని త్వరోద్ధురులై చనిఁ; రంత నాబృహ
త్సేనుఁడు గృష్ణుఁ దోడికొని సేనలు గొల్వఁగ నేగెఁ గోటకున్. 42

తే. గీ. అంతలక్షణకును జలజాక్షునకును
మంగళస్నాన మొనరించి రంగనాజ
నములు మంగళవాద్యముల్ గొమరుమిగుల
వేదఘోషమ్ము లందంద విస్తరిల్ల. 43

మ. తలయంటెన్ జలజాక్షియొక్కతె లలన్తైలమ్ము కంసారికిన్
నలుఁగుంబెట్టె మఱొక్కలేమ హరికి న్నాణెంపుఁ గాలాగురున్
జలకంబార్చె నిఁకొక్కచాన హిమవాస్సారమ్మునన్ జక్రికిన్
జెలి వేఱొక్కతె నున్ గురుల్ దగ విదిర్చెన్ గోరులన్ దువ్వుచున్.

తే. గీ. మురిపెములనొప్పు నవ్వధూవరుల నుచిత
భూషణాంబరముల నింపువుట్టఁ దగ న
లంకరించి యథోచితలక్షణముల
వేదిఁ గైసేయఁజేసిరి పేరటాండ్రు. 45

క. శ్రుతిహితముగ నతులితముగ
ధృతకుతుక స్వాంతులగుచు ద్విజులు శుభసమ
న్వితగతిఁ బెండ్లియొనర్చిరి
సతీపతులకిర్వురకు నెసక మెసఁగంగన్. 46

శా. కట్టెన్ గేలు సెమర్ప మానసము పొంగన్ గోర్కులాకాశమున్
ముట్టన్ మంగళసూత్రి మంగజకళాపూర్ణుండు గృష్ణుండు మేల్
రెట్టింపన్ దగు లక్షణాగళమునన్ లీలామహావాద్యముల్
ఘట్టింపన్ దదుదారదివ్యతరసౌందర్యమ్ము వీక్షించుచున్. 47

తే. గీ. అంత లక్షణఁ దోడ్కొని యనుఁగుఁజెలులు
కేళికాగారతోరణపాళిదరికి
హేళిఁ జెన్నార నొక్కొక్కయడుగువరుస
నరిగి లక్షణ కనిరి హాస్యంపుగతుల. 55

ఉ. "ఎన్నఁడుగాని కన్నియల హేలలెఱుంగని వన్నెలాఁడు మా
వెన్నుఁడు వెట్టిగొల్ల, పృథివీపతిపుత్రిక వీవు వన్నెలుఁ
జిన్నెలు నేర్చుదాన, వెటుచెల్లునొ మీకుఁ బరస్పరం" బటం
చు న్నళినాక్షి నెంచె నొకసుందరి కృష్ణునెఱుంగ నట్లుగన్. 56

క. "పలుసుదతుల చేతులలో
మెలఁగినవాఁ డతని నెట్లు మెప్పించెదొ? యో
కలికీ" యని వేఱొక చెలి
పలికెన్ గలమాట తెలుపుభంగి పొసంగన్. 57

క. "పలుపలుకు లేల, రాధా
లలనయనన్ మదనశాస్త్రలక్షణవతి యా
వెలఁదుకకు దాసుఁడై కడు
నలిఁగినవాఁ డతఁడు మెచ్చునారులు గలరేఁ" 58

క. అని పలువిధములఁ జెలు ల
వ్వనజానన గేలిసేయ వనజముఖి యొక
ర్తను "నతఁడు నేర్చికొనె మన
వనితయు నేర్చికొను నతనివలనఁ దనంతన్." 59

తే. గీ. "నేర్చికొననేల? వన్నెచిన్నె లన వయసుఁ
బడుచులకు నెల్లరకును స్వాభావికమ్ము"
లనుచుఁ దమలోనఁదమ రాడుకొనుచు నొయ్య
నొయ్య శయ్యకుఁదార్చి రయ్యువిద నెలమి. 60

తే. గీ. సిగ్గునను మ్రొగ్గుచున్న యచ్చెలియ గృష్ణు
దరికి రాఁదీసి యొకపొత్రిడఁడనషఁ గలికి

పలుకులం దెంతయును నేర్పు దొలకరింప
నింపులు జనింప నతసితో నిట్టులనియె. 61

సీ. పర్వతమ్ములుగావు పడఁతివక్షోజమ్ము
లలరుగుత్తులుసుమీ యద్రిభరణ!
కాలసర్పముగాదు కలికికీలుజడయ
ళికులమాలసుమి కాళీయదమన!
కరికరమ్ములుగావు కలికినుందొడ లంటి
స్తంభముల్ సుమ్ము కంసకరిహరణ!
చక్రముల్ గావు మాజలజాక్షి పిఱుఁదులు
సైకతమ్ములు సుమీ చక్రిహస్త!
తే. గీ. మోవి సుమ్మిది పిల్లనగ్రోవి గాదు
రాతనయ సుమ్ము చల్లమ్ము వేత్రిత గాదు
తెలుపుమర్యాద గావునఁ దెలుపుచుంటి
మెఱుఁగవా? రుక్మిణీసతీహృదయలోల! 62

వ. వేతొాక కీరవాణి లక్షణకు మెల్లన నిట్లనియె.

సీ. నూటికొక్కటికైన మాటకుత్తరము నీ
వలెఁగాని యూరకోవలదు సుమ్మ
కెమ్మోవియానసుంకించిన నొయ్యనీ
వలెఁగాని డాఁచుకోవలదు సుమ్మ
పుక్కిటవిడెమీయఁబోయిన నందుకో
వలెఁగాని వెలిఁజేయవలదు సుమ్మ
కాఁగలించుకొనంగ గమకింప నెదురొత్త
వలెఁగాని వెనుదీయవలదు సుమ్మ
తే. గీ. చిత్తమున కనుగుణముగఁ జెలఁగవలయుఁ
గాని యొక్కెడనైన నొక్కత్రుటికన్నఁ
బెనఁగులాడఁగవలదుసు మ్మనుఁగుకాఁ డ
నంగ దైవమ్మసుమ్మ సన్నుత లతాంగి. 63

తే. గీ. ఇటులఁ దగుభంగులన్నియు నెఱుఁగఁజేసి
"యాతఁడున్నాఁడు, నీవుంటి వతివమిన్న !"
యని పయికిఁజెప్పి యొక్కొకపని నెపమునఁ
జనిరి చెలికత్తెలందఱా స్థలమువిడిచి. 64

శా. కేలంటెన్ బెరకేలువట్టె మెయి సోఁకించెన్ మెయిఱా గంధమున్
గీలించెన్ గుచసీమ మంజులగతిన్ గేలుంచె గండస్థలిన్
లాలించెన్ దగఁగౌఁగిలించె మధురాలాపమ్ములన్ దేల్చెఁ గే
ళీలోలుండయి మించె శౌరి కడుబాళిన్ లక్షణాభామతోన్. 65

మ. అకృతప్రీత్యయ మప్రియుక్తవచనం బప్రాపితాలింగనం
బకనద్బంధ మచుంబితాధర మసంప్రాప్తావకాశం బదృ
శ్యకటాక్షంబగు లక్షణానవరతం బానందముంగూర్చె శౌ
రికి, ముగ్ధారతసౌఖ్యసంపదలు వర్ణింపంగ రా వేరికిన్. 66

*సీ. ఎందఱీడ్చిన సెజ్జయిల్లు చేరనిబోటి
చేరి వాకిలి యోరఁజేయనేర్చె
నెంతవేఁడిన మొగంబెత్త నేరనిచాన
యెత్తిచిఱ్నగవు పల్లొత్తనేర్చె
నిందమంచును విడెమ్మీయ నేరనిలేమ
యిచ్చి వాతెఱ యాననీయనేర్చె
చెయివట్టిలాగిన సెజ్జయంటనిగోల
యంటి తోఁ బన్నుంట యదియునేర్చె
తే. గీ. ముట్టినంతన మ్రాన్పడు ముద్దరాలు
మ్రాన్పడక పీలొసఁగనేర్చె రతికొకింత
యౌర! యేరీతిమాఱెఁ జేతోంతరంబు
నాతికన్నెరికమ్మ రెండవదినమున. 67

తే. గీ. ఎఱిఁగియు నెఱుంగకుండెడి సురతసుఖము
నొసఁగియు నొసంగకుండెడి యోష్ఠరసము

* ఈసీసము, మిత్రమగు, ఆదిపూడి ప్రభాకర కవిచే రచింపఁబడినది.

పలికియును బలుకకయుండు పలుకు తళుకు
కన్నియలకూటముల నెన్నఁగాఁ దరంబె ? 68

క. ఈగతి నాగజగమనా
భోగమయుండగుచు మద్రిపురమునఁ గృష్ణుం
డాఁగె నొక కొంతకాలము
భోగం బెఱుఁగంగనీదు పురుషార్థమ్మల్. 69

తే. గీ. ముగ్ధయై కొంతకాలంబు మురువుసూపె
మధ్యయై కొంతకాలంబు మది గరంచె
ప్రౌఢయై కొంతకాలమ్మ ప్రమదమొసఁగె
లక్షణాచంద్రముఖి సరోజేక్షణునకు. 70

ఉ. ఆ యదునందనుం డిటులు హాయిగ నాయలివేణిఁ గూడి ని
త్యాయితసౌఖ్యముల్ గొనెడి యాసమయమ్మననైన రాధికా
తోయజనేత్ర యాడిగల తొల్లిఁటి ప్రేతలచెల్మ లెంచు; నే
చాయల నేరికి న్మఱవ శక్యమె, తొల్లిఁటినాఁటి కూటముల్. 71

ఉ. శ్రీయవతారమై పొలుపుచెందెడి రుక్మిణియుండ సత్యభా
మాయతనేత్రి యుండఁ దగులాటపునెచ్చెలు లుండ రాధికా
తోయజనేత్రి సంగతులఁ దోయజలోచనుఁ డెంచి మించి యో
హో! యనిసొక్కు; నొక్కయెడ నొక్కనిమానస మట్లు చిక్కెడున్.

తే. గీ. ఇటుల జలజాక్షునకు "బొంది యిచటఁ, బ్రాణ
మచట" యనునట్టి సామెత యనువుపడఁగ
నంత నేతెంచెఁ దగ శరదాగమంబు
కలితకాదంబినీకాంతివలిత మగుచు. 73

సీ. తెలుపెక్కె మేఘముల్ బలుపెక్కె ఋక్షముల్
తళుకెక్కెఁ దారావితానములకుఁ
బొలుపొందెఁ జంద్రుండు తెలివొందె దిక్కులు
కాశసూనములు ప్రకాశమందెఁ

ష్ఠించిన దంతావళసార్వభౌముండును, దానికి నలుపక్కల ననేకగజం
బులును, ఆవెనుక సౌశీల్యంబును దయాళుత్వంబును బత్యాజ్ఞాపరిపోష
ణంబును భగవదాయత్తచిత్తత్వంబును దాక్షిణ్యంబును నౌచిత్యంబును
మహౌదార్యంబును మొదలుగాఁగల సుగుణమ్ములకుసంతసించి సరస్వతి
యప్పనంబుగానంపిన హంసలునాఁదగు ధవళ చ్ఛత్రచామరంబుల విభూ
షితశిరఃపార్శ్వభాగంబును పరివారకతాందోళికాసంఘ పరివృతమ్మును
నగు నాందోళిక నారోహించిన భూపాలాంబయగు లక్ష్మ్యంబయును,
నావెనుక, నాంధ్రకవితాగంగాతరంగం బనఁదగు తుంగంబగు తురంగం
బధిష్ఠించి వాజిధీరుండును నవాజిధీరుండును ప్రవిమలకాయుండును నగు
తిరుమల రాయండును, నాతనివెనుక సమారూఢగంధర్వుండగు వేంకట
రాయుండును, నావెనుక నాకాశపదము నాక్రమించుపగిదిఁ దారకల
రాల్చుపోలిక నంబోధింబానం బొనర్చుభంగి రిపుచ్ఛలఘూసంబుల నమలు
వడువునఁ బర్వతంబులం జూర్ణంబొనర్చు విధమ్మున దిగ్గజమ్ములం
జలింపఁజేయుచందమున హేషారవమ్ములు సలుపుచుఁ బదాగ్రమ్ము
లెత్తుచు సాదికరాంచలపగ్రహమ్ముల నాకర్షించుచు నాస్ఫాలితస్కంధ
భాగులును వామకరతలాకృష్టఖలీనరశ్మలును దృఢతరగృహీతపల్యాణ
ముఖులును వంకాంతనిరహితవామచరణులును నగు సాదిపతులు కశా
చలనమాత్రమున నడిపింప నడుచుచున్న యుద్ధరంగాఖేటకమ్ములగు
ఘోటకమ్ములును మహాసేనాజనితపారావారభ్రమావతీర్ణసగర్జనపర్జన్యా
శంకావహచతురరిపులర్జనస్ఫూర్జ దూర్జ స్వలఘూర్ణమానచక్రనేమినము
దీర్ణవిశృంఖలక్రేంకారసకలవీరజనహృదయానందమ్ములగు స్యందనమ్ము
లును మదబంధురసింధురోపరివిశృంఖల తాడ్యమానభేరీభాంకారరవ
మ్ములు దశదిక్తటమ్ము లద్రువఁజేయ మందమందమ్ముగా సవారణం
బగు నగరీతోరణంబునుండి బయలు వెడలుటయు. 45

శా. ఉచ్చండమ్ములు హిండమానము లతిప్రోద్దండనాగేంద్రశుం
డోచ్చైర్ఘాతవిభీతముల్ వియదభిప్రోల్లంఘనాఢ్యమ్ము లు

ద్యచ్ఛంచద్విహగేంద్రచిత్రగతు లత్యంతత్వరావిష్టముల్
తచ్చార్వశ్వము లాక్రమించె ధరణిన్ దండోపతండమ్ముగన్. 46

శా. ఉత్క్షిప్తాయుధధాళధళ్యకలనాత్యుద్దీపితాశాంతరుల్
దక్షుల్ రూక్షులునైన సాదిపతు లుద్యన్నాళకారావసం
ధుక్షీభూతవిచిత్రలాస్యకలితానూనాపసర్పక్రియా
విక్షేపాశ్వములన్ ఖలీనఖలనాప్తిం బట్టి రొక్కుమ్మడిన్. 47

శా. భేరీరావముచేతఁ గొన్నిహరు లుద్భీతమ్ములై యుత్క్షిప
ద్ధారాశాగ్రపదాంచితమ్ములయి స్తబ్ధశ్రోత్రయుగ్మమ్ములై
రారాజద్విషమత్థురమ్ములయి యారబ్ధాపసర్పమ్ములై
యారూఢాచరితేరణమ్ములయి నేత్రానందరీతిం దగెన్. 48

చ. కటుతరచండభానుకరకాండమహాపరితాపమున్ సహిం
చుటది మదీయనాథునకుఁ జొప్పడదంచుఁ దలంచి లోన న
క్కటికముఁబూని భూమి దివిఁగట్టిన చాందినినాఁగ ఘోటక
స్ఫుటఖురఘట్టనోద్ధమగు భూరిపరాగభరంబు వెల్వడెన్. 49

క. తురగవరఖరఖురాహతిఁ
బరాగ మంబరమునందుఁ బరఁగె న్వరము
క్కరసోమభూపతనయుని
వరూధిని ధరించు నాతపత్రంబనఁగన్. 50

క. నిజనాథాధికవిభవ
ప్రజాధినాథావలోకపరిమిళితమరు
ద్వ్రజసంతోషవిషాద
ప్రజసనశౌండమయి దివి పరాగ మెసంగెన్. 51

చ. లలి నదె నీలకాహళములన్ ధరియించె గజచ్ఛటల్ కర
చ్ఛలమున వ్యత్యయంబుగ నెసంగుట కేమినిమిత్తమో ! ప్రమ
త్తులకు వివేకముల్ మదినిఁదోఁచునె, దానన యారవంబు కా
హళరవభిన్నమై యెసఁగె నంచుఁ దలంచిరి కొంద ఱెంతయున్. 52

చ. ఖురపరితాడితంబయిన కుంభిని వే బతిమాలునిచ్చలన్
గరమును సాదిపాదచలనంబుల నేగుచుఁ గౌఁగిలింతలన్
బొరసినరీతి నెంతయును భుగ్ననిజావయవమ్ములై జవో
ద్ధురగతిఁ గొన్నిగుఱ్ఱములు తుందుడుకొప్పఁ జరించె నయ్యెడన్. 53

చ. హరియిటనుండువాఁడఁట మహాత్ముఁడుగాఁడె యితం డటంచు భూ
ధరములు స్తోత్రపాఠములు తద్దయు సల్పుచు సేవఁజేయ స
క్కరుమతిసన్నిధానమునకుం జనుదెంచెనొనాఁగ నేగె ను
చ్చరథము లుచ్చలత్ప్రబలచక్రవిరావభరంబులై తగన్. 54

చ. తగుగతి సాదివర్గము లదల్పఁగఁ బొల్పగుమండలప్రచా
రగతు లొనర్చువేళ నిరుప్రక్కల నచ్ఛములై నపుచ్ఛముల్
నెగడఁగఁ గాశసూనచయనిర్మలచామరవీజనంబొన
ర్చుగతిఁ దనర్చె నెంతయును సొంపు జనింపఁగఁ గొన్నిగుఱ్ఱముల్. 55

మ. తతమాద్యద్ఘనగంధసింధురచలత్పాదాతపాదాహతి
క్షతభూజాతపరాగసంకలితదిక్కంబై ప్రహేషావిఘూ
ర్ణితశత్రుక్షితిపాలసైన్యపరితోన్నృత్యత్తురంగాళిసం
గతమై సైన్యమెసంగె రంగుగను రంగన్మంగళోపేతమై. 56

మ. బలమాతంగపదాభిఘాతమున సంప్రాప్తించుకాలుష్య మి
మ్ముల మందాకినిలో మునింగి శుచియై పోనాడసుంకించి యు
ల్లలదుచ్చధ్వజవాయువుల్ తనకు నాలంబంబుగాఁగన్ వియ
త్తలముంజేరెడి భూమినాఁజెలఁగెఁ దత్తత్సైన్యధూళిచ్ఛటల్. 57

చ. ఉరుగతి శ్రీనివాసునిమహోత్సవమున్ దిలకింపవచ్చి వి
స్ఫురితపరాగపుంజపరిపూరితమైన నభమ్మునందు సం
చరణమొనర్చుచున్న దివిషచ్ఛయమున్ దనియించెఁ దద్ధ్వజో
త్కరము నిజోద్భవత్పవనఖండితభూరిపరాగజాలమై. 58

సీ. తాళారవమ్ము లుద్ధతి మీఱు తురగఖు
                రధ్వానమున విమిశ్రమ్ములయ్యెఁ

గాహాళీధ్వానముల్ ఘననాగరాజఘీం
కృతుల నెంతయును నేకీభవించె
శంఖసంఘధ్వానరింఖణం బశ్వహే
షావిశేషములతో సంగమించె
గజకంఠనిర్యదుత్కటరావముల్ భేరి
కారవమ్ములతోడఁ గలిసికొనియె
తే. గీ. ఇన్నియునుగూడి యేకమైయేపుమీఱి
యఖిలదిక్ప్రాంతముల నొప్పునట్టి పర్వ
తగుహలందున వ్యాపించి తత్ప్రతిస్వ
నములతోఁగూడి కోలాహలముగ నెసఁగె. 59

మ. ఘననిస్సాణ రవంబులెల్ల రథచక్రధ్వానమం దైక్యముం
గనుఁడుం దక్షిణమందు సేనయది రంగద్రింగభూమీసమం
బన నొప్పారెను మీఁద నెంతయును వేగాయత్తమై తత్క్షణం
బున రత్యంతవికీర్ణరూపయగు పూపుంబోడిఁబోలెం దగన్. 60

మ. మనుజుల్ కుంచితలోచనంబయిన తన్మత్తేభవిక్రీడితం
బును జిత్రంబగు నత్తురంగగతియున్ మోదమ్మునం గాంచి మీఁ
దను నున్నమ్రికశాఢ్యమౌ కరభముఖ్ దౌదౌవ్వల న్నవ్వి, రెం
డును సౌందర్యముగల్గువారికడ నన్యు ల్మాన్యతంగాంతురే. 61

మ. నను సర్వంసహయంచు స్తోత్రముల నానందింపఁగాఁజేసి తా
డనముంజేసెద రీజనుల్, క్షమయె కట్టా యింతకుం దెచ్చె, నా
కును నీస్తోత్రముచేత నేమి యనుచుం గోపించి భూదేవి త
జ్జనసంఘమ్ములమీఁదికెక్కె నసఁగా సైన్యాగ్రధూళుల్ దగెన్. 62

చ. ఇది నృపుసేన వేగముగనేగెడు దీనిపథమ్ములోపలం
బొదలకుఁడీ మనుష్యులని ముందుగ సూచనఁజేయుభంగి నొ
ప్పిదముగ నుజ్జ్వలప్రమదవేల్లితమౌగజరాజుపై ధ్వజం
బొదవెను మాటిమాటి కనిలోద్ధతికంపితమై యెసంగుచున్. 63

చ. పటుతరకోణతాండవముపైనెసఁగంగ నఖండరీతి సు
త్కటకరటీంద్రసంగసముదంచితదుందుభినిస్వనంబు ప్రా
కటముగఁబర్వ 'నాశిశువుఁ గాంచితె ? నాశిశుఁ గాంచితే' యటం
చటమటఁజెంది తల్లులు మహోత్సులతన్ వెదుకంగడంగిరో. 64

తే. గీ. గజరథతురంగములు నలుఁగడలఁదనర
నొప్పునాసేన రథ్యయందొగిఁ బ్రవేశ
కలనఁ దనరారె వియదాపగాఝరంబు
కుల్యయందుఁ బ్రవేశించుకొమరుదోఁప. 65

తే. గీ. రమణ గోమయగోముఖరంగవల్లి
గైరికద్రవరేఖలఁ గ్రాలువీథి
దనరె హరిదంశుకంబు ముక్తాసరములు
శోణమణిసరములుగల సుదతిమాడ్కి. 66

క. భుజనాళాంచలవిలస
న్నిజకరపంకజవిగళితనిబిడబిసలతా
వ్రజమోయన నటకాంతా
వ్రజకల్పితదివ్యరంగవల్లిక లొప్పెన్. 67

ఉ. బాలరో చూడుమా నృపుని బల్రయమొప్పఁగ రమ్మ నెచ్చెలీ
తాళుమొకింత పల్కవుగదా సుదతీ యిదె వత్తునంచు నీ
లీల విశృంఖలమ్ముగ లలిం దమలోఁ దమరాడుకొంచు న
క్కాలమునం జెలుల్ నృపునిఁ గన్గొన మేడలనెక్కి రందఱున్. 68

సీ. తనచెలికత్తె హస్తము కేలఁగీలించి
నిలిచి భూపతిఁజూచె నెలతయొకతె
తనమొగంబు మఱొక్క తన్విమూఁపున మోపి
నరపాలు నీక్షించె నాతియొకతె
చాలమేలగునట్టి జాలాంతరమునుండి
విభుని నాలోకించె వెలఁదియొకతె

అదియేమి యని సారెనడుగుచు నబ్బురం
బుగ రాజుఁ దిలకించె బోటియొకతె
తే. గీ. శ్రీమహితుఁడై నభూపాలశేఖరుం డె
చట నెచట నెచ్చ మెచ్చ మెచ్చటయటంచుఁ
గుతుకమొప్పార వేఱొక్కయతివఁజూచి
పలుకుచు నృపాలుఁగనె నొక్కపడఁతిమిన్న. 69

చ. 'కనుఁగొనుమీ నృపాలకునిఁ గన్గొనుమీ నృపుమీఁదనేమి గ
న్గొనెదవు రమ్మ ముందఱ కనుంగుఁ జెలీ మగవారు లేరు ల
జ్జనుగొననేల భ_ర్తృభయసంగతు లిష్టమె! య_త్త లోన ని
న్ననుకొని యేమిసేయు' ననె నంగనయొక్కతె క్రొ_త్తకోఁడలిన్. 70

చ. కనుఁగొన నాకునుండెఁ గుతుకమ్మధికమ్ముగ న_త్తగారి తి
ట్లను బడలేక నెమ్మది తడంబడుచున్నది బాల్యమందుఁ దా
మును మనరీతి నిట్లనె సముత్సుకతన్ గనలేదొ, కోడలం
చనినను మచ్చరంబిటుల న_త్తల కుండుట కేమిహేతువో. 71

మ. ఇది యెల్లప్పుడునుండుఁ జూడు మిటులేలే బాల నీనెమ్మదిన్
ముదమొప్పారను మోమువాడె నదియేమోయంచు నూహింతునా
విదితంబయ్యెఁగదే చెలీయనుచు దా వేమాఱు దత్పాలమం
దొదవున్ ముంగురులంటఁదోసెను మఱింకొక్క_ర్తు ప్రేమార్ద్రయై. 72

సీ. ఓమత్తురాల నాకొక్కింత చోటిమ్మ
చెలియరో యిచ్చోట నిలువరాదె
ముద్దియరో కొంతమోమె_త్తరాదఁ చే
కనుఁగొంటినేను గన్గొనుమునీవు
అచటరాజున్న నీవిచటఁజూచెదవేమి
యిటనీకుఁ జోటుండు నిట్లురమ్మ
ఓయమ్మ చోటు నాకీయవా యొక్కింత
నీకెంత కోపమే నీరజాక్షి

తే. గీ. మొగము మటమటలాడింపఁదగదు నీసు
మీపమున నుండ నిచటికి మేమువచ్చి
నారమే భారమేల యోనాతిమిన్న
చూతు మేమును నీవును జూడరాదె. 73

చ. ఉవిదరో! గుబ్బలన్ బయఁట నుంచఁగదే యివి నీక పుట్టెనే?
శివశివ యంబరంబు కటిచెంత నమర్చుము వీరలందఱున్
యువతులుగారె నీవలెనెయుండిరె? వామభుజంబు నెత్తఁబో
కు వివశురాల! వామకుచకుంభము బైటికి వచ్చు నచ్చుగన్. 74

ఉ. సారెకుముట్టబోకుమని సందడిఁజేసెడి నీవుసంఘముం
జేరఁగనేల నేమమునుజెందితివేని దిదృక్షయేలయం
చీరహినొక్క రొక్కొకరి నెంచుచుఁ బౌరసతుల్ విలాసముల్
మీఱ నృపాలకుం గనుచు మేలుగఁజూచిరి రాజపైన్యముల్. 75

ఉ. ముక్కఱ వాముకర్ణము, నముద్దులుగుల్కెడికాంచి కంఠమం
దొక్కలతాంగితాల్చి నృపునొప్పుగఁ జూచుచుఁ దన్నుఁజూచు బల్
చక్కనికోడెకాండ్రను వెసన్ గరఁగించెఁ; దమంత పోయుగం
బెక్కుడుగల్గువారు నగ లేగతిఁ దాల్చిన నేమితక్కువో? 76

ఉ. ఈతనిఁగన్నదే జనని, యాతఁడు బాలకుఁడయ్యు నిష్టు నా
చేతము దొంగిలించె నిఁకఁజెప్పఁగనున్నదె, జవ్వనమ్మునం
దీతనివంటి మంచిమగఁడే దొరకన్ వలె నాకటంచు వి
ఖ్యాతిగ వృద్ధలున్ దరుణకాంతలు నెంచిరి కన్నెమిన్నలున్. 77

తే. గీ. ఎవనిసామ్యముగనఁ దపమెనసి తార
మాకుమారుండెదిరియు రమాకుమారుఁ
డయ్యె నీరాజపుంగవుఁ డాతఁడెయని
యాదరమ్మున నొకకోమలాంగి జూచె. 78

తే. గీ. మేదతుదనున్న వెలఁదుకమిన్నబాహు
లతచిగురునుండి పేలముల్ రమణ నృపుశి

రమున జలజలఁబడియె దరదళితవిమ
లములయిన మల్లెమొగ్గలక్రమముదనర. 79

చ. క్షితిపతి గన్నకన్నులనె చెన్నుగ నన్యునిఁ జూడనోప నం
చతివ యొకర్తు పల్కె, నొకయంగన తా నిటుపల్కె 'సత్యమే
యతివరొ! రాజుమోముఁ గనినట్టియొయార మెసంగుకన్నులన్
మెతకమొగంబు గల్గుమగనిన్ గనినంతనె మొట్టబుద్ధియౌ'.

చ. స్మరుఁ డతిసుందరుండని ప్రజ ల్వచియింతు రతండ భూమిపైఁ
బరఁగినచో మనోహరత బైటఁబడున్ దదనంగభావమే
కరము యశమ్ముదెచ్చె, నటుగానియెడన్ మనభూమిపాలుముం
దఱ నతఁడేమిలెక్క యని తన్వి యొకర్తనె మన్మథార్తయై. 81

క. కవిమిత్రిసోమబాలక
భవదుచ్చక్షేత్రిమగుచుఁ బరఁగెడికన్యన్
గవిసియుఁ ద్వల్లగ్నాత్యం
తవిభవదుఁడ వగుమని యొకతన్వి వచించెన్. 82

క. ఏతత్సదృశవధూటీ
స్ఫీతకుచద్వయము కనకచిత్రితచోళం
బై తగెనని కనకపటస
మేతోన్నతకుంభములయి మెలఁగెఁ గలభముల్. 83

తే. గీ. సైంధవుండీతఁ డేమునుసైంధవులమ
యితనియూర్ధ్వస్థితికి సైతుమే యటంచు
నబ్బుఁ బడలాగుటకుఁబోలె సశ్వతతు లు
దగ్రచరణమ్ములగుచు నృత్యమ్ముసలిపె. 84

క. ఈరీతి యువతిరమ్యం
బై రాజిలు నాత్మపురము నరయుచు మోద
శ్రీరాజితుఁడగుచును సీ
తారామనృపాలకుండు దరలెఁ జావీథిన్. 85

తే. గీ. మఱియు నయ్యాత్మకూర్పురమహితరాజ
సౌధములయున్నతి వచింపశక్యమగునె ?
గగనచుంబినిజాగ్రజాగ్రన్మణిప్ర
కాండరుచిమండితార్యమమండలములు. 86

శా. ఆరాజావసథాగ్రభూముల గవాక్షాంతర్గతుండై న యా
నీరేజారిని గాంచి యామికులు బల్ నిద్రాలసత్వంబు చె
న్నారన్ ఘంటయటంచు దండమున నత్యంతంబు తాడింపఁ జే
కూరెఁ మండలమధ్యమం దలకిణాంకూరంబు తోరంబుగన్. 87

తే. గీ. ఆపురోపవనౌపమ్యమందఁ దపము
సల్పు నవనందవనమున్మనకుఁ దదాప్తి
యెంత తలక్రిందుఁబడినఁ దానెసఁగదాయె ;
వలవదునె కార్యసిద్ధి పరాశ్రితులకు ? 88

క. ఆపురినాత్మపురంబని
కాఁపుర మొనరించువారు గణియించుట యొ
ప్పే ! పరదేశీయులునుం
బాపురె యాత్మపురమనుట బహూచితమగున్. 89

మ. కొమరుంజుక్కలు తత్పురాంగనలతళ్కున్ దొంగిలన్ జాలమా
ర్గములన్ హర్మ్యగతంబులై నయెడ నిద్రంబోని భృత్యుల్ మహో
ద్యములై సంకెలలన్ దగుల్ప శశి తద్వక్త్రాప్తభీతిన్ వద
ల్పమిఁ దత్రత్యులచేతఁ దాల్పఁబడు లీలాతారహారాళిగన్. 90

వ. అట్టిపురవీథిన్ దరలి లోకేశుండగు శ్రీకేశవునకు నతియొనర్చి, శ్రీని
వాససేవార్థం బేగు నాకు వారుణీసమ్ముఖీనంబగు గమనం బనుచితం
బని తలంచియో యనఁ బశ్చిమదిశాగమనంబు మాని కుడికెలనికిం
దిరిగి వీథిని వదలి హరిదిశాగమనం బుచితం బని కొంతతడవు నడచి
సర్వోత్తరుండగు శ్రీనివాసునిసేవకై యుత్తరదిగాశ్రయణంబ మం
చిదియని యెఱింగినదియుంబోలె నుత్తరాభిముఖంబుగా నడచుచున్న

సేన మహోత్సవసేవాకుతుకంబున నుప్పొంగివచ్చిన కృష్ణాభిధానవాహి
నినా స్వాధిష్ఠిత కరిరాజపార్శ్వభాగమ్మునం దనరఁ, గనకరత్నమంట
పమ్మునం దధిష్ఠించియున్న సీతారామభూపాలుండు కుడిపైపున జలధి
పీతంబులగు తోయంబులు జలధియందు దశభాగమ్ములును ధరణి
యందు స్వల్పభాగంబును సుభిక్షకాలమ్మునసె వర్షించు నీపర్జన్యుండను
స్వార్జితదౌర్జన్యంబుఁ బోఁగొట్టుకొననుంకించి గగనతలంబు డిగివచ్చి
సముద్రభ్రాంతిచేఁ దనలోనంబడి యథేష్టంబుగ మధురజలమ్ము లాస్వా
దించి యచటఁ గొంచెము మాత్రమే వర్షించుచు నధికాంశమును సస్యా
భివృద్ధికై భూతలమ్మునం దొదవఁజేయు మేఘద్వయమోయననొప్పి.
హాలికులు పీనాహాగ్రభాసమానంబగు త్రికాచకమ్మునుండి డింప గృ
హీతజలమ్ములగుచు వృషభద్వితయస్కంధావనద్ధయుగమధ్యమ్మునం
గట్టఁబడిన రజ్జు వాకర్షించుచుండ వివరాంతరవినిర్గళత్సూక్ష్మతరజల
ధారాసారంబులగుచు యంత్రాధో మధ్యభాగవిరచితంబగు కుల్యాముఖ
మ్మునఁ దజ్జలమ్ములు చిమ్ముతఱి నటునిటుఁజెలఁగు జలశీకరమ్ములు
జీవనప్రదానమ్మున నారామమ్ము బ్రతికించుచుంటివే యని పుష్పాంజలు
లొసంగుపోలికం దెలుప, సఖండాదండవేదండతుండంబున్ బురణించు
చున్న మోటలచేఁ జెలువారు రాజవాపికను రాజసంబంధవాత్సల్యంబు
నఁబోలెఁ జూచుచు, నాగరికకుచంబులచే జయింపఁబడిన మనము
నగాగ్రమ్మునకుం బోవుదమని యెంచియుంబోలె నారంగనగశాఖల
నాశ్రయించి యంత నగమ్మును నక్కుచమ్ముల కోడినదియే యను
సాధ్వసమ్మునంబోలె ననిలకంపమానమ్ములై క్రిందికింబడుచున్నవియు,
నారామలక్ష్మిక్రీడాకనకతంతుసంతతిదంతురితకందుకంబులన్ బురణిం
చుచున్నవియు, నుపవనలక్ష్మి పరికల్పితరసభరితమంగళ తుంగభృం
గారనిచయమ్ముల ననుకరించుచున్నవియు, హరిద్రాపరిలిప్తకర్ణాటీ
వక్షోజమ్ముల నీసడించుచున్నవియు, నుద్యద్దినకరబింబ దాస్యదాన
శౌండములునగు పరిపక్వనారంగఫలమ్ములచేతను, మత్సనామిక
యగునొక్కతె యూర్ధ్వభాగమ్మున నెసంగుచుండ సిగ్గులేక దాని

కెదురుగా నెట్లుందుమను నసూయంగాని, యంశుమత్ఫలాభిఖ్యయు శుభచ్ఛాయయునగు నే నుండ ననుదినమ్ము నీయంశుమంతుం డుద యించినతోడనే సభ్రమరకమలినీసద్య స్త్సనకుట్మలంబులన్ గరముల మన్నించుచుండు నీతనిం జూడఁదగ దను క్రోధమ్మునంగాని వ్యావర్తి తవదనంబులును, రంభ వారవనితయాయెనను లోకాపవాదమ్మువలని యవమానమ్మునంబోలె నధోముఖంబులును గర్వదుర్విదగ్ధయు నుపరి విహరమాణయు నస్మదభిఖ్యయునగు గణికం జయించి వచ్చెద మమ్మా మమ్ము విడువుమని జననియగు భూమిని యాచించుటకు నవనమి తాంజలిపుటమ్ములై నవియుంబోలెనానమ్రఫలభరితశాఖాగ్రకుట్మలమ్ము లును, నైకటికనగరవిలసల్లలనాజననిజస్తైత్రోత్రియుగళస్మరణజనిత భయమ్మునన్బోలె మందానిలకంనమానదళకదంబమ్ములును నగు రంభాకదంబమ్ములచేతను, నస్మదుప్పాలు నాశ్రయించినవారి కుదగ్ర ఫలసిద్ధికాఁగలదని సూచించునవియుంబోలె నత్యున్నతశాఖాంచలప్రిఁ ర్శితబహుఫలమ్ములును, మౌక్తికహారగుచ్ఛపరివృత పద్మరాగకలశ ఘటితమూలమరకతతులాపీఠమనోహరమ్ములగు నారామలక్ష్మి దివ్య భవనవజ్రమయస్తంభమ్ములునాఁ దనరారునవియు, లంబమానప్రసూన గుచ్ఛపరికీర్ణ పరిపాకారుణఫలోర్ధ్వభాగామూలాగ్ర హరితతరపత్రశాఖ రమణీయ శిరోభాగమ్ములును, మారుతాందోళనావసరపరస్పరాభిఘట్టన విశీర్ణపరిపూర్ణఫల నివహనిరర్గళవినిర్గళత్ప్రుథుల రసధారాసారసంశయా వహమ్ములునగు నారికేళ ప్రకాండమ్ములచేతను నిబిడితమ్మును, నగ రంగస్థానంబయ్యు నాగరంగస్థానంబును, నముక్తకుసుమాభిరామంబ య్యు నతిముక్తకుసుమాభిరామంబునునగు నారామంబు విలోకించుచుఁ, గించిద్దూరంబతిక్రమించి యచ్చట భగవంతుండగు సుమాకాంతునకుఁ గృతనీరాజనపూర్వకమ్ముగా నమస్కరించి యచ్చోటు గదలి అశ్రాన్ఁ బగుకతనఁ బద్యకర్దమంబగుతటాకకచ్ఛపప్రాంతమార్గమ్మున నడచుచు న్నదియు,దృఢగృహీతఖలీనరజ్జువులును, గించిదవనమిత పూర్వకాయు లునగుసాదులచే సావధానప్రేరితంబులై ఘుర్ఘురశబ్దంబులుచెలంగఁడ

టాకసేతువు నారోహించు గుఱ్ఱమ్ములచేతను, నస్మదతిభారమ్ము నీసేతువు సైచునో లేదో యని యూహించినవియుంబోలె మందమందగమన మ్మున నారోహించు వారణమ్ములచేతను, నిబిడితంబునగు సేనచే నను గతుండగుచుఁ బార్శ్వభాగమ్మున నాసహధర్మిణియగు గంగానదిని సర్వజ్ఞుండయ్యు నీశివుండు పరకీయంగాఁ దలఁపక తన జటాజూట మ్మున నెట్లు ధరియించెనో యేనుబోయి యడుగువాఁడనని కోపమ్మున వచ్చి తత్పరమేశ్వరు దివ్యభవనంబు నరికట్టియున్న సముద్రుఁడో యనఁదగినదియు, సేతుకైతవమహావ్యాళపరిరంభణం బాచరించుకొఱ కతిచపలాయమానాంతరంగలై శిరోరత్నంబులతోఁ గూడ సహామహ మికతోఁ జనుదెంచు నాగకన్యకలు నాఁదగు ప్రతిబింబితాంబుజబంధు బింబంబులగు తరంగంబులఁ బరస్పరసంఘట్టనంబున నుత్కీర్యమాణ శీకరనికరంబగుకతన నాకును రత్నాకరసామ్యంబు గలదు, నన్నవమా నింపకుమని తనకు ముక్తాంజలు లొసంగుచున్నదియుఁ బోలె నెసంగు చున్నదియు, మహోత్సవదర్శనకుతూహలంబునం బోలె పైకినెగురుచు సర్వంబు నీక్షించి యెంతతలక్రిందుఁబడినను నస్మత్కేతనుండగు మద నుండీ భూపాలుని రూపంబులో శతాంశమ్మునుం బోలఁడని సూచించు భంగిఁ దలక్రిందుగాఁ బొరలుచు జలమ్ము లతిస్వచ్ఛమ్ములగుకతన నెంతలోఁతునకుఁ బోయినం గన్పట్టుచు సంచలన చాపలరభసవ్యా వర్తితాధఃకాయమ్ములగు కతన మెఱుపులుంబోలెఁ బ్రతిక్షణప్రద ర్శితధాళధళ్యమ్ము లగుచు గగనమునుండి జలరామణీయకం బాలా లోకించు నిర్జరాంగనల లోచనప్రతిబింబంబులోయన నలరుచుఁ, బరస్పర గృహీత పదార్థంబులం బరస్పరముం గ్రహించుచు. గ్రహించినదానిం జిందరవందరజేయుచు మరల నద్దానిన్ ముఖాగ్ర మ్మునం బొడుచుచు, నతిచాపల్యమ్మునం దిరుగుచు, జఠరాంతరం బనవకాశంబగుకతన బహిఃప్రసృతంబగు ముక్తాఫలమ్ము నాఁదగు బుద్బుదమున్ ముఖనిస్వానంబున వెడలంగ్రక్కుచు, భగవంతుండగు శ్రీనివాసుండును నస్మదవతారం బెత్తెనను సంతసంబునంబోలె గంతు

లిడుచు డిండీరమండలమ్ముం గాంచి బకవధూటీభ్రాంతిం జేసి పిల్లలతోఁ గూడ నధఃప్రదేశంబునకుం బోవుచు, దుర్జనులం బోలి స్వజాతిం గబళించుచు, నానాప్రకారంబులఁ జెలఁగు ననుకామీనమ్ములగు మీనమ్ములచే మనోహరమ్మును, నాత్మప్రతికూలదంతావళవిలోకనసాధ్వసంబునం బోలెఁ దరంగభంగసంఘసంఘర్షణప్రేంఖితమ్ములగుచుఁ గదలు తామరసంబులచే నత్యంతభాసమానమ్మును, బృహస్పతిం బోలె శ్రీమద్గురుతాంచితంబును, సంగరరంగముం బోలె సముచ్ఛలత్పృషత్కంబును, ఘనాఘనముం బోలె శతహ్రదాంచితంబును, నుషస్సమయముం బోలె నారక్తసంధ్యంబును, మృగయునిం బోలె నుత్పలాసక్తంబును, మృగరాజుం బోలె నాక్రాంతకుంభికాంతంబును, సకోకనదంబును నగు తటాకరాజముం దిలకించుచుఁ, గించిద్దూరం బతిక్రమించి, విశ్లథీకృత ముఖరజ్జువులును, నుత్తంభితవక్షస్కులును నగు తురగారోహకులు మందమందమ్ముగా తటాకవరణమ్ము నుండి యవతరింపఁజేయ డిగు తురంగమ్ములతోడను, నిమ్నస్థలావతరణమునకై సంశయించుచు నిషాదికరకలితాంకుశఘట్టనవేదన సయితము గణింపక శిరంబుల నటునిటు గదల్చుచు నెట్టకేల కేకైకచరణవిన్యాసపూర్వకంబుగా డిగుకతన శ్రీనివాససేవాకుతూహలాగతజనకోపపాత్రమ్ములును, గంభీరవేదులును, మనోరమమ్ములును నగు స్తంబేరమమ్ములతోడను, మహోత్సవదిదృక్షా చలితభూపాల బలభరభుగ్నఫణభుజంగపుంగవసాహాయ్యకమ్మునకై భూధరత్వాభిమానమ్మున భూమిని వ్రక్కలు జేసికొని రసాతలమ్మున కేగు శైలజాలమ్ములు నాఁదగు న్యుబ్జీభూతపూర్వభాగమ్ముగా డిగు పుష్యరథమ్ములతోడను, దత్తటాకప్రాంత మ్మతిక్రమించి భగవత్సన్నిధిగమనకుతూహలం బున్నతంబుగాఁ జెలంగ వడివడిగా నంబాపురస్థితరాజమందిరసమీపంబునకుం జనునంతలోఁ దురంగమమ్ములం దాఁటించుచుఁ, గరిమేళకమ్ముల నదల్చుచు, వారణమ్ముల ఘోషింపం జేయుచు, వాదిత్రమ్ముల మ్రోయం జేయుచు, దుందుభిభాంకారమ్ముల విస్తరింపఁ జేయుచు, బిరుదుపద్యమ్ము లుద్ఘోషించుచు, శరీరమ్ముల

విఱుచుకొనుచు, సారసనమ్ములఁ గటితటమ్ములం గీలించుచుఁ, పురస్థితగాత్రిమిణుల నివారించుచు, సరభసగమనమ్ము నాజ్ఞాపించుచుఁ, బశ్చాద్దృష్టమాత్రమ్ములగు పర్వతమ్ముల దూరంబులుగా నొనర్చుచు, హర్షాతిశయమ్మునం బొదలుచు, నుత్కంపితకేతనంబుగా నుచ్చాలితచామరంబుగా నున్నద్రితజాలకాతపత్రమ్ముగా నుక్షిప్తోత్కంపవసనమ్ముగా నున్మస్తకఘంటారవమ్ముగా నున్మీలితధూళిపాళికమ్ముగా నుద్దామహేషాఘోషమ్ముగా నుద్ధూతాలస్యమ్ముగా నజ్ఞాతబహుదూరమార్గాతిక్రమమ్ముగా నుదంచితాందోళికావహనధురీణజనవివిధనాదమ్ముగా నవన్యమానసమ్ములగు తత్సైన్యంబు లన్నియు నంబాపురమధ్యభాగవిలసితంబును నికామకాంతంబునునగు రాజమందిరప్రాంతంబున విడిసె. 91

తే. గీ. బలములన్నియు నిట్టు లంబాపురంబు
నికటమున కేగి మోదవార్నిధి మునింగె,
నెలమి నంబాపురప్రాంత మెవరికేని
యధికతరమైన సంతోషమందఁజేయు. 92

తే. గీ. గుఱ్ఱముల డిగి కొంద, తేస్తులను డిగియుఁ
గొంద ఱతిరభసమ్మును జెంది యంత
రక్షివర్గమ్ముతోఁగూడ రాజవర్యు
గజసమీపమ్మునకు వచ్చి కలసికొనిరి. 93

తే. గీ. అంత గజశిక్షకునియాజ్ఞ ననుగుణముగఁ
గుంచితాంఘ్రికమై యొప్పు కుంజరంబు
నుండి యొకభృత్యునికరంబు నూఁతఁగొనుచు
మంత్రితోఁగూడ డిగియె క్షమావిభుండు. 94

తే. గీ. యోధుల శిరస్థ్సలమ్ముల నొప్పుమీఱు
నంజలుల పుంజములఁజూచి యాదరించి
యత్యనర్ఘమణీరుచు లమరు హర్మ్య
రాజమును జేరె నంత నారాజసుతుఁడు. 95

తే. గీ. ఎంతదూరమ్ము మనరౌతు లేగువారొ
యనుచు ననుకొంటి మిచటనే యాఁపినార
లనుచుఁ జుల్కనఁజేసి నవ్వినవిధమున
హరులు హేషలొనర్చుచు నురుఁగుఁగ్రక్కె. 96

తే. గీ. జీనులనుదీసి మీఁద ఖలీనములను
జాఱవిడిచి పురస్థలిఁ జేరఁజేయ
హరికిశోరము లంబాపురాంకమున ము
దంబుచేనొప్పె ననుట యుక్తంబకాదె. 97

తే. గీ. ఇద్దియెంతయు దారుణాకృతి భజించె
ననుచు భృత్యులు కటకభూమ్యంతరమున
శంకులను గొట్టసాగి రశ్వగజబంధ
నములొనర్చుటకై లగుడముల నూని. 98

మ. ఎసఁగన్ సోలుచుఁ గొన్ని, బంధముల నాకృష్టమ్ములై కొన్నియున్
వసుధన్ మూర్ధావి డెక్కలన్ జొనిపి యుత్పాటించుచుం గొన్నియున్
వెసమై ముట్టెలఁదిప్పుకొంచును వడి న్నిట్టూర్పుల న్నించుచుం
బసమై మేయుచు గాత్రముల్ దులుపుచుం బాటిల్లె నా యశ్వముల్. 99

— గద్య —

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
నాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాసమ్మునం
దృతీయాశ్వాసము సంపూర్ణము.



శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీ ని వా స వి లా స ము

## చ తు ర్థా శ్వా స ము

సీ. కందోయినించుచక్కఁదనమ్ముగల్గి య
 చ్చెరుపాటు సేయుచిత్తరువు లొకట
బలపైరిమణిభిత్తికలఁ జెలువారు ని
 ద్దపు పెద్దనిల్వుటద్దమ్ము లొకట
దర్పణచ్ఛవిఘనాంతరతటిద్భ్రాంతి నా
 ట్యముసల్పు నీలకంఠమ్ము లొకట
నెమిలికొమ్మల పించియముల తెమ్మెర గ్రమ్మి
 శ్రమవాయుపండితాగ్రణులునొకటఁ

తే. గీ. దనర రక్షివిచక్షణాధ్యక్షకాభి
రూపఖౌరికనైష్కికగోపసావి
దల్లవాంశికసంచయమల్ల ముఖ్య
సుందరంబగు నరపాలమందిరమున. 1

క. పరిజనకరసరసిజయుగ
విరచితబహుచందనోదబిందువ్యజనాం
తరమరుదర్భకసంచిత
పరమానందానుబంధబంధురమతియై. 2

వ. ఆ సీతారామ భూపాలుండు యామమాత్రావశిష్టంబగు దివాభాగమ్మున సకలాధ్యక్షులుం బరివేష్టింపఁ దల్లికి నమస్కరించి తదనుమతిఁ బడసి నిజమందిరాంగణ నిర్దిద్రంబగు భద్రగజంబుం బరిజననికరంబు కరా

వలంబం బొసంగ సమాత్యపుంగవుండగు వెంకటరెడ్డితోఁ గూడ
నధిష్ఠించి చనునెడ. 3

చ. అరుణునివారువమ్ములు తదద్భుతజైత్రవరూథినీలల
త్తురగకదంబకంబుగతితో సరిదూఁగ మదిం దలంచి స
త్వరగతి మించెనాఁగ నొకదాఁటున దాఁటెను బశ్చిమావనీ
ధరమునసమీపభూమికి సదాగతి దాల్చినరూపులోయనన్. 4

వ. ఇట్లరుణుండు చరమాద్రిసమీపభూమికింజేరఁబోవుటయు యథాపూర్వ
మ్ముగఁ జతురంగబలమ్ములు గలిసి కొలువ నానగపాలుండు కుముతి
గిరిపరిసరపుష్కరిణీ తటమ్మునకుంజేరి యచట నిజాజ్ఞాప్రవర్తితం
బగు బ్రాహ్మణాన్నసత్రముఖంబున సుఖమ్ముగనున్నంత. 5

సీ. భుంజానులైనవిప్రులు గోరుశాకాదు
లెంచి వేర్వేఱ వడ్డించువారు
వచ్చికూర్చున్న విప్రచయంబులకు భుక్తి
భాజనంబుల నేరుపఱచువారు
భాజనంబుల నేరుపఱచినంతనె వస్తు
నికరంబుచేత నిండించువారు
ఆపోశనంబెత్తునంతనే జారీలు
వంచి నేతినిగ్రుమ్మరించువారు
ఆ. వె. భక్ష్యలేహ్యచోష్యపానీయములు చేతఁ
బట్టి వేయిసార్లు పంక్తిపంక్తి
కరిగి 'మీకు మీ' కటంచును వడ్డించు
వారలైరి వంటవార లచట. 6

సీ. నేయిరాల్చవదేమి నీతాతసొమ్మ యం
చఱచి యొక్కని చేతఁ జఱచెనొకఁడు
పప్పుతెమ్మనఁ దేకపరువెత్తె దేమి రో
గమని యొక్కనిఁ దిట్టఁగడఁగెనొకఁడు

ఔత్తరాహులు వీరలనియెఱుంగవెయంచుఁ
దెగువ నొక్కనిఁ జేతఁ దిగిచె నొకఁడు
ఔత్తరాహులకన్న నధముండనే యంచు
మించి యొక్కని నిరసించె నొకఁడు

తే. గీ. తెమ్ము తెమ్మని కుఱివెట్టి తెచ్చినంత
వలదుపొమ్మనె నొకని నవ్వులకు నొకఁడు
నృపునితోఁ జెప్పి నేఁడు నీనిక్క మాని
పించెద నటంచు నొకని వేధించె నొకఁడు. 7

క. దొన్నెలలోఁ గలఘృత మొక
చిన్నమ్మను మిగులకుండఁ జెంబున వేవే
గన్నెలకొలుపుచు లేదని
దొన్నెలు బోర్లించె నొకఁడు దుండగమెనయన్. 8

చ. నను సుగుణాయటంచు స్తవనంబొనరించె నితండు మంచివాఁ
డని మఱికొన్ని భక్ష్యముల నాయవనీసురుభాజనమ్మునం
దునిచెను వేగ నంసయుగ ముబ్బ నిరక్షరకుక్షియైన యా
దనికుఁ దొకండు సూడుఁడని తత్పదవాచ్య మెఱుఁగ కెంతయున్. 9

క. నవనీతము తెమ్మని యొక
యవనీసురుఁ డడుగ నొక్కఁడన్నం బిదిగో
నవనీతం బని యొసఁగెను
నవనీతం బొసఁగె నొకఁడు నవ్వుచు మరలన్. 10

వ. మఱియు నొక్కపాచకుండు నిష్ఠానత్వవిఖ్యాతంబగు తేమనంబిదిగో యని పరివేష్టింపఁ గేవలవైయాకరణుండగు నొక్క ధరాసురుం డీతేమనపదమ్మున కేసూత్రమ్మున నిష్ఠానత్వంబుగలిగె నని ఖసూచియగుచు భోజనమ్ము వదలి పరిశీలించుచున్నంత పరసతరసాహితీ సాహితీధురీణులగు కవులెల్ల నాతనిం గాంచి. 11

ఉ. చూచుటకే 'మి కోయణచి' సూత్రముగాదది బుద్ధి కేన కా
ణాచినటందు వర్ళకగణంబులకైన సుసాధమైన యా

వాచకమెన్నఁడేనిఁగనవా ? యమరంబున, లేదు పాప మీ
పాచకుఁడైన మేలని యపస్మితముంబొనరించి రెంతయున్. 12

క. ఇవి చూర్ణాపూపిక లీ
యవి మౌద్గము లివి లవణము లవి దాధికముల్
చవిఁజూడుఁ డంచుఁ బాచకు
లవిరళగమనమ్మొసల్పిరటు నిటు పంక్తిన్. 13

మ. సురసాలాళినొసంగుఁడంచు నొకఁ డౌత్సుక్యమ్మునంబల్కు ని
ర్జరలోకమ్మున కేగ మానవులకున్ శక్యంబె మేమెట్టు లా
సురసాలమ్మను జూడనోపుదు మటంచున్ బాచకు ల్వల్కు భూ
సురులున్ మార్జికలంచుఁ దెల్పిరి తగన్ సూదాళికి స్గ్రిమ్మఱన్. 14

సీ. మోదకమ్ముల నాసలేదు పొమ్మనువార
లాజ్యమ్మునకు దండమనెడివారు
చింత నెప్పటికి వాంఛింపఁబో మనువారు
తమకడ్పు లొకచేత నిమురువారు
సురభినీరముదాగ్రివి సొమ్మసిల్లెడువారు
తక్రిపానమొనర్చి తనియువారు
పద్యము ల్చదివి బొబ్బలువేయువారును
బొబ్బట్లుచవి తలపోయువారు
తే. గీ. అన్నవితరణసుకృతము నెన్నువారు
పొట్టఁజూచుచు బ్రహ్మను దిట్టువారు
పాలకుండగు సోమభూపాలసుతుఁడు
పృథివి నేలుతమంచు దీవించువారు. 15

వ. మఱియును జగ్ధార్ధకబళులు నజగ్ధకబళులును జర్వితమనోహరులును, భోజనాయాసమ్మున లేవ నశక్తులగు వారింజూచి నవ్వువారును, నవ్వు వారల నాక్షేపించువారును, దృప్తులయ్యును నాసదీరక భక్ష్యమ్ములవంకఁ జూచువారును, నరపతికులాభరణంబగు సీతారామభూపాలుం డనుదినం

బిట్టి సంతర్పణం బొనర్చుచుండ వలయు మేమునుం దినుచుండవలయు మీకేలయని నవ్వువారింగాంచి కోపించువారును నగు ధరాసురోత్తము లం గని డెందమ్మున నమందానందంబు కందళింప నటనుండి వెడలి తద్గిరివరపరిసరతటమ్మున మణికుట్టిమంబగు నొక కనక మంటపాంత రమ్మున రత్నకంబళప్రాంతకల్పితంబగు నొక్కభద్రాసనంబున సుఖా సీనుండై కొంతతరవారకాంతాకలిత నర్తనవిలోకమ్మునం గాలక్షేపం బొనర్చుచున్నంత. 16

చ. తతమగు నంబరీషపరితాప మితఃపర ముద్ధురంబుగాఁ
బ్రతివిపణిం జనించునను పల్కులు విన్నదివోలెనంతఁ గు
ర్మతిగుహనుండి వెల్వడియె మాధవుచక్రి ; మవక్రవిక్రమో
ద్యతుల కనుగ్రహంబు శరణాగతులం దధికంబగుంగదా. 17

చ. సరసులకున్ విరోధులగు క్ష్మాపతియేనుఁగులెల్ల నాత్మపు
ష్కరిణిఁ గలంచునో యనుచు సారసలోచనుఁడూహఁజేసి పు
ష్కరిణికిఁ దోడుగమ్మనుచుఁ జక్రమునంపెనొ నాఁగ నుల్లస
త్త్వరగతిమీఱఁ జక్రపతివచ్చె సరోవరతీరభూమికిన్. 18

చ. అనుదిన మేగు నియ్యది మహోత్వర నెచ్చటికోయటంచు దాఁ
గనుఁగొను వేడుకన్ వెడలు కంజవిలోచనుచేతిశంఖమో
యన రజనీమనోహర మహఃప్రతిపక్షిమహామహోదయం
బునఁ దగుఛత్రముందనరెఁ బొల్పుగఁ జక్రిముమీఁద నెంతయున్. 19

ఉ. పాములకున్ విరోధియగు పక్షివిభుండిఁకఁ గుర్మతీఁద్రిని నే
వామతి రాఁగలాఁ డతఁడు వచ్చిన మదరిథరజ్జుసర్ప మే
మేమి యవస్థఁజెంది మఱి యేమయిపోవునొకోయటంచుఁ ద
ద్భీ మదినెంచెనా రవియు వేగ మునింగెను బశ్చిమాంబుధిన్. 20

తే. గీ. శంఖచక్రంబులివిరెండు సరసిజాక్షు
చేతులందుండునని జనుల్ చెప్పుచుందు
రిచట నే నొంటిగానుంట యుచితమగునె
యంచుఁ జక్రిము గుహలోనికరిగెనంత. 21

తే. గీ. ఎపుడు దుర్మతిసంబంధమెనసియుండు
యుగవిగమమందయిన దానినుడుగఁబో ద
టంచు హరిపరిజనము లహంకరించి
మోదిరోయన దుందుభి మ్రొక్కువెట్టె. 22

క. ఆదట ఖగరాడాగమ
నాదరసూచకములగుచు నత్యద్భుతభే
రీదంధణనాదంబులు
రోదఃకుహరంబు కరమదుర్వఁ బిక్కటిలెన్. 23

క. కృతతాత్కాలికపూజా
రతుఁడై కుర్మతిధరాధరస్వామి దయా
మతిఖగరాడ్వాహోద్ధృత
మతియై గుహ వెడలె భక్తమండలి వొగడన్. 24

వ. ఇట్లు వెడలి చనుదెంచు నెడ ద్వారసన్నిద్ధంబును, శిరస్సమాటీకమాన రత్నకోటీ ఖచితకోటీరమ్మును, నుత్ఫుల్లపతత్రిమ్మును, గాంచనాంచిత వర్ణమ్మును నగు గరుడవాహనంబు కురుమూర్తి గిరి శ్రీనివాసనివాసం బగుటంజేసి యఖిలకులగిరి శేఖరం బగుఁగానఁ దదనుగ్రహంబువడసి నీవును దాదృశంబగు కీర్తి సంపాదింపు మని హేమాచలంబు పనిచిన సరత్నశృంగపఙ్క్తిండగు హేమాద్రితనయుఁడో యనఁ జెలువారె. మఱి యును నిఖిలదితిసుతమండలఖండనోద్దండుం డగు పుండరీకనయ ముం డుభయపార్శ్వలంబమానమేచకవైజయంతీపటవిరాజమానం బగు నిజవిజయస్తంభాగ్రంబునం దెత్తిన పద్మరాగమణికలశంబునాఁ జెలఁగు నాసామూల సమారబ్ధభ్రూయుగాంతరోజ్జృంభిత కుంకుమ తిలకంబును, నిఖిలలోకభీకర నాగరాజశిరఃపాటనోచితంబగు స్ృణియోయన నొప్పు దంభోళికాటవ సమపాటవంబగు చంచూపుటంబును గలదియు, నావంటి ద్విజరాజగునీతని వదనంబునంగూడ ద్విజరాజోదయంబు కలిగెనని జనులు వచించుచుందు రవి నాకంటె నధికశ్రీకంబులో న్యూనశ్రీకం బులో చూచెదనని బాల్యచాపల్యంబునం జూడవచ్చి యాజన్మకఠిన

శిలమ్ములగు నామధారణమాత్రమును సయిపని తదద్రిదమ్ములచే నుభయ
ధాఖండితుండైన బాలచంద్రుని శకలంబులు వికలాంగమ్ములగుటంజేసి
పోసేరక నెలవులఁ దగులుకొనెయెనోయనఁ దగుకోరలచే శ్వేతాతపీ
కోరకయు గళభాసురంబగు బంధూకకుసుమగుచ్ఛరాశింబోలునదియు,
ద్విజరాజను ననురాగంబున వచ్చి గుప్రిచ్చి కవుఁగలించుకొనిన తారా
వళులు నాఁదగు తారావళులచే నెసంగునదియు, జేజేరాజుకన్న నోజము
నం బదిరెట్లుపెద్దయని తెల్పుభంగి బాహుయుగళదశాదశావతార భాసు
రంబగు కులిశంబునా నహిగోత్రపక్షవిపళనచణంబగు నఖరనికరమ్ముచేఁ
జంద్రకాంతిం ద్విగుణమ్ముగాఁజేయు ప్రసారితకరతలమ్ములచే బ్రహ్మాండ
మండలంబెత్తి యొక్కసారి బంతిభాతిఁ గ్రీడింతునని దెలుపుభంగి నున్న
దియు, నికుంచితపాదయుగళంబగు కతన మత్సదృశుండగు వలీముఖ
శిశుపున కశక్యంబగు చండభానుమండలనిగిళనంబు నేనొక్కపదమ్మనం
జేసెద జనులారా చూడుఁడని యెగురుచున్న భంగినున్నదియు,మునుపొక
కొంతకాలము సురాశ్రియంబు నాకు దూరీకృతంబుగా నొనర్చితివట్లు
కలకాల మనుగ్రహింపుము నిన్నాశ్రియించెదనని వేఁడుకొనుసుధయో
యనఁదగు సితోత్తరీయమ్ముచేఁ దనరునదియు, రుద్రైకా స్తంబయ్యు
నారాయణైకభక్తంబును, శ్రుతిద్వయమనోహరాంగంబయ్యు ననంతశ్రుతి
మనోహరాంగంబును, బన్నగోచ్చాటనపక్షవాతంబయ్యు విపన్నగోచ్చా
టనపక్షవాతంబును, నిఖిలజగద్విజయాయశనంబును, నఖిలతేజంబుల
కాధారంబును, నఖండనయమ్మునకగారంబును రెండు దెఱంగుల సుకీర్తి
నవలంబించుచున్నదియు, వినతానంద కరమ్మునగు నాగరుడవాహనంబ
ధిష్ఠించి మత్సనామకుండును, ద్రయీశరీరుండును, భగవదాశ్రితుండును,
నగునీవతగేంద్రున కెంతతేజంబుకలదో చూచెదనని యంబరతలమ్మునుండి
యుపరిస్థలమ్మునకు బ్రేలుచు నిజరుచిధిక్కరణచణతత్తాదృశతదీయతేజో
విలోకనసముద్భూతసాధ్వసవిగళత్తేజోధారాసారంబగు భానుమండలం
బునాఁ దనరారు కనకదండాగ్రభాసమానకనకాతపత్త్రింబును, నద్దానితోడ
మైత్రింజేయు భంగిఁ దనరారు మణిమకుటంబును దాల్చుకతన నిళయం

దొక్కసారిగా భానుమండలయుగళోదయం బొడఁగూర్చి నిజశక్తిం బ్రక టించువానిభంగి నొప్పుచు, సుధాహరణప్రస్తావసమయంబున ఖగపతిచే సమానీతంబులగుచు నిజావాసభేదకుండగు నతనింగాంచి భయంబున ముహుర్ముహుః కంపమానంబులగు మౌక్తికపుంజంబులో నాఁదగు కింక రాందోళిత హంసవర్ణక చామరంబు లిరుప్రక్కలఁ దనరఁ బక్షిరాజముఖ నిర్ధూత చర్వితానేకదర్వీకర ధూర్వహ మహత్తర శిరోరత్నంబులోయన జాజ్వల్యమానంబులగు ప్రదీప బృదంబుల యమందప్రభచే గిరిప్రాంతం బులు పల్లవితంబులునాఁజెలువారుచుండ మందమందమ్ముగా బయలు వెడలి భక్తవాత్సల్యంబుం బ్రకటించుభంగి సీతారామాస్థానమంటపకుట్టి మంబునకుం జని సరభసకృతప్రణాముండును, సాంజలిబంధుండును, సగద్గదరవుండును, సానందబాష్పుండును, సపులకాంకురుండును బాలుం డయ్యు భగవద్దివ్యముఖారవిందమరందాస్వాదన స్తిమితమధుకరాయమా ణలోచనుండగు కతన దూరీకృతచాంచల్యుండును, నగు నాసీతారామ భూపాలునిచే సేవింపఁబడి కొంతతడవు దశమీవేదికయం దుపచితపూజా పురస్కారుండగుచు నాకురుమతిగిరీశ్వరుండు విజావాసగుహాంతరంబుం బ్రవేశించు నంతలో నతిశాంతుండగు నా మహీకాంతుండును యథా పూర్వంబుగా సముచ్చలచ్చతురతురగకరివరరథకులనిబిడీకృతపార్శ్వుఁ డగుచు మంజులంబగు కుంజరేంద్రంబు నధిష్ఠించి నిఖిలజనకదంబాక రంబగు నంబాపురంబుంజేరి బహువిధదర్పణస్ఫారంబగు విజాగారంబున సుఖమ్ముగఁ గుముదినీవిటకామినియగు నయ్యామినిం గడపెనంత. 25

ఉ. శౌరికి నాగపూర్ణ్యకలశంబిడి సన్నుతిఁ గాంచఁగాఁ దదా
కారముమాత్ర వేఱగునగంబను నేనెటు లూరకుందు బం
గారుపయోధరంబొకటి కానుకొసంగెదనంచుఁ దాల్చెనాఁ
గా రుచిమీఱెఁ దూరుపునగమ్ము శిరోగతసూర్యబింబమై. 26

మ. తనకాల్వెట్టినమాత్రి లోకముసమస్తంబున్ శుచింజేయు న
బ్జుని దోషాకరుఁ డం ద్రెఱుంగక కరంబుల్ సాఁచి కోయంచుఁ బా

యని నిశ్శ్రీకమలిన్యపగ్రహణసౌఖ్యంబందుచున్నట్టిపూ
ర్యుని దోషాకరుఁడంచుఁబల్కెదము చంద్రింబల్కఁగాఁబాడియే. 27

తే. గీ. తేజుగలవానియందు వర్తించునట్టి
దుర్గుణంబులుబైటికి దొరలవకట!
కువలయధ్వంసమొనరించు రవియు లోక
బాంధవుండంచు నుతియింపఁబడుటలేదె! 28

చ. రవికిరణప్రభాపటలరంజితమౌ మహిభృన్నికాయ మె
క్కువ రహిగా నిజాధిపతి కుర్మతిభూధరనాథునుత్సవం
బవునని దిక్సరోజముఖులందఱతో నవకుంకుమాంగరా
గవిలసితాంగకంబగుచుఁ గన్గొనవచ్చెననంగ శోభిలెన్. 29

తే. గీ. అగు నితఁడు నన్నుఁబోలి కంజారి, యిర్వు
రకు సుహృద్భావమున్న గౌరవముగల్గు
ననుచుఁ జందురుఁ దలఁదాల్చె ననఁగ రజత
కలశతో శ్రీశుదరికి నాగమ్మ వచ్చె. 30

తే. గీ. లచ్చికుచములతోడఁ బోల్పంగవచ్చు
దీనినను పేర్మిచేఁబోలె ద్విపసమావృ
తంబయిన కలశగల జలంబుచేతఁ
బాద్యమును గొని హరి మోదభరితుఁడయ్యె. 31

తే. గీ. మెల్ల మెల్లనఁగొందఱు మిగులవేగ
గరిమఁ గొందఱు జనములు గలసిమెలసి
కురుమతిగిరీంద్రకందరాకరుని హరిని
గొలువ నరిగిరి కరముల ఫలము లమర. 32

చ. చరమధరంబుసన్నిధికి సారసబాంధవుఁడేగునంతలో
నరపతివారువంబుల స్వనంబున మించిన దుందుభిధ్వనుల్
కరముఁజెలంగుసైన్యములుగ్రమ్మ మదావళ మెక్కియేగె న
క్కురుమతిశైలనాయకునకుం బ్రణమిల్లి ముదంబులందఁగన్. 33

తే. గీ. నాకుఁగలపేరు ధరియించి నాకు దాస
చర్యలొనరించుచున్న యాచకశ్రీరాజు
వచ్చెనో లేదొ యని చూడవచ్చెనో య
నఁగ వెడలెఁ జక్రరాజంబు నగమునుండి. 34

తే. గీ. మాకుఁ దనదర్శనం బిచ్చి మమ్ము ధన్య
తముల నెన్నఁడొనర్చునో దానవారి
యనుచు మంత్రులు కవులు చుట్టునుజెలంగ
మహీవరుం డుండె మణిమయమంటపమున. 35

సీ. వలలోఁ బడిన జక్కవలునాఁగఁ జందోయి
దుడుకుమీఱఁగఁదొంగితొంగిచూడఁ
బడగవిప్పిన నల్లపాముగా వెన్నుపైఁ
బైని గీఁజెడ బరాబరులుసేయ
పట్టిపిండినఁదేనె పట్టునా గానంపుఁ
జెలువుపై ఖరి తేనెఁ జిందఁజేయఁ
దేనెసోనలు నివేదించుచాడ్పునఁ గాళ్ళ
గజ్జెలు ఘళుఘళ్ళు ఘళ్ళురనఁగ
తే. గీ. వారకాంతలు మిగులశృంగారగరిమ
నభినయము కొంతదనుక నాట్యమ్ముకొంత
దనుక గానమ్ముమఱికొంత దనుకఁజూపి
మించి భూపాలకుని గరఁగించి రచట. 36

క. కదలక మానసవికృతిం
బొదలక నలకుసుమశరులఁ బోలెడి తనుసం
పదలఁబొదలునానరపతి
వదలకనటియించు వారవనితలఁజూచెన్. 37

ఉ. తమ్మనకున్ బయోనిధిగతమ్మయి యింపెసలారురత్నజా
తమ్మను దెచ్చియిచ్చి లసితమ్ముఘటింపఁదలంచియోయనన్

దమ్ములతేనితో నతిదుర్గతమ్మగ పశ్చిమవారిరాశిపా
తమ్మొనరించెఁ గాశ్యపి; సతమ్ములుగావె సగర్భ్యభావముల్. 38

ఉ. నింగినిపీడి వారిధిమునింగినభానుని మీనపాళి నా
రంగఫలభ్రమణ్ గదియరాఁ దదపారగభ_స్తిరాశి కాఁ
కం గడునోష్ఠభాగములు కాలఁగఁబోలును, గాకయున్న దే
నిం గబళింపఁబోయియును నేఁటికి భీతిమెయిం జలించునే. 39

తే. గీ. సరసియొడ్డునఁజేయుపూజలను గొనుచు
భేరికారావ మంతట బోరుకలఁగ
హరి గుడుసువాలు కుర్మతిధరణీధరగు
హాంతరంబున కంత రయమునఁజనియె. 40

తే. గీ. ఖగుఁడని పతంగుఁడని తన్ను జగముల్లెల్లఁ
బల్కుపల్కులు నిజముగా భాస్కరుండు
పతగభావము గనెననఁ బక్షిరాజు
లచ్ఛిమగనింటిగుమ్మ మలంకరించె. 41

తే. గీ. కుండలిత్వంబు రెంటికిఁ గొమరుమిగులు
గానఁ బన్నగమును బతంగమును సమము
లనుచుఁ బన్నగతల్పకుండయ్యు శౌరి
చెలఁగుచుఁ బతంగమును నధిష్ఠించెనపుడు. 42

చ. ఇవమువిరోధికిం దనయనేనని నల్లనియేరు గర్వమున్
దవిలిన నాసరస్వతియుఁదా నిజసాదిసగర్భ్యనెక్కుమా
ధవుమహమున్ గనన్ భువికిఁ దారినసూర్యునకున్ జనించెనాఁ
గ వెలసె ఛత్రమున్ బసిఁడి కామయు శౌరిశిరస్థలంబునన్. 43

వ. ఇట్లు విచిత్రింబగు పత్రరథతురంగమం బారోహించి మించురుచి
వహించియున్న యక్కరుమతిగిరి పతిఖగనాధమహామహామహీయస్త్రా
జనితఘనతరసంతోష నటనచటులంభులగు మరాళంబులునా డంబుమీఱు
చామరంబులు వీవ సోపానంబులకు మొట్టమొదటినుండి చిట్టచివరవఱ

కిరుదెసలఁ బసమీఱఁ బజ్జీఁ భూతంబులగు భక్తజాతంబుల యుదస్తంబులగు హస్తంబుల శస్తంబులగు గంధకబంధుర దీపంబు లంతరాంతః ప్రతిఫలితపరస్పరరేఖాభిరామంబులగుటంజేసి నిజాధినాథ శ్రీనివాస సేవార్థంబుగా నిజఖనీజనితమణీగణపరిష్మ్యూతపద్మరాగమణీగుంభిత లంబమానైకావళిభూషితంబునాఁ దనరు నక్కురుమతిగిరీంద్రంబు నిర్యత్న నిర్యత్తౌర్యత్రికారావమిళితసేవాహేవాకజనకోలాహలదంతురిత భేరికారావముఖరితంబులగుగుహాముఖంబుల నుదంచితంబగు ప్రతిధ్వానంబను నెపంబున నిజమహోత్సవంబు నుతించుభంగి నెసంగఁగదలి చను దెంచునెడ. 44

శా. దంతిన్ బ్రోచిననాఁటిధాటిచెలువొందన్ నేఁడు మాఱేఁడు శ్రీ
మంతంబైన పతత్రినాయకభుజామధ్యస్థలం బెక్కి మా
చెంతంజేరుచునున్నవాఁడని తలం జేదోయి సంధించి య
త్యంతమ్ము స్నుతియించె భక్తతతి తత్ప్రావీణ్యముల్ బాఁడుచున్. 45

సీ. బత్తిగల్గినవారి నెత్తిపెంచెడిపేర్మి
గలుగుదేవర ! నమస్కారమయ్య
పాపరాబుస్వఁబొప్పడుముక్కుగలపక్కి
సామిసాహిణి ! నమస్కారమయ్య
ప్రాఁబల్కుకల్కిపాపటివేల్పురారాతి
నగమైనవేల్ప ! దండంబులయ్య
జడదారులమదినెప్పును కాఁపురముసేయు
నల్లమైసామి ! దండంబులయ్య
తే. గీ. మేము నీవార మిదియెల్ల నీమహత్త్వ
మనుచు నానందబాష్పమ్ము లినుమడింపఁ
దలల దోసిలులొగ్గి యెంతయును ననుస
రింపసాగిరి వేంకటరెడ్డిముఖులు. 46

చ. గిరిపతిపైకినెక్కి యిరుకేలును నొక్కటిఁజేసి యాదలం
దిరముగ మోడ్చి తద్వదననీరజరమ్యరుచిప్రవాహభా

స్వరయుషదంపతీభవదపారవిశాలవిలోచనప్రభా-
నరపతియు న్నమస్కృతులొనర్చె ఖగేశవిహారిశౌరికిన్. 47

తే. గీ. రౌతుదినమందు మహము చేరంగవచ్చె
నంచు సేనాని నెమిలి యూహించి వచ్చి
పింఛమును విప్పెనోయన వెలసెనపుడు
పింఛమయమగు గొడుగు భూవిభుశిరమున. 48

సీ. గతనముల్ చెక్కించి పతిసేవకై వసుం
. ధర కానుకిచ్చిన మురుగనంగఁ
దపనీయమణిగణస్థగితమైయెసఁగు కా
ననలక్ష్మిరతనంపు న త్తనంగ
క్షిప్రాపతన్నిర్ఝరప్రమదాకన
ద్భ్రిష్టకాంచీకలాపంబనంగ
వేల్పురోవెలఁదుల విటులదండలనుండి
తరలిన పొగడపూదండయనఁగఁ

తే. గీ. గటకవిధమున నునికియె కర్జమనుచు
భాసమానప్రదీపముల్ పంక్తిగట్ట
వలయరూపమ్ముగాంచి చెన్నలరెఁ గటక
శబ్దవాచ్యమ్ము భూపాలసైన్యమచట. 49

సీ. అఱచేత లోకమ్ము లాడింప జీవమ్ము
గ్రమ్మివచ్చిన పైఁడిబొమ్మలనఁగ
జగములెల్ల జయించి జయపత్రమువహింప
స్మరుఁడు పంపినమంత్రశక్తులనఁగ
శృంగారరసము జేజేపెద్ద గరఁగించి
కరువుగట్టినయంత్రకాంతలనఁగ
వైరాగ్యమును జంపివైవఁగా రతి పంప
వచ్చిన మృత్యుదేవతలనంగ

తే. గీ. వారకాంతలు చెలులతో వచ్చి రాగ
మాలపించుచుఁ బాడుచు నభినయచ్ఛ
లమున శుకపికరవనిందలను సలుపుచు
హరియెదుట నాచుసలిపి రత్యద్భుతముగ. 50

వ. ఇట్లు మంగళధ్వానపురస్సరంబుగా నూరేగి. 51

తే. గీ. దీపరేఖలతో నిరుదెసలయందు
వాహినీనామ మది సార్థపటిమఁదనరఁ
బ_క్తిగాఁ బ్రసరించుభూపాలసేన
చేరిగొలువఁగ వేదిఁ గై సేసె శౌరి. 52

వ. ఇట్టుదశమీవేదిక నిషీదనం బాచరించి యర్చకకృతసపర్యలం గటాక్ష పరిసారమ్ములం బరిగ్రహించుచు భవద్వదనారవిందసుందరఘృణీలహరీ పరాభూతుండగు నస్మద్వల్లభు ననుగ్రహింపవేయని వేఁడు స్వాతియనఁ దగు కర్పూరదీపమ్మునఁ గృతనీరాజనుండై కదలి మరల గుహాగృహ ప్రవేశం బొనర్చునెడ. 53

ఉ. నాకు వయస్యయైన దివి నావలెఁగాక సమగ్రిబుక్షర
త్నాకులమంచు రత్నములు హ_స్తమునంగొని రత్నగర్భ యా
యాకసమందఁజేయ నవి యందక జాఱెననంగనొప్పె బా
ణాకృతిగంధకజ్వలనయంత్రిగళద్ఘుటికానికాయముల్. 54

శా. శౌరిశ్రీఁగనవచ్చి చూచియుఁ బునస్స్వ స్థానమున్ జేరుచోఁ
దారాసంతతి తుష్టిభారమునఁ గ్రిందన్ రాలెనా రాజిలెం
దారామండలగ-ధకజ్వలనయంత్రప్రోచ్ఛలద్ఘోరచూ
త్కారధ్వానవియద్గతాగతచలద్వహ్నిస్ఫులింగచ్ఛటల్. 55

సీ. భగవంతుతిరునాళ్ళు భ_క్తిమైఁజూచి సం
తసముపాలై యున్న తల్లితోడ
మాటమాటకుఁ దేనె పోటురా నుతిసల్పి
కలవుదీరిన పహాకవులతోడఁ

జతురుపాయోపాయమతి రాజకార్యముల్
నెఱవేర్పఁగల మంత్రివరులతోడఁ
బులితైన మీసాలు మెలివెట్టిపెకలించు
చిరుతచేష్టలుగల్గు సేనతోడ

తే. గీ. రాజు కురుమతిధరణీధరమ్ము వదలి
కదలిచను దెంచె జగదంబ కరుణకలిమి
సకలసంపత్సనాథమై సరసకతికి
బాపురేయననోపు నంబాపురంబు. 56

తే. గీ. సప్తమీపతియైన భాస్కరుఁడు నాఁటి
కురుమతిగిరీశునుత్సవం బరుగుదేఱ
భక్తిమై సేవఁజేయఁగ వచ్చెననఁగ
నుదయగిరిమీఁద రుచిమీఱ నుదయమందె. 57

క. భగవత్సేవయొనర్చిన
జగములరాగంబు లడఁగు జనులకనుచుఁ జె
ప్పఁగనెంచెనొ యన నంతట
ఖగరాజు ప్రణష్టరాగగరిమఁ గాంచెన్. 58

క. అరుణుం డుదయింపఁగ రాం
కురపానముచేసె ననఁగఁ గొలఁకులనెల్లన్
సరసీజము లరుణచ్ఛవిఁ
బొరసి జలజరాగమణుల పొలుపువహించెన్. 59

చ. సిరిచనుదోయితోడ సరిఁజేయుచు రందఱు కూడియున్న యి
క్కరివరకుంభయుగ్మము నొకండని నన్నన, రొక్కకుంభముం
బరిగొనినంత నిర్వ్వరసమంబుగఁ జూతురఁటంచు నెంచెనాఁ
గరము కరీంద్రకుంభయుగిఁ గ్రాలె రమాపతితీర్థకుంభమున్. 60

తే. గీ. నాకుఁ గుంభయుగంబు నున్నయదికాని
మలినమైయొప్పనంచు నన్మత్తగజము

శుచియయినకుంభమొకఁడు దాలిచెననంగ
రజతకుంభంబు గొనుచుఁ దీర్థంబుదెచ్చె. 61

క. కురుపతిధరణీధరమున
మురవైరి యుషస్సపర్య పూజకులెల్లం
గరమాచరించునంతటఁ
బరివారముతోడ ధరణిపతియుం దరలెన్. 62

సీ. దుందుభిధ్వని మహీద్యోభాగములు నిండె
మర్దళారవము సమ్మర్దమయ్యెఁ
గాహళధ్వానంబు కర్ణంబులు పగిల్చెఁ
గయిసేఁతగనె భద్రగజచయంబు
వారువంబులు వల్గువలనముల్ గావించె
ఖేటకమ్ములు మేళగింపుగాంచెఁ
జామరమ్ములు కరాంచలచాలితములయ్యెఁ
గటకమెంతయు లసద్గతులమించె
తే. గీ. ధ్వజములెత్తిరి వీథులు తడిపి మల్లె
పూలు చల్లిరి కత్తులు బొసఁగఁజేసి
రఖిలసైనికు లపుడు నయ్యవనివరుని
యాజ్ఞ తమతమయౌచలలందుఁదాల్చి. 63

తే. గీ. పార్శ్వభమ్మునఁ జతురంగబలముగొలువ
నశ్వమందు యశఃపటహములుచెలఁగఁ
జూపరుల సంతసమ్మునఁ జూచుచుండ
భద్రదంతావళము నెక్కెఁబార్థివుండు. 64

చ. ఒడిసి మదీయవంశభవు నొక్కని బాలుని రామనాము నె
క్కుడుతమి లోబిగించుకొనఁగూడునె నీకని కైరవాహితుం
డడుగఁగవచ్చె నాఁగఁ జెలువారెడి ఛత్రముతోడఁగూడ న
య్యెడయనిపెన్క నెక్కె కరి నొప్పుగ వెంకటరెడ్డి ధీరుఁడై. 65

ఉ. దుందుభిరావముల్ నృపునితోఁ జెలరేఁగుట లాలకించి చే
యందగుకృత్యముల్ మఱచి యందఱు మందగతి న్వెలందు లా
నందముతో నృపాలకుఁ గనంజనుదెంచుచుఁ జూచునంతలో
నం దగనేగె వేగ మహినాథుఁడు చామరవీజ్యమానుఁడై. 66

తే. గీ. వారువమ్ము లెక్కి వెన్కఁ జెన్నార నృపతి
యంతరానందకలితుఁడై యఖిలబలము
చెలఁగికొలువఁగఁ గురుమూర్తిశిఖరిచెంతఁ
గలసరసుఁ జేరి యచ్చటఁ గరిని డిగియె. 67

ఉ. స్నానముఁ జేసి పుండ్రములు చక్కఁగఁ దీరిచి భృత్యసత్తముల్
మానుగఁ దోడరాఁగ నగమధ్యఁ బితామహసంక్రిమ వేంకటే
శానుఁడు నిల్చినట్టి కపిచంద్రుని మారుతపుత్రుఁ గాంచి యెం
తేనతియించి యంతఁ జనియెం గురుమూర్తిసహాగ్రభూమికిన్. 68

సీ. గోవిందయని పెద్దగోలఁ గొల్చెడువారు
జలజనేత్ర యటంచుఁ జాటువారు
దేవదేవ యటంచు సేవజేసెడువారు
మురవైరియనుచును మ్రొక్కువారు
శ్రీనివాస యటంచుఁ జెలఁగియాడెడువారు
ఫణిశైలపతియంచుఁ బల్కువారు
కరిరక్షక యటంచుఁ గరమునోమెడువారు
నిందిరాధవయంచు నెరఁగువారు

తే. గీ. నన్నురక్షింపుమని వేఁడుచున్నవారు
పరిజలరక్షింపుమా యనిపల్కువారు
ప్రోవకున్నను నొట్టనఁబోవువారు
నైనభక్తులఁ గనియె నయ్యవనిభర్త. 69

ఉ. కొందఱు పూలదండలను గొందఱు దివ్యమణీగణప్రభా
సుందరభూషణంబులను సొంపుగఁ దాలిచి శ్రీశు సేవ కా

నందరసమ్మ్రైటంబడెనాఁ జెమటల్ ఝుటిఁగట్టఁ దొంవరన్
ముందఱ నారికేళఫలముల్ గొనియుండిరి దుస్థులై తగన్. 70

క. జనులహాళాహాళిఁజూచుచుఁ
జనె సీతారామనృపతిచంద్రుఁడు భగవం
తునికందరాగ్రభాగం
బునకున్ సపరిజనుఁడగుచు ముదమెదబొదలన్. 71

వ. నిజశిరోవిరాజమానసరోజలోచనచరణాంగుష్ఠమ్మునం జనియించి నికట తలపటుతరశ్రీచూర్ణ రేఖాంచలహాటకధరాధరశిఖరంబు తాఁకునం ద్విధాభూతమై యధస్థలలలద్భ్రుకుటీయుమధ్యభాగమ్మునం గలసి పదనప్రభూతలావణ్య సాగరసంగమంబు గనిన గంగాలహరీయుగంబునాఁ దగు పక్రికాశితశిఖరనాశికా మూలమిళితస్వచ్ఛోర్ధ్వపుండ్రయుగమ్ము మొగమ్మునందనర వకుళమాలాసౌరభీసమాస్వాదవివశీకృతంబగు మధుకరనికరంబనఁదగు సరసీజబీజసరం బురంబునం జెలువార నిరంతరలవణజలనిధిసమాలింగనవైరస్యయగుటంజేసి యిందిరాసుందరీసుందరకరారవిందస్యందమానమరందమాధుర్యంబును విజ్ఞానప్రదంబును నేతద్విరచితంబును నగు ద్రావిడాగమసాగరంబు కరంబు కరంబులం గౌఁగిలించుకొని సేవించుచున్న గంగానది నాఁదగు శిత్తోత్తరీయవల్లిక దివ్యదేహంబునం దనర, భగవద్గుణంబులను బంగారుదారంబుల నిగమయంత్రంబులం గ్రుచ్చి ధరించిన దివ్యసందంశికాయంత్రిక యనఁదగు వ్యాఖ్యానముద్రచే నారాయణపారమ్యంబునకై నఖాగ్రస్థధూళీమాత్రంబైన సంశయంబులేదని సూచించు భంగి నెసంగుచుఁ బ్రతిహారునకు దక్షిణభాగమున నిషణ్ణుండును జ్ఞానగరుత్మత్ప్రదర్శనసముత్తారితానేకభవపన్నగవిపన్నజనుండును వరణీతలంబును పత్పథం బనిపింపవచ్చిన ద్యుమణియోయనఁదగువాఁడగుకతన సంసారసాగరతరణియని నుతింపంబడువాఁడును బ్రపన్నజనకూటస్థుండును శఠారియు శఠారినామకుండును నిఖిలవైష్ణవకులాభరణుండును భగవంతుండునునగు వకుళాభరణున కెరఁగి, మఱియు నుభయవి

భూతి ప్రిదానమ్మునం జనియించిన యశోరేఖాయుగళంబనఁడగు సితోర్ధ్వపుండ్రి ద్వితయమును దురితపిశాచాపసర్పణంబునకై ధరించిన కనకవేత్రింబనఁదగు తిరుచూర్ణరేఖయును నిటలతలంబునం దనర, నిజశుచిత్వద్యోతకంబగు శిఖ శిరంబునంజెలఁగ, ఫణిపతిభావంబు మనుజావతారపిహితంబయ్యును హృదయంబునం దిముడక వెలుపలికి వచ్చు తరళతరతత్ఫణామణీరుచియనఁదగు కాషాయశాటిక కటితటంబునఁ దనర హృదయస్థపద్మాక్షసూచకంబు నాఁదగు పద్మాక్షమాలిక యురంబునఁ గరంబుమెఱయ, నిజాధీనమోక్షలక్ష్మీకరస్థిత కమలకుట్మలమనియు, జగదభయరత్నసంపుటంబనియు నెన్నఁదగు నంజలితో విశిష్టాద్వైత మతస్థాపనంబునంబడసిన సధ్వజవిజయస్తంభంబునాఁదగు సజలపవిత్రిదండత్రయంబుతో ధవళతరమృణాలసూత్ర విభ్రాంతిం దెలుపు నుపవీతంబుతోఁ దనరు నుజ్జీవితశ్రీవైష్ణవచర్యుండగు రామానుజాచార్యుం బ్రిణుతించి ప్రిచురసత్వులగు వేంకటరెడ్డి ముఖులతో, ''క్షంతవ్యోమేపరాధ'' యని ధ్యానించుచు వెల్లిగొను సంతోషబాష్పమ్ముల నతిమందప్రిసారితైకైకపదవిన్యాసుండగుచు భగవన్మందిరకందరాభిముఖుఁడై చనునవసరమ్మున. 72

తే. గీ. బెత్తములుచేతఁబూని 'భూవిభుఁడువచ్చె'
నంచురుఘిపించి జనుల వారించుకొనుచుఁ
దనకు గొందఱు భృత్యులు దారిదెలుప
నరిగెఁ గురుమతిపతిగుహాద్వారమునకు. 73

తే. గీ. 'ఇచటనుండుఁడు రాజుగారేగుదెంచి
నారు లోపలఁ జోటులేదు మీరొాదలను
మానుఁ' డని భటులు జనుల మాన్పుచుండఁ
గురుమతీశ్వరుదరికేగె ధరణివిభుఁడు. 74

క. మితపరివారముతో సం
తతము న్విచ్ఛిత్తిలేని నానాదీప

ప్రతతివితతకాంతితిర
స్కృతగాఢతమస్కమయిన గిరిగుహలోనన్ 75

సీ. పదునాల్గులోకముల్ బహునిష్ఠచే నహ
ర్దివమొనర్చినభాగధేయమనఁగ
ముడుపుమూటలుగట్టి మ్రొక్కువారల రోగ
తతులు పాపు మహౌషధంబనంగ
కురుమతిక్షోణీధ్రగుహలోనఁబుట్టిన
లలితమహేంద్రనీలంబనంగ
ముక్కురాన్వయమందుఁ బుట్టుభూపాలకు
లార్జించుకొన్న పుణ్యమ్మనంగఁ

తే. గీ. గారుకమ్ములకెనయు నాకారగరిమ
గలిగి దయచిమ్మురూపంబుఁ గలిగి చెలఁగు
విశ్వభరు దివ్యమంగళవిగ్రహంబు
గాంచె వేడుకఁ గన్నుల కఱవుదీఱ. 76

వ. వెండియు సోమబాలపాలనచతురంబగు నిది నన్నుమాత్రము పాలింపదేయని తలపోసి శరణాగతంబగు సోమబాలరేఖయో యనఁదగు నఖరేఖచే మనోరమంబును సంపుటీకృతంబును నగు పాదయుగంబును ఖగనాథోరస్థలమహాసీమైకావళీహారాయితంబును, హరిచరణంబు మజ్జన్మశరణంబని గరువంబుగాంచిన సురతటిని యతిశయంబు సహింపక పాదజాతయగు నద్దానికన్న నుత్కృష్టంబగు వైశిష్ట్యంబు సంపాదింపఁ గటీతటంబునం ద్విజన్మత్వంబుగాంచిన యమున నాఁదగునదియునగు నూరుయుగళంబును, దానిం గాళిందీభ్రాంతింజేసి చెలియని కౌఁగిలించికొనిన సరస్వతి నాఁదగు పీతాంబరంబును, మదీయ ధరణీధరభూషణం బీమహామహుఁ డని సంభ్రమంబునం బరతెంచి కౌఁగిలించుకొనిన శేషాహి నాఁదగు వజ్రకవచితకటిసూత్రంబును వినిమయకలనంబునందును నామవ్యత్యాసంబు లేని మధ్యమమునకుఁ

దగిన భూషణమో నాఁగఁ దాదృశంబై మనోజ మహారాజమణీవరణ సందేహావహయగు కాంచికచే విరాజమానంబగు మధ్యమంబును, మత్స హజంబగు నీకరంబు వామంబయ్యు భగవద్విజయశంఖాలంకృతం బగుచు నన్నిసడించుచున్నదను నవమానంబునంబోలెఁ గటీతటంబుం జేరి యధోముఖంబగు వామకరంబును, సంసారచక్రచంక్రమణమ్మన ఖిన్నమతులరయి యేలకృశించెద రయ్యయ్యో ఈగిరినున్న మదీయ చరణయుగళసేవ యొనర్పుఁ డని సూచించునదియోయన నధఃకృతా గ్రంబుగా జనుల కభయమొసఁగు నభయ హస్తంబును, జిరకాలము తన బింబాంతరమున నెలకొనియెనను సౌహార్దంబునఁ బరిరంభణంబా చరించుకొనిన భానునికరనికరమో లేక యురోవిరాజమానలోక జననీ కరారవిందస్యందమానపరాగరేఖయో యను సంశయం బొదవఁజేయు నుత్తరీయీకృతపీతాంబరంబును, వియత్తలంబు జననియగు తననాభి కుశలంబు తెలియఁ బుత్తెంచిన వచ్చి నిజోరఃకృతనివాసంబులై మరలఁ జనని తారకలో నాఁదగు నానాఖిలంబమానతారానామకముక్తా స్రజంబులును, నిసర్గతేజంబును ద్రయీశరీరంబునుగల నావలెఁ గళంకి యగు నీచంద్రుండును భగవన్నయనంబ యగుటంజేసి మత్సముం డనఁదగె నేనిపుడ తదురంబునం జనియించి తదౌత్కృష్ట్యంబు సంపా దించెదనని జనించిన నభోమణియో యనఁదగు కౌస్తుభమాణిక్యంబును, దనకుం గల చంద్రోపదర్శంబు తద్భగిని యగు రమకుం దెలిపెదనని యురస్థలం బాశ్రయించి యచటఁ గౌస్తుభంబను దీపంబువలన భయం పడి సమీపముననున్న నాభి గుహం డాఁగఁబోయి యచటను హారీయ నాయకమణిం గని సూర్యుండనుకొని జడిసి పార్శ్వంబునఁ దారావళీ భీతంబయి యటుచనలేక కృశించియున్న తమోరేఖ యనఁదగు రోమ రేఖయు, బాల్యచాపల్యంబున వనమాల నతిక్రమించి యచటఁ దమ యూధముంగానక డాఁగియున్న తిమిరశిశువనిగాని లేక దివ్యవిగ్రహ లవణిమాహస్కరతనయాసముద్భూద్ధంబగు సుడి యనియుంగాని పలు కంబడు పుట్టుమచ్చయును, నేను మిత్రరూపముగలదాన నే నబ్జరూపం

బుగలదాన నీకేల యహంకృతి నీకేల కోపమని కొంతదనుకం గల
హించునవియుంబోలెఁ బ్రత్యేక మజ్జమిత్రిరూపంబు లవలంబించి
చెలఁగు శంఖచక్రింబులచే విరాజితంబగు దోర్దండాంచలంబులును,
బార్శ్వద్వయస్థితలగుచు సవతులగు రమయు. భూమియు నిజవదన
సౌందర్యావలోకనంబునకై కలహింపుచుండ నిరువురను ననునయించు
టకై యిరుప్రక్కలం గట్టుకొనిన ముకురంబులు నాఁదగు కపోలం
బులును, గరిరక్షకా మమ్మనుగ్రహింపుము పిల్లలమని కర్ణంబులందగులు
కొని వేఁడుకొనుచున్న నిజవదనలావణ్యజలనిధిం జనియించిన మకర
శిశువులోయనఁ దగు నిందిరినీల మణిఖచితంబులగు మకరకుండలంబు
లచే మనోహరంబగు గండయుగళంబును, నిజవదనలావణ్యజలధింబడి
విహరించుతఱి నచట నించువిల్కాని రాకపోకలకుం గట్టినగట్టనఁదగు
నాసిక కిరుపక్కల రెండునుఁబడి యొకదాని నొకఁడు మూఁచుకొనమిఁ
జలితంబులగు మీనదంపతులనఁదగు లోచనయుగంబును, సర్వతో
భద్రంబను పేరు తనకుగల్గినను జేదగు తనయాకులకు లోకనాథవద
నారవిందమకరంద సేవనంబునం దీపి కలిపింతునని పిచుమందంబు
మొదటఁ బరీక్షకై పంపిన పర్ణయుగమునాఁదగియు, ముఖరుచి యను
మడుఁగునఁ గస్తూరీతిలకమను చేఁపపిల్లలం గ్రసియింపవచ్చి పరస్పర
లిప్సాజనితకోపమునం గలహింప నుద్యమించి మొగంబులు వంచి
యున్న నీటిపాములో నాఁదగియును, మేము సద్వంశపక్షిభవులము
మీరు గోత్రిభిదుపలంబులరని కర్ణమౌక్తికంబులు పరిహసింపఁగ నైఁ
పక నాసావంశంబున జనియించి యెగిరిపైఁబడి కర్ణమౌక్తికంబుల
తోడం గలహింపుటకుఁ జాలుగట్టి యెదుర్కొను నింద్రనీలంపుమణులు
నాఁదగు కనుబొమ్మలును, మదన వీరస్థాపితత్రిభువనవిజయసూచ
కాగ్రి భాగోభయతోవ్యాలంబిభ్రూపత్రినాసికేతు స్తంభాగ్రశుంభత్తద్
ధ్వజచిహ్నమీనశాబకంబనిగాని లేక కందర్పవీరభ్రూలతా చాపసమా
రోపితనాసావంశాంకురబాణాగ్రిఫలకంబని గాని పలుకంబడి ఫాల బాల
చంద్రుం గళంకిఁగాఁజేయు కస్తూరీతిలకంబును, నిరుపమానసౌంద

ర్యంబు ఘనీభవింపఁజేయుచుండ నిమ్మహామహు నుత్తమాంగంబు కర్ణాధిష్ఠితం బగుచుండఁగఁ గర్ణజనకుండనగు నే నేతత్పథంబున వసింతునే యను నసూయచేఁ దానును నుత్తమాంగవసతి యొనర్చిన సహస్రకిరణుండు నాఁదగు కిరీటంబుచే నుదితరవిమండలాగ్రచుంబితంబగు ఘనాఘనంబుంబురణించుచున్న నక్కుమతీశ్వరు నాపాదమస్తకం బవలోకించి తనివి దీరక గద్గదస్వరంబొదవ నానందబాష్పములుగ్రమ్మఁ బులకాంకురమ్ములువొడమఁ గుతూహలం బుప్పతిల నమస్కరింపుచు నుతియింపుచుఁ గదలని యవయవంబులతోఁ, వ్రాలని కనుఱెప్పలతోఁ, జలింపని మనంబుతో, నద్దేవుపాదారవిందంబులు మనంబున నునిచి ధ్యానించుచు దివ్యాభయహస్తసరభసవిగళత్ప్రసాదకుసుమసముదయుం డగు కతన భక్తాగ్రగణ్యాత్మకూరుపురభూపతి రాజ్యలక్ష్మీశిరంబునం బుష్పాభిషేకం బొనర్పుపగిదిఁ గాని లేక తదీయ శుభఫలబీజావాపం బొనర్చుచున్న భంగిం గాని చూపట్టునప్పరమేశ్వరునకు మరల మ్రొక్కి సబాష్పగద్గదులగు కతన నేమియు ననేరక ధ్యానించుచున్న వేంకటరెడ్డి ప్రముఖులతోఁ గూడ నిట్లని వినుతింపం దొడంగె. 77

సీ. కురుమూర్తిశైలకందరవిహారమొనర్చు
ఫణిశైలనాథ తుభ్యంనమోస్తు
కుర్మశిఖోణిభృద్గుహాలోనవసియించు
హస్తిశైలేశ తుభ్యంనమోస్తు
కురుమతిజ్యాభృద్దరి రమించుచున్న సీ
లాచలాధీశ తుభ్యంనమోస్తు
కురుపతిక్ష్మాదరికందరనున్న శ్రీరంగ
పట్టణాధీశ తుభ్యంనమోస్తు
తే. గీ. భవ్యకరుణాసముద్ర తుభ్యంనమోస్తు
పద్మభవముఖ్యవినుత తుభ్యంనమోస్తు

పరమపురుష రమేశ తుభ్యంనమోస్తు
భవ్యకరిరాజవరద తుభ్యంనమోస్తు. 78

సీ. చతురంగబల మేకగతి సమగ్రప్రభా
వంబుగై కొంట నీవలనఁగాదె
కాళిదాసునిఁబోలు కవులిచ్చుకావ్యక
న్యలనుగై కొంట నీవలనఁగాదె
నవజాతిమణుల విన్నాణంబుగల కోశ
ములనుగై కొంట నీవలనఁగాదె
ఘనమణిప్రాసాదగణములొప్పారు సం
పత్తిగై కొంట నీవలనఁగాదె
తే. గీ. ప్రాభవముగల్గియుంట నీవలనఁగాదె
బంధువిస్తృతిగనుట నీవలనఁగాదె
బహుళముక్కరవంశభూపాలకులకు
శేషశైలేశ కుర్మతిశ్రీనివాస. 79

తే. గీ. నిన్నుశరణంబువేఁడెద నిన్నుఁదప్ప
నితర దైవములను నెన్న నేనెఱుంగ
నన్ను నెప్పుడు సంరక్షణంబొనర్ప
శీతలంబగు నీదయఁ జిలుకవలయు. 80

తే. గీ. తతమతినిగాక నే నింతదనుకఁ జేసి
యున్న పాపంబులన్నియు సున్నజేసి
యింక నే పాపములుచేయనీక మించు
గతి ననుంబ్రోవుమయ్య కుర్మతినగేశ! 81

తే. గీ. నిన్ను నుతియింపనేరని చిన్నివాని
నన్నుఁ జపలుని రక్షింతువన్నధైర్య
సాహసంబులు గొనుటకు సాక్షిగాదె
రక్షితకరీంద్ర నీ ధుర్యరక్షణంబు. 82

చ. రవితనయాచరభ్రమరరాజివిరాజితదేహ దేవదా
నవనుత శంఖచక్రధర నాకుభవాదికపీంద్రనుత్య భూ
భువనధరప్రసిద్ధకురుమూర్తిగిరీంద్రదరీకుటీరమా
ధవ యమృతోపమామితకథావిమలాసమలాలితాఖిలా. 83

మ. మరుదన్నప్రభుమౌళికోటివిలసన్మాణిక్యచారుప్రభా
కిరణాళీచపలాకులారుణకలాకీలాలదాయాదసుం
దరనేత్రద్వయ నూతనద్యుమణిరుగ్దాయాదధామచ్ఛటా
ధర పక్షీశనుతా నతాఖిలజగత్సంరక్షణశ్రీరతా. 84

తే. గీ. రాజశేఖరదేవతారాజరాజ
రాణ్ముఖామరవినుతా! పరాక్రమవిజి
తామరాహిత! భక్తస్థిరానురాగ
రాధితపరాత్పర! వరకుర్మతిగిరీశ! 85

క. మందరగిరిధరకిటివర
సుందరవామననృసింహ శుభకరవదనా
నందకహస్త! యశోదా
నందన! కరిహరణ! నందనందన శౌరీ. 86

ఉ. తారలఁ గేరుగోరులు సుతారముఁజూప రమావసుంధరో
దారసుకంకణారవ మనంత ముదావహమై చెలంగ నా
కారము నీరజంబుల వికారములై టకుఁ బెట్టుచుండఁ జె
న్నారు భవత్పదద్వయ మనారతమున్ మదిలోఁ దలంచెదన్. 87

సీ. ప్రాఁబల్కుజవరాలిరాణివాసముగన్న
మునులు గన్గొనఁజాలుగనివి నీవ
పదితలల్ గలసోఁకుఁ బగసోఁకఁదెగటార్చి
ప్రజలఁగాచిన మగరాజవీవ
రాచయేన్గుల నేలరాచి వారలనల్ల
చెరువుగట్టిన జగాజెట్టివీవ

పదియాఱువేలయెన్మిదిమంది చెలులపై
భుజముసాచినపెద్ద బొజుగువీవ
తే. గీ. మంచుమలచూలుపల్కుటాల్ మరులమగల
కొలుపుగనునట్టి వేలుపుతలవునీవ
యిపుడుమాపాలివేల్పవై యెసఁగితయ్య
గుడుసువాడ్లాల్ప ! పాపరాగుట్టవేల్ప !. 88

చ. అని నుతియించి శ్రీహరికరాబ్జమునం దిడి యర్చకుండు కొం
డనుచు సుమప్రసాద మభయం బొసఁగం దలమీఁదఁ దాల్చి య
య్యనఘుపదద్వయంబు హృదయంబునఁ దాలిచి భక్తిపారవ
శ్యనియతచిత్తుఁడై నయనపారసముల్ ముకుళించియుండినన్. 89

చ. తనపతి సోమభూపతి ముదంబున శ్రీహరిఁ జేరువేళఁ జె
ప్పినవిధమంతయున్ విడిచిపెట్టక పుణ్యమునంద బుద్ధియున్
జనులయెడం దయామతియు సజ్జనులందుఁ బ్రపత్తియున్ దనం
తన దగియున్నలక్ష్మయుఁ దన్నుతిసేయఁదొడంగె నత్తఱిన్. 90

మ. మిగులన్ నీవు దయాస్వభావుఁడవు లక్ష్మి పుత్రుఁడోనాఁబ్రసి
ద్ధగుణోపేతు భవత్కుమారకుని సీతారామభూపాలు బ్రో
వఁగదే శ్రీపతి ! ప్రోవకున్న సిరి కోపస్వాంతయౌఁజుమ్మి; పె
ద్దగదా భర్తలకన్నఁ గాంతల కపత్యప్రేమ లోకంబునన్. 91

తే. గీ. జలజలోచన ! మున్ను రక్షఃకుమార
చంద్రహాసధ్రువాదిరక్షకునినిన్ను
దివిరి మాబాలు నేలుమా దేవ యనుట
నాతి నగుటనుగాని యన్యంబుగాదు. 92

వ. అని నుతియించి పిమ్మట జగన్మాతయగు లక్ష్మినుద్దేశించి.

తే. గీ. సోమునకుఁ దోడఁబుట్టిన సుదతివీవు
సోమభూపాలవరునకు సుదతి నేను
గానఁ జుట్టాలమగుమమ్మఁ గరుణఁజూచి
యిందిరాదేవి మాబాలు నేలుమమ్మ. 94

సీ. వలరాజునందుఁ గల్వలరాజునందుఁ గ
　　　　ల్గినసకూర్మి వీని రక్షింపుమమ్మ
కలవాని వేల్పుమూకలవాని నిరసించు
　　　　సిరియిచ్చి వీనిఁ బోషింపుమమ్మ
తులలేమియును నరాతులలేమిగల రాచ
　　　　రికమిచ్చి వీని భరింపుమమ్మ
కనికరం బర్థిరాఁగని కరంబర్థిఁగాఁ
　　　　జేయించి వీనిఁ గై సేయుమమ్మ
తే. గీ. సకలనరపాలవందితచరణుఁడై న
సీతనూజుని కెసఁగు లక్ష్మీతనూజ
నామమది సార్థకముజేసి నామనంబు
మోదరత్నాకరమ్మున ముంచుమమ్మ. 95

సీ. భయములేదని యొక్కపల్కు పల్కినఁజాలుఁ
　　　　బాకారిసిరి తృణప్రాయమనఁగ
అతిభక్తిగలదంచు నాదరించినఁజాలు
　　　　ధనదునిసిరి యదెంతటిదనంగ
నావాఁడవని పేర్మిచేవఁజూపినఁ జాలుఁ
　　　　బశుపతిసిరి గడ్డిపరకయనఁగ
మనసుదీరఁగ నొక్కమాఱు చూచినఁజాలుఁ
　　　　గురురాజుసిరి గోటికొనయనంగ
తే. గీ. విశ్వజనయిత్రి నీకు నాబిడ్డయందుఁ
గరుణగల్గుటకావలెఁగాని నీబ
లంబుగలవాని కేమిలోపంబు తల్లి!
భార్గవీ! నీకుఁ బదివేల వందనములు. 96

వ. అని నుతియించుచున్నంత. 97

క. ననుఁజూచెను ననుఁజూచెను
ననుఁజూచెను నన్నుఁజూచె నాభాగ్యంబే

మని యందఱుఁ దామనుకొనఁ
గనె నందఱ శౌరి కరుణగలచూపులతోన్. 98

క. నీరాజనంబునకుఁ గ
ర్పూరము వెలిగించి తెచ్చి పూజారియుఁ గై
వారమొనరింపుఁడన సీ
తారామనృపాలముఖులు దద్దయుభక్తిన్. 99

ఆ. వె. కనుల నద్దుకొనిరి కన్నులు చల్లగాఁ
జేసి ప్రోవుమయ్య శ్రీసతీశ !
సకలలోకరక్షణకలాచతుర ! కుర్మ
తిగిరివాస ! దేవదేవ ! యనుచు. 100

వ. ఇట్లు నీరాజనంబునకు నమస్కరించి.

సీ. భృత్యవర్యులు కొంద ఱిదిదారి యిదిదారి
యంచు మార్గమ్ముసూచించుచుండ
అడుగడ్డునకు మాధవావతారంబు క
న్దోయిఁగట్టినఁయట్లు తోఁచుచుండఁ
గరితురంగమసటాకలితభూరణ మభ్రి
మణిహయంబుల రంగు మాన్పుచుండ
'జయమహారాజరాజ్యంశాధి'యని వంది
జనులు కైవారంబు సలుపుచుండ

ఆ. వె. ధన్యజన్మమైన తల్లితో బాంధవ
ప్రితతితోడ సుకవివితతితోడ
సోమభూమిపాలసుతుఁడు కుర్మతిగిరీం
ద్రిమ్ము డిగియెఁ గడుముద మ్మెలర్ప. 102

తే. గీ. ఇట్లు డిగి భక్తజనముల యెసకమెల్లఁ
బరఁగనరయుచు నరిగి యంబాపురంబు
నందలిభవనమున కేగునంతలోన
నభ్రిమధ్యంబునకు వచ్చె నభ్రిమణియు. 103

తే. గీ. భోజనముచేసి యారాజపుంగవుండు
గాయకులగానములు సుహృద్గణముతోడ
వించు హృదయాంబుజము పల్లవింప రమ్య
హర్మ్యతలమున విహరించె నతిశయముగ. 104

— గ ద్య —

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
నాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాసమ్మునం
చతుర్థాశ్వాసము సంపూర్ణము.





శ్రీరస్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# శ్రీనివాసవిలాసము

## పంచమాశ్వాసము

తే. గీ. వాయువేగమ్ముగగ్గెడివారువముల
నెక్కి యిర్వురు సాహిణు లెసక మెసఁగ
నలరుధరణీధవునకు నంజలిఘటించి
పలికి రిట్లని సంతోషభరితులగుచు.

వ. దేవా! సావధానమనస్కుండవై యాలకింపుము. భవదాజ్ఞాప్రకారం బున మత్స్వాగతజనంబుల నరసివచ్చితి మస్మన్మత్యనుసారంబుగాఁ జూచినంతవట్టు విశేషంబు లెఱింగించెద మెట్లనిన, శ్రీనివాసచరణార విందసందర్శనంబునకై బృందబృందమ్ములుగా ననేకదేశమ్ములనుండి వచ్చిన ప్రజ లొకరిమొగ మొక రెఱుంగనికతనఁ బరదేశభాషాదుల నిందించుచు స్వదేశభాషాదులం బ్రశంసించు కొనుచుండిరి. మఱియును ధవళోత్తరీయప్రావృతమస్తకులును వసనగ్రంధికలిత వామకక్షులును బ్రహ్మవర్చసవిప్రులునునగు విప్రు లనేకులు వచ్చుచుండిరి. మఱియును గొందఱు తాము ముందువచ్చి దిగినచోటు మఱికొంద ఱాక్రమింప నుచ్ఛృంఖలమ్ముగాఁ గలహించుచుండిరి. మఱియు నొక్కబజారునఁ గొందఱు పద్మినీవల్లభకరంబులు పుండరీకంబులంబోలెఁ బటమంట మ్ముల విస్తరింపఁజేయుచు నుద్యోగు లుద్వృత్తవిపక్షులంబోలె ధాన్య పరిపూరితమ్ములగుగోనులను వృషభమహిషమ్ములనుండి పడఁద్రోయు చుండిరి. కొందఱు తండులమ్ములు రాసిగాఁ జేసికొని 'యోహో' జను లారా! ఇటురం డిటురం డంతకన్న నే నెక్కుడుగా నిచ్చెదనని చేతు లెత్తి పిలుచుచుండ మఱికొంద ఱంతకన్నను మేమెక్కు డిచ్చెదమని బొబ్బవేయ మరలిపోవు క్రాయికులను మొదటివా రంతకన్నను నెక్కు

డుగా నిచ్చెదమని పిలుచుచుండిరి. మఱియొకచోట మీకుఁ బృథుకా కృతిం గాంచెదము మమ్ము మర్దింపకుఁడని యాక్రోశించుపగిది సద్యో భర్జితంబులగుకతన నులూఖలాంతరమునలోఁగ్రిఘట్టనంబునఁ జుంకారం బొనరించు వ్రీహులను నివియుఁగూడ మనలఁబోలెఁ బృథుకంబులే యను సంతసమ్మునంబోలెఁ జలించుచున్న స్తనంబులంబొల్పు శృంగార వతులు మర్దించుచుండిరి. వేఱొక్కయెడ నాపణికాంగన లీహారిమండ కమ్ములు కఠినస్వభావంబులను గోపమ్మునంబోలె వేచి వినరుచుండిరి. మఱియొక్కచోటఁ గొందఱిఖిపాకంబీయుఁడని యడుగఁ గొంద ఱాప ణికు లాబాల్యాశిక్షితచాటువచనులగువారిం గాంచి పృథులగుడంబు కావలయునేయని యడుగఁ దద్వచనశ్రవణమాత్రపలాయమానులగు నవ్వారింగాంచి సహస్తతాళమ్ముగా నపహసించుచుండిరి. 2

సీ. ఒకచోట శర్కరనొసఁగుమంచును గొంద
ఱడుగ శర్కరలేనియట్టియొక్క
వర్తకుం 'డిదియేమివైఖరి యినుము కా
వలెనే' యటంచునవ్వంగ వారు
'కాదోయి సిత మాకుఁగావలె' ననుటయు
గోధూమపిష్టాళి గొని 'సిత యిదె'
యని చూప వారును 'నౌరౌర యిటు మోస
పుత్తువే యిప్పని భూపుతోడఁ
తే. గీ. జెప్పెద' మటన్న, నవ్వాఁడు 'సితయె కాదొ
కనుఁగొనుఁడు ప్రాజ్ఞులరు మీరు కనులులేక
యున్న వేఱొక్కరికిఁజూపు కొన్నఁదెలియు'
ననుచుఁ గలహింపసాగె నోయపసపాల. 3

సీ. ఒకచోటఁ బణ్యవీథిక నెన్నఁదెఱుఁగని
ఛాందసుండైనట్టిష్మసురుండు
వచ్చి హింగువు గోర, వర్తకుండొకఁడు ర
మ్మనుచు సురామయమైన మా దు

కాణముసం దేదికావలెననఁ గర్ణ
ములు మూసికొనుచు విప్రుఁడు కటకట
యనుచు నిష్ఠీవనంబాచరించుచు జంధె
మును నివీతముఁజేసికొనుచు నెన్నఁ
తే. గీ. దేవి రాని బజారునకేల వచ్చి
తిని సురామతమఁట యిది, దీనికేమి
నిష్కృతియొ యంచు దాని నిందించుచున్న
నతని నాడింపసాగి రోయవనిపాల! 4

వ. మఱియొక్కచోట మహాజనసంఘపారావారతురంగతరంగకౌతుకసమాగతరంగ దుత్తరంగ గంగాయమునాసరస్వతీభ్రాంతివల్లి కామతల్లికోప ఘ్నాయిత క్రియవిక్రయికానీతసముద్వేల్లన్మాంసలతరధవళనీలశోణవర్ణ మాహాక్షౌధ్యక్షంబులు లక్షలకొలఁదిగ నక్షీణాక్షిక్షణదానదక్షమ్ములై తనరారుచుండె. 5

సీ. ఒకచోటఁ బటమందిరకలితమ్ములగు సం
చులను విప్పుచుఁ గట్టుచునుజెలంగు
నట్టి వర్తకు లిచ్చునట్టి మాంజిష్ఠాది
వస్తువుల్ గొనుచున్నవారిరొదయు
సౌవర్ణతంతువిస్తారితరాంకవా
దికపటపటలమ్ములకునయి తగ
వందలకొలఁదిగా వచ్చెడిజనముల
కోలాహలమ్ముసుగూడి కొండ
తే. గీ. దరుల వ్యాపించి యటనుండు తపసులకును
గర్ణనిర్భేదనమొనర్పఁగా బయటికి
వచ్చి వారు మహాశ్చర్యమచ్చుపడఁగఁ
దలలనూచుచుఁ జూతు రుత్సవము నధిప. 6

సీ. కొండనెక్కెడివారు కొండనుదిగువారు
దేవున కెరఁగి నుతించువారు

పరుగెత్తువారును బడువారు తమయంత
లేచువారును వారిఁ జూచువారు
ఘోషించువారు సంతోషించువారు ర
మ్మనువారు నటనుండుఁడనెడివారు
ఫలములు గొనువారు పంచదారను గొను
వారు కీర్తనములఁ బాడువారు

తే. గీ. దానములొసంగి సుకృతమ్ముఁ బూనువారు
శ్రీనివాసాన్యమెఱుఁగక చెలఁగువారు
నైనజనసంఘములచేత వ్యాప్తమగుచుఁ
గొండ కన్నులపండువై యుండెనధిప. 7

సీ. పటమంటపములు ముప్పదివేలకెక్కుడు
వృషభంబులవి వేనవేలసంఖ్య
నశ్వమ్ము లొకలక్షయయిన నుండకపోవు
చేలముల్ లెక్కింపఁజాల మేము
రూప్యరాసులను నిరూపింపఁగారాదు
భక్ష్యపుంజములఁ జెప్పఁగఁదరంబె
తండులరాసులు తండోపతండముల్
రసవస్తువుల లెక్క రాదు చక్క

తే. గీ. నెచటఁ జూచిన వర్తకు లెచటదృష్టి
నించినను వస్తుజాతమ్ము లెంచఁదరమె
చనికనీనదేవరఖను విశదమకాదె
భూమి యీనినయట్లుండె భూపతిలక. 8

క. కల్లలుగావు నవోదన
ముల్లసిలఁగ భాండములు మహోన్నతగతిఁజా
బ్బిల్లఁగ నద్రిప్రాంతము
చుల్లీమయమయ్యె భూప ! సుందరరూపా. 9

సీ. మార్దంగికధ్వానమాననీయంబులై
తాళారవానుబద్ధమ్ములగుచు
వల్లకీనాదసంపత్తిరమ్యమ్ములై
తానప్రతానచిత్రమ్ములగుచు
మాపనీయామానగానగమ్యమ్ములై
ఘటవాద్యరవసముత్కటములగుచు
ముఖవల్లకీనాదముఖరవయుతములై
బహుళవై దేశికస్వనములగుచు
తే. గీ. తత్తదనుగుణరీతిఁ జిత్తమున కతుల
గతుల సంతసమొసఁగుసంగతుల నెఱిఁగి
పాడి యాడంగ నేర్చిన ప్రోఁడలున్న
వేశవాటములవి వేనవేలు భూప! 10

చ. ఎవఁడవు నీవటంచు వచియించెడివా, రెవఁడంచుఁబల్కఁ నీ
కవసరమేమి పొమ్మనుచు వాడెడివారును, దారియిమ్ము మే
మవలకుఁ బోవఁగావలెనటంచు వచించెడివారు, నాపయిం
గవయకు మదిగ్రి పెద్దదియ కా యటుపొమ్మనువారు భూవరా! 11

చ. నగలివి చూచుచుండుఁడని నమ్మికచేఁ దమ కిచ్చిపోవ నా
నగలను గొంచు వారు చనిన న్నగలిచ్చినవారు వచ్చి మా
నగలని యేడువందొడఁగినం గని మ్రుచ్చులఁబట్టితెచ్చి యా
నగల నొసంగుచుందురు జనమ్ములు విన్న నుతింప భూవరా! 12

చ. పనిగొని యట్కలన్ సెనగపప్పు నపూపములున్ ససంభ్రమం
బునఁ దినువారు కొంద, ఱనుమోదమునన్ సుర త్రావి త్రావి భూ
మినిబడి మాటికిం బొరలి మేనుతెలుంగక కారుమాటలన్
వినఁ గొలగావిరీతిఁ బలవించెడువారును గొంద ఱో నృపా! 13

సీ. పన్నెపూల్ సిగనిండ నల్లిబిల్లిగఁజుట్టి
విడెము పుక్కిటనిండఁ గడలుకొల్పి

తనువెల్ల మంచిగంధమ్ముగాఁ గయిసేసి
చలువబట్టలు పొల్పెసంగఁదాల్చి
యొకరికే లొకరికే లొకటిగాఁగిలించి
సుందరీమణులపైఁ జూపునించి
యన్నికార్యములు నట్టడవిలో దిగడించి
చాంచల్యమును చిత్తసరణిఁబెంచి

తే. గీ కులకుగుబ్బలజవరాంధ్రగుంపులోని
కరిగి యారాటుపోటుల కాగి నిక్కి
నీళ్లి విహరించుచున్నట్టి నీటుకాంధ్ర
వర్ణనముసేయ మేమెంతవార మధిప! 14

చ. కురుమతిపర్వతేంద్రమునకుం బ్రణమిల్లుకతమ్మునం దమోం
కురములు వీడుభంగి మఱికొందఱు ముండితమూర్ధమొప్పఁ బు
ష్కరిణి మునింగి "పాహి మునిసన్నుత దేవ ముకుంద" యంచు ను
స్థిరమతులై భజించుచును జేరిరి కొండకుఁ బార్థివోత్తమా! 15

చ. నరవర యేమిచెప్పుదు మనారతసంఘవిధుక్షితంబు పు
ష్కరిణి తదంబుపాన మవగాహనము న్నిరసించువారి క
క్కురుమతినేత శాస్త్రియొడఁగూర్చు 'నెఱుంగము పాహి నో' యనం
గరము ననుగ్రహించుఁ గరుణావరుణాలయుఁ డాతఁ డెట్టిఁడో! 16

ఉ. దేవునిఁ జూచువేడ్కఁ జనుదెంచినవారు సహస్రజిహ్వాలం
దేవరవారిపుణ్యము గణింతు, రదేమన నీదృశత్వసం
భావితుఁడైన శేషగిరివాసుఁడు కుర్మతి నాయకుండు సం
భావనఁజేసి మిమ్ముఁ బరిపాలనఁజేయుటఁగాదె భూవరా! 17

చ. పలుకులు వేయునేల, రవి పశ్చిమదిగ్ధరణీధరావని
స్థలనికటమ్ముఁజేరెడు లసద్గతి శ్రీపతిపాదుకోత్సవం
బలవడువేళయయ్యె నెలవంచు సలామొనరించి యేగి రు
జ్జ్వలతురగాధిరూఢులయి సాహిణు లాహరిసేవఁజూడఁగన్. 18

చ. సనకసనందనాదిమునిసత్తము లెవ్వని పాదుకాద్వయ
మ్మును బనిఁబూని చేరి భవము న్బెడఁబాయఁగ నెంతు, రట్టిదే
వుని వరపాదుకోత్సవముఁబొల్పుగఁ జూడఁగ నిచ్చ పిచ్చలిం
ప నృపతి కుర్మతీశ్వరుని పర్వతసన్నిధి కేగనెంచుడున్. 19

క. కరులును హరులు పదాతులు
ను రథమ్ములు మెఱయఁగా ననూనపరిమదా
కరమై నరపాలకుని చ
తురంగబల మేగుదెంచెఁ దుందుడుకుమెయిన్. 20

క. లలితమ్ములు సాదికరో
చ్చలితమ్ము లురశ్శిరఃపరిసారణవిలస
ద్వలితమ్ములు కలితమ్ములు
బలితమ్ములునైన కరులు బహుముదమొసఁగెన్. 21

క. ఖురగోపసమా మనకని
శిరమున్ దగవంచి చింతచే సూత్కృతులం
బరపు చయశము విడుచుగతి
ధరఁదిర్వెఁ గులీనతురగతతులు ఖురములన్. 22

క. అంజనగిరిసమ మరికరి
భంజనమున్ మంజులమును భదిమునగు మే
లు్కుంజరము నెక్కి భూపతి
కంజనయను జూచువేడుకం జనె గిరికిన్. 23

తే. గీ. కరివరములు పదాతులును రథములును
గురుమతిగిరీందిపతిసేవ కరుగుచున్న
నరపతికి ముందు నడచె సుందరతరముగ
నచ్చపుచ్చమ్ములైనట్టి హరివరములు. 24

తే. గీ. అగము చనుదెంచుచున్నదోయమ్మలార
యనుచు గజమునుజూచి భాింతినివహించు

నొక్క గ్రామాంగనను జూచి, యొక నిషాది
నాగ యని పల్కి నగియె విన్నాణముగను. 25

క. సరసిజనయనోత్సవముం
బరికింపఁగ వచ్చినట్టి బహువిధజనులం
బరికించుచుఁ బుష్పితగిరి
వరనికటమ్మునకుఁ జేరెఁ బార్థివుఁ డంతన్. 26

చ. సలలితరీతి నాట్యములు సల్పుచుఁ బాడుచు నీలలోలదృ
ష్టుల నిగుడించుచు న్నగడు సుందరులౌ వెలయంచయానలం
గలయఁ గనుంగొనెన్ నృపతికాంతుఁడు కుర్మతిసన్నిధిన్ మహో
జ్జ్వలతరమంటపోపరిలసన్మణిపీఠసుఖోపవిష్టుఁడై. 27

వ. ఇట్లు భూపాలప్రముఖులు నిర్భరానందదంతురితాంతరంగులై యట
నుండునెడ. 28

చ. అలకురుమర్త్యగేశుమహిమాతిశయం బది యావహింప ని
మ్మల మఱికొంద ఱాడుచును మ్రొక్కుచుఁ జేతులనూచుచున్ గిరి
స్థలమున గండశైలముల సారసలోచనునొద్దఁ బణ్యావీ
థుల మఱియచ్చటచ్చటను దోరముగాఁ దిరుగాడిరెంతయున్. 29

క. ఎఱిగియు నెఱుఁగవిగతిఁ గొం
దఱు బంధుల విడచి రాజు దర్శింపక మై
మఱచియుఁ బలుకక గౌరవ
మెఱుఁగక తిరుగాడసాగి రేమనవచ్చున్ ! 30

సీ. విడిపోయి మాటికి విప్పుపైఁ బొరలాడు
కురులజార్మడి వైచుకొనుటమాని
దిగజారి కాళ్ళకుఁ దగులుకొనెడి పైట
కులుకుగుబ్బల వైచుకొనుటమాని
చిందరవందరై క్రిందుమీఁదునుబోవు
హారమ్ములను జూచుటైనమాని

చెమట యేరై పాఱఁ జెదరి కొలువగట్టు
బొట్టును సవరించుపూన్కి మాని

తే. గీ. నర్తనం బభ్యసించుచందంబుదోఁపఁ
గులటలనుబోలి లజ్జనుగోలుపోయి
యధికతరమైనయావేశ మావహింప
నెనసియాడిరి తగుకుటుంబినులుగూడ. 31

వ. ఇట్లుభగవన్మహామహిమావేశంబున నొడలెఱుంగక పొరలాడు జనులం గాంచి యెవరేని వీరలు విడంబనార్థమ్ముగా నిట్లొనరింతురుగాని యిట్టి భగవన్మహిమ కలుగునా దబ్బరయని తమలోఁ దమ రనుకొన్నయంత మాత్రిన వారును భగవన్మహిమావేశంబున, 32

చ. వెనుకటివాగికన్నఁ బదివేలమడుంగులు గొప్పగాఁగ న
ర్తనమొనరించుచు న్మదపరాధముసైఁపు మటంచు గండతా
డనమొనరించుకొంచు నకటా యిటులెన్నఁడు చేయమంచు న
య్యనఘుని మ్రొక్కసాగిరి తదద్భుతదివ్యమహత్త్వమెట్టిదో ! 33

తే. గీ. కొంద ఱిలువీడినది మొదల్కొనియు గంతు
లిడుచుఁ బుష్కరిణింజేరి, యేదియో మ
ఱచినటుల వెన్కకేగి మరలయు వచ్చి
యుబ్బుచును నొక్కక్షణకాల మూరకొందుర్రి. 34

ఉ. పాపములార : మాపయికిఁ బాఱఁగఁబోకుఁ డటంచు మీఁదికిన్
రేపెడుభంగి జేతులను నింగికిసాచుచుఁ గొందఱున్, జగ
ద్వ్యాపకుఁడీతఁ డీయనఘుదాఁటినవేలుపులేఁడటంచు వే
చూపెడుభంగి శీర్షములు చొప్పడఁద్రిప్పుచునుందుర్రి కొందఱున్. 35

ఆ. శ్రీనివాసుసేవఁజేయ నుచ్చైర్గతి
యెసఁగునవెడిభంగి నెగురువారు
శ్రీనివాసునిందఁజేయ నధోగతి
బరఁగునసెడిభంగిఁ బడెడువారు. 36

తే. గీ. కురుమతిగిరీశునుత్సవం బరయవచ్చి
నట్టిజనములత్రేగున కాగలేక
యిల యొడలు కదలింపఁగా నెగిరి పడిన
భంగిఁ గొందఱు పొదలిరి భక్తులపుడు. 37

తే. గీ. శ్రీనివాసుని భక్తులమైనకతన
దండపాణికినజితము దండపాణు
లమగుద మనుచుఁ దెల్పెడియట్ల చేత
దండములు పూని రందుఁగొందఱుజనములు. 38

వ. మఱియు నిశ్వాసశ్వసననిగళమ్మునకై శ్రవణవల్మీకమ్ములనుండి బయలువెడలి గరుడధ్వజమహిమావేశజనితసాధ్వసమ్మునంబోలెఁ గంపించుచున్న కృష్ణాహికన్యకలనాఁదగు ప్రతిక్షణకంపితభ్రూలతలచే జనులకు భయహర్షంబులంకురింపంజేయుచు భక్తు లిటునటు తిరుగునంతట నలుదెసల దృష్టి ప్రసరించునంతవఱకు గుంపుగుంపుగా భగవన్మహిమాతిశయమ్మున నెగిరిపడుచున్న జనులచే నిబిడితమ్మగుకతన రమాకాంతుమహిమ నూహించి యూహించి భూమియుఁరోమాంచంబునం బొదలెనో నాఁ జెలువారుచుండ, నీదృశోత్సవసందర్శనమ్మునఁ దామును నావేశితమ్ములోయన భేరీపటహపణవహూణవాద్యకాహళాదులు సింహనాదంబులంబోని సమగ్రధ్వానంబుల నెసంగుచుండఁ దామును నావేశితమ్ములో యనఁ జామరోత్కంపవసనపతాకాపటలమ్ములు గంధవాహాందోళితంబులై కదలుచుండ, సర్వంసహయయ్యు జగదీశదివ్యావేశంబు సహింపనేరక మీఁదికెగిరిపోవు వసుమతియోయన ధూళికాపాళికలు ప్రబలుచుండ, మునుముందు కురుమతిగిరిదనుకం బరుగిడి శ్రీనివాసపాదుకాసమాశ్రయణంబుదక్క ధరణీభృదాశ్రయణం బనుచితంబని తలంచియోయన మరలి పాదుకలదనుక పరుగిడివచ్చు నావేశితజనమ్ములచేఁ బరివృతంబును, శ్రీనివాసదివ్యపాదారవిందయుగళీసమర్పణమ్మునకై తదనుగ్రహవర్ధమానమ్మగు వర్ధమానాఖ్యగ్రామమ్మునునుండు భక్తవరునిచే యథా

విధినిర్మితంబును, తచ్ఛిరోధృతంబును, సమగ్రజనభవపాశజడిమవిద
ళనచణుండగు మదావళవరదుని పదారవిందయుగళంబును నిరంతర
భవపాశిసమాఖ్యయును జడాధినాథత్వంబునుగల నన్నుఁబరిపాలించు
నని నిరంకుశవిశ్వాసమ్మున వరుణుం డభ్యర్థనోపాయనమ్ముగా నంపిన
నిష్కరాశియుగళంబనఁ దద్దిశాభాగానీయమానంబును, జలనిధిసుతా
తనులతానితాంతకాంతి నపహరించి ఘనదుర్గం బాశ్రయించి బలరిపు
మణిసఛ్ఛాయ రమానివాసదివ్యవిగ్రహరుచిప్రాప్తవిగ్రహచ్ఛేదబహు
ధవళంబగు నద్దానితోఁగూడ నేతత్పదారవిందయుగళంబుకన్న నన్య
శరణంబు లేదని ద్వేధాభూతంబై శరణుజెందిన విద్యుల్లతామండలం
బనఁదగికాని లేక నన్నజస్రవిష్ణుపదాభరణమ్మగాఁ జెప్పుచుందురు
తత్పదారవిందంబాశ్రయింపని నాకిది యుచితంబుగాదని నిరంతర
తత్పదయుగళోదగ్రభూషణద్వంద్వరూపంబు ధరియించి యిదియేమో
కనుఁగొందునని శంకితుఁడై యూర్ధ్వభాగమ్మనుసరించి వచ్చు
చంద్రునిచే రమణీయంబగు సహస్రకిరణమండలంబు నాఁదగుగాని,
ధవళతరవితానరమణీయోర్ధ్వభాగకాంచనసూత్రకలితంబును, శ్రుతియు
గళీమకుటీద్వితయాలంబితమ్మునునగు శ్రీనివాసుపాదుకాయుగళంబును
విలోకించుచున్న మానవులయు, వసుంధరాధురంధరప్రముఖులయు
హృదయంబులు సురకార్యం బాచరించి వచ్చిన జానకీహృదయానంద
నుండగు దశరథనందనుదివ్యపాదుకాయుగళంబు బురస్కరించుకొని
యెదుర్కొనుచున్న సాకేతనగరవాసులయు, దానింజూచుచున్న విభీష
ణాదులయు హృదయంబులంబోలె నానందబంధురంబులై చెలఁగెఁ
నీ యానందంబు వర్ణింప మహాకవి వచనమ్ములకును నసాధ్యం
బై యుండు. 39

శా. వ్యాసోద్దాలకశౌనకప్రముఖు లేపాదాద్వయిం జూడఁగా
నాసల్ చెంది తపమ్ముఁజేసి తుదకుంబ్రాపింతురో యట్టిశ్రీ
వాసాంఘ్రిద్వయరక్షల మ్సురవరాపాప్యమ్ములం గాంచి యెం
తోసంతోసముఁజెంది రందఱును దత్స్తోత్రక్రియాధుర్యులై. 40

శా. పాతివ్రత్యముపట్టుఁగొమ్మ కరుణావారాశి బుద్ధిక్షమా
చాతుర్యంబుల కెల్ల సోమధరణీశానార్ధదేహంబు తా
నోతల్లీ! హరిపాదుకా! సదయవై యెక్కింతరక్షింపుమా
సీతారామనృపాలునంచు వచియించెంబేర్మినిండారఁగన్. 41

శా. ఓతల్లీ! హరిపాదరక్షవని నిన్నూహింతుఁ లోకంబు లీ
వేతన్మాత్రమకాక మానవసుపర్వేశానముఖ్యామర
వ్రాతంబున్ దయంబ్రోచుచుందు వతిచిత్రింబంచుఁ గేల్మోడ్చి యా
సీతారామనృపాలకుండు నుతియించెం బేర్మిదైవాఱఁగన్. 42

చ. భరతుని శౌరిపాదయుగబద్ధమనస్కుని రాజ్యమిచ్చి మున్
గరుణదలిర్పఁబ్రోచినప్రకారమునన్ మమునేలు సోమభూ
వరసుతు సర్వభూమిపతివంద్యు నొనర్పుచుఁబ్రోవుమా దయా
భిరతినటంచుఁ గేల్మొగిచి వెంకటరెడ్డి నుతించె నెంతయున్. 43

తే. గీ. కురుమతీశ్వరుపాదపుష్కరసుహృత్త్వ
గరిమ గను ధామనిధిని నిన్గాంచి జనులు
హృదయగుహాగల తమమును నీసడింత్రు
చిత్రమని పాదుక నుతించెఁ జెలఁగియొకఁడు. 44

తే. గీ. అహహ మహదాశ్రయంబు నీ కబ్బుకతనఁ
గాదె బ్రహ్మాదిదేవతాగ్రణుల మకుట
తటము లెక్కుచునుందు నిత్యమునటంచు
శౌరిపాదుక నొక్కఁడు సన్నుతించె. 45

చ. హరి యటులుండుఁగాక మమునారసిప్రోవఁగ నీవ దిక్కుసు
మ్మరయ జగత్త్రయీపావనమహామహిమమ్మునఁబొల్పుశౌరి త
చ్చరణయుగావనమ్మునకుఁ జాలినమేటివి నీవటంచు న
త్తిరుమలరాయఁ డంజలివిధించి నుతుల్పచరించెఁబాదుకన్. 46

కవిరాజవిరాజితము.

అనుదినమున్ హరిపాదయుగమ్మున నంటిచెలంగుచుఁ గంటకబా
ధను నిరసించుట యుక్తముకాని సదా నినుఁ గొల్చెడివారి మనం

బునఁ గలకంటకముల్ హరియించి సమున్నతిఁ గంటకముల్ తనువె
ల్లనుబొనఁగించెడు పాదుక ! బల్విరలంబిది యంచొకఁ డెంచెనొగిన్.

తే. గీ. అంబ ! నీచే సపదరక్షఁడైన జగద
ధీశ్వరుండు పరముఁడయి యెసఁగుచుండ
దైత్యులెల్ల విపదరక్షతనుభజింపఁ
బాదుకా ! హేతు వేమని పలికెనొకఁడు. 48

తే. గీ. ఇట్లు తన్నెల్లఁను నుతియించుచుండఁ
గలితతూర్యస్వనమ్ములు గడలుకొనఁగఁ
బార్థనారక్తులయినట్టిభక్తులెల్లఁ
దోడఁరా గిరికేగెఁ బాదూయుగంబు. 49

క కురుమతిగిరిపతివరపతి
చరణాసక్తుఁడగుభక్తసత్తముఁ డొకఁ డా
హరిపాదుకలను శిరమున
ధరియించి రయమునఁ దెచ్చెఁదత్స్థలమునకున్. 50

చ. సనకసనందనాదిమునిసత్తమసేవ్య మనంతకాంతియుం
గనకమయంబునున్ సుజనకామదమున్ వరముక్కరాన్వయా
గ్రణియగుసోమభూపసుతుఁ గామము విచ్చి యనుగ్రహించుక
ల్పనగము పాదుకాయుగము పర్వతిమం దొగి నిల్పెనాతఁడున్. 51

శా. ఆవేశమ్మునుజెందియాడుచు మహోద్యద్రావముల్ సేయుచున్
దెవేశాఁఘ్రులనెంచు భక్తజనులెంతే వెల్లెడఁ మీఱఁగా
నావేశమ్మునుజెంది వారివలె నాట్యప్రక్రియ న్బొల్చె నా
శ్రీవాపాశ్రియమైనభూమిధరమున్ జెన్నారె విన్నాణమై. 52

క. శక్రాదివినుతమగు హరి
చక్రము పుష్కరిణిఁజేరి చయ్యనఁ బూజా
ప్రక్రియలనొప్పఁగా గ్రహ
చక్రాధిపుఁ డరిగెఁ బరమశైలమ్మునకున్. 53

తే. గీ. అలసుదర్శనముంజూచి యఖిలజనులు
ముంచుగా మోదవార్ణిధి మునిఁగి రంత
నరుణుఁడు నహస్తతాపుఁడై చరమవారి
రాశిలోన మునింగెను రయమెలర్ప. 54

మ. మును మన్నామకు సైంధవుందునుమ నంభోజాప్తునిం గప్పి తా
ననుకూలక్రియ నొప్పెఁజక్రమిది కట్టాయంచు లోనెంచి దా
నిని గెల్వఁగమకించియోయనఁగ నెంతే నగ్రిపాదద్వయ
మ్మును బైకెత్తిచెలంగె సైంధవము కుర్మ్యార్తీశుద్వారమ్మునన్. 55

క. అరియను నామంబూనియు
నరికర్శనమయి చెలంగు హరిచక్రము సుం
దరమగుకుసుమతిగిరికం
దరమునకుంజేరె భక్తతతి నుతియింపన్. 56

ఉ. యామినియన్వెలంది యుడుహారముల న్మెడఁదాల్చి కౌముదీ
క్షౌమముగట్టి శౌరికి రకమ్ముగఁ దాఁ దిలకమ్ముదిద్దఁగా
రామగు నర్ధచంద్రుఁడను రాజతపాత్రిఁ గళంకమున్గురం
గీమదమూని వచ్చె హరికిం బరిచర్యయొనర్పుటబ్రమే. 57

క. తాదృగ్రక్షోగణశ
త్రూదారోత్సవమునందునొగి దుందుభి నా
నాదిగ్వ్యాప్తనిజధ్వని
మోదంబొనరించె జనసముదయంబునకున్. 58

క. మానుగఁగోణాహతినెం
తేనిన్ మధ్యస్వరాభివృద్ధింగని యా
యానకమాయుత్సవమున
నానాకఖ్యాతమయ్యెనఁట యేమందున్. 59

శా. భేరీభాంకరణమ్మునం జనము లుద్వేలమ్ముగాఁ బ్రోవులై
చేర న్వెన్నెలనల్లడల్దనర నా శ్రీనాథుగుణ్ఠింబుజె

న్నారెన్ మందరపర్వతేంద్రి చలితంబై యొప్పు క్షీరాబ్ధి స
ద్యోరమ్యంబగుకాంతినొప్పెసఁగునాయుచ్చైశ్శ్రివంబోయనన్. 60

మ. తగుడోలాకలనమ్మున న్వివశతౌతన్వంగులన్ శ్రీలలం
దగవంచించి జనారవాకలితమౌ ద్వారమ్మునన్ మాధవుం
డగశత్రుండను జన్మవత్సలతచే నంపింప నుచ్చైశ్శ్రివం
బొగిఁ దావచ్చెనొనాఁగ నొప్పెసఁగు నశ్వోత్తంస మెక్కెన్వెసన్.

మ. సరవి న్వొల్చె సపద్మరాగకలశచ్ఛత్రంబు పాపాపహ
ర్త్రురమేశానమహోత్సవంబు గన స్వాతీతారతోఁగూడి చం
దురుఁ దేతెంచినభంగి నీలమణులన్ నూల్కొన్నదండంబు త
ద్ధరిసందర్శననిర్గళచ్ఛశికళాంకాంకూరమో నాఁదగెన్. 62

క. హరిహరినిర్మలతరపు
చ్ఛరుచిన్ విజితంబులగుచుఁ జామరములు త
ద్ధరికి సపర్యయొనర్చెడి
కరణిం జెలువారె లలితకంపితగతులన్. 63

తే. గీ. హరిహయంబయ్యె ధవళమైయలరె దీప
దీప్తినరుణమయి చెలఁగెదేవదేవు
నీలనీరదకాంతిచే నీలమయ్యె
లసితగంధకదీపరుచి సితమయ్యె. 64

తే. గీ. తనకును సనాముఁడై నట్టితార్క్ష్యనెక్కె
నితఁడనుచు వైమనస్యంబు నెనసియున్న
వాజిపతి నతిసంతోషవార్ధి ముంపఁ
జనె నధిష్ఠించి కుర్మతిక్ష్మాధరినేత. 65

తే. గీ. రత్నసానువటన్న పేరన్ దనర్చి
గర్వముననొప్పు మేరువుగర్వమడఁప
దీపపఙ్క్తులు నల్గడల్ దేజరిల్లఁ
బాదృశంబయ్యె గుర్మూర్తివరణిధరము. 66

తే. గీ. ఇచటనుండిన సిధరాభృత్తునిజ
నిత్యమణుల కోడితిమటంచు నిందవచ్చు
నవతుఁజెందఁగవలెనుంచు నచ్చయంబు
లటఁ బడినరీతి నొప్పె దీపాళులెల్ల. 67

మ. లలి నస్మత్ప్రతియైనచంద్రుభగినిన్ లక్ష్మీమహాదేవి ని
మ్ముల నెజ్జన్ దగమోసపుచ్చి యెటకేఁబోనున్నవాఁ డీతనిన్
గలయంజూచెద మంచుఁ దారకలు సన్నాహంబుతోనుండెనా
నెలవొందెన్ గిరినుండి క్రిందిదనుకన్ దీపంబు లిర్వంకలన్. 68

తే. గీ. ఎద్దియోకోర్కె దనమది నెనయుకతన
గండశిల పేర్మి దీపమొక్కటి శిరంబు
నందు ధరియించి చెలువారె నాకతమున
నందఱును గండదీపమటండ్రు దాని. 69

తే. గీ. మున్నహల్యనుబ్రోచిన పుణ్యమూర్తి
పాదరజమునఁ దనదృషత్త్వంబుఁబాపు
కొనఁ జిరతపంబుసేయ నెక్కొనియె మంట
దీనికవియెంచిరి శిరస్థదీపశిలను. 70

తే. గీ. అరుణగరుడులు సోదరు, లందు గరుడ
మణి శిలాగర్భయై మహిమంబుఁగనియె
నని యరుణమణియును వేడ్క నశ్మగర్భ
మయ్యెనన గండదీప మొప్పారెనచట. 71

మ. ప్రతిబృందమ్మున మాధవాయనుచు బాష్పమ్ము ల్లలిన్ గ్రమ్మ భ
క్తతతుల్ సేవయొనర్ప మెల్లన నగాగ్రమ్మున్ దగన్ డిగ్గి భూ
పతి వాసస్థలి కేగె శౌరి; యతఁడున్ భక్తిప్రణామాంజలి
ప్రతిపత్తుల్ దగఁ జూచె నాకురుమణిస్వామిన్ హయారూఢునిన్. 72

చ. అవనిపునాజ్ఞ సేన వలయాకృతిఁజెందఁ దదగ్రమందు ర
త్నవితతి రత్నగర్భఁ దమతల్లిని వంచనఁజేసి యేగు మా

ధవు నరికట్టఁగాఁదలఁచి తద్దయు మాతృదరాంతరంబునుం
డ వెడలి చుట్టువారుకొనుటీవి నెసంగెను దీపమాలికల్. 73

శా. రాణన్ స్థూణలపేరిబాహువుల నారాచాంగుళుల్ మోడ్చి యా
క్షోణీకామిని రక్తచామరములన్ జోడించి శ్రీకుర్మతి
క్షోణీభృత్పతి వీఁచెనాఁగ నెసఁగెన్ సొంపౌనిర్వ్యంకలన్
శోణశ్రీకమరుద్విలోడితజగజ్జ్యోతిఃప్రదీపద్యుతుల్. 74

క. ఓలి నయస్కాంతంబిది
కాలాయసమున్ గ్రహించి ఖ్యాతింగనఁగా
నాలీలనె శోణమణుల్
గ్రాలెననం జెలఁగె నాజగజ్జ్యోతులొగిన్. 75

క. నైకవిధగంధకకృత
ప్రాకారవిచిత్రవృక్షబహుచక్రికృతం
బై కడునెసంగె లంకా
ఖ్యాకము యంత్రంబు సేన కావలిప్రక్కన్. 76

సీ. భుజములల్లలనాడ ముఖము చిర్నగవూనఁ
జెమటచేతను జెక్కు చెమ్మగిల్లఁ
గనులు తళ్తళనింపఁ గనుబొమ్మలు చలింపఁ
జనులు గందరగోళమనుసరింపఁ
గాంచి ఘల్ఘళమ్రోయ గజ్జ లల్లరిసేయఁ
జిన్నారితిలకంబు చెదరిజార
నొయ్యార మెసఁగంగఁ బయ్యెదల్ దూలంగ
మేనికాంతులు మిసమిట్లుగొలుప
తే. గీ. నలసట జనింప నిట్టూర్పు లలవరింపఁ
గనుఁగొనెడివారి కానంద మినుమడింప
నెట్టుకొని కుర్మతిస్వామి కట్టెదుటను
మేలమాడిరి వారకామినులు చెలఁగి. 77

మ. జగతీమోహనరూప మొప్పు తమరోజద్వంద్వముందాఁకి పె
ల్లుగహారమ్ములు నాట్యమాడె సుగుణాలుల్ గల్గఁ గాకేమి హృ
ద్యగతుల్ మించిననేమి సన్మణిచయావ్యాప్తిం బ్రవర్తింపనే
మగు, గుబ్బల్గనినంత నేరికిని నాహాకారముల్ పుట్టవే. 78

తే. గీ. బుద్ధిమత్తముఁడగు రాజపుంగవాగ్ర
గణ్యుచేఁ గొంతవడి సేవ గాంచి, పిదపఁ
దూర్యఘోషము లెంతయుఁ దోరముగను
జెలఁగఁ గుర్మతిపతియు వేంచేయఁదొడఁగె. 79

క. పుష్కరివరదుండని నను
బుష్కరిణియు నాశ్రయింపఁ బూనెడునని తాఁ
బుష్కరిణిఁ బ్రోవనోయనఁ
బుష్కరిణికినేగెఁ బురుషపుంగవుఁడంతన్. 80

వ. ఇట్లు పుష్కరిణీతీరమ్మున కరిగి యటఁ గల్పితంబగు ననల్పసపర్యం గ్రహించి సేన కుత్తరదిక్తటమ్మున ననేకముఖాఢ్యయగు లంక గన్పట్టుచున్న దిదియేమోయని యనుకొనుచున్న జనులకోలాహలంబు విని రోషంబునంబోలె శీఘ్రమ్ముగానటనుండి కదలి యుభయపార్శ్వమ్ముల సైన్యంబు శ్రేణీభూతంబై చెలంగ నేమికతమ్మున నిటకిది వచ్చెనో యనురోషమ్మున గిరిశిఖరంబునుండి సాక్షాదుత్ప్లుతుండునాఁ దగు నరప్రేరితకృత్రిమమారుతతనయు వాలాగ్నిచే నంటింపఁ బడినదియుఁ, బ్రదీపరూపమణినిబిడితమహాకోలాహలజనకదంబాంబుధిమధ్యభూస్థితంబునునగు నాకృత్రిమలంకయం దస్మదధినాథుండగు భగవంతుం డనంతావతారుండగుచుండఁ దత్కారాలంకారంబున కేనును ననేకరూపంబు లాశ్రయింపఁ దగినదియే యని యనేకధావతీర్ణంబగు సుదర్శనంబునాఁదగి యభ్రపరిభ్రమణనిరవకాశనిక్షిప్యమాన స్ఫులింగసంఘనిబిడితప్రాంతంబులగు చక్రరూపయంత్రబృందంబులు కోట్లకొలఁది పరిభ్రమించుచుండ, నొక్కెడ సమున్నతస్తంభామూలాగ్రపార్శ్వద్వయగుంభితగంధకభరితేంగుదీపలరేఖా సముదయంబులు భూ

మిమొదలుకొని క్రమముగాఁ బ్రజ్వలించుచు నగ్ని స్వస్వోర్ధ్వస్థితం
బగు ఫలంబు నాక్రమించె నింక విడిపొందు విడిపొందు విడిపొందని
చెప్పుపగిది విశరణార్థకఫలధాతులోణ్మధ్యమపురుషైకవచనప్రయోగం
బుసేయుచుఁ దాపసశాఖిజాతంబులైనను గంధపూర్ణంబులైనయెడల
విశీర్ణత్వం బలవడకమానదని బోధించుపగిది విశీర్యమానంబులగు
చుండ, నింకొక్కయెడఁ దిర్యగ్గుంభితదారూభయపార్శ్వాలంబమాన
గంధకయంత్రపిటకయుగ్మంబులు గిరిశిఖరంబు దనుకఁ బ్రజ్వలించు
చుండఁ దదధోగళత్ప్రజ్వలనధవళగంధకఘుటికామాలికాంచితశణకాం
తులు గగనంబునంజరించుచు, మహోత్సవవిలోకంబున వివశలైన
సురకాంతలు పరస్పరహారావలోకనవైసర్గికస్త్రీస్వభావంబునంజేసి హార
వినిమయంబొనర్చుకొనుచున్నతఱి రెండురెండుగా స్థూలవజ్రఘటి
తైకావళీహారంబులు ప్రమాదవశంబునం జారిపోవ డిగి, వానిని
మరల గ్రహించుచుండిరో యనుపగిది క్షణకాలంబు మాత్రము
జూపట్టి నశించుచుండ, వేఱొక్కచోటఁ జక్రాకారయంత్రశతాంతరా
ళంబులు పార్శ్వద్వయసముద్దీపితంబులై ప్రత్యేకముగా నేకమార్గం
బునం బయలువెడలి మార్గమధ్యమ్మునఁ బరస్పరసమ్మిళీనంబులగు
కతన నివృత్తములగుచుండ, మఱియొకచోట నభిముఖమ్ములగు కతన
మరలుచు నట్లనె చిరకాలముపరిభ్రమించు గంధకయంత్రవిశేషద్వయం
బులు సమానబలమల్లయుగ్మమండలచంక్రమణరీతింజూపుపగిదిఁ బ్రజ్వ
లించుచుండఁ, గొన్నినక్షత్రంబులు ముందువచ్చి మహోత్సవంబాలో
కించి నభస్థితంబులగు తక్కిన రిక్కలంగూడఁ బిల్చుకొనివచ్చు
కొఱకు సశ్లాఘావచనరభసమ్మగా వెగురుచున్నవో నాఁదగు యాంత్రి
కజనదీపితాకాశబాణాఖ్య యంత్రంబులు శ్రీంకారశబ్దపూర్వకమ్ముగాగగ
నమ్మునకెగయుచుండ, మఱికొన్ని యంత్రంబులు శ్రీనివాససేవాసమా
గతజనతాపాతకసముదాయంబులంబటాపంచలై పొందని చెప్పుపగిదిఁ
బటపటపటయని పటధాతులోణ్మధ్యమపురుషైకవచనప్రయోగం బొన
ర్చుచుండ, మఱికొన్నియంత్రంబు లియ్యవి సకలజనులకుఁ గురుమతిగి

రిపతియందుదృఢభక్తినుంచుఁడని సూచించుచున్నయవి మహాజనకోలాహలమ్మున నెక్కుడగు భేర్యాద్యారవంబు దిఙ్ముఖముఖరితంబగు కతన నల్పప్రాణమ్ములగు దద్వర్ణమ్ములన్నియు వినఁబడక మహాప్రాణంబగు నొక ఢామనువర్ణము మాత్రము వినఁబడుచున్నదని జనులనుకొనునట్లు ఢాంకారంబొనర్చుచుండ, లాజనికరంబులపగిదియుఁ దెగిపోయినమౌక్తికహారంబులపగిదియుఁ బద్మరాగశకలంబులపగిదియు నింద్రనీలమ్ముల పగిదియు సువర్ణకుసుమమ్ముల పగిదియు యంత్రబృందమ్ములనుండి అగ్నికణంబులు రాలుచుండఁ గొన్నిగంధకదీపమ్ములు సంపూర్ణచంద్ర మండలమ్ములపగిదిఁ జెలువారుచుండ జగదుత్తమోత్తమంబగు నమ్మహోత్సవంబు విలోకించుచు నక్కురుమతిగిరిస్వామి సకలభక్తగణ స్తూయమానుండగుచు నద్రిశృంగంబధిష్ఠింప నుంకించుచున్నంతలో నుత్సవావలోకనసంతుష్టాంతరంగయు శుభగుణకదంబయు నిజాంబయు నగు లక్ష్మ్యంబఁ బురస్కరించుకొని మంత్రివరుండగు వెంకటరెడ్డితో వరవరుండును కరివరంబధిష్ఠించి పుండరీకదళాయతేక్షణుండును, గుణా వరుణాలయుండును, శరణాగతభరణాదరుండును, నఖిల నిగమాభరణుండును, నిఖిలజగద్విపత్తిహరణుండును, శుభకరస్మరణుండును, ఘనాఘనరుచిసుభగంకరణుండును, గరివరప్రియంకరణుండును సమగ్రదేవతాప్రమోదస్థూలంకరణుండును, సకలకలికంటకోద్ధరణుండును, నఖండజగదాఢ్యంకరణుండును, ప్రఫుల్లజలజతల్లజసదృశచరణుండును, నిత్యతరుణుండును, భవాంబుధితరణకరణుండును నగు నక్కురుమతి శ్రీనివాసు ధ్యానించుచుఁ, బ్రపన్నులమయిన మాకు నీవేశరణంబగుచు మమ్మురక్షింపుమనుచు ననేకవాద్యారవంబులు బోరుకలఁగ సమగ్రభూదేవకుటుంబాకరంబగు నంబాపురంబుఁ బ్రవేశించెనిఁక నిచ్చట.

మ. ననువంచించి మహోత్సవంబుగనఁగా న్యాయంబె నీకంచు న
వ్వనజాతాలయ నన్ను నేమనునొ కోపస్వాంతమైయంచు లో
ననుమానింపక కుర్మతీశ్వరుఁడు తానద్రిస్థలంబెక్కి చ
క్కని నోయింతు లొనర్చునృత్యమును వేడ్కంజూచుచున్నంతలో. 82

చ. మగఁ దొనరించినట్టియపమానము నైఁపక లక్ష్మి యాతనిం
దగ నవమానముంబఱుపఁ దద్దయు లోనఁ దలంచి యొక్కదొం
గఁ గడురయమ్మనంబనుపఁగా మఱివాఁడును సింహనాదమొ
ప్పఁగ నరికట్టె నాత్మపరివారముతో నలకుర్మతీశ్వరున్. 83

తే. గీ. ఆత్మకచచయముంబోలి యతికుటిలము
లైనపుండ్రిమ్మలొప్పెడి యతనిభటులు
మెల్లమెల్లన నొదుఁగుచు నల్లభుజగ
పర్వతాధీశుఁబొదివిరి వక్రగతుల. 84

చ. గొడుగునుగట్టి చామర లకుంఠితవిక్రిమలీలఁజిమ్మియున్
సిడములు పాడు సేసియును శ్రీకరమౌవనమాల లాగి యె
క్కుడుపుష భేరికాదికము గొబ్బునఁగైకొని వార లెంతయున్
గడబిడఁజేసి రుత్సవము కంజవిలోచనుఁడున్ దడంబడెన్. 85

శా. భేరీరావము దిక్తటమ్ములను గంభీరమ్ముగా మ్రోయ సిం
హారావమ్ములెసంగఁ జామరములొప్పారన్ సితచ్ఛత్రమున్
దారానాథునిపోల్కెఁజెన్నలరఁ బద్మాగేహసాన్నిధ్యముం
జేరెన్ రెండవకుర్మతీశ్వరుఁడునాఁ జెన్నారుచున్ జోరుఁడున్. 86

ఆ. వె. చిన్ననాఁడు గొల్లకన్నెల వంచించి
వెన్నదిన్నయట్టి వెకలితనము
కట్టికుడిపెనేఁడు కంజాతనేత్రున
కితరచోరగతుల నెన్ననేల. 87

క. అతిఖిన్నుండై కుర్మతి
పతి తనగృహమేగు నాయవసరమ్మున శ్రీ
సతియును భూపతితోఁ దన
పతి కెదురుగవచ్చెఁ దొట్రిపడుసరములతోన్. 88

సీ. తన సితచ్ఛత్రంబు తన చామరయుగంబు
తనదు బంగారుచక్కనిసరములు

తనరత్నమాలికల్ తన హేమవసనంబు
తనయొద్దనుండు దీపనికరములు
తనమదావళములు తన తురంగమములు
తన భేరికాదివాద్యనిచయములు
తనయగ్రిమందునృత్యమునల్పి యానంద
మునునించినట్టి రోహూవుబోండ్లు

తే. గీ. సర్వమును భార్గవీధరాసతులయొద్ద
నున్నసంగతిఁగనుఁగొని వెన్నుఁడపుడు
సంతసముకొంత యొక్కింత చింత కొంత
యబ్రిపాటొప్ప నిదియేమి యనితలంచె. 89

క. భూమియు లక్ష్మీదేవియు
నామెయిఁగనుచుండ శంకనందక లజ్జా
భామ హరి గౌఁగిలించెను;
గామినులకు సాహసంబు గలదెంతైనన్. 90

తే. గీ. సవతులమొగంబుఁ గనుఁగొన్నఁ శౌరి తన్ను
వదలునేమొకొ యనుభీతి పొదలుకతన
నో యనఁగ లజ్జ మొగమెత్తనీయదయ్యె
నిందిరానాథుఁడును దలయెత్తఁడయ్యె. 91

చ. ఇది సతమా యటంచు హరి హ్రీసతి నోసరిలంగఁజేసి య
మ్మదితలవంకఁజూచి కరముల్ ముకుళించి మనమ్ములోపలన్
బెదరుచు మెల్లనన్ బలికెఁ; బెండిలియైన సరోజనేత్రిలం
దొడపురసంబు వేతొక తలోదరులం దొదవంగనేర్చునే. 92

ఉ. దాసుఁడనైననాయెడలఁ దప్పులుగల్గిన సైఁపరాదె నేఁ
జేసిననేరమేమి ? దయఁజిల్కెడిచూపుల నన్నొకింత గై
సేసినదోసమౌనె ? ననుఁజిక్కులఁబెట్టిరి దొంగ లింత వి
శ్వాసము దప్పియుంట తగవా మగవా పగవాఁడనైతినే. 93

వ. అనిన లక్ష్మియిట్లనియె.

శా. నీ చాటూక్తులకేమి నే నెఱుఁగనే నీసంగతుల్ క్రొత్తలే
యీచాతుర్యముఁజూచి సంతసిలువారెవ్వార లిచ్చోట? ని
న్నేచోరుల్ గని కొట్టి పుచ్చుకొనిరో యెవ్వారి దండించెనో
కాచంబైనను నేనెఱుంగనుజుమీ కాంతా! భుజంగాగ్రిణీ! 95

వ. అనిన కురుమూర్తిస్వామి యిట్లనియె.

శా. నీసాన్నిధ్యమునందు భాస్కరునివన్నెంజెన్నుగన్పట్టిబల్
వాసింబొల్చెడి భూషణంబు లవియెల్లన్ లోననూహింపఁగా
నాసొమ్మేయగుఁగాని యన్యమగునా న్యాయంబు నూహింపుమా
హాసశ్రీప్రకటీకృతాత్మగతవామ్యాలంకృతీ! శ్రీసతీ! 97

వ. అనిన శ్రీదేవి యిట్లనియె.

తే. గీ. మామకీనకటాక్షసంబంధభాగ్య
మునలభించెఁగదా లక్ష్మి మున్ను దాని
నే హరించితిఁ జాపల్యమేల నీకు
దానినడుగుము పంచాయుధా! ముకుంద! 99

వ. అనిన శ్రీనివాసుం డిట్లనియె.

తే. గీ. అట్టిలక్ష్మివి నీవకాయనితలంచి
యడుగుచుంటిని దయసేయు మబ్జపుత్రి!
వామలోచన! కోపమ్ముమ్రపదలు, మేమి
తప్పుగల్గె వృథాపవాదమ్ముగాని. 101

వ. అనిన నిందిర యిట్లనియె.

తే. గీ. తగినయుత్తరములులేని తప్పులందుఁ
బురుషులకుఁ జతురోక్తులు పొసఁగుచుండుఁ
దావకాపరాధముల కంతంబుగలదె
త్రాడుబారెదు ధార్ష్ట్యంబు దవులుకతన. 103

వ. హరియిట్లనియె.

తే. గీ. లేదు నాయెడ నపరాధలేశమైన
నెవతె కల్పించిచెప్పెనో యిట్లునీకు

భవదీయుండ దాసుఁడఁ బంకజాక్షి
యే నెచటి కేగినాఁడ నిన్నెరుసుఁజేసి. 105

వ. అబ్ధిపుత్రి యిట్లనియె.

క. చనలేదని బొంకెదు భూ
వనజాక్షిని నన్ను వదలి వడి వేదవధూ
టినిఁగూడఁగఁజనలేదో ?
వనితల కెఱుఁగంగఁబడవె వల్లభులమతుల్. 107

వ. శ్రీనివాసుండిట్లనియె.

క. వనితా ! నిను వదలి యనే
కనగమృగాభీలమైనకాంతారమ్మున్
గననేగితి భీతిలెదని
నిను విడిచినతప్పుఁ సైఁపు నేమ్రొక్కెడుదున్. 109

వ. పద్మాలయ యిట్లనియె.

తే. గీ. పలుకులిఁక వేయునేల యోపంకజాక్ష !
యంతయును నాదులోపమే యగుటనిజము
నీకువలపైనయెడ కేగు, నేను ముద్ద
రాల నద్దానిఁబోలు గయ్యాళిగాను. 111

వ. కురుమతిపతి యిట్లనియె.

ఆ. వె. నాకు నీవుదక్క నలినాక్షి ! వేఱొక్క
పడఁతి లేదు; కష్టవచన రచన
పాలుజేసి రవ్వపాలొనరింతువే
పలుకవేల ? ముద్దుపలుకొకండు. 113

వ. భార్గవియిట్లనియె.

తే. గీ. నిపుణవాక్యమ్ము లొకకొన్ని నేర్చు కతనఁ
దప్పులొనరించియును నన్నుఁ దనిపెదీవు
నిన్ను నలయింపుటకు విధి పన్నలేదు
కుతుకమిదిసుమ్ము నమ్ము కుర్మతినగేశ. 115

వ. జలజాక్షుం డిట్లనియె.

తే. గీ. అందఱునుగూడ నన్ను రమాధివాసుఁ
డండుగ్రిగద యిట్టినాయం దొకప్పుడైన
నీకు కోపావకాశంబు నెగడుటెట్లు!
సకియరో! నాకు మోదమ్మొసంగఁగదవె 117

క. ఇటుబల్కుపల్కులకు న
క్కుటిలాలక కలఁకదేరి కోర్కెదలిర్పన్
దటుకున హరినెననెను; నొక
చిటుకగదా ప్రియులయందుఁ జెలులకుఁ గలఁకల్. 118

తే. గీ. లక్ష్మి దన్నెనసినంత విలక్షణమగు
కాంతిచెన్నారె నబ్ధిజాకాంతునకును
సుగుణవతియైన భార్యపొందుఁ గనఁడేనిఁ
ద్రిజగదీశునకైనను తేటగలదె? 119

తే. గీ. కూర్మితో సిరి తన్నొద్దగూడె నపుడె
యొప్పె నఖిలవిభవము దామోదరునకు
శ్రీమహాలక్ష్మి యొక్కింతసేపు మొఱఁగి
యున్న దేవునకును సిరి సున్నగాదె. 120

తే. గీ. ఏతరుణి యాగ్రహింప దేవేశ్వరునకు
వైభవంబెల్లబోయె నావైభవంబు
మఱలనేదేవి కరుణింప మట్టుపడియె
నాజగన్మాతఁ బ్రణుతింతు నతులభక్తి. 121

క. సుందరదుందుభిరవముల్
మందరఘనరవము నెసఁగమందముగ జనుల్
బృందములుగట్టి మాధవు
కందరమందిరముఁజేరఁగాఁ బనిరంతన్. 122

సీ. మదపుటేనుఁగఁబోలు మందంపుగతివాఁడు
తులలేనిమహిమఁజెన్నలరువాఁడు

పూర్ణచంద్రునివంటి ముఖవిలాసమువాఁడు
కాముకమ్మలనేలు కాంతివాఁడు
దయఁజిల్కునట్టిహృదయము చొప్పడువాఁడు
ప్రతిలేక జగములఁ బరఁగువాఁడు
సుజనులపైఁ బేర్మిఁజూపు చూపులవాఁడు
హెచ్చైనకోరిక లిచ్చువాఁడు

తే. గీ. భక్తులొనరించునతుల నాసక్తిఁగొంచు
వనము వెల్వడి కుర్మతిస్వామి దేవ
దుందుభులు మ్రోయ మోదమ్ము దొలకరింపఁ
దురగమును డిగ్గి కందరాంతరముఁజేరె. 123

తే. గీ. కింకిణులుమ్రోయఁ జామరల్ పంకజాక్షు
లిరుగడలవేయ నాయాసమెల్లఁబాయఁ
గుర్మతిస్వామి వేంచేసెఁ గొమరుమిగులు
మేలుబంగరు తూఁగుటుయ్యాలకడకు. 124

తే. గీ. బాలికల్ చామరాంచితపాణులగుచు
లీలమై వీవ వారాశిబాలతోడ
డోలికాకేళి నవ్వనమాలి సోలి
చాలమేలగు సౌఖ్యాబ్ధి నోలలాడె. 125

క. నీలాంబుజవనమాలా
లీలాభృదపాంగలమితలీలాకమణీ
మాలలు శుచిచేలలు వెల
బాలలు మేలమ్ములాడి పాడిరి ప్రోలన్. 126

క. ఘనతరమగునజ్జాళి
ఖ్యను సార్థకమొనరుపం గరాబ్జమునం గై
కొని ముక్తామణులవిధం
బునఁ జల్లిరి సుమములు వెలపూవుంబోఁడుల్. 127

క. జలధిసుతాధరసుధతోఁ
దులఁదూఁగఁగఁ దనగుణములతో నెగడఁగ భ
క్తులు పాడునట్టిగీతం
బులు విని సంతోషమందెఁ బురుషోత్తముఁడున్. 128

తే. గీ. జయవిజయులార ! చండప్రచండులార !
ధాత ! యోయి విధాత ! భద్రా ! సుభద్ర !
భక్తులెల్లరు చనెదరు ద్వారమందు
భద్ర మిఁకమీఁదఁ గాలాతిపాతమయ్యె. 129

తే. గీ. దివ్యసుమశయ్య శౌరి నిద్రించుచుండు
సార్వభౌముని ననుచరసమితివోలె
నఖిలరక్షకుఁడైన యీయంబుజాక్షుఁ
గాపవలెఁజుండి యష్టదిక్పాలులార ! 130

తే. గీ. వైణికాగ్రిణులార ! సువైఖరులను
హృద్యముగ మీరు వీణ వాయింపవలయు
నుత్సవపరిశ్రమంబొందియున్న హరికిఁ
బటుమృదంగాదివాద్యముల్ పనికిరావు. 131

తే. గీ ఇటుల వేత్రింబుచేఁబూనియెల్లరకును
దెలియఁగాఁజేసి సూత్రవతీప్రియుండు
శౌరి కిట్లనె 'నల్లదె సజ్జితమగు
శయ్య యద్దాన శయనింపఁజనుము దేవ !' 132

తే గీ. దానికంగీకరించి మందగతిమెఱఁ
గడలిరాముద్దుకూఁతుతోఁ బుడమితోడఁ
గోటిసూర్యప్రకాశమై కొమరుమిగులు
రత్నపున్ సెజ్జఁగూర్చుండె రమణ శౌరి. 133

మ. నతులెంతేఁ బచరించిభక్త జనులంతంబోవగేహాంతర
ద్వితయమ్మున్ ఘటియింపుడున్ బొబగుమై దేదీప్యమానోదయ

స్థితినొప్పారెడు కేళికాగృహమునన్ శ్రీవాసుఁ డాసప్తరా
త్రితతాయాసమునన్ క్షణావధిగ నిద్రాముదర్థి నొప్పె న్వెసన్. 134

ఆ. వె. అంత మేలుకాంచి సంతస మొప్పారఁ
బుడమితోడఁ గలిమిపడఁతితోడ
స్వేష్టభోగగరిమ లెనయుచు విహరించె
నజహరాదినమ్ముఁ దైనశౌరి. 135

సీ. మిసమిసల్ దేఱుకొ్రమ్మించు మించుపసిండి
డాలెసంగెడి మేటిచేలములును
అత్యుదారమ్ములై యనవద్యకాంతులై
యలరారుముత్యాలహారములును
నిర్దుష్టనవరత్ననిర్మాణమునుగాంచి
పొలుపారుబంగారువలయములును
అత్యుజ్జ్వలమ్ములై యత్యనర్ఘమ్ములై
సొరుమీఱెడిచంద్రహారములును

తే. గీ. చాలమేలుజరీయంచు సేలువలును
గొనబుగలనడగలమంచిగుబ్బములును
శ్రీనివాసోత్సవాగతులై నకవుల
కిడియెఁ బేర్మి సీతారామనృపవరుండు. 136

ఉ. ఆమఱునాఁడు గుర్మతి నగాధిపు సేవను ధన్యులై మహో
ద్దామరయమ్ము మీఱఁగ యథాస్థితిసంగతులై నసైనికుల్
సేమ మెలర్పఁ గొల్వ నృపశేఖరుఁ డాత్మపురమ్ముఁ జేరె నెం
తోముద మొప్పఁ దన్నుఁ బురతోయజనేత్రలు చూచి యుబ్బఁగన్. 137

సీ. తిరుమలకెనయైన కురుమూర్తిశైలకం
దరము వాసమ్ముగాఁ దనరువాని
ప్రావృణ్ణవీనాభ్రపటలకాంతుల గెల్వఁ
జాలు చక్కనిమేని డాలువాని

కలుములీనెడిపాలకడలిరాపట్టియె
ల్లప్పుడు వక్షమందొప్పువాని
కరుణామృతరసమ్ముదొరఁగి పారెడి విశా
లములైనకందమ్ము లమరువాని

తే. గీ. హృదయనీరేజమందుఁ దా నెల్లవేళ
నిలిపి భజియించి తద్దయాకలితుఁడగుచు
రాజ్యమొనరించుచున్నాఁడు రమ్యగతుల
సోమభూపాలసూనుండు సురుచిరుండు. 138

తే. గీ. కురుమతిశ్రీనివాసుని కరుణచేత
భూపమౌళి సీతారామభూమిధవున
కాయురారోగ్యసుఖసంపదాత్మజవిజ
యాదికం బెంతయును వృద్ధినందుఁగాత. 139

శా. ఈరీతి న్సతతమ్ము నుత్సవములెంతేనొందుచుం బేర్మి సీ
తారామప్రభు వృద్ధిజేయుటకు నుద్యద్దీక్షచెన్నార సు
శ్రీరమ్యంబయి వేంకటాచలసమశ్రీనొప్పు నక్కూర్మతిం
బేరొప్పార వసించె శౌరి యధికప్రీతిం బ్రియాయుక్తుఁడై. 140

ఉ. బాలుఁడనయ్య నీకృపకుఁ బాత్రుఁడనైనకతమ్మునన్ సుధీ
జాలము మెచ్చ నెంతయు రసమ్ముగ నీకృతిఁజెప్పి సంతత
శ్రీలనెసంగు నీపదముఁ జేర్చితినయ్య కృపాలవాల ల
క్ష్మీలలనామనోహర క్షమించి గ్రహింపఁగదయ్య మోహ్రికై డగా. 141

ఉ. ఇంచుక నేర్పుగల్గిన కవీశ్వరులందు నొకండనైన నా
కొంచెపుబుద్ధియేడ ! గవికుంజరులెల్ల నుతింపలేవి నీ
యంచితసద్గుణవ్రజమహత్త్వమదేడ ! యథామతిం బ్రిక
ల్పించితి నాదు గ్రంథమును బేర్మిమెయిన్ గ్రహియింపుమోహరీ. 142

తే. గీ. అర్థమునకైనఁ బదములకైనఁగాని
యించుకేనియు యత్నంబు నేనొనర్ప

నెట్లుచేయించుకొంటివో యిట్టినన్నుఁ
బేరిరణముఁజేసి యీకృతి శ్రీనివాస. 143

ఉ. లెక్కకు నొక్కఁడన్ సుగుణలేశము నొందక బల్చుమత్కృతిం
జొక్కక మన్ముఖోద్ధమయి చొప్పడు నీకృతి నాదరింపఁగా
నొక్కవచింతు నోపరమసూతనులార, కవీంద్రులార ! నా
మ్రొక్కులు గైకొనుండు కృతి మోదమెలర్పఁగఁ జేకొనుండొగిన్. 144

క. ప్రాచీన మగు కవనమె స
మీచీనమె ? సూతనము సమీచీనముగా
దే ! చవిచూడుఁడు నూతన
మై చెలువలరారు తేనె యతిమధురంబౌ. 145

మ కవి ప్రాజ్ఞుండగునేని సొంపుగఁ గృతిం గల్పించి ప్రాచీనమి
క్కవనంబంచు పచింపఁగావలయు నక్కావ్యంబు చోషైకదృ
క్ప్రవరుల్ గాంచి 'పురాతను ల్సుకవులప్రాజ్ఞుల్నవీను ల్సఖీ
కవనంబిట్టిది లే' దటంచ్రు స్వకృతింగా వారలూహింపమిన్. 146

ఉ. కొందఱు ప్రాక్కృతిన్ ముదముఁ గొందురు ; దానికి నెంతమాత్రము
న్జెంద నసూయ దాని తులఁజెందిన నూత్నకృతిన్ గణింపరే
మందును ! దానలేని గుణమైనను గాంచెద, రిందుఁగల్గుదా
నిం దిగఁదీతు రక్కట మనీషుల కియ్యది సహ్యమెట్లగున్ ? 147

తే. గీ. ప్రత్నసూత్నవిచారము ల్పనికిరావు
సుగుణముండిన గ్రహియింపఁదగు సుకవుల
కహహ యిచ్చోటఁగాని ద్వీపాంతరమునఁ
గాని మణి పుట్టి గ్రాహ్యంబుగాకయున్నె. 148

చ. కుటిలమనీషులార ! కవికుంజరులార ! వినుండు మిమ్ము న
క్కట కడుదూరినాఁడ నిదికర్జముగా దిట మీదుదోష మొ
క్కటియునులేదు మీమదినిఁగ్రాలెడి యోరువలేమియు న్సదు
ష్టతమగు దయ్యు మయ్యది వికారపుఁజేష్టలు మీకు నేర్పెడిన్. 149

క. కవితారసమెఱుఁగని దు
ష్కవులు గభీరమగు సుకవిసత్కృతి గుణదో
షవివేకమొనర్పఁగ బు
ద్ధివిశేషముఁ జెందలేమి తెల్లమ జగతిన్. 150

ఉ. చాలు నతిప్రసంగ మొకసంగతిఁజెప్పెదఁ బ్రిత్నమాత్నతల్
చాలవు కావ్యమందొదవు చాతురిరూపణఁజేయ, సద్గుణా
వాలత యొక్కటే కృతి కవంధ్యతనేర్పరుపంగఁజాలు స
చ్ఛీలురు పక్షపాతమునుజెందక దీని గ్రిహించుటొప్పగున్. 151

క. కవిసార్వభౌమబిరుద
ప్రవరుఁడు శఠమర్షణకులభవకృష్ణుం డే
నవయుల్లాసమ్మున శ్రీ
నివాసునివిలాసమందు నేర్పుగఁజెప్పెన్. 152

సీ. పరకాలగురువర్యపాదసేవామహి
మప్రాప్త కావ్యనిర్మాణచణుఁడ
ప్రత్యగ్రిదుర్గంబు వాసమైతగువాఁడఁ
గవిఘటాసార్వభౌమవిభవుండఁ
గృష్ణనాముఁడనై నయేను భవ్యంబైన
యీకావ్యరత్నమింపెసఁగఁజేసి
శ్రీరాట్సపై బహిరీబహదర్మఖ
బిరుదసీతారామసరపరునకుఁ
తే. గీ. గృతియిడ నతని విద్వాంసులెల్ల నేన్గు
పైని నెక్కించి తూర్యరవములునెలఁగఁ
గవిఘటాగండభేరుండ గరిమనొసఁగి
వీధినూరేగఁజేసిరి వేడ్కమెఱయ. 153

సీ. ఎవాఁని మతిలత మవ్వమౌనిజతాత
పూర్ణకృపారసస్ఫూర్తి మొలిచి

గురుతరరంగార్యనరసింహతాతస
ద్విమలకృపాస్ఫూర్తివేరుబాజి
సజ్జయదేశికాచార్యకృపామృత
భరముచే సఫలమై పరిఢవిల్లె
నతఁడు కృష్ణాంబికాతతగర్భకనకసం
పుటరాజమానవేంకటకృతీంద్ర

తే. గీ. లసదరుణమణిసహజనీలమ్ము దనరు
మహిని శ్రీవత్సగోత్రరామయమనీషి
కెన్న దౌహిత్రుఁడగుచుఁ బ్రపన్నతిలకుఁ
డైన రంగార్యునకు మేనయల్లుఁడగుచు. 154

సీ. ఫణిశైలపతికృపాప్రాప్తమహైశ్వర్య
పరిచితవైష్ణవభక్తిచయుఁడు
ప్యాపలిగ్రామనివాసుండు రంగాంబ
కును బొజ్జకృష్ణునకును దనయుఁడు
శ్రీనివాసార్యుఁ డెవ్వానిమాతృష్వసే
యుఁడు వెంకటార్యఘనుఁడు నెవనికిఁ
దంత్రితంత్రియగు శ్రీధరణీధరారాత్రి
కాన్వయుండగుకొండమార్యుఁడెవని

తే. గీ. కిచ్చె శబ్దాగమం బతికృపదలిర్ప
నట్టినానిరుపమితవాక్యప్రపంచ
ములకుఁ దలఁకి కుకవులెల్ల మూలఁబడిరఁ
టన్న నాకీర్తి పలుమాఱునెన్ననేల. 155

సీ. అమలరామానుజార్యమతరక్షకములౌ
మార్తాండముఖమహామహితకృతులఁ
దతకుదృష్టిచయసంతతతమస్సంతతు
లణఁచుచు నపరవేదాంతదేశి

కాచార్యుఁడన భూమినలరెడి గంగాల
హరిమదహరవరప్రౌఢవాగ్వి
భవుఁడు శ్రీకరబుక్కపట్టణవంశ సం
భవుఁడు శ్రీవాసాఖ్యపండితునకు

తే. గీ. సప్తయగురంగనాథార్యసకుఁ బసూనుఁ
డైన శ్రీబుచ్చివెంకటార్యుఁడుఁడు నుర
పురమహారాజ వేంకట భూపునయుఁడు
శాబ్దికుఁడు కార్యవేత్త ప్రశస్తినలరు. 156

సీ. ఆచార్యదీక్షితాఖ్యాకవంశాంబుధి
కల్పవృక్షమ్ము పుష్కలవిబుధాగ్ర
గణ్యాగర్వహరుండు కలితమోచాఫలో
పమితవాచావిభవప్రథితుఁడు
కవితామహత్త్వరక్షణవిచక్షణనిరు
పమవత్సలత్వసంభావితుండు
గద్యాదిసంస్థానకవియుఁ బురాణదీ
క్షితపండితుండు నీక్షితి వెలయుత

తే. గీ. ముక్కరదులమ్మనఁ బ్రసిద్ధికెక్కుచున్న
భూపమౌళి సీతారామ భూపుఁడెలమి
మన్ననలు సేయనొప్పు నీమహితు లిర్వు
రును గణింపఁగ మిక్కుతి దనరుఁగాత. 157

తే. గీ. శాలివాహనశకమున శైలదంతి
శైలభూసంఖ్యగలయేండ్లు జనినమీఁదఁ
దనరు రక్తాక్షియందున తపమునసిత
పక్షమున ధాతృతిథిఁ జేయఁబడియె నిదియు. 158

తే. గీ. దాతృసంపద జగమునఁ దనరుఁగాత
సరసకవితావిలాసంబు మెఱయుఁగాత

కర్మతిం దోత్రత్సవము వృద్ధిగొనెడుఁగాత
వేంకటాద్రీశ్వరుండును వెలయుఁగాత. 159

చ. అరయఁగశాలివాహనశకాబ్దములందున రత్నచంద్రదిక్
స్థిరలుపొసంగ నిక్కరుమతిప్రభుదివ్యచరిత్ర భవ్యమై
పరగఁగ హేమలంబియనువత్సరమందు శతావధానులౌ
తిరుపతివేంకటేశ్వరులు తెగ్గొనరించిరి శాశ్వతంబుగన్. 160

ఉ. సన్నుతవాడరేవుకులచంద్రుఁడు వేంకటరత్నమంత్రి మృ
ష్టాన్నముపెట్టుచున్ సవినయంబుగ గౌరవరీతిఁజూపుచున్
మన్ననఁజేయఁ చద్భవనమంజులసౌధమునంజరించుచుం
బన్నితి మీప్రబంధమును బండితమండలి కింపునింపఁగన్. 161

— గద్య —

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వరులచే
సాంధ్రీకృతంబగు శ్రీనివాసవిలాసమ్మునఁ
బంచమాశ్వాసము సర్వమును
సంపూర్ణము.



శ్రీమత్పరదేవతాయైనమః

# ఏలామాహాత్మ్యము

శతావధానులైన

తిరుపతి వేంకటేశ్వర కవులచే

రచింపఁబడినది.

ప్రకాశకులు:

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి సన్సు

వేంకటేశ్వర పబ్లికేషన్సు,

కడియం P.O.

తూర్పు గోదావరి జిల్లా,

1956

ఇది తూర్పుగోదావరి జిల్లాలోని పెద్దాపురం తాలూకాలో

ప్రవహించు ఏలా నది చరిత్రము

రెండు ఆశ్వాసముల

ప్రబంధము


పరిష్కర్త - విద్వాన్

చెళ్లపిళ్ల దుర్గేశ్వర శాస్త్రి

కడియం P.O. తూ॥గో॥ జిల్లా



మూడవ కూర్పు

1956

వెయ్యి ప్రతులు

ముద్రణ:

వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్,

ఆలమూరు,

తూర్పు గోదావరి జిల్లా.

శ్రీమత్పరదేవతాయైనమః

# ఏలా మాహాత్మ్యము

## ప్రథమాశ్వాసము

ఉ. శ్రీమరునల్కఁ బాప నడితేయి శశిన్ గనుఁ గప్పి యాపెకెం
దామరమేడఁ దుమ్మెదవిధమ్మునఁ జొచ్చి క్షమింపుమంచు నా
రామపదమ్ములం బడి కరంచు లసద్రసరాజవల్లభ
స్వామి దయాళుఁడై మనుచు సజ్జనగేయుని సర్వరాయనిన్. 1

ఉ. పొందుగ గబ్బిగుబ్బలకుఁ బూసిన కస్తురిపూఁతగా నుపేం
ద్రుం దలపోసి నెచ్చెలులు "తొయ్యలి భర్తకు మున్న లేచు టీ
చందమకా" యటంచు నెకసక్కెము లాడఁగ లోన నవ్వువా
ర్నందని సర్వరాయని నిరంతరముఁ దయఁ జూచుఁగావుతన్. 2

శా. క్షీరాంభోనిధిమధ్యభాగవిపుల శ్రీయుఙ్మణీద్వీపక
ల్పారామాంతరచంద్రికాధవళపర్యంకం బధిష్ఠించి సు
స్త్రీరూపామరశక్తిసేవ్య యగుచుం జెన్నారు శ్రీదేవి స
ర్వారాయాభిధు నెల్లవేళ సుఖసంపన్నాఢునిం జేయుతన్. 3

మ. "సతి నక్కుం గదియించి మోయఁదగునే సంసారి దామోదరుం
డతిలోలుం" డని గేలిసేయుపతి గర్వాటోపముం జూచి యే
గతి నేవేళనొ దేహమందు సగమున్ గైకొన్న బల్జాణ పా
ర్వతి భ్రాతృద్వితయీసమేతు నలసర్వారాయనిం బ్రోవుతన్. 4

మ. "వలరాజున్ హరియించియుం దుదకుఁ దాపం బాఁపఁగా లేక య
వ్వలలోఁ జిక్కితినేనకాదె" యను నాప్రాలేయగోత్రాత్మజన్
గిలిగింతన్నగఁ జేసి "యా" ననుచు నంగీకారమున్ జూపు గ
బ్బిలిరాయం డలరాజశేఖరుఁడు సర్వారాయనిం బ్రోవుతన్. 5

మ. చతురాస్యుండు కలాకరుండు జగదాశ్చర్యప్రభావుండు సం
స్కృతభాషోదయుఁ డుత్తమాభినుతకీర్తిప్రాభవోపేతుఁ డ
ర్పితభక్తోచ్ఛ్రియుఁ డార్ద్రచిత్తుఁడు గురుశ్రీకుండునౌ బ్రహ్మపం
డితుఁ డెల్లప్పుడు సర్వరాయనికిఁ బాటించున్ జిరాయుష్యమున్. 6

మ. "అనయమ్మున్ దనయత్తగా రొసఁగు నాయైశ్వర్యమున్ శోభిలం
గనుజేయన్ సమకట్టు దెయ్యెడల వాక్కంజాక్షి" యన్ దుర్యశం
బును వీడంగఁదలంచె నెవ్వనియెడన్ బుణ్యాత్ముఁడీసర్వరా
ట్సునుఁ డద్దేవికిఁ బ్రీతి గొల్పుతఁ గవిట్సత్కారపారీణుఁడై. 7

తే. గీ. కాళిదాసాది సంస్కృతకవుల కెరఁగి
నన్నయాద్యాంధ్రకవులకు నతులొనర్చి
కుకవులగువారలకు శతగుణముగాఁగ
మ్రొక్కికొందుము "మాకృతి ముట్టకుఁ" డని. 8

వ. అని శిష్టాచారానుసరణంబుగ నిష్టదేవతాభివందనాదికం బాచరించి
యుండునెడ. 9

క. వీరవరగ్రామణి కే
దారము లారామములును దగువాఁడుమహో
దారుఁడు తోఁటకులుఁడు స
ర్వారాయఁడు పేర్మి మమ్ము రావించి యనెన్. 10

ఉ. తిరుపతి వేంకటేశ్వర సుధీమణులార! కవీంద్రులార! దు
ష్కరము శతావధాన మెసకమ్మునఁ జేయుటకుం గవిత్వమున్
సరసముగా రచించుటకుఁ జాలినవారలు మీకుఁ దక్క నొం
డొరులకు సంస్కృతాంధ్రకవితోచితపద్ధతి గల్గియుండెనే? 11

క. వ్యాకరణము తెలిసినఁ గవి
తాకల్పనలేదు సుకవితావిదుఁడైనన్
వ్యాకరణము రా దీరెం
డీకాలమునందు మీక యెసఁగెఁ దలంపన్. 12

క. శ్రవణానందము నిజముగ
నవు వేంకటరత్నమంత్రి కంకితముగ మీ
కవ మును రచియించినయా
కవనమ్మెక్కింత వినిన కవయితలకహో. 13

తే. గీ. ఆత్మకూరు నృపాలున కంకితముగ
శ్రీనివాస విలాసంబు చెప్పికాదె
నాఁడు జోడుమషాల్చీలతోడఁ బవలు
నాగమండప మెక్కి యూరేగినారు! 14

వ. ఇదియునుం గాక.

క. గద్వాలపురములోపల
విద్వాంసుల నెదిరి రామవిభుమన్నన నే
తద్వాచకాక్షరాశీ
మద్వరకలధౌతబిరుదమాన్యతఁ గనరే! 16

క. వేదసమానము పుణ్యా
పాదక మఘనాశకంబు భాగవతం బ
ష్టాదశపురాణములలో
నైదవయది తెల్గుసేయు టబ్బురముగదా. 17

చ. మఱియు ననేక భూపరులమన్ననమైఁ దగు వృత్తులంది బం
గరుబిరుదమ్ములం బడసి కానుకలం గ్రహియించినార లో
తిరుపతివేంకటేశ్వరసుధీమణులార, కవీంద్రులార! చా
తురి నెఱమీఱు మీకవిత తొల్లిటివారలఁ బోలు టబ్రమే! 18

వ. అని పెద్దయుం బొగడ్డు ప్రశంసించి.

క. ఏలానదివేలాభువి
స్త్రీలీలల నిఖిలసుఖము లెనసెడి నా క
య్యేలమహత్త్వమ్మును వినఁ
గాలోలత మించె సుకవికల్పితకృతిగన్. 20

క. ఏలానదితోఁ బెఱనదు
లేలా తులఁదూగుఁ? నొక్క యింతజలమ్మున్
దా లో దాఁపక జలనిధి
పాలుం గానీక పంటపైరుల కిచ్చున్. 21

ఉ. కావున నన్నదీమహిమగా నొకచిన్నికృతిన్ రచించి యం
దేవియునేని పుణ్యకథ లేఱిచి కూర్చి మదంకితమ్ముగాఁ
బావను నన్నుఁ జేయఁగలభారము మీయది యంచుఁ గపత్రిపుం
దావి నెసంగు వీటి కలధౌతపుఁ బళ్ళెరమందుఁ బెట్టినన్. 22

వ. ఏమును దదీయవినయసౌజన్యాదిగుణమ్ముల కలరి విద్వత్తామాన్యమ్ము లగు వచనంబులకు సంతసించి యార్ద్రాంతఃకరణుల మగుచుఁ బదం కితమ్ముగఁ దత్కథాకథనమ్మున కంగీకరించి కృతిపతివంశం బభి వర్ణింప నారంభించితిమి. 23

ఆ. వె. గయుని తలకుఁ దొడవు, కలుముల జవరాలి
తొడకుఁదొడవు, వేల్పుదొరకు సిరియు
మేలుఁగూర్చు దాత, మిన్నేఱు జన్మించి
నట్టిచోటు వెలయు హరిపదంబు. 24

క. తాదృశమగు హరిపదమునఁ
బ్రాదుర్భావమ్మునొంది ప్రబలెన్ శాఖా
భేదముల నొక్కవర్ణం
బాదిన్ సచ్ఛూద్రు లాద్యు లందుఁ దలంపన్. 25

తే. గీ. అవనిఁ బెద్దాపురమ్మున కర్ధయోజ
నముగలుగు మేర వీరవర మనునూరఁ
బాఁడిపంటయు సిరియు సంపదయుఁ జదువు
కొదవలేకుండు రందొక్క కుదుటివారు. 26

క. అకాఁపువాఁడ్రఁదోఁట ల
నేకముగా నాటి జగతి నిర్మలయశమున్

గైకొనిన వారి నందఱ
నాకతమునఁ దోఁటవారటందురు జనముల్. 27

క. మానితధనుండు మర్యా
దానిధి భూవరహితుండు దాత ఘనుఁడు వి
జ్ఞాని యుదయించె వెంకన
నానాఁటికిఁ దత్కులమ్మునం దతయశుఁడై. 28

క. కృషివృత్తిగ నాతండొక
ఋషిగతి సత్యంబుఁ దప్ప కెంతయు నతికి
ల్బిషహరులగు భూసురులే
వృషవాహనులనుచు మది జపించుచుఁ బేర్మిన్. 29

క. సంతానార్థంబుగ నొక
యింతిన్ సీతాభిధాన నెంతయు సాధు
స్వాంతన్ గైకొనె సీతా
కాంతన్ శ్రీరామమూర్తి కైకొనినగతిన్. 30

శా. తాదృక్కోఁటకులాబ్ధిచంద్రున కనేతాదృగ్యశోరాశికిన్
భూదేవాదృతదత్తచిత్తునకు నన్యూనక్షమాకారుణీ
యాదోనాథుఁడు వేంకనాగ్రిమునకు, నయ్యబ్జాక్షికిం బుట్టెఁ దా
యాదుం డొక్కరుఁ డాత్మవంశమున కుద్యత్కీర్తి సంధింపఁగన్. 31

వ. అట్టి కుమారరత్నంబున కాదంపతులు వృద్ధానుమతంబున సర్వా
రాయం డనునామం బిడిరి. 32

క. పర్వారాయఁడు సర్వాం
తర్వాణీహితుండు చనవు దగఁ బెద్దాపు
ర్యుర్వీపతి నికటమ్మున
సర్వప్రాభవము తాన సవరించె నొగిన్. 33

క. శ్రీరుచిఁ దగు వేంకమయను
నారిన్ బరిణయము చెంది నానాఁటికి స

ర్వారాయఁ డతఁడు గనె నిం
పారఁగ నొకతనయు వేంకటాచలనామున్. 34

క. విద్వాంసుల కాతఁడు సం
విద్వరుఁడై యొసఁగె ధరణిఁ బెల్లుగ విఖ్యా
జద్వర్తన యగు వెంకమ
నుద్వాహము చేసికొనియె నొగి శుభరీలన్. 35

క. ఆయమయం దాతఁడు విపు
లాయుర్భాగ్యముల నొప్పు ననఘుల సర్వా
రాయని, నచ్యుతరామున్,
గేయగుణుం బద్మనాభునిన్ గనె ముగురన్. 36

సీ. తనతోడ వైరంబు గొనినమాత్తర నేల
రాచినాఁడు ధనమ్ము దాఁచినాఁడు
ఆశ్రయించినవారి కఖిలసంపదలిచ్చి
కాచినాఁడు ప్రతిష్ఠచూచినాఁడు
తనవారి ఘనత నెంతయుఁ బోచి సుఖడోల
నూఁచినాఁడు యశంబు దోఁచినాఁడు
మహనీయులకుఁ బెక్కు మాన్యమ్ములొసంగ
నోఁచినాఁ డపకీర్తి త్రోచినాఁడు

తే. గీ. రావు వేంకటనీలాద్రిరాయనృపతి
తరుణి శ్రీభావయాంబిక తనకుఁ దగు ని
యంత్రిగానెల్లయెడల స్వతంత్రుఁడగుచు
సర్వరాయఁడు ప్రఖ్యాతి సంతరించె. 37

క. పేర్వాసికెక్కి యెల్లెడఁ
బర్వఁగఁ, దనయున్న వీరవరమునయందున్
జెర్వొక్కటి త్రవ్వించెన్
సర్వారాయండు ప్రజలు సమ్మదమందన్. 38

మ కవియై పండితమండలీమృదుమనఃకంజాతకంజాతబాం
ధవుఁడై యచ్యుతరాముఁ డెంతయు దయాదాక్షిణ్యముల్ గల్గి బాం
ధవవిశ్వాసము నొంది యెన్నఁదగు తాణాదాసుఁడై మించి వీ
రవరగ్రామము పేరుగాఁ దగుమితా రక్షించె నిర్వైరియై. 39

సీ. ఏనాఁడు చూచిన నానావిపశ్చిత్ప్ర
సంగసంగత మగారాంగణంబు
ఏవేళఁ గనుఁగొన్న శ్రీవల్లభకథాభి
ధానపారాయణంబాననంబు
ఏకాల మరసిన సాకల్యముగ వనీ
పకకోటుల కొసంగు పాణియుగము
ఏక్షణం బీక్షింప నిందిరానాథస
త్కథల నాకర్ణించు కర్ణయుగము

తే. గీ. గలిగి పండితమండలి "లలితపాండి
తీవిభవమున్నవాఁడవు నీవు శాస్త్రి
నాఁదగుదువోయి" యనుచు విజ్ఞానమహిమ
వొగడఁగ యశస్వి పద్మనాభుండు తనరె. 40

క. ఒకయాత్మబోధమను పు
స్తకమున్ గృతిగాంచి యతఁడు దనియించెను న
య్యకలంకుని సుబ్రహ్మ
ణ్యకవీంద్రున్ సాహితీరసాంబుధిచంద్రున్. 41

ఉ. ఏఁబదిమాటలేల వినుఁ "డేఁబదివేల వరాలమూట వి
ద్యాబలమున్నవారలకు దానముచేసిన మేటిదాత" నాఁ
గా బహుపండితుల్ వొగడఁగా వినినారము మేముకాక యిం
కేఁబదిమందియైన నుతియింపఁగ నేర్తురె? పద్మనాభునిన్. 42

క. అసర్వారాయఁడు కవు
ణాసౌశీల్యాది లక్షణంబులకున్ గుం

భీసుతసతియగుచెల్లాం
బాసాధ్విన్ బెండ్లియాడె భాసురలీలన్. 43

తే. గీ. ఆసతీరత్నమందు నయ్యనఘమతికి
సంభవించిరి వేంకటాచలము పద్మ
నాభమూర్తియు నరసింహనాయఁ డనఁగ
నాత్మజాతులు కూఁతు రమ్మాయి యనఁగ. 44

క. వరహాలను వెంకయకున్
దరుణీమణియైన యమ్మనకుఁ గూఁతురు ము
ద్దరగడకులభవ నాగమఁ
దరుణీరత్నంబుగా నతఁడు వరియించెన్. 45

తే. గీ. పేర్మి నాగమకాంతను బెండ్లియాడి
వేఁకటాచలనాథుండు వెలసినట్లు
పేర్మి నాగమకాంతను బెండ్లియాడి
వేంకటాచలనాథుండు వెలయకున్నె. 46

క. తాతయగు వేంకటాచల
మేతీరునఁ బేరుగాంచె నేతీరున భూ
దాతయను యశమునించెనొ
యాతీరునఁ బ్రబలె వేంకటాచల మితఁడున్. 47

క. ఆరమణియం దతడు స
ర్వారాయని దాత పేరివరహాలను సు
బ్బారావున్ గనెఁ గూఁతుల
నారసె నమ్మన్నయనఁగ నమ్మాయియనన్. 48

క. అయ్యేవురపత్యమ్ములు
నెయ్యముఁదియ్యమును నెఱప నెఱిఁగాంచిరి యా
యయ్యమలిరువురు పెంచిన
యయ్యమ్మాయియను మేనయత్తయు మిగులన్. 49

క. దూఁటము తిమ్మయకూఁతు సు
శీలన్ బ్రహ్మాంబ యనెడి చెలువఁ గవితా
లోలుఁడు సర్వారాయఁడు
కేలంగొని సుఖముచెంది కీర్తివహించెన్. 50

క. చక్కనిసాహిత్యము నుతి
కెక్కిన వాదాన్యకంబు నెఱుకయుఁ గలఁడై
యెక్కువ సర్వారాయం
డక్కొమరులలోనఁ బ్రబలె నతినయగతులన్. 51

క. నిగమాంతవేత్త కవియును
నగు సింహంపూడి కామయాంతర్వాణిఁ
దగఁగొల్చి సాహితీపా
రగుఁడై యలరారె సర్వరాయఁడు పేర్మిన్. 52

క. వరహాలు సహజభావముఁ
బొరయఁగ జనియించినట్టి పుణ్యాత్మునకున్
విరతాగర్భశ్రీమ
త్తరసికులు వచించుటయును దబ్బఱయగునే. 53

సీ. విద్వాంసుఁడనుమాట విన్నంతమాత్రన
మనమున నానందఘనతఁ జెందుఁ
జెంది యాతఁడు తన్నుఁ జేర నెప్పుడు వచ్చు
నో యటంచును మది నూరుచుండు
నుండి యాతఁ డూరి దండకేతెంచిన
నెదురుగాఁ జను దూర మెంతయేని
చని తోడితెచ్చి వచ్చినవారితో శాస్త్ర
ముల సందియమ్ములు ముచ్చటించు

తే. గీ. ముచ్చటించి మనమ్మున లొచ్చుగాని
సంతసముమీఱ వారల శక్తిఁ గొలఁది

సత్కరించి వినయమున సాగనంపు
సర్వరాయండు పినతాత సాటిగాఁడె! 54

తే. గీ. తాతతండ్రులమర్యాద దప్పనీక
సర్వరాయండు సోదరసహితుఁడగుచు
భూసురాశీర్బలమ్మునఁజేసి వృద్ధిఁ
జెందెఁ జెందుచున్నాఁడు చెందఁగలఁడు 55

—• షష్ఠ్యంతములు •—

సీ. ఏతాదృశస్ఫీతిభూతివిఖ్యాతివి
ద్యాతిశయద్యోతితాంతరునకు
నాగమోదరపయస్సాగరచంద్రోది
యునకు వాదాన్యకకనకఖనికి
ననుజస్వితయమనోవనజభాస్కరునకు
వేంకటాచలపుణ్యవిభవమునకు
నేరువాకలగోత్రవారాశిభవునకు
దేవతాద్విజభక్తిపావితునకుఁ

తే. గీ. బుండరీకాక్షపాదసంభూతమణికి
భూవరహితున కాచారపావనునకు
సరసకవిరాజపిక పుష్పసమయమునకు
సంచితాజన్మభాగ్యవిస్తారునకును. 56

క. వీరవరగ్రామణి కతి
ధీరున కతిసాహితీకధీశాలికి గం
భీరునకు శాంతునకు స
ర్వారాయని కనఘతోఁట వంశభవునకున్. 57

వ. ధనకనకవస్తువాహనపుత్రపౌత్రాదిసర్వాభ్యుదయపరంపరాభి వృద్ధిగా మా యొనర్పంబూనిన యేలామాహాత్మ్యమ్మునకుఁ గథాక్రమంబు. 58

# కథాప్రారంభము



తే. గీ. నైమిశాఖ్యనెసఁగు నరణ్యమ్మునందు
శౌనకాదిమహామునుల్ శాంతిధనులు
వ్యాసశిష్యుండుఁ బౌరాణికాగ్రణియగు
సూతుఁ గన్గొని హర్షసమేతులగుచు. 59

చ. తెలిపితి దైవతమ్ములగు తీర్థము, లందును గౌతమీనదీ
కలితములైన శాఖల ప్రకారము లానతియిచ్చి, తింకఁ ద
ద్విలసిత మేల నాఁజనునదీమణియై యొకశాఖ కొంతమం
డలము పవిత్రితం గొలిపె నా మునువింటిమి రౌమహర్షణీ. 60

క. ఏవేవి దానఁగలతీ
ర్థావను ? లెందుండి యెచటి కానది చనె ? నా
యావిధమంతయు నానతి
యీవే, మాపాలిదైవమీవే ! యనఘా. 61

శా. "ఏలా భుక్తివిధాయినీ" యనుచు మున్నీవెన్న భీమేశ్వర
శ్రీలామండలవర్ణనాదృతి మతిన్ హెచ్చింపఁగా మాకుఁ ద
త్కాలద్యుతుఁ దదాపగామహిమ వక్కాణింపుమన్నంత వా
చాలాలిత్యము లేకపోయెను దదివ్వన్నేఁడు తీర్పందగున్. 62

క. అని శౌనకాదిమును లడి
గిన సూతుఁడు గురుపునకెఱఁగి కడఁగి కలహా
శనమునికి నజుం డెఱిఁగిం
చినవిధమునఁ దద్విధంబు చెప్పఁదొడంగెన్. 63

శా. కిమ్మీరుండను రక్కసుం డొకఁడు వేగిదండకారణ్యమ
ధ్యమ్మున్ జేరి సుఖమ్ము వీడి కడుముక్తాహారుఁడై యొక్క పా

దమ్మర్వీస్థలి మోపి చేసె నయుతాబ్దమ్ముల్ తపంబోలిఁ జి
త్తమ్మున్ దాఁదరుణేందుశేఖరపదాద్వైతమ్ముగాఁ జేయుచున్. 64

క. కులగిరులు గ్రక్కదలె న
ఖులు ఘూర్ణిల్లెన్ దిగంతములు బీఁటాటెఁ
దలకడచెన్ జ్వలనము చు
క్కలురాలెన్ దత్తపోనుగతమగు వేఁడిన్. 65

సీ. తలమీఁదిగంగ కడలిరాచపసిబిడ్డ
యగుచందురుని ముద్దులాడుచుండఁ
జేతిలోఁ దనరారు జింకకొమ్ములు తూఁగి
జీరాడుజడలలోఁ జిక్కువడఁగఁ
బులితోలుపై వ్రేలు పున్కదండలచాలు
చిలువరాతలలమణులను నొరయఁ
గందోయిఁ దొరఁగెడి కరుణామృతపువెల్లి
మిసిమినాఁ దెల్లనిమేను మెఱయఁ

తే. గీ. గొండరాచూలు తనకొక దండగాఁగ
గిబ్బతత్తడిపై నెక్కి కెలన నడచు
భృంగితోఁగొన్నిముచ్చట లెంచికొనుచు
నమరమౌళికిఁ బ్రత్యక్షమయ్యె శివుఁడు. 66

తే. గీ. ఇట్లుచూపట్టినట్టి మహేశ్వరునకు
సాగి సాష్టాంగముగ నమస్కార మాచ
రించి కృపమీఱఁ దన్నాదరించు నతని
యెదుట నిలిచి స్తుతించె నిర్జరకమౌళి. 67

మ. కరుణాసాగర ! బాలశీతకరరేఖాశాలిజూటాల ! ని
ర్జరగంగాతటినీమనోహరణ ! సూర్యాచంద్రమోవహ్నినే
త్ర ! రమానాథముఖామరప్రణతపాదా ! నీకు జోహారు పా
మరునిన్ బ్రోవుము నన్ను శీతనగజామాతా ! దయాంభోనిధీ ! 68

క. అజగవ్యాశయ ! నగశయ !
యజగవశయ ! విమతమర్దనాశయ ! నీకున్
ద్రిజగత్పాలనధుర్యన
కజరామరణునకుఁ బ్రిణతి యర్పింతు శివా ! 69

క. దాతవు ముముక్షుజనులకు
నేతవు భూతముల కభయనేతవు నగజా
మాతవు మాతవు భూమికిఁ
దాతవు మాకెల్ల నీన తరుణేందుధరా ! 70

సీ. పోతుతత్తడితోడఁ బోరాడి జడదారి
బుడుత కాయువొసంగి ప్రోచినావు
బాణాసురుని యింటఁ బడి వానిమొగసాలఁ
గాల్బంటురీతిగాఁ గాచినావు
పాలమున్నీటఁ బొల్పడినవిసము ద్రావి
సోఁకుమూఁకల దయఁజూచినావు
నినుఁగడ్పులో నుండుమని వేఁడు దానవు
తనవున నెమ్మేను దాఁచినావు

తే. గీ. నీకు భక్తులయెడఁ గల్గు నిరుపమాన
కరుణ యేదేవతలకైనఁ గలదె శీత
గిరిసుతాకలితాంగ ! చందిరసితాంగ !
రాజకలితోత్తమాంగ ! ధరాశతాంగ ! 71

క. అనివినుతించిన హరుఁ డా
తనిఁ గనుఁగొని "నీ యభీష్టదంబగు వరముఁ
గొనుమిచ్చెద" నన వాఁ డి
ట్లనియెన్ ముదమార ముకుళితాంజలియగుచున్. 72

వ. "దేవా పనసేక్షునారికేళకర్రిముకరసాలాదికారామమ్ములును ముక్కారుం
బండు కేదారమ్ములును నేనధివసించు నీవింధ్యారణ్యభాగమ్మునందు సం

పూర్ణమ్ములగుటకు నిమ్నగత్వమ్మును సాగరసంగత్వమ్మును లేక సతతజలపరివాహయగు నొక్కఁడుసీలలామన్ బ్రవహింపఁజేయఁ గోరెద" ననుడు మందస్మితసుందరవదనారవిందుం డగుచుఁ జందిరశేఖరుం డిట్లనియె. 73

తే. గీ. నీవుకోరినవర మది నీక కాక
జగములకు నెల్ల సంతోషసాధకంబు
గాని యొండు వచించెదఁ గడఁగి దాని
నాలకింపుము సావధానాంతరమున. 74

క. ఏలాముని నాకై యీ
లీలం దపమాచరించు లేఖాపగతోఁ
బోలునొక పాపహారిణిఁ
గూలంకషఁ గడలి కిచ్చికోలున కెలమిన్. 75

వ. అతని కా వరంబు ప్రసాదించుతఱి ధనదధిష్ఠితప్రదేశంబుమీఁదుగాఁ దీసికొని పోనానతిచ్చి యేదేని నొకకపటోపాయమ్మున సాగరసంగమం బాఁగెద ననుడుఁ గిమ్మీరుండు పురవైరి కిట్లనియె. 76

క. దేవా ! యేలామునియున్
దేవాపగవోని యొక నదీమణి నప్పా
రావారమున కొసంగం
గా వలసిన కతము సెప్పఁగావలె నాకున్. 77

క. అనుచు గిరిశుండు నేలా
మునివరుని తపంబు లోకములకెల్ల వినా
శనకర మగుగతి నున్నది
చనఁగావలె నతనివర మొసంగుటకొఱకున్. 78

వ. అని యానతిచ్చి నీవడిగిన ప్రశ్నమ్మున కిట కనతిదూరమ్మున నీకెదురగు వృద్ధ మునీంద్రుం డుత్తరంబిచ్చునని యంతర్ధానంబు చెందుడుఁ గిమ్మీరుండు నచ్చోటు కదలి వృద్ధుంగాంచి కడచినవృత్తాంతమ్ము చెప్పి యడిగిన నతని కతం డిట్లనియె.

సీ. పులికశేరుకమీఁదఁగలతీఁట నేచోటఁ
గొమ్ములతో జింక గోఁకుచుండు
నచిరప్రసూతమ్ములైన లేళ్ళేచోటఁ
దపసులవీఁపులు దడవుచుండు
మొదవులేఁగలకైనఁ బులియాండ్రు రేచోటఁ
జనవుగాఁ బాలిచ్చి సాఁకుచుండు
నీవేళ నీవారతృణరాసు లేచోటఁ
జిఱుతవేళలతోడఁ జివుకుచుండు

తే. గీ. లతలు నగములతోడ షడృతువులందు
నేకరీతిగఁ బుష్పఫలైకతాన
గతులఁదనరారు నేచోట గౌతమముని
యాశ్రమం బది యొప్పారు నశ్రమంబు. 80

చ. అచట వసించు గౌతమమహాముని శిష్యగణమ్ముతో దళ
ప్రచితకుటీరభాగమున భాసురవృత్తులు మౌనిసంఘ మీ
ద్యచరితు లేచికొల్వఁగ నయమ్మగ వారల కాగమాంతవా
గ్రుచిరకథామృతమ్మున నకుంఠితమోక్షపదమ్ము చూపుచున్. 81

వ. అటు లమ్మునీంద్రుండు తదాశ్రమమ్మున సర్వోపనిషదుద్ఘుష్యమాణ బ్రహ్మానందపరాయణమానసుం డగుచుఁ గాలంబుగడపుచున్నంత నొక్కనాఁడు కలహాశనుండు, 82

శా. కైలాసమ్మున కేగి యచ్చట నుమాకాంతామణిం గాంచి "యో
ప్రాలేయాచలకన్యకామణి ! కృపాపారీణవై నీమగం
డాలేఖాపగ నుత్తమాంగమున నిన్నర్ధాంగమం దుంచినాఁ
డౌలే" యంచు సపత్ను లిర్వురకుఁ బోరాటంబుఁ గల్పించుడున్. 83

క. కలహాశనమునిఁ గని య
క్కులపర్వతరాజపుత్రి కోపన యగుచున్
"దలమీఁదనుండు సవతిని
నిల దింపునుపాయ మొకటి యెఱిఁగింపు" మనన్. 84

వ. అతండును వల్లెయని "జయావిజయలను నీనెచ్చెలుల రప్పింపుము, వారు కృత్రిమగోరూపధారిణు లగుచు గౌతమాశ్రమమ్మునకుం బోయి తత్రత్యనీవార సస్యభక్షణం బొనర్చినంత భవదభీష్టంబు చేకుఱు" ననుడుఁ బార్వతి చెలులం బిలిపించి కలతెఱం గెఱింగించిన. 85

సీ. కప్పువోయినయింటఁ గల వాసములఁ దేవ
బక్క ప్రేవులతోడి పక్కలమర
నీ రెండిపోయి వన్నియ దక్కు పెన్పాయి
పోలఁగాఁ దగు వాలమూలమొలయఁ
జిరకాలభుక్తమై చివికినపొలికట్టు
భాతిగా నీరోమవాల మెసఁగఁ
బ్రాగంచపట్టెలపై నయశ్శంకుల
బొగడలునా ఖురములు చెలంగ
తే. గీ. గడియ కొకనూఱుసారులు కదలి జాఱు
గోమయస్రుతి యొడలిపై దోమపిండు
ముసరఁ జేయఁగఁ బెంపేదు ముసలియాల
యాకృతి వహించి రంత జయావిజయలు. 86

వ. ఇట్లు భీభత్సమ్ములగు గోరూపమ్ములతోడ గౌతమాశ్రమమ్మునకుంజని తదుప్తమ్మగు నీవారసస్యమ్మునంబడి చెల్లాచెదరు గావించిన గౌత ముండును, 87

క. హుమ్మని కసరుచు దర్భా
గ్రమ్మున నదలింప నదియు కతముగ నొకయా
"వమ్మా" యని యార్చుచుఁ బుడ
మిమ్మృతి గని పడియె ముని కమితభయ మొదవన్. 88

వ. రెండవయావును బలాయమానయగుచు నిటకుఁ బంచషయోజనదూరస్థమ్మగు నేలేశ్వరమ్మను నేలామున్యాశ్రమమ్మునం బడి మడియుటయు,

తే. గీ. నెట్టపంటగ నాశ్రమనికటమునకు
వచ్చిచచ్చిన మొదవును బెచ్చుపెరుఁగు

దుఃఖభరమునఁ గాంచి తుందుడుకుఁ జెంది
నివ్వెఱఁగుపడె నేలామునిప్రవరుఁడు. 90

వ. పదంపడియొకశిష్యునింబిలిచి "యియ్యదియెందుండియిందేతెంచెనో, యేమికతమ్మునని ట మృతిఁగనెనో సవిస్తరమ్ముగఁ దెలిసికొ" మ్మని పంచిన వాఁడును గౌతమాశ్రమంబుదరికిం బోయి యట మృతగోవిష యంబగువిచారమ్మున మ్రగ్గుఋషితండమ్ముం గాంచి కలతెఱఁ గెఱిఁగి సమస్తమ్మును దనగురువునకు విన్నవించె. 91

క. "ఋషులును గోహత్యాకి
ల్బిషయుతు గౌతమమునిని వెలింబెట్టుచు నా
వృషహాయశిరస్థ్సకూలం
కష నిలకుం దె" మ్మనిరి యఘ మెడలుపొం చెన్. 92

వ. అనవుడు గౌతముండును నేలామున్యంతేవాసికతమున ద్వితీయగవీమర ణమ్మును వినుటంజేసి "తద్గోహత్యాజనితంబగు కలుషం బెవ్వరిది" యని యడుగుడు ఋషులిట్లనిరి. 93

క. "ఎవని వనాంతమ్మున రెం
డవయావును జచ్చియుండె నతఁడ తదేనో
ర్ణవపతితుఁడు కాఁగలఁ" డను
చు వినిచెఁ దదుదంత మతఁడు సొంపుగవినియెన్. 94

వ. విని "తదఘనిష్కృత్యుపాయం బానతిం" డనుచు నేలామునియు గౌత ముం బోలె ఋషుల నడిగిన వారును నతనికిం బలె నొడివి రిట్లిరు వురును గోహత్యాసమాక్రాంతులగుచు బ్రహ్మగిరికడకు గౌతముం డును వింధ్యగిరికడ నేలామునియు నరిగి యచట ఘోరమ్ములగు తపమ్ములొనర్చుచుండి రంత, 95

క. దేవేంద్రుఁడు తన్మౌని త
పోవిభవమ్ములకు దిగులువొంది తనంతన్
భావజుఁ బిలిపించి మనో
భావము తెలియంగ వినిచెఁ బనపడి యతఁడున్. 96

వ. "ఇంతమాత్రమ్మున కింతచింతయేల" యని యచ్చరలయందుఁ బ్రౌఢ
లగు తిలోత్తమోర్వశుల రప్పించి యిట్లనియె. 97

ఉ. అచ్చరలార! మీ రతిరయమ్మున బ్రహ్మనగమ్మునందుమై
మచ్చికయైన లేక నియమమ్మున వర్తిలు గౌతముఙ్ జగం
బచ్చెరువంద వింధ్యనగమందుఁ దపంబొనరించు తాపసిన్
బొచ్చెము కొల్పి యిర్వురను మోసమొనర్పుఁ డటంచుఁ బంచినన్. 98

శా. కొంగుల్ జాఱఁగఁ గట్టి యాచిగురుటాకుంబోండ్లు నెమ్మేను లు
ప్పొంగన్ భూషణభూషితాంగులగుచున్ భూషామణీపాళి మ్రో
యంగన్ జన్నులు పైఁటలో నొదిఁగి పైయంచెత్తి దోబూచులా
డంగన్ డగ్గఱి రమ్మునీంద్రులను గాఢప్రేమలో ముంపఁగన్. 99

వ. అం దూర్వశి గౌతమముని యెదుట హావభావోచితమ్ములగు నృత్యమ్ములు
సల్పియుఁ గర్ణపేయమ్ములగు గీతమ్ములు పాడియు మరులుగొల్ప
నవశయగుచు మరల నమరావతి కరుగుదెంచి తదీయగాఢతపోనిష్ఠా
గరిష్ఠత్వంబు దేవేంద్రునకు విన్నవించెఁ; దిలోత్తమయు నేలాముని
పాలికింబోయి, 100

ఉ. మ్రాఁకులు మోసులెత్త సెలఱాలు చెమర్పఁ బటీరకోటరా
నీకనివాసమైతగు ఫణిప్రకరంబు కరంబు వేడ్కమై
నూకొనఁ గోకిలల్ ప్రతిరవోదయముం బొనరింపఁ బాడె న
వ్యాకులలీలఁ గట్టెదుట నమ్ముని యచ్చెరువంది చూడఁగన్. 101

సీ. ఘర్మాంబుబిందుప్రకాండంబు మేనెల్ల
ముత్యాలచేరుల మురువు నెఱపఁ
గాళ్ళగజ్జెలమ్రోఁత గళ్ళుగళ్ళని పజ్జఁ
గలయంచలకుఁ బ్రోదిగఱపుచుండఁ
జలితాంగుళీదళీకలితాభినయము వా
క్యపరంపరకుఁ డీక గాఁ జెలంగఁ
గలితకంకణఝుణత్కారంబు వనదేవ
తల వీనులకు నమృతంబు వోయఁ

తే. గీ. గులుకు క్రేఁగంటిచూపుల నలుక కొంత
సేపు సింగారమొకకొంతసేపు కొంత
సేపు కరుణము మఱికొంత సేపు హాస్య
మొలుక నాట్యంబు సల్పె నప్సరగుసాని. 102

తే. గీ. హరిహరబ్రహ్మ లెవని దాసానుదాసు
లెవని యావేశ మెట్టిజితేంద్రియులకుఁ
గనులు పొరఁగప్పఁజేయు నక్కమలశరుఁ డ
లతిఁగఁ బోనీక కలఁచె నేలాముసీందుని. 103

వ. ఇట్లు కుసుమశరశరవిదలితమానసుండగుచు నమ్మునీంద్రుండు తేజి చూచి యారామ రామణీయకమ్మున కచ్చెరువంది తపమ్మునాలించి మనమ్మున నిట్లు వితర్కించె. 104

శా. ఔరా! యీచెలి దేవతాతరుణియో, వ్యాళాంగనారత్నమో,
చారస్త్రీమణియో, కుబేరనగరీచార్వంగియో, కిన్నరాం
భోరుణ్నేత్రయొ, మానవాంగనయొ! సమ్మోదమ్ముమై నస్మదీ
యారామమ్మున కేగుదెంచెను మదీయమ్మైన పుణ్యమ్మునన్. 105

సీ. వికసదిందీవరప్రకరమ్మునకును నో
నామాలు చెప్పు నీ నాతికనులు
చక్రవాక పతత్రిచక్రమ్మునకును మం
త్ర ముపదేశించు నీతరుణిచనులు
పదియాఱువన్నె హొంబట్టుబొమ్మకు నైన
వెలఁ బెట్టనీయదీ వెలఁదియొడలు
మదదంతిగమనసామంజస్యమునకైన
లెక్కరా నీయ వీలేమనడలు

తే. గీ. కోటిచంద్రుల నొకసారి గొన సమర్థ
మైన దీ రామ ముఖకాంతి యతులకేని
మాన్యమీ భామ కంకణామందరవము
భృంగముల బారు మీఱు నీ యింతి యారు. 106

ఆ. వె. అంచు లేచి బిగ్గ న త్తిలో త్తమ హ త్తి
కౌఁగిలించుకొనియె వేగ మునియుఁ
గనులకింపు గల్గు కాంతఁ గన్గొనినంత
మారుబారిఁ బడనివారు గలరె! 107

సీ. తనచేతిసొమ్ము వెట్టని సౌధములభాతిఁ
గొమరారు వింధ్యాద్రిగుహాలయందుఁ
గమనీయసౌరభీకలితదిఙ్నీరేజ
షండమండితసర స్తటులయందు
వికసత్కుసుమపుంజవితతశయ్యాఘుమం
ఘుమితలతానికుంజములయందు
హిమరశ్మిదృషదకృత్రిమకుట్టి మావనీ
జాతశీతచ్ఛాయసరణులందు

తే. గీ. గిరినదీసైకతమ్ముల కెలఁకులందుఁ
జంద్రశాలాయమానరసాధరోన్న
తశిఖరతలములందు నతఁడు సుఖించె
న త్తిలో త్తమతో హ త్తి యనుదినంబు. 108

వ. ఇట్లు తిలో త్తమైకతానచి త్తమ్మున న త్తపస్వి యుండె; నట గౌతముం దూర్వశికి లోఁబడక తనంతఁ దపం బొనర్చికొనుచున్నంతఁ బురవైరి సాక్షాత్కరించి "వలయు వరమ్ముఁ గోరికొను" మన్న బద్ధాంజలిపు టుండగుచు నతండిట్లనియె. 109

తే. గీ. ఒక్కగోహత్య మద్వని నొక్కనాఁడు
నెట్టపంటగ నన్వచ్చి చుట్టికొనియె
"శివజటాజూటగతమగు సిద్ధతటిని
దె" మ్మనిరి మౌను లక్కందు తెరలుపొంటె. 110

క. కావున భూతలమున నీ
దేవేరిఁ బాఱఁజేయఁ దివిరితి నా కో

దేవర ! యనుగ్రహింపు మి
దే వర మని వేఁడినంత నీశుఁడు పేర్మిన్. 111

వ. ఒక జటాకుహరమ్మునుండి ధారాముఖంబుగ నద్దేవధునీలలామంబు వద లిన నయ్యది సహస్రముఖముల నుద్ఘోషించుచు మింటికిమంటికి నొ క్కటైపై బ్రహ్మాద్రి పయికిం బర్వుడుఁ బురారి గౌతమున కిట్లనియె. 112

క. "వెనుకకుఁజూడక వేగమ
చను మీ వార్ఝరము వెంటఁజనుదెంచును వా
ర్ధినిఁ గలుపు మెవ్వరేనియు
నిను నడిగిన నొక్కశాఖ నిమ్మి యనుడున్. 113

వ. గౌతముండును నతిత్వరితగమనమ్మున స్వాశ్రమతటమ్మున కేగుదెంచి యటనుండి యడిగినఋషులకెల్ల నొక్కొకశాఖ నిచ్చుచు రత్నాకరమ్ము నం గలిపె; నదియ యిట కనతి దూరమ్మున గోదావరియను నది యని. మఱియు నిట్లనియె. 114

క. ఏలామునియుం దపముం
జాలించి తదంగనావిచారవివశుఁడై
యాలీల సంచరింపఁగ
నాలేమయు విడిచి స్వర్గమరిగెఁదనంతన్. 115

వ. ఇట్లుచనినంతఁ దద్గతచింతాక్రాంతుండగుచు నమ్మునీంద్రుండు గోహ త్యాసంభూతంబగుపాపమ్ము శరీరమ్మునఁ బాండురోగాకారమ్ము వహించుడుఁదదేనోనివృత్తికై మును మునులు నొడివిన గంగావతరణం బింతకుమున్న గౌతమకల్పితంబని యెఱింగి యతనిపాలికిం జనిసవిన యమ్ముగ నిట్లనియె. 116

తే. గీ. అక్షపాదమునీంద్ర ! త్రైయక్షమైన
వరముపెంపున గోహత్య వదలితీవు
దివిజగంగను భూమికిఁదెచ్చి నాకు
నిమ్ముతచ్ఛాఖఁ బాపనివృత్తిపొంపె.

వ. అనిన గౌతముం "డింతకుమున్న యడిగితేని ఋషులకట్లనీకును నొసంగువాఁడ సాగరాధీనమొనరించితిఁ గానని<క నిందొకబిందువేని నాకీరా" దనిన నేలా మునియుఁగోపించి యిట్లనియె. 118

తే. గీ. పుడమినెల్లడ హూణులె యొడయలైన
కాలమునయందు నీనది కట్టఁబడును
తావకీనాశ్రమంబుచెంతను నటంచు
శాపమునొసంగి తనయంతఁజనియె నతఁడు. 119

వ. ఇట్లు చనిగోదావరికన్న మిన్న యగునొకతటినిం దెచ్చునిచ్చమరల వింధ్యాద్రి గహ్వరమ్మునఘోరమ్మగు తపమ్మున నున్నవాఁ డతం డచిరంబున భవదభీప్సితంబు చేకూర్చుఁ దదర్థంబ యీశ్వరగమనం బని చెప్పి వృద్ధయతీంద్రుండు యథేచ్ఛం జనుటయుఁ గిమ్మీరుండును దన్న దీపప్రవాహసమ్మక్షీనమనస్కుండగుచుఁ గిమ్మీరపురమ్మున నుండె; నట నీశ్వరుఁడును నచ్చోటు కదలి యేలామునికి సాక్షాత్కరించి యిట్లనియె. 120

క. ఎందులకై నీవు తపం
బుం దగుగతిఁ జేయుచుంటి వో యెఱుఁగుదు దీ
నం దీఱ నీదుపాతక
ముం దరలు నదిన్‌గ్రహించిముదమునఁ జనుమా. 121

వ. అని చెప్పి జటాకుటీరమునుండి యొకవారిధార ననుగ్రహించి మఱియు నిట్లనియె. 122

తే. గీ. ఎచట వెన్కకుఁజూచిన నచట నాఁగుఁ
గాన వెనుకకుఁ దిరుగక కదలు మినుఁడు
పొడుపుగిరిమీఁదఁ బొడువకమునుపె వేగ
వారినిధిలోనఁ గల్పు మవారణముగ. 123

వ. మఱియు నిట నుండి భవదీయాశ్రమంబగు నేలేశ్వరమునకుఁ జని యట నేతదీయ వార్ధ్యరమ్మున నేలేశ్వరు నభిషిక్తుం జేసి యట నుండి కిమ్మీర

సీమఁ జొచ్చి పీఠీపురమ్ము చెంతనుండి సముద్రమ్మునకుం గొని పొమ్ము పొమ్మని యానతిచ్చి యంతర్ధానంబుచెందిన నమ్మునియు హృదోపది ష్టంబగు మార్గమ్మునఁ గదలి చనుచున్నంత. 124

క. మును కిమ్మీరాసురునకుఁ
దనయిచ్చినవరము పెంపుఁదలఁచి హరుఁడు చ
య్యనఁ గోడియగుచు నది కూ
సినగతిఁ బీఠీపురమ్ముచెంతం గూసెన్. 125

క. ఏలాముని యారావం
బాలించి నిశావసాన మాయె నటంచున్
గాలోచితకృత్యమ్ముల
క్కాలోనన వెనుకఁజూచె నాశ్చర్యమునన్. 126

క. ముని నిలిచిన నయ్యేలా
ధునియునునట నిలిచిపోయెఁ దోయధికిం దో
డ్కొనిపోయి సంగమింపం
జననైతి నటంచు మునియు సంశయపడఁగన్. 127

వ. ఇట్లాపగారుఘురంబు నిలిచిపోయిన మునియు నిశ్చేష్టితుండగుచుఁ బ్రభాత సూచకమ్ములగు నిమిత్తమ్ములు మఱెవ్వియుం గానక యిదియెవ్వరి దియో యొకకపటోపాయం బని తలంచుచు గయపాదాధారంబగు కాసా రంబు తీరంబున నటునిటు తిరుగు చరణాయుధమ్ము గాంచి మెల్లన నిట్లనియె. 128

మ. చిరకాలంబు తపమ్మునల్పి తుద కా శీతాంశుజూటాలు మే
ల్వరమున్గాంచి ముముక్షమై నఘహరైలానామకేతన్నదీ
తరుణిన్వారిధి గూర్ప నేగుతఱి నంతర్విఘ్నముం జేసి పెం
పఱ నాకుం బరమాపకారమొనరింపం బాడియే పెకొగిన్. 129

వ. హరుఁ డీధునీలలామంబును నావెంటం బనుచుతఱి వెనుకకుం జూడకు మనియుఁ బ్రభాతమ్మునకు మున్న సముద్రముం బ్రాపించునదియనియు

నానతిచ్చిన నేనును నతిత్వరితగమనమ్మునఁ జనునెడ భవదీయారావం బాలించి ప్రిభాతాశంకి నగుచు వెనుకకుం జూచినకతన నీనది యిట నిలిచిపోయె. 130

క. కొక్కురుకోకో యని నీ
వక్కరణి నకాలమంద యిటు గూసి ననున్
ధిక్కార మొనర్చితి వీ
విక్కువఁగత నెప్పవేని నిను శపియింతున్. 131

క. పారావారములోనన్
జేరనినది ద్విజవరసముచితశుభకర్మ
ప్రారంభమునకుఁ దగ దని
నీరసముగ నెంతు రెంతనీరు గలిగినన్. 132

క. నిటలాక్షున కుల్లాసము
ఘటియించి కళింగదేశగతికై నది నా
క్కటి వెలయించిన దానిం
దుటికాలములోనఁ గూల్పఁ చొడఁగితి వకటా. 133

వ. అనుచు నిరంతరచింతాక్రాంతుఁడగుచు వందురు నమ్మునీంద్రునకు నిజస్వరూపమ్మున సాక్షాత్కరించి పురారి యిట్లనియె. 134

క. మున్నొక దోషాచరపతి
నన్నుగుఱిచి తపము చేసినన్ దానికి "నీ
వెన్నుకొనువర మొసంగెద
నన్నా" యన నాతఁడిట్టులడిగె వరమ్మున్. 135

క. ఏరాక్షసుండ మాకి
మ్మీరపురీమండలంబు మేల్ మేలుగ ము
క్కారుం బండఁగఁ జేయఁగ
వేతొక్కఁ దనుగ్రహింపవే పురవైరీ. 136

సీ. కడఁగి మద్దేశంబు కచ్ఛముగాఁజేయు
విమ్నగగావి ఘనీలలామ

మొండు పాఱఁగఁ జేసి నిండార ముక్కారుఁ
బండఁజేయుము ధరామండలమ్ము
సాగరసంగమ మూఁగఁగావలె దాన
లవణోదకముపోటు దవుల కైక్ష
వారామములు వృద్ధినందఁగా వలెఁ బన
సాగమంబులు రసాలాగములును
తే. గీ. నారికేళక్రముకములు నాగవల్లి
కలును మొదలగు మంచి నగములు లతలు
మిగులఁ జెలువారు కతమున జగతి నెగడి
మీఱఁగావలె నయ్య కిమ్మీరసీమ. 137

ఉ. అనుచు వరమ్ముఁ గోరుకొనునంతట నేనును వల్లెయంచు వా
నిని బరితృప్తుఁ జేసి యొకనిమ్నగకై తప మాచరించు నీ
కును వర మిచ్చి రాక్షసుఁడు గొన్నవరంబు ఫలింపఁ జేయ నీ
ధునికి సముద్రసంగమము దూరము చేసితిఁ గుక్కుటంబనై. 138

వ. కావునఁ గొండొకవిచారంబు దక్కుమదాజ్ఞంజేసి. 139

క. ఈకల్లోలినిఁ బాదగ
యాకాసారమునఁ గలుపు మచ్చట నే నీ
యాకారముతోనుందు ని
రాకులగతిఁ గుక్కుటేశ్వరాంకం బొప్పన్. 140

తే. గీ. గౌతమీసాగరమ్ములు కలియుచోట
నభిషవమ్ము లొనర్చినయంతఫలము
దీన స్నానంబుచేసిన మానవులకుఁ
గల దటంచు వరం బిత్తుఁ గరుణ నీకు. 141

క. ఏనరుఁడైనను నిత్యం
బీనదియందేని లేక యీమడుగునయం
దేనియుఁ గృతాభిషేకుం
డైనంత మహీయపదవి యతని కొసఁగుదున్. 142

వ. ఆదియునుంగాక కొండొకకాలమ్మునకు గౌతమ్యుపనది యగు శబరి నుండి వెడలి యొక శాఖ దీనం గలియు దానంజేసియు నియ్యది భుక్తి ముక్తిప్రదాయిని యనంబరఁగునని వర మొసంగు ననంగభంజనుం గాంచి యేలామునియు నాలీలా కల్పితంబగు కుక్కుటాకారం బప్పా దగయాకాసారతీరమ్మునం బ్రతిష్ఠించి యాశ్రమమ్మునకుం జని సుఖంబుండె నని విరించి నారదునకుఁ జెప్పిన తెఱంగున సూతుండు శౌనకాదులకుఁ జెప్పుటయు. 143

## ఆ శ్వా సాం త ప ద్య ము లు

క. నిరుపమసాహిత్యరసా
భరణ ! వితరణప్రవీణ ! పండితకవిరా
డ్వరుణాలయచంద్రోదయ !
చరణోద్భవ వంశరత్న ! సఫలితయత్నా ! 144

చ. పరతరుణీసహోదర ! విభాతివిభాసిసహోదరాదరా
దరహిమభూధరైణధరతారకతారకభూధరోదర
స్ఫురదురుకీర్తిహార ! పరిపూర్ణతరప్రతిభావిహార ! భూ
సురచరణాబ్జరేణుపరిభూషితహర్మ్యనివాసభాసురా ! 145

మాలిని. నయవినయవిహారా ! నాగమాంబాకుమారా !
స్మయనిరతవిదూరా ! సాధునుత్యప్రచారా !
నియతసుకృతకృత్యా ! నిత్యసంహృష్టభృత్యా !
ప్రియవిలసితసత్యా ! ప్రీణితార్థిప్రణుత్యా ! 146

## — గ ద్య —

ఇది శ్రీ * * *తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబగు
నేలామాహాత్మ్యమ్మునందుఁ
బ్రథమాశ్వాసము.



శ్రీమత్పరదేవతాయైనమః

# ఏ లా మా హా త్మ్య ము

## ద్వితీయాశ్వాసము

క. ధరణీసురపాదాంబుజ
పరిచర్యానిరత ! పాదభవవర్ణాగ్రే
సర ! సాహిత్యవిశారద !
సరసకవివిధేయ ! తోటసర్వారాయా ! 1

వ. అవధరింపు మనంతరంబు శౌనకాదులు సూతుంగాంచి యిట్లనిరి.

క. ఈయేలానదియొడ్డున
నేయేతీర్థములు గలవొ యెఱిఁగింపుము మా
కాయాతీర్థమ్ములు మఱి
యాయాతీర్థముల ముక్తినందినవారిన్. 3

వ. నావుడు సూతుండు బ్రహ్మ నారదునకుం జెప్పినతెఱం గిట్లు సెప్పం
బొడంగె. 4

సీ. సోమయాగము మొదల్గా మన్ననలుగన్న
జన్నమ్ము లొనరించుచున్నవారు
అతిథుల లభ్యాగతు లరుదెంచురే వారి
కన్నదానము చేయుచున్నవారు
అనృతంబు లేక విద్యల గోష్ఠిచే సర్వ
కాలంబు సుఖలీలఁ గన్నవారు
కొడుకులు మనుమలు కూఁతులు మొదలుగ
బహువృద్ధిగను కుటుంబములవారు
తే. గీ. ఆయువు శతాధికమ్ముగ నలరువారు
భూసురోత్తము లెపుడుఁ గాఁపురము సేయఁ

దనరు నేలానదీయామ్యతటనిఖాత
యూపభాసురమగు శాల్మలీపురంబు. 5

వ. అప్పురమ్మున.

తే. గీ. సోమయాజి యొకం డుండు సుదతితోడ
నతని నామంబు గణపతి యండ్రు భార్య
పేరు నరసాంబ యందు రాపెయును నాయ
నయును సంసక్తు లన్నదానమ్మునందు. 7

సీ. ఉదయమ్మునన లేచి యుదధిజాతకళత్రు
నొండె నిటలవీతిహోత్రు నొండె
ధ్యానించి యేలానదీనిర్మలాంబుప్ర
వాహంబులోఁ గ్రుంకి వార్చి ప్రాత
రౌపాసనమున యథాగమోక్తమ్ముగ
నగ్నులఁ బూజించి యంబికామ
హోమనూపాసనమ్మాచరించుచు ధర్మ
పత్ని పాకమొనర్ప వైశ్వదేవ
తే. గీ. మాచరించియు గృహదేవతార్చనంబు
చేసికొని బలియిడి గృహాజిరమునందు
లీల నిదురించు నతిథుల లేపి వారి
తోడఁ గుడుచు మృష్టాన్న మాబాడబుండు. 8

వ. ఇట్లు భుజించి వారికిఁ దాంబూలం బొసంగి దక్షిణ వెట్టి తీర్థయాత్రా మాహాత్మ్యకథనాదికమ్ములగు సల్లాపంబులఁ గొండొక సేపు గడపి వారును భోజనాయాసజనితనిద్రాపరవశాత్ము లగుడుఁ దానును గొండొక విశ్రమించి యంత నంతేవాసిజనము లేతేర నాసాయంబు సకల శాస్త్రార్థ పరిసంగమ్ము లొనర్చుచు సంధ్యాకృత్యమ్ములు దీర్చికొని యగ్నికార్యంబు నిర్వర్తించి సూర్యోఢులం గలసి భుజించుచు ననుదినం బిట్లు యుక్తక్రమమ్మునఁ గాలము గడపుచున్నంత నొక్కనాఁడు.

ఉ. అయ్యవనీసురోత్తమునియంగన భర్తకు వేడ్కమీఱఁ దా
నొయ్యన శయ్యపైఁ బదములొత్తుచు మెత్తనియెల్గుతోడ సా
హాయ్య మొనర్చు కంకణరుణారవ మైక్యముఁజెంద నిట్లనెన్
దియ్యఁదనం బపుత్రిగతి దెల్పెడు వంతకు వింతగొల్పఁగన్. 10

క. "సంతానము లేదను బలు
వంతన్ జిత్తంబు మిగుల వందురు దేవా!
యెంతటిసంపద గల్గిన
నింతికి సంతానవాంఛ యెక్కుడు గాదే. 11

సీ. సురభితైలము దెచ్చి శిర సంటి యొడ లెల్ల
రాసి సున్నియు హరిద్రియును జేర్చి
నట్టిమైపూఁతచే నలఁది నల్గిడి మంచి
నులివెచ్చనీర్వోసి జలక మార్చి
తనరుపయ్యంటచేఁ దడి యార్చి చెవిలోనఁ
దిరివెట్టి మేల్మికస్తురితిలకము
జాఱుగా నుదుట సింగారించి కన్నుల
నిండఁగాటుక వెట్టి నెఱులు దువ్వి
తే. గీ. సరిగఁ జేయుచుఁ గడుపార స్తన్యమిచ్చి
తూఁగుటుయ్యెలనుంచి సంతోష మెసఁగ
విసువులను నల్లనూఁచుచు నిద్రవుచ్చు
నవిద లేనోము నున నోఁచిరో మహాత్మ. 12

సీ. తొలిబాముననందు నోములునోఁచనిసతికిఁ
గలుగునే తనయుమొగమ్ముగనుట
ధూళిచేఁ బొరయుపుత్రుని మేను దుడుచుట
సుకృతంబుచేయని సుదతి కగునె
యుద్వాహపీఠిపై నొలయుపుత్రునిఁ జూడ
వఱలునే దురదృష్టవతికి నెందుఁ

గోడంద్రతోఁ గూడి కొడుకు సుఖించు సౌ
భాగ్యంబు గనునె నిర్భాగ్యురాలు
తే. గి. కొడుకులను గూఁతులను దనకొడుకు గనిన
వారిఁ దొడమీఁద నిడికొని వార్ధకంబు
నడపనేర్చునె కోటిజన్మములనుండి
యైనఁ బున్నె మార్జింపని యంబుజాక్షి." 13

క. అనుచుం దన సాధ్వీమణి
కనుఁగొనలం జాఱు నీరు కాలువయై చ
న్నొనలం బడఁ జింతించినఁ
గనుఁగొని యాసోమపీథి కలఁగినమదితోన్. 14

క. "జన్మము లెన్ని యొనర్చిన
సన్నుతగతి వ్రతము లెన్ని సల్పినఁగానీ
పున్నామనరక మేదఁగఁ
జన్నే యోసాధ్వి! యకృతసంతానునకున్. 15

ఉ. మానిని! యేలయేడ్చెదు కుమారుని నొక్కనినేని గాంచఁగా
లేని గృహస్థులందఱు మలీమసులై తొలిజాములందు నే
దేనియుఁ జేయలేదనుట తెల్లము నీబలువంతకంటె నా
లో నిరపత్యతావిధికి లొచ్చినశోకభరంబు కల్గెనే. 16

సీ. ధనములేకున్న విన్నునువుగా సంపాద
నముచేసి మిగుల నానందమొసఁగు
వయసంత కంత పోవఁగ మూఁడుకాళ్ళ ము
సలు లై నతఱిఁ బరిచర్య సేయు
కనుమొఱంగినఁ బ్రేతకార్యమ్ము నెఱవేర్చి
పలుగు పైశాచరూపమ్ముఁ బాపు
గయకేగి పుణ్యలోకమ్మురా విష్ణుపా
దంబుపైఁ బిండదానంబు సల్పు

తే. గీ. సుతులు లేకున్నఁ బరలోకగతులు సున్న
యనుచు ఘోషించు ధర్మమ్ము లనుపదంబు
కొడుకులకుఁగాని సెబ్రసెంచడవుఁజేఁత
నేసిన యధన్యులకుఁ బుత్రసిద్ధికలదె. 17

సీ. దశరథుం డనురాజు తనయులకై పుత్ర
కామేష్టి యను నొక క్రతువు చేసె
సత్యసంధుఁడు హరిశ్చంద్రుండు సుతునకై
వరుణుని గుఱిచి తపంబొనర్చెఁ
బరశక్తి నెదలోనఁ బాటించి వ్యాసుండు
సంతుకోసము పురశ్చరణసలిపె
సంతానవాంఛ హెచ్చఁగ మృకండుఁడు మున్ను
పశుపతిగుఱిచి జపమ్మొనర్చెఁ

తే. గీ. గాన నెంతటివారలకేనిఁ బూర్వ
జన్మకృతపాపపరిపాకజాతనిస్త
నయత పాయునె నీరజనయన! యింత
వంత నీవంటిదానికి వింతగాదె. 18

క. కావున మనమును దపముం
గావింతము మదిక్ ధైర్యగతినించుము ప్రా
గావేశితకర్మక్షతి
గావుటకై కుముదినీసఖతులితవదనా''. 19

మ. అని యోదార్చుచు బిగ్గగౌఁగిటికి డాయంజేర్చి యాసోమయా
జినికిఁ బొల్లిటిగాథలం దెలుపుచున్ జేలంబు చేఁబూని క
న్గొనలం గాఱెడు నీరముం దుడుచుచున్ శోకంబు వారించెఁ; గా
మిని కేశోకము పోదు భర్త తగునెమ్మిన్ జూచి లాలించినన్? 20

క. ఈగతి మృదుసల్లాపవ
చోగాథల గారవించుచో రాత్రియుఁ దా

వేగె నలయధ్వరియుఁ గ
ల్యాగమము వెలింగి యభిషవాదృతమతియై. 21

వ. కాలకృత్యమ్ములు దీర్చికొని పాంతేవాసిజనుం దగుచుఁ గదలి. 22

సీ. మలయమారుతపోతచలితశాఖాజాత
పతితపల్లవజాలభాసురంబు
చికోళ్రిదదంతప్రచితనారికేళక
తక్షరదిక్షరసోక్షితంబు
శుకముఖక్షతరసచ్యుతరసాలాలోల
వలయితగోపాలకలకలంబు
ఫలితపనసభూజపాదజాతఫలపల్లి
సారసౌరభయుగ్గిళాతటంబు
తే. గీ. హలసమాకృష్టతరరసాతలనిపతిత
వికసితపల్లవచ్ఛదప్రకటపుటని
పతదమితహిమజలపృషద్వితతదళస
మేతరంభానగవన మేలాతటంబు. 23

వ. చేరి తీర్థముఖంబు సొచ్చి కృతాచమనుండై శిఖాబంధంబు బంధించి గ్రుంకులిడి యఘమర్షణ ఋక్కుల జపించుచుఁ దటమ్ము చేరి పితృప్రీతిగ వాసోదక శిరోజోదకతర్పణంబులు గావించి శరీరసమ్మార్జనంబు నిర్వర్తించి. 24

క. క్రముకపల్లవదళీగత
విమలతరాంశుకము దీసి విధివిహితవిధా
నముగ ధరియించి తగుకృ
త్యములం దీర్చికొని వే గృహమ్మున కరిగెన్. 25

వ. అరిగి జాతవేదారాధనం బొనర్చికొనుచున్నంత. 26

సీ. కాషాయపరిధానకలితకటీభాగ
మర్కబింబస్ఫూర్తి నవనయింపఁ

జాలు నరుణశిరోజజటాభరమ్మును
గోపీనబద్ధదండోపరిష్ఠ
పుటితహస్తం బలాబూశలాటుకకమం
డలుగతేతరహస్త మళికపట్టి
కాసంగత్రైలాపగామృత్తిలకము స
ర్వాంగీణమగుభూతి యంఘ్రియుగళి

తే. గీ. మంచిపావాలు దయకసమానమైన
నయనయుగళంబు దర్భాసన ప్రశస్య
మానకక్షాంతరాలంబమానభస్త్ర
గలుగు జడదారి యొకఁ డింటికడకు వచ్చె. 27

ఉ. వచ్చిన మస్కరీంద్రుఁ డను వార్తను శిష్యులెఱుంగఁ జేయ లో
హెచ్చిన మెప్పుతోడ నెదురేగి తటాలున సోమయాజియుం
దచ్చరణమ్ములం బడి ప్రణామ మొనర్చుచు మద్గృహమ్మునన్
బిచ్చ యనుగ్రహింపఁ గదవే యని వేఁడెను సోమిదమ్మతోన్. 28

వ. ఇట్లు వేఁడి యత్యుచితంబగు సత్కారంబు నెఱవేర్చి కుశాసనోపవిష్టుం జేసి మీ యాడనితీర్థమ్ములును మీఁగ్రుంకని నదులును మీ చూడనిప్రదేశమ్ములును లేవు గా యనుచు మృదుమధురసవినయసరససల్లాపమ్ములఁ గాలమ్ము గడపుచున్నంత, 29

సీ. సోమిదమ్మయు వేగ సామి మాయింటికే
తెంచినా రనుచు నెంతే ముదంబు
తో రాత్రినాఁటి పుత్రులులేనిదుఃఖమ్ము
మఱచి యేటికిఁ జని మడుపు లుతికి
పస పైదువులకెల్లఁ బంచి తా మొగమునిం
డఁగఁ బూసికొనుచు స్నానంబుచేసి
పెంకికిఁ జనుదెంచి పెంకాయదొక్కల
నంటించి యొక్క క్షణార్ధమునకుఁ

తే. గీ. పాయసాన్నంబు మాషంపువటకములును
మున్నుగాఁ గలిగినభక్ష్యములును నాల్గు
కూరలును నాల్గుపచ్చడుల్ చారు శాలి
కొదనము సూపమును వేగఁ బ్రోదిఁజేసె. 30

వ. ఇట్లుగావించి పాకసమాప్తిం దెలిపిన నతండును నమ్మస్కరీంద్రునకు నైకవిధోపచారమ్ముల పత్యాచారానుగుణమ్ముగ భోజనమ్ము వెట్టిపిదప భుజించి పాదసంవాహనాదికమ్ములం దానును గులసతియు నతని శుశ్రూషితుం గావించుచుఁ దదీయముఖోదితపుణ్యకథామృతప్రవాహమ్మున నోలలాడుచు మెల్లమెల్లన నయ్యతితల్లజున కిట్లనియె. 31

క. "జన్మము లెన్నేఁ జేసితి
నెన్నికగలవ్రతము లెన్నియే నొనరిచితిన్
బున్నామనరకనీరధి
కి న్నావ లభింపదయ్యె గృహినగునాకున్. 32

వ. కావునఁ దదర్థమ్ముగ నేతీర్థమ్ములు సేవింతునో యేనదులఁ గ్రుంకుదునో యేదేవు నారాధింతునో తగినయోజ యోజించి నన్నుం గృతార్థుఁ జేయవే" యను సోమపీథి కయ్యతి యిట్లనియె. 33

క. ఏలానది కెప యగు నొక
కూలంకష గలదె ? కోరికొనుకోర్కుల వీఁ
జాలినది పెరటిలోచె
ట్టేలా మందునకు వచ్చు ? గృహికులతిలకా. 34

వ. అవిపెద్దయుం బొద్దు తత్తటినీమహత్త్వంబు వాక్రుచ్చి పటీయు విట్లనియె. 35

క. ఒకదినమున కొకవేయిగ
సికతాలింగములు కోటి చేయించి నదీ
సికతామయదేశమ్ముల
సకియును నీవును బ్రతిష్ఠ సల్పుఁడు వానిన్. 36

తే. గీ. కోటిసూర్యప్రకాస్తిఁ బేర్కొనఁగఁదగిన
కొమరుఁ డుదయించునీకిఁకఁ గొన్నియేండ్ల
కిచట స్నానంబు చేసిన నేరికేనిఁ
బుత్రు లుదయింతు రయ్య ! యపుత్రకులకు. 37

వ. పదింపడి యీశాల్మలీపురంబు కోటిలింగక్షేత్రం బనఁబరఁగు నని చెప్పి యిసు యిచ్చంబోయిన, నయ్యాల్మగ లిరువురును దదుపదిష్టప్రకారమ్మున ననుదినం బేలానదికిం జనుచు దినమ్మున కొకసహస్రమ్ము వంతునఁ గ్రమమ్మునఁ గోటిలింగమ్ములను బ్రతిష్ఠించునంత. 38

క. శతలక్షపరిమితిగ నై
కతశివలింగప్రతిష్ఠ గావించిన య
క్కతమునఁ దనూజవాంఛా
న్వితయగు నా సోమిదమ్మ వేఁకటిఁ దాల్చెన్. 39

క. నలుపెక్కఁగుచాగ్రమ్ములు
బలుపెక్కెన్ మధ్యసీమ పాల్పడె నంగ
మ్ముల వైవర్ణ్యము గర్భము
బలిసె న్నానాఁట నెలలు పదియు న్నిండెన్. 40

వ. పదింపడి యొక్క శుభముహూర్తమ్మున సోమపీథిని యొక్కకొమా రునిఁ గనియెనన విని ఋషు లిట్లనిరి. 41

క. అర్థియు విద్వాంసుండు స
మర్థుండును బుత్రవంతుఁ డపలితమూర్థుం
డర్థిన్ జన్నము సేఁతకు
విర్ధారితుఁ డండ్రు భువి మునిప్రకరమ్ముల్. 42

క. ఈసోమయాజి పుత్రుల
కోసము శివలింగములను గోటి ప్రతిష్ఠం
జేసె నని చెప్పితివి మా
కాసంశయ మేదఁ జేయ వయ్యా ! సూతా. 43

వ. అనిన సూతుం డిట్లను మహాత్ములారా ! నన్నొకపెద్దఁ జేసి యడిగితిరి
గాని యయ్యది తమకుం దెలియని యదియే ? శ్రుతులయందు నొడు
వంబడిన యగ్న్యాధాతకుం దగిన లక్షణమ్ములందు సపుత్రత్వమ్మును
గృష్ణకేశిత్వమ్మును బుత్రవత్త్వయు ననునివి శరీరదార్ఢ్యాపాదకమ్ములు
గాని వేఱొండుగావు ధరాసురమాత్రునకు నగ్న్యాధానంబుదౌర్బ్రా
హ్మణ్యనివృత్తికై యావశ్యకంబు గావున నీసోమయాజి యపుత్రకుఁ
డయ్యు నాయాక్రతువులొనర్చె; నిటు వేలాసైకతమ్మునఁ గోటిలింగ
ప్రతిష్ఠగావించి పుత్రసిద్ధి వడసినకతమున నచ్చోటు కోటిలింగక్షేత్రం
బనియు నపుత్రగతిక్షేత్రంబనియు నొడువంబడునని మఱియు నిట్లనియె.

సీ. అచటికర్ధక్రోశమగుచోట నమృతపు
త్రం బనునొక్క తీర్థంబుగలదు
తదధినాథుం డమృతసుతేశ్వరుం డను
శివుఁ డెల్లవేళ రక్షించు దాని
నమ్మహాదేవున కర్ధాంగియై యట
భ్రామరి యనుశక్తి ప్రబలుచుండు
నచట స్నానము చేసి శుచియయి మృతవంధ్య
యగుసతి యమృతసుతాభిధాను

తే. గీ. నీశ్వరుని మ్రొక్కి భ్రామరి నెదఁ దలంచి
భక్తిగొలిచిన జీవసూత్వము వహించు
నట్లు తత్ఫల మందినయట్టి యొక్క
చెలువ చరితంబు వినిచెదఁ జిత్తమలర. 45

తే. గీ. బ్రహ్మపురమను నొక జనపదము గలదు
బచ్చువాఁడొకఁ డుండు నప్పల్లెయందు
వానిపెండ్లము రూపసి వయసుకత్తె
పాటలాధర పలుగు పెల్లాటకత్తె. 46

ఉ. కాముని యాశుగంబన దుకాణమునం దది గూరుచున్న "సు
త్రామునివీటనైనఁ గనరానిది" యంచు నుతించుచుం జల

ద్వామకటాక్షపాతముల బ్రమ్ముచుఁ దన్నికటస్థవేదికా
సీమలఁ గాచి యుండుదురు చేరుచుఁ గోరుచుఁ గోడెకాండ్రొగిన్. 47

వ. మగఁడు సమీపమందుఁ గనుమాయక యుండినవేళ సాధ్విరీ
తిగఁ దలవంచు లాఁతిపయి దృష్టినిగుడ్పదు మాటలాడ ద
ప్మగఁ డొకకొంత మాటువడ మానిని చంచలలోచనాంతపా
తగతి బోజుంగురాయల యెదల్ వగులన్ దమిఁ జూచు నివ్వలన్. 48

మ. ఇటులానీలిపిసాళిజంత మది నెంతేఁ బల్లవాలోకలం
పటయై గాటపుటీర్ల మార్మగల కొంపల్ దూఱియున్ వారి నె
క్కటి నాత్మీయగృహంబుఁ జేర్చియును నక్కాఁపూగమాభ్యాస మా
దటఁ జేయన్ బ్రియుతించు భర్తనొక వేతాళంబుగాఁ జూచుచున్. 49

శా. పప్పుం బియ్యము నుప్పు మున్నుగను సంభారమ్ములం దెచ్చి పెన్
గుప్పల్వోయుచు విక్రయించుచును నందున్ వచ్చు లాభంబుతో
నప్పాపాత్మయుఁ దాసుమం బ్రదుకు బ చ్చాయీ యెడన్ బోవు నాఁ
డప్పాపాత్మిక యింట నుండును విటవ్యాసంగసంసక్తయై. 50

క. తనమగఁడు కస్తిపడి తె
చ్చినద్రవ్యము మాఱుమగలఁ జేర్చుచు వారిన్
దనియించుచు నక్కోఁమటి
వనజానన తిరిగె విహామఁ బరమున్ వెలిగాన్. 51

తే. గీ. తరుణి యిల్లాల యని లోనఁదలఁచుగావి
తిరుగఁబోతని యాఱుచ్చు తెలియఁ డకట
తనదు నోటివాసనయును తనవెలంది
జంకుతనమును దెలియువారలు గలారె! 52

వ. అంతఁ గొండొక కాలమ్మునకు.

మ. ఒకనాఁడమ్మగనాలు మాగ్మగనితో నుత్సాహమేపారఁ గొం
డికవాఁడంచు సుతుం దలంచి యెద వానిన్ లెక్కఁగాఁ జూడకే
చకితస్వాంతయుఁ గాక మన్మథరహస్యప్రక్రియం దేలెఁ; గాం
తకుఁ బూవిల్తుసివమ్ము గ్రిమ్మతటి నన్యం బెద్దియుం దోఁచునే. 54

ఉ. పిల్లఁడు చూచుచుండఁ దన పెన్మిటి నేని వెలంది కూడ ది
ట్లల్లగిచేఁత సేయఁ గనరాంగికి నెమ్మన మెట్టు లొప్పెనో?
తల్లి యొనర్చు నప్పనియుఁ దప్పని యొప్పనియే నెఱుంగ నేఁ
డుల్లమునందుమాత్ర మొకయుష్మలికం బుదయించె వానికిన్. 55

ఉ. కామముదీరి యప్పలుగుకామిని కాముకు నంపి తెల్వి రా
నేమియుఁ దోఁచ కీకొమరుఁ డింటన యుండఁగ సిగ్గు మాలితిన్
జీమ చిటుక్కుమన్నఁ బెఱచెల్వునికూటమి మాట దక్క న
క్కోమటితోడ నిచ్చిలుతరూళ వచించునొ యేమొ యం చొగిన్. 56

తే. గీ. మనము భయసాగరాంతర్నిమగ్న మగుడు
నతని నొక్క కరాసిక నటిఁతిఁగోసి
ప్రాతివేశినియింటికిఁ బజ్జ నొక్క
దరము గావించి యంతరస్థగితుఁ జేసె. 57

తే. గీ. కన్నకొమరుని గాసంత కరుణ లేక
బైసిమాలిన పరమనిర్భాగ్యురాలు
గొంతు తెగఁ గోసి చంపినవింత యింటి
యతఁడు పెంచిన సారమేయంబు చూచె. 58

ఉ. కోమటియున్ నిశాంతమునకుం జనుదెంచు పథమ్మునంద ల
బ్ధామయమట్ల నాల్క ననయమ్మను సాచుచు మాటిమాటికిన్
గోమటిదాని కృత్యమునకున్ బెగడొందుచు నోరు లేని య
క్కోమలసారమేయము దిగుల్ వడి చూడఁ దొడంగె నాతనిన్. 59

వ. వాఁడును సంభారమ్ము లమ్ముకొని యింటి కరుదెంచుచు మధ్యేపథ
మ్మున మతిభ్రష్టుండునుం బోలె ననుదినాగమ్యమానంబగు మార్గంబు
వదలి మాఱుదారి నూరు సేరినంత. 60

ఉ. "బాలునికేల యానగలు? ప్రాణము సైతము దక్కసీని దు
ష్కాలము వచ్చె" నంచుఁ బలుసార్లు వచించుచు మొత్తికొంచు "స్త్రీ
పాలికి నీదుసొమ్మలె యపాయముదెచ్చెనురా కుమార! యే
పాలసునింటి కేగితివొ? పార్వికశీతకరోపమాననా! 61

తే. గీ. రాకుమారులకైన నీరామణీయ
కంబులోన శతాంశమ్ముఁ గలుగఁబోదు
మరల నీనగుమొగ మొక్కపరి గనుంగొ
నంగల యదృష్టముండునే నాకుఁ గొడుక!'' 62

తే. గీ. అనుచు నెల్గెత్తి యింట రోదనము సేయు
చున్న పత్నిముఖం జూచికన్నుఁగొనల
నీర మొకయేఱుగా బచ్చ బారుమనుచుఁ
దాను రోదన మొనరించెఁ దనయుగుఱిచి. 63

వ. ఇట్లు గొంతవడి చింతించుచున్న యయ్యమాయికున కమ్మాయలాడి యిట్లనియె. 64

ఉ. పొద్దుటఁ జల్దికొంత దిని పోయెను రాతిరికైన రాఁడు నీ
ముద్దులమూట యే తులువ మోసము చేసెనొ సొమ్ముకోస? మే
సుద్దులురానివాని కిటు చూరలుగా నగ లుంచిపుచ్చ నీ
గ్గిద్దరి యూరివాండ్రు మనకాఁపురమున్ దుదముట్ట నిత్తురే. 65

తే. గీ. తోడిబాలకు లాటల నాడ రమ్మ
టంచుఁ బిలిచినఁ దిన్నఁగా నన్నమైనఁ
దినక పరువెత్తె వాండ్రు గుర్తింపరైరి
మాయమాటల మనయిల్లు మాయ నయ్యె. 66

వ. అనుచు ననేకభంగుల నిజమ్ముగ విలపించునదియుంబోలె దుఃఖించుచు నమ్మగనితోడఁ బ్రతియింటికిఁబోయి యడుగుచుఁ గృష్ణవేణీతటమ్ము నకుం బోయి యచటి కాశవనమ్మున నరయుచుఁ గుమారకా! యని తద్గుణమ్ము లుగ్గడించుచుఁ బూర్వజన్మ సంచితంబగు పుణ్యవశమ్మ నం జేసి. 67

తే. గీ. పతితపావన మను పేరఁ బరఁగునట్టి
కృష్ణవేణీనదీగతక్షేత్రమందు
నొయ్య నొయ్యన నడుచుచు నొడ్డువిరిగి
బోరగిలఁబడి తద్ఘురంబున మునింగె. 68

వ. ఇట్లు పడి మృతిచెందిన కులటం జూచి యక్కిరాటుండు గోరుచుట్టు మీఁది రోకటిపోటు చందమ్మునఁ బెచ్చుపెరుఁగు శోకభరమ్మున వందురుచున్నంత సారమేయంబు చిరకాలంబు తన్మార్గమధ్యమ్ముననుండి బచ్చురాకుంటకు విచారించుచు నింటికిం జనుదెంచి యెచ్చటనుం గానక కృష్ణాతటమ్మున నున్నవాని జనకోలాహలమ్మున గుఱుతెఱింగి చని యర్థసూచకమ్ములగు శిరఃకంపమ్ము లొనరించిన వాఁడును దాని వెంటవచ్చి ప్రతివేశిసిగృహనికటగర్తాంతరస్థగితంబగు కుమారకశేబరముం గాంచి మరల సంజ్ఞాముఖమ్మునఁ దన్నడిగిన నాసారమేయంబు.

క. తనయింటికిఁ జేరిచి శ
య్యను విటపరిభుక్తమైన యంబరమును బా
లుని కంఠము దునిమిన క
త్తినిఁ జూపెన్ జనములెల్లఁ దెలిసి నుతింపన్. 70

క. ఇతని వెలందుక యొక యుప
పతితోఁ గ్రీడించె; దాని బాలుండయ్యున్
సుతుఁడు గనె నంచు వాని య
తితిఁ గోసెనటంచు నిజమెఱింగిరి జనముల్. 71

వ. ఇట్లెఱింగి యతనింజూచి యేల శోకించెద వియ్యదియంతయు నీభార్య యొనర్చిన దుష్కృత్యంబనుచు నోదార్చుటయు. 72

క. అమ్మాటలెల్ల నమ్మి
నమ్మక యావర్తకుండు నాతిపడినక్షే
త్రమ్మునఁ బడి మృతిఁగనె శ్వా
నమ్మును విశ్వాసమును గనంజేసె నొగిన్. 73

వ. ఇట్లమ్మువ్వురుఁ బతితపావనక్షేత్రమ్మునంబడి మృతిచెంది రందుఁ గిరాటుండు సారమేయంబుతోఁ బరమపద మలంకరించె; నక్షులటమాత్ర మేలాతటభూషణమ్మగు భస్త్రాపురమ్మను జనపదమ్మున మాధవశర్మ యను నొక్క భూసురాగ్రణి కడుపునఁ గన్యకామణియై జనించె నన మును లిట్లనిరి. 74

తే. గీ. పతితపావనతీర్థసంఘాతమ్ము లతుల
కెల్లఁ బరమపదం బున్నదేని ముగుర
యందు నిర్వురు మోక్షమ్ము చెంది వైశ్య
తరుణి చెందని యానిమిత్తంబు చెపుము. 75

వ. నావుడు సూతుం డిట్లను; నాగామిసంచితప్రారబ్ధమ్ములు నాఁ గర్మ
మ్ములు మూఁడు తెఱంగు లందుఁ దీర్థయాత్రాదికమ్ముల నాగామి
సంచితమ్ములు నశించుఁ గాని ప్రారబ్ధం బనుభవైకనశ్వరంబ యని
మఱియును. 76

క. మును చేసిన దుష్కృత్య
మ్మునకుం బారంబు గనక పూర్వముకన్నన్
ఘనమగు భూసురకులమునఁ
బునరుదయము చెందెఁ దీర్ఘపుం బుణ్యమునన్.

వ. ఇటు భూసురయోనిం బుట్టిన యక్కిరాటి కపవిత్రంబగు శ్విత్రంబు
పురాకృతకర్మపరిపాకంబునంజేసి మేనెల్ల నలముకొనె నట్లు దశ
హాయనంబులు గడచుటయు. 78

క. పరిణయమగుటకు నే భూ
సురుఁడును నొడఁబడకపోయె సుకులీనుఁడు, దు
ష్కర మీ తనూజ కింకన్
బరిణయ మని తండ్రిమదిని వంతయుఁ బ్రబలెన్. 79

క. ఇహపరముల వెలి యఁట యు
ద్వహనము లేకుంట యదియుఁ దగఁ గా దఁట శ్వి
త్రహతి గలిగె నేనియు దు
స్సహ మగుఁగద దేహ మెంతచక్కని దైనన్. 80

వ. పదంపడి జామాత్రన్వేషణమ్మునకుఁ బాటువడుచుఁ బడుచునకు
వివాహంబు సేయులేమిం దన కేలానపేపరివేశంబ శరణంబని విచా
రించుచు మాధవశర్మ యొకనాఁటియుషఃకాలమ్మునం గుష్ఠరోగగ్రస్తుం
డును షోడశహాయనుండును నగు నొకధరాసురకుమారునిం గాంచి

నీవెందుండి యిందు వచ్చితి వెవ్వరివాఁడ వని యడిగిన నతం
డిట్లనియె.

సీ. మాది బ్రహ్మపురంబు మా శాఖ యాజుషి
కులము భూమీదేవకులము పేరు
కులశర్మ కౌశికగోత్రులబువాఁడ నా
తలిదండ్రు లటఁ జిన్నతనమునంద
స్మరణీయు లైరి; యామయ మిది ఘటియించెఁ
బ్రారబ్ధ మైనకర్మంబుకతన
నన్నోదకమ్ముల కాసించి మీవంటి
యాతిథేయులయిండ్ల కరిగి యచట

తే. గీ వారు పేర్మినొసంగినవంటకంబు
దైవసంప్రాప్తమనుచుఁ దద్దయు భుజించి
భవనముల నొందె రచ్చసావడుల నొందె
నధివసించెద మదుదంతమంత యిదియ.

వ. బ్రాహ్మణుండును దనకన్యక నతని కీఁవలంచి గృహమ్మునకుం
దోడ్కొని పోయి పుత్రి వేకతమ్మునఁ బిలిచి యిట్లనియె. 83

క. ఋతుమతియగు కన్యకయు
న్నిక్క తగదు బ్రాహ్మణులయింట, గృహినగు నాకీ
గతిగఁ బదియేండ్లు దాఁటిన
సుతకుం బరిణయములేమి చూచుటతగవే. 84

క. శ్వాత్రిణి వటంచు నిను సుచ
రిత్రులు ధనవంతులే దరిద్రులువే వో
పుత్రి ! ధరిత్రీనిర్జర
పుత్రులు వరియింప రేమవుదువో తలఁపన్ ! 85

క. ఇతఁడు స్నిపలెఁగుష్ఠా
న్వితుఁ డగుటన్ బరిణయంబు నేరఁడు నాకై

మతిమంతురాల యితనిన్
బతిగా వరియించి వంశపావని వగుమా. 86

వ. మనోవాక్కాయకర్మమ్ముల నితనియెడఁ బతిభక్తి నెఱపితివేని యైహి
కాముష్మికమ్ములు రెండును నీకు సమకూరు నిదియునుంగాక. 87

క. పతినొక్కని వరియింపక
సతి యతిగతి నుండి సర్వసంగమ్ములు వీ
డి తనరె నని యెచ్చటనున్
గత లెఱుఁగుదుమే పురాణగాథలయందున్ 88

క. బలవంతము లిందిరియములు
పలుగు సుమీ మదనుఁ డెంతవారగు విద్వాం
సులకేని లోఁబడఁడు, కాం
తలకుం దల మౌనె, విరతి తల్లీ? యెందున్. 89

క. పాతివ్రత్యమహత్త్వము
చేతన్ సావిత్రియనెడి చిన్నది మును దాఁ
బ్రీతయగు నాయకునకుఁ బ
రేతాధిపువలన నాయు విప్పించెఁ జుమీ. 90

వ. కావున నీసతీత్వమ్ముకతన నితండును నిర్గతరోగుం డగుచు నీ కను
కూలుండైన నగునని చెప్పిన విని జనకున కక్కుమారి యిట్లనియె.

తే. గీ. తగిన మగవానితోఁ బొందు తగునుగాని
తగని మగవానితోఁ బొందు తగదు సతికిఁ
గాన శ్విత్రిణి నగు నాకుఁ గమలజుండు
కుష్ఠరోగిని బతిగాఁగఁ గూర్పకున్నె! 92

వ. అది యట్లుండె.

ఉ. రెండవబ్రహ్మ వీవని యెఱింగి భవన్మతు నిమ్మహాత్ము నే
నిండుమనమ్ముతోడఁ బరిణేతగ నిక్కము చేసికొందు న
న్యుం డిఁకఁ గాముఁ డైన మది నొల్ల నటంచు వచించె, సోదరీ
మండలి నవ్వ నొవ్వక సమాప్తతదన్యవరాభిలాషయై.

క. అనుఁగుసుతపలుకు లన్నియు
విని ధరణీసురుఁడు మిగుల వేడుకపడి యా
తనిఁ గనుఁగొని యల్లన ని
ట్లనియెన్ మదిఁ బాదుకొనుభయంబెడలంగన్. 95

క. శ్వితృహతావయవయగు సు
పుత్రిక గల దొకతె నాకుఁ బూర్వకృతైనః
పాత్రీకృతకుష్ఠామయ
గాత్రున కిచ్చెదను నీకుఁ గైకొనుమ తగన్. 96

క. సుతకు వివాహము సేయక
ఋతుమతి యగు దానితోన యేలాతటినీ
పతనము మాకును, దిరిపపు
గతి నీకును దప్పు దీనిఁ గరుణింపఁగదే! 97

వ. అని యథార్థమ్ముగఁ బ్రార్థించు బ్రాహ్మణున కప్పరదేశి యిట్లనియె.

క. శ్వితృణి యగు మత్పుత్రిక
నత్రత్యుఁడవై గ్రహింపు మంటివి మృతిభీ
తిత్రస్తుఁడఁ గుష్ఠామయ
గాత్రుఁడ నా కేటి పెండ్లికతలు మహాత్మా! 99

ఉ. కాటికిఁ గాళ్లు సాఁచికొని కాలుపురమ్మున నిల్లు గట్టు నా
కేటి వివాహ, మేటిసుఖ? మేటికి నిచ్చిన మేలుఁ గాక, నా
బోఁటికిఁ గన్యనిత్తురె? ప్రభూతరుజావృతమైన మేనితోఁ
గూటికి గుడ్డకున్ బరులకొంపకుఁ బోయెడివాని కక్కటా. 100

క. మీ యావజ్జీవమ్మును
మా యాయతనమ్మ నంద మన్నించుచు నే
యేయెడనైనను బోషణ
చేయుదు నని నంత నొప్పఁ జెల్లునె నాకున్? 101

సీ. సంపాదకుఁడు గాక శ్వశురగృహమ్మున
వసియించువాఁడు జీవచ్ఛవంబు

వెలఁది అంకుతనంబు దెలిసియు దానిఁ జే
పట్టువాఁ డొక్క జీవచ్ఛవంబు
సంపాదకుండయ్యు సతికిఁ బెత్తనమిచ్చి
పఱలువాఁ డొక్క జీవచ్ఛవంబు
పూవులమ్మినచోటఁ బుల్లలమ్మంగఁ బా
ల్పడినవాఁ డొక్క జీవచ్ఛవంబు

తే. గీ. రసికులగు భూపతులు గానరాని కాల
మందు సరసంపుఁ గవియయి యలరునట్టి
పండితుం డొక్క జీవచ్ఛవం బటంచు
బుధులు వచియింత్రుగాదె యోభూసురేంద్ర! 102

ఉ. అంటిమి మున్నటంచు మరియాదకు లోఁబడి గాని, లేక నా
వంటి కురూపి కామయికిఁ బాతకి కామయదోషమెల్ల మై
నంటిన పుత్రినిచ్చితి మటంచును గాని భరింత్రు మీర, లే
యంటును సొంటు లేని భవవాలయగామిను లాదరింతురే. 103

ఆ. వె. ఎచట నేని బిచ్చమెత్తుచు దొరకినఁ
దినుచు దొరకకున్నఁ దిండి మాని
పొదలు ననద కకట, గుదిగోల నాకేల!
గొంతు నందుఁ గట్టికొనుట చెపుమ. 104

వ. అనుచుఁ బ్రత్యాఖ్యానంబొనర్చు ధరాసురకుమారు మాటలకుఁ బ్రత్యు త్తరం బీఁజాలక పురాకృతపాపపరిపాకమ్మునకై వందురుచు నప్పు డమివే ల్పతని కతిథి సత్కారంబు నెఱపి యానాఁటిరేయిదనుకఁ దనయింట నుండుమనిన నాతండును వల్లె యని యంగీకరించె; నప్పు లుకు లన్నియును నక్కన్నియ యేకాంతమ్మున విని తనలోఁ దానిట్లు చింతించె.

తే. గీ. కుష్ఠరోగిని నైతము కోరికొనినఁ
గూళవిధి గూర్పలేఁడు గాఁబోలు నాకు

నెన్ని భవములనుండియొ యేను జేసి
కొనిన పాపమ్ము నేఁటికిఁ గుడువ వలసె. 106

శా. తల్లిందండ్రియు నానిమిత్తము మనస్తాపమ్మునన్ బొక్కఁగా
నుల్లాసం బొక యింత లేక వితతాయుర్దాయనై యేను సం
పల్లాభం బొదఁగూర్తునే జగతి? కీపాపిణమ్ము లేలానదీ
వేల్లద్వారిఝరంబు పాలుగ ముదావిర్భావముం జెందెదన్. 107

క. అని మనమున నిశ్చయముం
బొనరుచుకొని రాత్రివచ్చువేళం బెఁ దపింపన్
ఘనతరగర్జేరమ్మద
నినదంబై మబ్బు మూసె నింగికిఁ దొడపై. 108

క. జలధార లెస్గుతొండం
బులకెక్కుడుగాఁగఁ నొక్క మొగిఁ గాలాభ్రం
బులు గురిసె జలమయంబుగ
నిలాతలము వెల్లివిరిసె నేలయుఁ బొంగెన్. 109

సీ. సీరదధారావినిర్భిన్నభూధర
సరివదసృక్కమవార్ఝరంబుతోడ
నాకాశవాహిన్యుపాలంభనాట్టహా
సస్ఫురత్ఫేనపుంజములతోడఁ
జిరకాలరోధఃప్రచితతాభిమానాను
యాతభూజపరిచయమ్ముతోడ
స్వాంబుపరివాహసంవర్ధితారానుభూ
జసమర్ప్యమాణపుష్పములతోడ
తే. గీ. నుభయతీరస్థజనపదక్షుభితజాన
పదసమారోహితోన్నతవసుమతీవి
రచితపరసౌధభూమికానిచయమగుచు
మింటికిని మంటి కేకమై మించె నేల. 110

వ. ఇట్లు జగదుపద్రవకరంబుగ నయ్యాపగాఘూరంబు విజృంభించు నంత నన్యుల కెఱుంగఁబడకుండ దానంబడి తత్ప్రవాహవేగమ్మునఁ జనిచని

చ. అటకొక క్రోసుదూరమునయం దలరారెడు తద్ధునీమణీ
తటగత మాదితేయరచితం బులిమేశ్వరు నాలయంబు మీఁ
దటఁ దగుపైఁడికుండ దన దాపుగ దానికిఁ గేలు సాఁచి సం
కటపడుచున్ గ్రహించె నల కన్నియ పున్నెము సేఁతపెంపునన్. 112

క. అట మూన్నాళ్ళేకగతిఁ ద
న్నిటలాక్షునియందు మనము నిలుపుచు నవిశం
కటగతి జలముం గ్రోలుచుఁ
బటగతమగు బొమ్మరీతిఁ బాల్పడియుండెన్. 113

వ. ఇట్లు మూఁడు దినమ్ము లయ్యుత్తరవాహినీమధురోదకపానతదభిషవ తదధినాథారాధనమ్ములం జేసి. 114

క. బంగారుం బురణించుచు
సింగారముఁ గుల్కఁజేయు సిరి గలిగి సహ
స్రాంగజసతులకు నెనయగు
నంగనయై మిగుల విస్మితాంతర యయ్యెన్. 115

వ. ఇట్లు దివ్యమంగళం బగు విగ్రహంబు ధరియించి యక్కన్నియ యట నుండ నేలానదియుఁ గ్రమమ్మన జానుదఘ్నప్రవాహమ్మ మిగిలి చెలువారె. 116

క. ఆనాఁటన తమ కన్నెం
గానక తలిదండ్రు లిండ్లు గాలించిరి; యెం
తేనియుఁ గురూపమగు సం
తానమ్మను బ్రేమ కాస్పదంబగుఁ గాదే. 117

వ. ఇట్లు గాలించి యెటనుం గానక యేటం బడిపోయెనని వందురుచున్న జంపతులం గాంచి వేదికాసుపుండగు ధరాసురకుమారుండు "తనయనాచరణంబు కతంబుగ నక్కన్నియ కేలాపాతంబు ఘటిల్లె" నని విచారించుచు నవ్వారి నొక్కింత యోదార్చి మఱునాఁ డుదయమ్మన లేచి

యేలానదీతరణమ్మునకు సాధనంబు గానక యాయొడ్డునన చనిచని యొక్క రసాలభూరుహచ్ఛాయం బథిశ్రమాపని నీషన్ బ్రక్కకుఁ నొరిగి కనుమూయునంతఁ గాలప్రేరితంబై యొకమహాసర్పంబు వానిం గఱచినఁ దదీయాయాసవివశీకృతుండగుచు నాయురుపాలంభనాపరత్వమ్మున నయ్యేటంబడి తదాలయమ్మున కొక పక్కకుం జేరి యట రెన్నాళ్ళుండి తన్మాహాత్మ్యమ్మునంజేసి వినిర్ముక్తకుష్ఠుం డగుచు నద్భుతంబువడి యయ్యాలయం బల్లన డిగి యటనుండు జనపదమ్మున కరిగి యొకయాతిథేయున కతిథియై తనవృత్తాంతంబు సవిస్తరం బాన తిచ్చిన నాగృహమేధి యిట్లనియె. 118

సీ. త్రేతాదియందుఁ బ్రతిష్ఠించె నీలింగ
ముల మేశ్వరుండను యోగివర్యుఁ
డిచట నర్ధక్రోశ మేలానదియును ను
త్తరవాహినీత్వంబుఁ దగ భజించెఁ
గాశికతో సాటిగల తీర్థ మిదియు వి
శ్వేశ్వరుఁడే యులిమేశ్వరుండు
క్షేత్రోపవాసంబుసేయుచు నులిమేశ్వ
రస్వామి భక్తి నెరఁగినయేని

తే. గీ. యెట్టియామయ మేనియు నెడలిపోవు
ననుచుఁ బెద్దలు వచియింతు రక్కతమునఁ
బ్రాగ్భవార్జితమైన పాపమున నీకు
సంభవించిన కుష్ఠును సడలె ననఘ. 119

వ. అనుచుం దత్తీర్థమహత్త్వంబు సవిస్తరంబుగాఁ జెప్పిన నాధరాసురకుమారుండును నట సంతుష్టాంతరంగుం డగుచుఁ గొన్నినాళ్ళు వసియించె; నిట దేవాలయ శృంగంబున బంగారుం బొమ్మవోని దశాధికవర్షీయయగు నక్కన్నియం జూచి పూజారి నిశ్రేణికామార్గమ్మున డింపి "నీవెవ్వరిదాన వెందుండివచ్చితి వేకతమ్మున దేవళంబధిష్ఠించి" తన వుడు నక్కన్నెయుఁ గల తెఱం గెఱింగించి నంత నతండు భస్త్రా

పురమ్మున కొక్క శస్త్రిం బంపించిన మాధవశర్మయు సంహృష్టాం తరంగుం డగుచు నట కరిగి బంగారుపత్రిమవోని కూఁతుం జూచి కౌఁగిలించుకొని యిట్లనియె. 120

క. అమ్మా! వేగమ్మున గే
హమ్మున కేతెమ్ము సంచితార్థమ్మగు పు
ణ్యమ్మున నీదేహమ్ము ఘ
నమ్మగు రోగమ్మును వృజినమ్మును బాసెన్. 121

వ. అని తోడ్కొనిపోయి సుందరాకారున కొక ధరాసురకుమారునకిచ్చి పరిణయం బొనర్పసమకట్టిన నక్కన్నియ యిట్లను. "మున్నొక కుష్ఠ రోగియగు ధరణీసుర కుమారకునకు నన్నీఁదలంచినతఱి మన్మనమ్ము తదధీనంబు గావించినదాన నతండు నన్నొల్లమింజేసి యేటఁబడిపోయిన కతమ్మున నులిమేశ్వరుండు నాకు శరణంబయి మరణంబు మాఱుగ దివ్యదేహం బనుగ్రహించెఁ; గావున నెప్పటికేనియు నతండ నాకుం బతి" యనిన మాధవశర్మ డిల్లవడి యిట్లనియె. 122

క. బంగారుబొమ్మవగు నీ
కుం గుష్ఠియతండు కేలఁగొన నర్హుండే
విం గొనుము నాగవల్లిక
కుం గాదంబరికిఁ బొత్తు కుతుకం బిడునే! 123

వ. అను తండ్రిమాటలు విశ్వసింపక యబ్బాలికాచూళికారత్నంబు తండ్రి కిట్లనియె. 124

క. దౌదవ్వుల నుండును నతఁ
డే దెసకుం జనఁడు మీర లేగి కడంకన్
దోఁదోడితెచ్చి పరిణయ
మాదట నొనరింపుఁ డతని యనుమతి గొనుచున్. 125

వ. అనిన మాధవశర్మయు నొండాడక తదన్వేషణమ్మునకై కదలి యులి మేశ్వరమ్మను జనపదమ్మునకుం జని యేలాతీర్థమ్మునఁ దానమాడు బాపఁడు నొక్కనిఁ గని యడిగిన నతం డతని కిట్లనియె. 126

క. నేఁటికి నాలఁగనాఁ డొక
పూఁట భవత్సదనమందు భుజియించితి నా
నాఁటి దినమె మీ కుమారిక
యేటం బడిపోయె ననుచు నేడ్చితి రనఘా! 127

వ. అని యభిజ్ఞానంబు సెప్పి మఱియును. 128

క. ఏనును స్వస్థత మీకుం
గానఁగి యటనుండి కదలి కాననసర్పా
హీనవిషదగ్ధదేహుండ
నై నదిలోఁ బడితి జీవితాశ వదలుచున్. 129

వ. అనదీప్రవాహం బొక్క త్రుటికాలమ్మున కీయులిమేశ్వరు దేవళమ్ముపైఁ బెట్టినఁ దదాధారంబు మరల జీవితాశంబుట్టింప నట సెన్నాళ్ళు నాంతరీయకతాసిద్ధమ్మగు నుపవాసం బొనర్చుచుఁ దన్నదీజలంబు ప్రాణంబులు నిలుపఁగ నిటనుండిన కతన నాకామయంబు వదలి యిట్టి రూపంబు తటస్థించె మీరును భవత్కన్యకోదంతం బెఱింగితిరే నావుడు భూసురుండు ప్రహృష్టాంతరంగుం డగుచు నక్కుమారున కిట్లనియె. 130

క. మీవలె మాకన్యకయున్
జావున కాసించి యేటిఝరమునఁ బడి యీ
దేవళమునకుం జేరి శు
భావహమగు రూపుఁగాంచె నా భవుకరుణన్. 131

క. మీరిరువురు నులిమేశ్వరు
కారుణ్యము వడసి యొదవి కలుష మెడలి మే
ల్తారుణ్యము గాంచితి రిఁక
ధారుణికిన్ మేలుగాదె దంపతులైనన్. 132

వ. అని ప్రార్థించి యింటికిం దోడితెచ్చి శుభముహూర్తమ్మున నల్లునిగా నొనరించుకొనియె; నంతఁ గొండొక కాలమ్మునకు నక్కన్నియ ఋతుమతి యగుడు గర్భాధానంబుసేసి యద్ధరణీశ్వరకుమారుం డులి

మేశ్వరమ్మునన వసించుచు సుఖములు గైకొనుచున్నంత నబ్బాలామణియుఁ జూలాలై యొక్కబాలునిం గనియె. 133

క. చేరెఁడు కన్నులు, ముద్దుం
గారెడు నెమ్మోము, సొబగుగల యురమున్, బెం
పారు నెఱులును దనరఁగఁ గు
మారుఁడు వెన్నప్పము వలె మలయుచు నుండెన్. 134

వ. ఇట్లు శుక్లపక్షశశిచాడ్పున దినదినప్రవర్ధమానుం డగుచున్నంత. 135

క. నాలవసంవత్సర మా
బాలునకున్ వచ్చె మరల బ్రాహ్మణసతియున్
జూలాలై పదినెలలకు
బాలునొకనిఁ గనియె విమలభాభాసురునిన్. 136

వ. తత్కుమారశీర్షోదయకాలంబునన ప్రథమపుత్రుండాకస్మికంబగు వాతరోగంబున మృతిఁజెందెఁ; బిదప ద్వితీయుండును ద్విహాయనుండయినంత నామె యింకొక కుమారుం గనియె; నంత ద్వితీయుండును మృతిజెందె; నిట్లొకొక్కని జన్మదివసం బొకొక్కని మరణదివసంబుగ నెనమండ్రు మడిసిరి. పదంపడి నవమపుత్రమారకంబును దశమపుత్రసంభవంబునగు గర్భంబు సంభవించె. 137

క. పదినెలలు నిండు నప్పూ
ర్ణదినమునం బ్రసవవేదనావశయగు నా
సుదతి ప్రసవించెఁ బ్రాణము
వదలిన యొక నిసువుఁ బాపపరిపాకమునన్. 138

వ. తత్క్షణంబ నవమకుమారుండును మృతిచెందిన నిరువుర నేలానదీవేలాసీమకుం గొంపోయి బ్రాహ్మణుండుశోకం బాఁగరామి నిట్లు చింతించె.

మ. అకటా! పుత్రులఁ బద్గురఁ గుసుమబాణాకారులన్ నిర్దయా
త్మకుఁడై యేటికి నప్పగించె విధి, యీఁదఁగరాని సంసారదు
ర్మకరాగారమునన్ మునింగితి వృథా, మాయామహత్త్వమ్ము యో
గికులేనిం దెలియంగలేరు గుణరక్తీభూతచేతస్కులై. 140

క. దశసుతులు గల్గియు నసుత
దశ సంప్రాప్తించె నింకఁ దనయులకొఱకై
పశువుల గతిఁ "బతిమేకా
దశం కృధి" యటన్న చదువు దాఁటందగునే. 141

తే. గీ. మఱియు నింకొక తరుణినిఁ బరిణయించి
తనయులను గాంచవలె నని తలఁచికొనినఁ
గాఱుపులివలెఁ బెనువార్ధకమ్ము దొడరె
ముసలికిం జిన్న పెండ్లము మొసలి యనరె! 142

వ. అని యింటికిం జనుదెంచి బాలెంతరా లగుపత్నికిఁ బుత్రశోకంబు మఱపింప వివిధాగమేతిహాసంబు లుపదేశించుచు నాదినమ్ములు గడపి పిదప నేలాతటినికిం బోయి స్నానం బొనరించి తత్తీరగతుండగు నీశ్వరునకుం బ్రణమిల్లి నుతియించె; బ్రాహ్మణియు నేలానదిం గుఱించి నుతించి యీశ్వరునకు మ్రొక్కిడుచు నిట్లనియె. 143

ఆ. వె. కడుపు వసుల నిరత కాసుపు గంటి నా
కొకనినేని నిడక యకట! మంటి
పాలుగా నొనర్పఁ బాఁడియె యందఱ
మహితతేజ? యో కుమారజనక. 144

వ. అనుచు విలపించుచు మనంబు తదేకాయత్తం బొనర్చినంత మహాదేవుండును దయాంతఃకరణుం డగుచు నెదుటఁ బొడసూపెఁ దన్నికటవర్తిని యగు నేలానదియు దివ్యరూపమ్మున నిట్లనియె. 145

తే. గీ. నీవు తొలిబామునందు గణించినట్టి
పాతకమ్మున నింతటి పనులు పుట్టె
నవనిఁ బ్రారబ్ధ మనునది యనుభవింప
కేరికైనను దీఱ దోనీరజాక్షి. 146

క. ప్రారబ్ధకర్మముననకు
మారులు పదుగురును గూడ మడిసిరి నీ వ

వ్వారలకై వగవకు మ
త్కారుణ్యం బొకని నీకుఁ దగ బ్రతికించున్. 147

వ. నీవు మరల నిచటికి సార్ధక్రోశమ్మున నున్న క్షేత్రంబునకుం బోయి యచటస్నానంబొనరించి యొక్క శివలింగమ్ముఁబ్రతిష్ఠించి యార్ద్ర వస్త్రమ్ముతోన మృతకుమారగర్తాంకితంబగు నీభూమికేతెంచి తద్వాసోదకం బీగర్తమ్ముపైఁ జిలికిన వాఁడు బ్రతుకు; నిది మొదలీకత మ్మున నాక్షేత్రం బమృతపుత్రంబనియు నమ్మహాదేవుం డమృతసుతే శ్వరుండనియు నొడువంబడు నచట స్నానంబొనర్చి యద్దేవు నారా ధించిన వారెన్నఁడును బుత్రశోకంబు గాంచరనియు నొడివి య య్యాశ్వపుతోడన యంతర్ధానంబు చెందుటయు. 148

క. ఆ విప్రసతియు స్నానము
గావించి మహేశు నిల్పి కడు ముదమున నీ
రావసితం బగు వసనము
తో వెడలెన్ బ్రాణనాథుతో వేగమునన్. 149

వ. వెడలి మరలఁ జితాభూమి కరిగి పతినిర్దిష్టమ్మగు గర్తమ్మునఁ దద్వాసోదకంబు చిలికిన మారసదృశాకారుండగు నొక్క కుమారుండు బ్రదికె; నిది యమృత పుత్రక్షేత్రమాహాత్మ్యం బనిన విని శౌనకాదు లక్కథకున కిట్లనిరి. 150

సీ. కోటిలింగక్షేత్రపాటవం బమృతపు
త్రక్షేత్రమహిమంబు తదధినాథుఁ
డమృతసుతేశు మహత్త్వంబు వినిపించి
యుటిమేశ్వరస్వామియునికిపట్టు
నలకేశదిక్ప్రవాహము గల్గుచోటును
నగు సర్వరోగాపహాభిధాన
తీర్థ మంటలి విశిష్టార్థంబు వినిపించి
సలిపితి కర్ణరసాయనంబు

తే. గీ. మఱియుఁ ద త్తటినీపూజ్యమానతీర్థ
రాజములమహిమమ్మును బూజనీయు
లగుచు నటముక్తిఁజెందిన యనఘమతుల
సుచరితలు సెప్పవే యన సూతుఁడనియె. 151

సీ. శృంగారపల్లభశీ(?)ఖండు వారాశి
పుత్రికతో నుండు పుణ్యభూమి
కల, దటకొక సార్ధగవ్యూతి దూరమ్మ
నందు సుత్తరతీరమందు మఱియుఁ
దత్పాలకుండు చంద్రప్రతిష్ఠితుఁ డగు
శంకరస్వామిభద్రంకరుండు
తిరుపతియందుఁ తత్క్షేత్రనామము నూట
యెనిమిది తిరుపతులను ఘనంబు

తే. గీ. నిరతమాదేవులను గొల్చు నీతిపరున
కాయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి
గలిగి తామరతంపరగా నెసంగు
సంపదనటింపఁ దుదకు మోక్షంబు దొరకు. 152

తే. గీ. ఆమయాపహతీర్థ సమక్షమందుఁ
గాంద్రకోటయనెడి పురి కలదు మున్ను
తత్పురము రాజధానిగ ధర్మకేతు
వేలెఁ గిమ్మీరమండల మెసకమెసఁగ. 153

వ. ఆధర్మకేతున్నృపాలుండు చంద్రవంశభవుం డతండు మణిద్వీపాధివాసిని యగు పరశక్తి నర్చించి తత్ప్రసాదంబున నూకాంబయను శక్తిం గొని యాపె సహాయగఁ గిమ్మీరమండలంబుఁ గైకొనియె నని మఱియును. 154

తే. గీ. మఱియు నొక్క విశేషంబు మఱచిపోతి
నామయాపహతీర్థమ్మునందు భాను

వారమునఁ గ్రుంకిరేనిఁ దత్ఫలము శతగు
ణం బగు నటంచు మౌనిజనంబు లంద్రు. 155

సీ. శృంగారవల్లభక్షేత్రమ్మునకు నాల్గు
కోసులు గలయెడఁ గుంతిమాధ
వస్వామి, కుక్కుటేశ్వరుఁడును, బురుహూతి
కాశక్తియును, బాదగయ యనునవి
గలుగుక్షేత్రము పీఠికాపురి యలరారు
దానికిసరియగు స్థలములేదు
పితరులు తరియింపఁ బిండప్రదాన మా
ర్యులపరంపర చేయుచున్నచోటు
తే. గీ. పాదగయయన గయుఁ డనువాని మున్ను
జలజనేత్రుఁడు వరమిచ్చి సమయఁజేయఁ
దల మగధదేశమందుఁ, బాదమ్ము లిచటఁ
గాఁబడియెఁ గాన నిది పాదగయ యటంద్రు. 156

వ. కుక్కుటేశ్వరుని యుత్పత్తిప్రకారంబింతకుమున్ను వివరించితి, నింకఁ
బురుహూతికామహత్త్వంబు వినిచెద ననిన విని ఋషు లిట్లనిరి. 157

క. మును గుష్ఠరోగియయిన య
వనిసురపుత్రకు చరిత్ర వచియించితి వా
తనికాయామయ మదిప్ర
ట్టినకారణ మెఱుఁగఁజేయవే యనఘమతీ. 158

వ. నావుడు సూతుం డిట్లను మత్కథయిష్యమాణపురుహూతికా మహత్త్వ
మ్మును మీ ప్రశ్నమ్మున కుత్తరమ్మును నొక్కటియ వినుఁడని యిట్లు
సెప్పం దొడంగె. 159

సీ. పుత్రఘాతిని యైన పూఁబోఁడి చరితఁ జె
ప్పితి మును నద్దానివింటిరి కద
నాఁటిదినం బలనాతితోఁ గ్రీడించి
నట్టి వాఁడొక్క ధరామరుండు

వదిలోనఁబడి బిచ్చునాతి గ్రమ్గినవిచా
రమున నతండు దేశములఁ దిరుగఁ
జని మంగళాఖ్య రసాధరమునకేగి
ఘనుఁడైన నారసింహునకు భక్తి
తే. గీ. మ్రొక్కి యటఁ బానకము వోసి ముక్తిదమగు
విజయవాటిక కేగి యవ్వీటనున్న
కనకదుర్గాంబ కెరఁగి యావెనుక ధరణి
సురపరాగ్రహారమ్ములు చూచికొనుచు. 160

వ. క్రమక్రమమ్ముగఁ బురుహూతికాధిష్ఠితమ్మగు పీఠికాపురమ్మున కరు
దెంచి యట నొక సభాపతి భవనమ్మున విడిదిసేసె. 161

తే. గీ. ఆసభాపతి కలరారు నమలమతికి
వెకలిగుణములు గలుగు పుత్రకుఁ డొకండు
చిన్నతనమునసుండి యచ్చెనఁటి చదువు
సంజలను వీడి లంజెలకుం జపించు. 162

తే. గీ. వాని కప్పరదేశి కనూనమైన
మైత్రి వాటిల్లెఁ దొంటికర్మంబుకతన
దాన మఱియంత పెరిబలె నవ్వానికుమతి
దుర్జనస్నేహ మేరికి దొసఁగొసఁగదె ! 163

మ. ఇటు లా పాపి ఘృతాభిషిక్తమగు బర్హిశ్శుష్మ చందమ్మనా
విటవర్యున్ బరదేశి భూమిసురు నేవేళన్ విసర్జింప కె
ప్పుడు రీతిన్ వెలయాంధ్రయిండ్లకు మదిన్ బ్రాపించుచున్ గాసు ము
న్పటికం బెన్ గడువెచ్చఁబుచ్చు చొగినుండన్ జూచి పౌరుల్ వెసన్,

క. "పరదేశి నవులఁ బంపి కొ
మరునకుఁ గల్గిన యవస్థ మాన్పింపుము భ
ట్టరకా" యని తెల్పిననున్
గర మాతని భూసురుండు గరుణాదృష్టిన్. 165

ఉ. చూచుచునుండుఁగాని తనసూనుఁడు నాతనితోడఁ బోవఁగా
జూచునొకో యటంచు నొకసుంతయుఁ గోపముసేయుఁ డెవ్వరే
నీచునిఁగాని యోగ్యకరణిన్ జరియించెడివానిఁగాని పోఁ
ద్రోచుట కిచ్చగింతురె సుతున్ ? దమ కెంతటి ముప్పు దెచ్చినన్. 166

శా. ఆమధ్యాహ్నము స్వస్తివాచనముసేయన్ గ్రామమందున్న య
య్యైమాన్యాత్మల యిండ్లకేగి యటఁ దా నార్జించు ద్రవ్యంబు వే
శ్యామానిన్యధరామృతంబులకునై యర్పించుపుత్రున్ దురా
యామున్ గాదనఁ డేకపుత్రవిషయంబై మించు ప్రేమమ్మునన్. 167

ఉ. చిన్నతనమ్మునుండియును జేసెడి చేష్టలు సన్నుతించుచున్
మన్ననఁజూచు తల్లియుఁ గుమారుని కబ్బిన పాడుబుద్ధికిన్
గన్నులనీరు కాల్వలకుఁ గాలువలై చన నేడ్చుఁ గాని యే
యున్నతిఁ దేక కూళగతి నున్నను వీడ దదెట్టిపేర్మియో ! 168

వ. ఇట్లిక్కులపాంసనుం డప్పరదేశింగూడి యిహపరమ్ములకు వెలియగు
భంగి సంచరించుచు నచిరంబునుండి తన తండ్రి యార్జించిన ద్రవ్యం
బొక వత్సరమ్మునకు వమ్మొనర్చియున్నంత. 169

తే. గీ. తనధనముతిన్న గణికలందఱుఁ గృతఘ్ను
లగుచుఁ దమతమజరఠల కప్పగింప
సాగఁ దోలిరి యమ్మదిసాను లతిక
ఠోరగద్గదవాక్కులు బోరుకలఁగ. 170

వ. ఇట్లు వృద్ధవేశ్యాపరిభూతు లగుచు నయ్యిరువురు ధనార్జనోపాయంబు
గానక తీర్థాటనమిషమ్మున నెటకేనియుం బోఁదలఁచి యొకనిశీథమ్మున
నేరికిం దెలియనిగతిఁ గదలి రాజవీథిం జనుచున్నంత. 171

సీ. కదళికాసుమదళీకల్పమైన నయన
ద్వయము రక్తప్రభాపటలి నీనఁ
బైనుండి క్రిందికిఁ బడు మట్టియూడల
పోలిక నిరువదిభుజము లొలయ

నానాభి వేర్చిలుచున్నట్టి పున్కలదండ
రత్నహారముల వొరయుచునుండఁ
దారకాపాశీయుతం బైన మిన్నునాఁ
జెలువారు గువకన్నుచీర మెఱయ

తే. గీ. శాకినిలు డాకినిలును బిశాచములును
దోడఁ జనుదెంచు చతులనుతుల నొనర్ప
నుచ్ఛ్రయము మీఱ నూరేగుచున్నదానిఁ
గవిరి పురుహూతికానామిక యగుశక్తి. 172

మత్తకోకిల. కాంచి యెంతయు జంకులేని వికాసమొప్పఁగ నిర్వ్యర
ఖ్యంచితం బగు శక్తిరూపు ప్రపంచదుస్సహ మంచు తో
నెంచి కేల్గవ నొదలన్ గదియించి నైకటికత్వమున్
గాంచి యిట్లని సన్నుతించి రఖండవాగ్ఝరి మించఁగన్. 173

ఉ. తల్లి! జగత్త్రయీభరణదక్షకటాక్షకలావిలాస! యు
త్ఫుల్లసముల్లసత్కమల తుల్యముఖీ! ప్రకృతిస్వరూపిణీ!
పల్లవపాణి! నిత్యశివభాగ్యవిధాయిని! సర్వరూపసం
వేల్లితదేహ! దివ్యపదవీపరిభాసిని! మత్తకాశినీ! 174

వ. ఇట్లు నుతించిన దేవియుఁ గరుణార్ద్రియగుచు "మీరెవ్వ రెందుండి యెటకేగెద" రని యడిగి కలతెఱంగెఱింగి "యేను మరల వచ్చుదనుక మదీయాలయమ్మున నధివసింపుఁ" డని యానతిచ్చి తన యిచ్చంబోవుటయు వారలును దదాలయమ్మున కరిగి యమ్మహాశక్తి శక్తి నుగ్గడించుకొనుచుండి రంత. 175

తే. గీ. ఎచట నుండెడిపరివార మచటికేగ
మరలఁ బురుహూతికయుఁ దనమందిరమ్ముఁ
జొచ్చి కూర్చున్నయట్టి భూసురులఁగాంచి
యిట్లనియె మేదురాదరమెసక మెసఁగ. 176

వ. ఏనూరేగువేళ నెవ్వరేని నాకెదురై మద్భీషణాకారమ్మున కడలి గతాసు

లగుట నిక్కం బట్లుగాక మీరలునిర్భయులై యంతఁబోకనన్ను మతిం
చితిరనివెండియు. 177

క. కావున వైశమ మీకుం
గావలసినవరముఁ గోరఁగాఁ దగు నని యెం
తేవేడ్కఁబల్కుకళ్త్రిద
యావసితమనస్కత కెద నద్భుతపడుచుఁ. 178

క. ధనకాంతల కెల్లరకుం
దనివిగ ధన మిచ్చి పొందఁ దలఁచుచు వా ర్ధం
ధనమున్ ధనముం గోరిరి
తనతనపాపములు సమయుతఱి యందైనన్. 179

వ. ఇట్లు కోరుకొన నప్పురుహూతికయు "నేతన్నగరీయామ్యదిశాభాగ మ్మున నొక నిక్షేపమ్ముగల దదిమీకు దొరకుఁబోం" డని దానిం గాచు పిశాచికొాకకమ్మలిఖించి యిచ్చిన నదికైకొని ప్రహృష్టాంత రంగు లగుచు నచ్చోటుచేరి తద్రక్షకి యగు దయ్యమ్మున కాళ్త్రియి చ్చినకమ్మ నొసఁగి యానిధినిఁ దత్సమ్మతిం గైకొని యిరుపురకుం దెలియఁదగిన యొక గోప్యస్థానమ్మునండాఁచి యెప్పటియట్ల రోవెలం దుల పొందుపట్లకుం జనుచుఁ బూర్వాచారంబు నిర్వర్తించుచున్నంత.

సీ. అప్పుడప్పుడు కొంచె మర్థమిచ్చుచు దయా
పరుఁడైన యాధరామరకుమారుఁ
డనుపఁగ వెలయాండ్రు రనుభవింపఁగరామి
ఘటచేటికలతోడఁ గలయునట్టి
పరదేశియును గరువంబు హెచ్చి ధనంబ
దంతయుఁదాఁ దెచ్చినట్ల వెచ్చఁ
బుచ్చుచు నతనికిఁ బుచ్చినవక్కైన
నీయకయుండు నుపాయమొకటి

తే. గీ. చేయఁ దలఁచియు నూరవసించునట్టి
పాఱు లందఱు నతనికిఁ బట్టు గాఁగ

లా రనుచు నెంచుకొంచుఁ గాలంబుగడపు
చుండె మూషకమార్జాలయుక్తితనర. 181

క. "ధనమెక్కడిదిర ! మీ" కను
చు నాగరులు తమ్మడిగినచో "సానుతె మా
కనయమ్మ ధన మొసంగుదు"
రనుచున్ జెప్పుదురు వార లవ్వారలకున్. 182

సీ. కూర్చుండి తిన్నచో గుళ్ళు గోపురము లా
గ పటన్న సామెత గాఁగ వార
లాధనం బంతయు నాయూరి వెలయాండ్రి
పాలొనరిచి పదంపడి ధనంబు
లేమి లంజెలు నుంతమోమోటమియు లేక
యిలు వెడలంగఁ ద్రోయింపఁ గస్తి
పడుచు ధనముగడింపఁగఁ గొండొక యుపాయ
మేమియుఁగానక యెన్నఁడేని

తే. గీ. గలదు ద్రవ్యంబు దొంగటికమ్మనంద
యంచు యోజించి ధనవంతుఁడైన యొక్క
గేస్తు గృహమేగి తద్భిత్తికి నొకటను సు
రంగముం ద్రివ్వివేగఁ దదంగణంబు. 183

వ. చొచ్చి లోనికిం బ్రివేశించి చతుస్సహస్రిరూపికా పూర్ణమ్ములగు నాల్గు సంచులు దొంగిలించి మరలి యమ్మార్గమ్మునన వెలికివచ్చి యథాపూర్వమ్ముగ నాధనమ్ము డాఁచి యుండునంత. 184

క. ఒరులధన మిట్టులు హరిం
తురె యనుకోపమునఁ బోలెఁ దూరుపు దెసయం
దరుణుండై కనఁబడె నం
బరమణి యగు సర్వసాక్షి ప్రిభద్దైవాఋన్. 185

తే. గీ. నాఁటిదినమున నచటికి నాల్గుక్రోసు
లందుఁ జెన్నారు తిరుపతి యనెడి యూరఁ

బరఁగు శృంగారవల్లభస్వామియుత్స
వంబనుడు నేగి రాయూరివారలెల్ల. 186

వ. అయ్యెడ.

క. పరదేశితోడ ధరణీ
సురసుతుఁ డిటు వల్కెఁ "గొంతసొమ్ము మనము రో
తరుణుల కొసఁగినచో వా
త్తిరుణాళ్ళకుఁ బోవుదు రఁట తిరుపతి" కనుడున్. 188

వ. అతండును గొన్ని దినమ్ములదనుక నీధనంబు ముట్టితిమేని యాచార్యం బస్మత్కృతమ్ముగాఁ బరిణమించెడినని చెప్పి యాధనంబు ముట్టనీక పదంపడి రేయి నిదుర మానినకతన నిదురించు నవ్వాని నవలోకించి వీని నియ్యెడంజంపితినేని యీ ధనంబెల్ల నాయదియ యగునని తలంచి.

క. మిత్రఘ్నుఁడు పరదేశి ధ
రిత్రీసురుఁ డధముఁ డత్యరిత్వము దోఁపన్
జిత్రముగ గృహచ్ఛాదక
పత్రముల న్నిప్పువెట్టి పదపడి భీతిన్. 190

వ. తిరుపత్యుత్సవంబు కనుఁగొను నెపమ్మనఁజనియె; నంతఁ దద్గృహమ్మును క్షణార్ధమ్మునకుఁ దద్ధరణీసురకుమారుతోడన భస్మంబగుడు నిరుగుపొరుగువా రుత్సవ దిదృక్షాగతుండగు సభాపతికి నయ్యుదంతంబుఁ దెల్పి రతండును జయ్యనఁ జనుదెంచి పోయిన యింటికై వందురఁ గాని కుమారునిమృతి యెఱుంగఁ డిది యిట్లుండ. 191

ఆ. వె. ఇంటి కగ్గివెట్టి యేగినపరదేశి
చంద మెల్ల నొక్కశత్రుచూచి
వెంట నేగి వాని విఱిచి కట్టించెఁ గా
దాగృహమునఁ గల తెఱంగుఁ దెలిపి. 192

క. తనయింట నుంచుకొని మే
పినకతమున వాఁడెనేఁడు విషమై యంటిం

చెను నిప్పు భూమిసురునిం
ట నటంచున్ జెప్పికొనఁ గడంగిరి పౌరుల్. 193

సీ. భూసురోత్తముఁడును బొగులుచు నవ్వార్త
దెలిసి యాతనిఁ బట్టి తెచ్చి కలిత
కారాగృహాచారు గావించి రనియును
నెఱిఁగి పుత్త్రినిచంద మెఱుఁగరామి
నచ్చోటి కరిగి 'మదాత్మజాతుం డేడ'
నని యేడ్వ సాగిన నతఁడు మొగము
వంచి 'యే నెఱుఁగ నవ్వాఁ డలవారకాం
తలతోడ స్వామియుత్సవము చూడఁ
తే. గీ. దిరుపతికి నేగెనని యేను నరుగుచుండఁ
బొంచి యీభటుఁ డొక లేనిపోని నింద
మోపి తోడ్తెచ్చెఁ గాని యేమోస మెఱుఁగ'
నంచుఁ గన్నీరు కాల్వగా నట్టియేడ్చె. 194

క. కరములఁ గశలం గొని భీ
కరమగుగతి భటులు పొడువఁగా నొగి నతఁడే
నెఱుఁగనను మాటదక్క ని
తరవచనము పలుకఁ డెంతధైర్యము గలఁడో. 195

తే. గీ. భటుని సాక్ష్యమ్ము కతమునఁ బ్రాడ్వివాకుఁ
డాతతాయితయును నద్ధరామరసుత
ఘాతకత్త్వమ్ము నెఱిఁగి యక్కడనె మరణ
దండనమ్ము విధించె నా దుండగునకు. 196

క. పురుహూతికకుం బ్రతివ
త్సరమగు నుత్సవమునందుఁ దగ నొక్కరునిన్
నరుని బలియిచ్చుచుండెడి
మరియాద యొకండు గలదు మనుజుల కందున్. 197

క. పురిఁ బ్రాడ్వివాకుఁ డెవ్వరి
కురిశిక్ష విధించు వారినొకచో నిడి య
ప్పురుహూతికకున్ బ్రీతిన
త్పరముం బలియిత్తు రచటి ధర్మజ్ఞు లొగిన్. 198

వ. తదర్థంబ యప్పరదేశింగూడఁ దాన్నశులగువారుగల యొక తమో గృహమ్మున రక్షించుచుండి; రిట్లు కారాగృహమ్మునందుండి యతం "దత్యుత్కటైఃపుణ్యపాపై రిహైవ ఫలమశ్నుతే" యను వచనముం దలపోసికొనుచుఁ బురుహూతికాబలినిమిత్తక ప్రాణత్యాగంబునకుం గొంత సంతసించుచు మనంబున నామె నిట్లని నుతించె. 199

ప ద్మ నా భ వృ త్త ము.

రాజాధిరాజోత్తమాంగస్ఫురద్రత్నరాశిప్రభాపూజితాంఘ్రిద్వయా ! నీ తేజం బనేతాదృశంబై జగంబందు దేదీప్యమానంబు మూథుండ సుమ్మె నీ జన్మమం దించుకేఁ బుణ్యముం జేయ నీ నన్ను నీవెట్లురక్షించెదో! దేవీ! జాగ్రదుగ్రప్రతాపా! మునీట్చిత్తవీథీనివాసా! నమస్తే నమస్తే! 200

క. అనుచు నుతించుచుఁ బురుహూ
తిని హృత్పీఠమున నిల్పి తిన్ననిభక్తిన్
దనియించుచు నతఁడుండఁగఁ
జనుదెంచెన్ బలియొసంగు శక్త్యుత్సవముణా. 201

వ. ఇట్లుజగదేక నేత్రపర్వంబుగఁ బురుహూతికామహోత్సవంబు చను దెంచె నంతఁ గారాగారనివాసియగు నయ్యపరాధిందోడితెచ్చి హరిద్రాకుంకుమాదికంబుల నలంకరించి వింబపత్రంబులు మెడకుంగట్టి యూరేగించి పదంపడి యహరవసానం బగుడు ధూపదీపనైవేద్యంబు లయ్యంబ కర్పించి పౌరులందఱును దదాలయ గర్భాగారంబునం బెట్టి కవాటంబులు ఘటించి తమతమపొందుపట్లకుం జని రంత. 202

క. తనబలికై నాగరులి
చ్చిన వానిన్ భక్తుఁ గాంచి చేతమ్ము దయా

ఘనముగఁ బురుహూతికయు న
తని కిట్లనె మోమునన్ స్మితం బొలయంగన్. 203

వ. నీచేసినదుష్కృత్యంబులు నిన్నింతకుం దెచ్చె నేరికేనియుఁ బ్రారబ్ధం బనుభవైక నశ్వరంబుగాని యూరకవోదు కావున నీవుత్తరజన్మమునఁ గుష్ఠామయచ్ఛలమ్మునఁ గొండొకకాలం బేతజ్జన్మకృతపాపఫలం బనుభవించి పదంపడి సుందరాకారుండ వగుచుఁ గొంతకాలంబు కడపి తదుత్తరజన్మమ్మునఁ జంద్రివంశమ్మునఁ బుట్టి మత్సాహాయమ్మున నీదేశం బేలఁగల వని మఱియు నిట్లనియె. 204

క. అవిముక్త క్షేత్రంబున
నివసించుచుఁ గొన్నినా ళ్ళనూనమహిము నా
భవునిఁ సేవింపుము కొం
తవఱకుఁ బ్రారబ్ధ మంత నశియించు నొగిన్. 205

వ. అని చెప్పి యొక్కక్షణార్ధమున నతని వారణాసిం జేర్చిన నతండును నచటఁ గొన్నినాళ్ళువసించియుఁ బురాకృతమ్మునంజేసి రాలప్రేరితుండై తనయూరికివచ్చి యయ్యెడ నొకనిమిత్తమ్మున దేహంబువిడిచి మరలనాబ్రహ్మపురమ్మునన యొకధరాసురున కుదయించి తనకుం గులశర్మయను నామం బిడకమున్న తలిదండ్రులు గతింప నొడ్లచేఁ బెనుపంబడి కొండొక కాలమ్మునకుఁ గుష్ఠామయంబు సంప్రాప్తంబగుడు దిక్కులేక దేశాటనక్రిమంబున నేలానదీతీరమ్మునకుం జనుదెంచి యయ్యెడఁ బూర్వోక్తక్రమమ్మున నిర్గతరోగుండును సుందరాకారుండునునై యక్కన్నియం బెండ్లియాడి సుఖంబుండెనని చెప్పిమఱియును.

క. ఇటు లెందఱెందఱో మి
క్కుటమగు పాపములు వాసి కోర్కులుగొని దు
ర్ఘటమగుమోక్షము గొని రి
త్తటిని మహత్త్వంబుఁ జెప్పఁ దర మేరి కగున్. 207

క. ఈ యేలామాహాత్మ్యము
వ్రాయుజనులకున్ బఠించువారికి మోక్షో

పాయము ఘటించు నానా
పాయములుఁ బీడు యశము భాగ్యము గలుగన్. 208.

క. అని చతురాస్యుఁడు కలహా
శనునకుఁ జెప్పిన విధమున సరసంబుగ శాం
తినిధి యితిహాసఖని య
య్యనఘులు మౌనులకు రౌమహర్షణి తెలిపెన్. 209.

ఆ శ్వా సాం త ప ద్య ము లు

క. సర్వాంతర్వాణీహృదం
తర్వాసితశారదా ప్రధానతర శుభా
శీర్వాదప్రాప్తయశా !
శర్వపదాంబుజవిధేయ ! సర్వారాయా ! 210

మ. కవిరాజానుమతస్వభావ ! సుమనఃకారుణ్య సంప్రాప్తవా
రవిమాఘాదికవీంద్ర కర్తృకకృతిద్రాఘిష్ఠ సారస్య! బాం
ధవసంఘప్రవణా ! సదాసుజనతా తాత్పర్య సంస్తుత్య ! వీ
రవరగ్రామనివాస ! తోఁటకుల సర్వారాయధీరాయితా. 211

భు జం గ ప్ర యా త ము.

సదాభోగశాలీ ! భృశత్యాగశీలీ !
హృదుప్తాబ్జమౌళీ ! కవీంద్రాబ్జహేళీ !
గదాహస్తనామప్రకాండాదరా ! వి
ద్వదీశాదృతిప్రాప్తభాస్వద్యశస్కా ! 212

— గద్య —

ఇది శ్రీకింకవీంద్రఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతి వేంకటేశ్వర ప్రణీతంబైన
యే లా మా హా త్మ్య మ్మ నం దు స ర్వ మ్మ ను
ద్వి తీ యా శ్వా స ము
సమస్తసన్మంగళాని భవంతు

శ్రీ మత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము



—* శతావధానులయిన *—

తిరుపతి వేంకటేశ్వర కవులచే

రచింపఁబడినది

ప్రకాశకులు:

చెళ్లపిళ్లవెంకటశాస్త్రిసన్సు

వేంకటేశ్వరపబ్లికేషన్సు

కడియం P. O.

తూర్పు గోదావరిజిల్లా.

1956

ఇది గౌతమబుద్ధదేవుని మహత్తర ఆదర్శ జీవితగాథ

కరుణారస పూరితమైన 6 ఆశ్వాసముల

# ప్రబంధము


సంకలనకర్త — విద్వాన్

## చెళ్లపిళ్ల దుర్గేశ్వరశాస్త్రి

కడియం P. O. తూ॥ గో॥ జిల్లా.



ఆరవకూర్పు

*1956*

వెయ్యి ప్రతులు

ప్రచురణ:

వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్.

ఆలమూరు,

తూర్పు గోదావరి జిల్లా.

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బు ద్ధ చ రి త్రి ము



## ప్ర థ మా శ్వా స ము

శా. శ్రీధామం బగు నీలభూధ్రమున సుశ్రీమించు వారాశివీ
చీధావళ్యము పొల్చు దేవళమునం జెన్నారు రూపంబు, లో
కాధారంబు, హలాయుధప్రణయి, నిత్యానంది, శ్రీమజ్జగ
న్నాథస్వామి కృపాళుఁడై మనుచుఁ గృష్ణారాయవిద్వత్ప్రభున్. 1

మ. ‘నటుచందంబున వేషధారియఁట నీనాథుండు లక్ష్మీ! నిజం
బటవే?’ యం చుడికించు నెచ్చెలుల ‘సర్వాత్మత్వముం జూప న
ట్టటు లో’ నంచు వచించుచు న్నగు సరోజాగార దాఁ గోడి వేం
కటకృష్ణప్రభు నాఱువేలధరణీకాంతాగ్రణిం జేరుతన్. 2

మ. హరినాభీకమలమ్మునం బొడమి విద్యల్నేర్చి విద్వాంసురా
ల్తరుణీరత్నముగాఁగ దేవతలకెల్లం బెద్దయై మించు దే
వర దీర్ఘాయురపారభాగ్యసుతసంపత్కీర్తులం బెంచి భూ
సురునిం బోలవరప్రభుం గరుణఁ బ్రోచుం గృష్ణభూపాలునిన్. 3

మ. శతలేఖిన్యవధానపద్యరచనాసంజాతభాస్వద్యశో
వితతాశేషవరాంధ్రభూపతిసభావిఖ్యాతనామాస్మదు
న్నతికిం గారణ మైనదేవి ఘనవీణాపాణి యవ్వాణి సం
తతము న్వేంకటకృష్ణరాయవిభువాగ్ధామంబుఁ గామించుతన్. 4

చ. శిరమునఁ గంగ, దేహమున శీతగిరీంద్రకుమారి, ప్రక్కఁ భృం
గిరిటియు, నంకభాగములఁ గేకిహయుండు గజాననుండు, ముం
దర ఋషు లిట్లు వెండిమలఁ దత్పరుఁడై కొలువున్న రాజశే
ఖరుఁడు కృపాళుఁడై మనుచుఁగావుతఁ గృష్ణనృపాలకాగ్రణిన్. 5

మ. సకలోర్వీధరనాథుఁ డైన యచలక్ష్మాభర్తచే శుద్ధభి
క్షుకు నాస్తప్రభుషు ల్ధరాధిపతి యంచుం జెప్పి యిప్పింపఁ గొం
కక యాత్మేశ్వరు నీశ్వరేశ్వరునిగాఁ గావించుకొన్నట్టి య
ద్రికుమారీమణిపుణ్యరేఖ మనుచున్ శ్రీకృష్ణభూపాలునిన్. 6

మ. కడియెద్దం జనియించి విద్య తెలమిం గాశీపురి న్నేర్చి యొ
ప్పెడురీతిం ధవళేశ్వరంబున మహావిద్వాంసులౌ శిష్యు లె
ప్పుడుఁ గొల్వ న్వసియించి సత్రి మొకఁ డప్పుణ్యస్థలిం బెట్టి యె
క్కుడుకీర్తి న్విలసిల్లు బ్రహ్మగురువాక్కు ల్మాకుఁ దోడయ్యెడున్.

మ. నలినాక్షప్రభృతు ల్త్రిమూర్తులు "గవర్నర్లై" సుర ల్క్రింద వ
ర్తిలు నుద్యోగిజనంబులై, ఘనమణిద్వీపంబును "న్లండనై"
యలరం దా నొకరాణియై జగము తేయంబామహాదేవి ని
చ్చలుఁ బాలించుఁ గృపాబ్ధి యాజనని కృష్ణారావు మన్నించుతన్. 8

తే. గీ. కాళిదాసాది సంస్కృతకవుల కెరఁగి
నన్నయాద్యాంధ్రకవులకు నతులొనర్చి
కుకవులగు వారలకు శతగుణముగాఁగ
మ్రొక్కికొందుము మాకృతి ముట్టరుఁడని. 9

క. తనచేసిన కబ్బముచే
తన కాకవి ననుచుఁ దెల్పు ధన్యాత్ముల స
త్యనిధులఁ దలఁచుట కబ్బం
బను తోఁటకుఁ జంచ యుఁచి నట్లగుఁగాదే. 10

చ. ఒకటియు రెండుఁ బద్యముల కొక్కొక గ్రంథమటంచుఁ బేరుపె
ట్టుకొని మహాకవీంద్రులకు దొంకక 'మాకవనంబు చూడ సా
ర్థక' మనుకొంచు 'మాకు సరిరా రారు' లంచును దమ్ముఁదామ మె
చ్చుకొనుచుఁ బొంగు వ్యాకరణశుంఠల కంఠముఁ గట్టుటొప్పదే? 11

ఉ. ఊరును బేరులేని యొక యుప్పనిచప్పని కావ్య మల్లు సిం
గారపుఁ గైతగాండ్రు పరకావ్యములం గని తప్పు లంచు సం

స్కారములేమిఁ బ్రేలుదురుగాక మహాకవి కేమిలోటు ? ల
జ్జారహితుల్ స్వశక్తిపరశక్తు లెఱుంగక పొంగు టబ్రమే. 12

వ. అని శిష్టాచారంబు నిర్వర్తించి కృతినాయకవంశావతరణపూర్వకంబు
గాఁ గృత్యవతారంబుఁ బ్రశంసించెదము. 13

మ. కల దార్వేలనియోగిశాఖ యొకఁ డక్కాంజాతభూవర్ణమం
దలఘుత్వంబునఁ బొల్చు నయ్యెడ నమాత్యశ్రేణు లుద్యోగులుం
దెలుఁగుంబాస కవీంద్రులు న్మఱియు నెందేనిన్ ధరాపాలురుం
గల రానాఁడును నేఁడును న్మిగుల యోగం బిందుఁ గానంబడున్. 14

తే. గీ. కల్మిఁ దనరారు నీశాఖఁ గాశ్యపముని
గోత్రమునయందుఁ గొచ్చెర్లకోటవంశ
మలరు విద్దెయు నసమును గలిమి బలిమి
సాజములు దీనఁ గల సత్యసంధులకును. 15

తే. గీ. ఎందఱో పుణ్యపూరుషు లిక్కులమ్మ
నందు జనియించి ప్రఖ్యాతినంది రందు
మిగుల సత్కీర్తి గని కవు ల్మేటి యనఁగ
నలరు శ్రీరామవందుర్తిఁ దయ్యనఘుఁబోలి. 16

తే. గీ. వియ్యనయుఁ బెద్దిరాజు జగ్గయ్య రామ
రావు నాఁగ జనించి రా రామచంద్ర
మూర్తి కాత్మజు, లిందఱుఁ గీర్తిధనులు
దాతృతాశూరు లధికారధన్యతములు. 17

శా. అందుం జగ్గయగారి నెన్నఁదరమే ? యప్పుణ్యుఁడే శ్రీమహా
నందీశుండు వసించు పట్టసగిరిన్ నవ్యస్థితిం గట్టఁజే
సెం దివ్యచ్ఛివకేశవాలయము లాశ్రీ చూచి తీఱన్వలెం;
బొందుం బున్నెముఁ బూరుషార్థ మటకుం బోనెంచు పుణ్యాత్ములన్.

సీ. మొదటినుండియుఁ దుట్టతుదిదాఁక నేరాజ్య
మునకు గోదావరి మొనసియుండు

ప్రజల పాపము పంచబంగాళముగ వీర
భద్రేశుఁ డేసీమఁ బ్రబలియుండుఁ
గొండకాల్వలవాలు నిండించు పెంజెర్వు
లేమండలము ఫలియింపఁజేయు
రత్నగర్భాఖ్య భూరమణి కెచ్చటఁ బ్రతి
పదమున సార్థకత్వము వహించు

తే. గీ. నెందుఁ ద్రిదశుల కంటికి విందుఁజేయు
విలువగల్గిన పాపికొండలు చెలంగు
నట్టిమండల మార్జించె ననఘమూర్తి
మహితగుణశాలి జగ్గయామాత్యమౌళి. 19

తే. గీ. అతని కుదయించెఁ గేవల మనఘమూర్తి
ధీరుఁడు నుదారుఁ డబ్ధిగంభీరుఁ డలఘుఁ
డాత్మవిద్యావిశారదుఁ డతని పేరు
రామచంద్రివేంకటకృష్ణరా వటంద్రు. 20

తే. గీ. భద్రకాళీపదద్వయీభక్తి కవన
శక్తి శివసక్తి తనకివి సహజములుగ
నయ్యనఘు నాత్మజుండు మహాయశస్స
నాథుఁడై యొప్పె శ్రీజగన్నాథరావు. 21

మ. అవనిం గౌతమియొడ్డున న్మిగుల భాగ్యాయత్త మౌ రెడ్డిపా
లవరగ్రామము రాజధానిగఁ జిరాలంకారమై వచ్చు రా
జ్యవిశేషమ్మును నేలె నీయనఘుఁ డుద్యత్ప్రాభవం బొప్ప శీ
లవయశ్శాలిని కామమాంబ సుగుణాలంకార దేవేరిగన్. 22

ఉ. చక్కని చుక్క యయ్యు నిముసంబును దాఁ దనభర్త ప్రక్కఁ గా
ల్ద్రొక్కక రాత్రులం బయలు ద్రొక్కు నరుంధతి యంచు నామెనుం
గ్రక్కున వ్రేలఁజూపుదురుగాని మహాసతి కామమాంబకు
న్నిక్కము దోస మించుక గణింపరుగా పలుగాకు లేనియున్. 23

సీ. దైవతభ క్తి విద్యాస క్తి జనర క్తి
యను నివి సహజమ్ములైనవాఁడు
ఆపామకాంతదీక్షాపారమైన నా
లవవేదమున సిద్ధుఁడైనవాఁడు
ప్రజలకష్టము కంటఁబడెనేని మితిలేని
కరుణ చిత్తమునందుఁ గలుగువాఁడు
తనవారు పెఱవారలను భేద మరయక
తగురీతి జగమేలఁ దగినవాఁడు
తే. గీ. నయవిదుం డగు నాజగన్నాథమూర్తి
కొలఁదికాలములోన లోకుల యదృష్ట
వైపరీత్యంబునన వీరభద్రు భద్రి
కాశి సేవించి తత్పదైక్యంబు గనియె. 24

సీ. ఎంతమందికి నేని నింగ్లీషు చెప్పించి
పెండ్లిండ్లు చేయించెఁ బ్రియమెలర్పఁ
బట్టసక్షేత్రస్థపర్వతసోపాన
ములు బాగుచేయించి ముదముగొలిపెఁ
గోటిపల్లెను నెల్లబాటసారుల కుప
యోగించు సత్రంబు నొకటి పెట్టె
నన్ని యిన్ని యనంగ నలవిగాని గతి నె
న్నేఁజెర్వులును నూతులెలమినించె
తే. గీ. లక్షవర్తివ్రతం బాది లక్షసుకృత
కార్యము లొనర్చె లోకోపకారబుద్ధి
నాజగన్నాథమూర్తి కర్థాంగియైన
కామమాంబిక నెన్నని కవులు గలరె! 25

చ. ప్రతిశివరాత్రికాలమునఁ బట్టసమం దనఘాత్ములైన వి
ప్రతతుల కెల్ల మొల్లముగ భక్ష్యము లెల్లెడ నొప్పఁ గొల్ల గా

మితికి నతిక్రమించు గతి మేదిని యాజ్యముచేత నాసున
ట్లితితరభక్తి భక్త మిడు నయ్యమ పుణ్యము నెన్నశక్యమే! 26

చ. ప్రతిదిన మాత్మగేహమున బ్రాహ్మణు లెందఱికేని షడ్రస
ప్లుతముగ నన్నదానమును బొంపిరివో నొనరించుటే మహా
వ్రత మని యెంచి తాన ప్రతిపక్షికి వచ్చునటంచు వింసు మా
సతి కొక యన్నపూర్ణయగు సాటి; యొరు ల్ప్రతి నాఁగఁ జెల్లునే. 27

సీ. గౌతమగోత్రవిఖ్యాతు శ్రీపెద్దాద
వంశజుఁ బెద్దవిద్వాంసుఁడై ది
గంతవిశ్రాంతమౌగతి శ్రీశకుంతలా
పరిణయ మనెడి ప్రబంధ మెలమిఁ
జేసిన నాగరాట్చేఖరు ముమ్మను
మని మల్లికార్జును మనుమని ఘనుఁ
దన చెల్లెలగు తిర్పతమ్మకు నకలంక
కనఘుఁడౌ నాగరాజాఖ్యునరుఁ ద

తే. గీ. నూజు విద్యలభోజు మనోజతేజుఁ
గలితకవిరాజు యాచకకల్పభూజు
రామచంద్రవేంకటకృష్ణరాడ్బిడౌజు
దత్తుగాఁ గొనెఁ గామాంబ ధవుని యాజ్ఞ. 28

శా. దత్తుం డయ్యును గన్నపుత్రువలె నాతం డామెయం దెక్కుడౌ
బత్తిం బేర్మియుఁ జూపుచు న్యశమునం బద్ధాదరుండై కళా
వత్తం బాల్యమునంద కైకొని సుధీవర్యు ల్నుతింపన్ లస
ద్వృత్తాఢ్యుం డయి సత్కవిత్వగతి నెంతే వృద్ధిఁజెందె న్వెసన్. 29

చ. అతిసుకుమారుఁ డయ్యుఁ బ్రభువయ్యు శ్రమంబు గణింపఁ బోక చి
న్నతనమునుండి విద్యల మనం బిడి వేగ "బి యే" పరీక్ష సం
గతముగఁ దేటి యిక్కతన 'గౌర్నరు' చేఁ గడుగౌరవంబు నొం
ది తనరు కృష్ణరాట్ప్రభు నుదీర్ణయశంబు వశంబె యెన్నఁగన్. 30

క. జననీజనకులు మునుచే
సిన ధర్మమ్ములను వృద్ధిఁజెందించి తనం
తన కొన్ని ధర్మకార్యము
లనూనముగఁ జేసె నన్యులాతని కెనయే. 31

చ. మరుని జయించు రూపమున, మాధవుఁ బోలుఁ గృపాప్రసక్తి, నా
దరమున మేటి, యోర్పున నుదారగుణంబున నేరు సాటి? ధీ
వరులకుఁ గల్పవాటి పరిపాటి నెలర్చెడు కృష్ణరాయభూ
సురవిభుధాటి కెయ్యెడలఁ జూచిన మేల్ప్రతికోటి కల్గునే! 32

క. నిరతాన్నదానరక్తియు
సరసకవిత్వప్రసక్తి, శాంతి, గుణమహో
త్తరపూర్ణశక్తి సహజ
స్ఫురణమ్ములు కృష్ణరాయభూమీంద్రునకున్. 33

క. ఇతఁ డతికవితాలోలుప
మతియని వర్ణింపనేల మాటికి నీసం
గతి ప్రతిమాసమున సర
స్వతియే ప్రతిదేశ మేగి చాటుచు నుండన్. 34

క. ఇంతకు నెక్కుడువారలు
నింతకుఁ దక్కువగువార లెందఱు లేరీ
ప్రాంతముల జమీందారులు
శాంతమ్మున నింతవారు జనియింప రిఁకన్. 35

చ. కవి యనునంతమాత్రమునఁ గా దొకపద్యమునేనిఁ జక్కఁగా
నవరసభావము ల్వెలుఁగ నాణెముగా రచియించి తన్నుఁ జూ
డవలయు నంచు వచ్చినయెడ న్మతి వాని దరిద్రతాభరం
బవలకుఁ ద్రోయఁజాలిన యుదారుఁడు వేంకటకృష్ణుఁ డల్పుఁడే! 36

చ. ఎవరికినేని నిచ్చుపనియే మనవృత్తి యటంచు నెంచి స
త్కవులను బండితోత్తముల గాయకులం దనియించుఁ గాని పో

లవరవిభుఁడు రక్షితకలావిదధీశుఁడు కృష్ణరావు మె
ప్పొవడయునంతపాటి బుధపుంగవులుం గలరే జగంబునన్ ! 37

తే. గీ. మేను బలి యను, నాకర్ణమితిని దెల్పు
నయనయుగళమ్ము, శ్రీకరాననము సెప్పు
దామభావము, శ్రీకృష్ణరాయచంద్రుఁ
డితఁడు వితరణియని వచియింపవలెనె ! 38

ఉ. పాఱులయందు విద్యల నపారులు గల్గిరి గాని బల్లమీం
దారులు లేరు, గల్గిన నుదారులు గా, రటులేని దుర్లభా
కారులు కాకపోరు, కవికారుల కీ, రిది యెల్ల మన్మథా
కారుని గృష్ణరాడ్విభునిఁ గారుణికాగ్రిణి నాశ్రయించెఁగా. 39

శా. శ్రీ రంజిల్లెడు నోడరేవుకులవార్ధిం బుట్టి శ్రీపాపమాం
బారావు న్పతిగాఁగఁ జేకొని జగన్మాన్యంబు గాఁగం జమీం
దారై యేలెడు వేంకటేశ్వరు నపత్యం బైన గారంపు బం
గారమ్మం గొనెఁ గృష్ణరాయధరణీకాతుండు దేవేరిఁగన్. 40

క. బంగారమ్మ తనకుఁ దను
వుం గాఁ దగు కృష్ణరాడ్విభువరేణ్యునకున్
బంగారమ్మ యెలమి న
ర్ధాంగంబై యొప్పు టొక్క యబ్బుర మగునే. 41

మ. ఘనుఁ డాతం డొకనాఁ డమావ మగువేడ్కం గొల్వు గూర్చుండి మ
మ్మును శ్రీమత్పరదేవతామహిమసంభూతాశుధారాకవి
త్వనితాంతప్రతిభావిశేషరచితాపారప్రబంధానుబం
ధనులన్ దివ్యశతావధానధనులం దర్కించి పల్కెం గృపన్. 42

సీ. తగ నాత్మకూరుసీతారామభూపాలుఁ
డేన్గు నెక్కించి యూరేగఁ జేసె
గద్వాలరామభూకాంతుండు గౌరవ
స్ఫీతికై బంగారు బిరుదు లిచ్చె

వానందగజపతిక్ష్మానేతయును దగి
న కవీందు్రలంచు మన్ననయొనర్చె
శ్రీరాజగోపాల కృష్ణయాచనృపాలుఁ
డవధాను లంచు గౌరవము చూపెఁ
తే. గీ. జెన్నపురిరాజ్యమందు వసించు రాజ
వరులు మిము గారవింపని వారు గలరె
జగ మెఱిఁగినబ్రాహ్మణునకు జందె మేల !
సరస తిరుపతి వేంకటేశకవులార ! 43

వ. అని బహూకరించి మీరచించిన ధాతురత్నాకర కాశీసహస్ర వీథీరూపక శుకరంభాసంవాదాది సంస్కృతభాషాప్రబంధంబులును శ్రవణానంద దేవీభాగవత శ్రీనివాసవిలాస లక్షణాపరిణయైలామాహాత్మ్యము లగు నాంధ్రప్రబంధంబులును ననేకమ్ములు నసాధ్యతరమ్ములునగు శతలేఖిన్యవధానాష్టావధానాది కవితావైచిత్ర్యంబులును మీయశమ్మునకు సాక్ష్య మొసంగు నని మఱియు నిట్లనియె. 44

ఆ. వె. ఇద్ధతేజుఁ డైనబుద్ధదేవుచరిత్ర
మశ్వఘోషముఖుల ననుసరించి
యస్మదంకితముగ నాంధ్రకావ్య మొనర్పుఁ
డనుచు వీడ్య మిచ్చె నాదరమున. 45

క. ఇచ్చినఁ గైకొని మనమునఁ
బొచ్చెము గనరానికూర్మి వొసఁగఁగ నెంతే
హెచ్చగు సంతసముం గని
సచ్చరితుం డితఁడు కృతికిఁ జాలు నటంచున్. 46

చ. అనువుగఁ గృష్ణరాయలు జయాంకుఁడు మున్నల తుంగభద్రయొ
డ్డునఁ దనరాజ్య మేలుచుఁ గడుం గవిరాజుల నాదరించియుం
డనపరిచారికాతనయుతం దిగఁద్రావఁగ నెంచి కృష్ణరా
ట్టునుఁ డయి పుట్టె విప్రుఁ డయి గౌతమియొడ్డున నంచు నెంచుచున్.

సీ. ఎవని హలాణాగమాతివిభూతి తెల్పుఁ ద
త్ప్రాపకం బైన బి యే పదంబు
ఎవని భాషాభిమానవిభవంబు వచించు
నెంచి చేయించు సత్కృతిచయంబు
ఎవని కవీంద్రగౌరవము చాటించు ము
ద్రాపితప్రాక్కవిగ్రంథపటలి
ఎవని యగణ్యపుణ్యవిశేష మెఱిఁగించు
నత్తకోడండ్ర యన్యోన్యమైత్రి
తే. గీ. యతఁడు కొచ్చెర్లకోట వంశాంబురాశి
చంద్రుఁ డురుకీర్తి సొందుఁడు శాంతిపరుఁడు
రామచంద్రవేంకటకృష్ణరామచంద్రుఁ
డనితరప్రతిభాశాలి యనియుఁ దలఁచి. 48

వ. విద్వజ్జనమనశ్చకోరచంద్రాయమాణుండును సత్యభాషాహరిశ్చంద్రుం డును భోగదేవేంద్రుండును నాశ్రితరక్షణోపేంద్రుండుననగు నాభూసు రేంద్రున కభ్యుదయ పరంపరాభివృద్ధిగా మారచింపంబూను బుద్ధ చరిత్రంబునకుఁ గథాక్రమంబు.



## కథా ప్రారంభము



మ. ఇల సాకేతపురాంతికంబునను రోహిణ్యాపగాతీరమం
దలఘుప్రాభవ మైన మంచుమల కత్యంతంబు దాదాపునం
బొలుచు న్వీ డొకఁ డెల్లవిద్యలు యశమ్ము న్సౌఖ్యము న్సంపదా
దులుఁ ద న్నెప్పుడుఁ గొల్వఁగాఁ గపిలవస్తుఖ్యాతి సంధిల్లఁగన్. 50

చ. అమితసితోన్నతంబు లగు హర్మ్యములం గని వెండికొండ నె
త్తము లను భ్రాంతి నొంది జలదంబులు నిచ్చలు విశ్రమించుచున్
బ్రమదమున న్నయంబునఁ బ్రభావమున న్రజతాద్రితోడఁ దు
ల్య మని తలంచు పౌరుల యథార్థమనీషలఁ జేయుఁ దత్పురిన్. 51

ఉ. చౌకము గల్గు తన్నగరసౌధములన్ రతనంపుఁగ్రొంజిగిం
జీఁకటివోలె లేమియును జేర భయంపడుచుండు నుత్తమ
శ్లోకులు పౌరు లంచు మదిలో ముదమందుచు నున్నదో యనన్
జోక యొనర్పుఁ దత్పురము చూపఱకు న్నడిరేయి నేనియున్. 52

చ. పణముగ సింహకర్ణములపై రతనంబులు దాపినట్టి తో
రణముల రామణీయక మరంగులరంగులు నేపురంబు తో
రణముల కింద్లకెందును సరాసరిలేమి బరస్పరంబుగాఁ
బణముగ మీఱుచున్నగతి భాసిలుఁ దత్పురమందు మాడువుల్. 53

మ. తనపై నేస్తముగల్గు తమ్ములకు సంతాపంబు గావించు వా
రని కాంతాముఖచంద్రులం జెనక నిత్యంబుం బతంగుండు త
ద్ఘనసౌధంబుల త్రోవఁ బోవుచుఁ గడుంగాలించియుం జూచి కా
ననిచింతం బడుచుండుఁ బ్రత్యగుదధిం దాఁ గోపరక్తాంగుఁడై. 54

చ. "శతమఖుఁ డౌనుగాక మనశాక్యనృపాలురతోడఁ దుల్యుఁ డే
గతి నగు ? నల్పు లిచ్చిన ప్రకారముగా బిరుదంబు చెల్లునే !

యితనికిఁ గల్గు నా బిరుదమేఁ దుడిపించెద" నంచుఁ దత్పురీ
సతి పయికెత్తు కేలన ధ్వజంబుల పెల్లలరారు నప్పురిన్. 55

తే. గీ. వీటఁ బొడవయి చద లంటు కోటగోడ
హరిపదము ముట్టె నన్నను నగును గాని
కడలివలె లోఁతు గల్గు నగడ్తగూడ
హరిపదము ముట్టె ననుట మహాద్భుతంబు. 56

తే. గీ. గజములో యని తలఁప నగజము లగుచు
నాగములె యని తలపోయ నగములగుచుఁ
గొండపొడుగుగఁ బురిచుట్టు నిండియుండుఁ
దొండములుగల్గునట్టి జంతువ్రజంబు. 57

తే. గీ. శాక్యపరిపాలకుండు విస్తారయశుఁడు
విక్రమక్రమవంతుఁడు చక్రవర్తి
యేలు నప్పట్టణం బమరేశ్వరుండు
నాఁగ శుద్ధోదనుండు సన్మార్గధనుఁడు. 58

తే. గీ. సకలసామంతమూర్ధాభిషవణగలిత
కలితజలబిందుదలదిందుఖండమండి
తోజ్జ్వలాంగుఁడు నైన శుద్ధోదనునకు
ధర్మమునఁ దుల్యుఁ డొక్క పృథాసుతుండు. 59

చ. జవనహయంబు నెక్కి రభసంబును రౌతులు మెచ్చులాడఁగా
నెవఁడు కరాసిచే నణుక నీల్గిన శాత్రవిరద్విపేంద్రము
ల్పవిలిన నెత్తులం బలకఁబాఱిన ముత్తెపుఁజేర్లు గ్రక్కుచుం
బువులను దోయిలించుగతి బోరగిలంబడు సంగరస్థలిన్. 60

మ. ఉపరాగంబులు నిష్క్రమించి రవి లోకోన్మోదముం జేయు న
ట్లపకారం బొనరించు శాత్రవులఁ జక్కాడించి శుద్ధోదనుం
డుపకారం బొనరించుచుం బ్రజలపై నుల్లాసముం జూపుచుం
గృప నీలోకము నేలెఁ బెగ్గడల యంగీకారము ల్తోడుగన్. 61

వ. భూభృద్వరుండయ్యు నపక్షపాతుండు, నీశ్వరుండయ్యు సమదృష్టి ప్రసారుండును, బ్రవృత్తదానుండయ్యు మదానుపేతుండును నగు నాశుద్ధోదననృపాలుండు సకల సామంతనృపాలసమర్ప్యమాణమదావళ మదధారావాహినీపంకిలభవనాంగణుండై రాజ్యంబు సేయుచు మాయా దేవియు గౌతమియు నను నిరువురు వెలందుకలం బెండ్లియాడి సుఖం బుండె. 62

సీ. తానకం బేకాంత దైవభక్తికి సాధు
గురుజనాసక్తి కేతరుణి కుదురు
ప్రజలపాలింటి కేభామిని జనయిత్రి
చుట్టాల కేసాధ్వి పట్టుఁగొమ్మ
పతి కేసరోజాక్షి పంచప్రాణంబులు
పరిశుద్ధి కేతల్లి పాలవెల్లి
కరుణానివాస మేకలికి భృత్యుల కెల్లఁ
గులకామినులకు నేలలన యొజ్జ

తే. గీ. నిజముగఁ గటికిచీఁకటి నియతి గలుగు
కలికికాలముల కేదేవి వెలుఁగుఁ దెచ్చు
మణి యగుచు నట్టి పతిరత మాయవంటి
నెలఁతుకలు ముజ్జగంబున నిందుసున్న. 63

ఉ. ఆరమణీలలామ యొక యామినియం దొడికంపు కేళికా
గారమునందు మంజులతఁ గ్రాలెడు పాన్పున భర్తఁ గూడి స్వే
చ్ఛారతుల న్మెలంగి యొక స్వప్నము గాంచెను నిద్రలోన నం
భోరుహమిత్రమండలము పౌ ద్వరజామున కొప్పునప్పుడున్. 64

తే. గీ. షట్కిరణయుక్తమైన నక్షత్ర మొకఁడు
పాటలప్రభ దిక్కుల దీటుకొనఁగ
నాకసమునుండి కుడిప్రక్కఁదాఁకి తనదు
గర్భమునఁ జొచ్చినట్టు లక్కలతెఱంగు. 65

వ. ఇట్లుత్తలోదరి కలగాంచి యల్లన మేల్కని యక్కల నిక్కము తన
పతికిం జెప్పి పదపడి బంధుజాతమ్మున కెఱిఁగించిన శుభసూచకం
బనుచు నెల్లరు నానందించి రదియునుం గాక. 66

శా. యావద్భూపరిపాలకుండయిన శాక్యాధీశురాజ్యంబు తా
నై వర్తించు ప్రజ ల్క్రమక్రమముగా నవ్వార్త యందంద యెం
తే వేడ్క న్విని చావుపుట్టుకల మాయింపించు నిర్వాణభూ
త్యావిర్భావము చెందినట్లు గని రత్యంత ప్రమోదస్థితిన్. 67

చ. వెనుకటికన్న నెల్లపృథివీవలయంబును బాడిపంటలం
దనరుట యాదిగాఁ గలుగు తత్తదశేషవిశేషము ల్గనుం
గొనుచు నృపాలురాణి కల కుంభిని కెల్లను మోదదాయి య
య్యె నని యపారమైన సుఖమెంచును జెంది రనేకభంగులన్. 68

చ. పదపడి రాజునానతి సభాస్థలి స్వప్నఫలప్రదర్శకు
ల్ముద మలరంగ స్వప్నఫలము న్వచియించిరి "దేవ! యెంతకే
నిఁ దగిన స్వప్నమీయది గణింపఁగ శక్యమె నీదు భాగ్యసం
పద! జగదేకరత్నము నపత్యముఁ గాంచెదు నిశ్చయంబుగన్. 69

శా. ఆపుణ్యాత్ముఁడు సార్వభౌమపదవిం బ్రాపించి సామంతభూ
మీపాలు ర్దనుఁగొల్వ నెల్లరును మేల్మేలంచు శ్లాఘింప నా
శాపాలేశునిభంగి యీభువనము న్బాలించుఁ, గాదేని వి
ద్యాపూర్ణుం డయి సర్వలోకులకు నిత్యానంద మిచ్చుం గృపన్." 70

క. పదపడి యమ్మానిని దౌ
హృదలక్షణము న్వహించె హృదయేశుఁడు స
మ్మదమందఁ బ్రథమగర్భం
బది భర్తకు మోద మిచ్చుటబ్రం బగునే. 71

ఉ. ఈరుచిరంపువార్త వినునెల్లర నెమ్మది మోదమట్లు వి
స్ఫారతఁగాంచె గర్భ మలసాధ్వికి దానఁ బ్రతిక్షణంబున
న్గోరుకు లేరిక ల్గొలిపెఁ గోమలికి న్మొగ మెల్ల వెల్లనై
యారయ నయ్యెఁ జూచుకములం దొదవె న్నలు పంతకంతకున్. 72

తే. గీ. ఉదరమునయందు భగవంతుఁ డుంటఁజేసి
యధికశోభ వహించె నయ్యధిపురాణి
వెన్నెలల కన్ని దెస లొక్క విత మయ్యెన
వెండిమలనెత్తములహెచ్చియుండుఁగాదె. 73

తే. గీ. మించుఁ గడుపున ధరియించు మేఘమాల
పోల్కిఁదనలోన బోధిసత్త్వుని ధరించి
ధరణి దీనాళి దారిద్ర్యతాపభరము
మాయ ధనవృష్టి గురిపించె మాయ యపుడు. 74

క. పరిపూర్ణగర్భవతియై
సరసిజముఖి పుట్టినింటిచాయకు వెంటం
బరివారము రాఁ జను నవ
సరమున దారి నుపవనముచక్కటి నొకటన్. 75

చ. అనయముఁ బూలఁ బిందెల ఫలావళులం దులఁదూఁగుచుండు లం
బినియను చెట్లతోఁపుఁ గడువేడ్క యెలర్పఁగఁ జేరనంత గ్రి
క్కునఁ బ్రసవంపుభంగి యొకకొంత కనంబడ నాపె యాన మొ
య్యన నిలువంగఁ జేసి డిగి యల్లనఁ గొండొక యేగి యొక్కెడన్. 76

వ. నిలువంబడి యొక్కపలాశవృక్షశాఖ చేతులం బట్టుకొని ప్రసవవేదనా
పరవశయై యుండుపట్టున నప్పలాశవృక్షంబు. 77

మ. తనకొమ్మల్దిగవంచి యెల్లెడలఁ బత్రివ్యాప్తిఁ గావించి సూ
ర్యనిరోధం బొనరించె గొడ్గుగతి నౌరా! వింత, యాసాధ్వి ని
ల్చినచోట న్నయనీయ మట్ల మొలచె న్లేజొంపము ల్పాపు, మీఁ
దను నేతొక్కటి వచ్చెదాపునకు నేత్రప్రీతి సంధించుచున్. 78

ఉ. ఇట్టి విచిత్రచర్యలకు నెల్లను నెల్ల సమస్తవిద్యలం
దట్టుఁడు కాఁగలాఁడు పరతత్త్వవిశారదుఁ డార్యసంతతు
ల్గట్టినభాగ్యరేఖ యలకాంతకుఁ బుత్రకుఁడై క్షణంబునం
బుట్టె సమస్తలక్షణసముజ్జ్వలమై తనమూర్తి యొప్పఁగన్. 79

తే. గీ. మొగిలుతెర దాఁటి రవి వచ్చుపగిది మాతృ
కుక్షి వెడలిన యాజగద్రక్షమూర్తి
యొదలి సంచులు వన మెల్లయెడల నిండి
పండు వౌనరించె బాలాతపంబుమాడ్కి. 80

క. చందనయూపముతో సరి
యందముగల శాక్యభూవరార్భకు మీఁద
న్మందారపుష్పవర్షము
బృందారకు లెల్లరుఁ గురిపించిరి పేర్మిన్. 81

ఉ. అల్లలనాడె వాతహతమౌ తరిలాగు ధరిత్రి యంతయుం
జల్లనిగాలి వీచె, రవిచంద్రులు మున్నటికంటె హెచ్చు భా
సిల్లిరి, దిక్కరుల్ ముదము చేఁదులఁదూఁగెను బొర్లె వార్ధులున్
మొల్లము పల్లవించె నగము ల్మహనీయుని జన్మవేళలన్. 82

మ. అహహా! యెంతమహామఘావుఁడో కదా యాతండు దిక్పాలకు
ల్మహి కేతెంచి ప్రసూనమేతముగ ధర్మస్ఫీతమై యొక్కడో
రహి నొప్పారెడి యానమం దునిచి గర్వం బింతయు న్లేక తా
ర్వహియింపం దగువారలై నగరికిం బ్రాపించి రప్పట్టునన్. 83

తే. గీ. సురలు మోయు కలాచికోపరితలమున
జనని యొడికట్టు లోపలఁదనరుచిసుపు
సంజకెంజాయచాటున జనులచేతఁ
జూడఁబడు బాలశశిరేఖజాడఁ జెందె. 84

వ. ఇట్లు దిక్పాలకానీతం బగుయానంబు కపిలవస్తుపురవీథిం జనుదెంచు సమయంబున నబ్బురంపడు పౌరు లందఱాకస్మికం బగు తదుదంతంబు సాంతంబుగా విని ముందుఁ జని శుద్ధోదనున కెఱింగించిరి. 85

క. కని శుద్ధోదనుఁ డానం
దనిమగ్నుం డయ్యె దేవతలు మనుజులు నాఁ
గను భేద మించుకయు లే
క నియతమోదాతిశయము నందిరి పౌరుల్. 86

ఆ. వె. పుడమి యెంతపెట్టి పుట్టెనే యనియు శు
ద్ధోదనుని దఖండయోగ మనియు
నతనిభార్య కెవ్వరైనను లొచ్చని
యు సురలెల్లఁ బొగడిరెసకమెసఁగ. 87

చ. మును గలనాఁడు పండితు లమోఘవచస్కులు చెప్పుమాట ఏ
దినమున లక్షణాఢ్య మగుతేజము వొల్చెడు పుత్రుచందము
న్మనమున నెంచి యీతఁడు సమస్తనృపాలశిరోవిభూషణం
బనఁదగు రాజచంద్రుఁ డవునౌ నని సంతస మందెఁ దండ్రియున్. 88

తే. గీ. అంతియే కాని సంసారమవలఁ ద్రోచి
జ్ఞానియై జ్ఞానులకునెల్ల జ్ఞానబోధ
మొలవఁజేయుచు సన్యాసమును వహించు
నని యెఱుఁగఁ; డేరికెఱుక భావ్యర్థగతులు! 89

సీ. ఐరావణమునైన నక్కుఁ దన్నఁగఁజాలు
చేవగల్గు ననేకపావళులును
నుచ్చైశ్శ్రవసముతోనొఱపుఁ జూపెడి చక్క-
నైన వేగమువొల్చునశ్వతతులు
పవితోడ నెదిరించి బవరం బొనర్పఁగఁ
జాలిన యాయుధసముదయములు
చింతామణికి సిగ్గుచేయఁజాలెడి మంచి
నిగ్గు గల్గిన రత్న నికరములును
తే. గీ. బునుఁగుఁ గస్తూరియు జవాజియుఁపు నవర్ఘ
మైన ముత్యాలహారమ్ము లట్టినేలు
వులు నుపాయనముగ నృపావళులు చూడఁ
దరలి వచ్చిరి తండోపతండములుగ. 90

ఉ. వెండియు నాఁడు సంతసమువెల్లిగొనంగను బౌరులెల్లఁ బూ
ర్ణమండన మాచరించి మృదుమంగళనిస్వననృత్తగీతము

లెమ్మెండుగ నెల్లచోటులను మేకొనఁ గేవలసౌఖ్యమగ్నులై
కొండొకసంగతు ల్తలఁపుగొల్పక వర్తిలి రేకరీతిగన్. 91

చ. చిరముననుండి తాఁ దపము సేయుచు యోగసమాధినున్న స
త్పురుషుఁడు వృద్ధమూర్తి యసితుం డను నొక్కమహానుభావుఁ డు
ద్ధురగుణుఁడైన బుద్ధుఁ డొక తొయ్యలికిం జనియించె నంచు నం
బరమున నొక్కవార్త విని పట్టఁగరాని కుతూహలంబునన్. 92

క. అమరుగతిఁ గపిలవస్తుపు
రమునకుఁ జనుదెంచి వేగ రాజన్యుని సౌ
ధము చొచ్చి యచ్చటిపరిజా
సముదాయముతోడ రాజసన్నిధి కరిగెన్. 93

ఉ. వచ్చినమౌనిఁ గాంచి జనవల్లభుఁ డల్లన లేచి మ్రొక్కి లో
మెచ్చుచుఁబాద్యమిచ్చి మది మెత్తని బత్తియుఁదత్తటింప 'నీ
యిచ్చ యొనర్తుఁ జెప్పఁగదవే' యని చేతులు దోయిలింపఁగా
నచ్చపుఁబేర్మి నిట్లనియె నమ్ముని తేనియ లొల్కుపల్కులన్. 94

ఉ. ఈవినయంబు కొత్తయగునే కులపూర్వులపోల్కిఁగారనీ
కీ వినయంబున న్ప్రజల నేలుటయందు సమాను లెవ్వ రో
కోవిదమాన్య ! నీవు జనకుండవుగా నుదయించె బుద్ధుఁ డన్
దేవుఁ డటంచు వింటి విని దేవరఁ జూడఁగ నిట్లు వచ్చితిన్. 95

ఉ. నావుడు రాజచంద్రుఁడు మనంబున సుబ్బుచు లేచి వెంటఁగొం
పోవఁగఁ బోయి కాంచె ముని ముద్దులబాలు దయావిశాలు నీ
రావసితాంగుఁ జక్రికమలాంకితపాదుఁ గళావినోదు దం
తావళవస్తికేశు జనతానుతరూపు నిరస్తపాపునిన్. 96

తే. గీ. గౌఁతొడమీఁద నున్న కుమారుపగిదిఁ
దల్లియొడినున్న పాపనిఁ దనియఁ గాంచి
మరలె యతియును గన్నులధారలునీరు
వంచి తెప్పలచే నప్పళించుకొనుచు. 97

తే. గీ. తనయుఁ గని కంట నీ ర్వెట్టుతపసిఁ గాంచి
యేదియో కత మంచు శుద్ధోదనుండు
కాలు చేయి వడంకఁగ గద్గదస్వ
రమ్ముతో నిట్లనియె దైన్యరసము గదుర. 98.

క. కడు నద్భుతజన్మము గల
కొడుకుం గని దేవుఁడనుచుఁ గొనియాడియు నా
కడుపు పగులంగఁ గన్నులఁ
గడుకొల్పితి నీ రి దేమికతము మహాత్మా! 99

మ. పలితాత్ముండను ముప్పవాఁడను మృతప్రాయుండ నాకుం జలాం
జలి యిచ్చుం దరియింపఁజేయు నని యుత్సాహంబుతో నున్న యా
హలపా ణెల్లనుగంగలోఁ గలియ దీర్ఘాయుండు కాఁ డేమొ, కాఁ
గల కార్యం బెఱిఁగింపఁగావలె నమస్కారంబు గావించెదన్. 100

క. కన్నులు తెఱవని పాపఁడు
చిన్నారిమెఱుంగు గల్గుచిఱుతఁడు పెంపుం
జెన్ను గను నంచు నున్నాఁ
డ న్నే దురదృష్టవంతుఁడను గాను గదా! 101

మ. గుణదూరుం డగునో! సదా ప్రజలబాగుం గోరఁడో! శత్రుసీమా
రణభీరుం డగునో! కరంబుఁ బరదారావిత్తముల్ గోరునో!
పణవీరుం డగునో! నయంబుగను విద్వాంసుండు గాఁడో! దయా
చణభారుం డగునో! విరాగమున సంసారంబు వర్జించునో! 102

తే. గీ. అనుచు నశ్లీలమునకు భయంబుఁ జెందు
కపిలవస్తుపురీందుప్రవిఁ గాంచి మౌని
"భయముఁ జెందకు మయ్య, నృపాల!" యనుచు
భావిగతిఁ జెప్పఁబోవు నవసరమందు. 103

శా. అంతంతం గని యమ్మహామహుని మాయాదేవి లో నెంతయు
న్సంతోషం బిగురొత్త నమ్మువి పదాబ్జాతద్వయిన్ వైచె శ్రీ

మంతుండును గుణవంతుఁడు న్మిగుల ధీమంతుండు నాయుర్భాగ్యో
వంతుండు న్సుతుఁడౌ నటంచు; నటుపైన న్యోగి దౌదప్పులన్. 104

చ. తొలఁగి భయమ్ము భక్తియను దోరముగాఁ గనుపట్ట నప్పరో;
తెలియఁగలేవు గా కితని తేజము సర్వజనాభివంద్య మి
య్యలఘుఁడు నమ్ముఁడెల్లరకు నారయ నీతని కెంత పెద్దవా
రలును ననమ్యులంచును గరమ్ములు మోడ్చి నమస్కరించుచున్. 105

క. ఆతనిపాదము లుంచిన
భూతలమున ధూళి హస్తమునఁ జేకొని య
త్యాతతభక్తి న్శిరమున
వేతాలిచె నతఁడు తత్త్వవేత్త్రుత నెగడన్. 106

చ. ఎనిమిదిసార్లు ధూళి గదియించి శిరమ్మున నంతఁబోక య
య్యనఘుని యంఘ్రిలందుఁ జెలువారెడు చిహ్నములెల్లఁ జూచి యిం
తని యనరానిమోదమున నమ్మహనీయు గుఱించి మైపథా
వన దనరంగ నిట్లనె నవార్యములై పులక ల్జనింపఁగన్. 107

క. బుద్ధుఁడవై జగముల కవి
రుద్ధం బగుజ్ఞాన మిచ్చిపోఁ్రచుచును నసం
బద్ధపుమతములఁ ద్రుంచుచు
నిద్ధచరిత నెగడఁ బుట్టితీవు మహాత్మా! 108

క. ఏ నతివృద్ధుఁడ నగుటన్
జ్ఞానము నీవలనఁ బొందఁగా నోఁచఁగ లే
దైనను జగ మెల్లను ని
న్నాని తరించుటకు శంకయుండదు దేవా. 109

క. తన కపాత్రిప్యం బైనది
కొనవచ్చునె, దాని కేమి? గుణఖని వగు నిన్
గనుఁగొనఁ గల్గెను సంతస
మును బొందితి నింతకన్నఁ బుణ్యము కలదే. 110

వ. అని శుద్ధోదనుదిక్కు మొగం బై యిట్లనియె. 111

క. జర తరగలుగా, మరణము
ఝరముగ, రోగములు నురుఁగుచందముగా దు
స్తరమగు సంసారాబ్ధిం
దరియింపంజేయు తరి యితండు నరేంద్రా! 112

క. వ్రతములు చక్రింబులుగాఁ,
బ్రతిభ జలంబుగ, సమాధి పారంబులుగా
వితతమగు ధర్మనది నీ
రితఁడే త్రావించువాఁడు తృష్ణార్దితులన్. 113

క. విషమం బగుచును దత్త
ద్విషయావృత మైన తప్పుతెరువునఁ బడు కి
ల్బిషవంతుల కీతఁ డకి
ల్బిషమోక్షపదంబుఁ జూపుఁ బృథ్వీనాథా. 114

తే. గీ. విషయశుష్కేంధనమ్ముల విస్తరిల్లు
మోహదావాగ్నిలోఁ బడు మోఱకులకుఁ
బ్రాణదానం బొసంగి కాపాడుకొఱకుఁ
గారుక్రమ్మిన ఘనఘనాఘన మితండు. 115

మ. నరపాలైక శిరోవతంస! కడుధన్యం బయ్యె నీపుట్టు; వె
వ్వరు నీకు న్సరి గారు; నీగృహముసౌభాగ్యం బగణ్యంబు; జ్ఞా
నరసాయత్తత నెల్లలోకముల యజ్ఞానంబు వోకార్ప వి
ట్టిరు తా మెచ్చటనో జనింతుర్రి చిరరూఢిన్ దేవతాంశంబునన్. 116

వ. అని వెండియు. 117

చ. నరవర! యొక్క కారణమునన్ భవదీయగృహం బదృష్టవ
త్తర మనియు న్వచించుట కెదం గడు సందియమందుచుంటి; నె
వ్వరికిని జన్మ మన్నది ప్రపంచమునం గడు దుఃఖదం బటం
చరసినవారికి న్మరణమన్నను జంకు జనింపకుండెడిన్. 118

వ. అని మాయాదేవివంకఁ జూచి కనుఁగొనలం జాఱు నీ రత్యధికంబై నరేంద్రుహృదయంబు పగులం జేయుచు నిట్లనియె. 119

శా. ఏతాదృక్షమహానుభావునకు మాతృత్వంబు చేకొన్న స
త్ప్రాతివ్రత్యగుణాభిరామ వగు నీబాము ల్ప్వ్యతిం బొందు టే
లా తప్పున్ ? విను, నేఁటి కేడవదినంబందుఁ భపత్కాఉయసం
పాతంబౌ; నిఁక సౌఖ్యదుఃఖముల సంబంధంబు నీ కేటికిన్ ? 120

మ. అని యయ్యోగి తనంతఁ దాఁ జనియె; మాయాదేవియున్ యోగి చె
ప్పినకాలంబునకున్ మృతిం గని జగద్వేద్యంబుఁగా దేవతాం
గన లెల్లం దనుఁ గొల్వ స్వర్గమున వేడ్కన్మీఱఁగా నొప్పె; స
త్యనిధుల్ యోగులు సెప్పువాక్యము లవంధ్యమ్ముల్గదా యెరికిన్! 121

వ. పదంపడి రాజును గొండొక విచారించి గతంబునకుఁ గర్తవ్యంబు గానక యతనిం బెంచుటకుఁ దన ద్వితీయకళత్రంబగు గౌతమి నేర్పఱచిన నామెయుం దన కన్నకుమారుంబలె నొడియం బిడుకొని నంత.

క. జ్ఞానియగు నీతఁ డితరుల
జ్ఞానం బిడి యిట్లు బ్రోవఁగలఁ డనుగతి స
ద్దాని చనుఁబాలు బాలుని
ప్రాణంబులు నిలిపి పెనిచె బలుపు మిగులఁగన్. 123

వ. శుద్ధోదనుండును బదియవదినంబున సర్వార్థసిద్ధుండను నామం బొసరించినఁ బౌరు లందఱును నీతనిపుట్టుపుకతన సర్వార్థసంసిద్ధి రాఁగలదు గాన నప్పేరు సార్థకం బగు నని సంతసించి రంత. 124

సీ. నెలమూఁడువానలు నియతిగా వర్షించెఁ
బుడమి సదా సస్యపూర్ణ యయ్యెఁ
గుంభప్లుతిగఁ బాలుగురిపించె గోవులు
చతురంగబలము విస్తార మయ్యె
నరిరాజులకు భయంకరమయ్యె రాజ్యంబు
దుర్మార్గులకుఁ బ్రోలు దూరమయ్యెఁ

గులకామినులయందు గొడ్రాలు లేదయ్యె
జారచోరులబాధ సమసిపోయెఁ
తే. గీ. పాపము నశించె ధర్మంబు పాదుకొనియెఁ
గఱవు కఱవయ్యె లేమికిఁ గలిగె లేమి
కపిలవస్తుపురేంద్రు నగారమందుఁ
జిన్న నెలమాడ్కిఁ బుత్త్రుండు పెరుఁగుచుండ. 125

చ. అడిగిన సీనివాఁడు వ్రతమన్నను జేయనివాఁడు కల్లనా
డిడియనివాఁడు బందుగుల సఖ్యము గోరనివాఁడు కొండెము
ల్వొడిపెడువాఁ డహూయ మదిలోఁ గలవాఁ డొకఁ డైన బోధిస
త్త్వుఁడు గలరాజ్యమం దరయఁబోయినను గనరాఁ డొకప్పుడున్. 126

క. పూవుందోఁటలు నూతులు
బావులు సత్త్రములు దేవభవనంబులు పెం
జావడులును గట్టించిరి
భూవరతనయుండు వృద్ధిపొందం జనముల్. 127

క. ధనముం దాఁపఁడు కామ
మ్మునకై, ధనమునకు ధర్మముం జేయఁడు, ధ
ర్మనిమిత్తము ప్రాణులపైఁ
గనికరముం బాయఁ బోఁ డొకండైనఁ బురిన్. 128

వ. ఇట్లభ్యుదయోన్ముఖంబై క్రమక్రమంబుగా వర్ధిల్లు కపిలవస్తుపురింబు
దుర్ని రాజ్యంబు పగిది సర్వార్థసిద్ధుండును వృద్ధిఁ బొందుచుండె. 129

తే. గీ. అంత నెన్మిదియవయేఁట నవనిపతియుఁ
గొమరునకు విద్యలను గడల్కొనఁగఁజేయ
నెంచి మంత్త్రులతోడ యోజించెఁ దగిన
దేశికుం డెవ్వఁ డీరలు తెల్పుఁడనుచు. 130

ఉ. అంతియెకాని యాతఁడు మహాత్ముఁడు వీనికి విద్యవిద్య లా
వంతయు జ్ఞానదాయకత నందమి నిక్కము భూతపూర్వమై

యంతయు నిమ్మహామహునియం దలరారు నటం జెఱుంగఁ; దా
సంతతియందు వత్సలత సర్వమును న్మఱపింపఁ జేసెడిన్. 131

వ. ఇట్లొడయం డడిగినఁ బెగ్గడ లంద ఱిట్లనిరి. 132

శా. విద్యావంతులకేమి యెల్లయెడల న్విచ్చేసి యున్నారు; సం
సద్యోషామణిభూషణాయితుఁడు విశ్వామిత్రుఁ డాఢీయుఁ డే
తద్యోగం బొనరింపఁగాఁ దగిన విద్వాంసుండు నీ వాత్మజున్
సద్యం బాతని కొప్పగింపు మణివాసశ్శ్రీల నర్చించుచున్. 133

చ. అనవుడు నట్లకాక యని, యానృపుఁ డాబుధుఁ బిల్వఁ బంచి, పు
త్రుని శుభమౌముహూర్తమునఁ దోరపుటుత్సవ మాచరించి, య
య్యనఘున కొప్పగించె మణిహారపరంపర లగ్రహారముల్
ధనమును ధాన్యము న్సముచితంబులు వస్త్రము లిచ్చిపుచ్చుచున్. 134

చ. కరమున రత్నపుం బలకఁ గైకొని మేటివినీతి యొప్ప నా
దరమున నగ్రభాగమునఁ దన్నృపపుత్రుఁడు నిల్వ నాసుధీ
వరుఁ 'డిది వ్రాసికొ'మ్మనుచు వ్రాయఁగఁజేయుడుఁ బూర్వమంద తా
నరసినవాఁడువోలె నదియల్లన వ్రాసి పఠించు నంతలోన్. 135

ఉ. ఆతఁడు చెప్పుచే కొదవయౌ గతి విద్యలనెల్ల నాజగ
న్నేతకుమారుఁ డెక్కుడగు నేర్పలరం గ్రహియించె నెన్నఁగా
బ్రాఁతియె వానిసంఖ్య! యొకభాషయొ, యొక్కొకపుస్తకంబొ, యే
రీతి గణింపవచ్చు! వినరే, మును ప్రాక్తనవిద్య లబ్బుటల్! 136

తే. గీ. ఏది చెప్పినఁ దనకన్న నెక్కుడుగను
దిరిగి చెప్పుటఁ జూచి యాదేశికుండు
మనుజమాత్రుండు గాఁడని మదిఁదలంచి
పడియె సాష్టాంగముగను దత్పాదయుగళి. 137

అంతం బోక మఱియు నిట్లనియె. 138

క. ఏ నీశిష్యుఁడ, నాకు న
నూనంబగు మతివిశేష మొదవఁగ నీవే

ధీ నెగడఁజేయు నొజ్జవు
నా నేర్చిన దించుకయయినను జే దనఘా! 139

వ. అని చెప్పి యతండు తద్వృత్తాంతంబు శుద్ధోదనున కెఱింగించి యత నిచే నుపాయనంబుగఁ గాంచనాంబరాగ్రహారాదికంబులు గ్రహించి తన యిచ్చం జనియెఁ; బదంపడి నృపసూనుండు. 140

చ. కలఁ నఖండుఁ డయ్యు మదిగర్వము దాల్పక, బల్పరాక్రమం బలవడియుం గృపాపరతనంది చరించుచు, నశ్వశిక్షయం దలఘుతఁ గాంచి, స్యందనవిహారములం గడిదేఱి, చాపవి ద్యలఁ బ్రబలత్వ మూని, వితతప్రతిభం జెలువారె సామునన్. 141

వ. ఇట్లు ప్రాగ్జన్మసంస్కారవిశేషంబునం గలిగినవిద్య లన్నియు న్నేర్చి సవయస్కులగు బాలురతోఁగూడ నాడువాఁడు. 142

ఉ. వేఁటకు నేగి తద్విపినవీథులఁ గ్రుమ్మరుచు న్మృగాళి నే పాటియు గాసిపెట్టక యుపాయమునం గ్రహియించి చంప క మ్మేటి కృపాళుఁడై విడుచు; మించినవేగమునం జరించుటన్ ఘోటక మార్తిఁగూరఁ గృపగొల్పి వ్యథాగతి మాన్పు నిల్పుచున్. 143

క. శోకము బాధయుఁ గన్నీ
రాఁకలియను శబ్దములన యతఁ డెఱుఁగుం; ద
ద్వ్యాకులత యించు కేనియు
నాకరుణాకరున కెఱుకయనఁ౦గ దొకటన్. 144

వ. ఇట్లు దశహాయనుం డగు నాసర్వార్థసిద్ధుండు కృపైకగుణావలంబియై కాలయాపనం బొనర్చుచు నొకనాఁడు దేవదత్తాసు లగు తన మిత్రులతోఁ గూడి. 145

చ. ఉపవనసీమలందు సొంబగొప్ప విహార మొనర్చుచు న్మనం బపరిమితప్రమోదమయమై యలరార హిమాద్రిచెంత కే గి పులుఁగులం గనుంగొనుచుఁ గేళి యొనర్చుచు నున్నయంత వ్యో మపథమునందు నంచలసమాజ మొకం డొకచక్కిఁ గన్పడెన్. 146

ఉ. కాళలతీరు ముక్కులచొకారము తెక్కలసౌరు నెమ్మదిన్
హాళి యొసంగఁజేయ నృపుఁ డంచలబంతిఁ ద దేకదృష్టిగా
లోలుపతం గనుంగొనుచు, లోఁ గడు మెచ్చుచుఁ, బజ్జ నున్న మి
త్రాళికి వానిచిత్రముల నారయఁజేయుచు నున్నవేళలన్. 147

తే. గీ. దేవదత్తుం డలుఁగొకండు దీసి వింటి
యందు సంధించి కరుణ యింతయిన లేక
యొక్కయంచను గొట్టె, నాపక్కి తెక్క
లాఁగలేక భువిం బడె నాక్షణంబ. 148

క. నెత్తురు తెక్కలఁ దొరఁగఁగ
న త్తెఱఁగున గిలగిల మని యాహంసము పే
రెత్తిన శోకభరంబునఁ
గుత్తుక తడియాఱఁ బడుటకు న్నృపుఁ డెడఁదన్. 149

క. కడలేని కనికరము గని
తొడ నిడుకొని నల్ల నల్లఁదుడుచుచు మేనం
గడులోఁతుగ నాటిన యలుఁ
గెడలించిన నంచ మఱియు హెచ్చినయార్తిన్. 150

క. గిలగిలఁ గొట్టికొనఁగ న
య్యలఘుం 'డిది యేల యిట్టు లార్తిం గను ? న
మ్మలికిం బుచ్చితిఁ గాదే
కలిగెనె వే తెద్దియేనిఁగారణ ?" మనుచున్. 151

క. తనకాయమునం దయ్యలుఁ
గును గుచ్చియుఁలబుచ్చియునుబుగులొ్కను నార్తిన్
దనలో నెఱింగి యనుభవ
మునకుం దెచ్చుకొని మిగుల మొనసిన కరుణన్. 152

ఆ. వె. అనఁటిమొవ్వువంటి యయ్యంచ తెక్కల
నేర్పుకొలఁదిఁ గేల నిమురుచును వ

నౌషధీరసముల నద్దాని క్షతి కొంత
యుపశమింపఁజేసె నృపసుతుండు. 153

వ. ఇట్లు సహజప్రాణిహింసాదూరుండగు సర్వార్థసిద్ధుం డయ్యంచ కిట్లు నైకవిధోపచారంబు లొనర్చుచుండ దానిం గొట్టిన దేవదత్తుని భృత్యుండు చనుదెంచి "మాదొర యంచను నాచేతి కి" మ్మనుటయు.

క. నృపసుతుఁడు వల్కెఁ, "బ్రాణ
వ్యపేత మగునేని వాని కగుఁజు మ్మిది, ప్రా
ణపరీతమగుట నటు కా
దపమార్గం బేరి కైన నర్హం బగునే." 155

వ. అనవుడు భృత్యునిచే నివేదితుండగు దేవదత్తుండును నయ్యెడకు వచ్చి "నాయంచ నీవు గైకొను టనుచితం" బన రాకొమరుం డిట్లనియె.156

ఆ.వె. ఆకసమున నిద్దియల్లన నెగురు నే
శక్తికతన నట్టిశక్తి మాత్ర
మీవు సంహరించి తిద్దానిజీవంబు
నెడప వైతి నీది యెట్లు లిద్ది? 157

ఆ. వె. దైవవిహితమైన దయ కల్మి నాకు నీ
యంచ బ్రతుకఁజేయునంతపాటి
యవసరంబు గల్గె, నక్కారణమున నా
యదియె యిద్ది యొరుల దగుట యెట్లు? 158

వ, అనవుడు దేవదత్తుండును "నిట్టియన్యాయోక్తులాడం బాడియె? మదీయ బాణనిహితం బగు హంసంబు నాది యనుటకు సందేహ మేమి" యనుచుఁ గలహింపం దొడంగిన యమ్మిత్రునిమనంబు నొప్పించుటకు నొడంబడని మనంబుతోఁ బలుకుల ననునయం బుట్టిపడ నయం బుగా నాభూవరతనయుం డిట్లనియె. 159

క. ఇందులకు నొల్ల వేని గ
నందగు సభవారు చెప్పు నాయంబును బే

రందిన విద్వాంసులు సభ
యందుందురు పోయి వారి నడుగుట తగదే. 160

క. అన, నతఁడికొన నిరువుసఁ
జని సంస్థానస్థవిబుధసత్తములం బ
ల్వినయమున నడుగ నొకరుం
జన రుచితంబైనత్రోవ సందియపడుచుస్. 161

వ. అట్టియెడ భగవంతుం డగు నొక విద్వాంసుండు నిష్పక్షపాతంబగు మతంబుతో నిట్లనియె. 162

క. ఈనిఖిలజంతువులకును
బ్రాణము ముఖ్యంబు, దాని రక్షించిన య
వ్వానిది తదాధిపత్యం,
బీనాయము నొప్పవలయు నెల్లరు సభ్యుల్. 163

తే. గీ. అంతియే కాని ప్రాణిహింసాచరణము
కరుణలేక యొనర్పఁగఁ గడఁగువాఁడు
తగునె దానికి నాధిపత్యము వహింప
ననుభవవిరుద్ధ మిది ధర్మమగుటయెట్లు ? 164

క. ఈసిద్ధార్థుఁడు దీనిఁ గృ
పాసహితుం డగుచుఁ బ్రోచువాఁడై యలుఁగుం
దీసి తనయొద్ద నిడుకొని
గాసిపాదిక మిడుట నితనిఁ గా దనఁ దరమే. 165

వ. మఱియు "మృగయావినోదంబునం బాణహతంబగు ప్రాణి యేదే నియుఁ బ్రాణి యున్నంతదనుక నాహతకునిది గా" దనున్యాయంబు సర్వసమ్మతంబు గావున నీయంచ సర్వార్థసిద్ధునిదే యని నొడివిన, రాజును విని యానందించి కుమారుని కృపావశత్వమునకును విద్వాం సుని నిష్పక్షపాతబుద్ధికిని మిగుల సంతసించె.

ఆ. వె. నాఁటఁగోలె నెల్లనరులకు నేప్రాణి
నేని హింసచేయు టె గ్గటంచుఁ

దేట తెల్లముగను దెలియంగ నయ్యె; న
హింసఁబోలు ధర్మమెందుఁ గలదె! 167

క. పదపడి యయ్యంచను బూ
ర్వదశకుఁ దాఁదెచ్చి దివికి వదలిన నది స
మ్మద మందుచుఁ జనె; నాతఁడు
సదయత నొనరించు నిట్టి సత్కృతు లెపుడున్. 168

వ. ఇట్లు సకలపౌరస్తూయమానుం డగుచు నాసర్వార్థసిద్ధుండు సమానశీల వయస్కులగు బాలురతోఁ గూడికొని క్రమక్రమంబుగ వృద్ధిఁ జెందుచున్నంత. 169

సీ. ఆజానులంబంబులై కరంబులు గ్రాలె
వక్షంబు తులితకవాట మయ్యెఁ
గందోయి కర్ణాంతకమనీయకమ్మయ్యె
నారవం బబ్దగంభీర మయ్యె
బలము సింగముతోడితులన కెక్కువయయ్యె
ధైర్యంబు మదిలోనఁ దా వొనర్చె
మొగము శ్మశ్రులమయి ముద్దుఁ జూపఁగసాగె
ఫాలంబు మిగుల విశాలమయ్యె
తే. గీ. దేహమున నొక్క లవణిమ దీటుకొనియె
జంఘలకుఁ బాటవంబు విస్తారమయ్యె
నతులసుగుణాబ్ధియైన సిద్ధార్థునకును
నిండుజవ్వన మది మేన నిండునంత. 170

వ. ఇట్లు సంపూర్ణయౌవనుం డగుచు నాకుమారుండు సంసారదూరంబగు విచారంబునఁ బ్రవర్తించు చున్నంత. 171

క. ఋతువులకు రాజు, తతదు
ర్గతులకు ధనికులకు నొక్కగతి సౌఖ్యమ్మున్
జతకూర్చు జాణ, కుంజవ
సతుల యదృష్టం బొదవె వసంతం బంతన్. 172

సీ. పండుటాకుల నూడ్చి పాదపంబులు నాఁడు
నాఁటికిఁ జివురుల దీటుకొనియె
నిగనిగ నెగడెడి చిగురులలోనుండి
పసరుమొగ్గలు సముత్పత్తిఁ జెందె
నామొగ్గ లంతలో నతిశయించుచు నొకిం
చుక సౌరభమ్మును జూఱఁగొనియె
నంతలో నలవిచ్చి యవి పూవులై సమ
గ్రపరిమళంబునఁ గ్రాలఁబొడఁగెఁ

తే. గీ. బదపడి రజఃప్రసంగంబు పరిఢవిల్లె
నంతఁ దుమ్మెదద్రిమ్మరీం డ్రావరించె
మలయవాయువు లామీఁద నలముకొనియె
నెల్లదెసల సుగంధంబు వెల్లివిరిసె. 173

తే. గీ. పట్టణముకన్నఁ బల్లెయుఁ బల్లెకంటె
నుపవనంబును మఱియు నయ్యుపవనంబు
కంటె వనమును మేటిసౌఖ్యంబుఁ గూర్పఁ
గలవియై యొప్పె నామని బలియుకొలఁది. 174

చ. నదులతలంబులం దుపవనంబులచాయలయందు దీర్ఘికా
వదనములందు వారినిధిపజ్జలఁ గట్టిన మేడలందుఁ ద
త్తదుచితకార్యభారములఁ దద్దయు లోఁగినవారు సంజ పెం
పొదవినవేళల న్ముదము లుప్పతిల న్నివసింతు రొప్పుగన్. 175

ఉ. ఎల్లెడ వృక్షజాతముల యేపుననో సరసప్రచారమై
చల్లనిగాలి వీచుటనో షట్పదకోకిలకీరశారికల్
కొల్లలుగాఁగ శ్రావ్యగతిఁగూయుటనో మఱి యేమొ తద్వసం
తోల్లసనంబు సంజలన యున్నత మై కనుపట్టు నెంతయున్. 176

సీ. లతలన్నియును బుష్పవతులై నగంబుల
నంచితంబుగఁ గౌఁగిలించుకొనియె

మందంబులై మంచిగందంపుఁ దావితో
　　　　జెలరేఁగి నునుగాడ్పులలముకొనియె
దోరముగ్గినపండ్లు తోఁటిచేఁ గొఱకుచుఁ
　　　　గొదమచిల్కలదండు కూయఁదొడఁగెఁ
బండుటాకులమీఁదఁబడిన పూవులజాలు
　　　　పండువెన్నెలకంటెఁ బండు వయ్యె
తే. గీ. నాలుమగ లెల్లఁదెల్లనిపూలఁజాల
లీలలొదవఁగఁ జేయు నీ రాలలోన
నించువిల్కానిచెయ్వు లగ్గించుకొనుచు
సంతసింపఁగ సాగి రాసమయమందు. 177

క. పొగడలుఁ దమాలములు మో
దుగులుం దిలకాగములు మధూకంబులుఁ గెం
జిగురుంబూవులతోడ
న్నగముల నింపుం దనర్చె నయనంబులకున్. 178

సీ. అరయరక్తాశోకకరయుఁ బలాశాంఘ్రి
　　　　కయును నీలాశోకకచయు నీల
నీరజనయనయు వారిజవదనయుఁ
　　　　గుందద్విజయు బిల్వకుచయు మంజ
రీకర్ణయును జపాశ్రీకాధరయు నీప
　　　　వసనాన్వితయు సిందువారనఖయుఁ
గోకిలాలాపయుఁ గేకికలాపయు
　　　　సారసస్వననూపురారవయును
తే. గీ. రమ్యవాసంతికాబద్ధరశనయు మద
హంసగమనయుఁ బుత్రజీవాభిధాన
లోమలతయును నగుచు నెంతే ముదంబు
సరసులకునెల్లఁ గూర్చె వసంతలక్ష్మి. 179

చ. క్రమముగ శైత్యబాధ తొలఁగం బ్రజ లందఱు మిద్దెమూలలం
బ్రమదలతోఁ బరుంట దిగఁదార్చియు మీఁదివిలాససౌధకు
ట్టిమముల లేఁతగాడ్పులకు డెందము లూరఁగ సన్న సన్న వ
స్త్రములను గప్పుకొంచు నిదురం గొనసాగిరి వేగుఁబోకలన్. 180

మ. మలయాగంబునఁ జందనాగముల సంపర్కంబునం బుట్టి సం
చలదూర్మిప్రకరంబులై కమలసంసక్తంబులై యొప్పు వా
గుల నయ్యేయెడ సేదఁ దీర్చుకొనుచుం గుంజమ్ములం దూఱుచుం
గలయం బ్రామఁదొడంగె వెన్నెలల సఖ్యంబొంది నుష్టెమ్మెరల్. 181

తే. గీ. పదృశమగు వేఁడి సదృశమౌ చలియుఁ గలిగి
పవలు నిశియును విషమభావంబుఁ గనక
త్రాసునం దూఁగుగతి సమత్వంబు దాల్చి
తనరుచున్నట్టి యవ్వసంతంబునందు. 182

వ. శుద్ధోదనుం డవ్వసంతర్తువిశేషంబులం జూపి కుమారుని మనంబు సంసారసక్తంబుగఁ జేయఁ దలంచి రాజమార్గంబు సర్వంబు పంగ్వంధవికలాంగబధిరరహితంబు గావింపించి కుమారుంగాంచి "తండ్రి యీవసంతర్తువు మిగులఁ జక్కనిది, దీనం గల విశేషంబు లాశ్చర్యజనకంబులు, గావున నీ వొకసారి యీ సమీపహిమాచలోపాంతంబుల కరిగి చూడు" మని శిరంబు మూర్కొని మఱియు నిట్లనియె. 183

తే. గీ. "తండ్రి వినుఁ బాసి గడియైనఁ దాళఁజాల
వేగ రావలె" నంచుఁ దెప్పింపఁ బనిచెఁ
గింకిణీమేఖలాసమాకీర్ణ మగుచుఁ
గలితశృంగారమైన బంగారుతేరు. 184

సీ. కమనీయతపనీయకలితసూత్రంబులై
వరుసఁ బూంచిన వారువములతోడఁ
బరిమళప్లవమానపవమానపోతమై
చుట్టుముట్టిన పూలకట్టుతోడఁ

కౌశేయపరిధానకంబై విరాజిల్లు
నవవంటి సింహాసనంబుతోడఁ
జిలుముత్తియములు చేర్చినచేర్లు గట్టి వి
న్ననువు చేసిన వితానంబుతోడ
తే. గీ. వెలయు నొక్కరథంబుఁ దెప్పించి సాది
"దేవదేవ! పరా" కంచుఁ దెలుపఁ దెలుప
జనకునకుమ్రొక్కి యా రాజతనయుఁ డేగె
నంత మిత్త్రులతోడ వాహ్యాళికొఱకు. 185

క. తారాగణంబుతోడం
దారానాథుండు మింటఁదరలు విధముగా
నా రాజసుతుఁడు మిత్త్రుల
తో రాజపథాంతరమునఁదోతెంచె వెసన్. 186

క. సిరికొామరునిజిగి జేజే
దొరకొామరుని సొబగు రిక్కదొర చెలువంబున్
దొరయు తమదొరకుమారుని
నరయంగా నేగుదెంచి రందఱు కాంతల్. 187

మ. తవులం జాఱిన కేశపాశ మొకచేతం దాల్చి డాకేల గ
త్యవరోధం బొనరించు కాలినగ లల్లల్లార్చుచు న్వచ్చి ముం
దవనీనాథకుమారు నొక్కసతి జాలాంతఃప్రవిష్టాస్యయై
యవలోకించెఁ గరంబు సాచి నిజకన్యాపాళికిం జూపుచున్. 188

సీ. ఒడిఁ గ్రోలుపసిబాలువిడిచి యొక్కడుగున
వచ్చి భూపతిఁ జూచె వసితయొకతె
మొలనూలి పైఁడిమువ్వలు జాఱుటైనఁజూ
డక వచ్చి విభుఁగాంచె సకియయొకతె
పతినియోగించు నానతియును జవదాఁటి
పోయిరాజుం గాంచెఁబొలఁతియొకతె

తననిశానై పథ్యమును మార్చుకొనుటయు
మఱచి తేనిం గాంచె మగువయొకతె

తే. గీ. యత్తగా రొక్కదిక్కున కరయఁబోవ
నామె కను నసుభయ మొద హత్తుకొనఁగఁ
దాను వేఱొక దెస కేగి ధారుణీంద్ర
తనయుఁ దతనయుఁ బొడఁగాంచెఁ దన్వియొకతె. 189

ఉ. గోడలు మేడలుం గుడులు గోపురములొ్మదలైన వెక్కి యా
చేడియలెల్ల రిట్లు తమచిత్తము తేలికమీఁద వ్రాలఁగాఁ
జూడఁ దొడంగి రయ్యనఘుఁ జూచిన జారిణి యైన నెమ్మదిం
బాడి దొరంగి విక్రియకుఁ బాలొనరింప దదేమహత్త్వమో! 190

క. పరిణయ మొనరింపం దగు
తరుణవయోధామ లైన తమ తనయల ముం
దఱ నిడుకొని కొందఱుచెలు
లరిగిరి భూపరకుమారుఁ డరయ నటంచున్. 191

మ. "కమనీయాకృతి యైన పుత్రకుని సౌఖ్యంబుల గమంగోఁగ న
య్యమకుం దివ్యధరాత్మజారముకు మాయాదేవికిం గొంతకా
లము దీర్ఘాయు వొసంగఁడాయెఁ దన కేలాభంబు? చండాలదై
వ" మటంచుం జరతీనికాయ మొకక్షేపం జూచె వాపోవుచున్. 192

క. జాలాంతర్గతలగు నా
లోలాక్షుల మొగము లెల్ల లోలభ్రమరీ
లీలాకరసరసీభవ
మాలాసౌందర్యమంజిమంబు వహించెన్. 193

వ. ఇట్లు సకలపౌరజనవిలోచనసనిపీయమానుం డగుచుఁ బుణ్యాంగనలు సేసలు చల్ల వృద్ధబ్రాహ్మణు లాశీర్వదింప నిరుదెస వందిమాగధులు కైవారంబులు చదువ పాదిజనసంచార్యమాణంబు లగు నుత్తమాశ్వంబులు ముందు నడువ రమణీయతరంబగు రాజమార్గంబు గడచి చనుచున్న సమయంబున.

సీ. అఱితి కాయలుగాయ నవనిదున్నుచుఁ గష్ట
పడుచుండు కాసరద్వయము నొకటఁ
జెన్నుగా దున్నిన చేలలో విత్తులు
వైచుచుండెడు కాఁపువాండ్ర నొకట
ఫలపుష్పవితతులఁ దులఁదూఁగి నేలకు
నంటు చున్నట్టి వృక్షాళి నొకట
వాని ఫలమ్ముల భక్షించి సుఖియించు
కీరాదికపతత్రివార మొకటఁ
తే. గీ. బట్టి చీమల మ్రింగెడు బల్లిని, మఱి
దాని మ్రింగెడు పాము, నద్దాని మ్రింగు
వైనతేయుని, జిన్నచేఁపలను మ్రింగు
పెద్దచేఁపలఁ దిను పక్షిబృంద మొకట. 195

తే. గీ. వానిఁ బట్టి భక్షించెడి శ్యేనములను
నొకట వేఱొక్కయెడ మనుష్యులనుదిను న
ఘోరులను జూచి యొక్కింతకుతుకమును మ
ఱింత సంతాపమును జెంది నృపసుతుండు. 196

చ. తన మనమందు నెన్నియొ విధంబుల నెంచుచుఁ "దండ్రి చూపఁ బం
చిన వివియొక్కొ! యిచ్చటి విశేషము" లం చొకయింత నిల్చి, లోఁ
గని "యొకఁ డన్యజీవమును గ్రాసముగాఁ గొను టెల్లభంగి హిం
సను నెగడించుచున్న దిది సైఁచితి నే దయగల్గువాఁడనే!" 197

వ. అని చింతించుచుఁ గొండొకనేల పోయి ముందు నడచినను నిట్టిమర్ణ
యంబులె కన్పట్టు నను భయంబునం గుందుచు జగం బంతయు హిం
సాప్రచారం బగుటకు విచారించుచుఁ దత్రత్యం బగు నొక్క నేరేడు
చెట్టుక్రిందఁ గూర్చుండి మిత్రులు పిలిచినను బలుకక ధ్యాననిశ్చలుం
డై యుండు నెడ. 198

ఉ. ఉప్పరవీధి నేగు రమరోత్తము లేగుచుఁ బుష్పకంబు దా
నెప్పటియట్ల నయ్యెడల నేగమి కించుక శంకనంది చూ

పప్పురుషాఢ్యుఁ డున్న ఘువియందు నిగుడ్చుచునున్న యంత్రితో
నిప్పలుకు ల్వినంబడియె నేరును జెప్పరయే దివంబునన్. 199

క. ఈతఁడు పరసంరక్షణ
కై తా జన్మంబు నెత్తినట్టిఁడు సుగుణా
న్వితుఁడు మహానుభావుఁడు
చేతమ్మునఁ గరుణఁ దక్కఁజేర్పఁ డితరమున్. 200

వ. అను నంబరవాణిపల్కు లాలించి వారలాసర్వార్థసిద్ధున కచ్చటి నుం
డియె నమస్కరించి తమయిచ్చంజనిరి; పిదప నితం డయ్యెడ సంజ
కాలంబుదనుకఁ గదల కుండుటయు. 201

క. జంబూవృక్షము రవికిర
ణంబులు పయి సోఁకకుండ నరనాథతనూ
జుం బేర్మిఁ గాచుచుండె; సు
ఖంబులు తమయంతఁ గల్గుఁగా జ్ఞానులకున్. 202

శా. ధ్యానైకాగ్రమనస్కుఁడై నృపసుతుండట్లుండఁగాఁ దక్కభృ
త్యానీకం బొకయింత లేప, దివి తానవ్వారితో నిట్లనున్
"వీనిన్ లేపఁగఁబోకుఁ డీతఁడు మహావేత్తృత్వధుర్యుండు తా
నే నేమం బగునంత లేచు" నన నాభృత్యు ల్భయభ్రాంతులై. 203

క. జననాథసుతుని లేపక
కనుఁగొనుచుండంగ, నతఁడు కమలాప్తుఁడు గ్రుం
కినతోడన ధ్యానసమా
ప్తిని జేసి పురంబునకును విచ్చేసె నొగిన్. 204

—• ఆశ్వాసాంతపద్యములు •—

క. ఆంధ్రికవిత్వాదర ! నీ
రంధ్రియశోవిజితరాజరజతధరశర
త్కంద్రసరసీభవభవపు
రంద్రీహీరేశ ! కృష్ణరాయమహీశా ! 205

మ. కవితాలోలమతీ! వికస్వరకృతీ! కళ్యాణభూభృత్పతీ!
యపిగీతప్రకృతీ! మనోహరగతీ! యాంధ్రాభిధక్ష్మాచల
త్పవిహస్తానుకృతీ! ధరావిబుధవిద్వన్నుత్యనిత్యోన్నతీ!
యవనీమండనకృష్ణరాయవసుధాధ్యక్షకృతిశ్రీపతీ! 206

మాలిని.

సరసతరవిహారా! సాధుచేతోబ్జసూరా!
కరవిలసితధీరా! కామమాంబాకుమారా!
తరుణవయడదారా! ధర్మ్యగోదాతటీరా
జ్యరమణధృతభారా! జాగరూకప్రచారా. 207

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరప్రణీతం బగు
బుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందుం
బ్రథమాశ్వాసము



శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బు ద్ధ చ రి త్రి ము

## ద్వి తీ యా శ్వా స ము

క. నిటలాక్షచరణ సేవా
ఘటానాదర ! సత్యవాక్యకల్పక ! గోవా
తటనికటరాజ్య ! శ్రీవేం
కటకృష్ణారాయ ! విబుధకవిజనగేయా ! 1

తే. గీ. అవధరింపు మనంతరం బవనిపాల
కాత్మజాతున కష్టాదశాబ్దముల వ
యస్సు నిండుటయును దండ్రి యయ్యవసర
మునకు ననుగుణ మైన రీతి నెదనెంచి. 2

తే. గీ. సీతునకు వేసవికిని వర్షించుకాల
మునకు నుచితంబులై సుఖంబును ఘటించు
శుభ, సురమ, రామ యను పేర్ల సొంపునింపు
మాడువులఁ గట్టఁబనిచె నాత్మజునికొఱకు. 3

శా. ఆసౌధమ్ములచుట్టుఁ దోఁటలును వార్యంత్రంబులుం గాల్వలు
న్వాసార్హమ్ములు చప్పరమ్ములును గూపమ్ము ల్తటాకమ్ము లెం
తేసొ రొప్పఁగఁ గూర్పఁజేసి మఱి యెన్నేలోఁగిళు ల్గట్టఁగాఁ
జేసెం దత్ప్రితిసౌధరాజమునఁ బల్చిత్రావళు ల్చొప్పడన్. 4

తే. గీ. గడియ కొకరీతిఁ గ్రీడలఁ గైకొనంగఁ
దగుగతిని సౌధముల నిట్లుతండ్రి కట్టఁ
జేసి కొమరుని నందు నివాసమునకుఁ
బనుచుటయు నాతఁ డా యీ భవనములందు. 5

ఉ. వాసము సల్పుచు న్విమలవాఃకలితంబు సరోవరంబు మ
త్స్యసరణిం గఱంచు నటు లెంతయు మానసము న్విచారము
ల్గాసిలఁజేయ నెయ్యెడ వికాసము దక్కినవాఁడు వోలెఁ దా
నేసుఖముం గ్రహింపమికి హెచ్చినదుఃఖమున న్విభుం డొగిన్. 6

వ. రాజకార్యవిశారదులగు మంత్రులం బిలిచి కొమరుని విషయపరాఙ్ముఖ
త్వంబు వారల కెఱింగించి వీనికిం దగిన కఱపలు గఱపఁ గఱుపు
నుపాయంబును నుడువుఁడని మఱియు నిట్లనియె. 7

గీ. స్వప్నఫలము వచించు నప్పట్టునందుఁ
బండితులు తెండురీతులఁబలికి రందు
మత్సుతుమనంబు తెండవమార్గమంద
నడచుచున్న దిఁకేమి యొనర్చువాఁడ. 8

వ కావున రాజ్యపాలనాదివ్యాపారంబునం దీతని మనంబు మరగునట్లు
చేయుఁ డనిన వృద్ధమంత్రి యొకం డిట్లనియె. 9

మ. మదిరాక్షీపరిరంభము ల్మఱియు నమ్మానిన్యపాంగంబులున్
హృదయంబు ల్గరఁగించు నేరికిని; మత్తేభేంద్రకుంభ స్తను
ల్గదియన్ ధ్యానము జ్ఞానము న్నిలుచునే? కాంతాశిరోజంబున
న్బదము ల్గట్టఁగవచ్చు సంకెలలకుం బద్ధుండు గాఁడేనియున్. 10

శా. హేలావత్యధరామృతంపుఁజవి యింతే నీతని న్సోఁక వే
త్రేలా యయ్యది మిమ్ము మ మ్మితర మెవ్వేనిన్ స్మృతిం జొన్పనీ
కాలావణ్యరసామృతమ్మున నిమగ్నాత్మ్ముం బొనర్చు న్నృపా!
హాలాపానము గాదె స్త్రీసుఖము వేఱం దెందుఁ గన్పట్టునే. 11

ఉ. మాయలమాటలు న్పగలు మంచితనమ్ములు టక్కులు న్వ్రాయ
ల్పాయక యిల్లు గట్టుకొని పాపముఁ బుణ్య మెఱుంగనీక నా
పాయములై సతీమణుల బంటుగఁ బూరుషుఁ జేయుఁ గావునన్
వేయును నేల పుత్రునకుఁ బెండ్లియొనర్పుము సత్వరంబుగన్. 12

వ. అని వెండియు.

చ. ఒకనికి నింపుగానిఁతి యొక్కని కన్నుల రంభగ త్తె వే
ఱొకనికి రంభయే మఱియు నొక్కనికిం గొఱగాఁ యుండు దీ
నికి మదియే ప్రధాన; మదినీ కొకఁ, దన్యుల కొక్కఁ, డింత యే
టికి మన మెంత యేరిచి ఘటించిన నయ్యది వేఱు తీరగున్. 14

క. అది గాన నితని మన మే
మది రేక్షణయందుఁ దవిలి మరగునొ మన నె
మ్మదికిం దెలియదు; దానికి
నిది యొక్కయుపాయ మడియు నెఱఁగింతు నృపా ! 15

క. అగుఁగాదె శాక్యులకుఁ బం
డుగు, మన మానాఁడు తగు పడుచుఁగన్నెల నొ
యగపుగనుల రప్పింపం
దగు బహుమానముల నొసఁగెద మనునెపమునన్. 16

మ. ధనమం దిచ్చుటగాని యుత్సవపు సందర్భమ్ము వీక్షించు కో
ర్కినిగానీ నృపునాజ్ఞ యేగతి నివారింపంగ నౌ నంచుఁ ద
ప్పని యిక్కట్టునఁ గాని వత్తురు కనత్పద్మేక్షణల్; వారచ
క్యనిరూఢిం దగు దాని నం దొకసతింగామించు నీపుత్రుఁడుం. 17

వ. ఇట్లు కామించిన నక్కన్యాజనకుండునుదనకొమరిత నీకుమారున కిచ్చి
పరిణయంబొనర్చు; నిట్టిదంపతుల దాంపత్యంబున నెవ్వెండును నెడ
గలుగ దని మఱియు నిట్లనియె. 18

క. చతురబ్ధిపరీతంబగు
క్షితి యెల్లను వేలు నృపతిశేఖరునకు నీ
సుతునకు సుత నీ నెంచని
మతిహీనులు గలరె శాక్యమనుజాధీశా ! 19

క. అన, రా జీకొని చాటిం
చినఁ గన్నెలు మిగులఁ జెమ్మ చెన్నారెడి భా
గ్యనిధులు తన్నగరంబున
కును వచ్చిరి వేలకొలఁది కుతుకం బలరన్. 20

వ. పదపడి శుద్ధోదనుండును దత్కన్యాజనంబునకు బహుమతు లిచ్చుచుఁ దగిన కన్యను వరియింపు మనియుఁ గన్యాస్వయంవరంబునకై యిది యొక్కయుపాయంబు ఘటించితి ననియుఁ జెప్పి కుమారుందోడ్కొని వచ్చుటకై యతని కాబాల్యమిత్త్రుంబగు పురోహితనందను బనిచిన వాఁడును సంసారంబు కష్టబహుళంబనియు యౌవనంబు జరా దూషితం బనియు మృత్యువనివార్యంబనియు వ్యాధు లనుభవనీయంబు లనియు విచారించుచుఁ బరిణయేచ్ఛం దిగఁద్రావి సన్యసనోన్ముఖంబగు మనంబున నున్మత్తునిపగిది జకునికేతి నున్నసరార్వర్థసిద్ధు నొద్దకుంజని.

క. హితమార్గము గఱపుటయు న
హితమార్గమునందు నడువనీకుంటయు దు
ష్స్థితి గతియును దుర్వ్యసనా
వృతియును మరలించుటయు సుహృల్లక్షణముల్. 22

వ. కావున నీమోదం గలుగుచనవునం జేసి నీకొక విన్నపంబు విన్నవిం పఁగ వచ్చితి భవదీయపరిణయంబునకై యొక నెపంబున సకలదేశ రాజకన్యకలఁ బిలిపించి యొక పండుగుఁ గావింపనుండి వారికిం దగిన బహుమతులు నీచే నిప్పింపవలయు నని నిన్ను రమ్మనియెఁగావున నీతండ్రిమాట వృథనేయక వచ్చి యక్కన్నియలయందు భవదీయమ నోగతంబునకుం దగినదాని నొక్కతెం బరిణయంబు గమ్మనిన నతండు సవినయమ్ముగా నప్పురోహితసూతి కిట్లనియె. 23

క. పరిణయ మొల్లక నే న
స్థిరమగు సంసార మనెడు తెరువునఁ బడ కొం
తరమగు తత్త్వజ్ఞానాం
తరమునఁ జరియింతు నన నతం డి ట్లనియెన్. 24

క. తరుణవయస్కుండవు సుం
దరుఁడవు నృపపుత్త్రకుఁడవు తగువాఁడవు ధీ
వరుఁడవు వంశము నెగడఁగ
బరిణయ మొనరించుకొనుట పాడి కుమారా.

క. కామము పురుషార్థంబుల
లో మహనీయంబు దానిలోపల గృహిణిం
జేమన్నింతురు గావున
నామాటలు వినుమ, రాజనయమ్ముం గనుమా. 26

క. పరతత్త్వాదరమగు మదిఁ
దిరమయ్యును దొంటిమునులు ధీమంతులు సు
స్థిరమని యెంతెఁగియు భార్యా
పరిగ్రహము మానిరే, తపంబులు చెడెనే? 27

చ. కొడుకులఁ గొమ్మలం బడసి కొండొకకాలము ధాత్రియేలి చె
ల్వడరఁగఁ జేసి మీకుల మలంకృతముం బొనరించి తండ్రికిం
గడుముద మేదఁజేయవలెఁగాని సరేంద్రులు చేయరాని యీ
వెడఁగుఁదనంబుఁ బూనఁదగవే, భగవంతుఁడు నైన మెచ్చునే? 28

చ. అదియునుగాక కామపురుషార్థము దెచ్చు మహాప్రపంచములం
జదువులు సంధ్యలు న్నిలువఁజాలవు; రేఁబవ లెల్లకేఁడులు
న్నిదురయు నారువంటికము నేనియు మానిన వారికైనను
జైవరక విల్చునే తపము నిష్ఠలు గిష్ఠలు శీలముండునే? 29

క. ఒకవాఁడు విరాగము పా
యకవర్తించినను దత్పదాంతరమునసే
సకల సుగుణంబులకు మా
రక మసు మది; దాని సమ్మరాదుకుమారా! 30

సీ. జడదారిసకితోడ జతగూడె వేవేలు
వెలఁదులు గలవాఁడు వేల్పు తేఁడు
జాబిల్లిపడఁతితో సరసంబుఁ గావించెఁ
దపసి లోపాముద్రధర్మభర్త
దైవతగురువి కాంతాలలామముతోడఁ
గవగూడె శిష్యుఁడై కలువతేఁడు

ఔతథ్యఋషిపత్నియగు మరుత్పుత్రితో
సావాస మొనరించె దేవగురుఁడు

తే. గీ. దాశపుత్రికతోడఁ బరాశరుండు
పట్టపపలు నదీతటీభాగమందుఁ
దగులుగావించె ; నిన్ని వింతలును దలఁపఁ
గామమును గెల్చువారు లోకమునఁగలరె ! 31

వ. మఱియు మునివరిష్ఠుండగు వసిష్ఠుం డక్షమాలయను మాతంగకన్యక యందుఁ గపింజలాదుం డను కుమారుం గనియె. యయాతియను రాజర్షి ముదుసలియైన పిదపను విశ్వాచి యను నచ్చరమచ్చెకంటితోఁ జైత్రరథంబునం గ్రీడించెఁ; గౌరవుండగు పాండురాజు మత్యువు నైనఁ దలంపక మాద్రీసాంగత్యంబున కొడంబడియెఁ; జిరకాలోపార్జి తంబగు తపంబు భగ్నం బగుననియైనఁ దలంపక విశ్వామిత్రుండు మేనకామధురాధరంబు చవిచూచెఁ ; గరాలజనకుం డనువాఁ డొక విప్రకన్య నపహరించి చావునకైన నంగీకరించెఁ గాని దాని వదలుట కొడఁ బడఁడయ్యె ; ని ట్లనేకు లనేక ప్రకారంబులం గామపురుషార్థం బునకు లోఁబడిన వారుకలరు ; వేయేల, యనుభూతకాంతాసంగమ సుఖాతిశయు లగువారి కేనియు నిట్టి ప్రమాదంబులు గలుగుచుండ ననమభూతవిషయోపభోగులగు నీవంటి తరుణ విరాగుల కది యడుగ వలయునే ! యనుమిత్రుని జూచి పరశ్శతజన్మసంసిద్ధార్థుం డగు సర్వార్థసిద్ధుం డిట్లనియె. 32

తే. గీ. మైత్రికిం దగుగతి నయమధుర మైన
సదుపదేశంబు నాకయి సలిపి తీపు
తప్పులన్నియు సైరించి దయదలంచి
మదికి నచ్చించి నాచేయుమనవి వినుము. 33

తే. గీ. ఏను విషయసుఖంబుల నెఱుఁగఁగాని
యెఱుఁగుదు విషయసుఖముల నెఱుఁగువారి

జగ మనిత్య మటన్న సంశయము కతన
దత్సుఖంబుల నామది తగుల దనఘ. 34

చ. ముదిమియుఁ జావు రోగమను మూఁడును బ్రాణులకుండవేని యీ
ముదితల కెల్ల జవ్వనము మూందును నీగతి నుండునేనిఁ గ
ష్టదశలు మాటిమాటికిని సంసరణంబున మూఁడవేని నా
మదికిని నచ్చవే విషయమార్గపు సౌఖ్యములెల్ల నెచ్చెలీ! 35

క. నీ నుడివినవా రెట్టిరు
కానీ కామాంధులనియ గణుతింపఁదనిసెదే
మానసము విషయమగ్నం
బైన మహత్త్వంబు నిలుచునా? చెలికాఁడా! 36

తే. గీ. పద్మదళమున జలముండుపగిదిఁ గూట
మంటి యంటని విధమున నుంట మేలు
గా గణింతురు గాని యాకామినులను
మోసపుచ్చుటకాదె, యామోడు చెలిమి? 37

క. కావున ముదిమియుఁ దెవులుం
జావును గలయట్టి పాడుసంసారములో
నావంటివానిఁ ద్రోయుట
కై విజ్ఞానంపుఁదెరువుఁ గడతేర్పకుమీ. 38

వ. అనుచు ననేకప్రకారంబుల సంసారనికారం బొనరించు రహూపం గని
పురోహితనందనుండు తిరోహితతదుపదేశుండై మరల నిట్లనియె. 39

చ. జనకుని కోరికన్ వృథగఁజల్పకు మయ్య! వివాహ మీవు మా
నినను భవన్మిషంబున ననేకనరేంద్రకుమారికాచయం
బు నగరి కేగుదేరఁగఁ బ్రభుండు నియోగము సేసెఁ గావున
న్ఘని, తగవారికిం బసదనంబు లొసంగఁగదయ్య మిత్రమా! 40

క. కొడుకులు కోడును లటించుం
గడుకొను పెనువంతఁ దపము గావించి తుదిం

బడసిన కొడుకులు తండ్రుల
నడలంగాఁజేయు టుచితమగునె కుమారా. 41

ఉ. కావు విరాగివై తిపనియే మదిఁ గుందుచు నన్నపానము
ల్పోవిడియున్న నీపిత కపూర్వములైన భవత్ప్రసంగము
ల్నే వినిపింతునేని నళనిజ్వలితంబగు కొండమాడ్కిఁ జిం
తాపళచిత్తుఁడై మడియుటబ్బురమా పృథివీంద్రపుత్రకా ! 42

క. కావున నే నుడివినగతి
గా వచ్చి నరేంద్రకన్యకలకు బహుమతు
ల్గావింపుము నావిన్నప
మూపలకుం ద్రోయవలవదయ్య. నరేంద్రా ! 43

వ. అనుచు ననేకైతిహాసికగాథలు బోధించియు గారవించియు నెట్టకేల
కురరీకారంబు గావించి నృపకుమారుం దోడ్కొనివచ్చి యేకతంపుం
గొల్వుకూటంబునం దగిన పరివారంబుతో ధనకనకరత్నచీనిచీనాంబర
శ్రేణి యిరుదెసలంగల యొక్క పటపుగద్దియపై వసియింపంజేసె నంత.

ఉ. చేరెఁడు కన్నులుం దళుకుఁజెక్కులుఁ గుల్కు పిసాళిగుబ్బ ల
ట్టారిని నేరుమోము కనదంఘ్రులు వింతగుచాయ మీన శృం
గారరసంపు దీవియనఁగా నొక కన్నియ వచ్చెఁ దత్సభా
స్తారులు తేటిచూడఁగ మితస్థితిభూషణభూషితాంగియై. 45

మ. చలువంజేసిన మంచుకన్నను గడుస్స్వచ్ఛంపు మేల్మొస్గుఁజెం
గులు పాదమ్ముల జీరువాఱ నును నిగ్గుల్దేఱు నెమ్మోము వ
న్నెలు మైచిన్నెలు శారదాంబుదతతి న్నిల్లీనమై యొప్పు వె
న్నెలనాఁ గొండొక దోఁప నొక్కచెలి తన్నే చూడఁజొచ్చె నృపుస్.

చ. గరగరలాడు గాగర ధగద్ధగితప్రభ లీన మేల్జరీ
హారు పలరారు పైక యొకయందముఁ జూపఁగ సన్నమైన బం
గరుపనిపైఁట యొక్క డగుకాంతి నెసంగ మణీవిభూషణో
త్కరమయమై సభాస్థలికిఁ గన్నియ యొక్కతె వచ్చె నచ్చుగన్. 47

మ. 'అధరం బొక్కటిసేయు నెంతరయినన్ హా! వేణి సా! రద్దిరే
మధురంబౌ గమనంబు ! మేనిపసదు స్మారతౌనె బంగారు? మే
ల్కుధరంబు ల్గదలించు గబ్బ' లని కోర్కుల్ మిన్ను ముట్టంగఁ ద
న్ను ధరాపాలసభాసదు ల్గమినిఁ గన్గో నొర్తు వచ్చెన్ వెసన్. 48

సీ. కడియంబు లందెలుగజ్జెగొల్సులు గూడి
యడు గడుగున గల్లురంచు మ్రోయ
జీరాడు మేల్జరీవెలఁగుఁ గుచ్చెళ్ళ చ
క్కఁదనంబు మిగాళ్ళకడల రాయ
మడఁచి యొడ్డాణంబుమధ్యఁ జేర్చినపైఁట
యంచు తెమ్మెరలు దూఁగాడఁ జేయఁ
గబరీభరంబుపైఁ గడయికొల్పిన పూవు
లవరిఁ దావులను దుమ్మెదలు రోయ

తే. గీ. విడెముతావియు రదనచ్ఛవియును గలసి
యోష్ఠకాంతికిఁ గొంత చేయూఁత యొసఁగఁ
జూపఱెల్లరుసుం దనసొగసె చూడఁ
గరిగమన యొర్తు వచ్చె నక్కజముతోడ. 49

తే. గీ. మోహమున నిట్లు రాసుతు ముంతు నన్న
పగిది నొక బొడ్డుమల్లెఁ గబరి ధరించి
చెలువు మించెడు నల్లని చీరఁ గట్టి
తెలుప సారసగమన యేతెంచె నొకతె. 50

ఉ. నున్నగఁ జెక్కుటద్దముల సూల్కొన దువ్వినరాలపక్షము
ల్సన్నని పంకగా నుదుటఁ జందన మద్దిన చంద్రరేఖయుం
జెన్నువహింప ముత్యములచేరు శిరంబునఁ దాల్చి పేడుకం
గన్నె యొకర్తు వచ్చెఁ గనకప్రతిభ మేనఁ దురంగలింపఁగన్. 51

క. కుస్తీ చేసినగతి నతి
శక్తమ్మగు మేనిపస పసందుగఁ బైకిం

గస్తూరితావి నింప వ
యస్సున్నత యగు నొక్కచందిరానన వచ్చెన్. 52

మ. నెనరుం జూపులు హారమధ్యమఘవన్నీలాశ్మరశ్మిచ్ఛటా
ఘనభాస్వజ్జనితాపగం గలసి వేడ్కం బైటపైఁ బర్వ లీ
లనుదాని న్వపరించుకోఁ గదలు కేల్వాయుభ్రమత్తత్రిజా
తనలభ్రాంతి యొనర్ప నొక్కతిత యంత న్వచ్చె బల్మెచ్చుగన్. 53

క. కులుకుచుఁ జూపఱ దృష్టికిఁ
దలఁకుచు నృపసుతుని గాంచితద్దయుఁ దనలో
నులుకుచు నొకకన్నియ వ
న్నెలకుప్ప యనంగ వచ్చినిలిచెన్ ప్రోలన్. 54

వ. ఇట్లు స్వవర్ణోచితభూషణమ్ములు ధరియించి తత్తద్దేశనరేంద్రకన్యకలు సభామంటపమ్ము దరియంజొచ్చుటయు సంతతమున్న శుద్ధోదనుండు వారలకు బహుమానంబులొసంగఁ గుమారు నియమించెఁ గావున. 55

శా. ఆ సిద్ధార్థుఁడు తండ్రియానతిని శాంతాకార మేపార మే
లౌ సింహాసనమందు సౌరలర నధ్యాసీనుఁడై, వచ్చు క
న్యాసంఘంబులవంకఁ గన్గొనకయే యద్దాని నొక్కొక్కతెం
దా సత్కారము చేయుఁ జీరలును రత్నా ల్మన్నుగా నిచ్చుచున్. 56

ఉ. అతనిదాపుద్ధ కేగి వినయమ్మున భీతకురంగులో యనఁ
గాతరరీతి సత్కృతులు గైకొని వెన్కకు నేగు కన్నెలం
జేతము పల్లవింప నృపు చెంత వసించు జను ల్మతింత్రు గా
నీ తనచిత్తమందయిన నించుక రాసుతుఁ డెంచఁ డొక్కతెన్. 57

వ. ఇట్లు తండోప తండంబులుగా వచ్చి కన్నియలు బహుమానమ్ములు గైకొనునెడ. 58

సీ. భ్రమరసమూహంబు పక్కగట్టినరీతి
జడ మడమల దాఁక సాగియాడఁ
బద్మేషుచాపంబుపై మణుల్దాఁపిన
సౌరున మేన భూషలు చెలంగ

నిసుము తిన్నియలపై నివము వొల్చినభంగిఁ
గటిసీమఁ బావడ కళలనీనఁ
జకచిమ్ములకు నిత్యసంగతికై యుపా
య మొనర్చె నన దైకయుట నెసంగ
తే. గీ. మోమునఁ బతివ్రతాత్వంబు మొలక లెత్త
సఖ్యులకు మాతృభావంబు చొరకళింప
ధ్యాననిశ్చలుఁడైన యతని యెదుటకు
వచ్చి నిల్చె యశోధరావారిజాక్షి. 59

ఉ. కన్నియ నంచయాన నవకంజవిలోచనఁ గోమలాంగి న
త్యున్నతపీనవర్తులకుచోజ్జ్వలఁ జంపకగంధి ప్రీడసం
ఛన్నముఖి న్యశోధర లసన్మృదులాధరఁ గాంచె రాసుతుం ;
డెన్నఁగరాదుగా మఱియు నేరికి నేలికి ధాత వ్రాయునో ! 60

వ. ఇట్లు పురాకృతసంస్కారవళంబునంజేసి యక్కన్నియయందు బద్ధాను
రాగుండగు నయ్యెడ. 61

చ. వెనుకొనుటబ్జ లో నడఁచి, భీతి యొకింతయుఁ తేర, రాజసం
దనునిమనం బెఱింగిన విఠంబున, నందఱకంటె నెక్కుడౌ
చన వెసఁగంగఁ 'గానుక లొసంగినఁ గై కొని యేగుదాన' నాఁ
గ, నతఁ డొకింత లోన నగి కానుక లయ్యెడ లేకయుండుటన్. 62

మ. 'వనజాతేక్షణ ! కానుక ల్మగిసె నీవామాఱులం దేరికీ
యని దీకానుక చూచితే' యనుచు నయ్యబ్జాక్షితో నొక్కభం
గిని మాటాడుచు నెల్లరుం గనుఁగొనం గ్రీవాగతంబైన చ
క్కని మేల్పచ్చలహార మచ్చెలివలగ్నంబందుఁ జుట్టె న్వెసన్. 63

ఉ. పచ్చలహారమిట్లు నరపాలసుతుం డవలగ్నసీమపై
నచ్చపలాక్షిం కిం పొదవునట్టులు చుట్టిన యంత నామెరున్
హెచ్చె నృపాలసూతిపయి నింతనరాని మనోరథంబు ; పే
రచ్చెరువందె రందఱు నరాధిపుఁడు న్వివి సంతసింపఁగన్. 64

వ. అబాల్యవిజృంభమాణవిరాగచేతస్కుండగు సర్వార్థసిద్ధుం డక్కన్నియ
యందు బద్ధానురాగుం డగుటకుఁ గతం బెట్టిదని. 65

మ. యమునాతీరమునందు నొక్కెడ సునందాభిఖ్య చెన్నారు నొ
క్కమహాశక్తి వసించు నాదరిని నక్కాసం గనద్దేవదా
రుమహీజంబులనీడఁ గ్రీడలు పొనర్చు న్వన్యకన్యాజనం
బమలాత్మం బొక పేఁటకానికొడు కత్యంతంబుఁ దోడై తగన్. 66

ఉ. వాఁ డొకనాఁడు మేలు గలవస్తువుల న్మఱికొన్ని దెచ్చి త
త్క్రీడల నారితేఱిన సతీతతికిన్ బహుమాన మిచ్చుచున్
వేడుక నందు నొక్కయరవిందదళేక్షణ కిచ్చి డెందమ
చ్చేడియఁ బెండ్లిచేసికొని చెల్మి యొసంగఁగ నుండి క్రమ్మఱన్. 67

వ. కొండొక కాలంబు సుఖంబు లనుభవించి తత్సహితమ్ముగఁ గాలమ్మ
నటలోఁబడి కేదారంబున నప్పు డప్పుడెఱుంగక పడిన బీజంబులును
వానకాలంబున మొలచిన వగిదిఁ బూర్వజన్మార్జిత సుఖదుఃఖంబు
లుత్తరజన్మంబున ననుస్యూతంబు లగుటఁ దదనుభవంబునకై సర్వార్థ
సిద్ధుం డయ్యెఁ; దత్సతియుఁ బురాసంభృతాత్యంతసంబంధంబున
నిట్లు జనియించె; నియ్యది యియ్యిరువుర యన్యోన్యానురాగంబున
కుం గతంబు ఇది యిట్లుండ. 68

శా. ఆసిద్ధార్థునకు న్యశోధరకు సౌహార్దంబు నన్యోన్య మెం
తే సిద్ధించుట గాంచి కొందఱది పృథ్వీశానుతోఁ దెల్ప 'నే
మీ సిద్ధార్థుఁడు సుప్రబుద్ధసుతపై మేలుంచెనే! యత్న మి
ష్టే సాఫల్యము చెందె సంతసము వేఱెం దింతయుం గల్గునే. 69

క. శ్రమ మెంతచేసినను సా
ధ్యముగాని పతత్రి పట్టఁదగు వలతానై
యమరిన దిఁకేమి?' యని మో
దమునన్ శుద్ధోదనుండు తద్దయు మునిఁగెన్. 70

వ. పిదప నయ్యశోధరతండ్రియగు సుప్రబుద్ధుండు విచిత్రవృత్తాం
తుండై సార్వభౌముఁ డగు శుద్ధోదనుని యొద్ద కిట్లు వార్తనంపించె.

క. మన శాక్యులలో విలు వి
ద్యను దక్కిన విద్యలను సమధికపరిజ్ఞా
దనరెడు వానికి మత్క
న్య నొసంగెద దేవదత్తుఁ డట్టిఁ డగుఁ గదా. 72

క. విలువిద్య నర్జునునితోఁ
దులఁదూఁగెడు సామునం దతులుఁ డశ్వములన్
మెలఁకువగ నెక్కుఁ బెఱభూ
తలనాథులసుతులు దేవదత్తున కెనయే ! 73

క. కాన నతనికిం గన్యక
నీనెంచెదఁగాని యన్యమెఱుఁగక నిత్య
ధ్యానాసక్తుండగు నీ
సూనునకు నొసంగనొల్లఁజుమ్ము మహాత్మా. 74

క. అనువార్తను విని శుద్ధో
దనుఁ డేమియుఁ జెప్పలే కెదంగడుఁ జింతం
గొనుటయు సిద్ధార్థుడు తన
జనకుని కిట్లనియె ధైర్యసంపన్నుండై. 75

క. జనకా ! మత్ప్రియవస్తువు
గ నున్న యిచ్చాన యొరులకడ కరుగునె ? నా
కును నేర్పుగలదు విద్యల
మనమున ననుమాన మింక మానుము తండ్రీ. 76

తే. గీ. అనుడు నరపతి సంతోషమందెఁ; బిదప
సుప్రబుద్ధుఁడు విద్యల తూరుఁడైన
వాని కిచ్చెద మత్సుత వరగుణాఢ్య
ననుచుఁ జాటించె నెల్లెడ ఘనులు మెచ్చ. 77

ఉ. అందఱు రాజపుత్రులు స్వయంవరమంటపమందుఁ జేరి రా
ణ్ణందని నిందు విద్యలఁ గనంబడఁజేసి పరింతు మంచు నా

సంచముఁ జెందుచుండ జననాథుఁడు యంత్రిమొకండు పన్ని 'దీ
నిం దెగఁగొట్టి మత్సుత ననింద్యగుణ స్గ్రహింపఁగావలెన్.' 78

చ. అనపుడు రాజపుత్రులు తదర్థమున న్రచితపర్రియత్ను ల
య్యును నటుచేయలేమిఁ దలలొయ్యన వంచిరి; యాతఁడంత నా
నన మలరంగ సింహహనునామకచాపముఁ గేలఁ బూని య
ల్లి నటికె యంత్రముం దనదులావు నృపాలకు లెల్ల మెచ్చఁగన్. 79

వ. పదపడి సుప్రిబుద్ధుం 'డొకక్రమాని నొకక్రేటునఁగ త్తిచే నఱుకవలయు'
ననుడు నరేంద్రి లందఱును యథాపూర్వు లైరి, కొందఱు నఱికి రంత.

తే. గీ. అసికరంబునఁ బూని సిద్ధార్థు డితర
కృత్తమౌ పాదపముకన్న నెక్కుడైన
లావు గల్గిన యొకచెట్టు నోవనేయ
నది తెగియుఁ దెగనిపగిది నట్టెయుండె. 81

చ. అది కని యెల్లవారుఁ 'దెగ దయ్యది యీతనిచేత, నెక్కుడై
పొదలెడి సామునేర్పుగల పూరుషుఁ డిప్పని సేయనేర్చు' నం
చెద ముదమొందుచు న్మిగుల హేళనము ల్పచరింప దేవత
ల్పదపడి తెల్పుచుం గుసుమవర్షము పైఁ గురిపించి ర త్తఱిన్. 82

వ. అంత ఖురళియందు నితం దత్యధికుం డని కృతనిశ్చయులై యశ్వా
రోహకత్వంబుఁ బరీక్షింపం దలంచినంత సిద్ధార్థుండు. 83

తే. గీ. కంటకాభిఖ్య నొప్పు నొక్క హరి నెక్కి
యెక్కుడగు గర్వమునఁ గడు నుక్కుమిగులఁ
దక్కుఁగల రాజతనయుల తక్కులడఁచి
జయము గైకొన వార లీర్ష్యకుఁ గడంగి. 84

వ. ఈగుఱ్ఱం బీతనిది కావున నీపందెము మేమొప్ప మని వివదించుచు: 85

తే. గీ. మిగుల నవలక్షణంబుల మేటియైన
దాని నొకవాజిఁ దెచ్చి, యద్దాని నెక్కి
తనపటిమ చూపెనేని యొప్పనగు ననుడు
నట్లుచేయఁగ సిద్ధార్థుఁ డనుమతించె. 86

వ. ఇట్లంగీకరించి యతండద్దాని నెక్కుటకు మున్న దాని ఘనవిచేష్టలు పరీక్షించుటకై యర్జునుండను వాఁ డయ్యశ్వంబు నెక్కుటయు. 87

క. అది యెయ్యెడ నిలువక దు
ర్మదమున నవ్వానిఁ గఱచి మహిఁ బడవైచెన్
గదిసి యొకకొంద ఱయ్యా
పదఁ దొలఁగించుటయుఁ గొంతపరమై తోఁచెన్. 88

మ. అది సిద్ధార్థుఁడు చూచియు న్భయము లో నాపంతయున్లేక దా
నిఁ దగందువ్వుచుఁ గళ్లెమైన నిడకే నేర్పొప్పఁగా నెక్కివా
ర్వదళం బందెముచెల్ల గెల్చెఁ; మిగుల న్వారంచలు న్సన్నుతు
ల్పొదలింపంగను సుప్రబుద్ధుఁడు మహామోదంబుమైఁ బొంగఁగన్. 89

చ. 'మతి మును గోరునట్టి ధృతిమంతుఁడె నాథుఁడుగా లభించె; నే
నతిసుకృతాత్మ' నంచు ముదమందుచు వేగ మధూకపుష్పజా
తమగు మాల కేలఁగొని కాముని కింబయి మెచ్చువచ్చు రా
సుతు గళమందు వైచెను యశోధర యాదర మేదురంబుగన్. 90

తే. గీ. అమరు లతిమోదమునఁ గుసుమములు గురిసి
రచ్చరలు నాటపాటల మెచ్చుగొలిపి
రనిలము సుఖప్రచారమై యతిశయిల్లె
నలయశోధర సిద్ధార్థు ననుమతింప. 91

వ. ఇట్లు యశోధర సర్వార్థసిద్ధుని వరించిన పిదప జీలుఁగు బెండులు రెండు దెచ్చి పాలలోఁ బడవైచి యవి తమంతటఁ దాము కలసికొనుటనుఁ జూచి సుసంగతంబులగునంతఁ బెద్దలగు వార లన్వధూవరులం గూర్చి 'మీర లివ్విధమున నెడతెగని చెలిమి గలిగి యలరుదురు గావుత' మని యాశీర్వచించి పరిణయం బొనర్చిరి. ఈక్షీరపరీక్షణంబు శాక్యుల వివాహంబునకుం బ్రథమలక్షణం; బిట్లు సలక్షణంబుగా వివాహంబు గావుటయు శుద్ధోదనుండు. 92

సీ. తేఱిచూచినమాత్రిఁ జేరిన మంచునఁ
దగు మలల్ చూపట్టఁదగినచోటఁ

గృత్రిమవృక్షసంకీర్ణమౌ క్రీడాకు
ధరము దాదాపునఁ బరఁగుచోట
నుత్కృష్టమగు గంగ కుపనదియైన రో
హిణి యెడనెడఁ బ్రవహించుచోట
నేకాలము సుమమ్ములెన్నేనిఁ బుష్పించు
పొదరిండ్లు నల్దెసఁ బొదలుచోటఁ

తే. గీ. పండి తమయంత రాలిన ఫలములు గల
వృక్షజాతు లెల్లెడలను వెలయుచోటఁ
పంకజాదిసుమమ్ములఁ బరిఢవిల్లు
నమలములగు తటాకమ్ము లమరుచోట. 93

వ. కన్నులపండువగు గతి నొక్క యారామంబుఁ గల్పింపంజేసి. 94

శా. ఆరామమ్మునఁ గేళికాభవన మాహర్మ్యంపుఁ గుడ్యంబునం
దారన్ వ్రాసిన బంధచిత్రములు, నాయాచోట్ల మారాగమ
శ్రీ రాణింపఁగఁ జేయు కీరముఖపక్షిశ్రేష్ఠముల్, నృత్తగీ
తాద్యూఢిం గడు నాఱితేఱఁదగు వేశ్యల్గల్గ సంధింపుచున్. 95

క. అందుం గొడుకుం గోడలిఁ
బొందుగ వసియింపఁ బనిచె; ముసలితనము, నా
నందాభావము, రోగ మ
నందగు నిమ్మాట లటఁజనక యుండంగన్. 96

క. పదిలపఱచి తగిన భటస
ముదయముఁ గాపుండఁ జేసి మొగి సుతుఁ డెందేఁ
గదలకయుండఁగఁ గారా
సదనం బేర్పఱచెఁ గేళిసదన మను మిషన్. 97

సీ. లలనయొనర్చు విలాసమ్ములట్టిటుఁ
జననీని పంకెల లనఁగరాదె?
కను గానవీక పైకొను ననురాగంబు
గాఢాంధకారంబు గావు టరుదె?

పంజరస్థములైన పక్షులు తనసాటి
బందుల దుస్థితిఁ బడయు టరుదె ?
చంద్రానిలాంగజుల్ జముదూతలంబోని
యదయులౌ బంట్రౌతులనుట తప్పె ?
తే. గీ. ప్రణయకోపపరాఙ్ముఖిఁ బడఁతిఁ దేర్పఁ
బడెడి పలుపాటు లచ్చటి పనులకంటె
నల్పములె ? యెన్నివిధములనైనఁ జూడ
బంధనాగారతుల్యంబు పడుకటిల్లు. 98

క. ఆకేళీసదనమునకుఁ
బ్రాకారము లొక్కమూఁడు పచరించి యయ
శ్శ్రీకకవాటదృషద్వా
రాకలితమ్ములుగఁ జేయున ట్లొనరించెన్. 99

వ. మఱియు నవలివారీపలకు, నీవలివా రవలకుం జనకుండఁ గాపాడుఁ డని సేవకులకు నియమించి త్రిలోకసుందరులగు పరశ్శతయువతీనుల నెప్పగిదినైనఁ గుమారు మనంబు లోఁగొనుఁడని నియోగించె; నిట్లు పిత్రుపదిష్టుండై సర్వార్థసిద్ధుం డక్కేళీగృహంబున యశోధరతో ననవరతసంభోగంబు లనుభవించుచుఁ బురావృత్తాంతంబులన్నియు మఱచి యాపద్వార్త కలనైన నెఱుంగక సుఖాతిశయంబునం బొదలుచుండి యొక్కనాఁడు. 100

సీ. వికసితప్రసవగుచ్ఛకదంబసంభ్రమ
భ్రమదురుభ్రమరవిభ్రాజితంబు
పల్లవగ్రాససంఫుల్లశీతారావ
వాచాలకోకిలాభాసురంబు
తుహినపాతంపతత్సుమమరందాసార
పంకిలీకృతనవప్రసవరజము
శుకముఖత్రుటితకంచుకపక్వఫలబీజ
వర్షితాంకురనగాధస్థలంబు

తే. గీ. కిసలయాంతరపతితార్కకిరణజాల
వర్తులాకారముద్రికావలయితంబు
నైన పూఁదోఁట కొక్కనాఁ డవనిపాల
పుత్త్రుఁ డరిగె ననుంగుఁబూఁబోఁడితోడ. 101

క. చెలువయుఁ జెలువుండును బూ
వులతోఁటం గ్రీడసేయఁబోయినఁ గని కా
వలివా రెడసనుటయు నె
చ్చెలు లందఱుఁ దోడుసనిరి చెలువం బొలయన్. 102

క. సరసిఁ గరిణీవృతం బగు
కరిపగిది పరస్పహసన్త్రికాంతలనడుమన్
ధరణీంద్రకుమారుండును
గరము ప్రకాశించెఁ బుష్పకానన మందున్. 103

క. కడుకొని విరక్తుఁ డగు రా
కొడుకుం గడెలోనఁ బుష్పకోదండునికిన్
బడిపిల్లనిగాఁ జేసిరి
పడఁతులు చేయింపలేని పనులుం గలవే. 104

మ. అటులాకృత్రిమకాననంబున నరేంద్రాదిత్యుఁడుం గాంతలుం
జటులంబైన మనోజరాగమునఁ బుష్పక్రీడ గావించునాఁ
తట శుద్ధోదనపాలితాఖిలధరోదారప్రదేశంబులం
బటహధ్వానము నాల్గుదిక్కు లద్రువ న్వాయించెఁ బూవిల్తుఁడున్. 105

వ. ఇట్లు తారాపరివృతుండగు పూర్ణచంద్రునిపగిది నారీపరివృతుండగు రాజచంద్రుండు నిరంతరోత్సాహసంపన్నుఁడై క్రీడించునెడ. 106

క. పదములు తడఁబడెనని యొక
ముదిత భుజాలతలు సాఁచి భూవరు నురముం
గదియించెం గాఢన్యా
స్పదవర్తులపీనమిలితవక్షోజములన్. 107

క. మొగమున నాసవపుం బుగ
బుగ తొలయఁగ రాజుకర్ణమున నూర్పుచ్చె
న్మగుదయొక ర్తరుణాధర
'తగవిను మిది యొక్క యేకతం' బంచు వెసన్. 108

సీ. సహకారశాఖ హస్తంబులు గీలించి
వలుదగుబ్బలు చూపె వనితయొర్తు
మొలనూలు పెక్కుసారులు కదల్చుచుఁ బీన
జఘనంబు గనిపించె సకియయొకతె
యొకతమ్మి చేఁబట్టుకొని పద్మాలయ
పోలెఁ బజ్జకు వచ్చె బాలయొర్తు
నెఱగాణవోలె వన్నెలుగుల్కఁ బాడుచుఁ
దాళంబు వాయించెఁ దన్వియొకతె

తే. గీ. యెంచఁదెంచఱు కామిను ల్తొందరించి
నను జలింపకయున్న మానవునిచేఁత
లభినయించుచు నెదుట నాట్యంబు సలిపెఁ
జెమ్మటలు మేన దిగజాఱఁ జెలియయొకతె. 109

ఉ. రాజకుమారు నొక్కతె సరంబులఁ జేతులుగట్టిపెట్టె; 'నీ
యోజ గణింపఁ జిట్టలయయో' యని వాయిబిగించె నొర్తు; 'కాం
తాజననిర్జితుండ' వని తా నెకసక్కెము లాడెనొర్తు; 'నీ
వ్యాజము నేనెఱుంగ నదియా?' యని నవ్వె నొకర్తుపక్కునన్. 110

వ. ఇట్లనుక్షణోజ్జృంభయిష్యమాణమదనోన్మాదులగు సుందరులు చేయు
వికారంబులకుం జొతారంబు గల్గినవాఁడుంబోలె నుండియు నాసర్వార్థ
సిద్ధుం డొక్క యశోధరయందు మాత్రము బద్ధానురాగుండై కొంత
తడవున నుద్యానవిహారంబు చాలించి చెలువలతోఁగూడ మరలి నిజ
సౌధంబుఁ జొచ్చిన యుదంతం బంతయుఁ బరిచారకులవలన విని శుద్ధో
దనుండు సపౌరరాష్ట్రియప్రజుండు ముదంబునం బొదలు చుండె. 111

చ. ఎలమి యశోధరాసరసిజేక్షణయు న్సహజంబులు న్విలా
సలలితభంగులు న్సతతసౌఖ్యకరంబులునైన క్రీడలం
బలుకుల ముద్దుల న్మురువుఁ బాటలతేటల సీటుల న్మదం
బొలయఁగఁ జేయుచుం దనుపుచుండెఁ బ్రియు న్బ్రియభక్తియుక్తయై.

మ. అతఁ డీరీతి యశోధరాకృతవిలాసాలోలుఁడై యుండి దే
వత లప్పు నిశీథమందుఁ దన స్వప్నం బందుఁ గన్పట్టి వి
జ్ఞతకై యాత్మ గుఱించి చెప్పు పలుకుల్ స్పష్టంబుగా నిద్దురన్
బ్రతివారం బొకభంగిగాఁ గలవరింపం బూను నుచ్చైర్గతిన్. 113

వ. అట్టియెడ యశోధర యుల్కిపడి యతని లేపి "యియ్యది యేమి" యని యడిగిన "నేమియు లే"దని యాపెను మఱపించుచు మరల నెడనెడ నొలయు వేశ్యా వీణాలాపాదికమ్ముల మైమఱచి మోహమ్మునం బడుచుండు. మఱియు నట్టియెడ దేవత లయ్యోధకు వచ్చి తదేక గోచరులై. 114

ఉ. ఎందులకుం జనించితి, మఱేమి యొనర్చుచునుంటి, వీ జగం
బందు నహింస యెల్లెడల వ్యాప్త మొనర్పుము, రాజ్యపాలనం
బందును నిట్టి సౌఖ్యములయందును మున్గక వ్యర్థమైన వే
డ్కం దిగఁద్రావి వైళ ముపకారము లోకులకుం బొనర్పుమా. 115

వ. అనుచుఁ బ్రతిపదంబును బోధించుచుండ సిద్ధార్థుం డొక్కనాఁడు ప్రపంచవిశేషమ్ముల నెఱింగి తదుపకృతికి యత్నింపఁ దలఁచి చిత్రయను సౌధదాసి నడిగిన, నయ్యది 'మహాత్మా! యీయవి వచింప నాబోటి కోటి కెట్లు సాధ్యం? బా యావిశేషంబులు దేవర చని కనినఁ దేట తెల్లంబులగు' ననుడు నతం డట్లకాక యని చెన్నుఁడను సారథిం బిలిచి.

క. "ఊరంతయుఁ గనుఁగొనవలెఁ
దే రాయత్తం బొనర్చి తెమ్మన, సూరీ
కారం బనివాఁడరిగి మ
హారాజునకు న్వచించె నది యొల్ల వడిన్. 117

తే. గీ. రాజువినికొడుకున కది రాజ్యకాంక్ష
గాఁ దలంచి పురమ్మధికమ్ముగా న
లంకరింపంగఁ జాటించెఁ టొంకముగ న
లంకరించిరి పౌరు లిలాధవాజ్ఞ. 118

తే. గీ. గ్రుడ్డివాండ్రును గుష్ఠరోగులును గుంటి
వాండ్రు రిక్తజనులు శోకవంతులాది
గాఁ గలుగు వార లెయ్యెడఁగాని వీధు
లందుఁ గాన్పింపకుండ రాజానతిచ్చె. 119

ఉ. కన్నులపండువౌ గతిఁ దగం బురమిట్టు లలంకరింప, నా
చెన్నుఁడుఁ దేరునాయితము చేయుఁడు, రాముతుఁ దంతఁ బట్టనం
బు న్నలువంకలం గనఁగఁ బూర్ణతరోత్సవ మొప్ప నేగి రాం
చెన్నరులందుఁ గల్గెడు విశేషముల న్మది కెక్కునట్లుగఁ. 120

వ. ఇట్లు కొంతవడి వీక్షించి మరలి స్వస్థానంబున కరిగి సుఖంబుండె;
నాఁటి నిశీథమ్మునన శుద్ధోదనునకు స్వప్నమ్మున నిట్లు కనసయ్యె. 121

తే. గీ. భానుఁడును వింద్రిచాపంబులోనఁ గల్గు
నొకపతాక యనిలమున నొరగి నేలఁ
బడినఁ గొందఱు సన్యాసివరులు దానిఁ
గొని చనిరి తూర్పుదిక్కునకుమ గడంగి. 122

క. దక్షిణఘంటాపథమున
నక్షతగతిఁ బదిగజమ్ము లరుగఁగ నందుం
దక్షతగల తొలియేన్గున్
శిక్షించుచు నెక్కి చనియె సిద్ధార్థుండున్. 123

క. హరు లొకనాలుగు గడున
త్వరమున లాగంగఁ జను రథమ్మునఁ దాను
స్థిరుఁడై సిద్ధార్థుఁడు సుం
దరమూర్తి ముదమునఁ జనియెఁ దనయంత వెసన్. 124

తే. గీ. సొబగు చిత్రము లెందు నంచులను దనరు
గనకమయములు మాణిక్యఖచితములును
నగునరము లొప్ప నలరు రథాంగ మొక్కఁ
డొక్కయెడ నొప్పెఁ గన్నులకక్కజముగ. 125

తే. గీ. ఒక గిరివరంబునందుఁ బొల్పొందు నొక్క
భేరిక నయోమయంబగు పెద్దకట్టెఁ
గరమునంగొని ఢాంకృతిగడలు కొనఁగ
నట్టె కొట్టుచునుండె సిద్ధార్థుఁ డెలమి. 126

తే. గీ. పొడవునఁదనర్చునొక్క గోపురపు శిఖర
మందుఁగూర్చుండి పదములు హస్తములును
జాఁచి యొకఁడు రత్నమ్ములుచల్లఁ గ్రింద
నేఱిగొనుచుండి రొకకొంద ఱిపలనవల. 127

క. ఒకయార్గురుజను లొకచో
వికలత్వము మొగములందు వ్రేలాడఁగఁ బం
డ్లుకొఱికికొంచు నజసార్రి
ప్రకలుషితాక్షులయి యేగ సాగి రనదలై. 128

వ. ఇట్టి యేడుకలలం గాంచి మేల్కాంచి శుద్ధోదనుండు దనకుం గీడు పూఁడునని శంకించుచుఁ గొల్వుకూటంబునకు వచ్చి సభాసదుల నవలోకించి స్వప్నవృత్తాంతంబు వచించిన నందొక విద్వాంసుండు 'రాజా! నీస్వప్నంబులకు ఫలంబులిట్టివి' యని క్రమంబుగఁ జెప్పందొడంగె.

తే. గీ. సూర్యబింబమువంటి సంశుద్ధుఁడొకఁడు
పెక్కెమును బోలి నల్దెస నుక్కుమిగులు;
పాత్రిక్షితాచార మడఁచి ప్రబలఁగఁజేయు
మంచి యాచారమును భువి నంచితముగ. 130

తే. గీ. ఆ పదిగజమ్ములన బుద్ధికగు తెరువులు;
మొదటికరి నెక్కియేగు టప్పది తెరువుల

యందు సత్యమార్గమ్మునయందుఁ జవిలి
యేగు నొకసిద్ధుఁడనుట యుర్వీశమౌళి. 131

క. అరదమును లాగు నాలుగు
హరులం గనుఁగొంటి పధిప! యవి జ్ఞానపు పె
ల్తురుఁజూపు చతుర్వర్గము;
పరిపాటిగఁ జూడు దీనిభావంబెల్లన్. 132

క. నానాచిత్రియుతము ర
త్నానీకస్థగితమునగు నలచక్రిం బెం
తేనీతిరీతికిఁ బ్రిపం
చానూనవిశేషములకు వ్యంజక మధిపా. 133

తే. గీ. నీకొడుకు భేరిఁగొట్టుచు నీకుఁ గానఁ
బడుట కర్థంబుఁదెల్పెదఁ బార్థివేంద్ర!
లోకములకెల్లఁ దెలియంగ "నేరమేవ"
యనెడి శ్రుతిని జాటించుట యరయుమెడఁద. 134

తే. గీ. గోపురము జ్ఞానశాస్త్రము, మగ్గోపురిమ్ము
నుండి రత్నమ్ములం జిమ్ము టొల్ల రెల్ల
దాని నుపదేశ మొసఁగు విధమ్ము, రత్న
నికర మేఱుట గ్రహియించు నియతి యధిప. 135

క. మొగములు వాడఁగ నార్గురు
వొగులుట తమ మతము వోపఁ బూర్వాచారా
నుగతి జగతికిం దెల్పుచు
నెగడు గురువు లేడుచుటయని యెఱుఁగు మధిపా. 136

వ. అని చెప్పిన నప్పలుకుల చందంబు విని యీయేడుస్వప్నంబులడుఁ బర్యవసితార్థంబు తనూజుండు సన్న్యసించుటకా యని కృతనిశ్చయుండై. 137

క. మునుపటికన్నను నెక్కుడు
జనులం గాపుంచి పూర్వసదనంబున నం

దను నుండఁజేసె; నెందుం
జనకునకుం బుత్రు విడువ సమ్మతమగునే. 138

శా. ఆ సిద్ధార్థుఁడు పూర్వరీతి మఱునాఁ డాచెన్నునిం గూడి ప్రో
లాసం గన్గొనుచు న్స్మృతింగను జనుం, బ్రాణంబు శేషంబుగా
గాసిం జెందెడు వానిఁ, బెక్కులగు రోగంబు ల్వ్యథం గూర్ప సం
త్రాసం బొందెడువానిఁదాఁ గని మదిం దాపప్రకోపంబునన్. 139

తే. గీ. తెలిసియున్న చెన్ను నడిగి కీడుమేలు
లాత్మఁబట్టించుకొనుచు నట్లరుగ నరుగ
వేళొకఁడు జుట్టు బందుగు ల్వెక్కివెక్కి
యేడ్వ వచ్చెడు సబ మొక్కఁ డెదురుపడియెఁ.     140

తే. గీ. కొమరుఁ దగ్గియుఁ గుండయుఁ గొని నడువఁగ
వస్త్రిమొక్కింత గన్పట్ట వస్త్రసంవృ
తంబుగాఁజేసి పాడెపైఁ దగఁబరుండఁ
బెట్టి నల్వురు వహియింప వెడలె శవము.     141

చ. పడిపడి కంకగృధ్రముఖపక్షిసమాకులము న్నివారవా
స్పదము ననేక వాహకశవప్రచురంబునునైన వల్లకా
టి దరిని బెట్టి యాశవము డెప్పరమైచను వహ్నిఁగాల్ప బూ
డిద యగుడు న్నృపాలసుతు డెందముచందము భిన్నభిన్నమై. 142

క. వివశంబగుటయుఁ జెన్నుని
నవలోకించి ''మనమిట్టులగుదుమె ?'' యన, వాఁ
డు వలుకు సిద్ధార్థునికిఁ గ
లవిధం బిప్పగిదిఁ దాఁగలంగెడి మదితోన్. 143

తే. గీ. పుట్టుటయు గిట్టుటయు మఱిఁ బుట్టుటయును
దిరిగిగిట్టుట యనునది దేహధర్మ;
మేల తప్పింపనగుఁ ? జక్రిమెట్టు లట్టు
లీప్రపంచమ్ము తిరుగు భూమీశమౌళి. 144

వ. అనిన విని యది యంతయు మనంబునకు గోచరంబు చేసికొని యారుద్రభూమి విడిచి మరలి నగరఘంటాపథంబున వచ్చుచుండ.

చ. సిరిచెడి బిట్టువంగిన కసేరుకయుం గనుతెప్పలుం బర
స్వరము గదించు మైవళులు పాతరలాడు శిరంబు సర్వము
న్నరసిన కర్ణలోమము లణంగిన పిక్కలబల్మి మోమునం
బొరఁగెడి లాల గల్గు ముదితొక్కనిఁ గాంచెఁ గుమారుఁ డొక్కెడన్.

క. వడవడ వడఁకుచుఁ బదములు
తడఁబడ హస్తమున నొక్క దండము గొని యె
వ్వఁడు వచ్చుచుండు వీఁ డని
యడిగిన నృపసూతి కిట్టులనె సారథియున్. 147

ఉ. రూప మడంగు బుద్ధియును రూపఱు దేహబలంబు గ్రుంగు సం
తాపము హెచ్చు నాళులును దామరతంపరలై జనించు వి
ద్యాపటిమంబు తగ్గు విషయంబులఁ బొల్పఱు దేనిప్రాపునం
దాపరమయ్యె నా జరయనందగు రోగ మొకండు వీనికిన్. 148

క. చవి యెఱుఁగమి యింద్రియపా
టవమును లేకుంట పండ్లడంగుటయును ము
న్నవు విధములు దలఁపఁగ రెం
డవబాల్యము సుమ్ము ముదిమి యవనీంద్రసుతా. 149

క. అనవిని బుద్ధుఁడు చిత్తం
బునఁ గూరిన వంత పేర్మిఁ బొరిఁబొరి నాలో
చన మొనరుచుచుం జనియె స
దనమునకుం బనివి పనివి తత్తఱ మొలయన్. 150

—• ఆశ్వాసాంతపద్యములు. •—

క. సంతతరవికాంతియుతా
నంతధరామండలావనాసక్తమ్మృదు
స్వాంతాంగ్లేయప్రభుసా
మంతధరాపాలలోకమానితశీలా !

ఉ. రాజతరంగిణీప్రముఖరమ్యతరాంధ్రవచఃప్రబంధక
ర్తా ! జయశీల ! ముద్రితపురాతనకర్తృకసత్ప్రబంధపా
శీజనితాతికీర్తిధవళీకృతసర్వదిగంతరాళ ! స
త్తేజ ! భుజాలసద్వసుమతీ ! సుమతీ ! వరకృష్ణభూపతీ ! 152

— భుజంగప్రయాతము —

జగద్గీతకీర్తీ ! భృశప్రేమమూర్తీ !
నగాధీశధీరా ! ఘనత్వప్రచారా !
యగోద్ధర్తృమానా ! సదాభ్యస్యమానాం
ధ్రగీర్వాణభాషాచరాకృష్ణవేషా. 153

— గ ద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరప్రణీతం బగు
బుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందు
ద్వి తీ యా శ్వా స ము



శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బు ద్ధ చ రి త్ర ము



## తృ తీ యా శ్వా స ము

క. శ్రీయుత ! హూణాధిరకళాధీ
రాయిత ! శాంత్యాదిసుగుణరత్నాకర ! కీ
ర్త్యాయత ! వేంకటకృష్ణా
రాయమణీ ! సుకవికమలరాజ్యాభ్రమణీ ! 1

తే. గీ. అవధరింపుము పిదప సర్వార్థసిద్ధుఁ
డట్లు గృహమున కేతెంచి యంతరంగ
మెంతయు విరక్తిపథమున గంతులిడఁగ
న్యాయముగ నెట్టరేల కాలేయి గడపి. 2

వ. మఱునాఁ డుదయంబునం గతిపయమిత్రసహితుండై యరణ్యప్రదేశ
విహారంబునకు మనంబు ప్రేరేపఁ గింకిణీకలసమూహలలంబుసు పిలంచ్చ్రా
ఖాద్యమానఖరీనఖలఖలారావంబుసు సన్నద్ధపల్యాణంధలంబుసగు వంట
రంబను వారువంబుఁ జెన్నుండాయితంబు గావించిన దాని నధిష్ఠించి
యెడనెడ గిరినదీకుల్యానిర్ఝరరామణీయకంబుఁ గనుంగొనుచుఁ
జనువాఁడు. 3

సీ. పంచాస్యనఖముఖాపాద్యమానకరీంద్ర
దలితకుంభస్థముక్తాఫలంబుఁ
గందరాముఖచరద్గంధేభఘీంకార
వితత్రస్తశార్దూలవిభ్రమంబు
శార్దూలఘోరదంష్ట్రాపీడ్యమానవ
న్యగసీమహిష్యాదిమృగకులంబు

వస్త్రకౌసరశృంగవధ్యమానోదార
రథసవిశ్రాంతతురంగమంబు
తే. గీ. నభయఖిల్లకుమారహస్తాగ్రవిహిత
పైణవాణగహన్యమానైణచయముఁ
గలితహిమఖండమండితగండశిల మ
యిన తుహినభూధరంబుఁ గన్గొనియె నెదుట. 4

వ. కని తత్పాదంబులం జేరంబడి ముందటి దారులు హయాధిరోహణ
సమీచీనంబులు గా వని వారువంబు నటనుండ నియమించి కాలినడన
వెడలి జడియకుండుఁ డని తనచెలికాండ్రకు ధైర్యంబు చెప్పుచుఁ బ్రాణి
హింసాఘోరంబగు నమ్మహారణ్యంబుం దరియంజొచ్చి సృష్టియందలి
వైచిత్ర్యంబున కచ్చెరువందుచుఁ జనిచని. 5

క. ముండితశిరస్కుఁ డై యొక
దండము కేలఁ గొని యేకతము గా వనమం
దుండిన మునిని గనుంగొని
యెం దెందమునందు వింత యిం పెసలారన్. 6

వ. కని 'నీవెవ్వండ వేమికతంబున నిట్టి వేసము సాదించితి, వేమి చేయు
చుంటి' వని యడుగ నుద్భవిష్యమాణమహాప్రబోధోదయుండగు సర్వార్థ
సిద్ధుం గని యతం డిట్లనియె. 7

క. నే నొకసన్న్యాసి నర
జ్ఞానం దపమాచరింప నరుదెంచితి నా
ధ్యానము మోక్షము చెందుట
కైనాపుడు రాజసుతుఁడు క్రమ్మఱఁ బలికెన్. 8

సీ. తల్లిదండ్రులు నీకుఁ దపమాచరింపఁగ
నిందుఁ బొమ్మని యానతిచ్చినారె ?
వా రేమియైరి ? నీపరిణయంబైన యి
ల్లాలి నెచ్చట డించితయ్య ? యనుచు

నడుగ, 'నయ్యో! వెఱ్ఱిపడుచుఁడ వెందేనిఁ
బరిణయం బాడిన బంధముక్తి
నెనయునే! తలిదండ్రులెవరైనఁ గొడుకు స
న్న్యాసంబుఁ గొనుమని యంపువారె?
తే. గీ. యవని మోక్షేచ్ఛ గలవార లఖిలబంధు
పుత్రమిత్రకళత్రాదిపూరితమగు
సంసరణవార్ధిఁ బడకయే చనఁగవలయు
నుగ్రకాంతారములవంక కూరు విడిచి. 9

వ. కావున నేను మోక్షార్థినై పరిణయపాశంబునం దగులక తలిదండ్రుల కన్నుఁగప్పి వచ్చి యీ ఘోరారణ్యప్రదేశంబునం దిట్టివేసంబునం దపంబు చేసికొనుచుంటి' ననపుడు సరేంద్రనందనుం డిట్లనియె. 10

మ. తరుణీపాశమునం దగుల్కొనక సత్యజ్ఞానసంపన్నుఁడై
తరణోపాయముఁ జూడఁగావలయుఁ దత్త్వం బింతియే కాని యు
ర్వరణిం దండముఁ గావిచేలములు నేరాలంబునం దాల్చుచుం
శిరముం బోడియొనర్పఁ గారణ మొగిం జెప్పంగదే నావుడున్. 11

సీ. "సాంసారికులతోడి సావాసము ముముక్షు
జనులకుఁ దగదు, సాంసారికులకు
సన్న్యాసులగువారి సహవాసమును గూడ,
దట్టులైన నిరుదెగలకుఁగు నిజము;
కావున మోక్షేచ్ఛగలవారి కడవియు,
సాంసారికుల కెల్ల జనపదంబు
వాసంబుగా నేర్పఱచిచిరి తొల్లింటి
పెద్దలు; వేషంబు వేఱుగాఁగఁ
తే. గీ. బట్టములఁ గావిరంగును బోడితలయు
యోగులకు నిర్ణయించిరి యుక్తిచేసి
కాని ముక్తికి నిదియొక్క కారణంబు
గాదు, ప్రతిబంధకంబును గాదు తలఁప." 12

తే. గీ. అసుచునెటిఁగింప మ్రొక్కివీడ్కొనుచుఁ గదలి
స్నేహితులుగూడ వెంట వచ్చిన కతమున
పన్యకరిరాజు ప్రోలికి వచ్చుపగిది
మరలె నగరునకుఁ దురంగమంబుతోడ. 13

వ. ఇట్లు సర్వార్థసిద్ధుం డానాఁటిపవ లెల్ల నరణ్యంబునం బుచ్చి నగరికిం బ్రివేశించునెడ భువనబంధుండును. 14

శా. సిద్ధార్థుం డిఁక నేఁటిరాత్రిమొద లాసింపండు సంసార మా
సద్ధిజ్ఞానమునం జగం బఖిలమున్సంధింప సన్న్యాసమ
స్సద్ధర్మంబు పహించు నంచుఁ బృథివిం జాటించి యాపై నుద
స్వద్ధాపస్థులను స్వచింపఁ జనెనా వారాశిఁ జేరె న్వడిన్. 15

తే. గీ. ఎల్లిసుండియు నితఁడింక నెపుడుఁ గట్టు
నట్టి పస్త్రంబులసు గట్ట కిట్టి పుట్టి
ములు ధరించు నటంచుఁ జెప్పు లలిదోఁప
నేయెడలఁ దోఁచె సంజకెంజాయ దెసల. 16

తే. గీ. పంకజాత యగుటఁ దన్నుఁబాసి యరిగె
రవి తప్రియామయుఁ దని నలిని వగ నిగుడ
మగుడఁ దలయెత్తనేరని మాడ్కి నొప్పె;
నకట ! దానఁ గేరికైన లజ్జావహంబు. 17

తే. గీ. పుష్పవతియైన పద్మిని బొందుచేసి
తనదు తేజంబు క్రమమునఁ దఱిఁగిపోవఁ
బశ్చిమసముద్రమున మున్గెఁ బాపమడఁగ
ననఁగ రవి క్రుంకెఁ దద్దిశాభ్యంతరమున. 18

క. ఎల్లెడల మనపతంగుఁడు
బల్లిదుఁడై దుర్నిమ్మరు నెటఁబట్టువడెనొ యా
పల్లినుఁ డగుచు ననుగతిఁ
గొల్లలుగఁ బతంగకులము గూయఁగఁ దొడఁగెన్. 19

తే. గీ. సూర్యుఁ డనుజ్ఞాన మొందేనిఁ జొచ్చుటయును
నలమెఁ దమము బ్రహ్మాండమునందుఁ బ్రబలి:
దానిఁ గని సైఁపలేని సుజ్ఞాను లనఁగ
మిగుల వాపోవఁ దొడఁగెఁ బక్షిగణ మపుడు. 20

సీ. ముల్లోకములలేని యిల్లాలు తనయింట
వెలిఁగించుకొనిన దివ్వియ యనంగఁ
బొగ్రిచి కేళీశయ్యపయిఁ గోల్పడిన నిగ్గు
గల యొంటితెలిబాతికమ్మ యనఁగ
నాకాశదోలాంతరాకాశమానకం
తుకరవిలాసకందుక మనంగఁ
దెఱగంటిదొరపట్టి పఱపుటుయ్యెల మంచ
మునకుఁ బైఁగట్టిన ముకుర మనఁగఁ

తే. గీ. జందురుఁ డుదయించెఁ, జక్రము ల్వంచలించెఁ,
జంద్రికాపక్షి లెలమిమై సంచరించె,
సరసకైరవసంతతి సంతసించెఁ,
బద్మినీకాంత తలవంచి పస్వళించె. 21

తే. గీ. అంబరము తనమణి వోవ నార్తిఁ గూరి
యెన్నియో దివ్వెలను బెట్టి యెందు వెదకి
విసివి పెద్దదీపమ్మును బెట్టె ననఁగఁ
దారలును జంద్రుఁడును గ్రమముగ నెసంగె. 22

వ. మఱియు. 23

సీ. తంజాపురీనీలకంజాతనయనల
రెండుచెక్కులు పుల్కరింపఁజేసి
కాంచీపురీదేశఘనసారగంధుల
పొలయల్క పెక్కుసారులు హరించి
కర్ణాటకామినీఘనశిరోరుహముల
కసమానమైగనిగ్యంబుఁ దెచ్చి

కుంతలపాళిం తకర్ణాంతాయతాక్షుల
చెలువపలకూర్మి హెచ్చింపఁజేసి
తే. గీ. యమితతృష్ణార్దిత భుజంగసముదయప్రి
యవిధానార్హకుశలసంపదలఁ బొదలి
మలయనిలయపటీరద్రుమవలయనిలయ
మారుతంబులుచెలరేఁగె మాసరముగ. 24

వ. అట్టిసమయంబున సర్వార్థసిద్ధుండు విశ్రమనామకంబగు కేళికోద్యానం
బునఁ దొల్లింటిపగిది యశోధరాసహితుండై యనర్ఘమణికుట్టితంబును
ననేకచిత్రాలంకృతంబును గృత్రిమదాక్షావల్లీసుమహితోల్లోచభాసురం
బును మౌక్తికసరసముజ్జ్వలద్భిత్తివ్రజంబును బహిస్స్థితగాయన్నానాగా
యనీజనసంకులంబును గమనీయపరిచారికాబహుళంబునునగు సౌధంబున.

సీ. జాలమార్గప్రవిష్టమ్మలౌ వెన్నెల
ల్వాజ్రఖిత్తుల సుధాభ్రాంతిఁజేయ
నపరత్నరుచిరపాత్రవిశేషభాస్వత్ప్ర
దీపమ్మ లొండొంటితేజు మిగులఁ
జలలేకత సహంసతూలికాతల్పంబు
పఱచినయద్దంబుభాతి మెఱయ
నుల్లోచ మయ్యెడనుండు నలంకార
ములకన్నిటికి వింతపొలుపు నెఱప
తే. గీ. నలుదెసల కుడ్యముల నొప్పు నిలువుటద్ద
ములు గుణించి పదార్థసముదయమును బ్రి
వృద్ధముగఁ జూప నెల్లెడ వేడ్కలొదవఁ
జాలు ననవద్యకేళికాసదనసీమ. 26

క. కేళీలోలతఁ గొండొక
కాలము వర్తించి తత్సుఖపరవశుండై
లీలమెయి నిద్రపోయెడి
వేళకు యామద్వయంబు వెడలం జొచ్చెన్. 27

వ. అయ్యెడ. 28

సీ. కలలోఁ బవలిటిసంగతుల నృత్యాదుల
నెంచి సారె కలవరించు నొకతె
కంకణారావమ్ము గానమ్ముగా నిటు
నటుఁ గదలుచు నిద్రనందు నొకతె
వీణ మీటుచు రసవివశయై యారీతిఁ
గదలక నిద్రింపఁగడఁగు నొకతె
శృంగము ల్స్వకుచసంసంగమ్ముగన తేటి
తనప్రక్క నొలయ నిద్రగను నొకతె
తే. గీ. పొలఁతు లిర్వు రొక పొగడపూలమాల
గుచ్చుచుండంగ నందొక్క కోమలాంగి
యలసి యాదండ యుపధానముగ గతిఁ బవ
శింప నద్దానిపైఁ బవళించె నొకతె. 29

తే. గీ. ఒకతె పెంపుడులేడిపిల్లకు గులాబి
పువ్వు దినిపింప నది కొంతపూవు దినియుఁ
గొంత తినుచు నిద్దురఁగొనఁ గువలయాక్షి
తాను దినిపించుచునె నిద్ర తగవహించె. 30

మ. లలన ల్కొందఱు కేళికాసదన ముల్లంఘించి పైవచ్చు దీ
పలసత్కాంతులు రోహిణీమరుదభిప్రభ్రంశితాచ్ఛాదనో
జ్జ్వలదాత్మావయవాలికి న్మిగుల దృశ్యత్వంబు సంధింప వె
న్నెలబైట న్నిదురింప సాగిరి మదాంధీభూతచేతస్కలై. 31

తే. గీ. ఇట్టులొకరీతిఁ గాక యెన్నెనిగతుల
నతులనిద్రాభరాలసలైన యావె
లందు లగవిచ్చుచున్న గులాబిపువ్వు
లనఁగ నెంతయు శోభ నొప్పారి రపుడు. 32

వ. ఇట్లు లక్కేళీగృహబహిస్స్థితులగు తత్తజ్జనంబు లెల్ల గాఢనిద్రాను
గతులై యుండ వేఁడియుఁ దత్పడనద్వారసంగతమ్మను గనకలతా

చిత్రితంబును నీలవర్ణమ్మును జందనకాష్ఠావలంబితంబునగు తెర యొద్ద
గంగాగౌతములను పరిచారిక లిరువురు పన్నుండియుండ నమేయం
బును నిశ్శబ్దంబునగు నయ్యర్ధరాత్రింబున. 33

తే. గీ. ధవునిభుజదండమది యుపధానముగ ని
దురగొనుచున్న యల యశోధర కల గని
తగని వగ నిగుడఁగ లేచి మగనికేలు
మూఁడుసార్లు ము ద్దిడుకొని మొనసి లేపె. 34

క. కన్నీరు కాల్వ గట్టఁగ
నన్నెలతుఁక పైఁట గుబ్బలం దిడుకొనుచున్
సన్నపు తెలుఁగున నాథుని
మన్నన దనుపార లేపి 'మనవి వినుఁ' డనన్. 35

తే. గీ. ప్రార్థనాపూర్వమైన యప్పడఁతిపలుకు
విని యదరిపాటుమై లేచి విహ్వలాత్మ
యైన సతిఁ గాంచి పల్కె సిద్ధార్థుఁ 'డబల!
యేమికారణ, మిందుల కెఱుఁగఁ జెపుమ.' 36

క. నావుడుఁ జెప్పుట కాసతి
భావం బెడతెగక మిగుల వగలం బొగలం
గా విభుఁడు పలువితమ్ముల
నావెలఁదుక ననునయించె నది చెప్పింపన్. 37

తే. గీ. అటు లనునయించు పతి కిట్టులను మృగాక్షి
"నాథ! నెప్పెడిదేమి, యీనాఁడు నాకు
పేఁకటియొదవె నద్దాని వెర వెఱింగి
శించుముదమున నేను నిదిరించుచుంటి. 38

మ. అకటా! యియ్యది యెట్లు చెప్పనగు నాథా! నిద్రలో నొక్కపా
డుకలం గంటి, న దెట్టి దన్న, నిటులట్టు ల్క్రమ్ములం జిమ్మకొం
చౌకయాఁబోతు మణీప్రభోజ్జ్వలితమై యొప్పారు చిహ్నంబు విం
తకు వింత న్మొగమం డెలర్ప నెదుటం గన్పట్టె శైలాకృతిన్. 39

తే. గీ. 'విచ్చలవిడిఁ దిరిగెడి యావృషభరాజుఁ
బట్టలేకున్నఁ బోవు మీభాగ్య' మనుచుఁ
బలికె నంబరవాణి; యప్పలుకు వినియు
నెవ్వరును బట్టలేకుండి రించుకేని. 40

ఉ. ఎమ్మెయిఁ బట్టరాక కడునేపునఁ బొల్చుచునున్న యమ్మహో
క్షమ్మును హస్తయుగ్మమున గట్టిగఁ బట్టితిఁ, బట్టినంతనే
హుమ్మని యార్చి పర్వతసమున్నతమౌ తనువు న్విదిర్చి పం
తమ్మున నన్ను మీఱి చరణంబుల భూమితలం బదల్చుచున్. 41

క. తెంకల నెల్లరఁ బొడిచి ని
రంకుశగతి వరణ మొక్కయంబగఁ బ్రబలా
హంకార మెసఁగదాఁటి త
లం కెల్లర కొదవ నేగె లావు మెఱయఁగన్. 42

తే. గీ. ఇద్దియొకరకల ; యిఁక నొక్కఁడెట్టు లనిన;
దేవదూతలు నల్వురు తివిరి సవరి
వారముగ నిప్పురమునను వచ్చి వైచి
యంతిక నొకండు నాటిన యంతలోన. 43

క. రవి యుదయమందె, మఱి వా
యువు వీచెన్ ; దాన సద్దియు న్విరఁబాఱెన్
వివిధగతి నక్కరము లు
న్నవి దాన" ననంగ పతికి నయ్యనఘుండున్. 44

క. పలుకు నిటు "లబల ! విను మి
క్కల నిక్కల శుభద, మేద్వఁగా నగునే ?" యనం
గ, లలన ధవునకు నిట్లను
బలుకులలో విన్నఁదనము ప్రబలింపంగన్. 45

తే. గీ. "ప్రాణనాథ ! మూఁడవకల యవధరింపు,
'కాలము సమీపమయ్యె నింకఁ దడవేల ?'

యనుచుఁ బలు కొండు వినఁబడె నంతట నుప
ధానము చెస విగిడ్చితి నేను దృష్టి. 46

తే. గీ. అచట దేవర ధరియించునట్టి వస్త్ర
ములు గనంబడెఁ గాని మిమ్ముఁ గననైతి
మున్ను మీరు నాకిచ్చిన చిన్నిమాల
నడుమునం జూడఁబాముగా నాకుఁదోఁచె. 47

క. అందెలుఁ గంకణములు జా
ఱెం, దిలకింపఁగ శయ్య పృథివిం బడె, నే
మందు న్మర్యాదాపట
మొందె స్సథిలత్వ, ముక్షమొక్కం డఱచెన్. 48

తే. గీ. మీఁద సందెలు జల్లిన మేలుకొంటి;
నిట్టి చెనఁటి కలకు ఫలమెన్నిగతుల
మన యిరువురందు నొక్కరికిని మృతియగు
నంచు నెంచి శోకించెదఁ బ్రాణనాథ." 49

వు. అను ప్రాణేశ్వరి పల్కుల న్వినుచు సిద్ధార్థుండు తా నవ్వి. నీ
కను నాకుం దొనఁ గిక్కలం గలుగ, దక్కం బోలుపుత్రుండు నీ
కు నొకం డుద్భవ మందు, నెన్నటికి నీకు న్నాకు సంబంధముం
డు నిటులన్మద్వచనంబులన్ హృదయమందు న్విశ్వసింపందగున్. 50

క. అని యనునయించి మఱి యి
ట్లను సిద్ధార్థుండు "దుఃఖమందు మునుఁగు భూ
జనుల కుపకారములు నా
కొనరింపఁగవలసి యున్నవో గజగమనా! 51

క. ఏ నేమార్గంబునకై
పోసుంటినొ యట్టిమార్గమున కీవును రాఁ
గా నమ్మోడి శోకింపం
గా నేటి" కటంచుఁ బేర్మి గదలుకొనంగన్. 52

ఆ. వె. కౌఁగిలించుకొని మొగమ్మున మొగమిడి
ముద్దుపెట్టుకొని సుముఖిని జేసి
కంటినీరు దుడిచి కాంతకు సిద్ధార్థుఁ
డిట్టులనియె మరల నెసక మెసఁగ. 53

క. "జ్ఞానోపదేశమును నా
చే నెందఱు గాంతు రట్టిశిష్యులలో ని
న్నానింతు నగ్రిగణ్యగ
నీ నా సంబంధ మెందు నిక్కంబ సుమీ." 54

తే. గీ. అని యనేకగతుల నాపె ననునయించి
చెమ్మిసమకూర్చి సంశయచ్ఛేది యగుచు
మరల నిద్రింపఁజేసి యమ్మానఘనుఁడు
తగని యాలోచనమునఁ జిత్తము కలంగ. 55

ఆ. వె. ఉండునంత మున్ను సుపదేశ మగుగతి
నమరవరులు పల్కి నట్టి పల్కు
లపుడు వినఁగనయ్యెఁ; నయ్యెడఁ జంద్రుండు
కర్కటస్థుఁ డగుచుఁ గ్రాలుచుండె. 56

మ. అపు డద్దేవత లాడువాక్యములు సిద్ధార్థుండు యోచించి స్వ
ప్నపుభంగిం దిలకించి లోకులను విజ్ఞానౌషధిం బాపలో
గపథాపాకృతులం బొనర్ప మతి సంకల్పించి పోనెంచి స్నే
హపు సంబంధము ద్రెంపలేక కడు మోహాయత్తుఁడై క్రమ్మఱన్. 57

క. వెనుదీయు మనము జ్ఞాన
మ్మనఘుం దానకము చేసి పూర్ణస్థైర్య
మ్మను జెంది యశోధరవం
కసు దృష్టినిగిడ్చి మిగులఁ గరుణార్ద్రుండై. 58

తే. గీ. ఆపె యవయవసౌష్ఠవ మరసి యరసి
తనివిఁ జెందఁగలేక నితాంతరాగ

గాఢవిజ్ఞానములు మదిఁ గదిసి పోరఁ
దుదకుఁ బోనెంచి తద్రదచ్ఛదము గాంచి. 59

మ. మృదులం బంచు నెఱింగియు న్నిను సముస్మేరన్మనోజాగ్నిదా
హదశ న్నిర్దయబుద్ధినై ప్రతిపదం బత్యార్తినొందించు నా
యదయత్వంబు సహించి స్వీయమగు రాగాఢ్యత్వము స్వీడ కో
యధరంబా! సెలవిచ్చి పంపుము కృపాయత్తైకచిత్తంబునన్. 60

తే. గీ. మది నహింసయ పరమధర్మం బటంచు
గుఱు తెఱింగియు నినుఁ గొన గోటిపోటు
లం గలంచితినన్న చలంబు విడిచి
సెల వొసంగుమ యోకుచసీమ! నాకు. 61

తే. గీ. ఎప్పు దేరస ముచితమై యెసఁగు నప్పు
డారసమ్మున నా హృదయమ్ముఁ గరఁచు
నీకు నారు ఋణము తీఱె నేఁటితోఁ గ
నుంగవా! యానతిమ్ము చనుటకునాకు. 62

క. అని తత్తదవయవమ్ములఁ
గనికర ముట్టిపడ నడిగి, కాంత విడిచి శ
య్యను డిగ్గి ప్రదక్షిణముం
బొనరించె న్మూఁడుసార్లు పూర్వాభిరతిన్. 63

వ. అట్లొనర్చి వెండియు దానింగూర్చి. 64

క. నెయ్యంబునఁ దగు మామా
కయ్యములం దొదవు గాఢకష్టంబులు నీ
వెయ్యెడ నోర్చితి వికనో
శయ్యా! నిను వీడెదను నొసంగుము సెలవున్. 65

వ. అని వెండియు. 66

సీ. అనవరతంబుఁ దియ్యని పల్కులం బల్కి
ముదముగొల్పెడి కీరముఖ్యులార!

గాఢాంధకారంబుగలఁచి సంతతదీప్తిఁ
బరఁగించు రత్నదీపంబులార !
యనుపదంబును మమ్ము నంతరమ్మునఁ దాల్చు
తళతళ నిల్వుటద్దమ్ములార !
పరిచారికలభంగిఁ బరిచర్య సల్పుచుఁ
బొల్పారు జంత్రంపు బొమ్మలార !
తే. గీ. యరమర యొకింత లేక కాయమున మైత్రి
దనర వాసించు మేల్సుగంధమ్ములార !
తక్కఁగల్గిన యోపదార్థమ్ములార !
పనివి దయయుంచి నన్నింకఁ బంపుఁడమ్మ ! 67

వ. అని బయలువెడలి యతండు. 68

మ. ఒకకొం తేగును, సంశయించును; సముద్యుక్తత్వముం దెంచు వే
ఱొకకొం తేగు, యథాస్థితిం గను; నిరుద్యోగమ్ము వాటించు; వె
న్కకుఁ దోతెంచుట కిచ్చగించునట ! సన్న్యాసార్థియే యౌను గా
కకటా ! యెవ్వనికేని శక్యమగునా ? యర్ధాంగి వర్జించుటల్. 69

వ. పదంపడి యెట్టకేలకు నిద్రించుచున్న కాంతాజనమ్ముల మధ్యమ్ము
నుండి నిశ్శబ్దమ్ముగ నడిచి మందవాయువులు గమనానుకూల్యంబు
సూచింప మెల్లనఁ జెన్నుని లేపి కంటకంబు నాయితంబు గావింపుమని
కలతెఱంగు వచించిన వాఁడిట్లనియె. 70

చ. మిసిమి నెసంగు ప్రాయమును మేటిసిరుల్ కడలేని రాజ్యము
న్రసికతయుం బసందొసఁగు రాకొమరుండవు సాధ్వి యైన నీ
దుసతి నకారణంబ విడి దొంగతనమ్మున రాత్రివేళ స
న్న్యసనము పూననెంచె దకటా ! సుఖమౌనె విరాగ మేరికిన్. 71

చ. స్థలమునఁ బండఁగావలెఁ బ్రసాదమటంచును సాధ్వు లిచ్చు భి
క్షలు గ్రహియింపఁగావలెఁ బొసంగదు వేళకుఁ దిండి తిన్న చో
నిలువఁగరాదు నిల్చినను నిల్చినచోటఁ బరుండరాదు నీ
తల మగునే యతిత్వమును దాల్పుటయు న్నరపాలబాలకా. 72

మ. అడవు ల్పూవులతోఁటలే? సుహాలు క్రీడాగారవారంబులే?
మడుఁగు ల్బావులె? క్రూరసత్త్వములు నమ్మన్వచ్చు బంట్రౌతులే?
నడిపాశ్రయంపుఁ దలోదరీమణిని నన్యాయంబుగా డించి పో
యెడువాని న్నిను నే మనంగలము? మేలే పాపియమం దిప్పనుల్! 73

చ. కొడుకులఁ గూఁతులం గనియుఁ గొంతొకకాలము వారిప్రోపు మే
ల్గుడిచియు వార్ధకం బొదవఁ గోరికలం దిగఁద్రావి రాజ్యముం
గొడుకుల కప్పగించి కయికోఁదగు సన్న్యసనంబుకోస మి
ప్పుడ ప్రయతించె దక్కట! నృపుం గడు దుఃఖపరీతుఁ జేయుచున్.

క. అని పలువితముల బోధిం
చిన చెన్నునిమాట విశ్వసింపక తగుభం
గిని వానికి జ్ఞానమ్ముం
బనుపడఁగాఁజేయ వాఁడు భయభక్తులతోన్. 75

వ. కంటకమ్మను తేనియశ్వమ్ము నాయిత మ్మొనర్చిన నద్దాని నధిష్ఠించి దేవతలు ఖురధ్వానంబున కస్ఫుటత్వంబు సంధింప నవలీలఁ బ్రాకారం బులు దాఁటి శీఘ్రగమనమ్మున నొకమహారణ్యమ్ము చొచ్చి దేవతా పరిధానమ్మునంజేసి వారువంబుతోడ నడచివచ్చిన చెన్నునిం గాంచి యిట్లనియె. 76

తే. గీ. గాలి కెనయగు నీకంటకంబుతోడ
నడుగు వెనుకకుం బడకుండ నడిచి వచ్చి
రాజభక్తియు నీదు పరాక్రమంబుఁ
దెల్ల మొనరించి తీవు నాయుల్లమునకు. 77

తే. గీ. రాజ్య మేలఁగఁ దలఁచిన రాజతనయు
మీఁద భక్తియు విశ్వాస మాదరంబు
భృత్యులకుఁ గల్గుఁ గాని రాజ్యేచ్ఛలేని
వానిఁ గొల్తురె నీవంటివారు తక్క! 78

వ. మఱియు శోకత్యాగంబునకై చనుచున్న నన్నుంగూర్చి శోకంబు వద లుము; పురుషున కర్థదాయాదులుదొరకుట సుకరంబుగాని ధర్మదాయా

దులు దొరకుట దుర్లభంబు, ధర్మంబు సహయు మపేక్షించునది కాదు. అశాశ్వతమగు దేహముల మతిమంతు లాస్థయొనరింపఁ దగదు. కావున నీ వీకంటకంబుతోడఁ బురంబునకుం బోయి మజ్జనకుండు నన్ను మఱచునట్లు హితోపదేశంబు లొనరింపుము. 79

క. వగవఁగ వల దని నొడువుము
యుగములు గతియించినను వియోగము మాన్పం
దగువారు గలరె? నిత్యం
బుగ మృత్యువు వెంట నంటి యొగియుచునుండన్. 80

వ. కావున జననమరణరాహిత్యంబునకై సన్న్యసించి యిక్ష్వాకులయందుఁ గందమూలాశనుండనై జీవయాత్రనడుపుదు నని పెక్కుభంగుల నుపదేశించు రాజకుమారుం గాంచి సంతాపవిక్లబుం డగుచుఁ జెన్నుం డి ట్లనియె. 81

తే. గీ. 'నరవరాత్మజు నొకనిఁ గానలఁ బంపి
చెప్పవచ్చితివా? యోరి! చెనఁటి' యనుచుఁ
జుట్టములు నన్ను బెనువంతఁ దిట్టుకొఱుఁ
బట్టణమునకు నిపుడేల పంపె దయ్య. 82

క. నామనము నాకు వశముల
గామికిఁ జింతింతు ఘోటకముతోడ నిసుం
గామించి ఘోరకానన
సీమకుఁ బంపం దలంపు సేయుమె నాకున్. 83

ఉ. దీపములేక పాడుపడి దీప్తిదొరంగిన యింటిమాడ్కి సు
వ్యాపితచంద్రబింబమయి యాఱడిపోయిన మింటిమాడ్కి నీ
ప్రాపును బాసి కీడ్పడిన పాడుతురంగముతోడ నేగతిం
బాపిని బోదు శాక్యపురపాలకుపాలికి రాజబాలకా. 84

సీ. తండ్రివేగతి వృద్ధుఁ ద్యజియింపఁగాఁదలం
చితివి ధర్మమును నాస్తికుఁడువోలె

వనిత నేగతిఁ బతివ్రత పీడి మఱపుఁగ్రై
కొంటు ముపకృియ కృతఘ్నుండువోలె
బాంధవం బేరీతిఁ బ్రాపుఁగోరినవారి
వదలితి యశము దుర్వ్యసని వోలె
దాది నేపగిది గౌతమిని వర్జించితి
నిందువిద్యను బ్రమత్తుండువోలెఁ
తే. గీ. జాపుపుట్టువు గల్గు సంసారచక్రి
మునకు భీతిల్లి యివి యన్నియును వదలఁగఁ
దలఁచితివి గాని నీదు పాదములె గతిగ
మనెడు నన్నెట్లు వర్జింప మనసు పుట్టె ? 85

క. అనుచుఁ బెనువంతఁ బడు చె
న్నుని గని శౌద్ధోదనియు మనోగతి ధైర్య
ప్రణయంబుఁ జేసికొని యి
ట్లనియెం గుతుకము విరాగ మనుసంధింపన్. 86

వ. పృథగ్జాతులగు దేహులయందు నానాభావంబు నియతంబని యెఱింగి తేని మద్వియోగంబునకు విచారింపకుము. ఎన్ని జన్మంబుల నెం దెం దఱతో నిట్టిసంబంధంబు లెన్ని యెన్ని వహించితిమో యెఱుంగుదువే. ఏను ముముక్షువై యి సన్న్యసించితిఁ గాని యిష్టబంధుద్వేషంబునం గా; దన్యోన్యవిపక్షులగు బాంధవుల నెన్నటికే నెడవాపుటకు మృత్యుదేవత వేచియే యున్నది; నాతోడ నిన్నుం గొంపోయిన ఫలంబు లేదు. నేను విజ్ఞానం బార్జించిన పిదప నందు నీకు నొకపాలొసంగువాఁడ నీ వీ తురంగంబుతోడం గపిల వస్తుపురంబున కరుగుము విచారింపకు మనికంటకంబుం గాంచి యిట్లనియె. 87

చ. అడలకు ముష్ణవారి నయనాంచలపూరిత మౌచుఁ జెక్కులం
బడి దిగజాఱ నాల్కదిగ వంచిపదంబులు నాకఁబోకుఁ గీ
ద్వడకుము నీకు నాకు ఋణబంధము తీఱెను నేఁటి కింక నీ
వడినపరిశ్రమంబు పరిపక్వఫలప్రదమౌ హరీశ్వరా. 88

వ. అనుచు శంఖచక్రగదాదిరేఖావిభ్రాజితం బగు చేలఁ బెన్నుసోఁకి ప్రాఁత
లంతయు నిమిరి నాయపరాధంబు సహింపుము మహాత్మ యనుచుఁ దెలిచ్చి
తనమేని సొమ్ములు దులిచి వేర్వేఱ సభినుతించుచుఁ జెన్నునిం గని
యిట్లనియె. 89

ఉ. ఈవలయమ్ము లెంతయును హెచ్చు లనం దగదే! ప్రశస్తసు
శ్రీ వెలుఁగొందు నీమణులచేరులు గాంచితె, పేరుచేల నా
నావిధభూషణంబు లివి నాకిదె మజ్జనకుండు పిన్ననాఁ
డీవు ధరింపుమీ యుఁడ మఱేటికి నాకిట సన్న్యసించితిన్. 90

క. ప్రాణమునకంటె హెచ్చిది
దీనిం దీసికొని వేగఁ దెరలిచను మటం
చానృపనందనుఁ డశ్వము
పై నెంతయుఁబేర్మిఁ జూపి పదపడి యనియెన్. 91

శా. చెన్నా! మజ్జనకుండు నాకయి కడుం జీర్ణించు శోకంబు నా
పన్నేరం డెటులేని శీఘ్రముగ నేపత్తున్ బరిక్షేయమై
యెన్నంగాఁ దగు వస్తువుం దెలిసి నీవీమాటలే తెల్పి త
ద్ధృన్నీరేజము సంతసంబుఁ గనునట్లై ప్లీని సంధింపుమా. 92

వ. అని యనిపిన వాఁడును గరధృతఖలీనం బగు కంటకంబుతోడఁ జన
లేక చనలేక వెనుకఁ జూచుచు రాజపుత్రుని చెయ్వుల కచ్చెరుపడుచు
వచ్చినత్రోవ యెఱుంగక కపిలవస్తుపురాభిముఖుండై చనియె. 93

మ. అటు లాచెన్నునిఁ బంపి చేరె నట సిద్ధార్థుండు స్వర్గంబు మా
అట నాఁ జెన్నగు బింబిసారుపురికిం బ్రాంతంబునందుం గుదు
ట్పటలీపక్వఫలప్రసూననిచయప్రచ్ఛాయధారాలల
త్తటరమ్యోన్నతరత్ననామకభృద్దర్యంతరాళస్థలిన్. 94

వ. ఇట్లు ప్రపంచపరమార్థజిజ్ఞాసాకందళితం బగు డెందంబున నమ్మాయా
దేవీనందనుండు సకలరాజ్యభారంబు పరిత్యజించి యతివేషమ్మున
నారత్నగిరి కెలంకులఁ దిరుగుచున్నంత. 95

తే. గీ. తమమునసుఁ బ్రాణిపోక కాంతలకు శోక
పదసుమాన్పించు నైకపాపపరిపాక
మాతులత్వవిలోలైకఘూకలోక
మేఁగుదెంచెను నలవోక వేగుఁబోక. 96

చ. తమి యను గోపకాంత భపథంబనుకుందను జ్యోత్స్న పేరి క్షీ
రములను దోడువెట్టి ఖగరావము కవ్వపుమ్రోఁతగా నిశాం
తమున దధిన్మథించి గళితంబగు వెన్నను ముద్దచేసి త
త్క్రమునకు మధ్యఁ జేర్చె ననఁగాఁ దగె వెన్నెల వేగుఁజుక్కయున్.

ఆ. వె. ఒడ్డు విఱిగి లోనఁబడ్డ గంగావారి
తిరుగఁ బంక మెడలి తేఱునాఁటి
చెలువు గలిగె వెన్నెలలకుఁ బ్రాభాతిక
ప్రభలు మెల్లమెల్ల బలియుకొలఁది. 98

క. మానితమగు వేసమునఁ గ
ళానిధియు నిశీథినీవిలాసినిని దమో
మానం బుడిపి కరంచిన
పానుపుపై వలువ యనఁగ భాసిలె నభమున్. 99

చ. పడమటికొండ లేటిచెలువ ల్తమమూతులు సాఁచి నాకఁగా
నుడుపతిబింబమందు నెలవుండిన యిఱ్ఱి సుఖించెఁ; బ్రాచియ
న్నడఁతుక భాస్కరప్రసవబాధకుఁ దాళక మూల్గుచుండెనా
వెడలెఁ గపోతహుంకృతులు వీనులకుం గడుసొంపు నించుచున్. 100

సీ. ఎంతవానికి వచ్చె నెంతదుస్థితి కటా!
యను వెరంగున వెల్లనయ్యె దెసలు
ఇవి రాజసుతులు చేయవలసినపనులు
గావు కావంచుఁ గాకంబు లఱచె
జగమునం దున్న యజ్ఞాన మింక నశింపఁ
గల దన్నపగిదిఁ జీఁకట్లు విరిసెఁ

దొలఁగు నీగతి సర్వమర్మతంబు లటంచు
నొడుపువోలిక ఁజుక్కలడఁగిపోయె
తే. గీ. దుష్టు లీగతి వాపోవుదు రనురీతి
నెవఁగె సుప్తోద్ధితకూర మృగరవంబు
జ్ఞాన ముదయించు నింక నీకరణినసనుచు
వింట నుదయించెఁ బిచ్చుక తుంటువేల్పు. 101

సీ. భూసురార్ఘ్యప్రదానాసివిచ్ఛిన్నమం
దేహారుణాస్యరక్తప్రదీప్తి యనఁగ
నుదయించుచున్న సూర్యుని నెమల్కొనఁబోవు
కమలినీగాఢరాగం బనంగఁ
జక్రవాకీ హృదబ్జమునుండి పైకి వె
లలిపాఱు శోకానలం బనంగఁ
బ్రసవవేదన పడు ప్రాచిపై దిగఁదుడ్చి
పాఱఁబోసిన రక్త నీరమనఁగ
తే. గీ. నబ్జవైరికి నిసికిఁ బెండ్లైనచోట
జంపతులకైన దేగాటసమయమందు
భూమిపైఁబడినట్టి బుక్కామనంగఁ
బొలుపువహియించెఁ జక్కఁగాఁ బూర్వసంధ్య. 102

చ. కలువలు నిద్రవోవ రతికాంతుఁడు తూపులు మూల వైవఁ జు
క్కలనడత్రోవ రక్తతరకాంతులఁ జక్కనగా పలాహకం
బులకుఁ గుసుంభచేలముల వోలిక రా వెలసెం జగంబు క
న్నులకు వచింపనేరని వినోదముగా నునుసంజ తూర్పునన్. 103

సీ. హరిహరబ్రహ్మల యాకార మగు వేల్పు
వేదత్రయీ స్వరూపోదయుండు
ఘూకైకదృష్టిసంకోచప్రదకరుండు
కోకకాంతల పుణ్యకోరకంబు

పద్మినీకాంతకుఁ బ్రమదమిచ్చు బొజుంగు
పంచేంద్రిందురూపులఁ బ్రిబలుజాణ
కాలపుంత్రిముఁ ద్రిప్పఁగలనేర్పు గలఱేఁడు
గగనలక్ష్మికి వింతగలుగుతొడవు
తే. గి. ఏకచక్రరథంబునఁ నేగుజోదు
చీఁకటులగొంగ కలువలసిరికి దొంగ
వేవెలుంగులదొర ప్రభవించె లోక
బాంధవుండగు నాస ప్తసైంధవుండు. 104

చ. తననిసి నేఁచఁబో నిరులు దయ్యముఁ దావ వదల్చి దాని ప
ద్మినివిపులం దళిచ్ఛలము మీఱఁ బగం దగిలించి లేచిపో
యినశశి కోపర క్తి నలినీంద్రకరాహతిఁ గ్రాఁగి వెల్లనై
మునిఁగె నపత్రపం దుదకు మూఁడిన యాపద వార్ధిలోపలన్. 105

సీ. నలినకుట్మలశయానమ్ము లైన మధువ్ర
తములు లేచి శుభధ్వనములు సేయఁ
బతులఁ గూడిన జక్కవలు విలాసరసంబు
తోఁ గృతజ్ఞతమై నెదుర్కొనంగఁ
జేదోయి నొదలఁజేర్చి భక్తులు శుభ
స్తుతులు వాడుచు నమస్కృతులు సేయ
వారాంగనానురాగారూఢి పగిది న
స్థిరమైన నీరెండ దెసలఁ బ్రాఁక
తే. గీ. నొక్కతేజినిగట్టి రయోద్ధతముగ
నొంటికా త్తేరు పిచ్చుకకుంటు దోల
అ స్తభూధరసందర్శనైకదృష్టి
భాస్కరుఁడు మింటితెన్ను న బైలువెడలె. 106

సీ. పద్మరాగప్రభాపటలిచేఁ బూయంగఁ
బడిన పోలిక నొప్పెఁ బర్వతములు

అరుణపల్లవచయవ్యాప్తంబులైనట్టి
పగిదిఁ బెంపెసలారెఁ బాదపములు
రక్తచందనసమాసక్తనీరంబుల
నియతిగాఁ బసరారె నిర్ఝరములు
శోణాంబరగాత్రిమ శోభాయమానంబు
లైన భాతిఁ దనర్చె నఖిల దిశలు
తే. గీ. తపనునారాధనము చేయఁదగినవస్తు
వులను సమకూర్చుకొనియె నీభూపురంధ్రి
యనఁగఁ దనరారె నివి యన్నియును దలంపఁ
బ్రబలి నీరెండఁ దిక్కుల బలియుకొలఁది. 107

వ. ఇట్లు జగద్బాంధవుండు సర్వలోచనానందకరంబుగా వెడలుటయు సర్వార్థసిద్ధుండును. 108

క. దండంబుఁ గావిచేల క
మండలువుం దైవమహిమ మార్గంబునయం
దుండం గని తనకై సుర
తండము పంపె నని వానిఁదాల్చి కడంకన్. 109

చ. వెడలిన చిత్రభానురుచివీచిపరంపర మేనిపై వెసం
బడుటయుఁ గాని తద్గిరికిఁ బార్శ్వమునుండియు రాజువీటికై
యడవిఁ గలట్టి యేకపదినారయుచుం గని వీడు సొచ్చి దో
సెఁడు యవలం గ్రహించె నొకయింటికి యేగి సముద్గిరంబునన్. 110

సీ. సరిగంచు నెఱిమించు చల్వవల్వలు దాల్చు
లలితుండు కావిశాటులు ధరించెఁ
బైఁడిపాత్రికలందుఁ బరమాన్నము భుజించు
రారాజు మాధుకరంబు గుడిచె
దూదిపాన్పులమీఁదఁ దూఁగుటుయ్యేలలూఁగు
భోగి తృణాంకురంబుల శయించెఁ

బొలుపాప క్రొత్తపూఁబొదరిండ్ల విహరించు
భాగ్యశాలి యరణ్యపటలిఁ దిరిగె
తే. గీ. నెండకన్నును వానకన్నెఱుఁగ కతుల
రత్నసౌధంబులఁ జరించురాచగున్న
శీతవాతాతపంబులవాతఁ బడుచు
బడుగు జడదారిరాయని పగిదిఁ దిరిగె. 111

వ. ఇట్లు సన్న్యసియై ప్రతిదినంబును రాజగృహపురంబునకుం బోయి యొక్క గృహంబున యాయావరంబుఁ గొనుచు రత్నగిరిగుహాము ఖంబున వసియించుచున్నంత నటఁ గపిలవస్తుపురంబున. 112

తే. గీ. తన్ను వంచించి పతి నిశీథమ్మునందు
నెచటి కేగుటయును నిద్ర నెఱుఁగనట్టి
సతి యశోధర యెప్పటిచందమునను
పేగుఁబోకకు మేల్కాంచి వెఱఁగుపడుచు. 113

సీ. జగమెల్ల సుప్రకాశము చేయఁగాఁజాలు
చంద్రుఁ బాసిన యాకసంబుమాడ్కిఁ
బనివానితనము తోఁపఁగ బిగించిన రత
నంబు జాఱిన వలయంబు పగిదిఁ
బ్రతిబింబమును జూపు పటిమంబుగల మించు
తళుకు గోల్పడిన యద్దంబు భాతి
నెంతైన విలువ చేయింపింపఁజాలు నీ
రంబుఁ గోల్పడిన హీరంబు రీతిఁ
తే. గీ. ప్రాణనాథుఁడు లేని తల్పంబు చూచి
'కలలు నిక్కలలా ? యంచుఁ దలఁచు నాకు
నేఁడె సిద్ధించె నీనాఁటి పాడుకల ఫ
లం' బనుచు నెంచి గుండియ ఝల్లురనఁగ. 114

క. చెలులఁ బిలిచి యడిగిన వా
రలు 'మేము నెఱుంగ' మనుడు రమణీమణి య

గ్గలమగు శోకభరంబున
నలమటఁ గొని మగుడ ధైర్యమంది వదలెన్. 115

క. మందురలోనికిఁ జని యం
దుం దురగము లేక యుంట తోట్తోడ నతఁ
డెందేని జనుట యెఱిఁగిం
పం దారుణదుఃఖభరము పరవశఁ జేయఁగా. 116

శా. సంసారంబు పరిత్యజించి యెటకే సన్యాసిగాఁ బోయె రా
ద్ధంసంబంచును నిశ్చయించుకొని యాయబ్జాక్షి మూర్ఛిల్లె: సు
త్తంసీభూతములైన పూవు లుపర్యత్యం బాత్మలోనెంచి మే
హింసం బెందక యుండఁ దల్పగతిఁ బెండె న్మెల సల్పప్రిరక్షలన్. 117

క. కర్ణాకర్ణికగా నా
కర్ణించిరి పౌరులెల్లఁ గలగతి, సతియు
ఘూర్ణమున నుండ నృపసుత
పూర్ణశశాంకుండు లేచిపోయె నటంచున్. 118

తే. గీ. చంద్రుఁ డస్తావనీభృత్తు చాఁటువడిన
కాలమున భంగములు గను పాలకడలి
రీతిగా నల్లకల్లోలమై తనర్చెఁ
గపిలవస్తుపురంబు తత్కాలమందు. 119

వ. పిదప శుద్ధోదనుండును దదుదంతంబు సేవకముఖంబుగా విని సహా
మాత్యపురోహితుండై కుమారాంతఃపురంబు నొచ్చి యచ్చటి కావలి
వారల నడిగిన వారును గుమారబహిర్గమనంబున కచ్చెరుపడుచు
నిట్లనిరి. 120

శా. ద్వారంబుల్ బిగియించి యున్న వెటు లీప్రాకారముల్ దాఁటెనో !
యేరీతి న్మముఁ గన్మొఱంగి చనెనో ! యేమందు మోదేవ ! దై
వారంభంబుల కడ్డులే దనుట సత్యంబయ్యె ; నాకాశసం
చారంబుం గొని యేగె నంచు మదిలో శంకింతు ముర్వీశ్వరా. 121

వ. అనప్పుడు శుద్ధోదనుండును నమానుషకృత్యంబుగాఁ దలఁచుచుఁ బురోహితామాత్యుల వంకకుం జూచి "మీరిరువురుం దగినపరివారంబుతో సకలదేశంబులు వెదకి కుమారుం దోడ్కొని రండు, మీవచ్చువఱ కేను నన్నపానంబులు విసర్జించి యీశ్వరాలయంబునం దగినబల్యాదిశాంతికక్రియ లొనర్చు చుండు" ననిన. 122

క. వారుం జనిరి నృపాలకు
మారాన్వేషంబునకు సమస్తదిశలకున్
ఘోరారణ్యంబులకు న
మీరజపంబులగు హారులమీఁదఁ గడంకన్. 123

తే. గీ. ఒడ లెఱుంగక మూర్ఛిల్లియున్న యయ్య
శోధరనుఁ దెల్విరా నంత సుదతులెల్ల
నూఱడించిరి మది తాల్మి నొసఁగించి
పడునవస్థకుఁ దగిన సంభాషణముల. 124

సీ. నృపతి యనుప్పిన యమాత్యపురోహితులు తోడి
కొని రాకయుండురా యనెడివారు
శాక్యవంశం బింక నశియఁగఁ గాఁబోలు
నంచు లోలో విలపించువారు
వింత తండ్రియె కాని యితఁడు రేపో నేఁడో
మరలివచ్చునటంచుఁ గెరలువారు
నఖిలరాజ్యమువీడి యకట సన్న్యాసి కాఁ
బోవునే యని మదిఁ బొక్కువారు

తే. గీ. అతిసుకృతవంతుఁడైన శాక్యనరపతికి
రాఁదగినయట్టి దురవస్థ కాదటంచుఁ
జెనఁటిదైవముచేఁత దూషించువారు
నైరి యాబాలగోపాల మఖిలజనులు. 125

వ. ఇట్లు కపిలవస్తుపురం బల్లకల్లోలంబుగాఁ గుమారవిరహాయాసంబున నన్నపానాదులు మఱచి చింతించుచున్న దివారాత్రంబు లెఱుఁగఁబడ

వంత నిత్తదివసంబులు గడచె; నట్లు రాజకుమారునిచే నంటఁ గొనువఁ బడిన యా చెన్నుండు. 126

క. మును పోక నిముసంబున తే
గిన మార్గము మిగుల వంతఁ గిన్వాడుచుం దా
నెనిమిది దినములకు న్నడ
చెను తురగఖలీన మొక్క చేతం గొనుచున్. 127

ఉ. పూరియు ఖాసము మాని తరపూర్వముగా నకిలించుచుం దదా
కారము లోఁ దలంచుచుఁ గొఱాకఱము వాసినమోము సారెకు
న్వారెకుఁ దత్తపోవని దెస న్నిగుడించుచుఁ దెరె సాంబితో
వారువ మక్కపట్టితనబలంబున నొప్పు పురంబులోనికిన్. 128

సీ. కలనైన జంతుహింసలఁ దలంపనివాఁడు
వేఁటాడఁ బోవునే విపినములకు ?
మున్నురాజ్యం బేనియును నొల్ల ననువాఁడు
వెడలునే రిపురాజ్యవిజయమునకు ?
నందంపు మేడలయందు వర్తిలువాఁడు
వసియించునే రిక్తవసతులందుఁ ?
తలిదండ్రులందు మెత్తనిబత్తి గలవాఁడు
రాకుండునే యిన్ని రాత్రులకును ?
తే. గీ. ననుచుఁ బలుపలువితముల నాడుకొనుచుఁ
దొలఁగుకన్నీరు వెక్కరాల్పులుగ సాచి
కరధృతఖలీనమగు కంటకంబుఁ జూచి
పౌరులందఱు నొకపెట్ట బారు మనిరి. 129

వ. అంత నారాజపుత్రవిరహితంబగు కంటకంబు రాక యొకరి యొకరంబున నొకరువిని. 130

తే. గీ. వెనుక రాఘవు నడవి కంపించినట్టి
స్యందనము వెంట సాకేతజనము పగిది

"రాజపుత్రకుఁ డేమాయెరా" యటంచు
నడుగుచును సాది వెనువెంటఁబడిరి జనులు. 131

తే. గీ. "ఏరికేనియు నపకారమెన్నఁడేనిఁ
జేయఁ దలఁపేనిఁ బుట్టని సిద్ధమూర్తి
దేవతాసన్నిభుండు వర్ధిష్ణు వతని
నెచట వసియింపఁజేసితివేమి చెపుమ" 132

మ. అనుచుం దన్నతితండ్రిమై నడుగుపౌరానీకముం జూచి 'హా!'
యనుచుం జెన్నఁడు గద్గదస్వరముతోడై మాట తొట్రిల్లఁగా
'మనరాచూలియె కంటకంబు గృహిధర్మంబు న్ననుం గూడ వీ
డెను దాఁ జీపులు తూఱరాని వనవాటిం గూర్చిచిత్తంబునన్.' 133

ఉ. నాపుడు నెట్టకేలకు మనంబులు కుర్రింగఁగ వానిపల్కు ల
ట్టే వినినట్టి పౌరులు పెటిల్లు మనన్ హృదయంబు వ్రయ్యలై
పోవఁగ మూర్ఛ చెంది పడిపోయిరి; తక్కిన పౌరు లట్ల వా
పోవుచు వానివెంటఁ బడిపోయిరి శూన్యతరేంద్రియంబుగన్. 134

ఉ. "ఎచ్చోటు రాజసూతి వసియించిన దయ్యదియే పురంబు సు
మ్మెచ్చట రాజసూతి వసియింపని దయ్యదియే వనమ్ము మా,
కెచ్చట నుండెనో యిచటి కేదెస పోయెద" మంచు వేడఁగాఁ
జొచ్చిరి దారికడ్డమగుచు న్మతిలేనిగతిం దురంగమున్. 135

వ. ఇట్లు సముద్రంబు వెల్లివిరిసినగతిఁ దండోపతండంబులుగా నిండిన పౌరమండలం బెడమీక యుండు రాజమార్గంబునం బోవుచుండ గవాక్షమార్గంబులు తెఱచి. 136

తే. గీ. రాఁగలం దనునాస నిరాశగాఁగ
రాజపుత్రుండు లేని వార్వమును జూచి
యట్టె వాపోవు తరుణుల యాననములు
పట్టపగలింటి చంద్రులభాతిఁ దనరె. 137

చ. తనయుఁడు రాఁగలందులకు దైవగృహంబున నొక్కదీక్ష గై
కొని తపమాచరించుచు సగోత్రులతోడఁ బురోహితుండు చె

ప్పసగతి శాంతిక్రియలు వేయువిధంబులఁ జేయుచుండె వ
ల్వని మెయిమంత్రితోఁ గపిలవస్తుపురిం బ్రముఁడు ఖిన్నచిత్తుఁడై. 138

క. తన తేనిం బగ అనిఁజం
విన వాజిం గొంచు పాది పిటికిఁ జనుదెం
చినగతిఁ గన్నీ రొలుకుచుఁ
జనియెం జెన్నుండు రాజసద్మంబునకున్. 139

వ. ఇట్లు రాజగృహంబుఁ బ్రవేశించి కంటకంబు స్వనాధిష్ఠానంబునం గట్టి పెట్టించినంత నదియుం బృష్ఠదేశంబు నదల్చుచు రాజపుత్రవిరహవేదనా సూచకంబుగ బిట్టు సకిలించినఁ బదారాపంబునకుం బంజరస్థంబులగు శుకపికపారావతాదిపక్షిగణంబులయుఁ బక్కనున్న హయంబులయు హాహా రవంబులు విని యంతిపురిపాలికలు తమ కాంతుండు చనుదెంచె నని వచ్చి యతిప్రహర్షంబు దుఃఖంబుగాఁ బరిణమింప మూర్ఛిల్లిరి. 140

చ. తొలకరివారివాహములతోయము వెల్వడి మెఱుఁగు దెంచు చం
చలలతలంగనం గృహము చయ్యన వెల్వడి చెల్వలందఱున్
బిలబిల నేగుదెంచి ధరణీపతిసూనుని గాఁమి మోములన్
వెలవెలఁబాఱి మూర్ఛిలిరి వేఁడికిఁ గందినతీవ లట్లుగన్. 141

చ. బుడుత నరేంద్రుఁ డిట్లు దలిపోయినదాదిగ సంస్కరింపమిం
జడముడి వీడిపోయియును జందిరరేకలు కన్నుమూసియున్
గడిఁది వెడంద కన్నుఁగవ బాటుక మాసియు నందమైన యు
వ్వడఁతుల మోము లన్నియుఁ బ్రభాతసితోత్పలకాంతులం దగెన్. 142

సీ. సహజారుణములైన చరణంబులకుఁ బాసి
దొరలు బంగారునూపురము లొకట
నచ్ఛంబులగు చెక్కుటద్దంబులకుఁ బాసి
గళితంబులైన కుండలము లొకట
గుత్తంబులైన పక్షోజంబులకుఁ బాసి
భ్రష్టంబులైన హారంబు లొకట

నంపంబులైనట్టి హస్తంబులకుఁ బాసి
స్ఖలితంబులైన కంకణము లొకట
తే. గీ. సైరతంబుల కెనయైనజఘనములకుఁ
బాసి జాఱిన మొలనూలత్రివణము లొకటఁ
బడఁగ విలపింపసాగి రప్పడఁతులెల్ల
మేల మాఁటోతు విడిచిన యాలపగిది. 143

మ. ఆసనింబాసిన నాఁటఁగోలెఁ గడువాత్సల్యంబుతో నెత్తి పెం
చిన యా రెండపరాజపత్నియు శితాసిచ్ఛిన్నమైపడ్డ లే
యనఁటింబోలెఁ బడెం గుమారవిరహాయాసంబుచే లేఁగకుం
దనపుం గూడికలేని యావుగతి పత్నా యంచు వాపోవుచున్. 144

తే. గీ. తొలఁకుఁ గన్నీరుగల వెలందుకల యాన
నముల కతమున నా రాచ నగరమపుడు
వానచినుకులు రేకులపైన జాఱు
తమ్మిపూలున్నకొలను చందమునఁ బొలిచె. 145

చ. ఎడపఱి చందిరంబులయి వృత్తములై పొలకండగట్టి క
న్పడని సరంబులున్ నగలుబాసిన వ్రేఁకలు గ్గలు చేతులం
బడఁబడ తొమ్ము బాఁదుకొను తామరసాక్షుల రీతిఁజూడఁ జొ
ప్పడెఁ బవమానధూతనిజపల్లవతాడితవల్లికాకృతిన్. 146

తే. గీ. మారుతాహతకమలకుట్మలశయాన
చక్రిమిథునంబులైన నిర్ఝరిణులట్లు
పరఁగి రిరుగేల తొమ్ములుబాఁదుకొనుచుఁ
గచలు చన్గవకలిగిన కాంతలపుడు. 147

వ. ఇట్లంతిపురివారంబఱు వందురుచుఁ జింతాక్రాంతలై మందిరంబులు
విడిచి మందురకడ కరుదెంచి కంటకంబుం జెన్నునింగాంచి పరిపరి
విధములఁ గుమారుని వృత్తాంతం బడుగుచున్నంత నాయశోధరయు.

సీ. కుచములమీఁది కుంకుమపూఁత బురదగాఁ
గరఁగించి కన్నీరుకాల్వ గట్ట

నిష్కారణక్రోధనిర్వాహకము లైన
కొలికికన్నులు సల్లఁగ్రుమ్మరింప
వెనుదీయఁగారాని వేఁడినిట్టూర్పుల
వలుద చన్నుందోయి వాడువోవఁ
బొంగుపొంగునవచ్చి పొరలు వల్వనివంత
గదియించి కంఠగద్గదికఁ జూపఁ

తే. గీ. కంపమునఁ గాలుచేయు గద్గద పడంక
నిమున మైనను నొకచోట నిలువలేక
కాంత లందఱు విలపించు కడకువచ్చి
కంటకముఁగాంచి యిట్లనెఁ గరుణ మొలుక. 149

తే. గీ. ఒడ లెఱుఁగని నిద్రలోనున్న వేళఁ
జనియె నాప్రాణనాథుండు నను మొఱఁగి;
యీవుఁ జెన్నుండు వచ్చితి. రేలరాఁడు
నాప్రియుఁడు చెప్పుమమ్మ ? కంటకముకాన ! 150

చ. నడినిశఁ బాన్పుమీఁదఁ గరుణామయుఁడై నిదురించువాని రా
బుదుతను బుద్ధిలే కడవి మోకలపా లొనరించి వచ్చియుం
బుడిబుడియేడ్పు లేడ్చుచును బొంపిరివోవు విచార మున్నటు
త్తడివలె నిత్తఱిం బ్రతివదంబును బొత్తును మోసపుత్తువే. 151

క. పతియెడ విశ్వాసముగల
మతిగలదానవని నిన్ను మన్నించితి దు
ర్మతి నెచటికిఁ బంపిన సం
గతియును నాతోడఁ జెప్పఁగదవే వాజీ. 152

క. సకిలింపకు కన్నీరిఁకఁ
బ్రకటింపకు నీదుకోర్కె వందెంగద ! నా
యకునెడపితి వింతటి కం
టకమా ? నామీఁద నక్కటా, కంటకమా ! 153

ఆ. వె. తెలివిలేని స్నేహితులు గల్గుటయకంటెఁ
దెలివిగల్గు శత్రుకులము మేలు
మిత్రరూపమైన శత్రువవై శాక్య
వంశ మంతరింప వచ్చితీవు. 154.

చ. అవిరతబాష్పపాతిగమితారుణభావములైన కన్నులున్
రపణము లుజ్జగించి నునురాణపుఁ బాసినమేనుఁ గల్గునీ
యువిదలు నీకతంబున నలోయని యేడ్చుచు భర్తయుండియున్
భవుఁడు గతించియుండిన యనాథల చందముఁ బొంది రర్వమా. 155.

చ. మగటిమి లేని యీతెలివిమాలిన కృత్యముఁ జేసి యిప్పు డి
ప్పగిది నరేంద్రసద్మ మద్రువస్ నకిలించిన నేమిలాభ? మ
మ్మగల విభూషణంబు ధృతిమంతునిఁ దోడ్కొని పోవువేళ నీ
మొగమునమల్లినాటెనె ప్రబోధమొనర్పకపోతి మమ్ములన్. 156.

క. తెలివలుఁ బరిచారికలం
దొఱుఁ గూర్కినవేళ నామనోరథమును నొ
ప్పరికించి ద్రుచ్చిలఁగ నే
ర్తెఱ నీమది కెట్లు సంఘటిల్లెను బాబా. 157.

క. అని యిట్లు గుల్లుముంగని
రనికర ముట్టిపడఁ బల్కఁగాఁ జెన్నుం డ
వ్వనితామణితో నిట్లని
వినిపించెం గతము వినయవినమితముఖుఁడై. 158.

ఆ. వె. నేను గంటకమ్ము నిందింపఁగాఁ దగ
దమ్మ! కేవలము నిరాగసులము
ప్రభుపుదెసఁ గృతజ్ఞభావంబు గలవార
మఘముఁ జేయనోపమమ్మ! యెపుడు. 159.

క. అద్దమరాతిరికడ నా
యొద్దకుఁ జనుదెంచి తేజినొగ్గుమటంచున్

మద్దేవుఁడు పల్కఁగ నే
మొద్దుగతిన్ మాఱునుడి మొఱ్ఱిడనైతిన్. 160

వ. పదంపడి వల దని నాకుం దోఁచిన పల్కులు పల్కినను వినని యమ్మహారాజు శాసనం బుల్లంఘింపఁ దగ దని యెంచి నైపథ్యంబుం జేసి తురంగమునుం బాయితంబుఁ గావించితి. నదియు విశృంఖలంబుగా ఖురంబులం బుడమి నదల్చినను హేషస్వనంబుల నాకాశంబుఁ బూరించినను దదారావంబులు దైవబలంబునం జేసి యెవ్వరికి నవిశ్రుతంబు లయ్యె నంత నారాజపుత్రుండును. 161

శా. ఉల్లాసంబునఁ దేజినెక్కి సుర లోహో యంచుఁ బైఁ బుష్పముల్
చల్ల, న్నే నొకచెంతఁ బోవఁగ, ఖురన్యాసంబు లేనంత ను
వ్వల్లీలం ద్రుటిలోనఁ జేరె నొకగాఢారణ్యదేశంబు : నా
తల్లీ ! యే మని విస్మరింపఁగలఁ దద్దైవప్రభావమ్ములన్. 162

చ. పదపడి మేనఁ గల్గు తనబాహువులన్ మొదలైన సొమ్ములన్
విదలిచి నాకొసంగి యటవిం జనుచు న్నసుఁ జూచి పల్కె "నే
వదలితి నోరి ! యింక గృహివర్తనము, న్నినుఁ, గంటకంబునుం
బదిలముగాఁగఁ బొం" డనియె, మాటలవెంబడిఁ గన్నులం గ్రుచున్.

వ. అని తదీయ భూషణవ్రాతంబుఁ బైఁబెట్టిన నత్తలోదరి యుత్తలపాటు మాని తత్ప్రభావంబున కచ్చెరువందుచు నస్స్వప్నం బయ్యె నని నిశ్చయించి; రంతఁ జిరకాలపరిపోషణానుయాత ప్రేమావేశంబు మరల్ప లేక గౌతమి యనురాజపత్ని యిట్లు విలపింపం దొడంగె. 164

ఉ. నీలములై సమంబు లయి నిగ్గులుదేఱి దళంబులై పృథు
గ్మ్మలములైన నీకురులను న్నృపనందన ! మంచి గందపుం
దైలము రాచి దువ్వి పువుదండలు దాల్చి మేలుసేయఁగాఁ
బోలును గాని యిప్పగిది ముండనముం బొనరింపఁ బోలునే. 165

ఉ. మేలికడానిఁ బోలు నునుమేని హొరంగు, వెడందఱొమ్ము, మో
కాళుల కంటు చేతులచొకారము, సింగమువంటి లావునుం,

గిల నడంచు కుత్తుకయు, గిత్తకనుంగవ వంటి కన్నులుం
గ్రిలు నరేంద్రసూతి కఁటరా! విధి వ్రాసె వనప్రచారముల్. 166

తే. గీ. నీవు పోర్రివంగఁదగిన పున్నెంబులేమి
వసుధ నిక్కము దురదృష్టవంతురాలు
జగతి నెంతటి పున్నెంబు సలుపకున్నఁ
బ్రజకు దొరకునె నీవంటి రాజు కొడుక! 167

చ. హిమరుచిఁ గేరు గోరులును వృత్తములై తగువ్రేళ్ళు గూఢగు
ల్ఫములును లేఁత కెంజిగురు వంటి మృదుత్వము నిప్పపూవుతో
సమమగు నాకృతు ల్గలిగి సర్వనరేంద్రనతంబులైన పా
దములు సహించునే యుపలదంతుర ఘోరవనప్రచారముల్! 168

క. కులమును వయసును రూపును
బలమును దేజమును బాహుపాటవమును లోఁ
దలఁచిన నీఁదగు నీకుం
గలనైనను బిచ్చమెత్తఁగాఁదగు నయ్యా? 169

తే. గీ. సర్వశృంగారితంబైన సౌధమందుఁ
బఱపుగద్దియ మంచంబుపై సుఖించు
రాజసము గల్గునీమే నరణ్యమందుఁ
జలికి వానకు నెండకు సైఁచునయ్య? 170

తే. గీ. అనుచు నెత్తిగ్గి బిట్టురోదనముఁ జేయు
గౌతమిం గని తక్కిన కాంత లెల్లఁ
దుందిలచ్యవమానమరందబిందు
భరితకుసుమంబులైనట్టి వ్రతతులైరి. 171

తే. గీ. చక్రవాకంబుఁ బాసిన చక్రవాకి
పగిది సారెకు గద్గదస్వరము తోడ
గౌతమీరోదనంబునఁ గడుపు పగిలి
మరల విలపించె నాయశోధరయు మిగుల. 172

తే. గీ. అగ్నిసాక్షిగఁ బరిణయమాడినట్టి
ధర్మపత్నిని వదలిన తపము తపమె ?
ధర్మమునఁ గామమునఁ దాఁటఁదగ దటంచుఁ
బలుకరే మున్ను పెద్దలు ప్రాణనాథ ! 173

క. మీవంగడంపుఁ దొల్లిఁటి
భూపతులను వినవె ? రాజ్యమును విడిచి యర
ణ్యావాసముఁ జేయంగాఁ
బోవుతఱిన్ సతులతోడఁ బోయి రనుటయున్. 174

శా. శ్రౌతస్మార్తములైన కర్మముల భార్యాయుక్తుఁడై గేస్తు దీ
క్షాతంత్రింబు లొనర్పఁ బాడి యని శాస్త్రంబుల్ విధింపన్ భవ
చ్చేతం బెట్లు ననుం ద్యజించె గుణరాశీ ? నాకు రా మానునే,
నీతో నుండని యంతమాత్రిన భవన్నిష్ఠాతపోలాభముల్ ? 175

చ. తెలిసినవాఁడ వౌదువు, సుధీమణి వౌదువు ధర్మచింతయుం
గలిగినవాఁడ వౌదువు, మనఃప్రియకృత్యుఁడ వౌదు వైన నా
తలఁపునఁ గల్గుసందియము దాఁపక చెప్పెద ; నింద్రలోకమం
దలి సిరిఁబోఁడ్ల చెల్వముఁ గనం జనినాఁడవు ప్రాణనాయకా ! 176

తే. గీ. అప్సరస్స్త్రీల సౌందర్యమరయ నింద్ర
లోకమేగితి వంచు నాలోచనంబుఁ
బూనఁ దగ ; దేల యన, వారలైన నస్మ
దాదివనితలకంటె సౌందర్యవతులె ? 177

క. తపమున కేగితి వనునొక
నెపమును నీయెడ విచారణీయంబు చిరా
దుపచితమగునాయందలి
కృపయుం బేర్మియును నేవగింపందరమే. 178

క. త్రిదివోపభోగముల నా
మదిఁ గోరఁబోదు సులభమార్గం బగుటన్

బడిపేలకుఁ గోరెద నీ
ముదిత నగుట నెన్నిజన్మములకేని సఖా. 179

సీ. తమ్మిపూరేకుచందము గల్గి చెవి దాఁకు
వెడఁదకన్నుం దోయి బెడఁగు తోడ
నిండుజాబిల్లి వెన్నెలవంటి చిఱునవ్వుఁ
దొలకించు కెమ్మోవి కులుకుతోడఁ
గొదమచందురుఁబోలెఁ గోమరారుకుదురైన
చదురు గల్గిన సొగనుదురుతోడఁ
గండుఁదుమ్మెద ఱెక్కగమి చెల్వమును బిల్వ
సొగు నూనూఁగుమీసములతోడఁ

తే. గీ. జక్కఁదనమున కిక్కయై చంద్రబింబ
మునకు సహపాఠియైన నీమొగము నింకఁ
బడయనేరని పరమనిర్భాగ్యురాలి
తనము సేయునె దయమాలి తమ్మిచూలి ? 180

ఉ. భాసురశీలునిన్ మగని భావజతుల్యవిలాసరూపవి
న్యాసుని బాసి యీసరణి నాకు ఘటించిన శోకవహ్నికిం
బాసటగాఁగ నామనము బ్రయ్యలు గాక మఱింతఁగాలఁగాఁ
జేసెను రాతనో, యినుము చేతనొ ? ధాత దయానుపేతుఁడై. 181

మ. అనుచున్ మూర్ఛిలు నేడ్చుఁ బ్రేలు వితతాయాసంబునం బొక్కు 'హా'
యనుఁ, 'గట్టా మగవారికిం గరుణలేదా ?' యంచు యోజించు, 'న
న్ననదం జేసితె దైవమా ?' యను, 'దయాస్వాంతుండు గా కెంతలో
మనముం ద్రిప్పఁగనేర్చెనో !' యను, 'మహాత్మా ప్రోవరాదా !' యనున్.

చ. కలికితనంబుఁ బాసి యిటు కంటికి మంటికి నేకధారగాఁ
గలవరమందుచున్న నృపకాంతను గన్గొని చెంతనున్న కాం
తలుసు మఱింత గద్గదఘనంబుగ నూరడఁ బల్కి రేడ్చుచున్
దొలకరివాన తాఁకుఁగని తూలిన తమ్ములఁబోలు మోములన్. 183

ఉ. ఓడన ముజ్జగించి దగయున్ విడనాడి సుతుండు రాఁగ శు
ద్ధోదనుఁ డెంతయుం జపము హోమము సేయుచు దేవళంబునం
గాదిలిచూలి రాక తన కంటకముం దనసాది నింటికిం
బోఁ దరలించె నన్న నుడి వొల్పుఋచు న్విని నేల మూర్ఛిలెన్. 184

వ. ఇట్లు మూర్ఛిల్లి కొంతతడవునకుఁ దెప్పిరిలి యొనర్చుచున్న పూజా
పురస్కారంబులు మఱచి చింతాక్రాంతకాంతాళియుతంబుగఁ గంటకం
బుం జెన్నుఁడు నున్నచోటికిం బరివారపరివృతంబుగఁ జని యాచె
న్నునివలనఁ గలతెఱం గెఱింగి దైవవశంబునకుఁ జింతించుచు వంశ
క్షయంబునకు వందుచు నున్నంత నారాళవాజివలన యశోధరాగర్భం
బున నొక సుతుం డుదయింపఁగలఁ డను పలుకు జీవితాశలఁ బుట్టింపఁ
దత్కాలంబు ప్రతీక్షించుచుఁ గపిలవస్తుపురంబున నుండె; నచట
రాజగృహపురంబున. 185

చ. ప్రతిదినమట్లు భిక్షకయి వచ్చు యతీంద్రు మహానుభావయో
గ్యతలను బౌరకామినుల కందఱకుం దగఁ దెల్పు ధ్యానని
ష్ఠత గుఱిచూపు నేత్రములసౌష్ఠవముం భగవద్ఘనాంశర
క్షితనవరోచిరాగమవిశిష్టమనోహరవస్త్రభాగమున్. 186

ఉ. శాటిక గన్నులద్దుకొని చాఁగిలి మ్రొక్కుఁ దటంచుఁ బుత్రులం
బోటులు కొంద ఱంపి యతిపుంగవునిం బ్రణమింపఁజేతు; రే
నాఁటికిఁ జేటురాకునికి నారులు కొంద ఱొసంగుచుందు ర
వ్వీటికి వచ్చువేళఁ గనుపెట్టితమంతటఁ దాము భిక్షమున్. 187

మ. పురకన్యల్తము పెట్టిప్రాయపు సురూపు ల్వచ్చి కాంక్షించినన్
చిరకాలంబుననుండి డెందమున కా చెల్వంబు సంధింప, ర
ట్టిరు బిచ్చమ్మున కప్పురిం దిరుగు శాటీధారునిం జూచి సుం
దరుఁ డంచుం బతిఁగాఁ దలంతు రట! తత్సౌందర్య మింతింతయే.

శా. చిత్తంబెంపునఁ బేర్మిగౌరవమునం బల్మాఱుఁ దన్నుం దదా
యత్తత్వంబునఁ బూజసేయు పురకన్యాసంఘముం జూచి త

చ్చిత్తం బేకగతిం జలింపకయ భాసిల్లుం జగద్వంద్యసం
పత్తిం బొందుట కేమియబ్బురము తద్వైరాగ్యధారాలతల్?

క. ప్రత్యహ మీతెఱఁగునఁ ద
త్రత్యచిరంటీటనైకదత్తయవగ్రా
సాత్యంతవారితక్షు
త్కృత్యుండై మరల రత్నగిరి దరికరుగున్. 190

సీ. అశనాయ నిరసించి యాహారములు త్యజిం
చి శరీరము కృశింపఁజేయువారు
రక్తమాంసంబుల రహిమించు దేహ మా
త్మకు విరోధియటంచుఁ దలఁచువారు
మనమున నెద్దియో మనన చేసెడిభంగిఁ
దెలుపు దైన్యంబునఁ గలఁగువారు
మాంసము జ్ఞానసంపత్తికై బాధింపఁ
దగిన వస్తువటంచుఁ బొగులువారు
తే. గీ. జైనయోగులఁ గొందఱ నవనిధరద
రీముఖంబుల నుండువారిని మహాత్ము
లైనవారినిఁ గనియె నొకప్పు డచట
నట్టిటుఁ జరించు శుద్ధోదనాత్మజుండు. 191

క. అవయవములు కృశియింపం
జివికినకీళ్లాలయ రెండుచేతులు జోడిం
చి వినుదెస మొగంబగు యో
గివరులఁ గనుఁగొనియె నొండు కెలన వతఁ డొగిన్. 192

సీ. ప్రేగులు మడఁచి కేల్బిగియింప నఱచేత
గోళ్లుఁదూఱినవారుకొంద, ఱాయ
సములైన సూదుల నమరు పావాలపై
నడుగుల నెలకొల్పి నడుచువారు

కొందఱు, వాఁడిరాల్గొని ముఖోరూరస్స్థ
లముల మోఁదికొని గాయములు సేసి
కొనువారు కొందఱు, గొంతునఁ బాములఁ
దగిలించుకొని కేళినెగడువారు

తే. గీ. కొందఱు, శ్మశానమందున్న శవవసనంపుఁ
జేలికల మెడ ధరియించి పీనుఁగులను
జేతు లరచాఁచి కౌఁగిలించికొనువారు
కొంద ఱెదురైరి యారాజనందనునకు. 193

వ. మఱియుం గాయమ్ములఁ గంటకంబులు గ్రుచ్చుకొనువారును శివశివా యని యఱచువారును దండులమ్ములు జొన్నలు మొదలగు పదార్థమ్ములు చేఁదగు వనపత్రములతోఁ గలిపి నములువారును నయనమ్ములఁ గంటకంబులఁ బొడిచికొనువారును నాలుకలు తెగఁగోసికొనువారును గాళులు బంధించుకొనువారును గర్ణంబులందుం జెవిటితన మాపాదించుకొనువారునైన యోగుల ననేకులఁ గాంచి వెంబం బాశ్చర్యరసనిమగ్నుం బగుడు నికటమ్మునకుం జని యందొకవృద్ధుం గాంచి సర్వార్థసిద్ధుం డిట్లనియె. 194

మ. బహుకాలమ్మననుండి యీగిరిదరీభాగమ్ములందుండి స
న్నుహానంబుం బొనరించుచుంటి ఘనవిజ్ఞానాప్తికై మీరు నీ
గుహలో దేహము గాసిపెట్టుటయుఁ గస్గొంచు న్మునీంద్రా! మనం
బహహా! నొందఁగఁ జేయుచున్నవిట మీయారబ్ధదుష్కృత్యముల్. 195

క. మానవదేహము కడుదుః
ఖానుభవం బనుభవింపనగునది, మీర
ద్దాని మఱియింత దుఃఖర
సానుగత మొనర్పఁ బాడియగునె మహాత్మా. 196

క. అని పల్కిన సిద్ధార్థునిఁ
గని తన్ముఖరోచిరాప్తిఁ గనుఁగొనుచు మహా

త్మనిఁగా నెఱింగి యిట్లని
యెను మెల్లన యోగివరుఁడు మృదువచనములన్. 197

ఉ. "ఇట్టి శరీరము న్మిగుల నీగతిఁ గష్టముపాలు సేయుటం
బట్టి పరంబున న్నరకబాధల నన్ని సహింపవచ్చు నాఁ
దట్టిప్రయాసము ల్మనకు నబ్బఁగఁజేసెడి వేల్పు లబ్బురం
బుట్టిపడంగ నేఁడ మన కొయ్యననిత్తురు పుణ్యలోకముల్. 198

క. బాధించినఁ గాయము వసు
బాధలు మానవుల పాపపటలం బడఁచున్
బాధ యనుకొఱవిఁ బడిన సు
ఖాధికలోకముల కాత్మయరుగుం బిదపన్. 199

తే. గీ. అనుచు మా మతసిద్ధాంత మదియె మేము
నాచరించుచు నున్నార" మనఁగ; రాజ
నందనుఁడు కటకటఁబడి నగుచు యోగి
వరున కిట్లనెఁ దత్త్వంబుఁగఱప నెంచి. 200

మ. వెలపం గొన్నపదార్థ మెయ్యదియు నుర్విం దగ్గిపోకుండ, దీ
రలు స్వర్గమ్మను దేహకష్టమను సద్ద్రవ్యమ్ముచేఁ గొన్నఁ ద
త్ఫల మెల్లన్వ్యయ మైనచో మరల నేతత్ప్రాప్తిచే దుఃఖబా
ధ్యలు గాకుందురె నశ్వరంబులగు కోర్కు ల్గోరఁగాఁ జెల్లునే. 201

సీ. యోగీంద్ర! యెవ్వఁడే నూర్ధ్వలోకంబులు
పాప్రించు మనుజుఁడు పడకమానఁ;
దిందులకై యేను దృష్టాంత మొక్కటి
వాకుత్రు నవధారు! వార్ధిలోని
సలిల మంతయును బాష్పస్వరూపమున నూ
ర్ధ్వంబున కేగ మేఘం బటంచు
బానినే కద, గాలితాఁకుచే నదియ చె
ల్లాచెద రగుచు జలముగఁ బుడమి

తే. గీ. మీఁదఁబడి యేఱుగట్టుచు మిట్టుపల్లఁ
మేకముగఁజేసి బురదతో నేకధాప
మంది వారాశిలోనిక యరుగు పగిది
నూర్ధ్వగామికి స్వస్థాన మొదవు మరల. 202

సీ. అన, విని యోగి యిట్లనియె, "మహాత్మ! నీ
వనినసంగతి నిజమౌనొ యేమొ
నేనెఱుంగను; మాట నిశ్చయజ్ఞానంబు
లేమి నిట్లయితిరు మే; మయినను
గుదికట్టువలె నాత్మకను బైకెగిరిపోవ
నీకుండఁ బ్రతిబంధ మొసఁగఁజేయు
నీశరీరము మాకనిష్టంబు; రాత్రిపో
యినవెన్కఁ బవలు వచ్చిన విధమున

తే. గీ. రొద చనినమీఁద నిశ్శబ్ద మొదవు పగిది
దేహ మీరీతి మిగుల బాధింతుమేని
గష్టమెడలి పదపడి సుఖంబ యాత్మ
కొదవు నని మాయభిప్రాయమిది నిజంబు." 203

మ. అని యోగీంద్రుఁడు వల్కుపల్కులను సిద్ధార్థుండు యోజించి యి
ట్లనియె, "నీ్మరనినట్టి సౌఖ్యమదియు న్సాంతంబగున్; లక్షహా
యనము ల్పోయినఁ బోవుఁగాక యెపుడే నంతంబు లేకుండు దా
నిని లోకంబునఁ జెందువార్గలిగిరేనిం జెప్పుఁడా యొప్పగన్." 204

వ. అనుడుఁ, బరమాత్మ యొక్కండు నశ్వరుండు గాఁడనియుఁ దదానం
దంబొక్కటి శాశ్వతం బనియుఁ దదితరమ్ములు సాంతమ్ములనియు
నొడివిన జడదారి కమ్మాయాదేవేయుం డిట్లనియె. 205

మ. అకటా, యోగివరేణ్య! తెల్వియును ధైర్యమ్ము న్పవిత్రత్వముఁ ధ
బ్రికటతత్వంబును గల్గుమీర లిటు స్వప్నప్రాయమై యస్థిరా
త్మకమై యొప్పు సుఖమ్ముఁ గోరి పరతత్త్వజ్ఞానసంపత్తిసా
ధకమై యొప్పు శరీరముం బ్రబలబాధాయుక్తిఁ గారింతురే. 206

తే. గీ. ఆత్మయందలి పేర్మి దేహమ్మునందుఁ
గల యనిష్టత్వ మీరీతిఁగా నొనర్పుఁ
గాని మీజీవయాత్రికుఁ గారణంబు
దేహ మెడలినఁ దత్త్వంబుఁ దెలియఁగలరె? 207

క. ఈదేహం బీయాత్మకు
నేదియొ యొక కారణమున నిల్లై యుండె;
నీమ్రఁదనిఁక నొక్కయింటం
బ్రోది యొనర్పుటకుఁ గూలఁద్రోతురె దీనిన్. 208

వ. అని యుపదేశించిన యారాజపుత్రున కాయోగు లిట్లనిరి. 209

క. ఈమార్గము మంచిదియని
యే మవలంబించినార మిదికానియెడన్
నీమదికి న్నచ్చిన మఱి
యేమార్గంబైనఁ దెల్పు మెఱుకగలిగినన్. 210

వ. నీకుం దెలియదేని మిన్నక పొమ్మనిన సిద్ధార్థుం డచ్చోటువాసి మన
మ్మున నిట్లు వితర్కించె. 211

ఉ. ఏలొకొ వీరు కష్టముల కిల్లగుదేహ మొగిన్ మఱింత క
ష్టాలకుఁ బాలుచేయుటకు సన్నహనం బొనరించుచుండి యీ
కీలక మింతమాత్రఁ బరికింపరు బాధలువెట్టి దేహముం
గూలఁగఁ ద్రోచియు న్బ్రతుకఁ గోరెద రక్కట బుద్ధిహీనులై. 212

సీ. మనుజులసుఖము గన్గొనలేని వేల్పులఁ
బేర్మిమై సంతోష పెట్టుకొఱకొ
యిహలోకకష్టమ్ము లెనసి నారక బాధ
లను సహించుట నేర్చుకొనుటకొఱకొ
తనువు చిక్కినతఱిఁ దప్పించుకొనిపోవు
టాత్మకు సుఖమను నాశకొఱకొ
దయలేని తప్పువ్రాఁతల మతగ్రంథంబు
లందుఁ గృతజ్ఞతఁ జెందుకొఱకొ

తే. గీ. తనువులను రోయుచున్నారు తపసు లకట!
మీకుఁ గలతెల్వి వీరికి లేకపోయె
వృక్షతతులార! పువులార! పక్షులార!
రోయుచున్నారె మీరు మీకాయములను. 213

చ. పరివిమలచిత్తు లందురి పశుపక్షిమృగాదులకంటె సర్వమూ
నవులును, దేహమేలొకో వినాశముచేయఁగరా దటంచు యో
గివరులు డెందమందుఁ బరికింపరు పక్షులపాటియైన నం
చు వికలచిత్తుఁడై తిరుగుచుం గిరిపై వసియించెఁ బ్రాగ్గతిన్. 214

చ. వనితయు నచ్చటం గపిలవస్తుపురంబునఁ జూలునిండి ప
ట్టసమునఁ బల్లెలం జను తెడందల సంతసమందుచుండఁగాఁ
దనకు సుతుండు లేనికొఱఁతం దిగదార్చుచు శాక్యవృద్ధు న
మ్మనమునఁ బొంగ నొక్కనిఁ గుమారునిఁ గాంచె శుభప్రసంబునన్.

తే. గీ. పెద్దయగు పుత్రుఁ డిప్పుడు పిన్నయయ్యె
నంచు శుద్ధోదనుఁడు పేర్మిఁ బెంచుచుండఁ
జిన్నజాబిల్లి వితమునఁ బెరుఁగుచుండె
రాహులుం డనుపేర నారాజసుతుఁడు. 216

—• ఆశ్వాసాంతము. •—

క. పెద్దాడవంశజాత! స
ముద్దామయశస్సమేత! బుధదారిద్రీ
రుద్దాలీభూతసము
ద్యద్దయ! రవిమిత్ర! తిరుపతంబాపుత్రా! 217

మ. ధరణీదేవకుమార! భూవర! సముద్యద్గౌతమీతీరసు
స్థిరరాజ్యాతిశయా! ప్రమోదిలహరీదేదీప్యమానాశయా!
తరుణీసూనశరా! ప్రవీర! పరకాంతాసోదరా! కీర్తిభా
స్వర! కార్తస్వరసన్నిభాసఘన! కృష్ణారాయభూమీశ్వరా! 218

విద్యున్మాలావృత్తము

విద్యాభ్యాసోపేతశ్రిద్ధా
విద్యుత్కాయా వీతాపాయా
సద్యోమిత్రా సాధుస్తోత్రా
హృద్యశ్రీయా కృష్ణారాయా. 219

— గ ద్య —

ఇది శ్రీ.... తిరుపతి వేంకటేశ్వరప్రణీతం బగు
బుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందు
దృ తీ యా శ్వా స ము



శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బు ద్ధ చ రి త్ర ము



## చ తు ర్థా శ్వా స ము

క. కొచ్చెర్లకోటరుల సం
పచ్చతుర కవీంద్రచంద్రవాగమృతలల
ద్ధృచ్ఛాతక ! నిర్మలతర
సచ్చరితా ! కృష్ణరాయ ! సాధువిధేయా ! 1

వ. అవధరింపు మనంతరంబ. 2

ఉ. రాజగృహాభిధాననగరంబుఁ గరంబు స్వధర్మపద్ధతిం
దేజము తప్పకుండ నవనీపతియై తగు బింబిసారుఁ డెం
తే జనము ల్నుతింప లలినేలుచునుండెఁ గలీను లైనరా
రాజులమాడ్కి మంత్రులు తిరమ్ముగ సుస్థితి దెల్పుచుండఁగన్. 3

తే. గీ. రత్నగిరి కందరమ్మున రాజపుత్రుఁ
డొకఁడు రాజ్యమ్ము విడిచి భిక్షుకునివగిది
నణఁగి యున్నాఁ, డతండు మహానుభావుఁ
డనియెడు వదంతి రాజగృహమునఁ బ్రబలె. 4

చ. అనద యొకర్తు తన్నగరమందు వసించుచునుండు, దానికిం
దనుజుఁ డొకండు. వాఁ డుపవనంబునఁ గ్రుమ్మరువాఁడు చిల్వకా
టునకు గతాసుఁ డై చనినటు ల్చెలికాండ్రు రయంబ యేగి యు
వ్వనితకుఁ దెల్పి; రాపె పెనువంత మరల్పఁగలేక యెంతయున్. 5

తే. గీ. కొడుకు పాము కతనఁ గూల నచ్చోటుఁ జేరఁ
బోయి నోరునెత్తి మోఁదుకొనుచు
'నన్ను విడిచిపోతె నాకులాధారంబ
నాతనూజ' యని మనమునఁ బొగిలి. 6

వ. వెండియు దురంతచింతాభరం బాపలేక యప్పాపనిసబంబుపైఁ బడి యిట్లు విలపించె. 7

చ. కటకట యెన్నఁ డేని నొకకష్ట మెఱుంగక నీవు నాకుఁ గ
ల్గుటకు ననేకదైవములఁ గొల్చి జగమ్ములు మెచ్చఁ గంటి నీ
చిటిపొటిమేను గాడఁ గఱచెం బెనుభూతము వోలె నెంత య
క్కటికము లేరపోయెఁ గొడుకా! కడ కెక్కడి కాలసర్పమో. 8

తే. గీ. తోడి బాలురతోఁగూడి నేఁడు పేర్మిఁ
గేళిమై నున్నవేళ నిన్నేల కఱచె
నట్టినడి పూలతోఁట ఫణాధరంబు?
పాము గాదది నాతొలిబాము గాని. 9

క. కొడుకు కళేబరము పయిం
బడి యిటు లెల్గెత్తి యేడ్చుపడఁతిం గనఁగాఁ
దడఁబాటునఁ జనుదెంచిరి
పడిపడి నాయిరుగుపొరుగు వాడజనంబుల్. 10

సీ. గొణగొణ నేదియో గొణఁగుచుఁ గేలుసా
చించి మార్జనుల మంత్రించువారు
విషముపో మందులు విషవస్తువులె యంచు
నూటి కల్కోము కంటఁగూరువారు
వనపత్రములు దెచ్చి పసరు గిన్నెలఁదీసి
ముకుఁజెవుల నొకింతపోయువారు
పురవైద్యశాలకు నరిగి భేషజనీర
ములు దెచ్చి గళమున నొలుకువారు

తే. గీ. 'నెచటిప్రాణము! లేచిపోయిన' దటంచు
నొరులకొరులకుఁ బెదవులు విఱిచికొనుచుఁ
దుటదుట స్రవించు కన్నీరు దుడిచికొనుచు
నరుగువారును నైరి తత్పురజనంబు. 11

వ. ఇట్లనేకు లనేకప్రతీకారమ్ముల విషనివర్తనోపాయమ్ము లాలోచించి యొనర్చుచు మృతపుత్త్రియగు నాయమ్మ నోదార్చు చున్నంత మఱి కొందఱు. 12

క. ఈనగరసమీపార
ణ్యాని వ్రిత్నగిరికందరాంతరమున స
న్న్యాసానుభావుఁ డొక్కఁ డ
తీనుం డున్నాఁ డతం డతీంద్రియుఁ డెందున్. 13

క. ఆయనయొద్దకు నీమృత
కాయము గొనిపొమ్మతండు కరుణాభరణుం
డాయువు పొసంగ సమర్థుఁ డు
పాయంబిది యనుచుఁ దెలుప నామెయుఁ గదలెన్. 14

కవిరాజవిరాజితము

భుజముపయి న్మృతపుత్త్రికళేబరముం దగ బర్వ్వసమోయుచు మే
న్గజగజలాడఁగఁ గన్నుల బాష్పపుఁగాల్వలు ధోయనఁగాఱఁగ న
క్కజ మెద నించు వికారమునం 'గొడుకా! కొడుకా! కొడుకా!' యనుచుం
గుజములనీడలకుం జనుచుం జనెఁ గూరినవంత దిగుల్పడుచున్. 15

సీ. కుసుమపేశలమైన పసిపాపమూఁపుపై
జలజలఁ గన్నీరు జార్చుదాని
"నిట నన్ను విడిచి నీవేగితే హాపుత్త్రి
హాపుత్త్రి" యంచు బిట్టడలుదాని
"నా పాపఫలము ఫణాధరమై నిన్నుఁ
గఱచెరా, కొడుక!" యంచొఱలుదాని
"నపకార మేమి నేనాచరించితి మాల
దేవుని?" కనిసారె దిట్టుదాని
తే. గీ. "నాసుతుని బ్రతికించు పుణ్యపరిచారు
జెప్పఁగదరమ్మ వేగమో చెట్టులార!"

యనుచు నాయీనగంబుల నడుగుదానిఁ
గనియె సిద్ధార్థుఁ డెంతయుఁ గరుణ మొలయ. 16

క. కని "నీ వెవ్వతె, వేకత
మునఁ దనయుం డీల్గె, గహనమునకుం జనుదెం
చిన కారణమే" మని యా
డిన నామెయుఁ బెల్లుగ దురటిల్లుచుఁ బలికెన్. 17

క. పసివానిఁ బాము వనమునఁ
గసిమసఁగె న్నాకు వీఁడొకండ సుతుం డీ
నిసువుం బ్రతికింపఁగల త
పసి కలఁ డిగ్గిరి నటంచుఁ బల్కిరి పౌరుల్. 18

వ. తదర్థంబ నావచ్చుట, యమ్మహాత్ము నెఱింగితివే నానతిమ్మని నందన శోకమ్మున నలందురుచుం దన ముందఱ వ్రాలు నాతిం గాంచి భూత దయాపారీణుండగు నాతం డిట్లనియె. 19

ఉ. పౌరులు నీకుఁ జెప్పిన తపస్విని నేనచుమీ, మనోహరా
కారు భవత్కుమారుఁ దుర్తికాలమునం బ్రతికింతుఁ గాని మీ
యూరికిఁ బోయి సర్షపములొయ్యనఁ దెమ్మొకకొన్ని, పుత్రు ని
ద్ధారుణి నుంచు మేను సవిధమ్మున నీవయి కాచుచుండెదన్. 20

వ. మఱియు నొక్కవిశేషంబుఁ గలదు వినుము, జననీజనక పతిపుత్రా దుల మరణమ్మున నెన్నండును నాపన్నులుగాని పౌరులయింటికిం జని యావలు యాచించి తేవలయుఁ జుమీ! యను సర్వార్థసిద్ధుని వచ నంబు లమందానందసందోహంబు డెందంబునం దుదయింపంజేయఁ గుమారు నటఁ గుతలశాయిం జేసి మరలి రాజగృహమ్మున నొక గృహమ్మున కరిగి కలతెఱంగు నొడివిన నాయింటి ముత్తైదువ తన యోజ్జీవనత్వరాయమాణమానసయగు నాపె కిట్లనియె. 21

మ. జననంబు న్మరణంబు జంతువులకు న్స్వాభావిక, మ్మెరి కె
ల్లి నిజం బౌనె? సుఖంబు లెక్కడివి తల్లీ! యేఁటి కేఁడాదియై

నను గాలేమ ప్రయోజకు స్వజనమందారంబుఁ బెట్టంతివా
నిని బుత్త్రిం దిగద్రిమింగి తాయిదరణి స్థ్వింది యిట్లుండనే. 22

క. ఆవలకు నేమి భాగ్యము,
కావలసినఁ గొను మటన్నఁ, గన్నీరు కుచ
పార్శ్వారము దడుపఁగఁ జని
యావీథిఁ గలట్టి గృహిణులందఱ నడిగెన్. 23

సీ. కన్నబిడ్డలనెల్ల గంగపాలొనరించి
బ్రతికినపరమనిర్భాగ్యురాండ్రుఁ
దారుణ్యమంద భర్తలు పెద్దనిద్దుర
పడసిన దురదృష్టవంతురాండ్రుఁ
జిరకాలమునకు వచ్చినచూలు గోల్పోయి
వంతచేఁ గుందు చూలెంతరాండ్రుఁ
బసితనమ్మున మారికసిమసంగిన తల్లి
దండ్రుల కడలు స్వతంత్రరాండ్రుఁ

తే. గీ. గాని యెందును నడిగినకరణిఁ దనడు
వలయు సిద్ధార్థము లొసంగువారు పురము
నల్గడలఁ గానరారైరి నాతి కాత్మ
శిశుమరణదుఃఖవార్ధి శుష్కింపఁజేయ. 24

క. తనకై యావల నిమ్మం
చు నడిగిన వెలంది పుత్త్రశోకాగ్ని రవి
ల్చెను బ్రాక్తనపౌరీహృద
యనలకగు ప్తఘనశోకహతచూర్ణంబున్. 25

క. తన్నగరనికేతనముల
కన్నింటికి నరిగి సుతునకౌషధ మని యా
పన్నులు తా మెన్నడుఁ గా
కున్న కుటుంబినుల వెదక నొకరును లేమిన్. 26

వ. ఖిన్నయగుచు రాజపుత్రాధిష్ఠితంబగు గిరికందరంబునకుం జని కని మ్రొక్కి కడచిన వృత్తాంతంబుఁ దెల్పిన నాతం డల్లన నగుచు నమ్మ గుప కిట్లనియె. 27

సీ. మరణంబు సర్వసామాన్యంబు దుఃఖంబు
గాంచనివారు లోకమున లేరు
నిజ మిదియనుమాట నీయంత నీకు గో
చరముగా నీయుక్తి సలిపినాఁడ
నీదృశదారుణఖేదమ్ము లకుఁ గత
మెద్దియో తెలియఁగ నెంచి నేను
దిరుగుచున్నాఁడఁ దెలియుట్రై ప్రాణ
మైనను విడుచు సాహసము కలద

తే. గీ. టంచు బోధించి పురమున కాపె నంపి
రత్నగిరి సానువులయందు రాజసుతుఁడు
ప్రాగ్గతి వసించుచును నొక్కపరి నజావి
పటలివెంబడిఁ జనెడు గోపకులఁ గాంచె. 28

ఉ. అందొక మేఁకకూన తనయంఘ్రి శిలాహతిఁజేసి గాయముం
జెందినఁ గుంటుచు న్విగతజీవముమాత్రము గాక యుండ, లో
సం దలపోసె నానృపతిసందనుఁ డిచ్చటికూనపాలిఁటిఁ బ్రో
పం దలపోంట యమ్మనులవంత లడంచుటకంటె మేలుగన్. 29

వ. ఇట్లు తలపోసి యక్కొండచఱియలనుండి డిగి చిఱుతమేఁకదరి కరిగి తన యెగుబుజంబున నెక్కించుకొని గోపకుల కిట్లనియె. 30

తే. గీ. పొద్దు బారెఁడు గ్రుంకకమున్న మేఁక
మందలను దొడ్డిపెట్టుదురెందు గొల్ల,
లకట! యీవేళ మట్టమధ్యాహ్నమంద
తోలుకొని పోవుటకును హేతువు నుడువుఁడ. 31

వ. నావుడు గోపకు లిట్లనిరి. 32

క. నూటింటి వేఁటకమ్ముల
నూటింటిం బ్రస్తముల సమాసప్రీతిన్
మా ఱేఁడు నేఁడు బలి చే
చేటేఁడుల కొసఁగునఁట సెసెగ జన్నమునన్. 33

ఉ. కావున మేము మేఁకలను గ్రన్ననఁ దోడ్కొని పోవుచుంటి, మా
దేవరయానతి స్పృథగ దేవనికైన నొనర్పరాదు, వే
పోవలె నంచు మార్వచనమున్వచియింపక యోగి గొల్లలం
గావి మెఱుంగు కన్గొనలఁ గ్రమ్మఁగ శాక్యమునీనుఁ డిట్లనెన్. 34

క. ఏనును వచ్చెద నిల్వుం
డా నరపాలునిని పాలికనుచుం గూసం
దాన మెడమీఁద నిడుకొని
మైసంభై చనియె గొల్లవాండ్ర పిఱుందన్. 35

క. చనిచని సాయమ్ముఖమున
ను నగరమున రజపటలియు గొట్టెలపిండుల
వనముందఱ నడుపఁగ నొ
య్యనఁ జనియెం దౌరితల్లసచ్చరుపలదన్. 36

ఉ. మేఁకలపిండుతోఁ జిఱుతమేఁక నొకండు ఘుటద్వయాభిధా
నోకహశాఖికాంకుగళి నూల్కొనఁజేసి పురంబుఁజేరు తం
డ్రాకృతికి న్యతీంద్రునకు ద్వారనివాసులు దారి యిచ్చి, రా
ఢాకరు నొత్తిగిల్లె శకటంబులు రాజపథంబు చెంతనున్. 37

లయగ్రాహి— అమ్మునిరయమ్మునఁ బురమ్మున కరమ్ముఁ గుపి
తమ్మగువిధమ్మునఁ బథమ్మునఁ జనంబో,
సమ్మకొను కోమటిజనమ్ములు మనమ్ముల ఘు
సమ్మగుచు వచ్చెరువు గ్రిమ్మఁగఁ దులాపిం
డమ్ములు త్యజించిరి; ముదమ్మలరఁగాఁ గ్రయికు
లు మ్మదిఁ దదంబడుచుఁ దమ్ముఁ దమవారల్

తెమ్మనిన వస్తునికరమ్ములను గైకొని గృ
హమ్ములకుఁ బోరు వికల మ్మయినబుద్ధిన్. 38

సీ. సామితశిక్షితదారుసన్నద్ధమైన చే
బాడిత లివియక చూడ నేగెఁ
దక్ష యయ్యతివరుఁ ; దంతువాయుండు మ
గ్గము వెట్టి తురిలోనఁ గండె లునిచి
తగ నేసికొనుచు నోతప్రోతముల సవ
రించి వేమమున ఘట్టించుకొనుచు
మగ్గమ్ము విడిచి యమ్మహనీయుఁ గన్గొన
నరిగెను ; పశ్యతోహరుఁడు పైఁడి

తే. గీ. తీవ రమ్మచ్చు పటకార్లు దిగవిడిచి య
తీంద్రు సాక్షాత్కరింపఁబోయెను ; గులాయిఁ
బొక్కరమున గూట మింకొక్క కేలఁ
బచ్చివంటియు ధరియించి పరుగు వెట్టె. 39

తే. గీ. ధాన్య మమ్మోడివా రద్భుతమ్ము గాఁగ
నెచటఁబోసినరాసుల నచట డించి
భిక్షుకుని జూడనేగ నాఁబెయ్యలేగి
వట్టి తినఁబొచ్చె నిష్ప్రతిబంధకముగ. 40

తే. గీ. సుత్తి యెత్తిన తనచేయి సుత్తియెత్తి
పట్టె యుండఁగఁ గమ్మరి యతనిఁ జూచె ;
ధనము లెక్కించుకొనుచు నత్తపసిఁ గాంచి
లెక్క మఱచెను వైశ్యకులీనుఁ డొకఁడు. 41

క. యతివరునిం జూచుచుఁ బా
ల్పితికెం గోపాలుఁ డొకఁడు విచ్చలవిడిఁ ద
న్మతి లోటా నిండిన సం
గతి యెఱుఁగనికతన నవియుఁ గాల్వలుగట్టెన్. 42

ఉ. కన్నులు చేరఁదేసి సుముఖంబు ముఖచ్ఛవి కంతుమేని శ్రీ
కన్నను మిన్నగాఁ గల చఖండత మూరుచి కేలుబోయి యు
త్యున్నత మంసయుగ్మము సమున్నత మీతనిజాతి యేమొ యుం
చు న్నగరాబ్జగంధు లఱచూడ్కులఁ జూడఁగసాగి రయ్యతిన్. 43

ఉ. పంచశిలీముఖాకృతిఁ బ్రపంచము సర్వము నేలఁజాలు ప
ఖ్యంచితతేజుఁ డీయనఘుఁ డక్కట గొల్లలు పోరె నెమ్మదిం
గొంచక మేఁకమందలను గొఱ్ఱెలమందలఁ గాచు పేలొకో
యంచుఁ బరస్పరంబుఁ గడునచ్చెరువందిరి కొంద అంగనల్. 44

వ. ఇట్లనేక లనేకపరివారంబులం గనుంగొను యతీంద్రుం డతిత్వరితగతిం జనుదెంచుటఁ గాంచి కొందఱు బలిదానత్వరాయమానమానసులగు బింబిసార నరపాలు పాలికిం జని యిట్లనిరి. 45

క. శః వాలభింపఁదగిన య
జావిరదంబంబుతోడ యతిపరుఁ డొకఁ డో
దేవర! వచ్చెడిఁ గంటె ఘు
జావితవికలపదబస్తకాంగుల డగుచున్. 46

సీ. హోమకుండాంతరాహుతఘృతజ్వలితమై
శ్వాసరజ్వాల లభ్రముస రెగయ
నాలభ్యమానమై కాజమేదోవసా
రక్తమ్ము లాపగ రహి వహింప
నైకకంఠీరితర్గ్యజుషమంత్రధ్వాన
పటిమ నజాండకర్పరము పగుల
బలిపీఠికాపోఢకుల దేవతావిగ్ర
హచ్ఛవిచ్ఛట దెసలలముకొనఁగ
తే. గీ. సోమపానంబుఁ జేసిన సోమయాజి
సంతతులు గూడి స్వస్తివాచనము సలుప
బింబిసారధరాపాలుఁ డింబుమీఱ
వితతబలియాగ మొకటి గావించుచుండె. 47

వ. మఱియు నొకఋత్విజుండు దీర్ఘశృంగంబులుగల యొక పశువు తల సులభముగ నుండు బిగువొఱం బొకయూపంబునకుఁ గట్టి యేతదర్థమ్ములగు సద్ధర్మమ్ములు చదివె. 48

సీ. 'ఇది బింబిసారపృథ్వీశుజన్మమునఁ బ్రి
ధానంబు దీని రక్తమును జూచి
యగ్నిదుండమ్మునయందు హోమముసేయఁ
బడు దీని సంపక్వపలలగంధ
సార మాఘ్రాణించి సంతసమందుఁ డో
దేవతలార! యీభూవరేంద్రు
పాపమ్ములను దీనిపై వైచితిమి గాన
వానితోఁ గూడ వైశ్వానరుండ!

తే. గీ. పశువు నశియింపఁజేయు', మిప్పగిదిఁ బల్కఁ
నఱకఁబోవుట దవ్వులనరసి వేగ
నరపతి సమీపమున కేగి, 'నఱక నీకు
మయ్య!' యని కేకవైచె సిద్ధార్థుఁడపుడు. 49

వ. ఇట్లానర్చి సమీపమ్మున కరిగి యప్పశుపాశం బూడ్చి విస్మయమయులై యూరక చూచుచున్న ఋత్విక్కులం గాంచి మృదుమధురమ్ములగు వచనమ్ముల నిట్లనియె. 50

తే. గీ. ప్రాణహననంబు గడుసులభంబు గాని
ప్రాణ మిచ్చుట మనకు సాధ్యంబుకాదు ;
ప్రాణరక్షణకై పాటుపడనివారు,
ప్రాణిపైఁ బ్రేమలేని వారలును గలరె. 51

తే. గీ. జీవములయాత్ర సంపూర్తిచేయకుండఁ
జంపువారికిఁ బాపంబు సంభవించు
జీవహింస యొనర్చెడిచేఁత సేయు
వారలకుఁ బాపముక్తి చేకూర దెపుడు. 52

సీ. దయఁగోరి వేల్పులఁదనియించు మనుజు లె
ట్లో దేవతలు జంతువులకు : జంతు
వులపైఁ గరుణ మనుజులు పూనకున్నవా
రలపైఁగరుణ దేవతలకు రాదు;
ఇలఁగల జీవరాసులు పరస్పరము సం
బంధమ్ము గలయవి : పరమనిర్ద
యతఁబూని మీరిప్పుడాలభించెడి పశు
వ్రాతమ్ము లన్నియుఁ బాలనొసఁగి

తే. గీ. మానవులయందు విశ్వాసమూని యున్న :
వెవ్వఁ డేనియు మృతిఁజెంది మృగశరీర
మైనఁ బక్షిశరీరమునైనఁ దాల్చు :
నవియు ధరియించుచుండు మానవశరీరం. 53

క. మతిహీను లెవ్వరే ని
గతి లంచముపెట్టి తుష్టిగావింతురె దే
వతల, కయోగ్యుల దుర్వ్యా
పృతులివి సంతోషమిడునె చింతం జేసిన్ ? 54

క. తనకావించిన కర్మం
బున నింతయు నన్యజంతువులపైఁ బడవే
య నశక్యః మేరితేఁ క
గ్గునె తమ కర్మంబు తార కుడుపర యెందున్ ? 55

తే. గీ. వాఙ్మనఃకాయముల దేహవంతుఁ డెలమిఁ
జెట్టచెద్దయి యొనర్చినఁ జెట్టఫలము,
మంచిచెద్దయి యొనర్చిన మంచిఫలముఁ
జెందుఁ గాని తదితరము చెందఁబోఁడు. 56

మ. మతియు న్నెరుపుఁ బేర్మియుం గృపయు సన్మానంబునుం జంతుసం
తతిపైఁ జూపక హింస మున్నయిన దుస్తంత్రంబు లెన్నెనియుఁ—

గతకాలంబునఁ జేసికొన్న నవి యక్కష్టాత్మలం బట్టి యా
యుతియందు న్వితఁ గుడ్పు నంచు మతయోగ్యగ్రంథము ల్చెప్పవే. 57

తే. గీ. అనుచు నందఱిడెందంబులందుఁ గరుణ
యనుగుణం బుదయింపఁగ ననుగుణముగ
విపులబోధ మొనర్ప ఋత్విక్కు లెల్లఁ
దలలు వంచిరి సిగ్గునఁ దపసిఁజూచి. 58

వ. రాజును మురళీతరకరకమలుం డగుచు సాష్టాంగనమస్కారంబు గావిం
చిన సతని దిక్కు మొగంబై యెల్లరకుం దెలియ మరల నిట్లనియె. 59

సీ. ప్రాణులెల్లను బరస్పరమైత్రి గనవలె
మాంసభక్షణమును మానవలయు
బంగారుఁరంగుమైఁబరఁగు చక్కని రాజ
నాలధాన్యము క్రింద రాలినట్టి
తీయనిఫలములు తేటయౌనీరును
శాకముల్మొదలగు సకలవస్తు
పులచేత క్షుద్బాధ తొలఁగింపఁజేసి యీ
తనువును గాపాడికొనఁగవలయు

తే. గీ. నీగతి నొనర్ప లోకమ్ము బాగుపడు న
టంచు బోధించుచున్న సిద్ధార్థు వచన
యోగమున మనముల సత్త్వ ముదయమందెఁ,
దెల్వియును వచ్చె నపటి ఋత్విజులకెల్ల. 60

వ. ఇట్లు తదుపదేశంబు మనంబులకెక్కి యాజకులు పశుహింసాకరమ్ము
లగు నాయుధమ్ములు పాఱవైచియు హోమకుండంబులు చల్లార్చియుఁ
దమయంత నరిగిరి. బింబిసారుండును సాంద్రంబగు సంతసంబునం
బొదలి జీవహింస చేయఁగూడ దనియు మాంసంబు తినరాదనియు
భూతదయ ప్రధాన మనియుఁ దనదేశ మందలి సకలజానపదమ్ములఁ
జాటించియు శిలాఫలకమ్ముల వ్రాయించియు బలియాగమ్ములు

మాన్పింపఁ దగువారి నియోగించెఁ; బదంపడి యెల్లయెడల జీవహింసా
ప్రచారంబు శశవిషాణప్రాయమై పశుపక్షిమృగాదులు నిర్భయముగ
మెలంగఁదొడఁగె. 61

ఉ. రాజకులంబునం బొడమి, రాజ్య మొసఁగుట మాని, తత్త్వవి
ద్యాజితమైన చిత్తమున ధర్మగతిం జరియించువానిఁగా
నా జటిలాగ్రగణ్యు మొగమందలికాంతి యెఱుంగఁజేయ న
త్తేజుఁడు బింబిసారుఁడు నుతించుచు నిట్లనె భక్తిపెంపునన్. 62

చ. యతివర ! రాజ్య మేలఁదగినట్టి మహామహిమానుభావసం
గతి గల మీకు బిచ్చమునఁగా నొకవృత్తియె; నాకుఁ బుత్రసం
తతి కఱవయ్యెఁ, గూఁతు నొకతెం గనియుంటిని; దాని నిచ్చి నా
యతులవిభూతి నిత్తు ముదమందుచు రాజగృహంబు నేలుమీ. 63

వ. అనపుడు బింబిసారుం గాంచి సర్వార్థసిద్ధుం డిట్లనియె.

సీ. రాజేంద్ర ! విను, నేను రాజవంశమునందు
బొడమినవాఁడఁ బ్రభూతమైన
సౌఖ్యంబు తొల్లి సంసారంబు సేయుచు
ననుభవించినవాఁడ నగుదు నిజము;
మునుపు వల్దని త్యజించిన సౌఖ్యమిపుడేల ?
సన్న్యసించితిని విజ్ఞానలబ్ధి
మనమున నెంచి, రంభయ వచ్చి కామించి
నను నింద్రపదవి వచ్చినను నొల్లఁ;
తే. గీ. దనువు కృశియింపఁ జేసెడి పనులకతనఁ
గాని శాస్త్రములకతనఁగాని యిచటఁ
గలుగు తాపసజనముల కతనఁ గాని
జ్ఞాన మబ్బ దటంచు నిశ్చయము గలిగె. 65

వ. కావున గయాప్రాంతదేశంబులం గల చల్లని యతివరులకుం బోయి
జ్ఞానసంపాదకంబగు యత్నం బొనరింతు; సద్విజ్ఞానంబు నాకు
లభించునాఁ డయ్యది నీకుం దెల్పి కృతజ్ఞుండ నగుదు నని మఱియును.

తే. గీ. పాములకు నైన నే భయంపడను, బిడుగు
లకును భీతిల్లి, దావపావకున కైన
భీతివడ, గాలి కైనను భీతిఁ జెంద
విషయహాతకమ్ములకు బిట్టు వెఱచినట్లు. 67

క. రామము లనిత్యములు మా
యామయములు వానిఁ గోరినంతన విద్వ
ద్గ్రామణులకైన నొక మో
హామయము ఘటిల్లు సంతతానర్థదమై. 68

శా. ఆశం బోలఁగఁజాలు శాత్రవుఁడు లేఁ డాసాగరాంతం బిలన్
దా శాసించెడివాని చిత్తమునకైనం దృప్తి గానీదు, ల
క్షేశుం గొల్లుగ దంభవంబగు ధనంబే కోరఁగాఁ జేయు, నా
శాశసత్రిక్కుల నల్లుఁ దన్మయున కింకం గల్గునే నిర్వృతుల్. 69

తే. గీ. నేల నాలుగుచెఱఁగులు నేలె, దేవ
తావరేణ్యుని యరగద్దెపై వసించె,
వలసి కురిపించుకొనెఁ బైఁడివానఁ, దృప్తి
దనరెనే యట్టివాఁడు మాంధాతకైన! 70

సీ. అమరాధిపతియు దైత్యక్రోధమునఁ దొల్లి
యజ్ఞాతవసతి చేయంగవలసె
మునులచేఁ బల్లకి మోయించిన మదంబు
నన కొండచిలువయ్యె నహుషనృపతి
స్వర్గంబుఁ జేరి లోభమున నిరాబారి
పైఁడిఁగోరి నశించె వేదనృపతి
గురుని వేసంబు శుక్రుఁడు దాల్చి మాత్సర్య
మున దేవతలనెల్ల మోసగించె

తే. గీ. గురునియిల్లాలితోఁగూడి కువలయేశుఁ
డప్రతిష్ఠ వహించెఁ గామాతిరక్తిఁ

గాన నెంతటివారలకేని విషయ
నిగమనము శక్య మగునయ్య మగధనాథ! 71

క. ఆకలము లేఱికొని తమ
యాఁకలిఁ బోఁగొట్టుకొనుచు నంబరములకై
మోకపొర ల్గట్టెదు మును
లే కామముఁ గెల్వఁజాలలేరు నరేంద్రా. 72

వ. మఱియు దుఃఖప్రతీకారనిమిత్తభూతంబులై దగఁదీర్చుటకుఁ దోయంబును నాఁకలిఁబాపుట కన్నంబును శీతాతపవారణంబునకు గృహంబును గుహ్యప్రదేశ శైత్యవారణంబునకు వస్త్రంబును నిద్రావినోదార్థంబు తల్పంబును మార్గశ్రమాపనోదంబునకు యానంబును స్థానపారిశుద్ధ్యంబునకుఁ బీఠంబును శరీరారోగ్యంబునకు స్నానంబును నిర్ణీతంబులైన యివి సుఖానుభూతికొఱ కుపయోగించు నరుండు కేవలమూఢుండు. 73

తే.గీ. మంచిగంధము శశియు గ్రీష్మమున సుఖముఁ
గలుగఁజేసియు దుఃఖంబుఁ గలుగఁ జేయు
శిశిరమునఁ గాన నిజము యోచింపఁ గలదు
సుఖము దుఃఖంబు సర్వవస్తువులయందు. 74

తే. గీ. సుఖము దుఃఖమ్ము నా కేరసుఖములగుట
రాజ్యదాస్యంబులును సమభోజ్యములగుఁ;
ధరణిపతికిని సుఖము నిత్యంబు గాదు,
దాసునకు దుఃఖమును శాశ్వతంబు గాదు. 75

తే. గీ. ఒక్కపుట్టము కట్టుఁ బన్నుండు నొకటి
నొక్కయింటన వసియించు నోరెమింత
మాత్రమే తినుఁ గాని శ్రమంబ యెక్క-
డీజగం బేలు రాజాధిరాజునకును. 76

తే. గీ. అనుభవము తుల్యమైనను నవనిపతికిఁ
దుష్టి హెచ్చనరాదు; సంతుష్టి లేదె,

కనకలోష్టంబు లొకరూపుగాఁగఁ బడమి
సర్వసంగంబువదలిన సంయములకు ? 77

వ. కావున సన్నుఁ గామపురుషార్థంబునకై పురికొల్పక నాయందుంగల మైత్రికిం దగినఫలంబుగ శివమార్గానుసంధానంబునకై హెచ్చరింపుము. కుటుంబకలహంబునంగాని శాత్రవకృతతిరస్కారంబునంగాని దుర్భరాక్రాంతిచేతం గాని వనప్రవేశంబుఁ జేసినవాఁడఁ గాను. దైవవశంబునంజేసి కనుదప్పి పాటిన క్రూరభుజంగంబు బారింబడెడు కుబుద్ధిచందంబున నెవ్వఁడు విసర్జించిన విషయంబులం గ్రమ్మఱఁ గైకొనువాఁ ? డని మఱియు. 78

క. అంధు ననంధుఁడు, నిర్ధను
నిం ధని, యున్మత్తచిత్తునిం దృఢమతియున్
సంధింపనిగతి దుర్విష
యాంధులతో మైత్రిఁ జేయు ప్రాజ్ఞుఁడు గలఁడే ? 79

క. కావున దుర్విషయములప్ర
భావము నాతోడ నుడువవలదింక; మనో
భావములు వృష్టిధూతల
తావలయంబులుగఁ దలఁపఁదగు నరపాలా. 80

వ. అని బహుమానపూర్వకంబుగా నమ్మగధనాథుని వీడ్కొని యరాడుండను నొక మునీంద్రుం డట కనతిదూరంబున నున్న యాశ్రమమందున్నవాఁ డని విని యతనివలన విజ్ఞానంబు వడయు నభిలాషంజని నంత. 81

ఉ. వచ్చిన రాజపుత్రుని గృపాపరిపూర్ణ విలోచనాంచలున్
హెచ్చినభక్తితోడ నెదురేగియు నింటికిఁ దెచ్చి యాసనం
బిచ్చి యనామయం బడిగి యెంతయు నమ్రత పెచ్చుగాఁగ నే
తచ్చరితంబు మౌని విదితంబుగఁజేయ నరాడుఁ డిట్లనెన్. 82

ఉ. సంకెల లూడ్చుకొన్న మదసామజముంబలె స్నేహపాశ మా
తంకము లేక కోసికొని దారుణకాననభూమిఁ జేరి ని

ష్పంకవిముక్తి రాజ్యపరిపాలనఁ జేయఁదలంచి నైజరా
జాంకము వీడి భిక్షుకుఁడవైతివె మేలు, నరేంద్రబాలకా. 83

క. కడు సుఖములు గుడిచి పదం
పడి రాజ్యభరంబు సుతులపైనిడి యెకిమీం
డ్రడవులకుఁ జనిరి గానీ,
విడచిరె నినుఁబోలి రాజ్యవిధి బాల్యమునన్ ? 84

క. మూన్నాళులయ్యె నేఁటికి
నిన్నరయఁగ వచ్చినట్టి నీమంత్రులు "మీ
యున్న తపోవనమునయం
దున్నాఁడా" యంచు నడిగి, యుత్తరదిశకున్. 85

క. పోయిరి; నీచుట్టంబు ల
లో యని నినుఁగూర్చి వగుచుచున్నారఁట; నీ
చేయఁగలముక్తిమార్గో
పాయం బేమిటికి ? వెఱ్ఱిపడుచుఁడ వకటా ! 86

క. ఎన్నాళ్ళనుండి తపమున
నున్నారము మేము, నేఁటికొఱ కించిత్తుం
గన్నది లే; దిఁక నీవా !
విన్నాణపుఁబదవిఁగాంచు వీరుఁడ వగుటల్. 87

వ. అని యుపదేశించు నరాదుని వాక్యంబు లాకర్ణించి, "దేవా! విరక్తుండ
వయ్యు నాకిట్లుపదేశించుట న్యాయ్యంబుగాదు; భవాదృశులగు మహాను
భావులు జరామరణరోగగ్రస్తంబగు మానవలోకము నుద్ధరింపఁ దలంప
వలయుఁగాని శరణార్థులగునంతేవాసుల నిరాకరింతురే !" యని
మఱియును. 88

క. "ధునిఁ దరియింపఁగ వేపో
యిన తఱిఁ దరి దొరకుపగిది, నినునివెలుంగుం
గనువానికిఁ దోడగుఁగతి
నినుఁ గనుఁగొఁగలిగె నాదు నేఁడు మునీంద్రా ! 89

క. నీయుపదేశము నాకుం
జేయందగు నేని నేను జెందఁదగుదునే
నాయనువు నొడువుమేగతిఁ
బాయు జరామరణ రోగభయము యతీంద్రా ?" 90

క. అనుఁడు, నరాదమునీంద్రుం
డును రాజసుతుని వినయపటుత్వంబునకున్
మనమలర నిట్లునొడివెను
దనదెలిసిన శాస్త్రనిశ్చితములగు పలుకుల్. 91

వ. ప్రకృతివలన జన్మమృత్యుజరావ్యాధిపీడితంబగు నీప్రపంచంబుత్పన్నం బయ్యెఁ; నది చతుర్వింశతితత్త్వాత్మకంబు; పంచభూతంబులును బంచ తన్మాత్రలును బంచకర్మేంద్రియంబులును బంచవాగింద్రియంబులును మనోబుద్ధిచిత్తాహంకారంబులునుం గలసి చతుర్వింశతి తత్త్వంబు లనం బడు; దీనిం దెలిసి ప్రకృతికిం బరుండై సాక్షిభూతుండగు పురుషునిం గనుఁగొన్నవారికి జరామరణరోగభయంబులు లే; విది కపిలమహా మునిప్రోక్తంబగు మార్గం; బింక బ్రహ్మమతప్రకారంబు వినిపింతుఁ; బుట్టుటయుఁ బెరుఁగుటయు ముదియుటయుఁ గిట్టుటయుం గలశరీరంబు వ్యక్తంబనియు, నట్లుకాని దవ్యక్తం బనియు ననంబడు. అజ్ఞానంబును నాశయుఁ గర్మంబును సంసారమునకుం గారణంబు; లీమూఁటం దవిలినవాఁ డెన్నండును దత్త్వంబుఁ దెలియనేరఁడు; విప్రత్య యాహంకారసందేహాభిసంప్లవావిశేషానుపాయసంగాభ్యవపాతంబులను నీయెనిమిదియు నజ్ఞానకారణంబు ; లందుఁ గర్తవ్యమన్యథాచేయు టయు, మంతవ్య మన్యథాతలఁచుటయు మొదలగునది విప్రత్య యంబు; నేను నాది యను నభిమానమహంకారం; బేకపదార్థ మనే కధా తలఁచుట సందేహంబు; భేదాభేదశూన్యంబగు జ్ఞానం బభిసంప్ల వంబు: జ్ఞాన్యజ్ఞానిభేదం బెఱుంగమి యవిశేషంబు; నమస్కార వషట్కారప్రోక్షణాభ్యుక్షణాదికకర్మతంత్రం బనుపాయంబు; మనో వాక్కాయబుద్ధుల దురాలోచనంబు సేయుచు విషయసంగంబు

లేనిపగిది సంచరించుట సంగంబు; నే నబలనివాఁడ, నబలుఁడు నావాఁ
డనుకొను టభ్యుపపాతంబు. తమోమోహమహామోహతామిస్రద్వయ
రూపంబున నా యజ్ఞానంబు పంచవిధం; బం దలభ్యచింతనంబు తమం
బు ; జననమరణప్రవాహమున నిత్యత్వభ్రాంతి మోహంబు; స్త్రీ వాంఛ
మహామోహంబు; క్రోధంబు ప్రథమతామిస్రంబు; విషాదంబు ద్వితీయ
తామిస్రం; బిట్టియజ్ఞానంబునకు లోఁబడి వ్యక్త పదార్థంబు లెఱుంగు
వానికి జరామరణశూన్యంబగు నక్షరపదంబు లభించు; నిది బ్రాహ్మ
మతంబని వ్యాఖ్యానించు నరాడునకుఁ గుమారుం డిట్లనియె. 92

సీ. ఎవ్విధి నెచ్చట నెంతపర్యంతమ్ము
జరపంగవలె బ్రహ్మచర్య మనఘ!
ధర్మంబునకుఁ బరస్థానమెయ్యది యెఱిఁ
గింపవే మదికి లగింపఁజేసి
యనవుడు, మౌనియిట్లనె, 'మొట్టమొదట గృ
హంబు వర్జించి సన్న్యాసియగుచు
నింటింటికిని బిచ్చమెత్తుకొం చొకచోట
నుండక వనినొందె నూరనొందె

తే. గీ. దొరకినది కొంచు, దాన సంతోషపడుచుఁ,
దనకు వాసంబుగా వివిక్తప్రదేశ
మొకటి దొరకొని, యింద్రియప్రకరమునకుఁ
బట్టువడకుండువాఁడెపో బ్రహ్మచారి. 93

వ. ఇట్టి బ్రహ్మచర్యంబున సంచరించుచు వివేకజన్యంబగు నిధిధ్యాసనం
బున సులభంబగు పరబ్రహ్మసాక్షాత్కారంబుఁ జెందుటయే మోక్షంబని
కొంద ఱిచ్ఛగింతురు. అహింసయే ధర్మంబునకుఁ బరస్థానం, బిదియ
వేదోక్తప్రకారం, బింతకంటె మనుజుండు గ్రహించుట దుస్తరం'
బని యుపదేశంబొనరించు నరాడుని పల్కులు మనంబునం బట్టి. 94

క. చనిచని యురువేలాకా
ననమున వసియించెఁ గొన్నినాళులు తనప
త్తనమును వదలినది మొద
ల్చనెనప్పటి కెన్న నాఱు సంవత్సరముల్. 95

తే. గీ. రాజపుత్రకుఁ డయ్యు నరణ్యమందు
నాఱువత్సరములనుండి యనుభవించు
ఘనపరిశ్రమమున ముఖకాంతి తఱిగె,
నంగకబలంబు సుడిగె సిద్ధార్థునకును. 96

వ. ఇట్లతికృశంబగు దేహంబునఁ బరిభ్రమించుటకుం దగనివాఁడై మెల్ల
మెల్లఁ జనువాఁడు ముందట. 97

సీ. పితరులు తరియింపఁ బిండప్రదాన మూ
ర్త్యులపరంపర చేయుచున్నచోటు
సురువలయ మ్మను నొకకంటకారణ్య
మినుము గొండలతోడ నెనఁగుచోటు
మిన్నంటుపొదవున మించు మోకల ముండ్ల
పొదలు తీవలుఁబ్రాఁకఁగదియుచోటుఁ
బూరికొంపలచేతఁ బొలుపారు సేనాని
యను పేరలరు పల్లె దనరుచోటు

తే. గీ. వెలయు నేయేటియొడ్డునఁ, గలయు మోహ
నయు, నిలాజనియను గొప్పనదులురెండు
నేనదీవార్ఝరంబున, దానిఁ గనియె
ఫల్గునీనామకంబగు భవ్యతటిని. 98

క. కని యాదఃపరికంపిత
వనజపరాగములు గలయఁ బర్వినగాడ్పుల్
తన మేనిచెమటఁ దుడువఁగఁ
జనియెను సేనాని యనెడి జనపదమునకున్. 99

క. చని యాలఁగాచుకొను న
జ్జనపదవరులైన గోపజనములఁ జగఁ గ
న్గొని వారియమాయికప్రవృ
త్తి నితాంతము సంతసము మదికి నొసఁగంగన్. 100

వ. ఇట్లు సంతసించుచు నటఁ గొంచెపుతడవు నిలిచి తత్ప్రాంతంబునన
నున్న మహారణ్యంబునకుం బోయి యచ్చట. 101

సీ. దైవవశమున నొదవు విపత్తి గుఱించి
మనుజుల దుఃఖమర్మములగుఱించి
యడవిజంతువుల మర్యాదచొప్పునఁ దాను
దెలిసికోఁదగిన నీతినిగుఱించి
యపరిమితమతసిద్ధాంతమ్ముల గుఱించి
సర్గమరణరహస్యములగుఱించి
చిత్రచిత్రప్రచితశక్రచాపతు
ల్యంబుగ బ్రతుకు కాలమునుగుఱించి

తే. గీ. మనము యోజింప ధ్యానసమాధి నూని
యొంటిపాటున నేరికిఁ గంటఁబడక
యుండు శౌద్ధోదనికి దాఁటుచుండె మూఁడు
ములకు మాసమ్ము లప్పనఘాములందు. 102

తే. గీ. దైవవశమునఁ దనకుఁ దాదాఁపునందు
ముగ్గి రాలినఫలముల భుక్తిఁ గొనుచు
నరుణు నుదయాస్తమయములవైన నెఱుఁగ
కట్టె ధ్యానించు నిస్తంద్రుఁడగుచు నారట. 103

వ. నిరంతరజిజ్ఞాసావశంబగు చిత్తంబున నాహారంబు మఱచి యున్న
సిద్ధార్థుని శరీరంబుమిగులఁ గృశించె. మొగంబునఁ గాంతియుఁ గను
మాసెఁ; బవఁపడి యొకనాఁ డశనాయావశంబున స్మృతిఁదప్పి మృతు
నింబోలి మూర్ఛనొందిన నొక గోపబాలకుండు తత్పథంబునం బోవుచు
నతనిం గనుంగొని వడఁదాఁకినవానిఁగా నెఱింగి. 104

క. పగలం బొగులుచు జంబూ
నగశాఖలు నఱికి పాఁతి నాలుగుదెసలన్
మొగముపయి నీడరా నొ
క్కఁ గృహం బాకులను బఱచి కల్పించెవెసన్. 105

వ. ఇట్లు సహజభూతదయాపారీణుండగు నాచిఱుతగొల్లం డొకపర్ణకుటీరంబుఁ గల్పించి తాను దాఁకినఁ బాతకం బగు నని యెంచి మేఁకల నతనిపాలికిం దోలికొని పోయి దుగ్ధంబు లమ్మహానుభావునినోటన పిదుకుచుండె; నిట్లు కొండొక కాలంబు చనుడు జంబూనగశాఖల న్నియు నిగిరించి పొదచాడ్పున నల్లిబిల్లిగ నల్లుకొనియె; నతండును దైవంబుగ నతనిం బూజించుచునుండ నొక్కనాఁడు తెలివొంది తన నికటమ్మున నున్నగోపబాలునిం జూచి తత్కరస్థితఘటీగతంబులగు దుగ్ధంబు లిమ్మనుడు వాఁ డిట్లనియె. 106

క. ఈపాలు నేను దాఁకితి
గోపాలుఁడఁ గాన నీవు గొనఁగాఁ దగ దో
శాపాయుధవర యను న
ప్పాపనిఁగని నగుచు భూమిపతిసుతుఁ డనియెన్. 107

సీ. నీశరీరమునందు నెత్తురు నాశరీ
రమునందు మంచిదుగ్ధములు గలవె
నాతల్లిదండ్రులు నన్నుఁ గాంచినరీతి
నీతల్లిదండ్రులు నిన్నుఁ గనరె
నా కున్నరీతినిగాక నీకఖిలావ
యవముల లోప మెందైనఁ గలదె
నీకంట నుప్పని నీరుండి నాకంటఁ
జప్పని రుచిగల జలము గలదె

తే. గీ. మోముపయి బొట్టు, జందెంబు భుజమునందు
వర్తిలెనె జన్మమంద యెవ్వరికిఁగాని

యీవు తాఁకినమాత్రన యేల పోలు
నేఁగొనం దగ దింటివి నిజము చెపుము. 108

చ. అన విని గోపబాలుఁ 'డివియన్నియు నిక్కము రాని నన్నుఁ బే
ర్మిని గహనస్థలంబునకు మేఁకలఁ గాపఁగ నంపునాఁడు మ
జ్జనని వచించె నిప్పగిది. స్వాములు బ్రాహ్మణు లగ్గిరేనిఁ దా
ల్తునిటుగ నిమ్ము తాఁకకుము తాఁకిన మీకు మటంచు' నావుడున్. 109

వ. సిద్ధార్థుండును సుకృతకర్మంబు లొనర్చువాఁడె ద్విజుండును దుష్కృ
తమ్ము లొనరించువాఁడె చండాలుండుఁగాక వర్ణభేదంబు గలదే యని
వానికి బోధించి తద్దత్తమ్ములగు నజాదుగ్ధంబులు గ్రోలి యచ్చోటు
విడిచి యొక్కవృక్షచ్ఛాయ నధిష్ఠించి యున్నంత. 110

సీ. రదనమ్ములయు వా తెరలయుఁగమ్మలయు న
వ్వులయుఁ గాంతులుగండములనుగలసి
యీరెండఁ గాయఁ గ్రొక్కారుటుకమ్ముల వరు
సము గల్గి బారను బారెఁదైన
కురు లీఁగ దిగజాఱు కరణి నున్నఁగ దుప్టి
గడలుకొల్పినకీలుజడలచాల్పు
మొలయుఁ దీరైన తూర్మంలయుఁ బైనున్న క్రొ
న్ననల గంధము దిగంతములఁ బర్వ

తే. గీ. సరము లల్లలనాడఁ గుచములమీఁది
పయ్యెదలు జాఱ రంగు పావడలు మీఱ
గళ్ళుగళ్ళని గజ్జెలు రాళ్ళమ్రోయ
నడుము లసియాడ వారాంగనాజనంబు. 111

వ. కొంద అచ్చటికిఁ దాఁపుననున్న యింద్రుని దేవాలయంబున మేళ
మాడంగ మృదంగంబు పిల్లియ చితారు లోనగు సాధనంబులు ధరి
యించి యాదారింబోవుచుండ నం దొక్కతె వేఱొక్కతె కిట్లనియె. 112

ఉ. కామిని యీచితారు సరిగా శ్రుతిచేయుము చేసితేనిమ
న్నామము వాసికెక్కఁగలనాట్యము సల్పియుఁ బాటపాడియున్

దామరపూవులం బలె సదస్యులడెందములం బ్రమోదకం
ధామమునందు నాపగిది నాట్యమొనర్పఁగఁజేతు నెంతయున్. 113

క. బిగువుగ సారించితివేఁ
వెసఁ దంత్రులు, వదులు చేసితేనిని సరిగాఁ
దగదు శ్రుతి గాన సమముగఁ
దగుగతి సారింపుమీ చితారు లతాంగీ. 114

క. అనుచుం బ్రశంస యొనరిచి
కొనుచుం దమయంతఁ బాడుకొనుచుం జను కా
మినులు వచనములు సిద్ధా
ర్థుని చెవిఁబడెఁ గాని వారెఱుంగరు తపసిన్. 115

వ. అతఁడును దలయెత్తి యగ్గలికం గనుఁగొని మనమ్మున నిట్లు తలపోసె. 116

ఉ. నీచులనుండియుం దగిన నీతులు కొన్ని గ్రహింప వచ్చుఁ దం
త్రీచయముం బిగించి తెగఁదీసినచోఁ శ్రుతిపోవుభంగిఁ గా
ర్యాచరణంబు దేహమున కబ్బినవేళలఁ దత్త్వచింతయుం
దోఁచునె? యే నెఱుంగ కిటు తోరముగా మెయిఁ జిక్కఁజేసితిన్. 117

వ. అని తలపోయుచుఁ దదరణ్యస్థంబగు నొకవనదేవతాలయంబునకుం బోయి యట నిస్తంద్రుఁడై యున్నంత. 118

సీ. తనపేరఫల్గునీతటమునఁ గట్టించు
కొనిన సేనానియన్ జనపదమునఁ
గాఁపురంబుండు నొక్కఁడు ధనవంతుండుఁ
బశుపతి ధర్మతత్పరుఁడు బుద్ధి
మంతుండు విబుధసమ్మతుఁడు; వానికి రూప
వతియు సాధ్వియు దయావతియు సత్య
సంధురాలును మృదుసంభాషిణియు సుజా
తయు నగు నొక కళత్రంబు గలదు

తే. గీ. సకలజనములు దాని సుజాతయందుఁ
మాయయను మాటయెఱుఁగ దమ్మగుప తమదుఁ
గాన్పులేదనువంత యొక్కటియుఁదక్క
నన్యదుఃఖం బెఱుంగ దయ్యాలుమగలు. 119

వ. ఇట్లు కొడుకులు లేమిం గడుకొను దురంతచింతాభరంబునఁ గర
మ్మలందురు నాసుజాతయు. 120

క. రాకారాత్రులయందు సు
తైకోదయవాంఛఁజేసి యేకాశీతి
ప్రాకారపరిదక్షిణములు
తేఁరుపఁ గావించు విపినదేవతగుడికిన్. 121

సీ. ధ్యానంబుఁగావించి యావాహన మొనర్చి
సింహాసనం బధిష్ఠింపఁజేసి
యర్ఘ్యం బొసంగి పాద్యమ్మిచ్చి స్నానంబు
చేయించి నెమ్మేను జేలఁ దుడిచి
యజ్ఞోపవీతవస్త్రాదులను నొసంగి
కస్తూరియును మంచిగంధ మలఁది
ధూప మాఘ్రాపించి దీపంబుఁ జూపించి
పదపడి మది భక్తిఁ బాదుకొలిపి

తే. గీ. వన్యఫలములు వడపప్పు వన్యమాక్షి
కంబు శాల్యోదనంబు శాకములుఁ దెచ్చి
వేడుక నివేదన మొనర్చి పాడి యిట్టు
లనుదినము సేవకావించు నాసుజాత. 122

క. కొడుకొక్కఁడేని నాకుం
బొడమిన రుచిగల్గు తగినభోజ్యమ్ములు నేఁ
గుడువం బెట్టెద నీకుం
బడిబడి మాయమ్మ పైఁడిపళ్లెరమందున్. 123

వ. అని మ్రొక్కికొని తదేకతాత్పర్యమునం బూజించు నాసుజాతకు. 124

క. నెలతప్పి క్రమంబుగ వే
విళు లొదవెన్ నడుము ప్రబలె వెలవెలమనెఁ గ
న్నులు మొగమును జన్మొనలఁ
నలుపొదవెఁ నీరుమోయ నానాఁటి కొగిన్. 125

వ. ఇట్లుచూలాలెంతరాలు పదినెలలు నిండి యొక్క శుభముహూర్తంబునఁ గుమారుం గనినంత సేనానినివాసు లందఱును సంతోషసాగరంబునఁ దొప్పదోఁగిరి. 126

క. సేనానియు డెందమున న
సూనానందంబుఁజెంది నూఱులకొలఁదిన్
దానంబుఁ జేసె గోవుల
మానితమర్యాదులైన మహిదేవులకున్. 127

వ. సుజాతయు నన్నిసువునకు మూఁడవమాసంబు చనుదెంచుటయుఁ దన మ్రొక్కికొనిన మ్రొక్కుఁ జెల్లింపఁ దలంచి తత్తత్పదార్థంబులు శిరంబుమీఁద నిడుకొని యొక్కకేలం గుమారు నెత్తికొని విపినదేవతాలయంబునకుం బోవుచుండఁదదాలయాలంకారార్థంబుగ మున్నుపంబడిన రాధయను దాసి వచ్చి యచ్చెరువుగ నిట్లనియె. 128

క. వనదేవత మనపుణ్య
మ్మున నట సాక్షాత్కరించె; ముఖసౌష్ఠవ మే
మనవచ్చు, సుజనభావం
బెనయించు విలోచనంబు లింతలు తల్లీ. 129

క. అనుచుం దత్తఱమునఁ గడు
వినతశరీర యగుదాసి వితమంతయు నె
మ్మనము వికసింపఁజేయఁగఁ
జనియెం గుడిచెంత కాసుజాతయుఁ బేర్మిన్. 130

వ. చని యటమున్న దేవళం బధిష్ఠించి యున్న సిద్ధార్థుం గాంచి దేవతా

భాత్రిం జేసి తత్తత్పదార్థంబు లతని చెంత డించి సుముఖుం డాసుజాత
కందిచ్చి సాష్టాంగ ప్రణిపాతం బొనర్చి యిట్లనియె. 131

ఉ. శ్రీకల గేస్తునింటికిఁ బ్రసిద్ధిపహించఁగ వచ్చి వంధ్యయై
వేఁకటి రాక దానఁ బలవించుచు నీకయి మ్రొక్కుకొన్న యీ
నాకు మహోపకారము నొనర్చితి వీవు దయామయుండవై
గైకొనుమయ్య నాయిడిన గవ్యఘృతంబును పాయసంబునున్. 132

వ. అని వేఁడికొనిన సాశనాయాపిపాసుండగు సిద్ధార్థుఁడు మూఁడాఱక
య వియన్నియు భుజించి తద్దత్తమ్ములగు పరిమళద్రవ్యంబుల నాఘ్రా
ణించి తత్త్వవిచారార్థం బింతకుమున్ను గడపిన దివారాత్రంబు
లన్నియు స్వప్నానుభూతంబులవలెఁ గన్పట్టుచు నిరంతరోత్సాహ
బలసంపన్నుఁ డగుచు, నాసమర్పించిన మ్రొక్కు యథోక్తముగఁ
జెల్లెఁగదా యను నాసుజాత కిట్లనియె. 133

క. ఈవిపుడు నాకొసంగిన
యీవస్తువు పే రదేమి యెఱిఁగింపుము నీ
కావించిన విధమే యది
నావుడు నిట్లనియె నతివినయమున సతియున్. 134

సీ. మా మందఁ గల వంద మంచి గోవుల దుగ్ధ
గ్ధము లేఁబదింటికిఁ ద్రావఁబోసి
వానిక్షీరమ్ములు పంచవింశతిగోవు
లకుఁ బోసి వానిపాల్పదియుఁ బెంచు
ధేనువులకుఁ బోసి వాని పాల్గోషడ్గ
వమునకుఁ బోసి యవ్వానిపాలు
పరిమళద్రవ్యసంభారమ్ముతోడఁ గ
లిపి పైఁడిగిన్నెఁ జొనిపి వడపడి

తే. గీ. సరసచందనవిటపికాష్ఠములమంటఁ
గ్రాఁగఁగాఁ జేసి యందు ముక్తాఫలములు

వోని తెల్లనిబియ్యమ్ము వోసి పంచ
దారతో వండినట్టి యోటనము తల్లి! 135

వ. ఇట్టిదియు మున్ను నాప్రమొక్కికొనినయది; నిక్కంబుగ వనదేవత వైతివేని దాసురాలనగు నామ్రొక్కు లందికొని నన్నుం గృతార్థత్వ మొందింపు మని కలతెఱంగెఱుంగక భక్తిపరవశయై ప్రార్థించు నాసుజాతంగాంచి యతండు. 136

క. ముసిముసినగ వొలయఁగ న
న్నిసువు శరీరంబుఁ గేల నిమురుచుఁ దలపై
ముసుఁగుం దీసి "చిరంజీ
వ సుఖీభవ" యంచుఁ బ్రియముపడి దీవించెన్. 137

వ. ఇట్లు దీవించి "తల్లీ! యేను వనదేవతను గాను; శుద్ధోదనుండను నొకరాజుకుమారుండ ననుచుఁ దనవృత్తాంతం బెల్లఁ దెలిపి వెండియు.

తే. గీ. క్రిమమున్గా నైకజంతుసారంబుకతన
నీపదార్థంబు రుచ్యమై యెసఁగినట్లు
నైకజన్మంబు లెత్తి యనంతరంబ
జీవుఁడును ముక్తియను ఘనస్థితికి వచ్చు. 139

వ. అనుచు నీవలనం దెలియనయ్యె; నిట్లారకయ జన్మంబు లెత్తుచున్నం తన జన్మసాఫల్యంబు గలుగునో, లేక జీవించియుండియు భూతదయ మున్నగు ధర్మంబులు కలిగియున్నం జాలునోయనియు నీవలనం దేటపడవలసిన యంశంబు లియ్యవి సావధానంబుగా నానతీయవలయు ననుడు సుజాత యతని కిట్లనియె. 140

ఆ. వె. నేను మూర్ఖురాల నీయడిగిన యర్థ
ములకు నుత్తరంబు మొదలెఱుంగ
నాయెఱింగినంత నాచేయునంతయుఁ
దెలియఁజేతుఁ దేటతెల్లముగను. 141

తే. గీ. అనుదినము వేగ లేచి, సత్యస్వరూపు
దేవు నెదలోనఁబాటించి, తివిరి పతికి

వలయు శుశ్రూష సల్పుచు వస్త్రవిధుల
నిరతమొనరింపఁజేతు దానిసలచేఁ. 142

వ. వాపీకూపతటాకమ్ములు త్రవ్వించుటయు శివాలయంబు గట్టించుటయు నగ్రహారంబొసంగుటయు ధననిక్షేపంబును వనప్రతిష్ఠయుఁ గృతిగ్రహణంబును బుత్రప్రాప్తియు ననునవి స్వర్గప్రాప్తిసాధనంబు లని యాగమంబుల నొడువంబడు నట్లగుట మత్పతికి స్వర్గప్రాప్తిసాధనీభూతుండగు నిక్కుమారునిం గాంచుటకు ననేకదేవతారాధనంబులు గావించితి; పరలోకసౌఖ్యంబులకెల్ల కుమారుండు మూలం బని యాగమరాద్ధాంతంబు; దేవతలతోడ సంభాషణాదులు గలిగి మంత్రములు నేర్చిన మహానుభావులకన్న నెక్కుడుగఁ దెలియుఁదాపఁ గానిరతమ్మున నాకుఁ దత్కృతంబులగు గ్రంథమ్ములయందు విశ్వాసమధికంబు; మంచిచెట్టులొనరించిన వారికి మంచిచెట్టులు గలుగం బని నాయెఱింగిన తెఱంగు. 143

క. యాదృశబీజము నాటినఁ
దాదృశవృక్షంబు వొడము తప్పు; దటు లసూ
యాదయలవలనన యసూ
యాదయ లుదయించు నేరికైనం జగతిన్. 144

క. దైవము వ్రాసినపగిదిం
జావున్నదియే సమస్తజంతువులకుఁ దాఁ
గావించు పుణ్యపాపము
లేవానికి నేని నూరకేపో వెపుడున్. 145

వ. ఒక్కయవబీజంబు భూమిపై నాటిన నయ్యది నశించియు ననేకయవబీజమ్ముల నుదయింపంజేసిన పగిది నీ జన్మంబు నశించియు ననేకజన్మంబులకుం గారణంబు గాఁగల; దదియుం గాక జీవించియున్నకాలఁది దుర్భరంబులగు కష్టపరంపరలు తండోపతండంబులుగా వచ్చుచుండెడి నని మఱియును. 146

క. పతిమున్నె బొంది విడచినఁ
జితిలోఁ బడియేను మేన్ దృజించి యతనికిన్
గతిఁ గావించెద నుత్తమ
గతికిం బతులకును సతులె గతులు దలంపన్. 147

క. మారన్న మున్నె బిడ్డఁడు
చారుండఁగ వలయుఁగాని చచ్చినయెడలన్
మాకొదవు దుఃఖవారిధి
కేరతణిం దరణిగల్గు సిద్ధచరిత్రా. 148

క. కాపున నామన మెన్నఁడుఁ
జాపునకై వెఱవ దనఘ ! సరిగా జన్మం
బీవరుస దుఃఖ మేది షు
ఖావిర్భావమున జరగ నయ్యెడు నాకున్. 149

క. రిత్తులపై దుర్విషయా
సక్తులపైఁ గష్టపడెడు సంసారులపై
సక్తంబివంబుఁ గరుణా
సిక్తత జాలివడు నాదుచిత్తం బనఘా. 150

క. అపకృతి యొనరింపమియును
నుపకృతి యొనరించుచుంటయును సత్కృతులం
దపియించుట లోనగు పు
ణ్యపరంపర నాయొనర్చునట్టిది తలఁపన్. 151

వ. కాపున నాకు వచ్చెడిదంతయు ననుకూలంబుగనె పరిణమించుచున్నదని నొడువు సుజాతం గాంచి సిద్ధార్థుం డిట్లను. 152

క. నీయుపదేశము గడుభ
ద్రాయితమై మదికినచ్చెఁ దల్లీ పెరిమన్
నీయంతవాని నన్నుం
జేయుము దీవించి వృద్ధిఁజెందెద నీవున్. 153

శాతాస్మదీయబాణా
పాతంబున నేతదీయపటుధైర్యంబున్. 161

వ. అని సాహసిక్యంబుఁ దెచ్చుకొని. 162

మ. శతిపార్శ్వంబునఁ, గేల నిత్యధనువున్, రాజీవముఖ్యాశుగ
ప్రతతుల్ కక్షమునం దెలంగఁ, దరుణీవారంబు కీరంబులున్
శతసంఖ్యంబుగ వెంటరా, సొబగుటంచల్ నెమ్ములున్ నాట్యసం
గతులం జూపఁగ నేగుదెంచె నట తక్కాముందు రామాకృతిన్. 163

క. చనుదెంచి ధనువు సజ్యం
బొనరించి కరంబునం దొకుగాత్రిశుగముం
గొని మునినిం గని యిట్లని
యొను నేత్రము లెట్టఁబాటి యింతింతలుగన్. 164

శా. ఓరీ, క్షత్రియపోత! ముక్తిఁ గనఁబో నుద్యోగమున్ మాని యిం
పారం గోరు మభీష్ట మిచ్చెదను ధర్మాసక్తి వర్జింపుమా
నారాచం బిది మేనిమీఁదఁ బడెనే నాశంబుఁగావించు నీ
ధీరత్వంబును నైష్ఠికత్వమును ఖ్యాతి న్నీతియున్ జాతియున్. 165

ఉ. పుట్టితి నార్యపూజ్యమగు భూవరవంశమునందు ముష్టిఁ జే
పట్టుట ఖ్యాతియా! ప్రజల పాలనఁ జేయుట ఖ్యాతిగాని; యి
ప్పట్టున నైన నాపలుకు పల్కులు నుంత శ్రవోయుగంబునం
బెట్టుము, పెట్టవేని మదిబీరము ధైర్యముఁ గాచుకొమ్మిఁకన్. 166

క. అనుచుం బాణముఁ జాపం
బునఁ దొడి కన్యలును సుతులు మూంచఱ నల్లా
డ నిభృతలక్ష్యండై వద
లెను బ్రత్యాలీఢపాదలీనుం డగుచున్. 167

క. వదలినశరమునకున్ ధృతిఁ
జెదరక కీడ్వడక వికృతిఁజెందక లోనం

బెదరని శాక్యకుమారుని
మది కప్పెయివంది కుంది మదనుం డంతన్. 169

చ. వెలిమలరాచబిడ్డయగు పార్వతికై మును శూలిచిత్తముం
గలఁచిన బాణముల్ సరకుగైకొనఁ డక్కట. నేను శంకరుం
గెలిచినవాఁడఁ గానొ! యిది కీడ్పడఁజేసినయమ్మ గాదొ! నా
బలము క్రమంబుగాఁ దఱిఁగి పోవ్వదెనో! యని లోఁ దలంచుచున్.

తే. గీ. కుసుమశరములు సరకుగాఁ గొనఁడితండు
రతియుఁ జాలదు వీని సంరంభమునడఁప
గాన భూతగణమునకు లోనుచేయ
గెలుచు నవి యంచుఁ దన భూతములను బిలిచె. 170

సీ. తలఁచినయంత గదాప్రాసనగశర
ప్రముఖనానాయుధపాణు లగుచు
నైకంబులైన యాననములు నైకంబు
లైన నేత్రములును నైకములగు
రూపులు గల్గువారును నగు భూతభృ
త్యులు వేనవేల్వచ్చి యుత్సుకులయి
క్రూరమృగంబులై కొందఱు పడగండ్ల
కొండలు గురిపించి కొంతమంది

తే. గీ. కొండచిలువలుగా వచ్చి కొంతమంది
కుంభవృష్టులు గురిపించి కొంతమంది
కుజములఁ బెఱికి వైచుచుఁ గొంతమంది
యేఁచి బాధించి రా శాక్యనృపతనూజు. 171

తే. గీ. ఇట్లు భూతగణంబు లనేకగతుల
బాధ నేయఁగ శాక్యనృపాలసుతుఁడు
భయముఁ గాంచక ధైర్యంబు పాటువడక
సంచలింపకయుండెఁ గాష్ఠంబువగిది. 172

క. తపచేయు కితవమార్గం
బునఁ బడని మునీంద్రుధైర్యమున కెటు భంగం
బని యెంచు మన్మథునకున్
వినఁబడె నారస్కృతముగ వింటం బలుకుల్. 173

శా. ఓరీ, మార ! యిఁకేల మానుముర, నీయుద్యోగ మీమౌని యా
చారంబుం దెగఁదీయ నీతలమె ? విజ్ఞానంబు నానాభవో
దారంబై ఘటియించె నీతనికి; సూర్యాచంద్రమోవహ్నులుం
బారావారము లాఱుఁగాని చలియింపం డీతఁ డింతేటికిన్. 174

సీ. అజ్ఞాన మనియెడి యంధకారంబేర్చు
రత్నప్రదీప మార్పం దరంబె
దుర్లోభమను రవిద్యోతంబుఁ దొలఁగించు
పారిజాతంబుఁ గూల్పం దరంబె
కుమతంబులను ధరాజములను బెకలించు
భద్రనాగంబుఁ జంపం దరంబె
జీవహింసాదావపావకంబు హరించు
పటువారిదంబు రేపం దరంబె

తే. గీ. నీ తలఁకు మించిపోయినరీతిఁ జేయఁ
బూనుకొంటివి, నీబుద్ధి బూదెగాను !
భ్రిగ్గతంబగుకీర్తియు భంగపఱుపఁ
దగునె, చాలింపు మీపాడుతెగువ మార ! 175

శా. అంత న్మారుఁడు, బుద్ధుఁ డీజగమునం దజ్ఞానముఁ బాపి తా
నెంతే జ్ఞానలతన్ నిగుడ్చు, నిఁక నేనేరీతి నిం దెందువ
ర్తింతున్ ? జ్ఞానుల కీప్రచారములు వింధే ? దీనికి న్మాఱు గా
వింతుం గాక యటంచు శత్రుగణముం బ్రేరేఁపెఁ; బ్రేరేపినన్. 176

క. చెలరేఁగెడి యార్పుల ని
మ్మలఁ గామక్రోధలోభమోహాదులు దీ

లలితుఁడగు బుద్ధునకు నా
సలుగొల్పి కలంపఁదొడఁగె స్వస్వాంతగతిగన్. 177

ఉ. కోరికపుట్టుఁ, గ్రోధ మొనఁగూడు, దురాశ జనించు, లోభ మే
పారు మదంబు, ద్వైతభావము, సంతస చింతయు హెచ్చుఁ దృష్ణ తం
బేరఁగనీని యస్మదహితు చిత్తమునం దిటులైన నన్నుఁ దె
వ్వారు జయింపనేర్తు? రరివర్గ మెదిర్చి కలంపఁ దొడ్గెనన్. 178

క. పదపడి యాతం డిది వి
ష్మది నెఱిఁగినవాఁడుగాన మఱవుఁ గనని ధు
ర్మదమగు నరివర్గంబుల
బెదరించి కలంప నదియు భీతిలి చనఁగన్. 179

వ. పిదప నహంకారమ్మను మాయయు సాహసికమ్ములును జిగీషయు గర్వంబును నవిద్యయు లోనుగాఁగల దుర్గుణమ్ములు స్వస్వభావంబుతో నెదుటం బొడకట్టి బుద్ధిం గాసిపెట్టినను నతండు నిర్వికారుండై యుండి.

సీ. అంధకారముభంగి నావరించెడి మాయ
కినుసుంతయైనఁ జోటీక కలఁచి
పృథ్వీధరముభంగి పెచ్చుపెరుఁగునహం
కారంబునకు లోనుగాక మిగిలి
కారుచిచ్చులరీతిఁ గదియు గర్వమున కా
వంత యేనియు లోఁగక ట్టి తఱిమి
కదలిపోలికఁ బొంగుఁగను జిగీషాపిశా
చము కంటఁబడక పంచన ఘటించి

తే. గీ. యధికవిజ్ఞప్తి నెసఁగు సిద్ధార్థు నెదుట
నంగనల రంగులును నయ్యనంగదేవు
సంగతులుఁ గోకిలాలాపభంగులును వె
డంగుఁ గనలేక యారక డంగువడియె. 181

వ. అంత మదనుండును. 182

చ. సుచిరకృశాంగియౌ నల యశోధర పుత్త్రినిఁ గక్షమందుఁ దా
లిచి. "పసు వీడు బొప్పగునె? లేమ, ననాథ ననాదరింతురే?
విచికిలగంధు లీవిరహవేదనసుం దగువారె" యంచు నే
ప్పుచుఁ బిసువెంచుభంగి నృపసూనుని కట్టెదుటం గనంబడెన్. 183

క. కసుపట్టిన నివియెల్ల మ
రునిచెయ్వులె యంచు లోనరోయుచు బుద్ధుం
డసమాన మొకించుకయును
గనకుండె; వికారమెట్లు ఘనులకు నొదవున్! 184

వ. ఇట్లు మదనోద్యోగంబు విఫలం బగుటయు.

ఉ. మాయ యదెంత లేని సపహాసముగాఁ దన కెంచి మీఁద న
త్యాయతమైన వృష్టి భయదమ్ములు గర్జితముల్ చెలంగఁగా
వాయు పమేయమై విసరఁ, బాదపముల్ ధరఁగూలఁ గల్పనం
జేయుచు నాతఁ డెయ్యెడ వసించునొ యయ్యెడ కెక్కుదద్దియున్. 186

క. పదపడి దిక్కులు తెల్విం
బొదలెన్ ధర నిర్మలత్వముం గనెఁ గడు మే
లొదవెన్ సత్వములకు ది
వ్యదృష్టి యుదయించె నంత నయ్యనఘునకున్. 187

వ. ఆ దివ్యదృష్టిచేతన నతనికై దువందలయేఁబది జన్మమ్ములందలి తన వృత్తాంతం బెల్లఁ గన్నులకుం గన్పట్టుటయేకాక పూర్వాపూర్వకృత సుకృతదుష్కృతంబు లుత్తరోత్తరసుఖదుఃఖ కారణంబు లని తెలియం బడియె; నంతఁ బ్రీతిమనుజూసక యోగాయోగంబులకుఁ బురాకృతంబు కారణం బని యెఱింగి సంసారంబు కదళీగర్భనిస్సారం బని తలపోయుచు ననంతమ్ములగు లోకంబులును సూర్యాదిగ్రహమండల విశేషంబులును వానిగతులును వీచీతరంగన్యాయంబునం బొదలు ననియు, వీని కన్నిటికి నొకమహాశక్తి పట్టుఁగొమ్మయై యలరు ననియు, నయ్యది యిచ్ఛామాత్రంబునఁ జీఁకటినుండి వెలుతురును మృతినుండి ప్రాణమ్మును శూన్యతనుండి పూర్ణత్వంబును నరూపంబు

నుండి రూపంబును గల్పింపఁ జాలు ననియును, నియుక్తంబును గానను వారలును గానివారలును లే రనియు, నదియే సర్వోత్కృష్టం బనియు, వికారశూన్యం బనియు, సృష్టిస్థితిలయంబులకుం గారణీ భూతం బనియుం దెలిసికొని ప్రతిమనుజుండును బ్రతిసన్న్యాస్యు చిన్నపెద్దలను భేదంబును జాతిగుణక్రియాభేదంబును దలఁపక ప్రాణిహింస వర్జించి సర్వసమత్వంబుఁ గాంచిన ముక్తిమార్గంబు లభించి క్రమంబున నిర్వాణమను ముక్తిపదంబు నొందునని యుం గనిపెట్టె.

క. నాలుపదాయున ధర్మో
న్మూలన మొనరించు పాపమున దుఃఖఫలం
బేలీలఁ బొలఁగునో తా
నాలోకముఁ జూచె నిశ్చలాత్ముం డగుచున్. 189

సీ. పెరుఁగుట తఱుగుట ప్రీతి యసూయయుఁ
గర్తృత దుఃఖంబు గారకత్వ
మాదియౌ సంగతు లలఘుసంతతిని
జన్మరాహిత్యంబు జనుఁడు గనఁడు;
మఱియును సుఖదుఃఖమయమగు సంసృతి
యానాయమని తెలియంగలేని
వారికి ముక్తి చేకూరదు; మాయావి
లసనంబు మొదటికిఁ గనిపించంగ

తే. గీ. జీవితేచ్ఛఁ ద్యజించి యాశించుముక్తి
నెవఁడు వాని కొదవు దివ్యదృష్టిఁ దానఁ
జేసి యఖిలంబుఁ దెలియు సుస్థితియుఁ గల్గు
నింత నిజమని బుద్ధున కెఱుక వొడమె. 190

వ. ఇంతదనుక మనుజుం డీమాయ జయింపదుండు నంతదనుక వాంఛా మూలంబగు తృష్ణయు భోగమ్మును స్తోత్రప్రియత్వంబును యశో

లిప్సయు నధికారతూరతయు జిగీషయు నహామిదంమమేద మ్మనుసహం కారంబును బ్రితుపదెరువునకై పడు పాట్లును లోనుగాఁగల విషయం బులం బ్రుంగుడువడుచు నవయుచుండు. బుద్ధిమంతుండు పరిభ్రమింప, కనంతంబులగు జన్మంబులను పడుగుతో మనోవాక్కాయక్రియ లను పేకసు గలిపి యల్లఁబడిన జన్మపటంబు శుద్ధం బొనరించుకొని, పూర్వ పూర్వవాసనావశంబగు నుత్తరోత్తరజన్మంబులను బొందుచుఁ, దుదకు జన్మసంపూర్తిఁ గావించుకొని, మాయాతీతుండై, శరీరస్కంధమ్ము లుపేక్షై, యుపాదాన బంధంబులం బట్టువడక, కాలచక్రావర్తంబునం దిరుగుడుపడక, సుప్తుండుమేల్కాను తెఱంగునఁ దెల్వింగాంచి, యని ర్వాచ్యంబును నానందమయంబును బాపరహితంబును నిర్వికారంబు నగు నిర్వాణపదవిఁ బొందు నని కృతనిశ్చయుండై పరమానందంబగు నిర్వాణపదవి యధిష్ఠించి యున్నంత. 191

తే. గీ. అరుణుఁ డుదయించె, నాతని కిరణములకుఁ
దారలన్నియు వెలవెలఁ బాఱఁజొచ్చెఁ,
గొండలం దెల్లయెడల నీరెండపర్విబలెఁ
గమలకుట్మలములకు వికాసమొదవె. 192

సీ. పచ్చికపట్లపైఁబడు మంచుబిందువుల్
వజ్రశకలపరిభ్రాంతిఁ జేసెఁ
బృథివి నెల్లెడఁ గాంతి విస్తరింపఁగఁజొచ్చెఁ
గెంజాయ మేఘపఙ్క్తిపయినెగడెఁ
దాశద్రుపత్రముల్ తళతళమీఱు బం
గారు చామరములసౌరుఁ దాల్చె
హరిణంబు లాదియౌ నతిసాధుజంతువుల్
క్రమముగా మేల్కాంచఁగాఁదొడంగె

తే. గీ. శుకపికాదికసర్వపక్షులును నిదుర
లేచి సూర్యుని వినుతి సల్పెడు విధమునఁ

గూయ మొదలిడె నంత నర్కుండు పొడిచె
దిక్కులం దంతకంతకుఁ దెల్వి హెచ్చె. 193

క. ఆనాఁటి సుకృత మేమనఁ
గానను, మది నెల్లరకు వికాసము ప్రబలెన్
శ్రీనెగడి రెల్లవారును
జ్ఞానోదయ మతని మదికిఁ గలిగిన యతనన్. 194

సీ. పఱ్తకు ల్మోసంబు వర్జించి తూఁచిరి
దస్యులెల్లరు దొంగతనము మాని
రసినేయువారు తా మంతతో విరమించి
రాధిమంతులబాధ లడఁగఁ దొడఁగెఁ
గటికవాండ్రును గత్తిఁ గడకొత్తి రజ్ఞాను
లకు నెల్ల జ్ఞానవిలసన మొదవె
రోగులెల్లరును నీరోగులై చెన్నారి
రెల్లజంతువులకు నెలమి వొడమెఁ

తే. గీ. చచ్చిపోయెడి వారలు సయిత మతని
జ్ఞానలవ మింత సోఁకిన యతనసో యు
సంగ విస్మితవదనులై యలరి రవి; యి
ది యననేటికి సర్వంబుఁ దేటపడియె. 195

క. ఆకాశమునం దమరులు
మాకార్యము ముగిసె ననుచు మాటికి సంతో
షైకస్థితి వహియించుచుఁ
బ్రాకటముగఁ బూలసోన వర్షించి రొగిన్. 196

క. చిరవిరహవేదనాభర
పరవశయై పగలఁ బొగులు పాపనికి యశో
ధర కానాఁడు హృదబ్జాం
తరమున నామోదరసము తానై పొడమెన్. 197

మ. పులులున్ లేళ్లను నొక్కఁజో మసలెఁ, బాముల్ క్రౌర్యముల్ మాని యీ
దలలన్ పంచి చరించెఁ, గొంగలకు మత్స్యంబుల్ భయంబొంద కెం
దు లలత్తుంగతరంగరింగణములందుం గంతులన్ వైచె, నొ
క్కగతిం దోఁచెఁ బ్రపంచ మెల్లరకు వక్రప్రక్రియాశూన్యమై. 198

వ. అట్టియెడ సిద్ధార్థుండు బుద్ధుండై.

శా. ఎన్నేజన్మము లెత్తియెత్తినను నే నెంతేని నీరీతిఁ గా
నన్నేరన్ నిన్ను నేఁటికిం దెలిసికొన్నాఁడన్ భవద్వృత్తినో
యన్నా! మామకజన్మకారణ మమాయాచాకచక్యక్రియా
సన్నంబైన శరీరలబ్ధి కిఁక నే సంధింతు నంతస్స్థితిన్. 200

చ. అని యనుకొనుచు నిర్వాణపదారూఢుండై యావటవృక్షంబు క్రిందన
ధర్మాసనంబున నాలుగుసప్తాహంబులు గడపి నానాదిగంతసమాగతు
లగు నంతేవాసిజనంబులకు నిర్వాణసాక్షాత్కారంబు నుడువుచు నాప్రి
దేశంబు కదలి సతతసంసేవ్యమానపరస్సహస్రజనసమాకులుండై
యెడనెడ నగరపల్లీవనపర్వతప్రదేశంబులం బోధిసత్వం బుపదేశించుచు
విజ్ఞాత లగు నంతేవాసిగణంబుల నుపదేశకులఁగా లాఁతి దేశంబుల
కంపుచుం జనిచని. 201

క. మన నగరంబున కెన్నఁడు
చనుదెంచునొ, తమము నెపుడు సమయించునొకో ?
యని తలఁచు బింబిసారా
వనిపతిపురి బుద్ధరజనిపతి యుదయించెన్. 202

— • ఆశ్వాసాంతపద్యములు • —

క. ప్రకృతపురాతనకవిరా
జకృతాంధ్రకృతిప్రపంచసారస్యమిళ
త్ప్రికృతీ! సుకృతీ! మదనా
నుకృతీ! కృతిమాధురీవినోదితసుకృతీ! 203

మ. కవిరాజానుమతప్రచార ! లలితాకారా ! గుణాపార ! పం
డివరాభిష్టుతనైజసార ! స్వకథానీతామృతాస్వాదిమా
నవరాణ్మౌళిసుతా ! నతార్తిజన! ధన్యప్రాభవా ! రెడ్డిపో
లపరాధీశ్వర ! కృష్ణరాయనరపాలా ! సత్యశీలాగ్రణీ ! 204

సుగంధి

ధీరధీర ! గర్వదూర ! ధీవిశాల ! శాంతిశూ
రా ! రమాకుమారతుల్య ! రాజసూయమానవి
ద్యారసప్రసన్నతాంధ్ర తత్కవిత్వకర్తృవా
రా ! రసాబుధేంద్ర ! కృష్ణరాయభూమిపాలకా ! 205

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరప్రణీతం బైన
బుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందు
చతుర్థాశ్వాసము

శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బుద్ధచరిత్రము



## పంచమాశ్వాసము

క. శాంతరసాపూరితహృద
యాంతర! కాంతస్వరూపయశఆసీతా
శాంతకృతాకించనతా
కృంతన! కవిరాజగేయ! కృష్ణారాయా! 1

వ. అవధరింపు మనంతరం బట్లు బుద్ధుండు రాజగృహపురంబుం జేరి యుండె: నిచటఁ గపిలవస్తుపురంబునఁ దండ్రి శుద్ధోదనుండు. 2

మ. ప్రతిదేశమ్మును జారులం బనిచియుం బైరాగులం గాంచిన
ప్డు తనూజాతుఁడు వారిలోఁ గలసినాఁడో యంచు వీక్షించియుం
బ్రతివారమ్మును యత్న మెంతయయినం బాటించి పాటించి త
త్స్థితి యొక్కింతయుఁ గానరామి మదిఁ జింతించుం దివారాత్రముల్. 3

వ. వెండియు సిద్ధార్థుభార్యయును బరమపతివ్రతామణియునగు యశోధర సారె సారెకుఁ బ్రాణనాథు గుఱించి విలపించియు దూరాగతులగు సార్థవాహుల నడిగియు నచ్చటచ్చటికి వార్తలు పంపించియుఁ దరువాత నించుకేనియుఁ దదుదంతంబు గానరామి నిట్లు చింతించు. 4

ఉ. ఇంటికి నెంత దవ్వయితొ, యేగతి మార్పును జెందినాఁడవో,
కంటికి నింత బర్వయితె కట్టిఁడిమాలవిధాత కక్కటా;
చంటికుమారునైనఁ గనఁజాలు నదృష్టము నోఁచవైతి, వే
వెంటఁ జరించుచుంటివొకొ? వేదన నే నెటు లోర్తు నాయకా! 5

క. బ్రతికియె యుంటివొ? లేదే
మృతియేఁ గనినాఁడవో? మతేమైతివొ? నీ

స్థితి తెలియదాయె; నే నే
గతిఁ బ్రాణము నిల్పుదానఁ గతినాత్మ్రకస్తై. 6

క. ఈ కపిలవస్తుపురమం
దేరచ్ఛత్రాధిపత్య మొసయక సన్న్యా
సాకులత శోకమందుట
నీకెటు తగునయ్య? ధాత నిర్దయుఁడు గదా. 7

క. మీయయ్యరన్న వెండియు
నాయీసుతుకన్న మఱియు నారన్న నృపా
లా! యెంతపుణ్యపతియో
మీయమ్మకు ధాత మున్న మృతిఁ గల్పించెన్. 8

వ. అని మఱియు దుఃఖావేశంబు సైఁపఁజాలక.

తే. గీ. శాక్యవంశసంభవుఁడగు చక్రవర్తి
ననఘు నేమంచు నెంచి సన్న్యాసిఁ జేసి
యడవి నిడుమలు గుడిపించె నకట, ధాత!
యుచిత మనుచితమును సుంత యుఁ దలఁపవలదె! 10

క. ఇటుఁ జింతించుచుఁ గపిన
క్కుటికం బొలయంగఁ గల్పకల్పము గాఁగన్
ద్రుటిఁ గడపుచు నొకనాఁడె
క్కుటిఁ జనెఁ బూఁదోఁటకు మధుకాలమునందున్. 11

మ. అలరుల్ ప్రాలెడు నించు పూఁబొదలయం దంచంచు విశ్రాంతికై
మలయుం, దానును భర్తయు న్మునుపు సన్మానించు ప్రత్యాశిశిలం
డలఁకున్, లోనులుకుం, దిటంబు గను, సంతంబు గాంచు, శంకించు, లోఁ
బలవించుం జెలికాని చెయ్వులకు నప్పద్మాక్షి విభ్రాంతయై. 12

మ. పడము ల్తొట్రిల నెమ్మనం బవియ బాష్పప్రావృతాంతై సుసం
తదశం జూడఁగనీక కన్నుఁగవ సంతంబు గూర్చ నెమ్మెన్నొదం
కఁ దదాయత్తమనస్కయై యొకట నశ్రాంతాలలాపంబు గ
ద్గదకంఠంబున నొక్కకాలువదరిం గాంచి యాలోలయై. 13

క. మొగమునఁ బడు జడలం దగ
నెగఁద్రోయుచుఁ గాంతి దక్కియెంతయుఁగృశమై
పొగిలెడి చెక్కుం దాద్రుశ
మగు కేలం గీలుకొల్పి యవనతముఖియై. 14

సీ. ఉత్సవం బనుచు శాద్యులతేఁడు చాటింపఁ
జాటించి నన్నేల పంపెఁ దండ్రి ?
పంపుఁగాఁ దందఱు పడఁతులవలెఁగాక
యతనిమానసము నన్నంటనేల ?
యంటుఁగా, కాత్మవిద్యాసక్తుఁ డని యెఱిం
గియు నమ్మహాత్ము నెనయు టిదేల ?
యెనసిన నేమి, నన్నెంతేని గారవ
మ్మునఁజూచి తుదకిట్లు చనఁగనేల ?
తే. గీ. చనిన వారలు లేరె, యీసరణి వార్త
యైనఁ దెలియంగ నీయని యట్టివారు
గానఁగారారు గాని; యేఁగడచు పెట్టు
లీవియోగాబ్ధి ? దుర్యోగ మెట్లు తప్పు ?. 15

చ. అని పలుమాఱు నెమ్మనమునందుఁ దలంచుచు మిన్ను మన్ను నొ
క్క నియతిగా నలందురుచుఁ గాంతుఁడుఁ దాను ను మున్ను పేర్మి నె
క్కొనఁగ వసించినట్టి సుమకుంజములం గనుఁగొంచు "నక్కటా"
యనుచుఁ బురాకృతం బనుభవైకవినశ్వర మంచు నెంచుచున్. 16

వ. పశ్చాత్తాపాతిరేకమ్మున మణిమయమ్మను సిద్ధార్థుండు తనకిచ్చిన
దియు నగు మేఖల కేలం గొని పతి లేఁచిపోయిననాఁటి రాత్రి
నుద్దేశించి. 17

మ. అకటా ! కృత్రిమ మింతయే నెఱుఁగ కన్యాసక్తుఁడుంగాక ని
ర్వికలంకైనమనంబుతో ననుఁ గడుం బ్రేమించి నిద్రించు నా
యకుని న్నాదగు పర్యంకనుండి యెడసేయం జాలి తో రాత్రి ! జా
లికి దూరంబగు చేరికేనియును మేలే, చాలు దుశ్శీలినీ. 18

వ. అని నిందించి యంతం బోరి కొమరుం డగు రాహులుం గూర్చి. 19

మ. కొడుకా! యెంతటి దుర్ముహూర్తమున నాకు స్ప్రపు గర్భంబునం
బడితో, నాఁటి నిశీథమంద జనకుం బైరాగిఁ గావించి పె
క్కుడుమ లొప్పొందఁగఁ జేయుచుంటి వకటా! యేమందు నీవంద, మె
ప్పఁడు తండ్రి న్సుఖపెట్టు వానికిఁ గదా పుత్రించుఁ బుత్రుం డనన్.

చ. అని పలుమాఱుఁ దల్లి పడునార్తి యొకించుకయేని బాల్యప
ర్తనుఁడగు రాహులుం డెఱుఁగరామి సమీపమునం దెలర్చు పూ
లను దగఁ గోసి తెచ్చి మిగులన్ బిగలం దగులంగఁ జేయుఁ గే
ల నిడుచుఁ గేరుచుం దుముకులం గొలుపున్, తన పే రెఱింగెనున్.

వ. అట్టియెడ వెండియు నయ్యశోధర శోకావేశంబున నలుగడలం
దిలకించి. 22

చ. అవనిసమస్తముం దిరుగు హంసపతంగములార! మేటి చ
క్కవకవలార! నా యెఱుకఁ గాంచి చరించు పికమ్ములార! కీ
రవరములార! యెందయిన నాసుతు జాడ తెలియంగవచ్చెనే
నవసరముం గ్రహించి నను నాతనికి న్వచియింపుఁ డొప్పుగన్. 23

మ. సుతుఁ దేదేండ్లవయస్సువాఁ డనియు నిం జూచి స్మరణంబులం బ
ల్కుతుకంబారఁగ నున్నవాఁ డనియుఁ గోర్కుల్మిన్ను ముట్టంగ నీ
సతియై నట్టి యశోధరాతరుణియుం జాలేక వాల్గిఱాపశో
షితయై యాగతి నిల్చియున్న దనియు న్శీఘ్రంబ పంపందగున్. 24

వ. అని యిట్లు పరిపరివిధంబులఁ బలవించుచుఁ గొంతసేపుండ నయ్యశో
ధరపాలికి నెచ్చెలు లరుదెంచి యిట్లనిరి. 25

తే. గీ. హస్తిపురినుండి యియ్యెడ కరుగుదెంచి
నార లిరువురు వర్తకు, లవ్వారిపేర్లు
త్రిపుషభల్లూకులఁట, సర్వదేశములు చ
రించు నెడఁ గాంచిరఁట శాక్యనృపతనూజు. 26

వ. వార లిరువురు మన కోట దక్షిణద్వారంబున విడిసియున్నవార, లో దేవీ!
యందమగు సరిగంచు దుప్పట్లును పంచికట్టులును చిత్తలపాలెమ్ము

లును దంతపుపస్తువులును సుగంధద్రివ్యములును జిత్రిచిత్రిమ్ములగు పక్షులును నమ్మఁదెచ్చి రని మఱియు నిట్లనిరి. 27

ఉ. దీనికి నేమి గాని విను దేవి! భవత్పతియౌ నృపాత్మజు
న్మానుగఁ జూచి వీరలు నమస్కృతి సల్పితి మంచుఁ జెప్పి, రా
జ్ఞానఘనుండు జ్ఞానులకు సైతము జ్ఞానము దెల్పుచుం గృపా
మానతఁ బూని పూజ్యుఁడయి యున్నవిధమ్మను జెప్పి రచ్చుగన్. 28

క. ప్రకటగతి బుద్ధుఁ డను సా
ర్థక నామము పూని యిద్ధరన్ దానెం తే
నకలంకబుద్ధి లోకో
పకృతికిఁ జరియించుచున్నవాఁ డఁట, తల్లీ! 29

క. అని వెండియు నాపెకు ని
ట్లని 'రోవనజాయతాక్షి! యతఁ డివ్వటికిం
జనుదెంచు నైన్యశమ్మని
యును జెప్పిరి యెంతనిక్కమో యది' యనుడున్. 30

మ. పరమానందపరీతయై మనము డాఁపనా్రిమి వేగ న్యశో
ధర 'యావర్తకుల న్సగౌరవవిధుల్ దైవాఱ నాయొద్దకు
న్సరవిం దోడ్కొనిరండు, రాకొమరు సచ్చారిత్ర మాలించి, వం
దురుకర్ణమ్ములకున్ రసాయన మొనర్తుం, జింత లిం కేటికిన్. 31

క. వారలు కోరుకొనిన బం
గారము రత్నములు గాన్కఁగా నిచ్చెద, మీ
కోరినయవియును మీకుం
గారవమున నిచ్చి పుత్తుఁగా చెలులారా.' 32

వ. నావుడు నెచ్చెలు లేగి యాసార్థవాహుల రావించుటయుఁ దెరచాఁటుగ నిల్చియుండి యాయశోధరయు. 33

ఉ. ఓయనఘాత్ములార పరమోపకృతిం బొనరించుచుం జగం
బేయెడ నిల్లుగాఁ దిరుగు నీనృపనందను చందమెల్ల నా

యామెడఁ గాంచి యీయెడకు నమ్మహనీయుఁడు వచ్చునంచు మీ
రే యిటఁ దెల్పినార లఁట, యీయది సత్యమకా వచింపుఁడీ. 34

వ. నావుడు నందుఁ దిరిపుషుండనువాఁ డి ట్లనియె. 35

శా. తల్లీ! యయ్యమలాత్ముఁ జూచితిమి, తత్పాదద్వయి న్భక్తి నం
ధిల్ల న్మ్రొక్కితి, మగ్గురుం డఖిలపృథ్వీనాథమౌళిస్థలో
త్ఫుల్లశ్రీఖచితాంగుఁ డై సుఖముగా బోధ్యాహ్వయమ్ము న్సము
ద్యల్లీలమ్మను నైన మఱ్ఱికడ బుద్ధత్వంబుఁ జెందెం దగన్. 36

వ. అవ్వటవృక్షంబు మగధదేశమ్మున ఫల్గునీనదియొడ్డున గయానికట
మ్మున నున్నయది; యమ్మహానుభావుం డెల్లరకు నిర్వాణంబు తెఱ
తెల్లంబుగ బోధించుచు ననేక జనానుగమ్యమానుండగుచు మహోన్న
తానందపదవియం దున్నవాఁ; డింతయేల, గాలివెంట శీర్ణపత్రంబు
లకేనియు గోపాలునివెంట గొఱ్ఱెలమంద కేనియు యుగపద్గమనం
బలవడకుండుఁ గాని యమ్మహాత్మువెనువెంట నెల్లజనులకు యుగపద్గ
మనం బలవడకుండ దని మఱియును. 37

క. తొలకరివానలకు న్మొం
గల నాతం డిటకు వచ్చుఁ గలకంఠీ! నా
పలుకులు సత్యము లిందుం
గలుగ దసత్యంబు నీవు గాసిలకు మీఁకన్. 38

చ. అనుడు యశోధరాబ్జముఖి యంచనిమ్రానిఫలంబు చేతికం
దినగతి సంతసించుచు మది న్మఱి కోరుకు తెన్నియేని నిం
పును ఘటియింపఁ దన్మయతఁ బొంది పొరింబొరి మూర్ఛచెందె; నం
గనలకు సింతకంబె సుఖకాలము పేఁటొకఁ డెందుఁ గల్గునే. 39

వ. ఇట్లు పరవశయై తనంతన తెలిసి వారలఁ గాంచి మేదురం బగు నాద
రంబున నిట్లనియె. 40

క. అనఘాత్ములార! జ్ఞానము
జనియించె నతనికి నని వెసం జెప్పితి, రే

యనువున నాసంగతి మీ
కు నెఱుంగంబడియె నాకుఁ గొంచక చెప్పఁడా. 41

వ. నాపుడు భల్లూకుండను వాఁ డి ట్లనియె. 42

చ. ధరణి వడంకె వాయువులు తద్దయు శీతియొసంగ వీచెఁ బె
న్వఱదలు వచ్చె, నన్నియును జ్ఞానము నీపతి కబ్బుటోర్వ క
మ్మరుఁ డొనరించు చెయ్వు లని మాకు వినంబడెఁ; దానఁ జేసి మే
మరిగి సమాధినిశ్చలు మహామహుఁ గంటిమి మఱ్ఱిచక్కటిన్. 43

వ. వెండియు నమ్మఱునాఁడు ప్రభాతమ్మునఁ బూర్వమ్ముకంటె శతగుణ
మ్మగు తేజమ్మునఁ బద్మబంధుం డుదయించె; సమస్తజనులహృద
యమ్ములు నమందానంద కందళితమ్ములయ్యె; నిది యిట్లుండ నాకాశ
వాణి, 'యోబుద్ధా! నీ తెలిసిన విజ్ఞానంబు జగంబున కుపదేశించి యం
దఱం గృతార్థులఁ జేయు' మని పల్కెడు బుద్ధుండు నమ్మాటకుఁ
జిఱునగ వంకురింపఁ దత్రత్యుల కిట్లనియె. 44

చ. వినుఁ డొకమాట దెల్పెద, నవీనులకుం బరిపాకశూన్యులై
తనరెడివారి కెక్కుడణఁ దత్త్వము తేటపడుం? దినేంద్రుఁగ
న్గొనియును బాలచందమునఁ గుట్మలము ల్వికసించునే? పురా
తనపరిపాకవంతులగు తాత్త్వికులం గరఁగింతుఁ గావునన్. 45

వ. అని కొండొక యుపన్యసించి యచ్చోటు గదలి వారణాసికిం బోయి
యయ్యెడఁ గౌండిన్యభద్రికాశ్వజిద్బసవమహానామ లను నేగురకు
శిష్యులకు జననమరణమ్ములు నశింపఁజేయు నుపాయమ్మును, సర్వ
మ్మునకుఁ బురాకృతం బగుసుకృత దుష్కృతరూప ధర్మంబు గాని
వేఱొండు దైవమ్ము లే దనియు, నరకం బన వారు వా రొనర్చికొనెడి
బాధయే యనియు, రాగద్వేషాదు లడఁపనేర్చినవారికి నిర్వాణంబు
కరతలామలకం బనియు, నహింసయు భూతదయయుఁ గలవారలా
నిర్వాణపదవి కధికారు లనియు నుపదేశించెఁ; నందుఁ గౌండిన్యుండు
చక్కఁగ సంగ్రహించి పరిజల కందఱికిఁ దాను నుపదేశం బొనర్ప

నెంచి దేశసంచారమ్మునకు వెడలెఁ; దక్కంగల నలువురును గొంత కాలంబునకుఁ గౌండిన్యుని యట్ల విజ్ఞానులై లోకోపకృతికై పాటు పడుచు దేశమ్ములు చరియింప నేగిరి. 46

క. పదపడి యశోదనృపుఁ డేఁ
బదివల్వురుభృత్యులు దను బలిసికొలుప న
భ్యుదయార్థి యగుచు నేతదు
పదేశమును బడసి తత్త్వపారగుఁ డయ్యెన్. 47

వ. శుద్ధసికతాప్రదేశంబునందు జలప్రవాహంబువలంజేసి తృణోదయంబగు పగిది బుద్ధుని యుపదేశంబున నారాజభృత్యులరును మనంబుల జ్ఞానాంకురమ్ములు వొడమి ముక్తికారణమ్ము చేకూరెననుసంతసమ్ము బలిసెఁ; నిట్లు జితేంద్రియులైన యాయఱువదిమంది శిష్యులును నానాదేశంబుల కేగి బౌద్ధమతం బిప్పటికి నుపదేశం బొనర్చుచుండి; లేము నమ్మహానుభావువెంటఁ గొంతదూరము చని పూర్వజన్మసంస్కారంబు లేమిఁ దదుపదేశంబు మనంబున కెక్కక యథాపూర్వంబగు సార్థవాహవృత్తిం జరించుచు నిట కరుదెంచితిమి. 48

తే. గీ. బుద్ధుఁడును బింబిసారుఁ డప్పుడమిఱేని
నరసి బోధింప రాజగృహాభిధాన
నగరమున కేగి యతనికి జ్ఞాన మొసఁగె
నచటివారెల్ల జ్ఞానులై రతనికతన. 49

వ. పిదప బింబిసారుండు గురువరుండగు బుద్ధున కధికంబగు సపర్య యొనర్చి. 50

క. గురుదక్షిణగా ధరణీ
ధరకందరసవిధచలదుదారసుధార
మ్యరసప్రవర్ధితనగో
త్తరమగు వేణువన మొకటి దానముచేసెన్. 51

వ. మఱియు నవ్వనంబున విశాలంబగు శిలాఫలకం బొండు స్థాపించి యం దిట్లు వ్రాయించె. 52

క. "జన్మములకుఁ గారణమును
జన్మమ్ములవలనఁ గల్గుసంసృతిదుఃఖం
బున్మూలించు విధంబును
సన్మతి బుద్ధుండు తెల్పె సదయత నాకున్." 53

వ. మెండియుఁ బూర్వోక్తంబగువనంబున నొక్కనాఁడు గొప్పకూటంబు గావించి యందు బుద్ధుం డతిధారాళంబగు వాక్ప్రపంచం బనేకులచిత్తంబుల కెక్కునట్లు రసవంతంబుగ నొకయుపన్యాసంబు చేసె. 54

తే. గీ. ఆయుపన్యాసమును విని యందలి జను
లందుఁ దొంబదివందలమంది బుద్ధు
నివలె సన్న్యాసులై నీతినెగడఁజేయ
నేగిరి జగమ్ముఁ గ్రుమ్మర నితనియాన. 55

వ. పూర్వోక్తంబగు నుపన్యాసంబు ముగించుచు నందు సారభూతమ్ము లగు వాక్యమ్ములు కొన్ని వచించె నయ్యవి వివరింతు. 56

తే. గీ. ఒగి నసత్కర్మములను జేయునరు లెన్న
టికి విముక్తిని గనరు, యోగ్యకృతు లాచ
రించు వారలు వైళమ కాంచుదురు వి
ముక్తి నీయది ఫలితార్థముగ నెఱుఁగుఁడి. 57

వ. కావున నెల్లవారును సన్మార్గావలంబకులును జితేంద్రియులునై యుండ వలయు నియ్యదియె మోక్షంబునకు ముఖ్యమార్గం బని విరమించెనఁట, అని చెప్పిన యశోధరయుఁ బరమానందభరితయై వారలకుం దగు బహుమతు లొసంగి "యమ్మహానుభావుం డిపు డెచ్చట నున్నవాఁడో యెఱుంగుదురె" నావుడు వార లిట్లనిరి. 58

తే. గీ. రాజగృహ మను నప్పురరాజమంద
బుద్ధుఁడున్నాఁ, డిచటికి నప్పురమునకును
యోజనము లొక్క యఱువదియుండు మధ్య
శోణనదమును మలలును జూడనగును. 59

వ. అనపుడు నప్పతివ్రతామణియు వాయువేగంబునం బోవు గుఱ్ఱపు రౌతులఁ గొందఱం బిలిపించి వారలచేతి కిట్లొకకమ్మ వ్రాసి యిచ్చి పంపించె. 60

సీ. కుముదిని శశిరాకఁ గోరెడి క్రియ నశో
కలతయుఁ బ్రోడయౌరలికి రాలి
తాఁకు వాంఛించు విశమ్మున నీరాక
చింతించు నామది సంతసం బొ
లయ నిట కొకసారి దయచేసి భవదవ
లంబితంబైన మతంబు నాకు
నుపదేశ మొనరించి కృపచూపఁదగు మహా
త్ముల కనదలఁ బ్రోవఁ దలఁచురంటెఁ
తే. గీ. గలదె సుకృతంబు ? పైశమ కవలి దర్శ
నం బొసంగి కుమారుని నన్ను జనరు
నసదృశానందవార్ధి నోలార్చి మరల
నేగు నవసరమేనియు నేగు మనఘ. 61

వ. అట్లుత్తరమ్ము గ్రహించి వార లతిత్వరితగమనంబున రాజగృహ పురంబునకుఁ బోయిరి, శుద్ధోదనుండు నింతకుమున్న పూర్వోక్తులగు వర్తకులవలన నీవార్త నెఱిఁగి తానుం గొందఱు నంపుచు వారితో నిట్లనియె. 62

మ. ఒక యేఁడేండ్లరిగెన్ సనన్ విడిచి తానొక్కఁడునుం దేశయా
త్రికునై యేగి, శరీర మింతఁడినుకం బ్రాణావశేషంబుగా
నొకభంగిణ్ ధరియించి యుంటి, నిఁక నే నోపన్ ధరింపంగఁ; దం
డ్రికి శోకం బొదవించు పుత్రకునికంటెం దుష్టు లెవ్వా రిలన్. 63

వ. అని యతనికి బోధించి యెట్లయిన నన్నుం జూచునట్లు సంధింపుఁడు మఱియుం బురిలోఁ గలవార లాబాలగోపాలంబుఁ దనరాక వెఱుకు చూచుచున్నా రని వచింపుఁడు, పొండు నాపుడు వారును శీఘ్రగమనంబున నరిగిరి. 64

క. శఃరౌతులు నారౌతులు
నా రాజకుమారు నొద్ద కరిగెడి వఱ కా
ధీరుఁడు బుద్ధుఁడు శిష్యుల
కారసి బోధించుచుండె నమృతమయముగన్. 65

వ. రౌతులును దదీయమ్మగు బోధామృతప్రవాహమ్మునకలరుచుఁ గర్త వ్యంబు మఱచి యిది వృష్టిసమయాం బిది రాత్రిసమయం బని యెఱుం గక ప్రసూనగత మరందాభిలాషమ్మునఁ జిక్కిన తేనెటీఁగలచందం బునఁ దదేకాయత్త చిత్తంబునం బొదలుచుఁ దదంతేవాసిగణంబునం గలసిరి. 66

తే. గీ. పిదప శుద్ధోదనుఁడు పుత్రువిధము నరయ
నరిగి రౌతులు రాకుంట కాత్మనెంచి
తనకు విశ్వాస్యుఁడును గుమారునకు బాల్య
హితుఁడునగు నుదయను బిల్చి యిట్లు వల్కె. 67

క. మును పంపిన శౌతులు పు
త్రునివార్తం దేక యెటకుఁ దొలఁగి చనిరొ, నా
కనఘా! తెలియఁగరా ద
య్యెను, నీ వరిగి యెటులైన నిది తేరఁదగున్. 68

వ. అనవుడు నుదయనుండు వైశంబ రాజగృహంబున కరిగి యటబుద్ధుం గని తత్కాలంబున నతండుశిష్యులంగుఱించి యుపన్యసించు విధంబుకొం చౌరవినితనచిత్తంబునుద న్మయంబగుట కచ్చెరువంది తత్సమీపమ్మున సన్న్యసించియున్న వార్తాహరులంగాంచి తానును నతని వాగమృతంబు గ్రోలిన నట్లయగుదునేమో యను భయంబునం గర్ణపుటంబున మధూ చ్ఛిష్టంబు గూరుకొని యతని సమీపంబునకుం బోయి శుద్ధోదనుండును యశోధరయుఁ బల్కిన పల్కులన్నియు వచించిన నతండు కరం బులు ముకుళించి సభ్యులు విన నిట్లనియె. 69

క. జనకుంశును నర్ధాంగియు
ననుఁ గనుఁగొను తలఁపు మిగిలి నాయనుఁగు న్మి

తుని౯ఁ బంపిరి కావున నేఁ
జను టుచితము తడ వొనర్పఁ జన దిఁక మీఁదన్. 70

తే. గీ. ముక్తి కారణమగు దేహమునకు హేతు
భూతులగు తల్లిదండ్రులచేతములకుఁ
బ్రీతిసల్పుట పెద్దయు నీతిపథము
నాకలా దీయది సమస్తలోకులకును. 71

తే. గీ. ధర్మగతిని జరించుచుఁ గర్మఫలము
ననుభవించుచు భూతమ్ములను సమస్త
విధములను దృష్టిచేయు విశేరధనుల
కబ్బు నిర్వాణపదము నిరర్గళముగ. 72

వ. అని యుదయను దిక్కు మొగంబై. "యే నతిత్వరితగమనంబున వచ్చుచున్నాఁడఁ బో" మ్మన నతండును గపిలవస్తుపురంబునకువచ్చి కడచినవృత్తాంత మెల్ల విన్నవించుటయుఁ బౌరు లెల్లరు సంతోషదంతురితాంతరంగులై తమగృహద్వారంబు లలంకరింపఁజేసిరి. శుద్ధోద నుండును గోటకు దక్షిణద్వారంబున నొక్కవితానంబు గట్టించి రంభాస్తంభంబులు నారికేళపత్రింబులు నాటించి నానావిధచిత్రపటమ్ములు సంఘటించి గాయకవందిమాగధగణికాబృందంబు లందంద సుచితముగ మెచ్చులొనర్ప నియమించి పరమానందంబునఁ గొమరు రాక కెదురుచూచుచుండె; నట్టియెడ యశోధరయు నొకపాలకి నెక్కి యా కాయమానమ్ము దాదాపున ధవునిరాక నిరీక్షించుచుండెఁ; బౌరులును నతఁ డెప్పుడు వచ్చునో యను తమకంబున నెదురుచూచుచు. 73

క. కొందఱు గోపురములు మఱి
కొందఱు మాడువులు మఱియుఁ గొంద ఱరంగుల్
సందడి నెక్కిరి కన నా
నందసముదార్పింతరమ్మనం దడఁబడుచున్. 74

క. వచ్చెడి పాంథుల నందఱ
నచ్చపు భక్తిమెయి "బుద్ధుఁ డేగపడఁడు గదా ?
యెచ్చట నేనియు దారి
న్వచ్చెడిచో" ననుచుఁ బేర్మివడ్డికిఁ బాఱన్. 75

క. అడుగుచును, గొంతదనుక
న్నడచి కనుంగొనుచు, వచ్చునా యని లోలో
నుడుకుచుఁ బలవించుచు న
ప్పడఁతి యశోధరయు నట్లపాల్పడి యుండెన్. 76

వ. ఇట్లక్కపిలవస్తుపురం బంతయు నాబాలగోపాలంబుగ నిందూదయం బునఁడు మున్ను గల్లోలితంబగు పాల్కడలితెఱంగున నల్లకల్లోలంబై యుండె; నచట సర్వార్థసిద్ధుండును రాజగృహంబు వదలి యిరువు రంతేవాసులు దక్కఁ దక్కిన వారిం దనతోడ రావల దని నివారించి కపిలవస్తుపురాభిముఖుండై చనియె నంత. 77

చ. అమలు డొకండు హస్తమునయం దొక మృన్మయపాత్రఁ బూని బి
చ్చమునకు నిల్లిలుం జనుచుఁ జక్కఁగఁ బెట్టినవారిఁబోలె బి
చ్చ మిడనివారినేని నయసంగతిఁ జూచి నమస్కరించుచున్
గ్రిమముగ రాఁ గనుంగొనియెఁ గొంత యశోధర యాదరంబునన్. 78

వ. మఱియు నిరువు రాతనింబోలెఁ గాషాయాంబరధారులై వెంబడి వచ్చుచుండిరి గాని మృన్మయపాత్రధరించి బిచ్చమెత్తుకొను సన్న్యాసి ముఖసౌష్ఠవంబు మహాసుభావత్వసూచకంబుగాఁ గన్పట్టుటంజేసి యాతని దర్శన మాచరించినతోడఁ బ్రతిమనుజునకు నితనికి శుశ్రూష చేయవలయు నను నిచ్ఛ పొడముచుండె. 79

ఉ. ఆతని గాంచినంతన భయమ్మును భక్తియు నొప్పఁ బాదకం
జాతము సోఁక మ్రొక్కి పరిచర్య యొనర్చు మనంబుతోడ 'న
య్యో! తగువస్తు వీతనికి నొక్కటి యిచ్చిననుం గ్రహింపఁ డి
ట్లీతని వెంటనేనిఁ జరియించినఁ బుణ్యము గల్గు' నం చొగిన్. 80

వ. స్త్రీలును బురుషులును నొకరివెంట నొక్క 'రిమ్మహాత్ముఁ డెవ్వ
రొక్కో' యని లోలోఁ బ్రశంసించుకొనుచు నడుచుచుండిరి గాని యితఁడు
సర్వార్థసిద్ధుం డని యొకండును గుర్తింపలేఁడయ్యె: నట్లుమ్మహానుభా
వుండును రాజమార్గంబునం బోవుచు రాజద్వారంబు సమీపించు నెడ
యశోధరయు. 81

సీ. సహకారకిసలయచ్ఛవితోడఁ దలనిండ
జడలుగట్టినశిరోజములతోడ
రోహిణీసహితార్కరుచిరత్నకుసుమలతా
గర్భంబుఁ బోలిన శరీరంబుతోడ
దినకరచ్ఛన్నుఁడై తేజఁబాసిన పూర్ణ
చంద్రుఁబోలిన ముఖచ్ఛాయతోడఁ
జిరవృష్టపతిరూపపరిపుష్టవైపర్ణ్యా
దైన్యసంతోషభేదములతోడఁ

తే. గీ. గూడ నేదేండ్లరోహిణిం 'దేవ దేవ'
యంచుఁ జెలరేఁగుచును జీరయుంచు లాగి
నెదఁద నేవేళ భావింపఁబడుచునున్న
జీవితేశ్వరు గుర్తించి చేరఁబోయి. 82

క. హా సిద్ధార్థా : యని కడు
నానమ్మెయిం గనుల నశ్రులత్యధికతర
శ్రీసృష్టి సేయఁ బదములు
కైసేసెన్ మిగుల నెగడు కచభరకాంతిన్. 83

ఆ. వె. అతఁడు లేవనెత్తునంత కమ్మహిళ వి
వశమనస్కయగుచు వగ విగుడఁగఁ
గౌఁగిలించుకొనియెఁ; గాంతలు కాంతుల
గారవించు టిట్లుకాదె యెందు. 84

వ. పదంపడి సిద్ధార్థుండును మొదట నొక్కయంతేవాసినిగాఁ దలంచి

తత్కృత్యంబునను దదీయముఖసౌష్ఠవంబునను బ్రియురాలిఁగాఁ గీర్తించి యోదార్చి జ్ఞానదాయకంబులగు వచనంబులు కొన్ని పలికి యాపె మనంబు కలఁకదేర్చునప్పటికి గుంపుగూడి వెంటవెంట వచ్చుచున్న పురజను లందఱును నితండు సర్వార్థసిద్ధుం డను చిహ్నంబులు పొడసూపె; నంతట మృదుమధురగంభీరసంభాషణమ్ముల విషయనివర్తన విషయంబులగు నుడువులు నుడువుచున్న కుమారు నవికారు మారాకారు నపువప్పులం గాంచి యాతని వేసంబు మనంబు గలంప శుద్ధోదన నృపాలుండు కోపంబు పట్టఁజాలక వారువం బట డిగి డగ్గఱకుం జను దెంచు నయ్యెడ. 85

క. అనఘాత్ముండగు బుద్ధుం
డును దండ్రికిఁ బేర్మి మ్రొక్కెడుం గోపము గ్ర
న్నన మాయమయ్యె; బుద్ధుని
గనుఁగొనియుం గోపముండఁగలదే యచటన్. 86

తే. గీ. అఖిలరాజాధిరాజపూజ్యప్రభావ
మహితమై యొప్పు తనదు కుమారు మహిమ
మరసి యాశ్చర్యమంది యయ్యనఘుఁ డిట్టు
లనియెఁ బుత్త్రునితోఁ బేర్మి యనువుపడఁగ. 87

చ. ధర సకలంబు నేలుచు సుదాయుఁడవై యశముం గడించి యె
ల్లరు నృపతల్లజు ల్ప్రణతులం బచరింపఁగఁ జుట్టలెల్ల వ
హ్వారె యనఁగా సుఖింపఁదగు నంతటివానికి నింతవచ్చె; నె
వ్వరి నెటు సేయనేరవు కృపారహితమ్ములు ధాత చెయ్దముల్. 88

సీ. ఆపన్నసత్వయౌ నర్ధాంగి కోర్కెల
నింపుమైఁ దీర్చి మన్నింపవైతి
పురుడు వోవకమున్న పుత్త్రు నెమ్మోము వీ
క్షించుభాగ్యంబు గాంచింపవైతి
నాకుమారుగ నిన్మనమ్మునఁ దలఁచు ప్ర
జలసమ్మతిని బొందఁజాలవైతి

ముదుసలివై రాజ్యము నొసర్పలేని నా
వగు నశక్తతచే తోఁ బొసగలవైతి

తే. గీ. పకట యింతటిరాజ్యంబు నడవిపాలుఁ
జేసి సన్న్యాసివైతి కాశ్మీరగర్భ
భము విధమ్మున వీణాతరము వ్యథావి
శేషభాజన మింకేమి సేయఁగలము. 89

క. నాపుడు బుద్ధుం 'డిది వా
రీవేళనె పట్టువడియెనె ? పరంపరగా
నే పచ్చుచున్న' దనుటయు
భూపరుఁ డిట్టులను నలుక పొంపిరి బోపఁగా. 90

క. ఎలమి మహాసమ్మతము
ఖ్యులు సూర్యవరు నృపులు శాక్యకులసంభవు లీ
యిల వేలి రందు నీవలెఁ
గలసెనె బైరాగులం బొరండేని సుతా. 91

చ. అనపుడు బుద్ధుఁ డిట్లను, మహాత్మ! మదుక్తి మదీయజన్మప
ర్తనపర మేను మున్నును బరంపరగా నిటు సన్న్యసించుచుం
జనకుని కుందు దీర్చితిని జ్ఞానధనం బిడి పెక్కుసార్లు రా
పున నిపు డట్టిదే ధనము పూర్తిగ నీ కిడువాఁడ శాంతికై. 92

వ. నే నీజన్మంబున విజ్ఞానలబ్ధి వడసి పునరావృత్తిరహితశాశ్వతనిర్వాణపద
వీసమారూఢుండనై యజ్ఞానులకు విజ్ఞానల బొసంగ జన్మించితిఁ గావి
శాక్యరాజ్యం బేలుటకుఁ గా దనుచుఁ బల్కుచుఁ దండ్రికరంబు పట్టి
కొని జనసంకులమ్ములగు వీథులవెంటఁ దిరుగుచు జ్ఞానపరిపక్వమ్ములగు
వచనమ్ములు బోధించుచుండ యశోధరయు రాహులసమేతయై సమీప
వర్తిని యగుచు నాదరమేదురంబుగ వర్తనంబు మఱచి వినుచుండెఁ
నట్టియెడ నంతేవాసు లిరువురయం దొక్కఁ డిట్లనియె. 93

వ. అడుగఁగఁ గొందుచుంటి నొకయర్థము, దేవర సన్న్యసించియుం
బడఁతిని బిగ్గఁ గౌఁగిటను బట్టుట దోషము కాదె? జ్ఞాను లీ
యెడఁ గడు సంశయింపరె? సతీచ్ఛ యతీంద్రుల కొప్పునే, కటా!
వెడఁగుదనం బి దెట్టు లొదవె న్వచియింపుఁ డటన్న నిట్లనున్. 94

ఉ. కోరినమాట మంచిదియె కోరఁగవచ్చును గోరినంతనే
నేరము గల్గునే, వినుము నీదగు మాటకు నుత్తరంబు, ని
ష్కారణ మేరినేనియును గాసిలఁజేయుట పాడిగాదు, చే
కూరునె యింతమాత్రమునకు న్నియతాత్ములకుం గళంకముల్! 95

వ. అదియునుంగాక తదాలింగనంబు తత్కార్త్రుకంబు గాని యస్మదా
ర్థంబు గా; దింక నొక్కవిశేషంబు వచించెద వినుము. 96

ఉ. తాను విముక్తిఁ జెందిన విధమ్మున నొర్లను దేర్ప నెంచు స
న్యాసికి నేరిదేనిఁ బరిభావము సూపుట మంచిగాదు స
న్మానము చూపి వారిని గ్రమమ్మున బోధసుధారసప్రసా
రానుభవక్షతావిధురితాత్ములఁ జేయఁదగున్ స్వశక్తిచేన్. 97

వ. ఏను గృహంబు విసర్జించి పోవునాఁ డీమెకు నానేర్చిన విజ్ఞానంబునం
బాలొసంగుదు నని వాగ్దానంబు చేసినవాఁడ, నీమెయు సంసారవాంఛఁ
దుంపలేక పూర్వసర్వార్థసిద్ధుఁడ నని యనురాగమ్మునం జేసిన పనికి
నివారించితినేని యంతేవాసిని యగుట తటస్థింపదు. 98

తే. గీ. ఎన్నియోజన్మములకు మున్నేను సింహ
ళమ్మనెడి ద్వీపమున జననమ్మునొంది
రాముఁడను పేరనుంటి, నీరమణి యపుడు
లక్ష్మియనుపేర నాకుఁ గళత్రమయ్యె. 99

వ. అయ్యెడ మే మిరువురమును బీదలమై యుండుకతన నెటకేనియుం
బని ధనమార్జింతు నని యోజించి దేశంబు గ్రుమ్మరఁ దలంచిన
నమ్మగువ యిట్లనె. 100

మ. సదయా ! నన్నిటు డించిపోవుటకు నిచ్చం జేయఁగాఁబోకు నా
మది యెల్లప్పుడు నీయందున మిది సంభావింపు మత్యంత ద
ష్టదశాపాదకమైన నీదు పరదేశవ్యాప్తి చేమంటు నా
హృద, దాంపత్యవియోగ మేరి కయినం బ్రీతిం బొసంగించునే. 101

క. అని యంగీకృతి చూపను
వనితను విడనాడి వడలిపై నారామా
ర్గనియతిఁ జనుచని పవపడి
యనేకకష్టములు గాంచి యట నొక్కయెడన్. 102

క. విలువయుఁ జెలువము దళరధను
గల యొక మత్తియము దొరకఁగా నది కొని యే
నెలమిం దేశంబునకు ము
రలి చనుదెంచితిని మిగుల రయ మలరారన్. 103

వ. అప్పటికిని మదీయదేశం బత్యంతక్షామపీడితంబై యుండినకతన నన్నంబు లేమిఁ దమిఁ గృశించి మచ్చాశచిత్తయై మూర్ఛవోయియున్న జాయం గాంచి యేనును దుఃఖాక్రాంతుఁడనై, "యిప్పుడింటి నెవ్వ రన్నం బిడి బ్రతికింతురో వారలకీమత్తంబు నిత్తునుఁడు" ననుచుండఁగ నొకండు తనయొద్దనున్న సక్తు వొసంగి యాముత్తియంబు గొనియె: లక్ష్మియు నాపేలపిండి తిని లబ్ధసంజ్ఞయై నన్ను విశ్వాసయుతుఁగ శ్లాఘించె. ఆజన్మము మొదలు ప్రతిజన్మంబునను మేము దంపతులమై జనియించుచుంటిమి. కావున నీమెంగూడ నిర్వాణపదారోహణం బేయు టకు నుపాయంబుగాఁ ఙదాలింగనంబు నివారింపనైతి నని మఱియు నిట్లనియె. 104

క. జ్ఞానం బొరుల కొసంగినఁ
దా నెగడుం దీపమువలె; ద్రవ్యంబిడ న
వ్వానికి లేకుంటయుఁ బెఱ
వానికిఁ గలుగుటయుఁ దొడరు వ్యయ మగు కతనన్. 105

క. వెనుకన్ లక్ష్మికి నాచే
సిన దానముకంటె నిపుడుచేయు వితరణం
బనఘ శతాంశాధికమగు,
ననుపమ మనరాదె జ్ఞాన మన్నిటికంటెన్. 106

క. తా నింద్రియనిగ్రహముం
బూని యబలలకు నితాంతమును విజ్ఞానం
బానఁగఁ జేయుట పురుషుల
కీనెంచుటకన్న మిగుల హెచ్చనవచ్చున్. 107

వ. కావున నియ్యశోధరకు మోక్షసాధనంబగు విజ్ఞానం బుపదేశింతు నని
భార్యంగాంచి తండ్రిదిక్కు మొగంబై యిట్లనియె. 108

సీ. వినుఁ డొక్కసంగతి ఘనుఁ డొండె నీచాత్ము
కుం డొండె నుద్దండపండితుండు
నొండె నెవ్వండేనియును నాలుగంతర
మ్ములు దాఁటి యష్టవిధుల కనుగుణ
ముగను జరించుచు మొదల నెనిమిది ధ
ర్మముల నెఱిఁగి తత్వమార్గమందు
దశబలంబులు గల్గి తనర నెప్పటికేని
జన్మరాహిత్యంబు సంభవించు

తే. గీ. ననుచు బోధించు సిద్ధార్థు హస్తమం దె
సంగు మృత్పాత్రి యాత్మహస్తమునఁ దాల్చి
కోప మెడచేసి శాంతమ్ము కుదురుపఱచి
తాల్చె శుద్ధోదనుఁడుఁ దన తనయు మతము. 109

క. అంత యశోధరయును న
త్యంతానందమున మోము దైవాఱఁగ న
క్కాంతుని మతమ్ము నమల
స్వాంతయగుచుఁ దాల్చి మిగుల శాంతి వహించెన్. 110

— • ఆశ్వాసాంతపద్యములు • —

క. శ్రీమత్కవితాకాంతా
వ్యామోహితహితసుతాసుయావస్వాంతా!
ధీమణినికరనియంతా!
కామంచకుటిలశాస్త్రకలితోపంతా! 111

శా. శ్రీరామాకరుణాకరస్వగుణరాశీ! యూరమూరీవ్రత
ధూర్తిరా! చారువిధానవా! కృతిసుతా! కొచ్చెర్లకోటాన్వయ
క్షీరాంభోధినిశాకళత్రి! గుణలక్ష్మీభూతదీప్తప్రియా
పారావార! యుదార! కృష్ణధరణీపాలాగ్రిణీ! ధీమణీ. 112

పంచచామరము

ప్రమోదబంధురా సుధీవిపశ్చిదాదృతావరా
ప్రమాదదూర ధీర శ్రీకరా యుదాత్తశాత్రివా
పుమగ్రిణీ మహాకవీంద్రపోషకా లలత్తురం
గమాధిరోహణప్రసక్తిగణ్యగుణ్యసంస్తుతా. 113

— గద్య —

ఇది శ్రీ....తిరుపతి వేంకటేశ్వరప్రణీతం బైన
బుద్ధచరిత్రంబను మహాప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము



శ్రీ ర స్తు

శ్రీమత్పరదేవతాయైనమః

# బు ద్ధ చ రి త్ర ము



## ష ష్ఠా శ్వా స ము

క. యాచకచయవిబుధద్రుమ !
మోచాఫలవిపులమదవిమోచనచణవా
చాచతుర ! తులితసుమనా
రాచా ! శ్రీకృష్ణరాయ ! రసవద్గేయా ! 1

వ. అవధరింపు మనంతరంబ సతీపితృసమేతంబుగ సన్న్యాసియగు సర్వార్థసిద్ధుండు తన పురంబునందలి విజ్ఞానాధికారంబుగల మనుజుల కందఱికి భిక్షువేషం బాపాదించి తక్కిన పౌరుల కధిపతిగా రాహులునకు శాక్యరాజ్యపట్టాభిషేకం బొనర్చి యచ్చోటుఁ గదలి యనేకాంతేవాసి జనపరివృతుండై. 2

చ. తగుగతి శీతమారుతపదంబయి పాటెడు కోహనాభిధా
పగకు సమీపమందు సుమపాదపభూషితమై మనోజ్ఞమై
మృగముఖజంతుసంతతిసమేధితమై ఫలభారవిస్ఫుర
న్నగయుతమై యెలర్చెడి వనమ్మున కేగె మనమ్ము పొంగఁగన్. 3

వ. సాగరమ్మను పురమ్మునకు సమీపమ్మునం దనరు నవ్వనమ్మున హిమవత్పాదనికట శిలాకుట్టిమంబున నొకనాఁటి సంధ్యాకాలంబున నానందదేవదత్తపరిభృతులగు శాక్యప్రభువులు వెనుకను, యశోధర పాదనికటంబందును, శుద్ధోదనుండు వామపార్శ్వంబునను జెలంగ ధర్మాసనంబుండి తన మతంబు సకలదేశాగతాంతేవాసిజనంబులకుఁ జక్కఁగ బోధింప నారంభించె. 4

చ. అమృతరసంబు వెల్లివిరియంగ మహాత్ముఁడు బుద్ధుఁ డెల్లలో
కములకు జ్ఞానబోధ మొనరంబునఁ జేయుచునుండ సూర్యుఁ డ
స్తమితుఁడు గాఁగ భూధరనితంబసమీపతలంబు లంచ ని
క్కము వసియించుచు న్వనిమొఁగాని తలంపఁడు కాలదైర్ఘ్యమున్. 5

క. పితృదేవతలును దేవత
లతిముదమున నాకసంబునంద నిలిచి య
మృతమంతు నుపన్యాసం
బితరేచ్ఛాశూన్యబుద్ధి నెనసి విని రాగిన్. 6

తే. గీ. అతఁ డొనరించు నయ్యుపన్యాసము వినఁ
గనొ యనంగఁ బమంబు చక్కటిఁ జీరాఁగఁ
దాను నయ్యెడి వినుచుఁ బోఁడలఁపదిగతి
సంజకెంజాయ కొంత మసలఁ బొడంగె. 7

తే. గీ. తారకావళి హారవిధమునఁ బసర
నిండుజాబిల్లి తిలకమై నెగడ నీర
దములు తల దువ్వ చెలుల విధమున మెలయు
సంజయను ప్రౌఢకన్నియ చవల నిలిచె. 8

క. వినతార్తయైన సూర్యుఁడు
చనుచుండఁ గొంతదవ్వు సారెకుఁ గని నం
జ విగిడ్చెడు నిట్టూరుపు
లనఁగ మలయమారుతమ్ము లలముఁ బొడంగెన్. 9

ఉ. జ్ఞానము వెల్లవారల కొసంగెడి బుద్ధిని బుద్ధుఁ డాత్మభా
షానుగతి స్వచించు వచనావళి యాదట నాలకించు నా
నానరజాతికిం దగవినంబడుచుండె స్వకీయదేశభా
షానియతి న్మహాత్ముల కసాధ్యములుం గలుగంగ నేర్చునే. 10

వ. అయ్యెడ బుద్ధుం డిచ్చిన యుపన్యాసం బనేకాబ్దశతం బగుటంజేసి
యిదమిత్థ మని యస్మాదృశులకు వివరింప నలవిగా, దైనను దిఙ్మాత

పరిదర్శన మొనర్చెద మని యెట్లన్న, నతండు తనచుట్టునుం బలసి కొలుచుచున్న నానాదేశీయులగు ప్రజలం గాంచి "యోయన్నలార! సావధానంబుగ మదీయోక్తు లాలింపుఁ డని యిట్లనియె. 11

క. ఎయ్యది యమేయమై చను
నయ్యది వివరింపఁ దరమె ! యది యడుగక బ
ల్మెయ్యమ్మున నా వినిచెడు
తియ్యనిపల్కులను మీమదిం బెట్టఁదగున్. 12

వ. అట్లు వినిరేని యయ్యమేయపదార్థంబు మీయంత మీకు గోచరం బగు.

క. తెలియని దేనియు మాకుం
దెలియంగాఁ జేయుఁ డనుచుఁ దివిరి యడుగువా
రలును న్వాతికిఁ దెల్పం
దలకొను వారలును దెలివితక్కువవారల్. 14

తే. గీ. అజుఁడు సృష్టికిఁ బూర్వమం దంధకార
మందుఁ దపమొనరించుచున్నట్లు కొన్ని
గ్రంధములు సెప్పుఁగాని యక్కతల నిజము
తెలియఁగారాదు తెలిసిన ఫలములేదు. 15

క. పొడముట గిట్టుట సుఖముఁబు
విడుమలునుం గాలగతియు నెడతెగక సదా
పొడముచునుంటయు ననునివి
కడఁగాంచెను దనుక మనకుఁ గలుగుచునుండున్. 16

తే. గీ. నదులు జనియించి పిదప వననిధిఁగలసి
బాష్పరూపమ్ము గాంచి యాపయి ధరాస్థ
లిని బడి యథాస్థితిని గాంచు లీల నెపుడు
జననమరణమ్ములకును విశ్రాంతిలేదు. 17

క. ఇల మొదలుగ నా యీ మం
డలములు విశ్రాంతి నెయ్యెడం గనక సదా

చలియించు పగిది జన్మ
మ్ములనుఁ భ్రమణంబు నెపుడు పొందుచునుండున్. 18

మ. ఉపవాసంబులు ప్రార్థనల్ జపములున్ హోమంబులున్ వ్రతముల్
కృపణమై నీయవి తా నెవండు గొను ? మీరీ బంధముం జేసి పా
పఫలంబుం గడ ద్రొక్కనేర్తురె ? రడుం బాశ్రయించు నిద్రాన చే
హాపరిశ్రాంతి, వృథాపరిశ్రమమునన్ బ్రారబ్ధము ల్పోవునే. 19

క. మన జన్మపరంపరయును
ఘనతయు నీచతయుఁ గర్మగతికారణమై
పనుపడుఁ గావున సత్క
ర్మనియతిఁ జరియించు టొప్పు మనుజుల కెల్లన్. 20

చ. మునుపటి జన్మమందు నృపముఖ్యతఁ గాంచియు నొరుఁ బాపపుం
బను లొనరించెనే నతఁడు పొల్పడు నేఁడొక భృత్యమాత్రుఁడై
వెనుకటి జన్మమం దొకట భృత్యత గాంచియు నంటుఁ బుణ్యపుం
బను లొనరించెనే నతఁడు పార్థివుఁడై జనియించు నిష్టటిన్. 21

వ. కర్మంబునకు జన్మపరంపరకును నాసంబంధంబు మేని జన్మము లెల్లరకును
వ్యసనకరంబు కాని యొండుగా దంట నటిగా, చేసునఁ గర్మంబు లనివా
ర్యంబు లయ్యును దనకంటె బలీయంబగు సంకల్పశక్తికి లోబడు ; నట్టి
సంకల్పంబు సమంజసం బేని నానాఁటి కుత్తమజన్మంబులు దొరకు ;
నట్టియుత్తమజన్మంబులు కొన్ని గతించుడు దివ్యజ్ఞానంబును దివ్యదృ
ష్టియు నుదయించు, దానం జేసి నిర్వాణపదంబు కరతలామలకంబగు
నని చెందియు. 22

క. ఇది పఱకు దారి తెలియమి
నెద లోకుల దుఃఖములకు నెంతేఁ దాపా
స్పదముగ నొనరించెడి నా
కిది యొదవె నుపాయ మొదఁ దనేతాదృశమై. 23

క. తనచేసిన కర్మమ్ములు
తనకుం భోజ్యమ్ము లగుచుఁ దనరు, నన్నటి య

న్యని నీయెడఁ బ్రేరకుఁడని
యనవలవదు తత్వవిధము నారయుఁ డింకన్. 24

సీ. ఆద్యంతములు లేక యజలోకమునకంతెఁ
బై నొప్పు నక్షత్రపటలి దాఁటి
వెలుఁగుచుండెడు నొక్కవిమలాత్మయగు శక్తి
యది యెల్ల వస్తువు లందుఁ దత్త
దనుగుణగుణముల ననుఘటించుచు నెల్ల
యెడలను వ్యాపించి యెల్లరకును
మంచిమార్గమ్ము నేమఱక సూచించుచు
నుచ్చైస్థితికిఁ దెచ్చుచుండు నిదియ.

తే. గీ. చిన్నిచీమలు మొదలగు చేతనముల
కును ననుఘటించు సంతానమున ననూన
రాగ, మీయదియ పయోధరములు సార్థ
కములుగాఁజేయు నిసువులు గలుగునెడల. 25

క. అవనిన్ రత్నాదిక ము
ద్భవ మొందుట దందశూకదంష్ట్రల విషము
ద్భవ మొందుటయును నీశ
క్తివలన నలవడు నటంచుఁ దెలియంగఁ దగున్. 26

వ. వెండియు నిమ్మహాశక్తియ పెరుఁగుటకుం దఱుఁగుటకుం గారణం బగు, జీవితము ప్రేమము ననుదారములతో మరణము బాధయునను తుది ప్రారబ్ధాదికర్మపటంబు నల్లుచుం బోవు. నీయది మనకు గోచరమ్ములగు పదార్థమ్ములందును నగోచరమ్ములగు వస్తువులయందును బ్రబలియుండు. 27

తే. గీ. మనుజుల మనమ్ములును వానిమార్గములును
దలఁపులును నిక్కతనఁ బ్రవర్తనము చెందు

తే. గీ. ఆమె తీర్చెడి తీర్పున కవలఁ గాల
దోష మనుమాట లేదు నిర్దుష్టముగ స
మస్తకాలములందును మసలుచుండు
వినుఁడు మఱియొక్క సంగతి వీను లలర. 34

తే. గీ. ఒరుల నఱకుట పరధనం బొడిచికొంట
యొడ్ల వంచింప దుస్సాక్ష్య మొసఁగుటయుఁ ద
నకు నొనర్చికొనెడు కీడులకట శక్తి
కతనఁ బరమునఁ దన కివి కలుగుకతన. 35

వ. మఱియు నీశక్తి యెల్లపుడును న్యాయమార్గంబు వదలదు, శుద్ధప్రేమం బిద్దాని స్వరూప మిక్కతనఁ దుదకు లభియించు ఫలము శాంతియు నిర్వాణంబును గాన నోయన్నలారః యెట్టి విత్తనము చల్లిన నట్టిపంటయె పండునట్లు తనకర్మము ననుసరించి యుత్తరజన్మం బలవడుచుండు.

తే. గీ. పనికిమాలిన కలుపు నవ్వలకుఁ ద్రోసి
మంచివిత్తనములు చల్లు మానవునకు
ఫలము నిరవద్యముగఁ గల్గుభంగిఁ బాప
కృతు లెడపు వారలకుఁ బుణ్యగతి లభించు. 37

సీ. తన పురాకృతదుష్కృతమ్ముల నెఱిఁగి యా
యాఫలమ్ములను దా ననుభవించు
చును సత్యవంతుఁడై యనవద్యుఁడై దయా
వంతుఁడై యెల్లర వంత లడఁప
యత్న మొనర్చుచు నపకారులకునైత
ముపకారమ యొనర్చుచుండి వాంఛ
మొదలంట నున్మూలముగఁజేసి కాలంబు
తగుగతిఁ గడపెడి ధన్యతమున

తే. గీ. కాలఁ బ్రాక్కృతపాపకర్మానుభవము
తీఱి సత్కర్మఫల మొకింతేని మిగులు

సత్కృతమ్మున జన్మరాహిత్య మొసఁగు
దాన నిర్వాణ మనెడి పదమ్ము పొందు. 38

వ. పుణ్యకర్మంబు మిగిలిన నయ్యది జన్మాంతరమును ననుభవింపఁ జేయును; జన్మ రాహిత్యం బెట్లు పడయు నని శంకింప వలదు. ఏజన్మంబునఁ దన చేసిన దంతయు సుకృత కర్మంబగునో దానికి ఫలంబు నిర్వాణపదంబు కాని జన్మాంతరంబు గాదు; దీయది కర్మసిద్ధాంతం బని. వెండియు. 39

ఉ. దారిని బోవు పాంథులకుఁ దద్దయు మేల్పడ యొక్కచోటఁ జే
రూరు, నిఁ కొక్కచోట నటుఁదూరు ననాఖ్యదమైన త్రోవ, యిటు
తీరుగ జీవుఁడొందు సుగతి న్మఱి యొండుగతిం ననంబు ని
ష్కారణ మొప్పు నంట సరిగా. నది యే మన నాలకింపుఁడీ. 40

కం. మును పొనరించిన పాప
మ్మును సుకృతమ్మును గణింప మొదవిన దని పో
చ్చునొ తదనుసరణముననే
జననంబులు గలుగుచుండు జనులకు నెపుడున్. 41

ఆ. వె. పట్టుపురువు దాను బవరించు దాయతోఁ
దగులుకొనెడుభంగిఁ దానొనర్చు
కర్మజాలమునను గట్టఁగఁబడు జీవుఁ
డింత కొండుహేతు వెందుఁ గలదె. 42

చ. అరయఁగ జమ్మువిత్తు లనిలాహతి దూరము పోయి యొక్కచోఁ
బురదను బ్రుంగి కాలమునఁ బుట్టువెలర్చెడురీతి జీవుఁడుం
ధర నొకచోట నెయ్యెడనొ తా జనియించి క్రిముష్యగాఁ గనుం
గరమును గర్తృతాగరిమ కారకతాగరిమమ్ము లాదిగన్. 43

తే. గీ. హత్య లోనగు క్రూరకృత్యము లొనర్చు
వార లేతత్ఫలమ్మును బడయుపొందె
హీనమగు యోని జనియింతు, రింత నిజము
కర్మఫల మేరికేనియుఁ గట్టికుడుపు. 44

ఉ. ఏఱు జనించి కొంతవఱకేగి యట న్మఱి గానరాక యెం
తే రహి కొంతదూరమున నేర్పడి పాఱెడుభంగి యోగ్యులౌ
వారలు మేను వీడియును వచ్చెడు జన్మమునందుఁ బూర్వసం
స్కారవిశేషకారణవశమ్మునఁ జెందుదు రుత్తమత్వముల్. 45

తే. గీ. ఉత్తమభవంబు నొందుచునుండి కొంత
కాలమునకు భవవిరతిఁగాంచి పొంద
వచ్చు నిర్వాణమును; దుష్టవర్తనులకు
నీచజన్మంబు లెన్నేని నెగడుచుండు. 46

వ. అట్టి నీచజన్మంబు లెత్తెడి వారికి జన్మసంఖ్య హెచ్చునుగాని యెన్న
టికిఁ దగ్గదు. లోకులు తమకు మంచికర్మంబులయందు శ్రద్ధ దగుల
నీక నిర్వాణప్రాప్తికి విఘ్నమొనరించు నజ్ఞానాంధకారమునం బడి
యీ ప్రపంచసుఖమ్ములు శాశ్వతమ్ములని తలంచుచు దురవస్థలకుఁ
గారణమ్ములై కాంతాకనకమూలంబులగు కామక్రోధాదులఁ జిక్క
నవయుదు రని వెండియు. 47

తే. గీ. అమలినమనీషచేఁ దెలియంగఁ దగిన
యట్టి నిర్వాణపదమున కాసచేయు
చున్న నాయన్నలార ! యత్యున్నతిప్ర
దమ్ము లీతత్త్వములు నాల్గుఁ దగ వినుండు. 48

చ. ప్రతినరజీవితమ్ముఁ గడు బాములపా లని నమ్ముఁ, డుద్భవ
స్థితిమొద లెన్నియో కలుగు జీవునకుం దురవస్థ, లెన్నఁడే
నతితరసౌఖ్య మబ్బినను నయ్యది పక్షివిధమ్మున న్రయో
ద్గతిఁ గనుఁ గాని శాశ్వతముగా దది మీ కనుభూత మౌఁ గదా. 49

తే. గీ. శైశవంబునఁ గొన్ని కష్టములు యౌవ
నమ్మునం దొకకొన్ని కష్టమ్ములు ముది
మిని మఱియుఁ గొన్నికష్టము ల్పనుపడు మృతి
సమయ మందలి బాధ వశమె వచింప. 50

క. అది గాన జన్మమెత్తిన
యది మొదలు మరణమునందునంతవఱకు దుః
ఖదశయె కన్పడు సుఖమను
నది కల్ల యటంచుఁ దెలియనగు నెల్లరకున్. 51

మ. అనురాగమ్మునఁ బొల్చు దంపతుల కత్యంతంబు సౌఖ్యంబు గ
ల్గును గానీ యిదియు న్వృథం బనుచు నారుం డోఁప, దే యున్న స
ద్వనితారోజములేని భర్తృరదనవ్యాపారమేనిం జితా
ఘనవహ్న్యాహుతి గాంచుచో నిలువశక్యం బౌనె యొండొంటికిన్. 52

క. కదన మొనర్చెడి వీరుల
కదనముగా ముదము గల్గు, నదియును నిత్యం
బొదవదు క్షణమునఁ బ్రాణము
వదలున్ దేహంబు పక్షివర్గము పాల్గాన్. 53

చ. నరులును బక్షులుం బశుగణమ్ములు పృథ్వివిశేషము ల్మనో
హరగతి నిందుఁ జొప్పడుట నందఱికిం ధర మోదధాత్రియై
కరమును సౌఖ్య మీఁగలుగుఁగాని క్షుదర్థము ప్రాణులం బర
స్పరహననం బసూయయు నసహ్యములై పెనుపంతఁ గొల్పెడున్. 54

వ. కావున నెన్నివిధమ్ములఁ జూచిన సౌఖ్యంబుకంటె దుఃఖం బధికమ్మని యనుభవసిద్ధమ్ముగఁ గన్పట్టినను వ్యాధిపీడితుల నొండె వృద్ధుల నొండె 'మీరు జీవనేచ్ఛ కలదా' యని యడిగిన జీవనంబు హేయమను వాఁడొక్కఁడు నుండఁ; డక్కటా! యీపాడు సంసార మాహాత్మ్యం బిదమిత్థమని వచింప నలవికాదు. శిశువులు నైతము జీవనంబు కష్టభాజనం బనికదా పుట్టినతోడనె యేడ్చుచుందురు. ఇట్టి జీవనంబు కష్టభాజనం బని నిశ్చయంబు పడసిన వారందఱు రెండవ తత్త్వం బాలింపుఁడు. 55

తే. గీ. సర్వదుఃఖమ్ములకును దృష్టమౌ ప్రధాన
కారణంబు తనంతనకల్గు దుఃఖ

మెయ్యదియు నెంచుఁ గానరా దింద్రియమ్ము
లర్థములును మనోవృత్తి నలమఁజేయు. 56

సీ. ఆకాశహర్మ్యంబు లల్లింపఁగాఁజేయు
గగనసుమంబులు గలుగఁజేయు
నన్యోన్యవైరంబు నందించు మోహాదు
లను బ్రతిక్షణము వృద్ధిని బొనర్చు
ద్రోహ మీర్ష్య యసూయ దౌలకరింపఁగఁ జేయు
స్వప్నమ్ము వోలె నసత్యమైన
మిథ్యాప్రపంచంబు తథ్యం బనెడు భ్రాంతి
గలిగించు నీతృష్ణ; కాన దీని

తే. గీ దౌలఁగారాదు దీని సందర్భమునన
భూమి పాపభూయిష్ఠమై పొలుపు దఱుఁగుఁ
గలుపు బలిసినపై నవకాశమెట్లు
మంచివిత్తనమునకు లభించుఁ జెపుఁడు. 57

తే. గీ. జీవితాంతంబునం దాత్మ చెడుగులైన
తృష్ణయను చెట్టువిత్తుల నెనయుకతన
మరల జన్మించునట్టి జన్మంబునందుఁ
బ్రబలుఁ దృష్ణాకుజంబు లీపలుకు నిజము. 58

వ. కావున నింద్రియనిగ్రహంబును దృష్ణావశ్యత్వంబును గల యోయన్న
లార! మూఁడవ తత్త్వంబు విన్నవించెద. 59

తే. గీ. ఇంద్రియముల జయించియు వృత్తులడఁచి
శాంతి వహియించి మృదులభాషణము చిత్త
శుద్ధి భూతదయయుఁ గల్గుసుజనులకును
గ్రమముగా జన్మరాహిత్యమమరు నిజము. 60

తే. గీ. స్వచ్ఛముగ వెల్గి దీపంబు చమురుతోడ
న శమియించెడి చందమ్మునఁ గ్రమముగఁ బొ

సంగపఁ గర్మరాహిత్యంబు జన్మరహిత
తయును సమకాలమున నింత తథ్య మరయు. 61

వ. మఱియు నింక నాల్గవతత్త్వంబు నిర్వాణమార్గంబు. అయ్యది యెల్ల
రకు ననులభంబని వెండియు. 62

సీ. చదలంటు నొక్క రసాధరశృంగంబు
నెక్కఁగ నుంకించునెడ విశేష
దార్ఢ్యమ్ము గల్గెడి ధన్యులు మార్గము
దెట్టిది యైనను నేగఁగలరు
గాని యశక్తులు కడుదూర మైనను
సహియించి మార్గమ్ము చక్కని యది
గాఁ జూచి నడుమను గాలూఁది విశ్రాంతి
వడయుచు వారలు పఱసినట్టి
తే. గీ. పదము కొంచెము వ్యవధిగాఁ బడయుదురు ప్ర
పంచమున నిట్లు నిర్మలభావులును ద
దితరులును గాంచుచుందు రొకింతకాల
పర్యయమ్మున నిర్వాణపదవి నెంచు. 63

వ. ఇమ్మార్గంబున విశ్రమించుచు మెల్లమెల్లనఁ బోవువారికిఁ గొన్ని
సోపానమ్ములు గల వవి వివరింతు. 64

తే. గీ. నిర్దయ దురాశ కోప మనియెడి దుర్గు
ణమ్ముల నడంచి సర్వభూతమ్ములందుఁ
గరుణగల్గి యెపుడు సుసంకల్పులగుచు
మలయమారుతములభాతి మలయవలయు. 65

తే. గీ. భూపతి వసించు కోటతల్పుల విధమునఁ
దమ పెదవు లెల్లపుడు మూయఁదలఁపవలయు
నెప్పుడేనియుఁ దెఱచిరయేని వచ్చు
పలుకు లన్నియు శాంతిమైఁ బరఁగవలయు. 66

చ. తన యొనరించు కార్యము లుదాత్తములై యలరన్వలెఁ విశే
షనియుతి నెందు మంచియొ యసత్కృతివారణమో తదంతర
మ్మున మెలఁగన్వలె, స్ఫటికపూసలపేరున నుండు వెండితీ
వను బురణించుచున్ గృపయ భాసిలఁగావలె నెందుఁ జూచినన్. 67

క. నేరిచికొనఁగోరెడి సా
ధారణు లన్యాయ్యకృతులఁ దవులక జనన
ప్రారంభకారణము క
ర్మారంభము నెఱిఁగి నడచు టభిమత మెందున్. 68

వ. ఇయ్యవి నాలుగు నాలుగు మెట్లు, పారిశుధ్యంబును సచ్చింతయు నేకాంతత్వంబును సదానందంబును నను నీనాలుగును బూర్వోక్త సోపానంబులకుం బైనుండు సోపానంబులు. 69

తే. గీ. ఆత్మపరిశుద్ధి గనక యూర్ధ్వాభిగామి
గాఁ జన, దదేమనఁగ వెనుకఁ జిరకాల
మనుభవించిన సంసారమునకు మనము
కాంక్షచేసినయేని విఘ్నంబు దొడరు. 70

సీ. దారపుత్రాదుల దయగల్గుటయు నాట
పాటల ననురక్తి బరఁగుటయును
మనమున కతిసుఖమనుఘటించుట యెల్ల
వారల కిది యనుభవమ, యీ తె
ఱఁగున భూతమ్ములఁ గ్రమముగ సమదృష్టిఁ
గాంచి హృదయము పక్వంబొనర్చి
సత్యమ్ము దెలియ సత్సంకల్పమున యత్న
మాచరింపఁగవలె నట్లు కొన్ని

తే. గీ. జన్మములు వోవఁ బోవ నిస్సంశయముగ
మనము నిర్మలమును విషయనిగళగళి
తమ్మునై యుత్స్థితిం గని తత్త్వసిద్ధిఁ
గాంచుఁ బదపడి నిర్వాణగమన మొదవు. 71

తే. గీ. తత్త్వసిద్ధిని బొందు నిదన సమయము
త్రాడుపోఁబుచు విషయసంగ్రహా మొనసిన
నేనహోయమ్మ గనర తానెట్టు లిట్టి
మైన జన్మము ట్రెంపుఁ డా పై ననుపుగ. 72

క. పదపడి యీజన్మంబునఁ
బొదలున్ భూతదయ నిదప బుద్ధులనిను పే
రొదవెడు వీరలు క్రమముగఁ
దుదియగు నిర్వాణపదవి దొరకొందు రొగిన్. 73

తే. గీ. శత్రులను జంపి విజయమ్ము సంధరించు
యోధు చందంబున ననూయయును నహంకృ
తియును నజ్ఞానకామసంశయములును జ
యించి యమ్మూర్ఖుఁడు మెట్టుల నెక్కవలయు. 74

తే. గీ. ఆద్యసోపానములు నాల్గు నల్లనల్ల
నిట్లు తరియించి పై జీవితేచ్ఛ స్వర్గ
వాంఛ యాత్మస్తుతియుఁ బొరపాటు గర్వ
మనెడు దుర్వృత్తులను వీడ నగుఁ గ్రమమున. 75

చ. అటుపయి వాఁడు దేవతలకన్నఁ బ్రశస్తతఁ గాంచి యొప్పు నం
కటములఁ జిక్క, కా ప్రళయకాలమునందును హానిఁ జెందఁ, డె
ప్పటి కొరరీతి నొప్పెసఁగుఁ బై పదమున్ గనుఁ; గర్మసూత్రసం
ఘటితము దేహగేహము నిఁకం గొనఁగాఁ బనిలేదు వానికిన్. 76

క. నే నను శబ్దంబున కొక
తానే వాచ్యంబు గాక తక్కు సకలమున్
గా నగు భేదం బెంచును
బూనక చరియించు హేతువున వాని కొగిన్. 77

వ. మఱియుం గొందఱు నిర్వాణమ్మున నాత్మ నశియించు ననియుఁ గొం
దఱు నిర్వాణమందును నాత్మ జీవించి యుండు ననియుం జెప్పుచుందు.

రిచి సరిగా దే మన,జన్మరాహిత్యమ్ము నొడఁగూర్చునట్టియుఁ గాలావధి శూన్యం బగునట్టియు నానందమయమగు నట్టియు నిర్వాణమను సౌఖ్య పదవి యిట్టి దని వచింపఁగరాదు. కావున జ్ఞానమార్గం బవలంబించితి రయేని యది తనయంత గోచరమగునని వెండియు. 78

ఆ. వె. మన కసూయవంటి ఘనదుఃఖకారణం,
బరిగణంబు కంటె నధికదుఃఖ
హేతు, వింద్రియముల కెక్కుడు మోసగాం
డెందు లే రటంచు నెఱుఁగు టొప్పు. 79

క. ఒక్కొక్క పాపహేతువుఁ
జక్కఁగఁ దనకాలఁ ద్రొక్కఁజాలు నతఁడవో
యొక్కొక్క మెట్టువంతున
నెక్కంగానేర్చు మెట్టులెల్లఁ గ్రమమునన్. 80

ఆ. వె. జ్ఞానమార్గమందు సమరీతిగఁ బ్రవేశ
మబ్బెనేనిఁ దృష్ణ యబ్బఁజేయు
దాహమెల్ల నడఁగుఁ దన్మార్గమున దివ్య
సుమచయంబువంటి సుఖము దొరకు. 81

తే. గీ. కర్మమోక్షసిద్ధాంతాఖ్యఖసికి వజ్రి
పుంగనులు సాటిరా, విది పొలుపునందు
నట్టి దిట్టిది యని చెప్పనలవికాదు
దీనఁ గల్గు నానందం బుదీర్ణమెందు. 82

వ. పూర్వోక్తజ్ఞానమార్గానుసరణంబునకు నాచెప్పఁబోవు నీయైదుసూత్రంబు లావశ్యకంబులు. 83

క. ప్రతిజంతువు మీవలెనే
మితిలేని భవంబు లెత్తి మేటిదశను బొం
ది తరించుఁ గానఁ గరుణా
న్వితులై యేప్రాణినేని హింసింపకుఁడీ. 84

రించు వారికి విసు వొక యించుకేనిఁ
గలుగ దాయాస మింతయుఁ గడలు కొనదు. 89

ఉ. తావృశులైన వారలకుఁ దద్దయుసుం గురుభక్తి భూతస
మ్మోదకమైన చిత్తము సముస్నతమై తగు నోర్పు నిప్పు డెం
తేఁ దనివారె నేనిఁ బయినేర్పడు జన్మ మపారయోగ్యతా
పాదకమై యితోధికకృపాయుతమై పొలుపొందు నిచ్చలున్. 90

వ. అని యనేకవిధమ్ములఁ బోధించి యానాఁటి కాసభఁ జాలించెఁ; బదంపడి యొకనాఁటి యుదయంబున సింగళకుఁడను నొక గేస్తు స్నాన మాచరించి యార్ద్రవస్త్రధారియై దిక్కులకు సాష్టాంగనమస్కారంబు లొనర్చుచు రక్తమ్ములును శ్వేతమ్ములునగు కొన్ని యక్షతలు తత్తద్దిశల వెదచల్లుచుఁ గన్పట్టుటయు నతనిం గాంచి, "యిదియేమి యిట్లొనర్చెదు" నావుడు, 'మహాత్మా మా పెద్దలునింగినుండియు భువి నుండియుఁ దెసలనుండియుఁ దొడరు నరిష్టంబులు వారించుపొంటెఁ బ్రత్యూషఃకాలమున నిట్లొనరింపవలయు నని నా కానతిచ్చి రన, బుద్ధుం డల్లన నగి యిట్లను, "నాహా యిట్లూరక యక్షతలు చల్లుకతన నరిష్ట పరిహారంబు గానేరదు సర్వజంతువులకును గ్రోధంబులేక దయకలిగి తత్సూచకమ్ములగు కార్యంబుల వర్తింపవలయునని మీపెద్దల యభిప్రాయ" మని యిట్లు చెప్పం దొడంగె. 91

తే. గీ. ప్రాచినక్షతలను జల్లవలయు ననుట
తేజ ముదయించుటకుఁ దూర్పుదిక్కువోలె
నీకు జన్మకారణ మయి నెగడు తల్లిఁ
దండ్రి నెప్పుడుఁ బూజింపఁదలఁపు మనుట. 92

తే. గీ. శమను దిక్కున నీగతిఁ జల్లు మనుట
తగు మలయమారుతము నిచ్చు దక్షిణదిశ
పగిది విజ్ఞాన మొసఁగుచు సుగతికిఁ దెరు
వైన గురువును బూజింపు మనుట సూవె. 93

క్లేశమార మృత్యుమార దేవపుత్రమారు లను మారచతుష్టయజేత యగుట మారజిత్తనియుఁ దపంబున లోకంబు జయించినవాఁడగుట లోకజిత్తనియు సంసారవిజయి యగుట జినుండనియు దివ్యదృష్టియు దివ్యశ్రోత్రము పూర్వజన్మశ్రుతియుఁ బరచిత్త విజ్ఞానంబును నప్ర త్యక్షవిషయజ్ఞానంబును వియద్గమనాదిలాఘవంబు నను నా అభిజ్ఞలు గలవాఁ డగుటచే షడభిజ్ఞుం డనియు బుద్ధియు ధ్యానమును క్షాంతియు వీర్యంబును జ్ఞానంబును గృపయును శీలంబును బలంబును దానంబు నుపేక్షయు నను పదిబలంబులు గలవాఁ డగుటచే దశబలుం డనియు బోధిసత్వసంపన్నుండగుటచే బుద్ధుం డనియు సర్వార్థసిద్ధి గలవాఁడగు టచే సిద్ధార్థుండనియుఁ బలుకంబడు నమ్మాయాదేవీనందనుండు తన తండ్రికి బోధించిన దినము మొదలు పంచషవత్సరంబులు తదేకదీక్షగ సర్వభాషలయందు సమస్తజాతులకు సకలదేశమ్ములఁ దనమతంబు బోధించి వ్యాపింపంజేసినఁ బంచాశత్కోటిసంఖ్యాకంబగు జనం బమ్మతం బవలంబించిరి. 99

క. ఆమత మిప్పటికిని నెం
తే మెయి నెర్కుడగు భంగి నెసఁగుటకుఁ గతం
బేమెయిఁ జూచిన భూతద
యామతి యందలరుట యని యారయుటొప్పున్. 100

మ. అలుకన్ లోఁగొని శంకరార్యు లతిజీర్ణావస్థ నొందించినన్
బలిమిం జెన్నగు నేమతంబు భువిఁ దద్రాచుర్య మింతింతనాఁ
దలమే ః సర్వమతావలంబులగు మర్త్యశ్రేణితో నెంతయుం
దులఁదూఁచన్ ములు సూపఁగాఁ గలరు బౌద్ధుల్ నేఁటి కింతేటికిన్.

తే. గీ. బుద్ధునకుఁ గల యెక్కుడు భూతదయను
గూర్చి మా నేర్చుగతి నిట్లు గొంతదనుక
వ్రాసినారము తద్గుణవైభవంబు
సారెసారెకుఁ బ్రేరణం బారఁజేయ. 102

## * ముఖ్యమైన సవరణలు *

### శ్రవణానందము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 1 | ష్ఠి | ష్ఠ |
| 17 | 26 | ర్చుదనే | దనేర్చు |
| 22 | 23 | క్షకు | క్షకు |
| 24 | 2 | మాహి | మహి |
| 25 | 13 | నఁపన | నప్రిస |
| 31 | 2 | విపు | విపు |
| 91 | 14 | బ్రాహ్మ | బ్రహ్మ |
| 95 | 8 | యని | యవి |
| 100 | 24 | కుర్మ | కూర్మ |
| 102 | 15 | కప్ప | కప్రి |

### పాణిగృహీత

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 17 | ణిబా | బాణి |
| 13 | 5 | పలన్ | పలనుఁ |
| 18 | 15 | మను | మును |
| 42 | 14 | నసి | నశి |
| 54 | 1 | యొప్పు | య్యొప్పు |
| 61 | 9 | ఉదోగ్య | ఉద్యోగ |
| 64 | 23 | వాస | వారస |
| 81 | 14 | గుదు | గుద |
| 117 | 12 | యేమి | మేమి |
| 128 | 7 | మనుము | మనము |

### లక్షణాపరిణయము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 20 | 1 | గట్టి | గటి |
| 31 | 12 | ల్లాడ్రి | ల్లాండ్రి |

